# శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణము

## శ్రీకృష్ణజన్మఖండము

### ఉత్తరార్ధము



"కాయేన మనసా వాచా పరంభక్త్యా దివానిశమ్ ।
భజ సత్యం పరంబ్రహ్మ, రాధేశం త్రిగుణాత్పరమ్ ॥"

రచయిత :
"పౌరాణిక రత్న"
"మహాపురాణాంధ్రీకరణచణ"
**శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త**

మూల్యము **రూ : 150-00**

ద్వితీయ ముద్రణము
యువ ఆషాఢ పూర్ణిమ
గురుపూర్ణిమ 12-6-95

# SREE MADANDHRA BRAHMAVYVARTHA MAHAPURANAMU

## SREE KRISHNA JANMA KHANDAMU UTTARAARADHAMU

**By**

'Pouranika Ratna'

'Mahapuranandhrikaranachana'

**Sri Mattupalli Siva Subbaraya Gupta**

పుస్తకములు లభించు ప్రదేశములు :

1. శివా ఇంజనీరింగ్ కంపెనీ
   స్టేషన్‌రోడ్, గుంటూరు-522 001
   ఫోన్ : 220827

2. శ్రీ మట్టుపల్లి శివసుబ్బారాయగుప్త,
   మట్టుపల్లివారివీధి కొత్తపేట,
   గుంటూరు-522 001.
   ఫోన్ : 223327




THIS BOOK IS

PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

UNDER THEIR SCHEME

"AID TO PUBLISH RELIGIOUS BOOKS".



# విన్నపము

శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాస మహర్షి విరచితములైన అష్టాదశ మహాపురాణములలో పదియవదియు శ్రీరాధాకృష్ణస్వరూప మైనదియు నగు శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణమును శ్రీరాధాకృష్ణుల అనుగ్రహ విశేషముచే ఆంధ్రీకరించితిని. ఇది చతుష్టయఖండాత్మకము. 1. బ్రహ్మఖండము 2. ప్రకృతిఖండము 3. గణపతిఖండము 4. శ్రీకృష్ణజన్మఖండము, పూర్వార్ధము మఱియు ఉత్తరార్ధము.

శ్రీకృష్ణజన్మఖండము పూర్వార్ధములో శ్రీకృష్ణావతారరహస్యము, గోలోకవర్ణనము, శ్రీకృష్ణుని బాల్యలీలలు, దేవతలదర్పభంగములు, రాసక్రీడలు మొదలగు అద్భుతములగు రహస్యములతో నిండిన ఆఖ్యానములు వర్ణింపబడినవి. దీనిలో ఏబదినాలుగు అధ్యాయములు గలవు.

శ్రీకృష్ణజన్మఖండము ఉత్తరార్ధము అనేక దేవతలదర్పభంగ ప్రసంగములు, శ్రీరామచరితము, కంసవధ, శ్రీకృష్ణుడు శ్రీరాధకుపదేశించినగీత, నందునకుపదేశించినగీత, రాధఉద్ధవునకుపదేశించినగీత, యశోదకుపదేశించిన గీత, శ్రీకృష్ణలీలలు మొదలగు దివ్యములైన ప్రసంగములలో పరిపూర్ణము. అది అనేక స్తోత్ర, ధ్యానాదులతో ఓతప్రోతము. దీనిలో డెబ్బదిమొనిమిది అధ్యాయములు గలవు.

ఈమహాగ్రంథానువాదములోను ముద్రణములోను, ఎందరో మహానుభావులు నాకు సహాకరించిరి, వారందరికి నావందనములు. ముఖ్యముగ నామిత్రులు బ్రహ్మశ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రిగారు, ఐదువేలు భూరి విరాళము నొసంగిన శ్రీతిరుమల తిరుపతి దేవస్థానములవారు, సకాలములో ముద్రణ మొనరించి యిచ్చిన రవిప్రెస్ యజమానులు శ్రీతోట సుబ్బారావు గారు ప్రశంసనీయులు.

పశ్చిమగోదావరిజిల్లా ప్రథమ ఆర్యవైశ్య మహాసభలు తణుకులో 26-6-79వ తేదీన నిర్వహింపబడినవి. ఆసభలో నన్ను సన్మానించి, నాకు సన్మానపత్రము నొసంగిన పూజ్యశ్రీ తుమ్మలపల్లి సత్యన్నారాయణ మూర్తిగారికి, ఆర్యవైశ్యసంఘ సభ్యులకు నా హృదయపూర్వక మైన వందనముల నర్పించుచున్నాను.

నాఈకృతికిపతి ఆ గోవిందుడు, "త్వదీయం వస్తు గోవిన్ద తుభ్యమేవ సమర్పయే".

ఈమహాగ్రంధ రచనలో నన్ను ఆశీర్వదించి కరుణించిన నాతల్లిదండ్రులు శ్రీమహాలక్ష్మమ్మ జగన్నాధముగారలకు నేను ఆజన్మము ఋణపడి యున్నాను, వారలకు నాసాష్టాంగ దండ ప్రణామములు. ఈగ్రంధమును నాతల్లిదండ్రులావిష్కరించుట నామహద్భాగ్యము. ఈమహాకార్యములోను నాతో సహకరించిన నా శ్రీమతి శ్యామసుందరికి, నాపుత్రులు చిరంజీవులు, యదువీర రంగధామునకు, శ్రీనివాసశరణునకు, నాగమల్లికార్జునునకు శ్రీరాధాకృష్ణుల పరిపూర్ణానుగ్రము కల్గుగాక!

ఏమైనను "ప్రమదోధీమతామపి" యను నార్యోక్తి యనుభవమైనదగుటవలన నిందెన్నియో ప్రమాదములుండి తీరును గాన, సహృదయు లగు పాఠకులు దయతో మన్నింప ప్రార్థన.

శేషం శ్రీకృష్ణస్మరణం

శ్రీదుంధుభి సంవత్సర
శ్రవణ కృష్ణ అష్టమి
శ్రీకృష్ణ జన్మాష్టమి
12-8-1982

ఇట్లు
భక్త జనదాసాను దాసుడు
సుజన విధేయుడు
**శ్రీ వట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త**

## శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్తగారిచే రచింపబడి ప్రచురింపబడిన గ్రంథములు:

1. శ్రీమద్బ్రహ్మవైవర్తమహాపురాణ సారసంగ్రహము
2. శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములో మొదటిభాగము బ్రహ్మఖండము
3. రెండవభాగము ప్రకృతి ఖండము
4. మూడవభాగము గణపతి ఖండము
5. నాల్గవభాగము శ్రీకృష్ణజన్మఖండము పూర్వార్థము
6. ఐదవభాగము శ్రీకృష్ణజన్మఖండము ఉత్తరార్థము
7. శ్రీరాఘవేంద్ర కల్పవృక్షము
9. శ్రీరాఘవేంద్ర స్తోత్రకవచ మంత్రి మంజరి

### అ ము ద్రి త ర చ న లు :

శ్రీ హనుమద్భాగవతము
శ్రీ రాఘవేంద్ర మహాత్మ్యము
శ్రీ భవిష్య మహాపురాణము
శ్రీ అగ్ని పురాణము

### ప్ర తు లు ల భి ం చు ప్ర దే శ ము


మహాపురాణ ప్రచారసంఘము

**శ్రీమట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త**

మట్టుపల్లివారివీధి, కొత్తపేట, గుంటూరు-1.

ఆంధ్రప్రదేశ్, ఫోన్లు: 20827 & 23827

# విషయసూచిక


| అధ్యాయము | విషయము | పుటలు |
|---|---|---|
| 55 | శ్రీకృష్ణ ప్రభావ వర్ణనము | 1-4 |
| 56 | దేవదా దర్పభంగ వర్ణనము | 4-9 |
| 57 | పతి మహాత్మ్య వర్ణనము | 10-13 |
| 58 | దేవి దర్పభంగ వర్ణనము | 14-00 |
| 59 | ఇంద్ర దర్పభంగ వర్ణనము | 15-24 |
| 60 | నహుషోపాఖ్యానము | 25-29 |
| 61 | అహల్యోపాఖ్యానము | 30-33 |
| 62 | శ్రీరామచరిత వర్ణనము | 33-40 |
| 63 | కంసుని దుస్స్వప్న వర్ణనము | 41-42 |
| 64 | కంస సత్యక సంవాదము | 43-46 |
| 65 | అక్రూర హర్షోత్కర్ష వర్ణనము | 46-52 |
| 66 | రాధాస్వప్న వృత్తాంతము | 52-53 |
| 67 | శ్రీకృష్ణుడు రాధకు ఆధ్యాత్మిక జ్ఞానబోధ చేయుట | 54-62 |
| 68 | శ్రీరాధాకృష్ణ సంవాద వర్ణనము | 62-65 |
| 69 | బ్రహ్మ యొనరించిన శ్రీకృష్ణస్తోత్రము | 65-72 |
| 70 | అక్రూరుడు శ్రీకృష్ణుని దర్శించుట | 72-79 |
| 71 | యాత్రావర్ణనము | 79-81 |
| 72 | శ్రీకృష్ణుడు కంసుని వధించుట | 81-89 |
| 73 | నందశోకమోచనము | 90-101 |
| 74 | పాంచభౌతికమైన దేహము మిథ్యయని శ్రీకృష్ణపరమాత్మ నందునకుపదేశించుట | 102-105 |

| | | |
|---|---|---|
| 75 | ఆహ్నిక కృత్యముల వర్ణనము | 106-113 |
| 76 | శుభాశుభ దర్శన ఫలవర్ణనము | 114-121 |
| 77 | సుస్వప్న దర్శన ఫలము | 122-127 |
| 78 | ఆధ్యాత్మిక జ్ఞానోపదేశము | 127-133 |
| 79 | సూర్యగ్రహణాఖ్యానము | 134-136 |
| 80 | చంద్రగ్రహాఖ్యానము | 136-138 |
| 81 | తారవిముక్తికొఱకు శుక్రాచార్యుని చెంతకు దేవత లఱుదెంచుట | 138-142 |
| 82 | దుస్స్వప్న వర్ణనము | 142-147 |
| 83 | వర్ణాశ్రమములు | 148-161 |
| 84 | గృహస్థ, గృహిణీ, శిష్య, పుత్ర, కన్యా, ధర్మములు | 161-172 |
| 85 | కర్మవిపాక వర్ణనము | 172-180 |
| 86 | కేదార కన్యోపాఖ్యానము | 180-188 |
| 87 | శ్రీకృష్ణుని సచ్చిదానందవిగ్రహ నిరూపణము | 189-192 |
| 88 | శ్రీకృష్ణుడునందునకు దుర్గాస్తోత్రము నొసంగుట | 193-199 |
| 89 | శ్రీకృష్ణనంద సంవాదము | 199-201 |
| 90 | చతుర్యుగ ధర్మకథనము | 201-211 |
| 91 | దేవకీ వసుదేవులు నందుని ఊరడించుట | 211-213 |
| 92 | రాధా స్తోత్రము | 213-219 |
| 93 | రాధోద్ధవ సంవాదము | 220-226 |
| 94 | గోపికా సంభాషణము | 226-238 |
| 95 | రాధ తన దుఃఖమును ఉద్ధవునకు తెలుపుట | 238-240 |
| 96 | రాధ ఉద్ధవునకు భవతరణోపాయము నుపదేశించుట | 240-250 |
| 97 | శ్రీరాధోద్ధవ సంవాదము | 250-257 |

98 శ్రీకృష్ణ ఉద్ధవ సంభాషణము 257-261

99 భగవంతుని ఉపనయపమహోత్సవములో
శ్రీగణేశ్వరుని అభిషేకము 262-266

100 భగవదుపనయనములో బ్రహ్మాది దేవతలు
భగవంతుని స్తుతించుట 266-270

101 శ్రీరామకృష్ణుల ఉపనయన మహోత్సవము 270-274

102 శ్రీరామకృష్ణుల విద్యాభ్యాసము 274-278

103 ద్వారకాపురి నిర్మాణము 279-288

104 ద్వారకానగర ప్రవేశము 288-290

105 రుక్మిణీ కళ్యాణ ప్రస్తావన 290-294

106 రేవతీబలరాముల వివాహము 295-296

107 సాల్వాదులను బలదేవుడు మర్దించుట
భీష్మకుడు శ్రీకృష్ణుని స్తుతించుట 296-301

108 శ్రీరుక్మిణీకళ్యాణము 302-303

109 శ్రీకృష్ణరుక్మిణీకళ్యాణ మహోత్సవము 303-305

110 శ్రీరాధ-యశోదా సంవాదము 306-308

111 శ్రీరాధాగీత 308-317

112 ప్రద్యుమ్నసంభవము 317-322

113 శిశుపాలదన్తవక్త్రులవధ 322-328

114 ఉషాపహరణాఖ్యానము 328-331

115 శివబాణాసురసంవాదము 331-338

116 బాణానిరుద్ధసంవాదము 338-341

117 శివలంబోదరసంవాదము 341-342

118 ఉషానిరుద్ధులను శ్రీకృష్ణునకర్పింపుమని
బాణునకు పార్వతీదేవి ఉపదేశించుట 343-345

119 బలియొనరించిన శ్రీకృష్ణస్తోత్రము 346-354

120 శ్రీకృష్ణబాణసంగ్రామము ఉషానిరుద్ధుల వివాహము, 355-358

121 శృగాల వాసుదేవోపాఖ్యానము 358-361

122 శ్యమంతకమణి ఉపాఖ్యానము 361-363

123 సిద్ధాశ్రమములో రాధాదేవి యొనరించిన
శ్రీగణేశారాధన 363-367

124 బ్రహ్మేశశేషాదులొనరించిన శ్రీరాధికాస్తోత్రము 367-378

125 వసుదేవుడు రాజసూయ యజ్ఞములో
తన సర్వస్వమును దాన మొనరించుట 378-380

126 రాధామాధవుల పునః సమాగమము 381-387

127 శ్రీకృష్ణుడు వ్రజమునకు మఱలివచ్చుట 387-390

128 రాధాగోపగోపికలు గోలోకము జేరుట 390-393

129 శ్రీకృష్ణ నిజధామ గమనము 394-405

130 నారదుడు శృంజయ కన్యను పాణిగ్రహణ మొనరించుట 406-412

131 పురాణాములు, పురాణముల శ్లోక సంఖ్యా నిరూపణము 413-414

132 శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ మహాత్మ్యము 415-420

# స్తోత్ర సూచిక


| | | పుటలు |
|---|---|---|
| 1 | దేవత లొనరించిన శ్రీ మహాలక్ష్మీస్తోత్రము | 7 |
| 2 | అక్రూరు డొనరించిన శ్రీకృష్ణపరమాత్మ మహిమాస్తోత్రము | 46 |
| 3 | బ్రహ్మయొనరించిన శ్రీకృష్ణ స్తోత్రము | 65 |
| 4 | అక్రూరు డొనరించిన శ్రీకృష్ణ స్తోత్రము | 86 |
| 5 | శ్రీకృష్ణుడు నందున కుపదేశించిన గీత | 91 |
| 6 | పతి స్తోత్రము | 160 |
| 7 | శ్రీ మహాదేవు డొనరించిన దుర్గాస్తోత్రము | 194 |
| 8 | ఉద్ధవు డొనరించిన శ్రీ రాధా స్తోత్రము | 216 |
| 9 | బ్రహ్మాది దేవత లొనరించిన శ్రీకృష్ణ స్తోత్రము | 267 |
| 10 | సాందిపు డొనరించిన శ్రీకృష్ణ స్తోత్రము | 275 |
| 11 | శ్రీకృష్ణుడు విశ్వకర్మ కుపదేశించిన వాస్తుశాస్త్ర జ్ఞానము | 281 |
| 12 | శ్రీ రాధా గీత | 308 |
| 13 | బలి యొనరించిన శ్రీకృష్ణస్తోత్రము | 347 |
| 14 | శ్రీ రాధికా స్తోత్రము | 367 |
| 15 | బ్రహ్మాది దేవత లొనరించిన శ్రీకృష్ణస్తోత్రము | 394 |
| 16 | మహాదేవు డుపదేశించిన శ్రీకృష్ణధ్యానము | 411 |


# చిత్ర సూచిక


| | | పుటలు |
|---|---|---|
| 1 | కృతిపతి యగు గోవిందుడు | 1 |
| 2 | శ్రీరామచంద్రుడు | 33 |
| 3 | శ్రీకృష్ణుని ఉపనయన మహోత్సవమున కరుదెంచిన త్రిమూర్తులు | 265 |
| 4 | రాధామాధవుల పునః సమాగమము | 381 |



శ్రీ ర స్తు | ఓం నమః | శు భ మ స్తు

శ్రీ గణేశ్వరాయ నమః

# శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణము

## శ్రీకృష్ణ జన్మ ఖండము

## ( ఉత్తరార్థము )

## ఏబదియైదవ అధ్యాయము

### శ్రీకృష్ణ ప్రభావ వర్ణనము

మంగళాచరణము

**ఓం** నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ॥

పరమ పురుషుడు, అంతర్యామియు నగు నారాయణునకు, నరశ్రేష్ఠుడైన నరునకు, వీరిద్దరి దివ్యలీలలను సదా ప్రకటించు సరస్వతీ దేవికి, ఆ దివ్యగాథలను గానమొనరించు వ్యాసదేవునకు నమస్కరించి పిమ్మట జయమును బలుకవలెను.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

శ్లో॥ స ఏవ భగవాన్ కృష్ణః సర్వాత్మా పురుషః పరః ।
దురారాధ్యోఽతి సాధ్యశ్చ సర్వారాధ్యః సుఖప్రదః ॥

నిజభక్తాతిసాధ్యశ్చ భక్తస్యారాధ్య ఏవ చ ।
శశ్వద్ దృశ్యః స్వభక్తస్యా భక్తస్యా దృశ్య ఏవ చ ॥ 2
దుర్జ్ఞేయం తస్య చరితం కార్యం హృదయమేవ చ
బద్ధాస్తన్మాయయా సర్వే మోహితాశ్చ దురన్తయా ॥ 9

నారదా ! ఆ శ్రీకృష్ణ భగవానుడే సర్వాంతర్యామి పరమపురుషుడా యని గ్రహింపుము. ఆయన దురారాధ్యుడైనను అత్యంతసాధ్యుడు, అనగా ఆరాధనాబలముచే భగవంతుని పొందుట అత్యంతకష్టము, అయినను ఆయన యే భక్తులపై కరుణించి స్వయముగ వారికధీనుడు కాగలడు. శ్రీకృష్ణుడా సర్వులకు నారాధ్యుడు, అఖండసుఖప్రదాయకుడు. ఆయన తనభక్తుల కత్యంతసులభుడు, భక్తులే భగవంతుని యారాధనద్వారా వశమునందుంచుకొనగలరు; కాని యభక్తులకు ఆయనదర్శనము సర్వదా అసంభవము. ఆయనదివ్యలీలాచరితరహస్యములను అర్థముజేసికొనుట యత్యంతకఠినము. కేవల మాదివ్యచరితములను హృదయములందు సదా చింతింపవలెను. సంసారములో నివారందరు శ్రీకృష్ణునిదురన్తమగు మాయచే బద్ధులు, మోహితులు నై యున్నారు.

శ్రీకృష్ణునిభయమువలననే నిరంతరము ప్రవహించుచు వాయువు స్వయముగ ఆధారరహితమై మహాకూర్మమును భరించును. మహాకూర్మము భగవంతునిభయమువలనే అనంతుని తనపృష్ఠభాగముపై ధరించియుండెను. ఆదిశేషు డాయనయాజ్ఞ వలననే విశ్వమును తనమస్తకములపై భరింపగల్గెను. సహస్రశిరసమన్వితు (సహస్రమనగ అనంతమనికూడఅర్థము) డైన ఆదిశేషుడు తనయొక్కొక్క శిరముపై నొక్కొక్కవిశ్వమును ధరించియున్నాడు. ఆయొక్కొక విశ్వమందు సప్తసముద్రములు, సప్తద్వీపములు, పర్వతకాననయుక్తమైన పృథ్వి యుండును. సప్తపాతాళములు, భూర్భువఃస్వరాదిసప్తస్వర్గములు, (ఈస్వర్గములలో బ్రహ్మలోకముకూడకలదు), అన్నియు గలసి ఒకవిశ్వమన బడును. ఈవిశ్వమును త్రిభువనమందురు. ఇట్టిత్రిభువనము లసంఖ్యాకములు కలవు. వీనినే కృత్రిమ (అనిత్య) జగము లందురు. విధాతయే ప్రత్యేకకల్పమందు శ్రీకృష్ణునిభయముచే నీకృత్రిమజగమును సృష్టించును. ఇట్లు అసంఖ్యాక విశ్వములు కలవు, వానినన్నింటిని శ్రీకృష్ణునియంశజుడైనమహావిరాట్పురుషుడు (మహావిష్ణువు) తనయసంఖ్యాకరోమకూపములందు ధరించును. ఆమహా

విష్ణువు శ్రీకృష్ణునియాజ్ఞానువర్తియై సకలబ్రహ్మాండములను తనరోమకూపము లందు ధరించి నిరంతరము ఆయననే ధ్యానించుచుండును. కృపానిధాను డైన విష్ణువు (లఘువిరాట్పురుషుడు) కూడ శ్రీకృష్ణునిభయమువలననే సంసారమును పాలించును. ఆయనయాజ్ఞను శిరసావహించియే కాలాగ్నిరుద్రస్వరూపమైన కాలము దేహధారులను సంహరించును. షడ్గుణ షడైశ్వర్యయుక్తుడైన, విరక్తుడైనమృత్యుంజయమహాదేవుడు అనురాగముతో నిరంతరము శ్రీకృష్ణ ధ్యానమందే నిమగ్నుడై యుండును.

శ్రీకృష్ణునిభయమువలననే అగ్ని జ్వలించును, సూర్యుడు తపించును, ఇంద్రుడు వర్షించును మృత్యువు సకలదేహధారులప్రాణములను హరించును, ధర్మదేవత పాపులను దండించును, పృథ్వి చరాచరములను ధరించును. ప్రకృతి సృష్టికాలమందు మహత్తత్త్వాదులకు జన్మనుప్రసాదించును. వత్సా! ఆసర్వేశ్వ రేశ్వరు డైనశ్రీకృష్ణునియభిప్రాయమేమో తెలిసికొనుట యత్యంతకఠినము. పరబ్రహ్మమైన, పరమాత్మయైన, సచ్చిదానందవిగ్రహుండైన శ్రీకృష్ణుని పరి పూర్ణముగ తెలిసికొన్నపురుషుడు ఈసర్వజగములందు లేనేలేడు. కుమారా! బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులుగూడ ఎవనిప్రభావమును తెలిసికొనలేరో, ఆభగ వంతునిలీలారహస్యములను నావంటిమందబుద్ధి యెట్లు తెలిసికొనగలడు ?

ఆ నందనందనుడు బృందావనమును వీడి మధురకెందులకు వెడలెనో ? ఆయన గోపికలను, తనప్రాణాధికప్రియ మైనరాధను ఎందులకు వీడి వెడలెనో? యశోదను నందుని, అన్యాన్యబంధువులను వీడి యెందులకు వెడలెనో ? ఈ రహస్యముల నన్నిటిని స్వయముగ ఆయనతక్క మఱియెవ్వరు తెలిసి కొనగలరు ?

ఆయనయే దర్పప్రదాత, సర్వులదర్పభంగకర్త. సర్వస్వమును ప్రసా దించువాడు శ్రీకృష్ణుడే. సర్వులదర్పభంగమొనరించి ఆయన వారిపై కరు ణించెను. ఆయనయే జగత్సృష్టిపాలనసంహారకర్త, ఆయన స్రష్టలకే స్రష్ట. శంకరుడు తనపంచముఖములద్వారా కూడా శ్రీకృష్ణుని స్తుతించుటకు సమ ర్థుడుకాడు. చతుర్ముఖుడైనబ్రహ్మకూడ ఆయనను స్తుతింపలేడు. సహస్ర ముఖసమన్వితు డైనయాదిశేషుడుకూడ భగవంతునివర్ణించుటకసమర్థుడే. సాక్షాత్తుగ విశ్వవ్యాపియగుజనార్దను డైనవిష్ణువుకూడ ఆయనను స్తుతించుట కసమర్థుడే. మహావిరాట్పురుషు డైనశ్రీమన్నారాయణుడుకూడ ఆయ

నను స్తుతింపలేకపోయెను. స్వయముగ ప్రకృతియైనను పరమాత్మయెదుట కంపించును. సరస్వతి ఆపరమేశ్వరుని స్తుతించుటకుసమర్థురాలు కాదు. నారదా ! సర్వవేదములుకూడ ఆయనమహిమలను తెలిసికొనలేకపోయినవి. బ్రాహ్మణోత్తమా! ఇట్లు నేను ప్రాకృతికనిర్గుణుడైనపరమాత్మయైన శ్రీకృష్ణుని ప్రభావములను కించిన్మాత్రము వర్ణించితిని. ఇపుడు నీవు ఏవిషయములను విన గోరుచున్నావో ప్రశ్నింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున శ్రీకృష్ణప్రభావవర్ణన
మను ఏబదియైదవ అధ్యాయము.
సంపూర్ణము.

## ఏబదియాఱవ అధ్యాయము
## దేవతా దర్పభంగ వర్ణనము

నారదుడు పలికెను :

దేవా! అచ్యుతుని దివ్యచరితములు అనంతములు. గూఢములైన, పరమాద్భుతములైన, అపూర్వములైన మాధవునిలీల లెంత యద్భుతములు ! శ్రీకృష్ణపరమాత్మ మహావిష్ణువు దర్పమును భంగ మొనరించిన ప్రసంగమును, అన్యదేవతాహంకార భంగ ప్రసంగములను వర్ణింపవలసిందిగ ప్రార్థించుచున్నాను. శ్రీకృష్ణదివ్యచరితములు వినుట కతీవమధురములు, కాని యాచరిత్రములు స్వయముగ కవిముఖమునుండి శ్రవణ మొనరించిన అత్యంత రమ్యములుగ నుండును.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదా! సర్వవిశ్వములు ఆయనరోమ కూపములందే విరాజిల్లుచున్నవి, సకలవిశ్వములకు తానే యీశ్వరుడ నని శ్రీమహావిష్ణువునకు అహంకార

ముదయించెను. శ్రీమహావిష్ణువు అభిప్రాయమును గ్రహించి శ్రీకృష్ణుడు సంహారభైరవుని ప్రచండరూపమును ధరించి శ్రీమహావిష్ణువైన మహావిరాట్పురుషుని మ్రింగివేయనారంభించెను. సమస్తశరీరము సంహారభైరవునకు గ్రాసము కాగా కేవలము శిరము శేషించెను. శ్రీమహావిష్ణువు ఆక్షణమందే దర్పము వీడి సచ్చిదానందవిగ్రహుడైన శ్రీకృష్ణపరమాత్మను ప్రార్థింపగా భగవంతుడు కరుణించి శ్రీమహావిష్ణువుపై కృపను ప్రసరింపజేసి రక్షించెను.

ఒక సమయమున నేనే త్రిలోకములకు స్రష్టనని, పాలకుడనని, సంహర్తనని బ్రహ్మ యహంకరింపగా అది గ్రహించి శ్రీకృష్ణుడు గోలోకమందు బ్రహ్మకు పంచవక్త్రి బ్రహ్మలను, షడ్వక్త్రిబ్రహ్మలను, శతవక్త్రిబ్రహ్మలను బరిచయమొనరించెను. పిమ్మట మోహినిద్వారా అపూజ్యుని గావించెను. స్వకన్యను దర్శింపజేసి బ్రహ్మను మోహితునిగ నొనర్చెను. అనంతరము శంకరునిచే గర్వభంగ మొనరించి మరల లోకపూజ్యునిగ నొనరించెను. జ్ఞానానందుడు, సనాతనుడు, మహాజ్ఞానియు నగు పరమాత్మ బ్రహ్మకు జ్ఞానమును ప్రసాదించి కరుణించెను. జగములను బాలించుస్వామిని తానే నని విష్ణుదేవునకు గర్వము కలుగగా శ్రీకృష్ణుడు రామావతారమున విష్ణుమూర్తికి ఆత్మవిస్మృతిని గలిగించెను. విశ్వమును నేనే భరించుచున్నా నని భావించి ఆదిశేషుడు అహంకరింపగా భగవంతుడు గరుత్మంతుని ద్వారా అనంతుని గర్వభంగ మొనరించెను. ఒకసమయమున నాగులందఱు శ్రీకృష్ణవాహన మైన గరుత్మంతుని పూజించుసమయమున అనంతుడు గర్వమునకు శివభూషుడై గరుడారాధన మొనరింపలేదు. అందుల కలిగి గరుత్మంతుడు మహాసంగ్రామ మధ్యమున అనంతుని నిర్జించెను. శ్రీకృష్ణుడు కరుణించి ఆదిశేషుని రక్షించెను. సదాశివుడు దర్పవశమున వివాహమాడలేదు. అపుడు శ్రీకృష్ణుడు శివుని మోహింపజేసి సతితో బరిణయమొనర్చెను. పిమ్మట సతితో వియోగమును కల్పింపగా శంకరుడు విరహాతురుడై చాలకాలము నానాప్రదేశములందు భ్రమించి తుదకు భగవదనుగ్రహమువలన సతీదేవిని పార్వతిరూపమున బొందగల్గెను. త్రిపురాసుర సంగ్రామమందు హరుడు రథచ్యుతుడై శ్రీకృష్ణుని ప్రార్థింపగా భగవంతుడు వృషభరూపధారియై శంకరునకు సంగ్రామ మందు విజయమును ప్రసాదించెను. శివుడు త్రిపురాసురులను సంహరించి త్రిపురారిగ ప్రసిద్ధిగాంచెను. శంకరుడు వృకాసురుడను దైత్యున కమోఘవరమును

ప్రసాదింపగా వాడు తనహస్తమును శివుని శిరముపై నుంచి భస్మ మొనర్చుటకు సంసిద్ధుడయ్యెను. భక్తుని శిక్షింపలేక భక్తవత్సలుడైన హరుడు పలాయనము చిత్తగించుచు శ్రీకృష్ణుని ప్రార్థింపగా ఆజగన్నాథుడే అత్యంత మోహన రూపమును ధరించి దైత్యుని మోహమున బడవైచి వానిహస్తమునే వాని శిరముపై నుండునట్లు జేసి దైత్యుని సంహరించి శివుని రక్షించెను.

సాధ్వీ పాతివ్రత్యమునే పరీక్షించుట కుద్యుక్తుడైన ధర్మదేవుని దర్పమును శ్రీకృష్ణపరమాత్మ కేదారకన్యద్వారా అణచెను. సతీశాపమునకు గుఱియై ధర్మదేవత కృశుడయ్యెను. శాపాంతమున త్రేతాయుగమందు త్రిపాదుడుగ, ద్వాపరమందు ద్విపాదుడుగ, కలియుగమందేకపాదుడుగ, కలియుగాంతమందు సంపూర్ణముగ నశించి మఱల సత్యయుగమందు చతుష్పాదముల పొందగల్గెను. మాండవ్యమహర్షి శాపమునకు గుఱియై యమధర్మరాజు శూద్రునిగ జన్మింపవలసివచ్చెను. అహంకరించిన సాంబుడు విమాతశాపము వలన కుష్ఠువ్యాధిని పొందెను. చంద్రుడు దర్పవశుడై తార నపహరించి గురుదేవునిద్వారా శాపముపొంది ఘోరయక్ష్మరోగియయ్యెను. సూర్యుని దర్పభంగము శంకరుని వలన సంభవించెను. సూర్యుడు దర్పమునకు వశుడై మాలిసుమాలులను శంకర కింకరులను సంహరింప యత్నింపగా వారు హరుని శరణు వేడిరి. తన భక్తుల సంకటములను గాంచి శంకరుడు కోపించి సూర్యునిపై త్రిశూలమును ప్రయోగించెను. సూర్యుడు త్రిశూలాఘాతముచే మూర్ఛితుడు కాగా జగమంతయు అంధకారబంధురమయ్యెను. ఆశుతోషుడైన మహాదేవుడు కరుణించి సూర్యుని పునర్జీవితునిగ నొనరించెను. అగ్నిదేవుని దర్పమును భృగుమహర్షిచే భంగమొనరించెను. గురుదర్పము తనభార్యనపహరింపబడుటద్వారా భంగమయ్యెను. దుర్వాసుని దర్పము అంబరీషునిద్వారా, హిరణ్యకశిపుని దర్పము నారసింహమూర్తిద్వారా, జయవిజయులదర్పము బ్రాహ్మణకుమారులద్వారా, హిరణ్యాక్షుని దర్పము వరాహావతారము ద్వారా భంగమయ్యెను. రావణ కుంభకర్ణులు రామబాణాగ్నికి బలియైరి. శిశుపాల దంతవక్త్రులు శ్రీకృష్ణునిచే సంహరింపబడిరి. దేవతలందఱు దైత్యులవలన నిర్జింపబడి గర్వభంగమునొందిరి. మఱల దైత్యులు దేవతలవలన గర్వభంగమునొందిరి. బ్రహ్మ నీ (నారద) దర్పమును భంగమొనరించెను. ప్రజాపతిపుత్రుడవైన నీవు తండ్రిశాపమునకు గుఱియై గంధర్వుడవై జన్మించి

తదనంతరము శూద్రజన్మనుపొంది మఱల సత్సాంగత్యమువలన నారదుడవైతివి. మన్మథుని దర్పము శంకరునివలన భంగమయ్యెను. కామదేవుడు శివకోపాగ్నికి గుఱియై భస్మముకాగా ఆశుతోషుడైన మహాదేవుడు కరుణించి మన్మథునకు మఱల ప్రాణములనొసంగెను. లక్ష్మణుని దర్పము రావణప్రేరితమైన త్రిశూలము వలన భంగమయ్యెను. విష్ణుదర్పభంగము బ్రహ్మశాపమువలన సంభవించెను. కార్తవీర్యార్జునుని గర్వమును పరశురాముడు తొలగించెను. విప్రపుత్రుని మరణసమయమున శ్రీకృష్ణుని రాణులు అపహరింపబడగా యుద్ధములో కర్ణునివలన అర్జునుని దర్పము భంగమయ్యెను.

బాణాసురుని గర్వము ఉషాపహరణముచే తొలగెను. భృగుదర్పము దక్షయజ్ఞవాటికయందు వీరభద్రునిచే తొలగెను. పరశురాముని గర్వము సీతారామకళ్యాణ సమయమున శ్రీరామునిచే భంగమొనరింపబడెను. సుమేరు దర్పము వాయుదేవునిద్వారా భంగమొనరింపబడెను. అగస్త్యమహర్షి పానమొనరించుటద్వారా సాగరుని దర్పము తొలగెను. కలహవశమున గంగా సరస్వతులకు దర్పభంగమయ్యెను. పార్వతి దర్పము శంకరుడు త్యజింపగ, కామదేవుడు భస్మముకాగా సంభవించెను. తదనంతర మామె ఘోరతపమాచరించి మఱల శంకరుని ప్రాణేశ్వరునిగ పొందగల్గెను.

మహాలక్ష్మి యొకప్పుడు దర్పమునకు వశయై వైకుంఠాంతఃపుర ద్వారమున జయవిజయులడ్డురాగా అంతఃపురమును ప్రవేశింపలేకపోయెను. తనతిరస్కారమునుగాంచి అయ్యభిమానవతి యగులక్ష్మి హరిపాదపద్మములు లభించని యీ జీవిత మెందులకని దేహత్యాగ మొనరించుటకు సంసిద్ధురాలయ్యెను. అపుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, భాస్కరుడు, ధర్మదేవత, చంద్రుడు, మన్మథుడు, వైశ్వానరుడు, ధనేశ్వరుడు, మహర్షులు, మునులు, మనువులు, మహేంద్రుడు, వరుణుడు, జగత్ప్రాణప్రదాతయైన హుతాశనుడు మొదలగు వారందఱు, మూలప్రకృతి యగునీశ్వరీ! శ్రీమహాలక్ష్మి! శాంతింపుమని, ప్రసన్నురాలవు గమ్మని యిట్లు ప్రార్థించిరి.

దేవా ఊచుః :-

శ్లో॥ క్షమస్వ భగవత్యమ్బ క్షమాశీలే పరాత్పరే ।
శుద్ధసత్వస్వరూపే చ కోపాదిపరివర్జితే ॥ 75

ఉపమే సర్వసాధ్వీనాం దేవానాం దేవపూజితే ।
త్వయా వినా జగత్సర్వం మృతతుల్యం చ నిష్ఫలమ్ ॥ 76
సర్వసమ్పత్స్వరూపా త్వం సర్వేషాం సర్వరూపిణీ ।
రాసేశ్వర్యాధిదేవీ త్వం త్వత్కలాః సర్వయోషితః ॥ 77
కైలాసే పార్వతీ త్వం చ క్షీరోదే సిన్ధుకన్యకా ।
స్వర్గే చ స్వర్గలక్ష్మీ స్త్వం మర్త్యలక్ష్మీశ్చ భూతలే ॥ 78
వైకుణ్ఠే చ మహాలక్ష్మీర్దేవదేవీ సరస్వతీ ।
గఙ్గా చ తులసీ త్వం చ సావిత్రీ బ్రహ్మలోకతః ॥ 79
కృష్ణప్రాణాధిదేవీ త్వం గోలోకే రాధికా స్వయమ్ ।
రాసే రాసేశ్వరీ త్వం చ బృన్దా బృన్దావనే వనే ॥ 80
కృష్ణప్రియా త్వం భాణ్డీరే చన్ద్రా చన్దనకాననే ।
విరజా చమ్పకవనే శతశృఙ్గే చ సున్దరీ ॥ 81
పద్మావతీ పద్మవనే మాలతీ మాలతీ వనే ।
కున్దదన్తీ కున్దవనే సుశీలా కేతకీవనే ॥ 82
కదమ్బమాలా త్వం దేవీ కదమ్బకావనేఽపి చ ।
రాజలక్ష్మీ రాజగేహే గృహలక్ష్మీర్గృహే గృహే ॥ 83
ఇత్యుక్త్వా దేవతాః సర్వే మునయో మనవ స్తథా ।
రురుదుర్నమ్రవదనాః శుష్కకణ్ఠోష్ఠతాలుకాః ॥ 84
ఇతి లక్ష్మీ స్తవం పుణ్యం సర్వదేవైః కృతం శుభమ్ ।
యః పఠేత్ ప్రాతరుత్థాయ స వై సర్వం లభేద్ధ్రువమ్ ॥ 85
అభార్యో లభతే భార్యాం వినీతాం చ సుతాం సతీమ్ ।
సుశీలాం సున్దరీం రమ్యామతిసుప్రియవాదినీమ్ ॥ 86
పుత్రపౌత్రవతీం శుద్ధాం కులజాం కోమలాం వరామ్ ।
అపుత్రో లభతే పుత్రం వైష్ణవం చిరజీవినమ్ ॥ 87
పరమైశ్వర్యయుక్తం చ విద్యావన్తం యశస్వినమ్ ।
భ్రష్టరాజ్యో లభేద్రాజ్యం భ్రష్టశ్రీర్లభతే శ్రియమ్ ॥ 88
హతబన్ధుర్లభేద్బన్ధుం ధనభ్రష్టో ధనం లభేత్ ।
కీర్తిహీనో లభేత్ కీర్తిం ప్రతిష్ఠాం చ లభేద్ధ్రువమ్ ॥ 89
సర్వమఙ్గలదం స్తోత్రం శోకసన్తాపనాశనమ్ ।
హర్షానన్దకరం శశ్వద్ధర్మమోక్షసుహృత్ ప్రదమ్ ॥ 90

భగవతీ! అంబా! క్షమాశీలా! పరాత్పరీ మమ్ములను రక్షింపుము. శుద్ధసత్వస్వరూపిణీ! కోపాదులను పరిత్యజింపుము. సర్వసౌభాగ్యదాయినీ! సర్వదేవతా పూజితురాలా! నీవు లేనిచో సర్వజగములు మృతప్రాయములై నిష్ఫలములు కాగలవు. దేవీ! నీవు సంపత్స్వరూపిణివి, సర్వాధారభూత స్వరూపిణివి. రాసేశ్వర్యాధి దేవీ! నీకళలనుండే సర్వ ఉద్భవించినది. కైలాసమందు పార్వతివి నీవే, క్షీరసాగరమందు సింధుకన్యకవు నీవే, స్వర్గమునందు స్వర్గలక్ష్మివి నీవే, భూలోకమందు మర్త్యలక్ష్మివి నీవే. వైకుంఠమందు మహాలక్ష్మివి నీవే, దేవదేవి వైన సరస్వతివినీవే, గంగవు, తులసివి, బ్రహ్మలోకమందు సావిత్రివి, గోలోకమందు నీ వే స్వయముగ కృష్ణప్రాణాధిదేవి వైన రాధవు, రాసమండలమందు రాసేశ్వరివి బృందావనమందు బృందవునీవు. భాండీర వనమందు కృష్ణప్రియవు నీవే, చందన కాననమందు చంద్రవు నీవే, విరజా వనమందు విరజా దేవివి నీవే. శతశృంగమందు సుందరివి నీవే. పద్మవనమందు పద్మావతివి, మాలతీవనమందు మాలతివి, కుందవనమందు కుందదంతివి, కేతకీ వనమందు సుశీలవు నీవే. కదంబకాననమందు నీవే కదంబమాలవు, రాజ గృహమందు రాజలక్ష్మివి, గృహములందు గృహలక్ష్మివినీవే.

ఇట్లు సర్వ దేవతలు, మహర్షులు, మనువులు స్తుతించి రోదించుచు నమ్ర వదనులై శుష్క-కంఠోష్ఠ తాలుకా యుక్తులై లక్ష్మీదేవిని స్తుతించిరి. పుణ్యమయమైన, శుభప్రదమైన సర్వ దేవతలు స్తుతించిన యీ లక్ష్మీస్తోత్రమును ప్రాతఃకాలమున పఠించువారికి సర్వమనో వాంఛితములు తప్పక లభించగలవు.

భార్యలేనివారికి వినీతురాలైన, సతియైన, సుశీలగలదైన, సుందరియైన, సుప్రియవాదినియైన, శుద్ధురాలైన, ఉత్తమగుణ సంపన్నురాలైన, పుత్రపౌత్రవతియైన భార్య లభింపగలదు. పుత్రులు లేనివారికి చిరంజీవులైన, ధనవంతులైన, పరమైశ్వర్యయుక్తుడైన, యశస్వియైన, విద్యావంతుడైన సత్పుత్రుడు లభింప గలడు. బంధువియోగము సంభవించిన వారికి బంధువులు, ధనభ్రష్టులకు ధనము లభింపగలదు. కీర్తిహీనులకు కీర్తి ప్రతిష్ఠలు నిశ్చయముగ లభింపగలవు. సర్వ మంగళప్రద మైన యీస్తోత్రము శోకసంతాపనాశకము, హర్షానందదాయకము, ధర్మార్థకామమోక్షాదులను ప్రసాదింపగలది.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ
మందలి శ్రీకృష్ణ జన్మఖండములో
దేవతాదర్పభంగవర్ణనము
ఏబదియాఱవ అధ్యాయము
సంపూర్ణము

# ఏబదియేడవ అధ్యాయము

## -: పతి మాహాత్మ్య వర్ణనము :-

శ్రీనారాయణఋషి పలికెను :-

నారదా! దేవతలు చేసినస్తోత్రము నాలకించి శ్రీమహాలక్ష్మి శోకమును వీడి ప్రసన్నురాలై వారి నుద్దేశించి యిట్లుపల్కెను.

శ్రీమహాలక్ష్మి పలికెను :-

దేవతలారా! నేను క్రోధమువలనగాని, వైరాగ్యమువలనగాని దేహ పరిత్యాగ మొనరించుటలేదు. మహానుభావుడు, సర్వసామ్యదృష్టిగలవాడు, నిర్గుణుడు, సర్వాత్మకుడు, సదానందుడు, తృణశైలములందు సమభావముకల వాడైన నాభర్తయున్న చోట భ్రూభంగలీలతో సృష్టియొనరింపగలమహాలక్ష్మి నైననన్ను భృత్యుడవమానించినాడు. దేవాదిదేవునిపత్నులందు ప్రధానురాల నైననేను అవమానింపబడి అగ్నిప్రవేశముజేయవలె నని సంకల్పించుకొంటిని.

శ్లో॥ యా స్త్రీ భర్తురసౌభాగ్యా ససౌభాగ్యా చ సర్వతః।
శయనే భోజనే తస్యా న సుఖం జీవనం వృథా ॥ 7

భర్త సౌభాగ్యము పొందనిస్త్రీ యెన్నిసౌభాగ్యములు కల్గియున్నను భోజనమందుగాని, శయనమందుగాని సుఖింపదు. భర్తప్రేమ పొందనిస్త్రీ యొక్క జీవితమే వ్యర్థమగును.

శ్లో॥ యస్యా నాస్తి ప్రియప్రేమ తస్యా జన్మ నిరర్థకమ్ ।
తత్కిం పుత్రే ధనే రూపే సమ్పత్తౌ యౌవనేఽథవా ॥ 8

పుత్రునందు, ధనమునందు, రూపమునందు, సంపదలందు, యౌవన మందు, ప్రియతమునియందు ప్రేమలేనిస్త్రీకి ఆమెజన్మ నిరర్థకము.

శ్లో॥ యద్భక్తిర్నాస్తి కాన్తే చ సర్వప్రియతమే పరే ।
సాఽశుచిర్ధర్మహీనా చ సర్వకర్మవివర్జితా ॥ 9

సర్వప్రియతముడైన, పరాత్పరుడైన కాంతునియందు భక్తిలేనిస్త్రీ అశుచిరాలై, ధర్మవిహీనయై సర్వకర్మలకు అనధికారిణి కాగలదు.

శ్లో॥ పతిర్బన్ధుర్గతిర్భర్తా దైవతం గురురేవ చ ।
సర్వస్మాచ్చ పరః స్వామీ న గురుః స్వామినః పరః ॥ 10

పితా మాతా సుతో భ్రాతా క్లిష్టా దాతుమిదం ధనమ్ ।
సర్వస్వదాతా స్వామీ చ మూఢానాం యోషితాం సురాః ॥ 11

పతియే బంధువు, గతి, దైవము, గురువు, ముఖ్యుడు, స్వామి, ఉన్నతుడు. ఇట్టివాడుఇతరులయందు లేనేలేడు. భర్తయే స్త్రీకి తండ్రి, తల్లి, సుతుడు, సోదరుడు. దేవతలారా! మూఢు లైనస్త్రీలకు సర్వస్వమును, ధనమును ప్రసాదింపగలస్వామి యతడే.

శ్లో॥ కాచిదేవ హి జానాతి మహాసాధ్వీ చ స్వామినమ్ ।
అతిసద్వంశజాతా చ సుశీలా కులపాలికా ॥ 12

అసద్వంశప్రసూతా యా దుశ్శీలా ధర్మవర్జితా ।
ముఖదుష్టా యోనిదుష్టా పతిం నిన్దన్తి కోపతః ॥ 13

సద్వంశ సంజాతయు, సుశీలయు, కులపాలికయు, మహాసాధ్వియునగు స్త్రీయే భర్తమహిమను దెలిసికొనగలదు. కువంశసంజాతలు, దుశ్శీలలు, ధర్మవర్జితలు, కఠినవచనములచే మనస్సు నొప్పింపగల వ్యభిచారిణు లైన స్త్రీలు మాత్రమే కోపముతో భర్తను నిందింతురు.

శ్లో॥ యా స్త్రీ సర్వపరం ద్వేష్టి పతిం విష్ణుసమం గురుమ్ ।
కుమ్భీపాకే పచతి సా యావదిన్ద్రాశ్చతుర్దశ ॥ 14

వ్రతం చానశనం దానం సత్యం పుణ్యం తపశ్చిరమ్ ।
పతిభక్తివిహీనాయ భస్మీభూతం నిరర్థకమ్ ॥ 15

అంపటియందు ఆసక్తికలస్త్రీలే విష్ణుసమానుడు, గురుసముడునైన భర్తను ద్వేషింతురు. అట్టివారు పదునల్వురిందులిల యాయుర్దాయపర్యంతము కుంభీపాకనరక మనుభవింపగలరు. పతిభక్తివిహీనయైన స్త్రీ లొనరించినసమస్త వ్రతోపవాసదానపుణ్యతపము లన్నియు భస్మములు నిరర్థకములు కాగలవు.

కావున దేవతలారా! సర్వేశ్వరు డైన నాభర్త యెడల నా కెట్టికోపము లేదు. కాని భృత్యుడైనవాడు న న్నవమానించినకారణమున ప్రాణముల త్యజింపవలె నని సంకల్పించినాను. పతిదోష మున్నను మహాసాధ్వులైనవారు వారిని నిందింపరు.

శ్లో॥ పతిసేవా వ్రతం స్త్రీణాం పతిసేవా పరం తపః ।
పతిసేవా పరో ధర్మః పతిసేవా సురార్చనమ్ ॥ 18

పతిసేవా పరం సత్యం దానతీర్థానుకీర్తనమ్ ।
సర్వదేవమయః స్వామీ సర్వదేవమయః పతిః ॥ 19

సర్వపుణ్యస్వరూపశ్చ పతిరూపీ జనార్దనః ।
యా సతీ భర్తురుచ్ఛిష్టం భుంక్తే పాదోదకం సదా ॥ 20

తస్యా దర్శ ముపస్పర్శం నిత్యం వాంఛన్తి దేవతాః ।
తతః సర్వాణి తీర్థాని పునన్తి పాపినో హ్యఘాత్ ॥ 21

స్త్రీలకు పతిసేవయే వ్రతము, పరమతపస్సు, పరమధర్మము, సురార్చనము, పరసత్యము, దానతీర్థానుకీర్తనము. భర్త సర్వదేవ స్వరూపుడు, సర్వపుణ్యమయుడు, పరిశుద్ధుడు, సాక్షాత్తుగ జనార్దనుడు. భర్తప్రసాదమును, పాదోదకమును సదా సేవించు స్త్రీదర్శనమును, స్పర్శను నిత్యము దేవతలు వాంఛింతురు. పాపులను పునీతులుగ నొనరించు తీర్థములు కూడ అట్టి స్పర్శ వలన పవిత్రములు కాగలవు.

ఇట్లు ప్రవచించి మహాసాధ్వియగు శ్రీమహాలక్ష్మీ భర్తదర్శనము పొందలేక పోయితినిగదా యని దుఃఖితురాలయ్యెను. భయభీతుడై బ్రహ్మ భక్తినమ్రాత్మకంధరుడై యిట్లు పల్కెను. "దేవీ నీయెడల అపరాధ మొనరించిన జయవిజయులకు భద్రము లేదు. వారు మూఢులై నీయెడల అపరాధ మొనరించినారు. ధర్మిష్ఠులైన వారు తమ యెడల అపరాధమొనరించిన వారిపై కోపించిన వారు నిశ్చయముగ సర్వనాశనము కాగలరు.

శ్లో॥ యది శప్తుం న శక్తశ్చ న దణ్డం కర్తుమీశ్వరః।
సాపరాధే చ పురుషే ధర్మో దణ్డం కరోతి చ ॥ 25

అపరాధ మొనరించినవారిని శపించుటకు సమర్థులు కానియెడల శిక్షించుటకు సమర్థులు కానేకారు, అట్టి యపరాధులను స్వయముగ ధర్మదేవతయే శిక్షింపగలదు.

దేవీ! మాతా! మమ్ముల నందఱిని క్షమింపుము. నీప్రియుని సన్నిధానమునకు స్వేచ్ఛగా వెడలిపొమ్ము. దేవీ! నేను విష్ణుభక్తుడను, సృష్టికర్మయందు నియుక్తుడనై యున్నవాడను. కావున దేవీ! నన్నుకూడ క్షమింపుము. శ్రీమహాలక్ష్మిని సమాధానపఱచి బ్రహ్మ వైకుంఠములో జగన్నాథుడైన, శ్రీమహావిష్ణువును చతుర్వక్త్రములతో స్తుతించెను. వేదవిదుడైన బ్రహ్మచేసినస్తోత్రము నాలకించి నమ్రవదనయై దుఃఖించులక్ష్మిని యవలోకించి శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై వారి నుద్దేశించి యిట్లు పల్కెను.

శ్రీ విష్ణువు పలికెను :-

కమలోద్భవా! నాకు సర్వము విదితమే. నేను సర్వజ్ఞుడను, సర్వపాలకుడను, సర్వశక్తిసమన్వితుడను, సర్వాధికారుడను, భక్తులయెడల, భార్యయెడల, బంధువుల యెడల, అందఱియెడల నాకు సమభావముకలదు. కాని విశేషముగ నాయనన్య భక్తులు నాకు నాకళత్రముకంటె అధికులు. నాభక్తులైన, పుత్ర సములైన, దురంతకులైన ద్వారపాలకుల యపరాధములను, క్షమింపుము. నా భక్తితో పరిపూర్ణులైనవారు దైత్యులకు గూడ భయపడరు. నాభక్తియనెడు మధువును పానమొనరించి భక్తినిష్ఠాయుక్తులై యున్నవారు నాచక్రముచే రక్షింపబడెదరు.

ఇట్లుపల్కి ఆజగన్నాథుడు సాదరముగ శ్రీమహాలక్ష్మికి తనహృదయ మందు స్థానమొసంగెను. తదనంతరము ద్వారపాలకులైన జయవిజయులను రావించి భయముచెందకు డని యభయమొసంగెను. సర్వదేవతలు జగదీశ్వరున కనేక ప్రణామము లర్పించి తమతమ స్వధామముల కరిగిరి. శ్రీమన్నారాయణుని యభయ ప్రదానము నాలకించినవాడై ద్వారపాలకు డగు జయుడు పులకాంకిత దేహుడై భక్తితో తలవంచుకొని యిట్లుపల్కెను. "దేవాదిదేవా! నీచరణాంభోజముల ధ్యానమున నిమగ్నమైన మనస్సుకల్గిననేను దేవతలవలనగాని, లక్ష్మి వలనగాని, మునిగణములవలనగాని యేమాత్రము భయమొందను."

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ
మందలి శ్రీకృష్ణ జన్మ ఖండములో
పతి మాహాత్మ్య వర్ణనమను
ఏబదియేడవ అధ్యాయము
సంపూర్ణము.

# ఏబదియొనిమిదవ అధ్యాయము

## -: దేవీదర్పభంగ వర్ణనము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదా పూర్వము సర్వమున కాధారము నేనే యని పృథ్వి గర్వము వహింపగ సనాతన పరబ్రహ్మమైన ప్రభువు పృథుచక్రవర్తిద్వారా ఆమెదర్పమును భంగ మొనరించెను. సకల వేదములకు మాతను నేనే యని సావిత్రి గర్వము వహింపగ పరమాత్మ ఆమెకు పుత్రుడై, ఆమె దర్పమును భంగమొనరించెను. నేనే నిర్వాణపదాయిని యని గంగాదేవి అహంకరింపగా, ఆజగత్పతి జహ్నుమహర్షి ద్వారా ఆమె గర్వమును అణచెను.

మునీశ్వరా! మనసాదేవిదర్పమును పరమాత్మ దుర్గద్వారా హరించెను. అంతియేకాదు తుదకు ఆద్యాప్రకృతిరీశ్వరి యైనరాధదర్పమునుకూడ ఆపురుషోత్తము డెట్లుహరించెనో ప్రవచించెద నవధరింపుడు. విరజాగోపికతో గూడియున్న శ్రీకృష్ణుని సమీపించుటకు రాధ ప్రయత్నింపగా శ్రీకృష్ణపార్షదుడైన సుదాము డామెను అడ్డగించి భూమిపై నవతరింపు మనిశపించెను. ఆభక్తునిశాపవశమున జగజ్జననిరాధ భూతలముపై కళావతీవృషభానులకు గారాలకుమార్తెయై ప్రాదుర్భవించెను. శ్రీకృష్ణపరమాత్మ కంసునిభయ మనుకారణమును సృష్టించుకొని నందగృహమును ప్రవేశించి నందనందనుడై రాధననుగ్రహించెను. తన యనన్యభక్తుడైన సుదాముని శాపము పరిపూర్ణమొనరించుట కొఱకు ఆజగత్పతి రాధను వీడి మథురకు జనెను. నారదా! ఆమహామహుని యభిప్రాయము నెవరు తెలిసికొనగలరు.

నందనందనుడు నందునిగృహము వీడి మథురకు వెడలిపోయినపిమ్మట నందయశోదలు గోపగోపికలు ఎట్లుశోకించిరో ప్రవచించెదను. ఆగోపికలు వనములందు, అడవులందు, శ్మశానములందు శ్రీకృష్ణునికొఱకెట్లు విలపించుచు సంచరించిరో వర్ణించెదను. శ్రీకృష్ణవిహీనయైనరాధ అత్యంతదుఃఖితురాలై చేతనా శూన్యయై శ్రీకృష్ణునికొఱకై యెట్లువిలపించెనో వర్ణించెద నవధరింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ
మందలి శ్రీకృష్ణ జన్మఖండములో
దేవీ దర్పభంగ వర్ణనము
ఏబదియెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము

# ఏబదితొమ్మదవ అధ్యాయము

## -: ఇంద్రదర్పభంగవర్ణనము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదా! ఇట్లు నేను సర్వుల దర్పభంగప్రసంగములను సంక్షేపముగ వివరించితిని. ఇపుడు ఇంద్రదర్పభంగప్రసంగమును విస్తారపూర్వకముగ వర్ణించెదను శ్రవణమొనరింపుము. ఒకసమయమున నిండుపేరోలగములో రత్నసింహాసనాధీశుడైయున్నమహేంద్రుడు సభను ప్రవేశించు బ్రహ్మనిష్ఠాసంపన్నుడైన బృహస్పతిని గాంచియు లేచి నిలువబడి గౌరవింపలేదు. ఇంద్రుడొనర్చిన యీాధిక్కారమును గాంచి బృహస్పతి కుపితుడై ఆక్షణమందే సభను వీడి వెడలిపోయెను. ఇంద్రునిప్రవర్తనయెడల ద్వేషభావ ముదయించినను ధర్మాత్ముడైన ఆచార్యుడు కరుణాంతరంగుడై స్నేహావశమున ఇంద్రుని శపింపలేదు; కాని గురుశాపమునకు గుఱికాకపోయినను ఇంద్రుని దర్పమంతయు నశించెను.

శ్లో॥ అన్యశ్చేన్న శపేదర్మాత్ ప్రేమ్ణా వా చాతి కిల్బిషమ్ ॥ 4
తథాపి తం చ ఫలతి ధర్మస్తం హన్తి నారద ।

యో యం హింస్రం పాపరాధం శపేత్కోపేన ధార్మికః ॥ 5
వినాశః సాపరాధస్య ధర్మోనష్టశ్చ ధర్మిణః ।

ధర్మాత్ములు ప్రేమగల్గినవారు తమకెగ్గు ఒనరించినవారిని శపింపకపోయినను, అయ్యపరాధియపరాధమవశ్యముగ ఫలము ప్రసాదించును. నారదా! స్వయముగ ధర్మదేవతయే ఆపాపిని సర్వనాశనమొనరింపగలడు. ధర్మాత్ముడైనపురుషుడు తనయెడల అపరాధ మొనరించినవానిని శపించిన వాడు నిశ్చయముగ నశింపగలడు; కాని యాధర్మాత్మునిధర్మముకూడ (పుణ్యము) శపించిన కారణమున క్షీణింపగలదు.

ఇంద్రుడు గురుతిరస్కారమను అధర్మకార్య మొనరించినకారణమున బ్రహ్మహత్యకు గుఱియయ్యెను. శక్రుడు బ్రహ్మహత్యాపాతకమును గాంచి భీతుడై తనరాజ్యమును వీడి మానససరోవరమందుగల కమలనాళములో సూక్ష్మరూపియై నివసింపదొడంగెను. భారతవర్షమందు విరాజిల్లువిష్ణుదేవుని యీాసరోవరము పుణ్యతీర్థము, తాపసులు తపమొనరించుటకు దగినశ్రేష్ఠ

స్థానము. ఆ ప్రదేశమున బ్రహ్మహత్య ప్రవేశింపలేదు. ఆసరోవరమునే పురాణ వేత్తలైన పురుషులు పుష్కరతీర్థమని కీర్తించిరి. ఇంద్రుడు రాజ్యభ్రష్టుడు కాగా ధర్మాత్ముడు, హరిభక్తుడైన నహుషచక్రవర్తి త్రిలోకాధిపతి అయ్యెను.

ఒకదినమున మనోహరాంగ సమన్విత యైనశచీదేవి పతివియోగ కారణమున వ్యథితహృదయయై స్నాన మాచరించుటకు ఆకాశగంగాతటము నకు బయలుదేరెను. శచీదేవి అసమయమువఱకు సంతానవతి కాలేదు. ఆమె నూతనయౌవన సంపన్నయై, రత్నమయ వివిధాలంకారములచే విభూషితయై, అఖండసౌందర్యవతిగ ప్రకాశింప దొడంగెను. ఆత్రిభువనసుందరిని గాంచిన నహుషుని హృదయము మలినమై కామము జనించెను. అతడు శచీదేవి సమక్షమున తనమనోభావమును బహిర్గత మొనర్పగ శచీదేవి యిట్లు బదులు పల్కెను. "కుమారా! నే నుపదేశించు నీతివచనముల నవధరింపుము. మహా రాజా! నీవు ప్రజల భయమును భంజన మొనరించు వాడవు. రాజు సమస్త ప్రజలకు పాలకుడు, తండ్రి, అతడు తనప్రజలను భయమునుండి రక్షించును. ఈ సమయమున ఇంద్రుడు రాజ్యభ్రష్టుడుకాగా నీవు స్వర్గరాజ్యాధిపతివైతివి.

శ్లో॥ యో రాజా స పితా పాతా ప్రజానామేవ నిశ్చితమ్ ॥
గురుపత్నీ రాజపత్నీ దేవపత్నీ తథా వధూః । 54

పిత్రోః స్వసా శిష్యపత్నీ భృత్యపత్నీ చ మాతులీ ॥
పితృపత్నీ భ్రాతృపత్నీ శ్వశ్రూశ్చ భగినీ సుతా । 55

గర్భధాత్రీష్టదేవీ చ పుంసః షోడశ మాతరః ॥ 56

రాజైనవాడు నిశ్చయముగ ప్రజలకు పాలకుడైన తండ్రి కాగలడు. గురుపత్నీ, రాజపత్నీ, దేవపత్నీ, కోడలు, తల్లి సహోదరీ, తండ్రి సహోదరీ, శిష్యపత్ని, భృత్యపత్నీ, మేనమామపత్నీ, తండ్రిపత్నీ (తల్లి కాక సవతితల్లి), సోదరునిపత్నీ, కన్యాదానముచేసిన మామభార్యసోదరి, కొమరిత జన్మము నిచ్చిన తల్లి, ఇష్టదేవి, వీరు పదునాఱుగురు పురుషునకు తల్లులని గ్రహింపుము.

నీవు మనుష్యుడవు, నేను దైవపత్నిని; కావున నేను వేదసమ్మతముగ నీకు తల్లినైతిని. కుమారా! నీవు తల్లినే కామింపదలంచితివేని తల్లి యగుఅదితి చెంతకు పొమ్ము.

శ్లో॥ సర్వేషాం నిష్కృతిశ్చాస్తి న వత్స! మాతృగామినామ్ ।
కుమ్భీపాకే తే పచన్తి యావద్వై బ్రహ్మణో వయః ॥ 58
తతో భవన్తి కృమయః వేశ్యాయోనిషు కల్పకాన్ ।
తతశ్చ కుష్ఠినో మ్లేచ్ఛా భవన్తి సప్త జన్మసు ॥ 59
నాస్త్యేవ నిష్కృతిస్తేషామిత్యాహ కమలోద్భవః ।

వత్సా! పాపులందఱిని ఉద్ధరించుటకు ఉపాయములు కలవు; కాని మాతృగామికి ఎట్టియుపాయము లేదు. అతడు బ్రహ్మాయుః పర్యంతము కుంభీపాక నరకమున నుండును, పిమ్మట ఏడు కల్పముల పర్యంతము వేశ్యా స్త్రీ యోనియందు కీటకమై నివసించును. తదనంతరము ఏడుజన్మల వఱకు కుష్ఠు, వ్యాధిగ్రస్తుడై తుదకు మ్లేచ్ఛుడు కాగలడు. అట్టి పాపాత్మునకు ప్రాయశ్చిత్తమే లేదని బ్రహ్మదేవుని కథనము. వేదములం దట్టివానికి ప్రాయశ్చిత్తము లేదని అంగిరస స్మృతి నొక్కి వక్కాణించెను. నిశ్చయముగ సాంసారిక దేహధారులకు స్వర్గ సంపద ననుభవించుటయే సుఖప్రదము; కాని ముముక్షువులకు మోక్షము, తాపసులకు తపస్సు, బ్రాహ్మణులకు బ్రాహ్మణత్వము, మునీశ్వరులకు మౌనము, వైదికులకు వేదాభ్యాసము, కవులకు కావ్యవర్ణనము, వైష్ణవులకు విష్ణుదాస్యము పరమ సుఖప్రదములు. విష్ణుభక్తులు విష్ణుభక్తి రసాస్వాదనయే పరమసుఖ మని భావింతురు. వైష్ణవులు విష్ణుభక్తిని తప్ప ముక్తినైనను కాంక్షింపరు. రాజేంద్ర! నీవు మహాచక్రవర్తు లుద్భవించిన యుత్తమ కులమునందు బుట్టితివి. అనేకజన్మల పుణ్యమువలన నీకు పవిత్ర భారతవర్షమందు జన్మ లభించెను. చంద్రవంశ నరేశ్వరులను కమలములను వికశింప జేయుటకు నీవు గ్రీష్మకాల మధ్యాహ్న సూర్యునివలె ప్రాదుర్భవించితివి.

శ్లో సర్వేషా మాశ్రమాణాం చ స్వధర్మశ్చ యశః పరమ్ ॥
స్వధర్మహీనా నరకే పతన్తి మూఢచేతసః । 67
బ్రాహ్మణస్య స్వధర్మశ్చ త్రిసన్ధ్యమర్చనం హరేః ॥
తత్పాదోదకనైవేద్యభక్షణం చ సుధాధికమ్ ॥ 68
అన్నం విష్టా జలం మూత్రమనివేద్యం హరేర్నృప ॥ 69
భవన్తి సూకరాః సర్వే బ్రాహ్మణా యది భుంజతే ।
ఆజీవంభుంజతే విప్రా ఏకాదశ్యాం న భుంజతే ॥ 70
కృష్ణజన్మదినే చైవ శివరాత్రౌ సునిశ్చితమ్ ।

తథా రామనవమ్యాం చ యత్నతః పుణ్యవాసరే ॥ 71
బ్రాహ్మణానాం స్వధర్మశ్చ కథితో బ్రాహ్మణా నృప ।
వ్రతం పతివ్రతానాం చ పతిసేవా పరం తపః ॥ 72
యథాపుత్రః పరపతిరేష ధర్మశ్చ యోషితామ్ ।
పాలయన్తి యథా భూపాః ప్రజాః పుత్రానివౌరసాన్ ॥ 73
ప్రజాః శ్రీయం చ పశ్యన్తి రాజనో మాతరం యథా ।
యజ్ఞం కుర్వన్తి విష్ణోశ్చ సేవనం దేవవిప్రయోః ॥ 74
నివారణం చ దుష్టానాం శిష్టానాం ప్రతిపాలనమ్ ।
ఇతి ధర్మః క్షత్రియాణాం కథితో బ్రాహ్మణా పురా ॥ 75
వాణిజ్యం చైవ వైశ్యానాం స్వధర్మో ధర్మసంచయః ।
శూద్రాణాం విప్రసేవా చ పరో ధర్మో విధీయతే ॥ 76
సర్వన్న్యాసో హరౌ భూప ధర్మః సన్న్యాసినాం ధ్రువమ్ ।
రక్తైకవాసా దణ్డీ చ బిభర్తి మృత్కమణ్డలుమ్ ॥ 77
సర్వత్ర సమదర్శీ చ స్మరేన్నారాయణం సదా ।
కరోతి భ్రమణం నిత్యం గేహే గేహే న తిష్ఠతి ॥ 78
విద్యా మన్త్రం చ కస్మైచిన్న దదాతి చ లోభతః ।
కరోతి నాశ్రమం భిక్షుః కరోతి నాన్యవాసనామ్ ॥ 79
కరోతి నాన్యసఙ్గం చ నిర్మోహః సఙ్గవర్జితః ।
న స్వాదు భుంక్తే లోభాచ్చ శ్రీముఖం నహి పశ్యతి ॥ 80
న వాంఛితం భక్ష్యవస్తు యాచతే గృహిణం ప్రతి ।
ఇతి సన్న్యాసినాం ధర్మమిత్యాహ కమలోద్భవః ॥ 81

సమస్త ఆశ్రమములందు స్వధర్మపాలనమే ఉత్తమయశమునకేకైక కారణము. స్వధర్మహీనుడైన మూఢమానవుడు నరకమును పొందగలడు. త్రిసంధ్యలయందు శ్రీహరిని పూజించుట యే బ్రాహ్మణుల స్వధర్మము. భగవచ్చరణోదకపానము, భగవదర్పిత నైవేద్య భక్షణము వారికి అమృతము కంటె నుత్కృష్టము. నరేశ్వరా! భగవంతున కర్పించని అన్నపానీయములు మలమూత్ర సమానములని గ్రహింపుము. బ్రాహ్మణులు భగవదర్పితము కాని అన్నపానీయములను సేవించిన సూకర జన్మమును పొందగలరు. బ్రాహ్మణులైనవారు జీవిత పర్యంతము భగవంతున కర్పించిన నైవేద్యమునే భుజింపవలెను; కాని యేకాదశీ దినమున భుజింపరాదు. ఆపవిత్ర దినమున పూర్ణముగ నుపవాసముండవలెను. అటే శ్రీకృష్ణజన్మాష్టమి-

శివరాత్రి, రామనవమి మున్నగు పుణ్యావసరములందు గూడ నిశ్చయముగ, యత్నపూర్వకముగ నుపవసింపవలెను. బ్రాహ్మణులకు బ్రహ్మ ఏయే ధర్మములను నిర్ణయించెనో వానిని వర్ణించితిని. నరేశ్వరా! పతివ్రతలకు పతిసేవయే యుత్తమవ్రతము, ఉత్తమ తపము. పరపురుషులు పతివ్రతలకు పుత్రతుల్యులు; ఇదియే నారీమణుల కత్యుత్తమ ధర్మము. రాజులు ప్రజలను ఔరసపుత్రులుగ భావించి పాలించు నట్లే ప్రజలభార్యలను మాతృదేవతలుగ నెంచవలెను. విష్ణుదేవుని ప్రసన్నత కొఱకు యజ్ఞముల నాచరించుట, సత్పురుషులను బ్రాహ్మణులను సేవించుట, దుష్టులను శిక్షించుట, శిష్టులను రక్షించుట మొదలగు కర్మలు రాజధర్మము లని పూర్వకాలమందే బ్రహ్మ నొక్కి-వక్కాణించి యున్నాడు. వాణిజ్యము, ధర్మసంగ్రహము, గోపాలనము, వ్యవసాయము, వైశ్యులకు స్వధర్మము. బ్రాహ్మణులను సేవించుట శూద్రులకు పరమధర్మము. రాజా! సర్వస్వమును భగవంతు డైన శ్రీహరి కి సమర్పించుట సన్యాసుల ధర్మము. సన్యాసులైనవారు కాషాయ వస్త్రములను ధరించి, దండము, మృణ్మయ కమండలము, చేబూని చరింపవలెను. వారు సర్వత్రా సమానదృష్టి కల్గి శ్రీనారాయణ స్మరణ మొనరింపవలెను. వారు నిత్యము పర్యటించుచు లోభవశమున బహుకాలము ఎవని గృహమునను నివసింపరాదు. లోభవశులై అపాత్రులకు విద్యనుగాని, మంత్రమునుగాని ఉపదేశింపరాదు. సన్యాసియైనవాడు తనకొఱకు ఆశ్రమమును నిర్మింపరాదు, ఇతర విషయవాసనలకు తన మనస్సునందు స్థానమును కల్పింపరాదు, మోహములకు దూరముగ నుండి ఏకాంతనివాసము సల్పవలెను. సన్యాసి లోభవశమున స్వాదు పదార్థములను భుజింపరాదు, స్త్రీముఖమును దర్శింపరాదు. తన ప్రశంసను ద్వేషి మనస్కుడై చరింపవలెను. ఏగృహస్థునైనను తనకిష్టములైన భోజ్యవస్తువులను యాచింపరాదు. ఇవియే బ్రహ్మదేవుడు ప్రవచించిన సన్యాసుల స్వధర్మములు. కుమారా! ఇట్లు నేను నీకు ధర్మవిషయములను ఉపదేశించితిని. ఇపుడు నీవు సుఖముగ స్వగృహమునకు వెడలిపొమ్ము."

ఇట్లు నహుష చక్రవర్తికి ధర్మోపదేశ మొనరించి ఇంద్రాణి మౌనము వహించెను. ఆమె పలికిన పల్కుల నాలకించి కామ మనస్కు డైన నహుషుడు ఇట్లు ప్రత్యుత్తర మొసంగెను. "దేవీ! నీ యుపదేశములన్నియు సత్యములుగ నున్నవి. యదార్థవైదిక ధర్మమేదియో నేను ప్రవచించెద నాలకింపుము. సురసుందరీ! సర్వులు తమతమ కర్మఫలములను అనుభవింతురు గాని నిమిత్తములో

వలెను. నాల్గవదినమున నామె పతికొఱకు శుద్ధురాలు కాగలదు; కాని దేవ పితృకార్యముల నొనరించుట కాదినమున నామె శుద్ధురాలు కాదు. రజస్వల యైనస్త్రీతో మొదటిదినమున సమాగమ మొనరించువారు బ్రహ్మహత్యలో నాల్గవభాగమును పొందెదరు. ఆపురుషుడు దేవకార్యముల యందు, పితృ కార్యములయందు అర్హతను పోగొట్టు కొనును. వారధములై, నిందితులై అపకీర్తిని పొందగలరు. రెండవదినమున రజస్వలస్త్రీతో కామమోహితులై సమాగమ మొనరించినవా రవశ్యముగ గోహత్యాపాతకమును పొందగలరు. అట్టి వారు జీవితపర్యంతము దేవ, పితృ, బ్రాహ్మణ, పూజార్హతను కోల్పోయెదరు. వారు మనుష్యత్వమునుండి దిగజారి కళంకితులు కాగలరు. మూడవదినమున రజస్వలస్త్రీని పొందువారు మూఢులై, నిశ్చయముగ భ్రూణహత్యాపాతకము నకు గుఱికాగలరు. వీరు పతితులై సత్కర్మలకు అనధికారులు కాగలరు. నాల్గవ దినమున రజస్వలస్త్రీ అసత్ శూద్ర యనబడును; కావున విద్వాంసులైన పురుషులు రజస్వలస్త్రీని నాల్గవదినమునైనను తాకరు. నేను నీకు తల్లివంటి దానను. నీవు పాపభీతిలేక తల్లినైనను పొందగోరెదవేని, ఈదినమున నన్ను పోనిమ్ము. నాఋతుకాలము గడచిన పిమ్మట నీయిచ్ఛ వచ్చినట్లు పాపకార్య మును నిర్వర్తింపుము.

శచీదేవి ఎంతవారించినను నహుషుడు తనపాపచింతనను వీడక "దేవ రమణులు సదా శుద్ధులే కావున నీవు తక్షణమే స్వగృహమునకు వెడలిపొమ్ము, త్వరలో నేను నీగృహమున కరుదెంచెద" నని పల్కి దివ్యరథారూఢుడై శచీ గృహమునకు బయలుదేరెను. కాని శచీదేవి గృహమునకు మరలిపోలేదు. ఆమె ఆకాశగంగా తటమునుండి సరాసరి దేవగురువైన బృహస్పతి యాశ్రమము నకు జని కుశాసనముపై విరాజమానుడైయున్న ఆచార్యుని దర్శించెను. ఆగ ఆయన చరణారవింద సేవయం దుండగ బృహస్పతి బ్రహ్మతేజః ప్రకాశ మానుడై హస్తములందు జపమాల ధరించి తనయభీష్టదైవమైన శ్రీకృష్ణుని దివ్యనామమును జపించుచుండెను. శ్రీకృష్ణపరమాత్మ సగుణుడు, నిర్గుణుడు, పరమానం నంద మయుడు, సర్వేశ్వరుడు, నిర్గుణుడు, నిరీహుడు, స్వతంత్రుడు ప్రకృతి యతీతుడు, స్వేచ్ఛామయుడైన పరబ్రహ్మ, భక్తానుగ్రహ విగ్రహుడు. బృహస్పతి ఆయనచింతనయందే సంలగ్నుడై ఆనందబాష్ప పూరిత నయనుడై ప్రకాశించుచుండెను. గురుదేవుని గాంచి దుఃఖించుచు శచీదేవి సాష్టాంగ దండ

ప్రణామము లర్పించి నిలువబడి భయభీతయై వ్యథిత హృదయముతో బ్రహ్మ నిష్ఠుడైన, ఆచార్యుడైన, కృపానిధానుడైన బృహస్పతి నిట్లు స్తుతింపదొడంగెను. మహాభాగా! నేను భీతనై నిన్ను శరణుజొచ్చితిని. నీవు ఈశ్వరుడవు, నేను శోకసాగరమందు చిక్కియున్న నీదాసిని, దేవా! నన్ను రక్షింపుము, రక్షింపుము. గురువు సమర్థుడైనను, లేక అసమర్థుడైనను, బలవంతుడైనను లేక నిర్బలుడైనను, అతడు తనశిష్య పత్ని పుత్రులను శాసించుటకు సమర్థుడే. ప్రభూ! నీవు నీశిష్యుల లను రాజ్యమునుండి దూరమొనరించితివి, బహుకాలము గతించినది, ఆ దోషము శాంతించినది; కావున కరుణింపుము. కృపానిధీ! నేను అనాథను, నాకు సర్వదిశలు శూన్యములైనవి, అమరావతి శూన్యమైనది, నానివాస స్థానము కూడ సకలసంపత్తి శూన్యమైనది. నాయీదురవస్థను గాంచి నన్నీ సంకటములనుండి రక్షింపుము. ఒకదుర్మార్గుడు నన్ను కబళింపవలె నని యత్నించుచున్నాడు, దయతో వాని బారినుండి నన్ను రక్షించి మీకింకరుడైన దేవేంద్రుని యుద్ధరించి వానికి మీచరణధూళిని ప్రసాదించి అనుగ్రహింపుము.

శ్లో॥ సర్వేషాం చ గురూణాం చ జన్మదాతా పరో గురుః ।
పితుః శతగుణా మాతా పూజ్యా వన్ద్యా గరీయసీ ॥ 144
విద్యాదాతా మన్త్రదాతా జ్ఞానదో హరిభక్తిదః ।
పూజ్యో వన్ద్యశ్చ సేవ్యశ్చ మాతుః శతగుణో గురుః ॥ 145
మన్త్రోద్యపీడ్గిరణే నైవ గురురిత్యుచ్యతే బుధైః ।
అన్యో వన్ద్యో గురురయమన్యశ్చారో పితో గురుః ॥ 146
అజ్ఞానతిమిరాన్ధస్య జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః ॥ 147
అదీక్షితస్య మూర్ఖస్య నిష్కృతిర్నాస్తి నిశ్చితమ్ ।
స్వకర్మస్వనర్హస్య నరకే తత్ప్రశోః స్థితిః ॥ 148
జన్మదాతాన్నదాతా చ మాతాఽన్యే గురవస్తథా ।
పారం కర్తుం న శక్తాస్తే ఘోరసంసారసాగరే ॥ 149
విద్యామన్త్రజ్ఞానదాతా నిపుణః పారకర్మణి ।
స శక్తః శిష్యముద్ధర్తు మీశ్వరశ్చేశ్వరాత్పరః ॥ 150
గురుర్విష్ణుర్గురుర్బ్రహ్మా గురుర్దేవో మహేశ్వరః ।
గురుర్ధర్మో గురుః శేషః సర్వాత్మా నిర్గుణో గురుః ॥ 151
సర్వతీర్థాశ్రయశ్చైవ సర్వదేవాశ్రయో గురుః ।

సర్వదేవస్వరూపశ్చ గురురూపీ హరిః స్వయమ్ ॥ 152
అభీష్టదేవే రుష్టే చ గురుః శక్తో హి రక్షితుమ్ ।
గురౌ రుష్టేఽభీష్టదేవో న హి శక్తశ్చ రక్షితుమ్ ॥ 153
సర్వేగ్రహాశ్చ యం రుష్టాయం రుష్టా దేవబ్రాహ్మణాః ।
తమేవ రుష్టో భవసి గురురేవ హి దైవతాః ॥ 154
న గురోశ్చ ప్రియశ్చాఽఽత్మా న గురోశ్చ ప్రియః సుతః ।
ధనం ప్రియం చ న గురోర్న చ భార్యా ప్రియా తథా ॥ 155
న గురోశ్చ ప్రియో ధర్మో న గురోశ్చ ప్రియం తపః ।
న గురోశ్చ ప్రియం సత్యం న పుణ్యం చ గురోః పరమ్ ॥ 156
గురోః పరో న శాస్తా చ న హి బన్ధుర్గురోః పరః ।
దేవో రాజా చ శాస్తా చ శిష్యాణాం చ సదా గురుః ॥ 157
యావచ్ఛక్తో దాతుమన్నం తావచ్ఛాస్తాతదన్న దః ।
గురుః శాస్తా చ శిష్యాణాం ప్రతి జన్మని జన్మని ॥ 158
మన్త్రీ విద్యా గురుర్దేవః పూర్వలబ్ధో యథా పతిః ।
ప్రతిజన్మ ని బంధేన సర్వేషాముపరి స్థితః ॥ 159
పితా గురుశ్చ వన్ద్యశ్చ యత్ర జన్మని జన్మదః ।
గురవోఽన్యే తథా మాతా గురుశ్చ ప్రతిజన్మని ॥ 160

సమస్తగురు జనులందు జన్మదాత యైనతండ్రి శ్రేష్ఠగురు వనబడెను. తండ్రికంటె తల్లి నూరురెట్లు ఎక్కువగ పూజనీయురాలు, వందనీయురాలు, వరిష్ఠ; కాని విద్యాదాత, మంత్రదాత, జ్ఞానదాత, హరిభక్తిప్రదాత యైన గురువు తల్లికంటే గూడ నూరురెట్లు ఎక్కువ పూజనీయుడు, వందనీయుడు, సేవ్యుడు. అజ్ఞానరూపమైన తిమిర రోగముచే అంధుడైన మహాశిష్యుని దృష్టిని జ్ఞానాంజనముతో సమ్మిళితమైయున్న శలాక శస్త్రము చే శస్త్రచికిత్స గావించి దృష్టిని ప్రసాదించు నాగురుదేవునకు నమస్కారము. జన్మదాత, అన్నదాత, మాత, పిత, అన్యగురువులందఱు జీవుని ఘోరసంసార సాగరము నుండి తరింప జేయుటలో సమర్థులు కారు. గురువే విష్ణువు, గురువే బ్రహ్మ, మహేశ్వరుడు, గురువే ధర్మము, గురువే ఆదిశేషుడు, గురువే పరబ్రహ్మ, గురువే నిర్గుణుడైన శ్రీకృష్ణుడు; గురువే సర్వతీర్థములు, ఆశ్రమము, దేవాలయము, గురువే సర్వదేవస్వరూపుడైన శ్రీహరి. ఇష్టదైవము కోపించిన గురువు తనశిష్యుని రక్షింపగలడు; కాని గురువే కోపించిన ఇష్టదైవమైనను

రక్షింపలేడు. ఎవనిపై సర్వగ్రహములు, దేవతలు, బ్రాహ్మణులు కోపింతురో వానిపై గురుదేవుడు కోపించును; ఎందువలననగ గురుడే సకలదైవస్వరూపుడు. శరీరము, పుత్రులు, ధనము పత్నీ కూడ గురువును మించినప్రియులు కారు. ధర్మము, తపము, సత్యము, పుణ్యాదులు కూడ గురువుకంటే నధిక ప్రియములు కావు. గురువును మించిన శాసకుడు, బంధువు మఱియొకడు లేడు. శిష్యులకు గురువే శాసకుడు, రాజు, దైవము. అన్నదాత ఎంతవఱకు అన్నము ప్రసాదించుటలో సమర్థుడో అంతవఱకే శాసింపగలడు; కాని ఆచార్యుడు జన్మ జన్మలందు శిష్యులకు శాసకుడు కాగలడు. మంత్రము, విద్య ఆచార్యుడు దైవము వీరందఱు భర్తవలె పూర్వజన్మాను సారముగ ఈ జన్మయందు ప్రాప్తింతురు. ప్రతిజన్మయందు గురుసంబంధము సంభవించును గాన ఆయన స్థానము అందరికంటే నత్యున్నతము. పితృస్వరూపుడైన గురువు జన్మను ప్రసాదించినను జన్మయందే వందనీయుడు. తల్లి యొక్క అన్యగురుజనుల యొక్క స్థితి కూడ నంతే, కాని జ్ఞానదాత యైన గురువు ప్రతిజన్మమందు వందనీయుడే.

బ్రాహ్మణోత్తమా! నీవు సకలబ్రాహ్మణులలోను వరిష్ఠుడవు తాపసులలో గరిష్ఠులవు, సమస్తధర్మాత్ములయందుత్తమ ధర్మిష్ఠుడవు. బ్రహ్మనిష్ఠులలో బ్రహ్మవేత్తవు. మునిశ్రేష్ఠా! ఇపుడు నీవు నాపై, ఇంద్రునిపై సంతుష్టుడవుకమ్ము. నీవు సంతుష్టుడవైన సకలగ్రహములు, దేవతలు సంతుష్టులై యుండెదరు.

నారదా! ఇట్లు స్తుతించి శచీదేవి మఱల ఉచ్చైస్స్వరముతో రోదింపసాగెను. ఆమె విషాదమును గాంచి తారాదేవి కూడ అనేక విధములు దుఃఖించి పతిచరణముల నైబడి ఇంద్రుని యపరాధములను క్షమించి రక్షింపుడని ప్రార్థింపగ బృహస్పతి సంతుష్టుడై తారతో "తారా! లెమ్ము, నీకిక సర్వము మంగళకరము కాగలదు. నాయాశీర్వాద బలముచే ఆమె వానిని శీఘ్రముగ తనభర్తయగు మహేంద్రుని పొందగలదు" అనిపల్కెను. పిమ్మట తార శచీదేవిని ప్రేమతో ఆలింగన మొనరించి యనేక యాధ్యాత్మిక వచనములను పలికి సమాధాన పరచెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ
మందలి శ్రీకృష్ణ జన్మ ఖండములో
ఇంద్ర దర్ప భంగ వర్ణనము
ఏబదితొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.

# అఱువదియువ అధ్యాయము

## -: నహుషోపాఖ్యానము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారాదా! శచి యొనరించిన స్తోత్రముచే సంతుష్టుడై బృహస్పతి శాంత భావముతో నింద్రపత్నియగు శచితో నిట్లు పల్కెను. కుమారీ! భయమును వీడుము. నే నుండగ నీ కేల భయము? నాకు కమునిపత్ని (పుత్రవధు) ఎట్లో నీవుకూడ నట్లే.

శ్లో॥ యథా పుత్ర స్తథా శిష్యో న భేదః పుత్రశిష్యయోః ।
తర్పణే పిణ్డదానే చ పాలనే పరితోషణే ॥ 3

యథాగ్నిదాతా పుత్రస్య తథా శిష్యశ్చ నిశ్చితమ్ ।
ఇతీ దం కణ్వశాఖాయాముమవాచ కమలోద్భవః ॥ 4

పితా మాతా గురుర్భార్యా శిశుశ్చానాథబాన్ధవాః ।
ఏతే పుంసాం నిత్యపోష్యా ఇత్యాహ కమలోద్భవః ॥ 5

పుత్రునకు గల స్థానమే శిష్యునకు కూడ గలదు. తర్పణము, పిండ దానము, పాలనము, పరితోషణము మొదలగు సర్వకార్యములను నిర్వర్తించుటలో పుత్ర శిష్యులందే భేదములేదు. మరణించిన తండ్రికి పుత్రుడు అగ్నిదాత యగునట్లు శిష్యుడుగూడ గురువునకు అగ్నిదాత యగును. ఈవిషయములు ఖణ్వశాఖలో బ్రహ్మ ప్రవచించియున్నాడు. తండ్రి, తల్లి, గురువు, పత్ని, పిన్నవయస్కులైనవారు, అనాథలు, కుటుంబజనులు, పురుషునిచేనిత్యము పోషింపబడుటకు యోగ్యులని బ్రహ్మప్రవచించెను.

వీరిని పోషింపనివారు వారిశరీరము భస్మమగు వఱకు అశుచిగ నుండ గలరు. అట్టివారు జీవితమందు దేవయజ్ఞ, పితృయజ్ఞాది కర్మలకు అనధికారులు కాగల రని మహేశ్వరుడు ప్రవచించెను.

శ్లో॥ కురుతే నరబుద్ధిం చ మాతరం పితరం గురుమ్ ।
అయశ స్తస్య సర్వత్ర విఘ్న ఏవ పదే పదే ॥ 7

సమ్పన్మత్తో యః కరోతి స్వగురోశ్చ పరాభవమ్ ।
అచిరాత్సర్వనాశశ్చ భవే త్తస్య సునిశ్చితమ్ ॥ 8

తల్లియెడల, తండ్రియెడల, గురునియెడల మానవ భావముతో ప్రవర్తించు వారు అపయశమునకు గురియై అడుగడుగున విఘ్నముల నెదుర్కొన గలరు. ధనమదాంధులై ఆచార్యుని యవమానించు వారు శీఘ్రముగ సర్వ నాశమొందగలరు, ఇది నిశ్చితవిషయము.

తన సభలో నన్ను గాంచియు నింద్రుడు ఆసనమునుండి లేచి గౌరవింప లేదు, ఆదుష్కర్మఫలమే యతడీసమయమున అనుభవించుచున్నాడు. గురువు నవమానించిన యెంతటి దుష్కరఫలము ప్రాప్తించునో నీవు కన్నులారా గాంచితివి, ఇపుడు నేను ఇంద్రుని శాపవిముక్తుని గావించి నిశ్చయముగ నిన్ను రక్షించెదను.

శ్లో॥ శాసితుం రక్షితుం శక్తః స ఏవ గురురుచ్యతే ॥ 10

శాసింపగలవాడు, సంరక్షింపగలవాడు గురువని చెప్పబడును.

కలుషితభావరహిత యగు స్త్రీసతీత్వము నశింపదు; ఏస్త్రీమనస్సు నందు వికల్పము లుద్భవించునో ఆస్త్రీధర్మము నిశ్చయముగ నశించును. పతివ్రతా! నీకు దుర్గాదేవితో సమానమైన ప్రభావము వృద్ధి చెందుగాక. నీ ప్రతిష్ఠ, యశస్సు లక్ష్మీదేవితో సమానముగ ప్రకాశించుగాక! నీపతిప్రేమ సౌభాగ్యము శ్రీరాధప్రేమ సౌభాగ్యములవలె, వృద్ధి చెందుగాక. స్వామి యెడల గౌరవము, మానము, ప్రీతి ప్రధాన భావము నీయందు శ్రీరాధా సదృశముగ నుండుగాక. రోహిణివలె నీలో పత్యపేక్ష వృద్ధి చెందుగాక. నీవు భారతితో సమానముగ పూజనీయురాలవై సావిత్రీ తుల్యముగ సదా తపస్వి రాలవై, సాటిలేనిదానివై యుండెదవుగాక.

బృహస్పతి శచీదేవి నిట్లు ఆశీర్వదించుచుండగా నహుషుడు పంపినదూత ఆప్రదేశమున కరుదెంచి శచీదేవిని 'నందనవనమునకు బయలుదేర వలసినదిగ నహుషుడాజ్ఞాపించె' నని విన్నవించెను. దూతవచనములను వినిన బృహస్పతి శరీరమంతయు క్రోధముచే కంపించెను. ఆయన రక్తపంకజలోచనుడై దూతతో నిట్లుపల్కెను. "దూతా! నీవు నహుషుని కడ కేగి "మహారాజా! నీవు శచీ సమాగమము వాంఛించితివేని సప్తఋషులు మోయుచుండగ పల్లకి నధి రోహించి ఉత్తమవేష భూషలను ధరించి రావలయు నని మా సందేశముగా తెల్పుము" ఆదూత బృహస్పతి సందేశమును నహుషునకు సవిస్తరముగ విన్న వించెను. ఆసందేశమును విని మదోన్మత్తుడైన నహుషుడు పరిహసించుచు సేవకుల

నిట్లు ఆజ్ఞాపించెను "సేవకులారా! మీరు తత్ క్షణమే సప్తఋషులను తోడ్కొని రండు" నహుషుని యాజ్ఞానుసారముగ సప్తఋషులు ఇంద్రసభకేతెంచిరి. వారిని గాంచి నహుషుడు ప్రణామము లర్పించి ఆదరపూర్వకముగ నిట్లు పలికెను" "ద్విజోత్తములారా! మీరు బ్రహ్మపుత్రులు, బ్రహ్మతేజ సంపన్నులు, భక్తానుగ్రహ విగ్రహులు. నిరంతరము శ్రీమన్నారాయణోపాసనయందు నిమగ్నులైయుండు మహాత్ములు, శుద్ధ సత్త్వస్వరూపులు. దర్పాహంకారములు మీవంటి వారలను సమీపింపలేవు. మీరు ఎల్లపుడు నారాయణ సమాన తేజ స్వరూపులు, యశస్వులు. గుణములందు కృపాప్రేమ వరదానములందు నిశ్చయముగ మీరు శ్రీహరి తుల్యులు" ఇట్లు సప్తఋషులను స్తుతించి నహుషుడు వారిచరణములపై బడెను. రాజు భక్తిని గాంచి యత్యంత సంతుష్టులై యాఋషిపుంగవు లిట్లు పల్కిరి "కుమారా! నీమనస్సునందుగల కోరికను నిర్భయముగ నర్థింపుము, మేము సర్వస్వమును ప్రసాదించగలవారము. మాకసాధ్యమనునది లేదు. మనుపదమునైనను, అతిశయ సుఖములనైనను, పరమ దుర్లభము లగు నైశ్వర్యములనైనను, తపస్సుచే గూడ లభింపని హరిభక్తిగాని ముక్తినిగాని మేము నీకు ప్రసాదింపగలము.

శ్లో॥ యుగలక్షసమం యచ్చ క్షణం కృష్ణార్చనం వినా ।
తద్దినం దుర్దినం యత్తద్ ధ్యానసేవనవర్జితమ్ ॥ 32

వినా తత్సేవనం యో హి విషయాన్యం చ వాంఛతి ।
విషమత్తి ప్రణాశాయ విహాయామృతమీప్సితమ్ ॥ 33

బ్రహ్మశివశ్చ ధర్మశ్చ విష్ణుశ్చాపి మహావిరాట్ ।
గణేశశ్చ దినేశశ్చ శేషశ్చ సనకాదయః 34

పతే యచ్చరణామ్భోజం ధ్యాయన్త్యోఽహర్నిశం ముదా ।
జన్మమృత్యుజరావ్యాధిహరం తన్నిరతా వయమ్ ॥ 35

శ్రీకృష్ణునియారాధనలేక వ్యతీతమగు క్షణము లక్షయుగములతో సమానము. అనగా శ్రీకృష్ణభజనలేకుండగ ఒకక్షణము వ్యర్థమైన ఒకలక్ష యుగములు మనకు వ్యర్థమైనట్లు భావింపవలెను. శ్రీహరిసేవాధ్యానరహితమైనదినమే అన్నిదినములందు దుర్దిన మనిభావింపవలెను. శ్రీహరిసేవను వీడి అన్యవిషయసేవనమందు ఇచ్ఛకల్గియుండువాడు మనోవాంఛితమగు అమృతమును త్యజించి తన వినాశముకొఱకు విషమును పానముచేసినట్లే

భావింపవలెను. బ్రహ్మ శివ ధర్మ విష్ణు మహావిష్ణు, గణేశ్వర సూర్య శేష సనకాదు లందఱు అహర్నిశములు ప్రసన్నతాపూర్వకముగ ఎవనిచరణారవింద ముల చింతనయందు సదా సంలగ్నులై యుండెదరో; జన్మమృత్యుజరావ్యాధి హరు డైన యట్టి శ్రీకృష్ణునియందే సదా మేమనురక్తులమై యుందుము."

సప్తఋషులు పల్కిన బోధామృతమును విని రాజేశ్వరు డైన నహుషుడు లజ్జితుడై శిరము వంచుకొనెను. కాని యతడు మాయామోహితు డైనకారణమున తన చెడువాంఛను ఆమహర్షులతో నిట్లు చెప్పెను. "మహర్షు లారా! మీరు భక్తవత్సలు లైనకారణమున ఆశ్రితులకు సర్వస్వమును ప్రసా దింపగల శక్తి సమన్వితులు, నే నీసమయమున శచీదేవి గృహమునకు పోవ లయు ననియభిలషించుచున్నాను; కావున మీరు నాకు శచినిసమర్పింపుడు. సప్తఋషులనే వాహనములుగ కల్గినపతినే పొందవలెనని శచీదేవి కోఱు చున్నది, కావున మీరు నాయీయభీష్టకార్యమును సంపన్న మొనరించవలసి నదిగ ప్రార్థించుచున్నాను.

నారదా! నహుషుని యీవిపరీత మైనకోర్కెను విని మహర్షులు ఆశ్చర్యచకితులై యొకరిముఖము నొకరు వీక్షించుచు నుచ్ఛస్స్వరముతో నట్ట హాసము లొనరించిరి. రాజు విష్ణుమాయచే మోహితుడయ్యె నని గ్రహించి ఆదీనవత్సలు లైనసప్తఋషులు కృపాపూర్వకముగ నహుషునిపల్లకిని మోయుట కంగీకరించిరి. అనంతరము నహుషు డత్యుత్తమా లంకారసమన్వి తుడై, రత్నమయ మగుపల్లకిని అధిష్ఠింపగా, సప్తర్షు లాపల్లకిని భుజములపై నెత్తుకొని శచీగృహమునకు బయలుదేరిరి. ఆవాహనముద్వారా అభీష్టస్థానము నకు జేరుటకు విలంబన మగుట గాంచి నహుషుడు సప్తఋషులను దూషింప నారంభించెను. పల్లకిని మోయుచు అందరికంటె ముందున్న దుర్వాసమహర్షి నహుషునిదుర్భాషలకు కోపించినవాడై, మూఢా! నీవు తక్షణమే యొకమహా జగరమగుదువుగాక యని శపించెను. నహుషునిదర్ప మంతయు పూర్తిగ నశిం పగా అతడహంకారమును వీడి తనతప్పిదమును దెలిసికొని పశ్చాత్తప్తహృద యుడై క్షమింపుడని, అనుగ్రహింపుడని మహర్షులపాదముల పై బడి ప్రార్థింప దొడంగెను. కోపము శాంతింపగ దుర్వాసమహర్షి యుధిష్ఠిరునిదర్శనమువలన నీకు శాపవిమోచనము కలుగగలదని నహుషుని యనుగ్రహించెను. ఆక్షణ

మంతే త్రిలోకాధిపత్యమునుండి పతితుడై నహుషుడు తనదుష్కర్మమువలన మహాసర్పముగ మారి భూమిపై బడెను.

దేవర్షీ! నహుషగర్వభంగ సమాచారమును విని శచీదేవి యత్యంత సంతుష్టయై గురుచరణములకు నమస్కరించి యమరావతికి తిరిగివచ్చెను. పిమ్మట బృహస్పతి యింద్రుడు దాగియున్న ప్రదేశమున కేతెంచి, వత్సా! సరోవరమును వీడి బహిఃప్రదేశమునకు రమ్ము. నే నుండగ నీ కేలభయము? నీవు నిర్భయుడవు కమ్ము, నేను నీయాచార్యుడనైన బృహస్పతినని యింద్రుని సంబోధించి పల్కెను. తన గురుదేవుని స్వరమును గుర్తించి యింద్రు డత్యంత ప్రసన్నుడై తన సూక్ష్మరూపమును వీడి సరోవరమునుండి బయల్వెడలి బృహస్పతి పాదముల పైబడెను. బృహస్పతి తనశిష్యుని మన్నించి ప్రాయశ్చిత్తము కొఱకు ఇంద్రునిచే సోమయాగమును జేయించి మఱల ఆతనిని త్రిలోకాధిపతిగ జేసెను. ఆచార్యు డింద్రునకు మొదటికంటె నాల్గురెట్లు ఎక్కువగ నైశ్వర్యమును బ్రసాదించెను. శచీదేవి మఱల తనభర్త యైన దేవేంద్రుని గలసికొని యానంద పూర్వకముగ సుఖముల ననుభవించెను. వత్సా! ఇట్లు నేను నహుషుని, ఇంద్రుని, గర్వభంగ ప్రసంగములను, శచీదేవి పాతివ్రత్య రక్షణ ప్రసంగమును వర్ణించితిని. ఇపుడు నీవే విషయములను వినగోరుచున్నావో చెప్పుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ
మందలి శ్రీకృష్ణ జన్మ ఖండములో
న హు షో పా ఖ్యా న మ ను
అఱువదియవ అధ్యాయము
సంపూర్ణము.

## అఱువదియొకటవ అధ్యాయము

### -: అహల్యోపాఖ్యానము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదా! ఇంద్ర దర్పభంగ ప్రసంగమును కించిన్మాత్రమే వర్ణించితిని. ఇప్పుడు మఱియొక యింద్రుని గర్వభంగ చరితమును వర్ణించెద నవధరింపుము. సముద్రమును మథించి యింద్రుడు శ్రీమన్నారాయణుని కృపవలన అమృతపానమును గ్రోలినవాడై దైత్యులను జయించి, ఇదియంతయు తనప్రభావమే యని గర్వించెను. అదిగ్రహించిన సర్వాంతర్యామి బలిచక్రవర్తిచే నింద్రుని గర్వభంగము గావించెను. శ్రీభ్రష్టుడై యింద్రుడు పరితపింపగ యింద్రజనని యదితి పయో వ్రత మాచరించెను. ఆచార్యుడైనబృహస్పతి యింద్రుని రక్షింపవలసినదిగ భగవంతు ననేకవిధముల స్తుతించెను. వారి ప్రార్థనలను మన్నించి శ్రీహరి సర్వేశ్వరేశ్వరుడు స్వకళచే నదితికి వామన రూపమున ప్రాదుర్భవించి బలిని యాచించి సకల సామ్రాజ్యమును మఱల మహేంద్రున కొసంగెను.

మఱియొక సమయమున అహంకరించిన యింద్రుడు శ్రీహరిప్రసాద మును తృణీకరించి, దుర్వాసమహర్షి శాపమునకు గుఱియై సకలరాజ్యశ్రీ భ్రష్టుడయ్యెను. మఱల కృపానిధానుడైనమహర్షి యనుగ్రహమువలన తిరిగి తనసామ్రాజ్యమును బొందగల్గెను. కల్పాంతరమున నింద్రుడు గౌతమమహర్షి శాపమునకు గుఱియై తనశరీరమునందంతయు భగచిహ్నములుగలవాడయ్యెను. ఆవికృతాకారుని గాంచి సకలమహర్షులు మౌనివర్యులు పరిహసించిరి, సమస్త దేవతలు లజ్జవలన నతమస్తకులైరి, బృహస్పతి తనశిష్యునిపతనమున కెంతయో చింతించెను. పిమ్మట ఇంద్రుడు గర్వమును వీడినవాడై సహస్ర వర్షములపర్యంత మాదిత్యుని యుపాసించి ఆయనకరుణవలన భగములు సహస్ర పోగా సహస్రాక్షుడయ్యెను.

నారదుడు పలికెను :

దేవా! ఏకారణమువలన నింద్రుడు గౌతముని శాపమునకు గుఱి కావలసివచ్చెను? పూజ్యురాలు, భువనపావని, నిర్మల, శుద్ధాంతఃకరణసంపన్నురా యగుఅహల్య ఎట్లువంచింపబడెను?

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దేవర్షీ ! సూర్యపర్వణిదినమున తీర్థయాత్రనొనరించుచు పుష్కరతీర్థమున కేతెంచినయింద్రుఁ డాప్రదేశములో త్రిభువనసౌందర్యవతి యైన యహల్యను గాంచెను. ఆమె మందస్మితముఖారవింద, సుదతి, పరమశాంత, పీనశ్రోణిపయోధర. అయ్యతిలోకసౌందర్యవతిని గాంచినవెంటనే యింద్రుఁడు మోహాతిశయముచే మూర్ఛిల్లి మరల తెప్పరిల్లి ఆమెసౌందర్యము నిట్లు ప్రశంసింపనొడంగెను. "ఆహా ఏమిగుణము? ఏమిరూపము? ఏమినవయౌవనము? ముఖశ్రీశరచ్చంద్రునికంటే నెంతప్రకాశవంతముగనున్నది. ఈమె విశాలలోచనములు శరత్కాలప్రఫుల్లపద్మములకంటే సువిశాలములు. అహో! కటాక్షములు కుటిలములు చిత్తాకర్షకములు; గమన మతిరమణీయమైన గజగమనము. వాక్యము లమృతమువలె సుమధురములు, సర్వులకు సుదుర్లభములు. ఆహా ! ఈసుందరాంగి విపులశ్రోణి సుమనోహరము. కాముకులకు కామమును ప్రసాదింపగలయీతన్వి మునిమానసమోహిని. అహో ! నితంబయుగళము వర్తులాకారముగ ప్రకాశించుచున్నవి. శ్రీయుక్తములై, శ్రీఫలతుల్యములై యలరారు స్తనయుగ్మకము లత్యున్నతములు, సుకఠినములు, త్రైలోక్య చిత్తమోహనములు. ఆహా! ఏతపఃప్రభావమువలన తపోధనుఁ డైనగౌతము డీసుందరిని, అర్ధాంగిగ పొందగల్గెను. ప్రకృతిని, దుర్గను, విష్ణుమాయను, సనాతనిని, శ్రీమహాలక్ష్మిని సేవించి లక్ష్మీసమానురాలైనయీపద్మినిని యేతపముద్వారా పొందగల్గెను. ఆమె సుకోమల, సువదన, లలన, నలినానన, సుదతి, శ్యామల, శుద్ధురాలు".

ఇంద్రుఁ డహల్యను సమీపించి కామపీడితుఁడై యిట్లు కామప్రలాపములాడెను. "దేవీ! నేను సకలకామశాస్త్రవిశారదుఁడను, మహర్షియైనగౌతమునకు కామశాస్త్ర మేమి తెలియును? కామశాస్త్రవిదుషీమణులైన ఊర్వశి, రంభ మొదలగు నప్సరసఃకాంతలు సదా నాకామపాటవమును ప్రశంసించెదరు. కామినీ! నీవు నన్ననుగ్రహించిన శచీదేవినీ నీకు దాసిగ జేయగలను. నీకు అఖండ కామ సామ్రాజ్యమును ప్రసాదింపగలను". ఇట్లు కాముకుఁ డైన యింద్రుఁడు కామాలాపములు పల్కఁగ మహాసాధ్వి యైన యహల్య ఆశ్చర్య చకితయై వానికి తత్త్వమును ప్రబోధింప నొడంగెను, "నీవంటిపాప మనస్కుఁడైన పుత్రుని కల్గినందులకు బ్రహ్మ, మరీచి, కశ్యపప్రజాపతి అభాగ్యులైనారు.

ఇంద్రా ! సృష్టిని స్రష్ట విస్తరింపజేయుటకు కాముకులమనస్సు నాకర్షించుటకు స్త్రీరూపమును నిర్మించెను. స్త్రీసౌందర్యము సర్వమాయలకు గారణము, ధర్మమార్గమున కవరోధము, తపమునకు వ్యవధానము, సర్వాశ్రమములకు పరమమోహకారణము, కర్మబంధనములను కఠినముగ బంధింపగలబంధన మనిస్మృతి వచనము. స్త్రీకీటకసదృశు లైనదేహధారులకు దీపరూపము, మీనసదృశు లైనదేహధారులకు ఎఱవంటిది. స్త్రీ పరిణామమందు సకలదుఃఖములకు బీజము, నరకమునకు సోపానసదృశము, కావుననే మహాత్ము లైనసనకాదులు స్త్రీనాంగిత్యమును వాంఛింపక అఖండహరిపూజనమునందే సంలగ్ను లై యున్నారు. పరస్త్రీయందు మనస్సును లగ్న మొనరించినవారిసర్వతపములు ; ఆరాధన మొదలగునవి నిష్ఫలములు కాగలవు.

శ్లో॥ పరస్త్రీసేవనం శక్ర ఇహైవాత్యయశస్కరమ్ ।
పరత్ర నరకం ఘోరం దదాతి కాముకాయ చ ॥ 41

ఇంద్రా ! పరస్త్రీసేవనము దేహధారున కిహలోకమున అపయశస్సునకు గారణమై పరలోకమున ఘోరనరకమును ప్రసాదింపగలదు.''

ఇట్లు ఆమహాసాధ్వి యింద్రునకు ధర్మబోధయొనరించి స్వగృహమునకు మఱలిపోయెను. ఆమె జరిగినదంతయు తాపసి యైనగౌతమునకు విన్నవించగ, ఆయన పరిహసించినవాడై యింద్రునసేకవిధముల నిందించెను. ఒకదినమున గౌతమమహర్షి శంకరుని దర్శించుటకు గృహమును వీడి వెడలిపోగా, ఇంద్రుడు అదిగమనించి గౌతమరూపమును ధరించి ఆయనగృహమున ప్రవేశించి యహల్యాదేవిపాతివ్రత్యమును భంగమొనరించెను. సర్వజ్ఞుడైనగౌతముడు తనగృహమున ఘటిల్లుసంఘటన తెలిసికొని యాక్షణమే గృహము జేరి రక్తపంకజలోచనుడై యింద్రుని సహస్రభాగయుక్తుడగుగాక యనిశపించెను. భయముతో దుఃఖించుచున్న తనయర్ధాంగిని పాషాణరూపమై మహారణ్యమధ్యమున బడియుండు మనిశపించెను. ఇంద్రుడు లజ్జతో నతమస్తకుడై స్వధామమునకు వెడలిపోయెను. భర్తశాపమునకు అత్యంతదుఃఖితురాలై యహల్య "నాధా ! ఈమీదాసి దోషరహిత, ధర్మమును విచారించి నన్ను త్యజింపకు మనిగౌతమమహర్షిని ప్రార్థించెను. అందులకు గౌతముడు "దేవీ ! నీయంతః కరణము పరిశుద్ధ మనినాకు విదితమే. కాని పరపురుషునివలన పాతివ్రత్యభంగముపొందిన నీవు పరిశుద్ధురాలవు కావు; కావున మహారణ్యమున

నను జని పాషాణరూపిణివై పడియుండుము. శ్రీరామపదాంగుళిస్పర్శచే భవిష్యత్తులో మఱల పరమపవిత్రురాలవు కాగల వనిశాపవిమోచన మనుగ్రహించెను. నారదా! ఇట్లు నేను వివిధమహేంద్రులగర్వభంగప్రసంగములను వివరించితిని, నీవు మఱియే చరితములను శ్రవణ మొనరింపగోరెదవో తెల్పిన సవిస్తరముగ వర్ణింపగలను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ
మందలి శ్రీకృష్ణజన్మఖండములో
అ హ ల్యో పా ఖ్యా న మ ను
అఱువదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

---

## అఱువదిరెండవ అధ్యాయము

### -: శ్రీరామచరితవర్ణనము :-

నా ర దు డు ప లి కె ను :

మహాత్మా! దశరథనందను డైన శ్రీరామచంద్రుడు ఏయుగములో నెట్లు గౌతమపత్ని యగునహల్యను శాపవిముక్తురాలుగ నొనరించెను? మహాభాగా! నీవు రామావతార చరితమును సంక్షేపముగ వర్ణించి నన్ను ధన్యునిగ జేయుము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! త్రేతాయుగములో బ్రహ్మప్రార్థన ననుసరించి విష్ణుభగవానుడు కౌసల్యాదశరథులకు కుమారుడై సానందముగ నవనిపై ఆవిర్భవించెను. కైకేయికి రామసమాన గుణవంతు డైన భరతు డుదయించెను. సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులు జన్మించిరి. దశరథనందను లైన యానల్వురు మహాపురుషులు భాతృప్రేమ కత్యున్నతాదర్శమూర్తులు. తండ్రి యాజ్ఞను శిరసావహించి శ్రీరాముడు లక్ష్మణసహితుడై విశ్వామిత్రునితో వనములకు జని జన్నమును కాపాడెను. విశ్వామిత్రుడు సీతాకళ్యాణార్థమై శ్రీరామలక్ష్మణులతో మిథిలాపురికి బయలు దేరగా మార్గమధ్యమున శిలారూపిణి యైనస్త్రీని

గాంచి జగదీశ్వరు డైన శ్రీరాముడు మహర్షిని ఆశిలావృత్తాంతము నడిగెను. శ్రీరాముని ప్రశ్నను ఆలకించి ధర్మాత్ము డైన విశ్వామిత్రమహర్షి అహల్యో పాఖ్యానము నంతయు వర్ణింపగ కరుణాంతరంగుడు, అఖిలభువనపావను డైన శ్రీరాముడు తన చరణాంగుళిచే శిలను స్పృశించెను. భగవంతుని స్పర్శ పొందగనే అహల్య పరమపవిత్రురాలై సుందర నారీరూపముగ మారిపోయి శ్రీరాముని యనేక విధముల స్తుతించి స్వగృహమునకు వెడలి పోయెను. రామ స్పర్శచే పునీతురాలైన అహల్యను స్వీకరించి గౌతమమహర్షి శ్రీరాముని యనేక విధముల ఆశీర్వదించి బహుకాల మామెతో సుఖించెను.

అహల్యోద్ధరణ మొనరించిన పిమ్మట శ్రీరాముడు మిథిలకు చని శివధనుర్భంగ మొనరించి సీతాపాణిగ్రహణ మొనరించెను. కళ్యాణమంటపమునుండి శ్రీరాముడు పరశురాముని గర్వమును భంగ మొనరించి సానందముగ మంగళా చారపూర్వకముగ అయోధ్యాపురిని ప్రవేశించెను. దశరథుడు శ్రీరామునకు పట్టాభిషేక మొనర్పవలె నని సంకల్పించెను, దైవప్రేరితురాలై కైక దశరథుని రెండువరముల నర్థించెను. మొదటివరము భరతరాజ్యపట్టాభిషేకము, రెండవది రామవనవాసగమనము. దశరథుడు పుత్రప్రేమకు వశుడై శ్రీరాముని పినతల్లిక యావరములను ప్రసాదించుటకు నిరాకరించుట గాంచి ధర్మావతారు డైన శ్రీరామచంద్రుడు తండ్రిసత్యవ్రతము భంగము కాగల దని యెంచి తండ్రి నిట్లు సమాధానపఱిచెను.

శ్రీ రామ ఉవాచ :

శ్లో॥ తడాగశతదానేన యత్ పుణ్యం లభతే నరః ।
తతోఽధికం చ లభతే వాపీ దానేన నిశ్చితమ్ ॥ 16
దశవాపీ ప్రదానేన యత్ పుణ్యం లభతే నరః ।
తతోఽధికం చ లభతే పుణ్యం కన్యాప్రదానతః ॥ 17
దశకన్యాప్రదానేన యత్ పుణ్యం లభతే నరః ।
తతోఽధికం చ లభతే యజ్ఞైకేన నరాధిప ॥ 18
దశయజ్ఞేన యత్ పుణ్యం లభతే పుణ్యకృజ్జనః ।
తతోఽధికం చ లభతే పుత్రస్య దర్శనేన చ ॥ 19
దర్శనే శతపుత్రాణాం యత్ పుణ్యం లభతే నరః ।
తత్ పుణ్యం లభతే నూనం పుణ్యవాన్ సత్యపాలనాత్ ॥ 20

నరేశ్వరా! శత తడాగదానమువలన ఏపుణ్యము నరునకు లభించునో అంతకంటే అధికపుణ్యము ఒకవాపీదానమువలన నిశ్చయముగ లభించును. దశవాపీదానమువలన నేపుణ్యము నరునకు లభించునో అంతకంటే నధికపుణ్యము కన్యాదానములవలన లభించును. దశకన్యాదానములవలన ఏపుణ్యము నరునకు లభించునో, అంతకంటే నధికపుణ్యము ఒకయజ్ఞమువలన లభించును. దశయజ్ఞములవలన ఏపుణ్యము పుణ్యాత్ముడైన నరునకు లభించునో, అంతకంటే అధిక పుణ్యము సత్పాత్రదర్శనమాత్రమున లభించును. నూర్గురు సత్పాత్రులను దర్శించిన ఏపుణ్యము నరునకు లభించునో, అంతకంటే నధికపుణ్యము సత్యపాలనము వలన సులభముగ లభింపగలదు.

శ్లో॥ న హి సత్యాత్ పరో ధర్మో నానృతాత్ పాతకం పరమ్ ।
న హి గఙ్గాసమం తీర్థం న దేవః కేశవాత్ పరః ॥ 21
నాస్తి ధర్మాత్ పరో బన్ధుర్నాస్తి ధర్మాత్ పరం ధనమ్ ।
ధర్మాత్ ప్రియః పరః కో వా స్వధర్మం రక్షయత్నతః ॥ 22
స్వధర్మే రక్షితే తాత శశ్వత్ సర్వత్ర మఙ్గలమ్ ।
యశస్యం సుప్రతిష్ఠా చ ప్రతాపః పూజనం పరమ్ ॥ 23
చతుర్దశాబ్దం ధర్మేణ త్యక్త్వా గృహసుఖం భ్రమన్ ।
వనవాసం కరిష్యామి సత్యస్య పాలనాయ తే ॥ 24
కృత్వా సత్యం చ శపథమిచ్ఛయానిచ్ఛయాథవా ।
న కుర్యాత్పాలనం యో హి భస్మాన్తం తస్య సూతకమ్ ॥ 25
కుమ్భీపాకే స పచతి యావచ్చన్ద్రదివాకరౌ ।
తతో మూకో భవేత్ కుష్ఠీ మానివః స ప్తజన్మసు ॥ 26

తండ్రీ ! సత్యమును మించిన ధర్మము మఱియొకటిలేదు, అసత్యమును మించినపాతకము లేదు; గంగతో సమమైనతీర్థము రెండవదిలేదు; శ్రీ కేశవుని మించిన దేవుడు లేడు; ధర్మమును మించిన శ్రేష్ఠబంధువులు లేరు; ధర్మమును మించినధనము లేదు; ధర్మముకంటే నధికమైనది, ఉత్తమమైనది మఱియొకటి ఏదికలదు? కావున నీవు యత్నపూర్వకముగ స్వధర్మమును రక్షింపుము. స్వధర్మమును రక్షించిన సర్వత్ర శుభములు కల్గును. యశము, ప్రతిష్ఠ, ప్రతాపము, పరమాదరము ప్రాప్తించును. నేను పదునాల్గువర్షములు గృహసుఖమును పరిత్యజించి ధర్మపూర్వకముగ చరించుచు మీసత్యవ్రతమును రక్షించుటకు వనవాసమొనరించెదను. ఇచ్ఛచేతగాని అనిచ్ఛచేతగాని సత్యప్రతిజ్ఞ

యొనరించి ప్రతిజ్ఞాపాలన మొనరింపనివారు అశౌచమును పొందగలరు. అయ్యా శౌచము వారిశరీరము భస్మమగువఱకు వారితో నుండగలదు. అసత్యవాది సూర్యచంద్రు లున్నంతవఱకు కుంభీపాకనరక మనుభవింపగలడు. తదనంతరము అతడు మఱల మానవుడై జన్మించి యేడుజన్మలు మూగవాడై, కుష్ఠురోగ ముతో బాధ లనుభవింపగలడు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

ఇట్లు శ్రీరామచంద్రుడు తండ్రికి సత్యప్రబోధ మొనరించి ఆ క్షణ మందే జటావల్కలధారియై సీతాలక్ష్మణసహితుడై వనగమన మొనరించెను. శ్రీరామచంద్రుడు తండ్రిసత్యవ్రతమును రక్షించుటకు స్వయముగా వనవాసము స్వీకరించెను. మునీశ్వరా! అయోధ్యలో దశరథుడు పుత్రశోకమును భరింపలేక శరీరమును త్యజించెను. వనవాససమయమందు ఆశ్రమములో నివసించు చున్న నీలమేఘశ్యాముని విహారార్థమై అరణ్యమున కేతెంచిన రావణ సహోదరి దర్శించెను. ఆజగన్మోహనాకారుని గాంచగనే ఆరాక్షసస్త్రీ మనస్సున కామ మంకురింపగ నామెయంగము లన్నియు పులకించెను. శూర్ప ణఖ నిత్యయౌవనసంపన్న, అత్యంతప్రౌఢ, కామోన్మత్త. ఆమెమనస్సులో కామభావము నిండగా శ్రీరామునిదరి జేరి చిరునవ్వులు చిందించుచు "రామా! ఘనశ్యామా! రూపధామా! గుణసాగరా! నాహృదయము నీయందనురక్తమైనది శతకోటిమన్మథాకారా! ఏకాంతప్రదేశములో నన్ను స్వీకరించి నాజన్మనుతరింపజేయు" మనిప్రార్థించెను.

అందులకు రాముడు మాతా! నేను ఏకపత్నీవ్రతుడను, అదియునుగాక ప్రస్తుతము నాభార్యతో నున్నాను. నాసహోదరుడైనలక్ష్మణుడు తనభార్యకు దూరముగ నున్నాడు, కావున నీవు నీకోర్కెను లక్ష్మణునకు తెలియజేయుమని ప్రత్యుత్తర మొసంగెను. రామునివచనములను విని ఆకాముకి లక్ష్మణుని సమీపించి తనకోర్కెను వెల్లడింపగా అందులకు లక్ష్మణుడు "ఓ మూఢురాలా! భగవంతుడైన శ్రీరామచంద్రునియనుగ్రహము పొందక యేలయీదాసుని వాంఛించెదవు. నీవు నాపత్ని నైనసీతాసాధ్వికి దాసివై చరింపవలెను, ఎందు వల ననగ, నేను శ్రీరామదాసుడను; కావున సీతామాతకే యత్నపూర్వక ముగ సపత్నివికమ్ము. నేనే స్వయముగ నీకు పుత్రరూపమున సేవ లొనరించెద" నని పల్కెను. సహోదరు లిర్వురు తనను తృణీకరించుట గాంచి శూర్ప

కుపితయై "నరులారా! కామపీడితయై మిమ్ములను సమీపించినస్త్రీని త్యజించెదరా? కావున మీరిద్దరకు ఘోరవిపత్తు సంభవింపకలదు. మోహిని శాపమువలన బ్రహ్మ, రంభాశాపమువలన దక్షుడు, ఊర్వశిశాపమువలన అశ్వనీకుమారులు, మేనకశాపమువలన కుబేరుడు, ఘృతాచిశాపమువలన కామదేవుడు, మదాలసశాపమువలన బలి, మిశ్రకేశిశాపమువలన బృహస్పతి సతీవియోగము లనుభవించినట్లే, రామా! నాశాపమువలన నీభార్య నపహరింపబడగా నీవు భార్యావియోగదుఃఖము ననుభవించెదవుగాక" యనిశపించెను.

శూర్పణఖపల్కిన నిష్ఠురవాక్యములను విని లక్ష్మణుడు కోపించి యారాక్షసస్త్రీనాసికను, కర్ణములను వాడికత్తితో ఖండించివైచెను. ఆరక్కసి శోకించుచు తనయాప్తబంధువులైనఖరదూషణాదు లనుమహారాక్షసులను శరణువేడెను. వారిసంఖ్య పదునాల్గువేలు. ఆరక్కసు లందఱు అస్త్రశస్త్రసమన్వితులై రక్తపంకజలోచనులై శ్రీరామాశ్రమమును ముట్టడించిరి. జగదేకవీరు డైనశ్రీరామచంద్రమూర్తి అప్రతిహతములైన తనబాణములచే ససైన్యముగ ఖరదూషణాదులను త్రుటికాలములో సంహరించెను. ఈవిపరీతమును గాంచి శూర్పణఖ అత్యంతవిరక్తయై తనసహోదరు డైనరావణునకు జరిగినదంతయు సవిస్తరముగ విన్నవించి జటావల్కలధారిణియై పుష్కరతీర్థమున కేగి బ్రహ్మనుగూర్చి ఘోరతపమాచరించెను. శూర్పణఖ యొనరించిన ఘోరతపమునకు అత్యంతప్రసన్నుడై కృపాసింధు వైనబ్రహ్మ ఆమెయెదుట సాక్షాత్కరించి శూర్పణఖయంతరంగము తెలిసికొన్నవాడై యిట్లామె ననుగ్రహించెను. "వరాననా! సత్యసంధుడు, ఏకపత్నీవ్రతుడు, జగదాదర్శమూర్తియైనశ్రీరామచంద్రుడు నీకీజన్మలో దుర్లభుడు, నీయఖండతపమునకు ఫలస్వరూపమున మరుజన్మలో నీకు బ్రహ్మవిష్ణుశివాదులకు నీశ్వరుడైన ప్రకృతికతీతు డైనశ్రీకృష్ణపరమాత్మయొక్క దాస్యసౌభాగ్యము లభింపగలదు."

ఇట్లు శూర్పణఖ ననుగ్రహించి జగత్స్రష్ట యగుబ్రహ్మ యంతర్హితుడయ్యెను. పిమ్మట శూర్పణఖ తనశరీరము నగ్నిలో త్యజించి, రెండవజన్మమందు కుబ్జయై మధురానగరిలో జన్మించి శ్రీకృష్ణచంద్రుని తనివిదీర సేవించి జన్మరాహిత్యమునందెను. శూర్పణఖకు జరిగినయవమానము నెఱిగిన రాక్షసరా జైనరావణుడు కుతంత్రముచే రామలక్ష్మణులు ఆశ్రమముచెంత

లేనిసమయమున సీతాసాధ్విని అపహరించెను. సీతను ఆశ్రమమునందు గానక అపారదుఃఖసాగరమున మునిగి రాముడు పత్నీవియోగమును భరింపలేక మూర్ఛిల్లగా లక్ష్మణుడు ఆధ్యాత్మికజ్ఞానచర్చయొనరించి విచారగ్రస్తుడైన రాముని సమాధానపఱచెను. మునీశ్వరా! తదనంతరము రామలక్ష్మణు లిద్దరు జానకిని వెదకుచు శోకార్తులై వనములందు, గిరులందు, కోనలందు, నదీనదములందు, మహర్షులయాశ్రమములందు దిరుగసాగిరి.

దక్షిణదిశగ జనకరాజకుమారిని వెదకుచు, తుద కాసోదరులు పవనసూను డైనహనుమంతుని గలసికొని సుగ్రీవునితో మైత్రిసల్పి వానరేశ్వరు డైనవాలిని వధించి సుగ్రీవునకు వానరసామ్రాజ్యమును బ్రసాదించిరి. వానరరాజు సీతామాత నన్వేషించుట కసంఖ్యాకవానరులను దశదిశలకు బంపెను. శ్రీరాము డంజనీకుమారునకు ప్రేమపూర్వకముగ దుర్లభమైన తనపాదధూళి నొసంగి అన్వేషణసమయములో సీతకు ఆనవాలుగ శ్రీరామముద్రిక నొసంగి సీతాజీవనరక్షణ మైనతనసందేశమును వినిపించెను. రామభక్తు డైనహనుమంతుడు మహాకపులతో బరివేష్టితుడై జానకిని వెదకుచు దక్షిణసముద్రతీరము జేరెను. హనుమంతుడు రుద్రకళాసంభవుడు, వాయుపుత్రుడు. ఆమహావీరుడు శ్రీరామనామబలసంపన్నుడై వాయువేగమనోవేగములచే అగాధసాగరమును లంఘించి సీతను వెదకుచు లంకానగరమును ప్రవేశించి అశోకవనములో రామవిరహశోకముచే నత్యంతకృశ యైనసీతను గాంచెను. ఉపవాసము లొనరించి సీతామాత అమావాస్యనాటిచంద్రునివలె కృశించి రామనామమును జపించుచుండెను. ఆమెశిరోజములు జడలైనవి, అంగకాంతి ప్రతప్తసువర్ణమువలె ప్రకాశించుచుండెను. ఆమె యుత్తమవ్రత మొనరించు పరమపతివ్రత. ఆసాధ్వి భూశయన మొనరించుచు అహర్నిశములు శ్రీరామధ్యానమందే సంలగ్నురాలైయుండెను. అత్యంతశోభతో ప్రకాశించు సీతాసాధ్విని దర్శించి ఆమె శ్రీమహాలక్ష్మియే యనిపావని గ్రహించెను. జానకి అఖండపుణ్యప్రదాయిని, ఆమె దృష్టిమాత్రముననే అఖిలభువనములను పునీతమొనరింపగలదు. రామవియోగదుఃఖముచే రామనామమునే యాశ్రయించి దుఃఖించుచున్న సీతను గాంచి హనుమంతుడు రామముద్రిక నామె కర్పించి చరణముల పైబడి విలపించెను. పిమ్మట మారుతి సీతాజీవనమును రక్షించు శ్రీరామచంద్రునిసందేశము నామెకు విన్నవించెను. హనుమంతుడు సీతాసాధ్వికి ధైర్యమును

కలిగించుట కిట్లు పలికెను. "జననీ! సముద్రమున కావల శ్రీరామలక్ష్మణులు లంకను ముట్టడించుటకు సిద్ధముగనున్నారు. శ్రీరాముడు వాలిని వధించి మిత్రుడైన సుగ్రీవునకు సామ్రాజ్యమొసంగెను. సుగ్రీవుడు రామానుగ్రహము వలన తనభార్యను మఱల పొందినవాడై నిన్ను వెదకించెదనని అగ్నిసాక్షిగ ప్రతిజ్ఞపూనెను. సమస్త వానరసైన్యము పృథ్వినాలుగుచెరగులకు నిన్ను వెదకు టకు బయలుదేరినది. నావలన నీ శుభసమాచారమును పొంది కమలనయను డైన శ్రీరామచంద్రమూర్తి అగాధసాగరముపై సేతువును బంధించి లంకను జేరి పుత్రబంధుసహితముగ రావణుని వధించి నిన్నుద్ధరింపగలడు. జననీ! నేడు నీయనుగ్రహమునకు బాత్రుడనైననేను ఈస్వర్ణలంకను త్రుటిలో భస్మ మొనరించెదను. మందస్మితముఖారవిందవై నాపరాక్రమమును దర్శింపుము. తల్లీ! ఈలంకానగరము రామానుగ్రహబలసంపన్నుడనైననాకు తృణప్రా యము, సముద్రము మూత్రప్రాయము, అవని గోష్పాదప్రాయము, సైన్య సహితుడైనరావణుడు నాదృష్టిలో పిపీలకాసమానుడు. జననీ! నేను అర్ధ ముహూర్తకాలములోనే అనాయాసముగ ససైన్యముగ రావణుని వధింప గలను. కాని శ్రీరామప్రతిజ్ఞను మన్నించుటకు నేను రావణుని సంహరింప జాలను; జననీ! నీవు స్వస్థవై నిశ్చింతగనుండుము, భయమును వీడుము."

హనుమంతుని వాక్యములను విని సీతాసాధ్వి దుఃఖించుచు తనసంశ యము నిట్లుబహిర్గతమొనర్చెను. "వత్సా! నావియోగశోకముచె దుఃఖించు నాప్రాణనాథుడు, కౌసల్యానందనుడు కుశలమేనా? నాహృదయేశ్వరుడు యథావిధిగ నాహారమును స్వీకరించుచున్నాడా? నిజముగ సముద్రమున కావల నాకొఱకై నాహృదయేశ్వరుడున్నాడా? నాకొఱకు నిజముగ నాప్రభువు లంకను ముట్టడింపగలడా? నేను నాప్రాణేశ్వరునకు దుఃఖ ములనే ప్రసాదించితిని, ఈపాపాత్మురాలను నాస్వామి స్మరించుచున్నాడా? నానాథుడు నాకొఱ కెంతదుఃఖించుచున్నాడోకదా! క్షణమైనను నన్ను వీడి చరింపని స్వామి యీనాడు నాకు దూరమై విరహము ననుభవించుచున్నాడు గదా! హనుమా! ధర్మకర్మధురంధరుడు, ధర్మిష్ఠుడు, నితాంతశాంతగుణ సమన్వితుడు, కరుణాసాగరుడైన శ్రీరామచంద్రుని నేను మఱల దర్శింప గలనా? నేను మఱల నాప్రభువుచరణకమలములను సేవింపగలనా?

శ్లో॥ పతిసేవా విహీనా యా మూఢా సా జీవసం వృథా ॥ 85

పతిసేవనుండి వంచితురాలగు స్త్రీ జీవితము వ్యర్థము. నాయపహరణమువలన ధర్మపుత్రుడైన, విరహశోకసాగరమగ్నుడైన నాప్రాణనాథుని యభిమానము దెబ్బతిన్నది. వీరులందు శ్రేష్ఠుడు, ధర్మాత్ముడు, దైవసమానుడైన నాభర్త, నామరది యగులక్ష్మణుడు కుశలమేగదా? భ్రాతృసేవాధురంధరుడైన ఆమహాత్ముని నేను మఱల గాంచగలనో లేనో?"

మునీశ్వరా! సీతావచనములను విని పావని యామెను ధైర్యవచనములచే సమాధానపఱచి, యనుజ్ఞగైకొని, అనాయాసముగ లంకాదహన మొనరించెను. తదనంతరము హనుమంతుడు మఱల జానకిని దర్శించి యామెకు ధైర్యమును జెప్పి సముద్రమును లంఘించి కమలనయనుడైన శ్రీరామచంద్రుని జేరెను. హనుమంతుడు మిథిలాకుమారిశోకమయవృత్తాంతమంతయు రామునకు నివేదింపగా శ్రీరాముడు సీతను స్మరించి దుఃఖించెను. లక్ష్మణసహితముగ సకలవానరులు సీతకష్టముల కనేకవిధముల దుఃఖించిరి. నారదా! తదనంతరము సకలవానరసేనాసహితముగ లక్ష్మణునితో గలసి శ్రీరాముడు బయలుదేరి సముద్రముపై సేతువును నిర్మించి, సాగరమును దాటి లంకానగరమును ముట్టడించెను. దేవర్షీ! ఘోరయుద్ధములో పుత్రబాంధవసహితముగ రావణుని సంహరించి శుభముహూర్తమున సీతాసాధ్విని యుద్ధరించెను. తదనంతరము సత్యపరాయణయైనసీతను పుష్పకవిమానముపై గూర్చుండబెట్టుకొని శ్రీరాముడు లక్ష్మణవానరసహితుడై మనోవేగముతో నయోధ్యను జేరెను. శ్రీరామచంద్రుడఖిలపృథ్వికి సార్వభౌముడై ప్రజలను గన్నబిడ్డలవలె బరిపాలించెను. శ్రీరామరాజ్యములో సకలజీవులు ఆధివ్యాధిరహితులై సుఖించిరి. శ్రీరామచంద్రునకు కుశలవులను నిర్వురు ధర్మాత్ములైన పుత్రు లుదయించిరి. ఆయిర్వురుకుమారులు సూర్యవంశమును విస్తారమొనరించిరి. వత్సా! నారదా! ఇట్లు నేను సుఖప్రదము, మోక్షప్రదము, సకలసారతత్త్వము, భవసాగరమును దరింపజేయుటకు నౌకాసదృశము, మంగళమయము నగుశ్రీరామపవిత్రచరితమును సంక్షేపముగ వర్ణించితిని.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ మందలి
శ్రీకృష్ణజన్మఖండములో శ్రీరామ
చరిత వర్ణనమను అఱువదిరెండవ
అధ్యాయము సంపూర్ణము.

# అఱువది మూడవ అధ్యాయము

## -: కంసుని దుస్స్వప్న వర్ణనము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదా ! మథురలో కంసుడు నిశీథిసమయమున ననేకదుస్స్వప్నములను గాంచి యత్యంతభీతుడై చింతాసాగరమున నోలలాడుచు ఉద్విగ్నుడయ్యెను. అతడు ప్రాణభయముచే అన్నపానీయములను గూడ త్యజించి అహర్నిశములు శ్రీకృష్ణస్మరణమందే సంలగ్నుడైయుండెను. అత్యంతదుఃఖితుడై కంసనృపాలుడు సకలపుత్ర, మిత్ర, బంధు, పురోహితసహితముగ సభను దీర్చి సభాసదుల నుద్దేశించి యిట్లు తనకు గల్గిన దుస్స్వప్నములను వర్ణించెను.

కంసుడు పలికెను :

సభాసదులారా ! అర్ధరాత్రసమయమున మహాభయంకరములైన దుస్స్వప్నములను నేను గాంచితిని, ఆస్వప్నముల నన్నింటిని వర్ణించెద నవధరింపుడు. ఒకవృద్ధస్త్రీ మెట్టనిపుష్పమాలను ధరించి రక్తచందనము ననులేపనమొనరించుకొని రక్తవస్త్రధారిణియై అట్టహాసమొనరించుచు నల్లనిశరీరము కల్గి నానగరిలో నృత్యమాడెను. ఆమె కరవాలము ధరించి లోలజిహ్వాకలదియై యత్యంతభయంకరముగ నాకు గోచరించెను. అట్లే మఱియొక కృష్ణవర్ణస్త్రీ నల్లనివస్త్రముల ధరించి ఖండితనాసికయై, ముక్తకేశములు కలదియై నన్ను ఆలింగనముచేసికొనుటకు నుద్యుక్తురాలైనది. ఆమె విధవయైన మహాశూద్రివలె నున్నది. ఆమె మలినవస్త్రఖండములను, రూక్షకేశములను, చూర్ణతిలకమును ధరించియుండెను.

పురోహితా ! సత్యకా ! నాకపాలమును నేను గాంచితిని, నావక్షఃస్థలముపై నల్లనితాటిఫలములు ఛిన్నభిన్నములై శబ్దముచేయుచు బడినట్లు గాంచితిని. ఒకపతీపుత్రవతియైనదివ్యస్త్రీ అత్యంతరోషభరితయై నన్ను అనేకపర్యాయములు శపించి పూర్ణకుంభమును భగ్నమొనరించినది. ఒక ద్విజోత్తము డత్యంత కుపితుడై నన్ను శపించి, నాకు తాను ధరించినరత్నచందనచర్చితమాల నొసంగెను. నానగరిపై నొకక్షణములో నంగారవృష్టి, మఱియొకక్షణమున భస్మవృష్టి, తదుపరి రక్తవృష్టి కురిసెను. వానరములు, వాయసములు, శ్వానములు, భల్లూకములు, శూకరములు, వికటముగ భయంకరశబ్దము లొనరించినవి.

మండి మసివారిన శుష్కకాష్ఠములరాసిని గాంచితిని. అరుణోదయసమయమున నేను వానరములను, ఖండితనఖములను గాంచితిని. పీతాంబరధారిణియై, శ్వేతచందనాంగరాగయుక్తయు, మాలతీమాలాధారిణియు, రత్నమయాభూషణవిభూషితయు నగునొకసతి తనహస్తమందు క్రీడాకమలమును ధరించి, ఫాలదేశమును సిందూరబిందువులతో నలంకరించుకొని నాపై కోపించినదియై, నన్ను శపించి నాగృహమును వీడి వెడలిపోయెను. హస్తములందు పాశములను ధరించి, ముక్తకేశయుక్తులు అత్యంతభయంకరులు నగు పురుషులు నగరమును ప్రవేశింపగా నేను గాంచితిని. ముక్తకేశినులు, వికటరూపిణులైన దిగంబరస్త్రీలు నాగృహమునను నృత్యమొనరించినట్లు గాంచితిని. ఎఱ్ఱనివస్త్రములను ధరించిన యెఱ్ఱని కేశములు కల్గియున్న విచిత్రపురుషులనుగూడ గాంచితిని. బంధువులారా! ఒకముహూర్తముననే సూర్యచంద్రు లుదయింపగ గ్రహణగ్రస్తులైనట్లు గాంచితిని. పురోహితా! నేను స్వప్నములో నుల్కాపాతమును, ధూమకేతువును, భూకంపమును, రాష్ట్రవిప్లవమును, ఝంఝామారుతమును, మహోత్పాతములను గాంచితిని. భయంకరపురుషులు హస్తములందు నరకపాలములను ధరించి నాకు స్వప్నములో గోచరించిరి. గృహము లగ్నిజ్వాలలకు గుఱియై నశింపగా ప్రజలు హాహాకారము లొనర్చుచున్నట్లు గాంచితిని.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! ఇట్లు తనదుస్స్వప్నవృత్తాంత మంతయు సభాసదులకు వర్ణించి కంసనృపాలుడు మౌనము వహించెను. ఈవిచిత్రస్వప్నవృత్తాంతము నాలకించిన కంసునిబంధువులు తలలు వంచి నిట్టూర్పులు విడచిరి. న దేశమునకు సంభవింపబోవు వినాశము తెలిసికొన్నవాడై పురోహితు డైనసత్యకుడు మిక్కిలి చింతాక్రాంతుడయ్యెను. రాణివాసస్త్రీలు, తదితరబంధువులు శోకగ్రస్తులైరి. శీఘ్రకాలములోనే నిశ్చయముగ కంసునకు వినాశకాల మాసన్నమైనట్లు దని సర్వజనులు విశ్వసించిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో కంసుని దుస్స్వప్న
వర్ణనము అఱువదిమూడవ
అధ్యాయము సంపూర్ణము

---

# ఆఱువదినాలుగవ అధ్యాయము

## కంససత్యక సంవాదము

శ్రీ నారాయణ ఋషి పలికెను:

మునీశ్వరా! అఖండప్రజ్ఞాసంపన్ను డైనసత్యపురోహితుడు శుక్రాచార్యునిశిష్యుడు. అత డన్నివిషయములను విచారించి కంసునకు హితమొనరించుటకు సంకల్పించి యిట్లుపల్కెను. "మహాభాగా! కంసరాజేంద్రా! భయమును వీడుము, నే నుండగ నీకేలభయము? సర్వారిష్టములను వినాశమొనరింపగల మహేశ్వరయజ్ఞ మొనరింపుము. మహేశ్వరయజ్ఞమే ధనుర్యజ్ఞము. ఈయజ్ఞము దుస్స్వప్నవినాశకము, శత్రుభయనివారకము, అధ్యాత్మికాధి దైవికాదిభౌతికోత్పాతములను నాశముచేయునది, అఖండైశ్వర్యము నొసంగునది. ఈమహాయజ్ఞమును నిర్విఘ్నముగ సంపన్నమొనరించిన, సర్వసంపత్ప్రదాత యైనశంకరుడు దర్శనమొసంగి జరామరణములను నివారింపగల అమోఘ వరములను ప్రసాదించును. పూర్వకాలములో మహాబలవంతు డగుబాణాసురుడు, నంది, పరశురాముడు, బలవంతులందు శ్రేష్ఠు డైనజాంబవంతుడు ఈయజ్ఞము ననుష్ఠించి అజేయులైరి. మొదట శివు డీయజ్ఞమున కత్యంతసంతుష్టుడై యొకదివ్యధనువును నందీశ్వరున కొసంగెను. ధర్మాత్ము డైననందీశ్వరు డామహాధనువును బాణాసురున కొసంగెను. ధనుర్యజ్ఞ మొనరించి మహాసిద్ధుడైన బాణాసురుడు పుష్కరతీర్థములో నాశివధనువును పరశురామున కర్పించెను. కృపానిధి యైనపరశురాముడు నీపై గరుణకలవాడై దానిని నీ కొసంగెను. నరేశ్వరా! ఆధనువు మహాకఠోరము, మహావిశాలము, శంకరసంకల్పనిర్మితము. పశుపతి ధరించినపాశుపత మను నీధనువును కదిలించుట కనేకరథములను వినియోగింపవలెను. కంసరాజేంద్రా! శంకరునిప్రీత్యర్థమై యీమహాయజ్ఞమున శివధనువును పూజింపుము. సకలబంధువులను యజ్ఞమున కాహ్వానింపుము. యజ్ఞసమయమున ధనుర్భంగమైన నిశ్చయముగ యజ్ఞకర్తకు వినాశముసంభవించును. ధనువు భంగమైన యజ్ఞము అసంపూర్ణము కాగలదు. యజ్ఞమసంపూర్ణమైన నీకు యజ్ఞఫల మెట్లులభించును? కావున సదా శివ ధనువును రక్షింపుము.

రాజా! ఈధనువుమూలభాగమందు బ్రహ్మ, మధ్యభాగమందు స్వయముగ నారాయణుడు, అగ్రభాగమందు ఉగ్రప్రతాపశాలి యైనమహాదేవుడు

ప్రతిష్ఠితులైయుండెదరు. రత్నజటితమైన యీమహాధనువు తనదివ్యదీప్తిచే గ్రీష్మఋతుమధ్యాహ్నకాలప్రచండమార్తాండప్రభను మించి ప్రకాశించును. మహామతీ! అనంతుడైనను, సూర్యుడైనను, కార్తికేయుడైనను, ఈశివధనువును సంధింపలేరు; అయినచో అన్యజనులెంత? పూర్వకాలమందు త్రిపురారి యగు శివు డీధనువుద్వారా త్రిపురాసురులను వధించెను. కంసరాజేంద్రా! భయమును వీడి విజయార్థమై ధనుర్యాగమహోత్సవ మారంభింపుము."

సత్యకు డొనరించినహితవాక్యముల నాలకించి చంద్రవంశవృద్ధికరుడైనకంసుడు తన హితమును గోరుపురోహితు నుద్దేశించి యిట్లుపలికెను. "పురోహితా! నన్ను వధింపగలవీరకుమారుడు దేవకీవసుదేవులకు ఉదయించి నందగోకులములో నందనందనుడై స్వచ్ఛందముగ దినదినప్రవర్ధమాను డగుచున్నాడు. ఆబాలుడు మహాబలవంతుడు, వాడు నామంత్రిలను, శూరవీరులైనబంధువులను, నాసహోదరి యగుపూతనను సంహరించెను. అతడు తన యిచ్ఛానుసారముగ బలమును పెంచుకొనగలడు. ఆశ్యామసుందరుడు గోవర్ధన మహాపర్వతమును చిటికెనవ్రేలితో నెత్తగల్గెను, మహేంద్రుని పరాజితుని చేసెను, సృష్టికర్త యైనబ్రహ్మకు తనవిరాట్‌రూపమును జూపి స్వయముగ గోవులను, గోపబాలకులను సృష్టించెను. ఆబాలుడు సాక్షాత్తుగ అఖిలాండకోటిబ్రహ్మాండనాయకు డనిబుధజనులు కీర్తింపదొడంగిరి. పురోహితా! ఆబాలకుడె నామృత్యు వని మున్నె అశరీరవాణి నన్నాదేశించినది. కావున మహాబలసంపన్నుడైన బాలముకుందుని సంహరించుటకు నాకు సరియైన యుపాయ ముపదేశింపుడు. త్రిలోకములందా బాలకుడుదక్క అన్యులెవ్వరును నాకు శత్రువులులేరు. సర్వదేవతలు నే నన్న కంపింతురు. బ్రహ్మశివాదులు లఖండతపోనిమగ్నులు కావున తపమునందే సదా రమింతురు. సనాతనుడైన విష్ణువు సర్వాత్మకుడుగావున సర్వులపై సమానదృష్టికల్గియుండును. నేనే నందకుమారుని సంహరింపగల్గిన సకలభువనములకు సామ్రాట్టునయ్యెదను. త్రిలోకములను పాలింపగలను. కావున మీరు శీఘ్రముగ నందవ్రజనమునకు జని నందుని, నందనందను డైనశ్రీకృష్ణుని మహాబలసంపన్నుడైనబలరాముని ధనుర్యజ్ఞమున కాహ్వానించి తోడ్కొనిరండు.

కంసునివచనముల నాలకించి పురోహితు డైనసత్యకు డిట్లుసమయోచిత హితవచనములను పల్కెను. "మహాభాగా! నీవు నందవ్రజమునకు అక్రూరునిగాని, ఉద్ధవునిగాని లేదా వసుదేవునిగాని బంపుము," సత్యకునియీయాదేశము

నాలకించి కంసు డాసభలోనే రత్నసింహాసనాసీను డైయున్న తన బావ యగు వసుదేవు నుద్దేశించి యిట్లుపల్కెను. వసుదేవా! నీవు నీతిశాస్త్రపారంగతు డవు, ఉపాయచతురుడవు; కావున నీవే స్వయముగ నీపుత్రుని గృహమున కేగి వృషభానుని, నందుని, బలరాముని, నందనందను డైన శ్రీకృష్ణుని సమస్త గోకుల వాసులను ధనుర్యజ్ఞమున కాహ్వానింపుము. నామాత లప్పుడే సమస్త నరేశ్వరులను, మహర్షులను ఆహ్వానించుటకు దశదిశలకు బయలుదేరిరి''.

దేవర్షీ! కంసుని యాదేశము వినినవసుదేవుని యోష్ఠములు, తాలుక ములు, కంఠము శుష్కములైనవి. వ్యథితహృదయుడై కంసునితో వసుదేవు డిట్లుపల్కెను. ''రాజేంద్రా! ఈకార్యము కొఱకు నేను స్వయముగ నందవ్రజ మునకు జనుట యుచితము కాదు. నీయజ్ఞ మహోత్సవమునకు నందనందను డేతెంచినచో నవశ్యముగ ఆతడు నీతో యుద్ధమొనరింపగలడు. కావున కృష్ణుని పిలిపించి యీయజ్ఞవాటికలో యుద్ధమొనరింప జేయుట నాదృష్టిలో నీకు శ్రేయస్కరము కాదు. ఇందువలన నీకైనను, నాబిడ్డకైనను అపాయము సంభవించిన నేను భరింపలేను. శ్రీకృష్ణునివలన నీవు వధింపబడినచో తండ్రియే కుమారుని రావించి, రాజును పుత్రునిద్వారా సంహరించె నని ప్రజలు నన్ను నిందింతురు. మీయిర్వురి సంగ్రామమువలన మఱియెందరో మహావీరులు మరణింపగలరు''.

మునీశ్వరా! వసుదేవుడు పల్కిన వచనములను విని కంసు డత్యంత కుపితుడై రక్తపంకజలోచను డయ్యెను. అత డొరనుండి ఖడ్గమును దూసి వసుదేవుని సంహరించుట కుద్యుక్తుడు కాగా ఆసభయం దుపస్థితులైయున్న యుగ్రసేనాది మహామహులు కంసుని వారించిరి. వసుదేవుడు ఖిన్నవదనుడై ఆసనమును డిగ్గి సభను వదలి వెడలిపోయెను. కంసుడు దక్రూరుని శ్రీకృష్ణాదుల నాహ్వానించుటకు నందవ్రజమునకు వెళ్ళవలసినదిగ జెప్పి, ధనుర్యజ్ఞ కార్యము లందు సంలగ్నుడయ్యెను. కంసుని యాహ్వానములను పొంది సమస్తమహర్షులు. నరేశ్వరులు, దిక్పాలకులు, దేవతలు, ద్విజోత్తములు, మునులు, పులస్త్యుడు, భృగువు, ప్రచేతసుడు, జాబాలి, మార్కండేయాది మహర్షులు మొదలగువారు శిష్యపరివార సహితముగ మథురానగరిని జేరిరి. మే మిర్వురము (నరనారాయ ణులు) సోదరులముకూడ కంసు డొనరించు మహాయజ్ఞమున కఱుదెంచితిమి. జరాసంధుడు, దంతవక్త్రుడు, ద్రవిడ నరేశ్వరు డైన దాంభికుడు, శిశుపాలుడు,

భీష్మకుడు, భగదత్తుడు, ముద్గలుడు, ధృతరాష్ట్రుడు, ధూమకేశుడు, ధూమకేతువు, శంబరుడు, శల్యుడు, సత్రాజిత్తు, శంకువు మొదలగు నరేశ్వరులు కూడ నరుదెంచిరి. వీరేకాక భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడు, మహాబలి యగు నశ్వత్థామ, భూరిశ్రవ శాల్వ కైకేయ కౌశలాదులుకూడ దయచేసిరి. మహారాజైన కంసుడు అతిథుల నాహ్వానించి యథోచితముగ సంభాషించి యజ్ఞకార్యములందు సంలగ్నుడయ్యెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో కంస సత్యక సంవాద
మను అఱువది నాల్గవ అధ్యాయము
సంపూర్ణము

---

# అఱువదియైదవ అధ్యాయము

## -: అక్రూర హర్షోత్కర్ష వర్ణనము :-

నారాయణ ఋషి పలికెను :

నారదా! కంసుని యాదేశము విని ధర్మాత్ములయందు శ్రేష్ఠుడు, శాంతస్వరూపుడైన యక్రూరు డత్యంత ప్రసన్నాంతరంగుడై సంతోషముతో భక్తాగ్రగణ్యుడైనయుద్ధవునితో నిట్లుపలికెను. శ్రీకృష్ణ దర్శనోత్సాహ సంపన్నుడైన యక్రూరుడు శ్రీకృష్ణపరమాత్మ మహిమలనిట్లు వర్ణించెను.

అక్రూర ఉవాచ

శ్లో॥ సుప్రభాతాద్య రజనీ బభూవ మే శుభం దినమ్ ।
తుష్టాశ్చ గురవో విప్రా దేవా మామితి నిశ్చితమ్ ॥ 2

కోటిజన్మార్జితం పుణ్యం మమ స్వయముపస్థితమ్ ।
బభూవ మే సముత్పన్నం యద్ యత్కర్మ శుభాశుభమ్ ॥ 3

నిఛ్ఛేద బన్ధనిగడం మమ బద్ధస్య కర్మణా ।
కారాగారాచ్చ సంసారాన్ముక్తో యామి హరేః పదమ్ ॥ 4

సుహృదర్థీ కృతోఽహం చ కంసేన విదుషా రుషా ।
వరేణ తుల్యో దేవస్య క్రోధో మమ బభూవ హ ॥ 5

వ్రజరాజం సమాహర్తుం వ్రజం యాస్యామి సాంప్రతమ్ ।
ద్రక్ష్యామి పరమం పూజ్యం భుక్తిముక్తి ప్రదాయినమ్ ॥ 6

నవీన జలదశ్యామం నీలేన్దీవరలోచనమ్ ।
పీతవస్త్రసమాయుక్త కటి దేశవిరాజితమ్ ॥ 7

దూళిధూసరితాఙ్గం చ కిం వా చన్దనచర్చితమ్ ।
అథవా నవనీతాక్తమఙ్గం ద్రక్ష్యామి సస్మితమ్ ॥ 8

కిం వా వినోదమురలీం వాదయన్తం మనోహరమ్ ।
కిం వా గవాం సమూహం చ చారయన్త మితస్తతః ॥ 9

కిం వా వసన్తం గచ్ఛన్తం శయానం వా సునిశ్చితమ్ ।
విదేశం కీదృశం చాద్య సుదృష్ట్వా చ శుభే క్షణే ॥ 10

యత్పాదపద్మం ధ్యాయన్తే బ్రహ్మవిష్ణు శివాదయః ।
న హి జానాతి యస్యాన్త మనన్తోఽనన్త విగ్రహః ॥ 11

యత్ప్రభావం న జానన్తి దేవాః సన్తశ్చ సన్తతమ్ ।
యస్య స్తోత్రే జడీభూతా భీతా దేవీ సరస్వతీ ॥ 12

దాసీ నియుక్తా యద్దాస్యే మహాలక్ష్మీశ్చ లక్షితా ।
గఙ్గా యస్య పదామ్భోజాన్నిః సృతా సత్త్వరూపిణీ ॥ 13

జన్మమృత్యుజరావ్యాధిహరా త్రిభువనాత్ పరా ।
దర్శన స్పర్శనాభ్యాం చ నృణాం పాతకనాశినీ ॥ 14

ధ్యాయతే యత్పదామ్భోజం దుర్గా దుర్గతినాశినీ ।
త్రైలోక్యజననీ దేవీ మూలప్రకృతిరీశ్వరీ ॥ 15

లోమ్నాం కూపేషు విశ్వాని మహావిష్ణోశ్చ యస్య చ ।
అసంఖ్యాని విచిత్రాణి స్థూలాత్ స్థూలతరస్య చ ॥ 16

స చ యద్ షోడశాం శశ్చ యస్య సర్వేశ్వరస్య చ ।
తం ద్రష్టుం యామి హే బన్ధో మాయామానుషరూపిణమ్ ॥ 17

సర్వం సర్వాన్తరాత్మానం సర్వజ్ఞం ప్రకృతేః పరమ్ ।
బ్రహ్మజ్యోతిఃస్వరూపం చ భక్తానుగ్రహవిగ్రహమ్ ॥ 18

నిర్గుణం చ నిరీహం చ నిరానన్దం నిరాశ్రయమ్ ।
పరమం పరమానన్దం సానందం నన్దనన్దనమ్ ॥ 19

స్వేచ్ఛామయం సర్వపరం సర్వబీజం సనాతనమ్ ।
వదన్తి యోగినః శశ్వద్ ధ్యాయన్తేఽహర్నిశం శివమ్ ॥ 20

మన్వన్తరసహస్రం చ నిరాహారః కృశోదరః ।
పద్మే పాద్మస్తపస్తేపే పురా పాద్మే తు యత్కృతే ॥ 21

పునః కురు తపస్యాం చ తదా ద్రక్ష్యసి మామితి ।
సకృచ్ఛబ్దం చ శుశ్రావ న దదర్శ తథాఽపి తమ్ ॥ 22

తావత్కాలం పునస్తప్త్వా వరం ప్రాప్య దదర్శ తమ్ ।
ఈదృశం పరమేశం చ ద్రక్ష్యామ్యద్య తముద్ధవ ॥ 23

పురా శమ్భుస్తపస్తేపే యావద్వై బ్రహ్మణో వయః ।
జ్యోతిర్మణ్డలమధ్యే చ గోలోకే తం దదర్శ సః ॥ 24

సర్వతత్త్వం సర్వసిద్ధం మమ తత్త్వం పరం వరమ్ ।
సమ్ప్రాప తత్పదామ్భోజే భక్తిం చ నిర్మలాం పరామ్ ॥ 25

చకారాత్మసమం తం చ యో భక్తం భక్తవత్సలః ।
ఈదృశం పరమేశం చ ద్రక్ష్యామ్యద్య తముద్ధవ ॥ 26

సహస్రశక్రపాతాన్తం నిరాహారః కృశోదరః ।
యస్యానన్తస్తపస్తేపే భక్త్యా చ పరమాత్మనః ॥ 27

తదా చాత్మసమం జ్ఞానం దదౌ తస్మై య ఈశ్వరః ।
ఈదృశం పరమేశం చ ద్రక్ష్యామ్యద్య తముద్ధవ ॥ 28

సహస్రశక్రపాతాన్తం ధర్మస్తేపే చ యత్తపః ।
తదా బభూవ సాక్షీ స ధర్మిణాం సర్వకర్మణామ్ ॥ 29

శాస్తా చ ఫలదాతా చ యత్ప్రసాదాన్నృణామిహ ।
సర్వేశమీదృశమహో ద్రక్ష్యామ్యద్య తముద్ధవ ॥ 30

అష్టావింశతేరిన్ద్రాణాం పతనే యద్దివానిశమ్ ।
ఏవం క్రమేణ మాసాబ్దౌ శతాబ్దం బ్రహ్మణో వయః ॥ 31

అహో యస్య నిమేషేణ బ్రహ్మణః పతనం భవేత్ ।
ఈదృశం పరమాత్మానం ద్రక్ష్యామ్యద్య తముద్ధవ ॥ 32

నాస్తి భూరజసాం సంఖ్యా యథైవ బ్రహ్మణాం తథా ।
తథైవ బన్ధో విశ్వానాం తథాధారో మహావిరాట్ ॥ 33

విశ్వే విశ్వే చ ప్రత్యేకం మహావిష్ణుశివాదయః ।
మునయో మనవః సిద్ధా మానవాద్యాశ్చరాచరాః ॥ 34

యత్షోడశాంశః స విరాట్ సృష్టౌ నష్టశ్చ లీలయా ।
ఈదృశం సర్వశాస్తారం ద్రక్ష్యామ్యద్య తముద్ధవ ॥ 35

ఇత్యేవ ముక్త్వా వాఽక్రూరశ్చ పులకాఙ్కితవిగ్రహః ।
మూర్ఛాం ప్రాప సాశ్రునేత్రో దధ్యౌ తచ్చరణామ్బుజమ్ । 36

బభూవ భక్తిపూర్ణశ్చ స్మారం స్మారం పదామ్బుజమ్ ।
కృత్వా ప్రదక్షిణం వాపి కృష్ణస్య పరమాత్మన ॥ 37

ఉద్ధవశ్చ తమాశ్లిష్య ప్రశశంస పునః పునః ।
స చ శీఘ్రం యయౌ గేహమక్రూరోఽపి స్వమన్దిరే ॥ 38

అక్రూరుడు పలికెను :

ఉద్ధవా! నేడు రాత్రి గడచి ప్రభాతమైనది. ఈదినము నాకెంతో సుదినము. నిశ్చయముగ దేవతలు, బ్రాహ్మణులు, గురువులు నాకు సంతుష్టులైరి. కోట్లకొలదిజన్మలందు సముపార్జించిన పుణ్యమీనాడు నాకు ఫలమును ప్రసాదించుటకు సిద్ధమయ్యెను. నాశుభాశుభకర్మలన్నియు నాకు సుఖప్రదములైనవి. కర్మబంధనములచే బంధితుడైనయీయక్రూరుని బంధనము లీదినమున కర్మవలననే ఖండింపబడినవి. నే నీసంసారకారాగారమునుండి విముక్తుడనై శ్రీహరిధామమునకు వెడలుచున్నాను. విద్వాంసుడైన కంస రాజేంద్రుడు రోషమునకు వశుడై నన్ను మిత్రిర్థిగనొనరించెను. ఈనరేశ్వరుని క్రోధము నాకు వరతుల్యమైనది. ఇపుడు వ్రజరాజును తోడ్కొనివచ్చుటకు వ్రజమున కేగి నేను మోక్షప్రదాతయు, పరమపూజ్యుడు, పరమాత్మయు నగు శ్రీకృష్ణుని దర్శించెదను. ఆసచ్చిదానందవిగ్రహుడు నూతనజలధర సమానశ్యామలకాంతివర్ణుడు నీలకమలసదృశవిశాలనేత్రుడు, పీతాంబరధారి. ఆభగవంతుడు వ్రజధూళిధూసరితుడై యుండవచ్చును లేదా చందనచర్చితుడై యుండవచ్చును లేదా ఆయనయంగములందు నవనీతమునలందుకొని చిరునవ్వులు నవ్వుచుండవచ్చును. ఇట్టి దివ్యసుందరుని నేను కన్నులకరవుదీర దర్శించెదను. వినోదార్థము మురళీగానమొనరించుచు, ఇటునటుగోవులను గాయుచు

సుఖాసీనుడై యుండవచ్చును. చరించుచు లేదా నిద్రించుచు మనోహరుడైన యానందనందనుని నేను దర్శించెదను, ఇది పూర్ణముగ నిశ్చితము. శుభ సమయమందు నేడు భగవంతుని తనివిదీర దర్శించిననాకు ఏయనంతసుఖము లభించునో, ఆసుఖసమక్షమున రాజాదేశమహత్త్వమెంత? బ్రహ్మవిష్ణుశివాదు లెవనిచరణకమలములను నిరంతరము ధ్యానించుచుందురో, అనంతవిగ్రహుడైన యనంతుడుగూడ నెవనియంతము తెలిసికొనలేడో, దేవతలు, మహాత్ములుకూడ నెవని ప్రభావము తెలిసికొనలేరో, ఎవనిని స్తుతించుటలో సరస్వతీదేవియైనను భయభీతయై జడయగునో, ఎవనిసేవలకొఱకై శ్రీమహాలక్ష్మి కూడ దాసియైనదో, ఎవనిచరణకమలములనుండి త్రిలోకములం దుత్కృష్టయున జనమృత్యుజరావ్యాధిహారిణియు, దర్శనస్పర్శనాదులచే మనుష్యుల సమస్తపాపములను నశింపజేయగల సత్త్వస్వరూపిణి యగుగంగ ప్రాదుర్భవించెనో, త్రైలోక్యజనని మూలప్రకృతిరీశ్వరి దుర్గతినాశని యైనదుర్గాదేవి ఎవనిచరణకమలములను సదా ధ్యానించునో, స్థూలముకంటె స్థూలతముడైన మహావిష్ణువు రోమకూపములం దసంఖ్యాకవిచిత్రబ్రహ్మాండములున్నవి, ఆమహావిరాట్పురుషుడుకూడ ఏసర్వేశ్వరుని షోడశాంశస్వరూపుడో, ఆమాయామానుషరూపధారి యగుశ్రీకృష్ణుని దర్శించుటకు నేను వ్రజమునకు వెడలెదను. ఉద్ధవా! ఆయన నందనందనుడు, సర్వరూపుడు, సర్వాంతరాత్మ, సర్వజ్ఞుడు, ప్రకృతి కతీతుడు బ్రహ్మజ్యోతిస్స్వరూపుడు, భక్తులననుగ్రహించుటకే దివ్యసచ్చిదానంద విగ్రహమును ధరించినవాడు, నిర్గుణుడు, నిరీహుడు, నిరానందుడు, సానందుడు, నిరాశ్రయుడు, పరమానందస్వరూపుడు-ఆస్వేచ్ఛామయుడు సర్వాతీతుడై విరాజిల్లువాడు సనాతనబీజస్వరూపుడు నగు బాలముకుందుని యోగిజనులు అహర్నిశములు ధ్యానించుచుందురు.

మొదట పాద్మకల్పమందు బ్రహ్మ కమలాసనుడై యొకసహస్ర మన్వంతర పర్యంతము శ్రీకృష్ణ దర్శనార్థియై తపమాచరించెను. నిరాహారుడైన కారణమున బ్రహ్మ కృశోదరుడైనాడు. సహస్ర మన్వంతరములు పూర్ణమైన పిమ్మట మఱల తపమొనరించిన నన్ను గాంచగల వని ఆయన కాదేశము లభించెను. ఈయాదేశము నొక్క పర్యాయము శబ్దమాత్రముననే బ్రహ్మకు వినిపించెను. అఖండతప మొనరించినను బ్రహ్మ భగవంతుని ప్రత్యక్ష దర్శన సౌభాగ్యము పొందలేక పోయెను. మఱల బ్రహ్మ సహస్ర మన్వంతర కాలము

ఘోరతప మాచరించి తుదకు శ్రీహరి దివ్యదర్శన సౌభాగ్యమును వరములను బొంది ధన్యుడయ్యెను. ఉద్ధవా! అట్టి పరమేశ్వరుని యీదినమున నేను కన్నులారా గాంచి తరించెదను. పూర్వకాలము శంకరుడు బ్రహ్మ ఆయుఃపర్యంతము తప మాచరింపగా, జ్యోతిర్మండల మధ్యమున గోలోకములో శ్రీకృష్ణుడాయనకు దివ్యదర్శన మొసంగెను. ఆశ్రీకృష్ణుడు పరతత్త్వ స్వరూపుడు. సంసిద్ధి సంపన్నుడు. ఆయన సర్వులకు నాకు సర్వశ్రేష్ఠ పరమతత్త్వ స్వరూపుడు. శివుడు ఆయన చరణారవిందములందు పరమనిర్మల భక్తిని బొందెను. ఉద్ధవా! తనభక్తుడైన శివుని తనతో సమునిగ నొనరించిన ప్రభావశాలి యైన పరమేశ్వరుని నేడు నేను దర్శించెదను. వేయిమంది యింద్రులు పతనమగు నంతకాలము నిరాహారుడై కృశోదరుడై అనంతుడు ఆపరమాత్మ ప్రసన్నత కొఱకు భక్తి భావముతో తపమొనరించెను, అపుడు భగవంతు డనంతునకు తనతోసమాన మైన దివ్యజ్ఞానమును ప్రసాదించెను. ఉద్ధవా! ఆపరమేశ్వరుని నేడు నేను దర్శించెదను. సహస్రేంద్రుల కాలపర్యంతము ధర్మదేవత తపమాచరింపగా భగవంతుడు సర్వధర్మములకు, సర్వకర్మలకు ధర్మదేవునిసాక్షిగ, ఫలప్రదాతగ అనుగ్రహించెను. ఆసర్వేశ్వరునే నేడు దర్శించి తరించెదను.

ఇరువదియెనమండుగురు ఇంద్రులు పతనమైన బ్రహ్మ లోకపగలు, ఒక రాత్రి కాగలదు. ఈక్రమముననే ముప్పదినము లోకమాసమై పండ్రెండు మాసము లోకవర్షమై నూఱువర్షములు పరిపూర్ణమైన బ్రహ్మాయుర్దాయము పూర్తికాగలదు. ఆహా! అట్టిబ్రహ్మపతనము ఎవనియొకనిమేషకాలమందే సంభవించునో, ఆపరమాత్మను నేడు ప్రత్యక్షముగ దర్శించెదను. సోదరా! ఉద్ధవా! భూమియందున్న ధూళికణములను గణించుటయసంభవమైనట్లు బ్రహ్మాండములను, ఆబ్రహ్మాండములందున్న బ్రహ్మలను లెక్కించుట యసంభవము. అయ్యఖిలబ్రహ్మాండముల కాధారభూతుడైన మహావిరాట్పురుషుడు శ్రీకృష్ణునిషోడశాంశమాత్రుడే. ప్రత్యేకబ్రహ్మాండమందు బ్రహ్మవిష్ణు శివాదిదేవతలు, మునులు, మనువులు, సిద్ధులు, మానవులు ఆదిగాగల సకల చరాచరప్రాణులు నుందురు. అట్టి బ్రహ్మాండముల కాధారభూతుడైన మహా విరాట్పురుషుడెవనిషోడశాంశయో, ఎవనిలీలామాత్రముననె యావిర్భూతుడై తిరోభూతుడగునో, అట్టి సర్వశాసకుడైనపరమేశ్వరుని నేడు నేను దర్శింపబోవుచున్నాను.

ఇట్లు శ్రీకృష్ణపరమాత్మమహాత్మ్యమును వర్ణించి ప్రేమవిహ్వాలుడై యక్రూరుడు మూర్ఛిల్లెను. ఆయన అంగాంగము లన్నియు పులకింపగా నేత్రములనుండి యానందాశ్రువులు ప్రవహింపగా భగవచ్చరణారవింద ధ్యానమగ్నుడయ్యెను. అక్రూరునిహృదయము భక్తిచే నోతప్రోతమయ్యెను. ఆయన శ్రీకృష్ణునిచరణకమలస్మరణమగ్నుడై భగవంతుని దివ్యభావసంపన్నుడై ప్రదక్షిణముల నొనరింపదొడంగెను. ఉద్ధవుడు భగవత్ప్రేమవిహ్వాలుడైన యక్రూరుని హృదయమునకు హత్తుకొని యనేకవిధముల ప్రశంసించెను. తదనంతరము అక్రూరుడు సెలవుగైకొని తనగృహమునకు వెడలిపోయెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో అక్రూరహర్షోత్కర్ష వర్ణన
మను అఱువది యైదవ అధ్యాయము
సంపూర్ణము

---

## అఱువదియాఱవ అధ్యాయము

## -: రాధాస్వప్న వృత్తాంత వర్ణనము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా ! రాసేశ్వరీయుక్తుడై స్వయముగ రాసేశ్వరుడు రాసక్రీడల నొనరించి విశ్రమించెను. నిద్రావస్థలో రాధ యనేక దుఃస్వప్నములను గాంచి మేల్కొని శ్రీకృష్ణుని మేల్కొలిపితను గాంచిన స్వప్నముల నిట్లువర్ణింపసాగెను.

రాధిక పలికెను :-

దేవా ! నేను రత్నసింహాసనముపై రత్నమయఛత్రమును ధరించి ఆసీనురాలనైయుండగా రోషయుక్తుడైనయొకద్విజు డరుదెంచి నాఛత్రమును పరిగ్రహించి నన్ను మహాఘోరదుస్తరగంభీరసాగరములో బడవైచెను. శోకపీడితనైననేను ఆజలప్రవాహములో గొట్టుకొని పోవుచు దారితెన్ను గానక మహాతరంగములచే పీడితురాలనై "నాథా ! నన్ను రక్షింపుము, రక్షింపుము" అని నిన్ను ప్రార్థింపనొడంగితిని. నిన్ను గానక నేను మహాభయవిహ్వా

లనై రక్షింపవలసినదిగ సకలదేవతలను ప్రార్థించితిని. శ్రీకృష్ణసముద్రమందు మునుగుచున్నపుడు చంద్రమండలము వందలకొలదిముక్కలై ఆకాశమునుండి భూమిపై బడినట్లు గాంచితిని, రెండవక్షణములో సూర్యమండలముకూడ గగనమునుండి భూమిపై బడి నాల్గుముక్కలైనట్లు గాంచితిని. సూర్యచంద్ర గ్రహణములను వీక్షించితిని. నాయొడిలో నున్న అమృతకలశమునొక బ్రాహ్మణు డత్యంతరోషయుక్తుడై అటుదెంచి భగ్న మొనరించినట్లు స్వప్నములో గాంచితిని. దేవా! నాహస్తమునుండి క్రీడాకమలము పతనమై ముక్కలైనది. ఉత్తమరత్నసారముచే నిర్మితమైన దర్పణముకూడ నాహస్తమునుండి పతనమై భంగమైనట్లు గాంచితిని. నాగళమునం దలంకరింప బడియున్న రత్నసారనిర్మిత హారము, కమలము వక్షఃస్థలము నుండి జారి పృథ్విపైబడి భిన్నములైనవి. ఆకాశములో కృష్ణవర్ణయుక్తమైన విశాలచక్రము మహాభయంకరముగ భ్రమించుచున్నట్లు గాంచితిని.

నాప్రాణాధిష్ఠాత్రుదైవము నానుండి బయల్వెడలి 'రాధా' సెలవిమ్ము నేపోయివచ్చెద నని పల్కెను. ప్రాణవల్లభా! ఈ దుఃస్వప్నములను గాంచిన నాదక్షిణాంగము లదరుచున్నవి, మనస్సు ఆందోళితమగుచున్నది. నాథా! నీవు వేదవేత్తలం దత్యంత శ్రేష్ఠుడవు, కావున యీదుఃస్వప్నము లెందులకు సంభవించెనో తెలుపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో రాధా స్వప్నవృత్తాంత
వర్ణనమను అఱువదియాఱవ అధ్యాయము
సంపూర్ణము

---

# అఱువదియేడవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు రాధకు ఆధ్యాత్మిక జ్ఞానబోధ చేయుట :-

శ్రీ నారాయణ ఋషి పలికెను :

ఇట్లు తనస్వప్నవృత్తాంతములను విశదీకరించి శ్రీరాధాదేవి శోకముతో భయవిహ్వాలయై శ్రీకృష్ణుని చరణ కమలముల పైబడెను. ఉద్విగ్నురాలైన ఆమె కంఠము, ఓష్ఠములు, తాలుకము శుష్కములైనవి. కరుణాంతరంగుడైన శ్రీకృష్ణుడు రాధను లేవనెత్తి సమాధానపఱచినవాడై క్రీడాసరోవరము చెంతను దోడ్కొని వెడలి రత్ననిర్మిత పర్యంకముపై సుఖాసీనుడు కాగా, రాసేశ్వరునితో రాధ యిట్లుతన మనోభావములను బహిర్గతమొనర్చెను.

శ్రీ రాధిక పలికెను :

శ్యామసుందరా! నేను నీతో కలసియున్నంతవఱకు సత్యంత హర్షముతో వికసింతును, నీవు లేనిదే నేను మలినమై మరణించిన వంటిదానను కాగలను. ప్రాతఃకాలమందు సూర్యోదయమైన ఓషధులు ప్రకాశించునట్లు, చీకటి యందు దీపశిఖ ప్రకాశించునట్లు, నీవు నాతో నున్నపుడు నేను ప్రకాశించెదను. నీవు లేని నేను కృష్ణపక్షచంద్రునివలె దినదినము క్షీణించెదను. నీవక్షఃస్థలమున విరాజమానురాలనై యున్న నాదీప్తి పూర్ణచంద్రుని ప్రభవలె ప్రకాశించును. నీవు నన్ను వీడి వెడలిపోయిన నేను తత్కాలమునందే మరణింతును. నేను అమావాస్య చంద్రునికళవలె విలీన మయ్యెదను. ఆజ్యాహుతిచే అగ్నిశిఖ ప్రజ్వరిల్లునట్లే మీసాంగత్యముపొందిన నాదీప్తి ప్రజ్వరిల్లును. నీవు లేని నేను శిశిరఋతువునందు కమలమువలె నిర్వాణనై యుండెదను. నీవు నన్ను వీడి వెడలిపోయిన నేను చింతాజ్వరముచేత లేదా వృద్ధాప్యముచే కబళింపబడెదను. సూర్యచంద్రులస్తమించిన భూమియంతయు అంధకారముచే నావరింపబడునట్లే నీవు నాదృష్టిపథమునుండి తొలగిపోయిన నేను దుఃఖమగ్నురాల నయ్యెదను.

శ్లో॥ త్వమేవాత్మా చ సర్వేషా మమ నాథో విశేషతః ।
తనుర్యథాత్మనా త్యక్త్వా తథాహం చ త్వయా వినా ॥ 13

నీవు సర్వాత్మవు; విశేషముగ నాప్రాణనాథుడవు. జీవాత్మ త్యజించిన శరీరము శవమగునట్లు నీవు లేనిదే నేను మరణింతును.

నీవు నాపంచప్రాణములు; నేత్రగోళములు నల్లగ్రుడ్డులేనిదే దర్శింపలేనట్లు నీవు లేని నేను అంధురాలను కాగలను. చిత్తయుక్తస్థానము శోభించు నట్లే

నీతోనున్న నాశోభ వృద్ధినొందగలదు. నీవు లేని నేను అలంకార రహితనై శుభ్ర మొనరింపని భూమివలె శోభాహీనురాల నైయుందును. శ్రీకృష్ణా! నీతోనున్న నేను చిత్రయుక్త మృణ్మయప్రతిమవలె శోభించెదను. నీవు లేనిచో జలములచే కడిగిన మట్టిబొమ్మవలె కురూపినై గోచరించెదను. నీవు రాసేశ్వరుడవు; సువర్ణమాల శ్వేతమణిసంయోగముపొంది అధికముగ శోభిల్లునట్లు, గోపాంగనలకు నీవలనే శోభసమకూరును. వ్రజరాజా! ఆకాశమున చంద్రునితో తారకలు శోభిల్లునట్లు నీతో రాజులు శోభిల్లుదురు. నందనందనా! శాఖలతో, ఫలములతో, పల్లవములతో, వృక్షావళులు శోభిల్లు నట్లు నీతో నంద యశోదలు శోభిల్లగలరు. గోకులేశ్వరా! సమస్తలోకము రాజేంద్రులచే శోభితములగునట్లు సమస్తగోకులవాసులు నీతో యున్ననె శోభిల్లుదురు. రాసేశ్వరా! స్వర్గలోకమున దేవరాజైనయింద్రునిచే నమరావతి శోభిల్లు నట్లు రాసమండలము కూడ నీవలన మనోహరశోభను బొందును. మహాబల పరాక్రమ సంపన్న మైన సింహము వనములకు శోభయై, స్వామియై, ఆశ్రయమై చరించునట్లు నీవు బృందావనములందు గల వృక్షములకు శోభవు, సంరక్షకుడవు, ఆశ్రయదాతవు. గోమాత తనవత్సమును పొందనియెడల వ్యాకులయై భయభీతురాలగు నట్లు నీవు లేనిచో యశోద శోకసాగర మగ్నురాలు కాగలదు. శ్రీకృష్ణా! తప్తమగు పాత్రలో ధాన్యరాశి దగ్ధమగునట్లు నీవు లేనిచో నందుని హృదయము దగ్ధమగును ప్రాణము లాందోళితములు కాగలవు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

ఇట్లు తమకు గలప్రేమను శ్రీకృష్ణునకు జెప్పి అత్యంత ప్రేమవిహ్వలయై రాధ శ్రీహరిచరణముల పైబడెను. అయ్యపార ప్రేమసాగరుడు వ్రజేశ్వరియైన రాధను లేవనెత్తి హృదయమునకు హత్తుకొనినవాడై అత్యంత ప్రేమతో ఆధ్యాత్మిక జ్ఞానము నుపదేశించి వ్యథిత హృదయ మైయున్న యామెను సమాధానపఱచెను.

శ్లో॥ ఆధ్యాత్మికో మహాయోగో మోహసంచ్ఛేదకారణమ్ ।
యథా పరశువృక్షాణాం తీక్ష్ణధారశ్చ నారద ॥ 26

నారదా పదునైన పరశువు వృక్షములను ఖండించుటకు హేతువగు నట్లు ఆధ్యాత్మిక మహాయోగము మోహవిచ్ఛేద కారణ మనబడెను.

నా ర దు డు ప లి కె ను :

వేదవేత్తలందు శ్రేష్ఠుడవగు దేవా! లోకములశోకములను ఖండింపగల రాధా దేవికి శ్రీకృష్ణుడు చెప్పిన అయ్యాధ్యాత్మిక మహాయోగ ముపదేశ మొనరించి నన్ను తరింపజేయుడు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :-

దేవర్షీ ! ఆధ్యాత్మికమహాయోగమును యోగులైనను తెలిసికొనలేరు. ఈ యాధ్యాత్మికయోగ మనేకప్రకారములు. ఈ మహాయోగమును పరిపూర్ణ ముగ దెలిసినయోగయోగేశ్వరుడు శ్రీకృష్ణపరమాత్మయే. రమణీయ మైన క్రీడాసరోవరతటముపై కృపానిధి యగుశ్రీకృష్ణుడు శోకాకులయైనశ్రీరాధ కుపదేశించినయాధ్యాత్మికమహాయోగమును వర్ణించెద సావధానుడవైయాకర్ణిం పుము.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :-

ప్రియా ! నీకు పూర్వజన్మవిషయములు స్మరణమునం దున్నవా? నిన్ను నీవు తెలిసికొనుము. గోలోకమునందు ఘటిల్లినవృత్తాంతము, సుదాముని శాపమును ఏలమరచినావు? ఆశాపకారణమున కొంతకాలమువఱకు నీకు, నాకు వియోగము సంభవింపగలదు. శాపావధిసమాప్తమైనపిమ్మట మఱల మన మిర్వురము ఏకముకాగలము. తదనంతరము నేను గోలోకవాసులైనగోపగోపిక లతో గోలోకపరంధామము చేరెదను. నీకు ఆధ్యాత్మికజ్ఞానము నుపదేశించెద నవధరింపుము. ఈ సర్వసారభూతజ్ఞానము శోకనాశకము, ఆనందవర్ధకము మనస్సున కత్యంతసుఖప్రదము.

శ్లో॥ అహం సర్వాన్తరాత్మా చ నిర్లిప్తః సర్వకర్మసు ।
విద్యమానశ్చ సర్వేషు సర్వత్రాదృష్ట ఏవ చ ॥ 44

వాయుశ్చరతి సర్వత్ర యథైవ సర్వవస్తుషు ।
న చ లిప్తస్తథైవాహం సాక్షీ చ సర్వకర్మణామ్ ॥ 45

జీవో మత్ప్రతిబిమ్బశ్చ సర్వః సర్వత్ర జీవిషు ।
భోక్తా శుభాశుభానాం చ కర్తా చ కర్మణాం సదా ॥ 46

నేను సర్వాంతరాత్మనైనను సమస్తకర్మలయందు నిర్లిప్తుడను. సర్వు లందు సర్వత్రయుండియు ఎప్పుడు నెవ్వరికిని గోచరింపను. వాయువు సర్వత్ర సర్వ వస్తువులందు భ్రమించినను దేనియందు లిప్తముకానట్లు నేను సమస్తకర్మలకు

సాక్షినై విరాజిల్లెదను, కాని యాకర్మలు న న్నంటవు. సర్వదేహధారుల యందు గలజీవాత్మ లందఱు నాప్రతిబింబములె. జీవాత్మయే సర్మకర్మలకు కర్త, ఆకర్మలశుభాశుభఫలములకు భోక్త.

యథా జలఘటేష్వేవ మణ్డలం చన్ద్రసూర్యయోః ।
భగ్నేషు తేషు సంశ్లిష్టస్తయోరేవ దథా మయి ॥ 47

జలభరిత మగుమృణ్మయపాత్రలలో సూర్యచంద్రులనేకులుగ ప్రతిబింబించుచుందురు కాని యాపాత్రలు భగ్నమైనచో యాప్రతిబింబము లన్నియు సూర్యచంద్రులందు విలీనములగును; అట్లే యంతఃకరణరూపోపాధి (దేహము) నశించిన చిత్ ప్రతిబింబములైనజీవులు నాయందే విలీనము కాగలరు.

శ్లో॥ జీవశ్లిష్టస్తథా కాలే మృతేషు జీవిషు ప్రియే ।
అహం చ విద్యమానౌ చ సతతం సర్వజన్తుషు ॥ 48
ఆధారశ్చాహమాధేయం కార్యం చ కారణం వినా ।
అయే పర్వాణి ద్రవ్యాణి నశ్వరాణి చ సున్దరీ ॥ 49

ప్రియా! సమయానుసారముగ సమస్తదేహధారులకు మరణము సంభవించిన వారు నాయందే లీనులయ్యెదరు. మన మిర్వుర (శ్రీరాధాకృష్ణులు లేదా పురుషుడు ప్రకృతి) మెల్లపుడు సమస్త జంతువులయందు (జీవులయందు) ఉందుము. సర్వజగత్తులు ఆధేయములు. నేనే సర్వజగత్తులకు నాధారము. కారణము లేనిదె కార్యము సంభవింప నట్లు ఆధారములేనిదె ఆధేయము నివసింప జాలదు. సుందరీ! సంసారమందు గల సర్వద్రవ్యములు నశ్వరము లని గ్రహింపుము.

శ్లో॥ ఆవిర్భావాదికాః కుత్ర కుత్ర చిన్యూన మేవచ ।
మహాంశాః కేఽపి దేవాశ్చ కేచిద్దేవాః కలాస్తథా ॥ 50
కేచిత్కలాః కలాంశాంశాస్తదంశాంశాశ్చ కేచన ।
మదంశాః ప్రకృతిః సూక్ష్మా పా చ మూర్త్యా చ పంచధా ॥ 51

అక్కడక్కడ పదార్థము లధికముగ సంభవించును, కొన్నిచోట్ల న్యూనముగ సంభవించును. కొందఱు దేవతలు నాయంశలు, కొందఱు కళలు, మఱికొందఱు కళాకళల యంశలు, కొందఱు ఆయంశల యంశాంశలు. నాపరిపూర్ణాంశ స్వరూపిణియైన ప్రకృతి సూక్ష్మరూపిణి. ఆమె కైదుమూర్తులు (మూలమూర్తులు) కలవు.

శ్లో॥ సరస్వతి చ కమలా దుర్గా త్వం చ పి వేదసూః ।
సర్వేదేవాః ప్రాకృతికా యావన్తో మూర్తిధారిణః ॥ 52
అహమాత్మా నిత్యదేహీ భక్తధ్యానానురోధతః ।
యే యే ప్రాకృతికా రాధే తే నష్టాః ప్రాకృతే లయే ॥ 53
అహమేవాసమేవాగ్రే పశ్చాదప్యహమేవ చ ।
యథాహం చ తథా త్వం చ యథా ధావల్యదుగ్ధయోః ॥ 54
భేదః కదాపి న భవేన్నిశ్చితం చ తథావయోః ।

ఆమూర్తులైన సరస్వతి, లక్ష్మి, దుర్గ, నీవు (రాధ) వేదజనని యగు సావిత్రి. మూర్తిధారులైనదేవత లందఱు పాౢకృతికులు. నేను సర్వుల కాత్మను, భక్తులు ధ్యానించుటకొఱకు నిత్యము సచ్చిదానందవిగ్రహుండనై యున్నాను. రాధా! పాౢకృతికదేహధారులై యున్నవా రందఱు పాౢకృతిక ప్రళయమందు నశింతురు. సర్వమున కాది నేనే, సర్వమునకు అంతము నేనే (అనగా సర్వమునకు మొదట నేనే యున్నాను, అంతమున నేనే యుండగలను.) నేనెట్లో నీవును అట్లే. క్షీరములకు, వానిధవళత్వమునకు భేదములేనట్లు నిశ్చయముగ మనయిర్వురియందు భేదము లేదు.

శ్లో॥ అహం మహాన్విరాట్ సృష్టౌ విశ్వాని యస్య లోమసు । 55
అంశస్త్వం తత్ర మహతి స్వాంశేన తస్య కామినీ ॥
అహం క్షుద్రవిరాట్ సృష్టౌ విశ్వం యన్నాభిపద్మతః ॥ 56
ఆయం విష్ణోర్లోమకూపే వాసో మే చాంశతః సతి ।
తస్య స్త్రీ త్వం చ బృహతి స్వాంశేన సుభగా తథా ॥ 57

ఎవని రోమకూపములయం దసంఖ్యాకబ్రహ్మాండము లున్నవో, సృష్టి పాౢరంభమున ఆమహావిరాట్పురుషుడను నేనే. ఆమహావిరాట్పురుషుడు నాయంశజుడు, నీవు నీయంశచే ఆయనకు బత్నివైతివి. తదనంతరము సృష్టిలో నెవనినాభికమలములనుండి యీబ్రహ్మాండములు పాౢదుర్భవించినవో; ఆక్షుద్ర విరాట్పురుషుడను నేనే. విష్ణురోమకూపములందు నాయంశలు నివసించుచున్నవి. నీవే నీయంశచే ఆవిష్ణువునకు సుందరస్త్రీ వైతివి.

శ్లో॥ తస్య విశ్వే చ ప్రత్యేకం బ్రహ్మవిష్ణుశివాదయః ।
బ్రహ్మవిష్ణుశివాఅంశాశ్చాన్యే చాపి చ మత్కలాః ॥ 58

శ్లో॥ మత్కలాంశాంశ కలయా సర్వే దేవి చరాచరాః ।
వైకుణ్ఠే త్వం మహాలక్ష్మీ రహం తత్ర చతుర్భుజః ॥ 59

స చ విశ్వాద్బహిశ్చోర్ధ్వం యథా గోలోక ఏవ చ ।
సరస్వతీ త్వం సత్యే చ సావిత్రీ బ్రహ్మణః ప్రియా ॥ 60

శివలోకే శివా త్వం చ మూలప్రకృతిరీశ్వరీ ।
వినాశ్య దుర్గం దుర్గాచ్చ సర్వదుర్గతినాశినీ ॥ 61

సా ఏవ దక్షకన్యా చ సా ఏవ శైలకన్యకా ।
కైలాసే పార్వతీ తేన సౌభాగ్యా శివవక్షసి ॥ 62

స్వాంశేన త్వం సిన్ధుకన్యా క్షీరోదే విష్ణువక్షసి ।
అహం స్వాంశేన సృష్టా చ బ్రహ్మవిష్ణుమహేశ్వరాః ॥ 63

త్వం చ లక్ష్మీః శివా ధాత్రీ సావిత్రీ చ పృథక్ పృథక్ ।
గోలోకే చ స్వయం రాధా రాసే రాసేశ్వరీ సదా ॥ 64

బృన్దా బృన్దావనే రమ్యే విరజా విరజాతటే ।
సా త్వం సుదామశాపేన భారతం పుణ్యమాగతా ॥ 65

పూతం కర్తుం భారతం చ బృన్దారణ్యం చ సున్దరి ।
త్వత్కలాం స్వాంశకలయా విశ్వేషు సర్వయోషితః ॥ 66

యా యోషిత్సా చ భవతి యః పుమాన్ సోఽహమేవ చ ।
అహం చ కలయా వహ్నిస్త్వం స్వాహా దాహికా ప్రియా ॥ 67

ఆమహావిరాట్పురుషుని యొక్కొక్క విశ్వమందు బ్రహ్మవిష్ణుశివాది దేవతలు విద్యమానులైయున్నారు. ఆబ్రహ్మవిష్ణుశివాదులు అన్యబ్రహ్మాండములం దున్న వివిధ బ్రహ్మాదిదేవత లందఱు నాకళలే, దేవీ! సర్వచరాచర ప్రాణులు నాకళాంశాంశకళలచే ప్రకటితులైరి. నీవే వైకుంఠములో మహాలక్ష్మివి, నేనే చతుర్భుజ నారాయణుడను. గోలోకము విశ్వబ్రహ్మాండముల కావలయున్నట్లు వైకుంఠము కూడ అవల నున్నది. సత్యలోకమందు నీవే సరస్వతివి, బ్రహ్మప్రియ యైన సావిత్రివి, శివలోకమందు మూలప్రకృతికీశ్వరి యైన శివకూడ నీకంటె భిన్నురాలు కాదు. ఆమె దుర్గమసంకటములను నాశ మొనరించును కావున సర్వదుర్గనాశని యగుదుర్గ యని కీర్తింపబడెను. ఆమె దక్షకన్య యైన సతి ఆమెయె. గిరిరాజకుమారి యగు పార్వతి. కైలాసములో సౌభాగ్యశాలిని యైన పార్వతి శివవక్షఃస్థలమందు విరాజిల్లు చుండును. నీవు

స్వాంశచే సింధుకన్యవై క్షీరసాగరములో శ్రీవిష్ణువక్షఃస్థలములో విరాజిల్లు చున్నావు. సృష్టికాలములో నేనే నాయంశలచే బ్రహ్మవిష్ణుశివరూపములను ధరింతును, నీవు లక్ష్మి, శివ, ధాత్రి, సావిత్రి మున్నగు వివిధ రూపములను ధరించెదవు. గోలోకరాసమండలములో సదా నీవే రాసేశ్వరీ పదముపై ప్రతిష్ఠితురాలవై యుందువు. రమణీయ బృందావనములో బృందవై విరజాతటముపై విరజారూపమున నీవే శోభింతువు.

నీవే యాసమయమున సుదాముని శాపవశమున పుణ్యభూమి యైనభారత వర్షములో నవతరించినవి. సుందరీ! భారతవర్షమును బృందావనమును బవిత్ర మొనరించుటే నీరాకలోని యుద్దేశ్యము. సర్వలోకములందున్న స్త్రీలందఱు నీకళాంశకళలచే ప్రాదుర్భవించిరి. స్త్రీలైన వారందఱు నీవే, పురుషులైన వారందఱు నేనే, నేనే నాకళచే అగ్నిరూపమున ప్రాదుర్భవించితిని నీవు అగ్నికి దాహకశక్తియు ప్రియపత్నియైన స్వాహా దేవివైతివి.

శ్లో॥ త్వయా సహ సమర్థోఽహం నాలం దగ్ధుం చ త్వాం వినా
అహం దీప్తిమతాం సూర్యః కలయా త్వం ప్రభాకరీ ॥ 68

సంజ్ఞా త్వం చ త్వయా భామి త్వాం వినాఽహం న దీప్తిమాన్ ।
అహం చ కలయా చన్ద్ర స్త్వం చ శోభా చ రోహిణీ ॥ 69

మనోహర స్త్వయా సార్ధం త్వాం వినా చ సున్దరః ।
అహమిన్ద్రశ్చ కలయా స్వర్గలక్ష్మీశ్చ త్వం శచీ ॥ 70

త్వయా సార్ధం దేవరాజో హతశ్రీశ్చ త్వయా వినా ।
అహం ధర్మశ్చ కలయా త్వం చ మూర్తిశ్చ ధర్మిణీ ॥ 71

నాహం శక్తో ధర్మకృత్యే త్వాం చ ధర్మక్రియాం వినా ।
అహం యజ్ఞశ్చ కలయా త్వం స్వాహాంశేన దక్షిణా ॥ 72

త్వయా సార్ధం చ ఫలదోఽవ్యసమర్థ స్త్వయా వినా ।
కలయా పితృలోకోఽహం స్వాంశేన త్వం స్వధా సతీ ॥ 73

నీతో గలసియున్న నేను జ్వలించుటలో సమర్థుడను, నీవు లేని నేను అసమర్థుడను, నేను దీప్తిమంతుడనైన సూర్యుడను, నీవు సర్వకళలచే సంజ్ఞవై సూర్యప్రభను విస్తరింపజేయుచున్నావు. నీసహయోగము వలననే నేను ప్రకాశితుడనైతిని. నీవు లేని నేను దీప్తిమంతుడను కాలేను. నేను నాకళచే చంద్రుడ నైతిని, నీవు చంద్రశోభ యైన రోహిణివైతివి. నీతో నివసించియే నేను మనోహరుడనైతిని; నీవు లేనిదే నాయందు సౌందర్యములేదు.

నేను నాకళచే నింద్రుడనైతిని, నీవు స్వర్గలక్ష్మి యైన శచివైతివి. నీవు నాతోనున్ననేను దేవతలకు రాజైనయింద్రుడను, నీవు లేనినేను శ్రీహీను నయ్యెదను. నేను నాకళచే ధర్మమైతిని, నీవు ధర్మపత్ని వైన మూర్తివైతివి. ధర్మక్రియారూపిణి వైన నీవు నాతోసహకరించినచో నేను ధర్మక్రియల సంపాదనమందు దసమర్థుడ నయ్యెదను. నేను నాకళచేయజ్ఞ రూపుడనైతిని. నీవు నీకళాంశచే దక్షిణవైతివి. నీతోనున్న నేను యజ్ఞఫలదాత నయ్యెదను; నీవు నాతో లేనిచో నేను ఫలములను ప్రసాదించుటకు సమర్థుడను కాను. నేను నాకళచే పితృలోకమైతిని; నీవు నీకళచే స్వధవైతివి.

శ్లో॥ త్వయాలం కవ్యదానే చ సదా నాలం త్వయా వినా ।
అహం పుమాంస్త్వం ప్రకృతిర్నస్రష్టాహం త్వయా వినా ॥ 74

త్వం చ సమ్పత్స్వరూపాహమీశ్వరశ్చ త్వయా సహ ।
లక్ష్మీయుక్తస్త్వయా లక్ష్మ్యా నిఃశ్రీకశ్చ త్వయా వినా ॥ 75

నీసహచర్యమువలనే నేను కవ్య (శ్రాద్ధ) దానమందు సమర్థుడనైతిని. నీవు లేనిదే నేను సమర్థుడను కాలేదు. శ్రీమహాలక్ష్మి వైన నీవు నాతో నున్నంతవఱకే నేను లక్ష్మీయుక్తుడను, నీవు లేనిదే నేను శ్రీహీనుడను. నేను పురుషుడను నీవుప్రకృతివి; నీవు లేనిదే నేను సృష్టించలేను.

శ్లో॥ యథా నాలం కులాలశ్చ ఘటం కర్తుం మృదా వినా ।
అహం శేషశ్చ కలయా శ్వాంశేన త్వం వసున్ధరా ॥ 76

త్వాం శస్య రత్నధారాం చ బిభర్తిమూర్ధ్ని సున్దరి ।
త్వం చ కాన్తిశ్చ శాన్తిశ్చ మూర్తిర్మూర్తిమతీ సతీ ॥ 77

తుష్టిః పుష్టిః క్షమా లజ్జా క్షుధా తృష్ణా పరా దయా ।
నిద్రా శుద్ధా చ తన్ద్రా చ మూర్ఛా చ సన్నతిః క్రియా ॥ 78

మూర్తిరూపా భక్తిరూపా దేహినాం దేహరూపిణీ ।
మమాధార సదా త్వంచ తవాత్మాహం పరస్పరమ్ । 79

యథా త్వం చ తథాహం చ సమౌ ప్రకృతిపూరుషౌ ।
న హి సృష్టిర్భవేద్దేవి ద్వయోరేకతరం వినా ॥ 80

మట్టిలేనిదే కులాలుడు ఘటములను నిర్మింపలేనట్లు నీవు లేని నేను సృష్టింపలేను. నేనే ఆదిశేషు డను, నీవే స్వకళచే వసుంధరవైతివి. సుందరీ ! సస్యములకు, రత్నములకు ఆధారభూతవైన నిన్ను (వసుంధరను) ఆదిశేషుడనై

నేను శిరమున ధరింతును. నీవే కాంతివి, శాంతివి, మూర్తివి, మతివి, సతివి, విభూతివి, తుష్టివి, పుష్టివి, క్షమవు, లజ్జవు, క్షుధవు, తృష్ణవు, దయవు, నిద్రవు శుద్ధవు, తంద్రవు, మూర్ఛవు, క్రియవు. మూర్తిస్వరూపిణీ! భక్తిరూపిణీ! దేహులయందు దేహరూపిణీ! నీవు సదానాయాధారభూతవు నేను నీయాత్మను. ఇట్లు మనమిర్వురము పరస్పరము శరీరము ఆత్మలము నైయున్నాము. నీవెట్లో నే నును అట్లె. మనమిర్వురము సమానులమైన ప్రకృతిపురుషులము. దేవీ! మనమిర్వురిలో నేయొక్కరు లేకున్నను సృష్టిసంభవించదు.

నారదా! ఇట్లు పరమప్రసన్నుడైన శ్రీకృష్ణుడు తనప్రాణాధికప్రియురాలైన శ్రీరాధను హృదయమునకు హత్తుకొని అధ్యాత్మిక జ్ఞానమును స్వస్వరూప స్మరణమును ప్రబోధించెను. తదనంతర మాజగన్మాతా పితరులు పుష్పశయ్యపై సుఖముగ శయనించిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో రాధాకు అధ్యాత్మిక
జ్ఞానబోధ చేయుటయను, అఱువది యేడవ
అధ్యాయము సంపూర్ణము

---

# అఱువదియెనిమిదవ అధ్యాయము

## :- శ్రీరాధకృష్ణ సంవాద వర్ణనము :-

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా ! సనాతనుడు, పరమేశ్వరుడు, శ్యామసుందరుడునగు శ్రీకృష్ణ పరమాత్మ బ్రహ్మముహూర్తముననే పుష్పశయ్య పైనుండి నిద్రమేల్కాంచిన వాడై, గాఢనిద్రలో నిమగ్నురాలై యున్న తనప్రాణసమాన ప్రియతమ మగు శ్రీరాధను నిద్రమేల్కొల్పెను. వస్త్రాంచలముచే నామె ముఖమును తుడచి చిర్నగవు మొనరించి మధుసూధనుడు మధురశాంతవాణితో నిట్లు పల్కెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

శుచిస్మితే, రాసేశ్వరీ! వ్రజస్వామినీ! క్షణకాలము రాసమండలమందే యుండును. బృందావనములో విహరింపుము లేదా గోకులమునకు మఱలిపొమ్ము. దేవీ నీవు రాసాధిష్ఠాత్రివి; కావున కొంతకాల మీరాసమండలములోనే రాసరసాస్వాదనముచేయుము. గ్రామ గ్రామములందు గ్రామదేవత వశించునట్లు రాసేశ్వరి రాసమండలమునందే సదా నివసింపవలెను. లేదా సుందరీ! నీవు నీయిష్ట సఖులతో గూడి చందనవనమందు గాని, లేదా చంపకవనమందు గాని విహరింపుము లేదా వసింపుము. నేను స్వగృహమునకు విశేష కార్యర్థమై మఱలిపోయెదను; అందువలన ప్రాణవల్లభా! కొంతసమయమువఱకు నాకు ప్రసన్నతా పూర్వకముగ విరామము నొసంగుము.

శ్లో॥ ప్రాణాధిష్ఠాత్ర దేవీ త్వం ప్రాణాం చ త్వయి సన్తి మే ।
ప్రాణీ విహాయ ప్రాణాంశ్చ కుత్ర స్థాతుం క్షమః ప్రియే ॥ 7

త్వయి మే మానసంశశ్వత్త్వం మే సంసారవాసనా ।
త్వత్తో మమ ప్రియా నాస్తి త్వమేవ శఙ్కరాత్ప్రియా ॥ 8

ప్రాణా మే శఙ్కరః సత్యం త్వం చ ప్రాణాధికా సతి ।

దేవీ! నీవు నాప్రాణములకే అధిష్టాత్రీవి. నీయందే నాప్రాణములు నివసించును; ప్రియే ప్రాణి తనప్రాణములను వీడి అన్యత్ర మనగలడా? నీయందే సదా నామనస్సు లగ్నమైయుండును. నీకంటె నధికప్రియులు నాకు మఱియొకరు లేరు. కేవలము నీవే నాకు శంకరునికంటె అధికప్రియవు. శంకరుడే నాప్రాణ మనునది సత్యము; కాని రాధ! నీవు ప్రాణములకంటే నధికురాలవు.

ఇట్లు రాధతో బల్కి భగవంతు డాప్రదేశమును వీడి గోకులమునకు బయలుదేరెను. ఆయన సర్వజ్ఞుడు, సర్వసాధనుడు, సర్వాత్ముడు, పాలకుడు, సర్వోపకారకుడు. అక్రూరుడు తనకొఱకై వ్రజమున కేతెంచు నని తెలిసికొని ఆయన వ్రజమునకు వెడలుట కుద్యుక్తుడయ్యెను. శ్రీకృష్ణుని మనస్సు మఱియొకరిచే పంచుకొనబడినదని, కావుననే ఆయన తన్ను వీడి వెళ్ళుట కుద్యుక్తుడైనాడని గ్రహించి రాధ వ్యథితహృదయయై, భగవంతునితో దనప్రేమ నిట్లు వెల్లడించుకొనెను.

రా ధి క ప లి కె ను :

నాథా! రమణశ్రేష్ఠా! ప్రియజనులైన నాసర్వ బంధువులందు నీవే శ్రేష్ఠుడవు. ప్రాణనాథా! ఈసమయమున నీమనస్సు భిన్నమైన దని గ్రహించితిని. నీవు నన్ను వీడి వెడలిపోయిన, నాప్రేమ సౌభాగ్యము సర్వస్వము పోగలవు. నన్ను ఈమహాశోక సముద్రములో బడవైచి నీవెచటకు వెడలిపోయెదవు? నేను విరహవ్యాకులను, దీనురాలను, నీశరణము నాశ్రయించిన దానను. ప్రాణనాథా! నేను గృహామునకు మరలి పోలేను, అన్యవనములకు వెడలి యహర్నిశములు కృష్ణ! కృష్ణ! యనుచు నీదివ్యనామమునే గానమొనరించెదను. లేనిచో నేవనమునకు జనక ప్రేమసాగరములో బ్రవేశించి మనస్సులో కేవలము నిన్నే పొందవలె ననెడి యభిలాషతో దేహత్యాగ మొనరించెదను.

ఆకాశము, ఆత్మసదానివసించునట్లు, నీవు నాకొంగును పట్టుకొనినావద్దనే యుండి నాతో చరింతువు; కాని దీనవత్సలా! ఈసమయమున శరణాగతయైన యబలను త్యజించుట నీ కుచితము కాదు. బ్రహ్మ విష్ణుశివాది దేవతలెవని చరణకమలములను ధ్యానింతురో ఆపరామాత్మవు నీవే. సచ్చిదానంద విగ్రహా! నీవు ఆత్మమాయచే గోపవేషధారి వైయున్నావు. ఈర్ష్యగల స్త్రీని నేను; నేను నిన్నెట్లు తెలిసికొనగలను? దేవా! నేను నిన్ను నాప్రాణవల్లభునిగ నెంచి అభిమానముగల దాననై నీయెడల ఏదుర్నీతిపూర్ణ వ్యవహారముల నొనరించితినో ఎన్ని యపరాధముల నొనరించితినో; వాని నన్నింటినీ క్షమింపుము. నాగర్వమంతయు నశించి, నాయాశలన్నియు అడియాసలైనవి. నాసౌభాగ్య మేపాటిదో, ఈదినముననే నేను తెలిసికొనగల్గితిని. నాథా! ఇంతకంటె నిన్ను నే నేమని ప్రార్థింపగలదానను. గర్గమహర్షి ముఖారవిందమునుండి నీమహిమలను శ్రవణమొనరించియు నేను నీమాయామోహితురాలనైతిని. ప్రాణవల్లభా! నీవు లేని యొక్కొక్క క్షణము నాకు శతయుగ సమానము; అయినచో నూఱుసంవత్సరముల పర్యంతము నిన్ను వీడి నేనెట్లు జీవింపగలను?

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

మునీశ్వరా! ఇట్లు భగవంతుని ప్రార్థించి రాధాదేవి మూర్ఛిల్లుట గాంచి కృపానిధి యగు శ్రీకృష్ణపరమాత్మ కరుణాంత రంగుడై ఆమెకు ఉపచారముల ద్వారా స్పృహనుకలుగజేసి యాలింగన మొనరించుకొనెను. తదనంతరము భగవంతుడుశోకమునుహరింపగల యనేకయోగములద్వారా రాధాదేవినిసమాధాన పఱచుటకు యత్నించెను, కాని శుచిస్మితయగు శ్రీరాధ శోకమును వీడలేదు.

సామాన్య వస్తువియోగము సంభవించినను మనష్యునకదిశోకప్రదము కాగలదు; అయినచో దేహాము ఆత్మ విడిపోయిన సుఖమెట్లు కలుగగలదు ? రాధ ప్రేమకు వశుడై శ్యామసుందరుడగు శ్రీకృష్ణ పరమాత్మ వ్రజమునకు ఆదినమున వెడలిపోలేదు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో రాధాకృష్ణ సంవాద
వర్ణనమను అఱువది యెనిమిది
అధ్యాయము సంపూర్ణము

---

## అఱువదితొమ్మిదవ అధ్యాయము

### :- బ్రహ్మయొనరించిన శ్రీకృష్ణస్తోత్రము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! శ్రీ రాధతోగూడి భగవంతుడు క్రీడాసరోవరతటమునకు జనెను. ఆరమణీయప్రదేశమున పరమాత్మ ప్రకృతిస్వరూపిణి యగు రాధతో మరల దివ్యరాసక్రీడల నొనరించెను. తదనంతర మత్యంతానందమగ్నురాలై రాధాదేవి పుష్పశయ్యపై అలసి శయనించెను. ఆసమయముననె లోకపితా మహుడైన బ్రహ్మ శివశేషాదిసకలదేవతలతోను, మహర్షిమునీంద్రులతోను శ్రీకృష్ణునిసమక్షమున కేతెంచెను. బ్రహ్మ భగవంతునకు సాష్టాంగదండ ప్రణామము లర్పించి ముకుళితహస్తుడై పరిపూర్ణతముడైన యాపరమేశ్వరుని సామవేదోక్తమంత్రములచే నిట్లుస్తుతించెను.

### -: బ్రహ్మోవాచ :-

శ్లో॥ జయ జయ జగదీశ వన్దితచరణ నిర్గుణ నిరాకార
స్వేచ్ఛామయ భక్తానుగ్రహ నిత్యవిగ్రహ గోపవేశ మాయయా
మాయేశ సువేశ సుశీల శాన్త సర్వకాంత దాన్త
నితాన్తజ్ఞానానన్ద పరాత్పరతర ప్రకృతేః పర
సర్వాన్తరాత్మరూప నిర్లిప్త సాక్షిస్వరూప వ్యక్తావ్యక్త

నిరంజన భారావతారణ కరుణార్ణవశోకసన్తాపగ్రసన
జరామృత్యుభయాదిహరణ శరణపంజర భక్తానుగ్రహ-
కాతర భక్తవత్సల భక్తసంచితధన ఓం నమోఽస్తు తే॥ 23

శ్లో॥ సర్వాధిష్టాతృదేవా యేత్యుక్త్వా వై ప్రీణనాయ చ
పునః పునరువాచేదం మూర్ఛితశ్చ బభూవ హ ॥ 24
ఇతి బ్రహ్మకృతం స్తోత్రం యః శృణోతి సమాహితః ।
తత్సర్వాభీష్టసిద్ధిశ్చ భవత్యేవ న సంశయః ॥ 25
అపుత్రో లభతే పుత్రం ప్రియాహీనో లభతే ప్రియామ్ ।
నిర్ధనో లభతే సత్యం పరిపూర్ణతమం ధనమ్ ॥ 26
ఇహలోకే సుఖం భుక్త్వా చాన్తే దాస్యం లభేద్ధరేః ।
అచలాం భక్తిమాప్నోతి ముక్తిరపి సుదుర్లభామ్ ॥ 27

జగదీశ్వరా! నీకు జయమగుగాక, జయమగుగాక. సకలవందిత చరణా! నీవు నిర్గుణుడవు, నిరాకారుడవు, స్వేచ్ఛామయుడవు. సదా భక్తులను అనుగ్రహించుట కొఱకు దివ్యవిగ్రహధారివైతివి. ఆ శ్రీవిగ్రహము నిత్యము. మాయచే గోపవేషమును ధరించు మాయాపతీ! నీవేషభూషలు, శీలస్వభావములు మొదలగునవి యన్నియు సుందరములు, అత్యంత మనోహరములు. నీవు శాంతుడవు, సర్వులకు ప్రాణవల్లభుడవు, నితాంత జ్ఞానానందుడవు, స్వభావముగ నింద్రియ సంయమము మనోనిగ్రహముగల వాడవు. పరాత్పరా! ప్రకృత్యతీతా! సర్వాంతరాత్మా! నిర్లిప్తా! సాక్షిస్వరూపా! వ్యక్తావ్యక్తరూపా! నిరంజనా! భూభారహరణా! కరుణాసాగరా! శోకసంతాపనాశనా! జరామృత్యు భయాది హరణా! శరణాగతరక్షకా! భక్తానుగ్రహకాతరా! భక్తవత్సలా! భక్తసంచితధనా! సచ్చిదానందా! 'ఓం' కార స్వరూపా! నీకు నమస్కారము. సర్వాధిష్ఠాతృదేవా! ప్రీతిప్రదాయకా! ప్రభో! నీకు సాదర నమస్కారము.

ఇట్లు అనేకవిధముల భగవంతుని స్తుతించి ప్రేమవిహ్వలుడై బ్రహ్మ మూర్ఛిల్లెను. బ్రహ్మకృతమగు నీస్తోత్రము నేకాగ్రచిత్తులై శ్రవణమొనరించు వారికి సర్వాభీష్టములు సిద్ధింపగలవు, ఇందు సంశయములేదు. అపుత్రులకు పుత్రులు లభింపగలరు, ప్రియాహీనులకు ప్రియులు లభింపగలరు. ఈస్తోత్రశ్రవణమాత్రముననే నిర్ధనులకు సత్యముగ పరిపూర్ణధనము లభింపగలదు.

ఇట్లు మఱల స్తుతించి యనేకప్రణామము లర్పించి జగద్విధాతయగు బ్రహ్మ భక్తిభావ సమన్వితుడై భగవంతు నిట్లు అర్థించెను.

బ్ర హ్మ ప లి కె ను :

దేవదేవేశ్వరా! లెమ్ము, పరమానందకారణా! సానందా! నిత్యానంద మయా! నందనందనా! నీకు నమస్కారము. నాథా! బృందావనమును వీడి నంద భవనమునకు దయచేయుము. నూఱు సంవత్సరముల వఱకు రాధావియోగ మను భవింపవలె నని సుదామునిశాపము జ్ఞాపకముజేసికొనుము. భక్తునిశాపమును సఫలమొనరించుట కొఱకు నీప్రాణాధికప్రియురాలను నూఱు సంవత్సరముల వఱకు త్యజింపవలెను. శాపసమయము పరిసమాప్తమైన పిమ్మట రాధతో గలసి మీరు గోకులమునకు దయచేయుడు.

దేవా! నీపితృదేవుని గృహమున కఱుదెంచిన యక్రూరుని యనుగ్రహింపుము. ఆయన నీకు పితృవ్యుడు, మాననీయుడు, అతిథి, ధన్యవాద యోగ్యుడు, సర్వసమర్థుడైన వైష్ణవుడు. దేవా! ఇపు డక్రూరునితో నీవు మథురకు బయలుదేరవలెను. హరీ! మథురాపురిలో శివధనుర్భంగ మొనరించి శత్రువులను హతోత్సాహులుగ నొనరించి సంహరింపుము. దురాత్ముడైన కంసుని వధించి తల్లిదండ్రులకు స్వాతంత్ర్యము ప్రసాదింపుము. ద్వారకాపురిని నిర్మించి భూభారమును హరింపుము. శంకరుని సమరాంగణమున నిర్జించి యింద్రుని జయింపుము; యుద్ధములో శివుని జృంభకాస్త్రముచే జృంభితునిగ నొనరించి బాణాసురుని భుజములను ఖండింపుము. నాథా! రుక్మిణిని హరింప వలెను. నరకాసురుని వధించి పదునాఱువేల రాజకుమారికలను పాణిగ్రహణ మొనరింపవలెను. కావున వ్రజేశ్వరా! ఈసమయమున ప్రాణతుల్యమైన రాధికను వీడి వ్రజమునకు మఱలి పొమ్ము. దేవా! నీకు కళ్యాణమగుగాక. రాధ నిద్ర మేల్కాంచకమునుపె నీవు బయలుదేరవలెను.

ఇట్లు భగవంతుని యర్థించి బ్రహ్మ సకలదేవతా సహితుడై బ్రహ్మ లోకమునకు వెడలిపోయెను. శివదేవతానంతాదులు తమతమ స్వధామముల కేగిరి. దేవతలు శ్రీకృష్ణునిపై భక్తిప్రేమ సమన్వితులై పుష్పచందన వృష్టి గావించిరి. అశరీరవాణి 'ప్రభూ! కంసుడు వధ్యుడు; కావున విలంబన మొనర్పక వానిని సంహరించి మాతాపితలను బంధవిముక్తులుగ నొనరించి తదనంతరము

పృథ్వీభారమును వారింపుమని శ్రీకృష్ణుని ప్రార్థించెను. నారదా! ఇట్లశరీర వాణిని వినినవాడై శ్రీకృష్ణుడు రాధను వీడి మెల్లగా నిలువబడి వ్రజమునకు బయలు దేరెను! మాటిమాటికి వెనుదిరిగి చూచుచు శ్రీహరి రాధను వీడలేక కొంతదూరము చనెను. తదుపరి చందనవనములో నిలువబడి రాధనే వీక్షించుచుండెను. రాధ నిద్రమేల్కాంచినదై శయ్యను త్యజించినదియై శాంతుడు కాంతుడు, ప్రాణవల్లభు డైనశ్రీహరిని గానక విలపించుచు నాథా! హారమణశ్రేష్ఠా! ప్రాణనాథా! ప్రాణవల్లభా! ప్రాణచోరా! ప్రియతమా! నీ వెక్కడ నున్నా'వని యాక్రోశించుచు, అన్వేషించుచు మాలతీ వనమం దంతట భ్రమించెను.

వనములందు, నికుంజములందు, తరుఛాయలయందు క్రీడాసరోవర తటములపైన శ్రీకృష్ణుని రాధ వెదకుచు దుఃఖిత హృదయాంతరంగయై, నాథా! రమ్ము, రమ్మని యనేకవిధముల యెలుగెత్తి యాక్రోశించుచు సంతాపముచే మూర్ఛిల్లెను. విరహానలముచే సంతప్తురాలై శ్రీరాధాదేవి ప్రాణములు వీడినట్లు భూమిపై అచేతనమై పడిపోయెను.

మహాత్మా! ఆసమయమున అగణిత గోపికాకాంతలు హస్తములందు వింజామరలు, చందనానులేపనాదులు ధరించి రాధకు శైత్యోపచారము లొనరించుట కరుదెంచిరి వారియందు రాధాప్రియసఖి రాధను హృదయమునకు హత్తుకొని యామె నిర్జీవయై పడియుండుట గాంచి ప్రేమవిహ్వలయై దుఃఖింపదొడంగెను. గోపికలు కమల దళములతో శయ్య నమర్చి రాధ నాశయ్యపై బరుండ జేసిరి. కొందఱు గోపికలు వింజామరలు వీచుచుండగా మఱికొందఱు చందనలేపన మొనరించిరి. రాధయొక్క యాదారుణ విరహపరిస్థితిని గాంచినవాడై శ్రీకృష్ణు డామెను వీడి వ్రజమునకు జనలేక మరలివచ్చెను. నారదా! శ్రీకృష్ణపరమాత్మ రాధను సమీపింపబోగా గోపిక లాయనను అడ్డగించి అపరాధిని బంధించినట్లు శ్రీకృష్ణుని బంధించిరి. మరల ఆగోపికలు కోపమువీడి తమప్రాణసఖియగు రాధకొఱకు శ్రీకృష్ణుని బంధవిముక్తినిగ నొనరించి రాధ సమీపమునకు తోడ్కొనివచ్చిరి. కృపానిధి యైన శ్రీకృష్ణపరమాత్మ రాధాదేవిని తనయొడిలోనికి దీసికొనినవాడై చైతన్యమును గలుగజేసి యనేకప్రబోధాత్మక వచనములద్వారా ఆమెను సమాధానపఱచెను . మరల స్మృతిపొందిన రాధ తనసమక్షమువ ప్రాణవల్లభుని గాంచి స్వస్థయై విరహజ్వరమును

త్యజించెను. ఆసమయమున రాధయొక్క యిష్టసఖియైన రత్నమాల శ్రీకృష్ణునితో నిట్లునిష్ఠురోక్తులబలికెను.

రత్నమాల పలికెను :-

శ్రీకృష్ణా! పరిణామమందు సుఖప్రదమైన, హితకరమైన, సత్యమైన, సకలనీతిసారభూతమైన, పతిపత్నులకు ప్రీతివర్ధకములైన విషయములను వర్ణించెద నవధరింపుము.

నేను వచింపబోవు వచనములు నీతిసమ్మతములు, వేదపురాణానుమోదితములు, లోకవ్యవహారములలో ప్రశంసనీయములు, ఉత్తమయశఃప్రాప్తికరములు.

శ్లో॥ నారీణాం చ యథా మాతా ప్రియో భ్రాతా చ బన్ధుషు ।
తతః ప్రియశ్చ పుత్రశ్చ పుత్రాదేవ ప్రియః పతిః ॥ 60

శతపుత్రాత్ ప్రియః స్వామీ సాధ్వీనాం సాధుసమ్మతః ।
రసికానాం విదగ్ధానాం న హి భర్తుః పరః ప్రియః ॥

స్త్రీలకు తల్లియత్యంతప్రేమపాత్రురాలైనట్లు బంధుజనులందు సహోదరుడత్యంతప్రేమపాత్రుడగును. సహోదరునికంటె ప్రియుడు పుత్రుడు. స్త్రీకి పుత్రునికంటె ప్రియుడు పతికాగలడు. సాధ్వియైనస్త్రీకి సత్పురుషుల ద్వారాసమాహృతుడైనస్వామియే నూర్గురుపుత్రులకంటె నధిక ప్రియుడు కాగలడు. రసికురాలైన, చతురయైనస్త్రీకి భర్తను మించినప్రియతముడు మఱియొక డుండడు.

శ్లో॥ సంసారే చానృతే వత్స దమ్పత్యోః ప్రీతిరేవ చ ।
పరస్పరం చ సమతా ప్రేమసౌభాగ్యమీప్సితమ్ ॥ 63

దమ్పత్యోః సమతా నాస్తి యత్ర యత్ర హి మన్దిరే ।
అలక్ష్మీస్తత్ర తత్రైవ విఫలం జీవనం తయోః ॥ 64

ఈమిథ్యాసంసారమందు భార్యాభర్తలు పరస్పరము ప్రీతికలిగియుండుట, వారిర్వురినడుమ సమత్వము, ప్రేమసౌభాగ్యములు, పరమాభీష్టములు నుండవలెను. ఏ గృహములందు భార్యాభర్తలు పరస్పరముప్రేమించుకొనక, సమభావము లేక వర్తించెదరో అగృహములందు దారిద్ర్యము నివసించును. అట్టిపరిస్థితులలో వారిర్వురిజీవనము నిష్ఫలమైనట్లే.

శ్లో॥ సుస్వామినాం విభేదశ్చ పరం దుఃఖం చ యోషితామ్ ।
శోకసన్తాపబీజం చ జీవితం మరణాధికమ్ ॥ 65
స్వప్నే జాగరణే చాపి పతిః ప్రాణాశ్చ యోషితామ్ ।
పతిరేవ గురుః స్త్రీణామిహలోకే పరత్ర చ ॥ 66

స్త్రీకి సత్పురుషుఁడైనభర్తతో విభేదము సంభవించుట యత్యంత శోచనీయవిషయము. పతిని వ్యతిరేకించినస్త్రీజీవితము శోకసంతాపములకు బీజము, మరణముకంటెనధికకష్టదాయకము నగును. నిద్రయందు జాగ్రదావస్థయందుఁగూడ స్త్రీప్రాణములు తనపతియందే నివసించును. ఆమెకు పతియే ఇహలోకము, పరలోకములి గురువు.

నాథా! నీవు రాధను వీడి వెడలినతత్క్షణమే ఆమెవిరహాగ్నికి బలియై అచేతనురాలై ధూళిధూసరితమగు ధరణిపై మూర్ఛిల్లినది. మే మందఱము శైత్యోపచారము లొనరించినపిమ్మట రాధ మరల చైతన్యముగలది యైనది.

నాసఖి క్షణక్షణము 'నాథా! కృష్ణా!' యనిసంబోధించుచు మరుక్షణమందు సంతప్తురాలై దుఃఖించి తత్కాలమే మూర్ఛనొందుచున్నది. రాధా శరీరము విరహాగ్నిచే సంతప్తమై దగ్ధలోయష్టివలె నైనది. ఆసంతప్తశరీరమును మేము స్పృశింపనైనను స్పృశింపలేకపోయితిమి. రాధాదేవికి సుషుప్త జాగ్రదావస్థలయందు, అహర్నిశముల, గృహవనములందు, జలస్థలములందు, చంద్రసూర్యోదయములందు భేదము నశించెను. మారాధ యొకస్థానమునందే యుండి సదా సర్వజగత్తును విష్ణుమయముగ దర్శించుచున్నది. విరహాగ్నిపీడితయైన ఆమెకొఱకు కమలపత్రములచే చల్లనిశయ్య నొనరింపఁగ; ఆశయ్యపై విరహజ్వరపీడితురాలైనరాధ శయనించినది. ప్రియసఖు లందఱు వింజామరలు వీచుచు, అంగములకు చందనానులేపనమొనరించుచు శైత్యోపచారము లొనరింపఁజొచ్చిరి. ఆమెసంతప్తశరీరస్పర్శచే కమలపుష్పములు, కమలపత్రములు శుష్కములైనవి. స్నిగ్ధకమలదళములు తత్క్షణమే జ్వలించి భస్మములైనవి. చందనానులేపనము శుష్కింపగా విరహాగ్నిచే చంపాపుష్పమువంటి సువర్ణకాంతిగల రాధాశరీరవర్ణము కాటుకవలె నయ్యెను. సుందరసిందూర బిందువులు తత్కాలమే శ్యామల వర్ణమైనవి.

కమలాకాంతా! కృష్ణా! నీవు రాధను అనుగ్రహింపనియెడల ఆమె నీ వియోగముచే నిశ్చయముగ ప్రాణములను పరిత్యజింపగలదు. కావున నీతి

విశారదా! కృష్ణా! నీవు మనస్సులో బాగుగ నాలోచించి ఏది యుచితమో దానిని యాచరింపుము. దానివలన నీయం దత్యంతానురక్త యైన యొకయబల ప్రాణముల విడువరాదు.

రత్నమాల పలికిన మధురవచనములను ఆలకించి మాధవుఁడు మందస్మిత ముఖారవిందుఁడై హితకరములైన, సత్యములైన నీతిసారములైన, పరిణామమందు సుఖప్రదములైన వచనముల నిట్లుపల్కెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :-

ప్రియా! రత్నమాలా! నేను ఈశ్వరుడనైనను, మాయిర్వురి వియోగమునకు కారణ మైనశాపమును ఖండింపగల వాడ నైనను అట్లొనరించుట నా కుచితముకాదు. నేను నిర్ణయించిన నియమములను నేనుగూడ మార్పలేను.

శ్లో॥ బ్రహ్మాణ్డేషు చ సర్వేషు మర్యాదా స్థాపితా మయా ।
తయా కర్మ ప్రకుర్వన్తి మునయశ్చ సురా నరాః ॥ 83

సర్వబ్రహ్మాండములందు నే నే మర్యాదను స్థాపించితినో, ఆమర్యాదనె యాధారముగ నొనరించుకొని దేవతలు మహర్షులు, మనుష్యులు కర్మ లొనరించుచున్నారు. (అయినచో నేనే ఆమర్యాద నెట్లుఖండింపగలను ?)

సుందరీ! సుదామునిశాపమువలన దంపతుల మైనమాకు సంభవింప గల వియోగము అభీష్టముకాదు, కాని నిశ్చయముగ వియోగము సంభవింపగలదు. సుమధ్యమా! నేను రాధ కొకవరమును ప్రసాదించుచున్నాను; ఆవరప్రభావమువలన రాధ కేవలము జాగ్రదవస్థయందే నావియోగ మనుభవింపగలదు, కాని స్వప్నములో నిరంతర మామెకు నాసామీప్యము, ప్రేమ లభింపగలవు. నేను నాప్రాణాధికప్రియ యైనరాధకు ఆధ్యాత్మిక జ్ఞానమును ప్రసాదించితిని. ఆజ్ఞానప్రభావమువలన ఆమెశోకము నశింపగలదు. రత్నమాలా! నీకు కళ్యాణ మగుగాక! నీవు రాధను సమాధానపఱచుము, నేను నందభవనమునకు ప్రస్థాన మొనరించెదను.

నారదా! ఇట్లు రత్నమాల నాదేశించి జగదీశ్వరు డైన శ్రీకృష్ణపరమాత్మ నంద భవనమునకు వెడలిపోయెను. రత్నమాలాదిగోపిక లందఱు జగజ్జనని యగురాధాసేవలందు నిమగ్నులైరి. గృహమును జేరి శ్యామసుంద

రుకు తలిదండ్రులకు ప్రణామము లర్పింపగా, పుత్రుని దర్శించి అత్యంతానంద భరితయై యశోద అచ్యుతుని యొడిలో గూర్చుండబెట్టుకొని అప్పటికప్పుడు తీసిన నవనీతమును తినిపించెను. తల్లియొడిలో సేదదీరిన జగన్నాథుడు శీతల జలముల త్రావి తల్లియొసంగిన కర్పూరసమన్విత తాంబూలమును భుజించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో బ్రహ్మ యొనరించిన
రాధాకృష్ణ స్తోత్ర మను అఱువది తొమ్మిదవ
అధ్యాయము సంపూర్ణము

---

# డెబ్బదియవ అధ్యాయము

## అక్రూరుడు శ్రీకృష్ణుని దర్శించుట

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! కంసునివలన వ్రజగమనము అజ్ఞ నొంది యక్రూరు డుద్ధవునితో తనయదృష్టమును వేనోళ్ళ పొగడినవాడై శ్రీకృష్ణమహాత్మ్యమును అనేక విధముల కీర్తించి తనగృహమును జేరి, మిష్టాన్నములను భుజించి శయ్యపై సుఖముగ నిద్రించెను. అక్రూరుడు నిశీథసమయమున నిద్రలో ననేక స్వప్నములను గాంచెను. అక్రూరుడు గాంచినట్టి స్వప్నములు పురాణములందు శ్రుతులందు ప్రశంసింపబడినవి, అక్రూరుడు నిరోగి, ఆయనశిఖ బంధింపబడియున్నది. అక్రూరుడు సుందరవస్త్రములను ధరించి శయ్యపై శయనించియున్నాడు. ఆయన హృదయ సాగరమందు స్నేహతరంగము లుద్భవించుచుండెను. అక్రూరుడు చింతాశోకరహితుడు.

మునిశ్రేష్ఠా! ఆయన మొదట స్వప్నములో నొకసుందర బ్రాహ్మణ బాలుని గాంచెను. కిశోరవయస్కు డైనవానికాంతి శ్యామలవర్ణము

ధారి యైనయాబాలుడు హస్తములందు వేణువును ధరించి శోభిల్లుచుండెను. ఆశ్యామసుందరుడు పీతాంబరధారి, వనమాలా శోభితుడు, చందనచర్చితుడు. గళమునం దలంకరింపబడియున్న అజానులంబితమాలతీమాల ఆజగన్మోహనా కారుని శోభను వృద్ధియొనరించెను. ఆబాలుఁడుత్తమమణిరత్న నిర్మితాభూషణ విభూషితుఁడు, మయూరపిచ్ఛమకుటధారి; మందస్మితముఖారవిందుడు, కమల సదృశవిశాలనేత్రయుక్తుఁడు, అనంతకోటి మన్మథలావణ్యసముఁడు.

పిమ్మట అక్రూరుడు పతిపుత్రసహితయు, పీతాంబరధారిణియు వివిధ రత్నాభూషణ విభూషితయు నగుసాధ్విని గాంచెను. ఆమె యొకహస్తమందు రత్నప్రదీపము, మఱియొక హస్తమందు శ్వేతధాన్యమును ధరించియున్నది. ఆమెముఖమండలము శరత్పూర్ణిమచంద్రుని మించి ప్రకాశించుచున్నది. ఆమె మందస్మిత ముఖారవిందయై, వరములను ప్రసాదించుట కుద్యుక్తురాలైనట్లు అక్రూరుడు స్వప్నమున దర్శించెను. తదనంతర మాయన శుభాశీర్వాదమొన రించు బ్రాహ్మణుని, శ్వేతకమలమున, రాజహంసను, అశ్వమును, సరోవరమును స్వప్నమునందు దర్శించెను. పిమ్మట పుష్పసమన్వితమైన మామిడి పండును, నిమ్మ పండును, నారికేళములను, గురువార్కమును, కదళీవృక్షమును, మనోహర చిత్రములను గాంచెను. తాను హస్తములలో శ్వేతధాన్యమును, శ్వేతపుష్పము లను ధరించి చందనచర్చితుడైయున్నట్లు గాంచెను. తదనంతరము రజతమును, సువర్ణమును, ఉజ్జ్వల మణిరత్నములను, ముక్తామాణిక్యములను, జలభరిత మైన మంగళకలశమును, గోవత్ససహిత సురభిని, వృషభమును, మయూరమును, శుకమును, సారసమును, హంసను, ఖంజనమును, తాంబూలమును, పుష్ప మాలను, ప్రజ్వలితాగ్నిని, దేవపూజను, పార్వతీ ప్రతిమను, శ్రీకృష్ణ విగ్రహమును, శివలింగమును, బ్రాహ్మణకన్యను, సామాన్య బాలికను, పంటతో నిండిన పొలమును, దేవస్థానమును, సింహమును, వ్యాఘ్రమును, గురువును, దేవతలను దర్శించెను.

అట్టి సుస్వప్నములను గాంచి ప్రాతఃకాలముననే నిద్రమేల్కాంచిన వాఁడై యక్రూరుడు ఇచ్ఛానుసార మాహ్నికకృత్యముల నెరవేర్చి తనబంధువులకు స్వప్నవృత్తాంతముల వర్ణించి గురువును, దైవమును పూజించినవాడై మనము లోనె శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించుకొనుచు నందగోకులమునకు బయలు దేరెను. నారదా! మార్గమధ్యమున గూడ అక్రూరుడు మంగళసూచకము

లగు శకునములను గాంచెను. అక్రూరుడు తన వామపార్శ్వమందు శవమును, పూర్ణకుంభమును, ముంగిసను, నీలకంఠమృగమును, దివ్యాభూషణవిభూషిత యైన పతీపుత్రవతిని, శ్వేత పుష్పములను, శ్వేతమాలను, శ్వేతధాన్యమును, శుభ ఖంజనమును గాంచెను. దక్షిణపార్శ్వమున ఆయన ప్రజ్వలితాగ్నిని బ్రహ్మణుని, వృషభమును, గజరాజును, వత్ససహిత గోవును, శ్వేతాశ్వమును, రాజహంసను, పుష్పములను, అప్సరసను, పతాకమును, దధిని, పరమాన్నమును, మణులను, సువర్ణమును, రజతమును, ముక్తామాణిక్యములను, చందనమును, మధువును, ఘృతమును, కృష్ణసార మృగములను, ఫలములను, లాజసిద్ధాన్న ములను, సరస్సులను, దర్పణమును, విచిత్రవిమానమును, సుందర ప్రతిమను, శ్వేతకమలమును, కమలవనమును, శంఖమును చిల్లమును, చకోరమును, పర్వతమును, మేఘములను, మయూరములను, శుకమును, సారసమును దర్శించెను. అక్రూరునకు శంఖధ్వనులు, గండుకోయిలల కలకలారవములు వివిధవాద్య మంగళధ్వనులు, శ్రవణానందముగ వినిపించినవి. శ్రీకృష్ణ దివ్య గుణనామ సంకీర్తనము, హరినామము, జయజయాకార శబ్దములు మార్గమధ్య మున అక్రూరు డాలకించి యత్యంత సంతుష్టాంతరంగు డయ్యెను.

అట్టి శుభశకునములను గాంచి హర్షోల్లసిత హృదయయు క్తుడై శ్రీకృష్ణుని స్మరించుచు అక్రూరుడు రమణీయ బృందావనమును ప్రవేశించి దివ్య రాస మండలమును దర్శించి, క్రమముగ నందుని ప్రసాదము జేరెను.

అక్రూరుని శుభాగమనము తెలిసికొని నందు డత్యంత ప్రసన్నుడై బలరాముని, శ్రీకృష్ణుని తోడ్కొని స్వాగతమీయ బయలుదేరెను. నందుని వృషభాను డాదిగాగల గోపపెద్దలందరు అనుసరించిరి. నందుడు నర్తకిని, జలభరిత మైన మంగళకలశమును, గజరాజును శ్వేతధాన్యమును, ముందిడుకొని మధుపర్కమును, పాద్యమును, రత్నమయాసనాదులను వెంటనిడుకొని వినీతుడై శాంతభావముచే హసితముఖారవిందుడై అక్రూరునకు స్వాగతమీయ బయలుదేరెను. సకలగోపగణములు, గోపికలు ఆ వైష్ణవశిఖామణి రాకను గాంచి యత్యంతా నందముగ్నులైరి. మహాభాగు డైన యక్రూరునకు ఎదురేగి నందుడు స్వాగతముపల్కి యాలింగన మొనరించుకొనెను. అప్రదేశములో నేకత్రితులైన సకల గోపగోపీజనములు తలలువంచి అక్రూరునకు ప్రణామము లర్పించి ఆయనశుభాశీర్వాదములను పొందిరి. అక్రూరుడు శ్రీకృష్ణ బలరాము

లను తనివిదీర దర్శించి వారిని తనయొడిలో గూర్చుండ బెట్టుకొన్నవాడై యనేకపర్యాయములు వారిసుకోమల కపోలములను ముద్దులాడి కృతార్థు డయ్యెను. అక్రూరుని హృదయములో నాహ్లాదము సాగరమువలె పొంగనారం భించెను. అక్రూరుని జన్మ తరించెను, ఆయన మనోరథము సిద్ధించెను. ద్విభుజ యుక్తుడై శోభిల్లు శ్యామసుందరుడైన బాలకృష్ణుని అక్రూరమహాశయుడు కన్నుల కరువుదీర దర్శింపనారంభించెను. పరమాత్మ పీతాంబరధారి, మాలతీ వనమాలా విభూషితుడు చందన చర్చితుడు, వేణుగాన వినోది, బ్రహ్మశివ శేషాది దేవతలు, సనకాది మునీంద్రులు ఎవనిని స్తుతింతురో, గోపకన్య లెవని సౌందర్యమును సదా నేత్రముల ద్వారా పానమొనరింతురో, పరిపూర్ణు డైన, పరబ్రహ్మమైన, పరమాత్మయైన శ్రీకృష్ణుని అక్రూరుడు తనయొడిలో కూర్చుండ బెట్టుకొని ఒక్కక్షణకాలము వీక్షించెను. ఆమాయామానుష రూపధారి యక్రూరుని గాంచి చిరునవ్వులు చిందించెను. తదనంతరము అక్రూర మహాశయుడు శ్రీకృష్ణపరమాత్మను చతుర్భుజ శ్రీమహావిష్ణు రూపమున గాంచెను. శ్రీమహావిష్ణువున కిరుపార్శ్వములందు లక్ష్మీసరస్వతు లలరారుచుండిరి. శంక చక్ర గదా పద్మ ధారియై గళమునందు ఆజానులంబితవమాలను ధరించి, రత్నభూషణ భూషితుడై, సునందనంద కుముదాది పార్షదులు సేవింపగ దేవతలు, మహర్షులు స్తుతింపగ ఆజగన్నాథు డక్రూరునకు దర్శన మొసంగెను.

మరుక్షణమందే యక్రూరుడు శ్రీకృష్ణుని మహాదేవుని రూపమున గాంచెను. మహాదేవుడు పంచముఖుడై యొక్కొక్క ముఖమందు త్రినేత్రము లను కల్గి, శుద్ధస్ఫటికసమానోజ్జ్వలాంగకాంతిచే ప్రకాశించుచు, నాగాభరణుడై దిశలు వస్త్రములుగ గల్గినవాడై అంగములందు భస్మము, శిరముపై జటా జూటామును, ధరించి హస్తములో జపమాలను త్రిప్పుచు సచ్చిదానంద పర బ్రహ్మ దర్శన మొసంగెను.

తదనంతరము శ్రీకృష్ణు డక్రూరుని ధ్యానపరాయణులలోను మనుష్యుల లోను శ్రేష్ఠమైన, చతుర్భుజ బ్రహ్మరూపమున దర్శనమొసంగెను. తదనంతరము ధర్మమువలె, ఆదిశేషునివలె, సూర్యునివలె సనాతన జ్యోతిస్స్వరూపమువలె, కోటికందర్పలావణ్య సుందరాంగునివలె, పరమశోభాసంపన్నునివలె కాముకులకు కమనీయ ప్రేమాస్పదునివలెను దర్శన మొసంగెను. ఈరూపమున నందనందనుని దర్శించి యక్రూరుడు పులకితగాత్రుడై పరమాత్మను అనన్యప్రేమతో నాలింగన

మొనరించుకొని చరితార్థుడయ్యెను నారదా! నందు డొసంగిన రత్నమయ రమణీయసింహాసనముపై పురుషోత్తము డైన శ్రీకృష్ణుని గూర్చుండ బెట్టి అక్రూరుడు భక్తిభావముతో ననేకప్రదక్షిణముల నొనరించి, పులకిత శరీరుడై భూమిపై శిరమును వంచి, ముకుళితహస్తుడై సాశ్రుపూర్ణలోచనుడై అపర బ్రహ్మము నిట్లు స్తుతింప నారంభించెను.

## అక్రూర ఉవాచ

శ్లో॥ నమః కారణరూపాయ పరమాత్మస్వరూపిణే ।
సర్వేషామపి విశ్వానామీశ్వరాయ నమో నమః ॥ 56
పరాయ ప్రకృతేరీశ పరాత్పరతరాయ చ ।
నిర్గుణాయ నిరీహాయ నీరూపాయ స్వరూపిణే ॥ 57
సర్వదేవస్వరూపాయ సర్వదేవేశ్వరాయ చ ।
సర్వదేవాధిదేవాయ విశ్వాదిభూతరూపిణే ॥ 58
అసంఖ్యేషు చ విశ్వేషు బ్రహ్మవిష్ణుశివాత్మకః ।
స్వరూపాయాదిబీజాయ తదీశ విశ్వరూపిణే ॥ 59
నమో గోపాఙ్గనేశాయ గణేశేశ్వరరూపిణే ।
నమః సురగణేశాయ రాధేశాయ నమో నమః ॥ 60
రాధారమణరూపాయ రాధారూపధరాయ చ ।
రాధారాధ్యాయ రాధాయాః ప్రాణాధికతరాయ చ ॥ 61
రాధాసాధ్యాయ రాధాదిదేవప్రియతమాయ చ ।
రాధాప్రాణాధిదేవాయ విశ్వరూపాయ తే నమః ॥ 62
వేదస్తుత్యాత్మవేదజ్ఞరూపిణే వేదినే నమః ।
వేదాధిష్ఠాతృదేవాయ వేదబీజాయ తే నమః ॥ 63
యస్య లోమసు విశ్వాని చాసంఖ్యాని చ నిత్యశః ।
మహద్విష్ణ్వీశ్వరాయ విశ్వేశాయ నమో నమ ॥ 64
స్వయం ప్రకృతిరూపాయ ప్రాకృతాయ నమో నమః ।
ప్రకృతీశ్వరరూపాయ ప్రధానపురుషాయ చ ॥ 65

సర్వకారణరూపా! పరమాత్మస్వరూపా! సంపూర్ణ విశ్వములకే ఈశ్వరా! శ్రీకృష్ణా! నీకు మామాటికి నమస్కారము. సర్వేశ్వరా! నీవు ప్రకృతికంటె నతీతుడవు, పరాత్పరుడవు, నిర్గుణుడవు, నిరీహుడవు, నిరాకారుడవు, సాకారుడవు, సర్వదేవస్వరూపుడవు, సర్వదేవేశ్వరుడవు, సర్వదేవతలకు గూడ

అధిదేవతవు విశ్వమునకే ఆదికారణుడ వైన నీకు నమస్కారము. అసంఖ్యాక బ్రహ్మాండములందు నీవే బ్రహ్మవిష్ణు శివరూపముల విరాజిల్లుచున్నావు, నీవే సర్వమున కాదికారణము. విశ్వేశ్వరుడు విశ్వములు నీస్వరూపములే; దేవా నీకు నమస్కారము, గోపాంగనా ప్రాణవల్లభా! నీకు నమస్కారము, గణేశ్వరుడు ఈశ్వరుడు నీరూపములే; దేవా! నీకు అనేక నమస్కారములు. దేవా! నీవు దేవగణములకు స్వామివి. శ్రీరాధా ప్రాణవల్లభుడ వైన నీకు మాటిమాటికి నమస్కారము. నీవే రాధారమణుడవు, నీవే రాధారూపము ధరించినవాడవు. రాధారాధ్య దేవా! రాధా ప్రాణాధిక ప్రియుడవు నీవే, నీకు నమస్కారము. రాధావశమునం దుండు వాడా! రాధాప్రియతమా! నీకు నమస్కారము. నీవు రాధాధిష్ఠాతృ దేవతవు, సర్వవిశ్వములు నీరూపములే; దేవా నీకు నమస్కారము. వేదము లెవనిని స్తుతించునో నీవే ఆపరమాత్మవు వేదజ్ఞు లైన విద్వాంసులు కూడ వేదజ్ఞాన సంపన్నుడ వైన కారణమున నిన్ను 'వేద'యని కీర్తించిరి; దేవా! నీకు నమస్కారము. వేదముల కధిష్ఠాతవు నీవే, వేద బీజము నీవే; నీకు నమస్కారము. ఎవనిరోమ కూపములం దసంఖ్యాక బ్రహ్మాండములు నిత్య నివాసము చేయుచుండునో, ఆమహావిష్ణువునకే ఈశ్వరుడ వైన, విశ్వేశ్వరుడ వైన నీకు అనేకానేక నమస్కారములు. నీవే స్వయముగ ప్రకృతిరూపము ప్రాకృతపదార్థము నైయున్నావు. ప్రకృతికి ఈశ్వరుడవు నీవే, ప్రధాన పురుషుడవు నీవే, దేవా! నీకు అనేకానేక నమస్కారములు.

ఇట్లు స్తుతించి అక్రూరమహాశయుడు నందసభామధ్యమున ఆనందాతిరేకముచే అచేతనుడై భూమిపై బడెను. ఆమూర్ఛావస్థలో ఆయన తనయొక్క అంతరంగములో విశ్వమందంతట వ్యాపకుడైన, సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుని దర్శించెను. ఆయనయే విశ్వములం దంతట వ్యాప్తుడై విశ్వేశ్వరస్వరూపుడై ఆకృష్ణ శిఖామణికి దర్శన మొసంగెను. నారదమహర్షీ! అక్రూరుడు మూర్ఛనొందియుండుట గాంచి నందుడు ఆదరపూర్వకముగ షోడశోపచారము లొనరించి చేతనత్వమును కల్గించి రత్నసింహాసనముపై గూర్చుండ బెట్టెను. నందుడు అక్రూరుని శుభాగమనమునకు కారణ మేమని ప్రశ్నింపగ అక్రూరుడు కంసుని ధనుర్యజ్ఞ వృత్తాంతము సవిస్తరముగ వివరించి, దేవకీవసుదేవులను బంధవిముక్తులుగ నొనరించుటకు, బలరామకృష్ణులను మధురానగరమున కవశ్యముగ బంపవలసినదిగ నందుని యర్థించెను.

అక్రూరునిచే స్తుతింపబడిన యిశ్రీకృష్ణస్తోత్రమును ఏకాగ్రచిత్తులై పఠించువారు పుత్రహీనులైనను సంతానవంతులు కాగలరు, వారు భార్యా హీనులైన ప్రియభార్యను పొందగలరు, ధనహీనులైన ధనమును, భూహీనులైన సారవంతమైనభూమిని, ప్రతిష్టారహితులైన ప్రతిష్టను, యశోహీనులైన మహాయశమును పొందగలరు.

తదనంతరమక్రూరుడు నందు డర్పించిన మిష్టాన్నముల భుజించి యత్యంత ప్రసన్నచిత్తుడై, రమణీయ మగుచంపాశయ్యపై శ్రీకృష్ణుని హృదయమునకు హత్తుకొని సానందముగ శయనించెను. ప్రాతఃకాలమున నిద్ర మేల్కాంచినవాడై అక్రూరమహాశయుడు ఆహ్నికకృత్యముల నెరవేర్చి జగదీశ్వరుడైన శ్రీకృష్ణుని, బలరాముని, రత్ననిర్మితరథముపై ఆసీనులుగ నొనరించెను. శుభముకొఱకు పంచగవ్యపదార్థము (క్షీరము, దధి, నవనీతము, ఘృతము, మీగడ) లను, నానావిధపరమదుర్లభద్రవ్యములను రథమునందుంచెను. వృషభానుడు, నందుడు, సునందుడు, చంద్రభాను డాదిగాగల సకలగోపులు అక్రూరునితో బయలుదేరిరి. ఆసమయమున గోపవృద్ధులు మృదంగకరతాళాది వాద్యములతో మంగళధ్వనుల గావించి హరినామసంకీర్తన మొనరించిరి. శ్రీకృష్ణబలరాములు మధురానగరమునకు బయలుదేరుచున్నారని తెలిసికొని గోపికలు ప్రణయకోపపీడితలై వాయువేగమనోవేగములతో ఆప్రదేశము జేరిరి. నారదా! శ్రీకృష్ణుడు వారించుచున్నను ఆగోపికలు సరకుగొనక శ్రీరాధాప్రేరితులై తమపదాఘాతములచే కంసనృపాలుడు బంపిన స్వర్ణమయరథమును అనాయాసముగ ఛిన్నభిన్న మొనరించిరి. గోపకిశోరీమణులందత్యంతబలసంపన్నలైనవారు శ్రీకృష్ణుని యెత్తుకొని యాప్రదేశమును వీడి నిష్క్రమించిరి. అన్యగోపికలక్రూరుని యనేకవిధముల నిందించి వస్త్రముచే బంధించిరి. ఈహటాత్సంఘటనను గాంచి అక్రూరు డత్యంతాశ్చర్యచకితుడయ్యెను. పిమ్మట శ్రీకృష్ణుడు రాధను సమీపించి ఆధ్యాత్మికయోగముద్వారా ఆమెను సమాధానపఱచి తనమధురాగమనమునకనుజ్ఞ గైకొనెను. ఆసమయమున ఆకాశమార్గమునుండి యొకదివ్యరథము పరమాత్మకొఱకై భువి కరుదెంచెను. రథమును గాంచి శ్రీకృష్ణుడాదినమునకు ప్రయాణము నిల్పి సోదరసహితముగ గృహమును ప్రవేశించెను. మహర్షులు, దేవేం

హస్తమందుంచగా ఆయన యా ద్రవ్యములను తనమస్తకముపై నిడుకొనెను. తదనంతరము శ్రీహరి ఘృతమును, మధువును, సువర్ణమును, దధిని దర్శించెను. శ్రీకృష్ణపరమాత్మ లలాటముపై చందనానులేపన మొనరించుకొని, గళమునందు పుష్పమాలను ధరించి గురుజనులకు, బ్రాహ్మణులకు భక్తిభావముతో శిరమువంచి నమస్కరించి శంఖధ్వని, వేదపాఠము, సంగీతము, మంగళాష్టకము, బ్రాహ్మణశుభాశీర్వాదములను సాదరముగ శ్రవణ మొనరించెను.

సర్వత్ర శుభముల నొసంగు తనమంగళమయ స్వరూపమునే ధ్యానించి శ్రీకృష్ణుడు తన దక్షిణ పాదమును ముందిడి బయలుదేరెను. నాసికవామ భాగమునుండి వాయువును పీల్చి భగవంతుడు తనమధ్యాంగుళిచే వామరంధ్రమును బంధించి నాసికదక్షిణ రంధ్రమునుండి ఆవాయువును బహిర్గత మొనరించెను. తదుపరి నందనందనుడు అంతఃపురమును వీడి నందుని ప్రాంగణమును సానందముగ ప్రవేశించెను.

శ్లో॥ సానన్దః పరమానన్దో నిత్యానన్దః సనాతనః । 14
నిత్యోఽనిత్యో నిత్యబీజస్వరూపో నిత్యవిగ్రహమ్ ॥
నిత్యాఙ్గభూతో నిత్యేశో నిత్యకృత్యవిశారదః ॥ 15

నిత్యనూతనరూపం చ నిత్యనూతనయౌవనః ।
నిత్యనూతనవేషం చ వయసా నిత్యనూతనః ॥ 16

నిత్యనూతనసమ్భాషో యత్ప్రేమ నిత్యనూతనమ్ ।
నిత్యనూతనసమ్ప్రాప్తిః సౌభాగ్యం నిత్యనూతనమ్ ॥ 17

సుధారసపరం మిష్టం యద్వాక్యం నిత్యనూతనమ్ ।
నిత్యనూతనభక్తం చ యత్పదం నిత్యనూతనమ్ ॥ 18

ఆయన పరమానందమయుడు నిత్యానందస్వరూపుడు, సనాతనుడు. నిత్యానిత్యములన్నియు ఆయనరూపములే. ఆయన నిత్యబీజస్వరూపుడు, నిత్యవిగ్రహుడు, నిత్యాంగభూతుడు, నిత్యేశుడు, నిత్యకృత్యవిశారదుడు. ఆయన రూపము యౌవనము, వేషభాషలు, కిశోరావస్థ మొదలగునవియన్నియు నిత్యనూతనములే. ఆయనమధుర సంభాషణము, ప్రేమ, సౌభాగ్యము, నిత్యనూతనములు. సుధారస భరితమధురవచనములు, భోజనము, పదముకూడ నిత్యనూతనములే.

అయ్యత్యంతరమణీయప్రాంగణములో నిలుచుండి మాయామాయుక్తుడైన మాయేశ్వరుడు ప్రస్థానమున కుపక్రమించెను. కదళీ స్తంభములచే పట్టుసూత్ర

ములతో గుచ్చబడిన ఆమ్రపల్లవతోరణములచే ఆప్రాంగణము అలంకరింపబడెను. విశ్వకర్మయే స్వయముగ ఆప్రాంగణమును పద్మరాగములచే నిర్మించి అలంకరించెను. కస్తూరీ చందన కేసరములచే నాప్రాంగణమును సంస్కారమొనరించెను. అక్రూరబంధుజనసహితుడై శ్రీకృష్ణపరమాత్మ యచట కొంతకాల మాగగా వామపార్శ్వమునుండి యశోద, దక్షిణపార్శ్వమునుండి సానందముగ నందు డరుదెంచి తమప్రియకుమారుని హృదయమునకు హత్తుకొని యాలింగనమొనరించుకొనిరి. ఆతల్లిదండ్రులు తమబిడ్డగా మెలంగు సచ్చిదానందవిగ్రహుని నగుమోమును అనేకపర్యాయములు తనివిదీర చుంబించిరి. బాలకృష్ణుడు తల్లిదండ్రులతో, బంధుజనులతో మధురసంభాషణ మొనరించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో యాత్రావర్ణనమను
డెబ్బదియొకటవ అధ్యాయము
సంపూర్ణము

---

# డెబ్బదిరెండవ అధ్యాయము

## -: శ్రీకృష్ణుడు కంసుని వధించుట :-

శ్రీ నారాయణ ఋషి పలికె :-

మునీశ్వరా! తదనంతరము శ్రీకృష్ణపరమాత్మ గురుజనులకు నమస్కరించి ప్రాంగణమును వీడి స్వర్గమునుండి అరుదెంచినరథముపై నారూఢుడై అక్రూరబలరామాదులు వెంటరాగా మధురకు బయలుదేరి మనోవేగముతో మధురాపురి జేరెను. మధురానగరము ఇంద్రుని యమరావతినె తిరస్కరింపగల సుశోభాసంపన్నము, అత్యంత మనోహరము. శ్రేష్ఠరత్నఖచిత మైన మధురాపురి విశ్వకర్మచేనిర్మితము, సుందరబహుమూల్యరత్ననిర్మితకలశములచే సుశోభితము; అసంఖ్యాకసుందరశ్రేష్ఠ రాజమార్గసమన్వితము. ఆరాజమార్గములు చంద్రకాంతమణులచే జటితము లైయున్నకారణమున చంద్రునితో సమాన

ముగ ప్రకాశించుచున్నవి. వాణిజ్యవీధులచే, చిత్రశాలలచే, మహాహర్మ్యము లచే, అనేకసరోవరములచే, పుష్పోద్యానములచే సమన్వితమై యామహానగర మలరారుచుండెను. రత్నమయాభూషణవిభూషితలై పద్మినీజాతిస్త్రీలు ఆనగర ములో సంచరించుచు మథురాపురిశోభను ఇనుమడింపజేసిరి. నవయౌవన సంపన్నలు, సుస్థిరసౌందర్యరాసులైన యాకాంతలు శ్రీకృష్ణదర్శన లాలసలై శిరములనెత్తి కనుఱెప్పవేయక రాజమార్గమున కిరువైపుల నిలు చుండి నిరీక్షింపదొడంగిరి. ఆనగరమునకు నాల్గువైపుల శత్రుదుర్భేద్యములైన దుర్గములు కలవు. రణశాస్త్రవిశారదులైన యసంఖ్యాకరాక్షసులు అస్త్రశస్త్ర సమన్వితులై ఆమథురానగరమును సురక్షితముగ రక్షించుచుండిరి.

ఇట్లు మథురాపురిశోభను దిలకించుచు కమలనయనుడైన శ్రీకృష్ణుడు మార్గమధ్యమున, అత్యంతజీర్ణశరీరముగల వృద్ధురాలైన కుబ్జను గాంచెను. ఆమె ముడతలుబడిన శరీరముచే వణకుచు హస్తములలో సువాసితకస్తూరీ చందనకేసరాను లేపనములను తీసుకొని శ్రీకృష్ణుని సమక్షమున కఱుదెం చెను. ఆవృద్ధురాలు తనకు చందనానులేపాదులను సమర్పించుటకు వచ్చినదని గ్రహించి శాంతుడు, ఐశ్వర్యయుక్తుడు, శ్రీసంపన్నుడు, శ్రీనివాసుడు, శ్రీబీజుడు, శ్రీనికేతనుడు, శ్రీవల్లభుడైన శ్యామసుందరు డామెను మంద స్మితముఖారవిందుడై వీక్షించి అనుగ్రహించెను. ఆమె శ్రీకృష్ణుని కన్నులకరవు దీర దర్శించి హస్తములను ముకుళించి, శిరమును పరమాత్మచరణకమలముల పైనుంచి అనేకప్రణామము లర్పించెను. తదనంతరము కుబ్జ మనోహరుడైన శ్యామసుందరుని శ్రీఅంగములందు చందనానులేపనమొనరించెను. శ్రీకృష్ణుని పరివేష్టించి యున్న కృష్ణసఖులనుగూడ కుబ్జ చందనానులేపనములచే సత్క రించెను. ఆసౌభాగ్యవతి చందనపాత్రను హస్తమం దిడుకొని అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీకృష్ణపరమాత్మకు ప్రదక్షిణము లొనరించి ధన్యు రాలయ్యెను. ఆభక్తురాలిని శ్రీకృష్ణుడు కరుణాభరితదృక్కులతో వీక్షింపగా ఆమె తత్క్షణమే అనుపమశోభాసంపన్నయై శ్రీమహాలక్ష్మివలె రమణీయ రమణిగ మారిపోయెను. అగ్నితప్తమై పరిశుద్ధమొనరించిన స్వర్ణప్రతిమవలె ఆమె ప్రకాశించెను. సుందరవస్త్రములు, రత్నమయాభూషణములు ఆమె యవయవశోభను వృద్ధియొనరించెను. ఆధన్యురాలు పంద్రెండ్రువత్సరముల కన్యయై సర్వులకు మనోహారిణిగ కన్పడెను. బహుమూల్యరత్ననిర్మితశ్రేష్ఠహార ముచే ఆమె వక్షఃస్థలము భాసిల్లుచుండెను. గజగామినియై చరించు ఆమె

చరణమంజీరములు కలకలధ్వనులు చేయదొడంగినవి. మాలతీమాలలచే అలంకరింపబడి అత్యంతసుందరముగ గన్పడెను. ఆమె లలాటమందు చిత్రింపబడిన సిందూరబిందువులు దానిమ్మపుష్పములవలె అరుణవర్ణములుగనుండెను. ఆబిందువులతో కస్తూరీచందన బిందువులుకూడ ఆమెనగుమోముపై అలంకరింపబడినవి. అత్యంతవికృతస్వరూపిణియైనకుబ్జ శ్రీకృష్ణుని కటాక్షవీక్షణ మాత్రముననే జగన్మోహినిగ పరిణమించుట గాంచి మథురానగరవాసులందఱు ఆశ్చర్యచకితులైరి. కుబ్జ కృతార్థురాలై శ్రీమహాలక్ష్మివలె స్వగృహమునకు బయలుదేరెను.

దరిద్రదేవతకు నివాసమైన ఆమె జీర్ణగృహము లక్ష్మీనివాసమువలె అత్యంతమనోహరముగ మారిపోయెను. ఆదివ్యహర్మ్యమందు రత్ననిర్మితశయ్య కలదు. రత్నదీపికలప్రభలతో నాభవనము ప్రకాశించుచుండెను. ఆభవనసౌందర్యము వర్ణనాతీతము. మునీశ్వరా! సిందూరమును, వస్త్రములను, తాంబూలాదులను, శ్వేతవింజామరలను, కుసుమమాలికలను హస్తములందిడుకొని అసంఖ్యాకదాసీజనము కుబ్జను సేవించుటకు నిరీక్షించుచుండిరి. కించిన్మాత్రమే శ్రీకృష్ణపరమాత్మన కొనరించినసేవాఫలము అఖండసౌభాగ్యమై తనకు లభించుట గాంచి కుబ్జ యత్యంతభక్తిభావయుక్తయైనది. నారదా! ఆసుందరి మనోవాక్కాయకర్మలచే శ్రీహరిచింతన సమారాధనాదులందు సంలగ్నయైనది. ఆమె నిరంతరము శ్రీహరి తనగృహమున కఱుదెంచి తన్ను కృతార్థురాలిగ నొనరించునా యని నిరీక్షింపదొడంగెను. ఆమెకు సర్వజగత్తులు శ్రీకృష్ణమయముగ గోచరించెను. కందర్పకోటి లావణ్యలీలాధాముడైన శ్యామసుందరుడు క్షణకాలమైనను తన కనన్యభక్తురాలైన కుబ్జను విస్మరింపలేదు.

కుబ్జ నుద్ధరించి మథురాపురవాసులను తన దివ్యదర్శనముచే కృతార్థులుగ నొనరించుచు శ్రీకృష్ణపరమాత్మ మార్గమధ్యములో మాలిని గాంచెను. ఆరాజమాలి అనేకపుష్పహారములను సంతరించుకొని రాజభవనమునకు బోవుచుండెను. మాలి తనసమక్షమున శ్రీకాంతుని గాంచగనే శిరమువంచి భక్తిభావసమన్వితుడై సాష్టాంగదండప్రణామము లర్పించెను. తుచ్ఛనరేశ్వరుని సేవలకంటె అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుని సేవయే ఉత్తమ మనిభావించి భాగవతోత్తము డగునామాలి తాను సంతరించినపుష్పమాలిక లన్నింటిని

[illegible] ప్రేమమున నర్పించి చరితార్థుడయ్యెను. శ్రీకృష్ణపరమాత్మ [illegible] సమర్పించిన కుసుమమాలికలను ధరించి, మాలికి దుర్లభదాస్యసౌభా[illegible] రాజమార్గమున బయలుదేరెను. మార్గమధ్యములో కంసనృపా[illegible] వస్త్రములమూటతో పరమాత్మకు ఎదురుబడెను. వాడు మహా[illegible]. అహంకారపరిపూర్ణుడు, యౌవన మదోన్మత్తుడు, ఉద్దండుడు. మునీశ్వరా! శ్రీకృష్ణుడు రాజోచితవస్త్రములను తనకు సమర్పింపవలసి [illegible] ఆదేశించెను: అంతట రజకుడు కోపించి "ఓరీమూఢుడా! నీవు [illegible], ఈవస్త్రములు గోపాలకులకు యోగ్యములుకావు, రాజులకే [illegible] మహాహంకారముతో బల్కెను. రజకునివచనముల నాలకించి [illegible] మందస్మితముఖారవిందుడై బలదేవాక్రూర గోపగణసమక్ష[illegible] అవలీలగ సంహరించెను. తదుపరి ఆరాజోచిత వస్త్రములను [illegible] తనసఖులతోపాటు ధరించి యానందించెను. దేవర్షీ! శ్రీకృష్ణునకు [illegible] సౌభాగ్యమేమని పొగడగలను. పరమాత్మకరస్పర్శచే పవిత్రుడై ఆరజకుడు పాంచభౌతికదేహమును వీడి దివ్యదేహధారియై శ్రీకృష్ణ[illegible] దివ్యవిమానము నధిరోహించి గోలోకమునకు బయలుదేరెను. శ్రీకృష్ణప్రదత్తమైనవానిదివ్యదేహ మక్షయయౌవనయుక్తము, [illegible]రహితము. రజకుడు పీతాంబరధారియై, మందస్మితముఖారవిందుడై, శ్యామకాంతిసమన్వితుడై మనోహరుడయ్యెను. గోలోకమును జేరి [illegible] శ్రీకృష్ణపార్షదుడయ్యెను.

ఇంతలో సూర్యు డస్తమింపగా అక్రూరుడు శ్రీకృష్ణుని యాజ్ఞ [illegible] గృహమునకు వెడలిపోయెను. తదనంతరము పరమాత్మ నందబల దేవా[illegible]సహితుడై, వస్త్రములను నిర్మించు వైష్ణవభక్తుడైన సాలెవాని గృహమునకు అతిథియై యరుదెంచెను. ఆభక్తుడు శ్రీహరిని యనేకవిధముల సేవించి, శ్రీ[illegible] అనేక ప్రణామము లర్పించి యాతిథ్యమొసంగి తనసర్వస్వమును [illegible] సమర్పించి ధన్యుడయ్యెను. మునీశ్వరా! శ్రీకృష్ణుడు అనన్యభక్తు[illegible] మిష్టాన్నములను భుజించి యత్యంతప్రసన్నుడై వానికి బ్రహ్మాదిదేవ[illegible] దాస్యభక్తిసౌభాగ్యమును ప్రసాదించెను. అంతలో [illegible] స్మరించి శ్రీకృష్ణపరమాత్మ ఆమె ననుగ్రహిం[illegible] గృహమున కేతెంచెను. ఆభక్తురాలు పరమాత్మకు స్వాగత[illegible] పూజించి సేవించెను. ఆమెసేవల కత్యంతప్రసన్నుడై

భగవంతుడు "ప్రియా! శ్రీరామావతారసమయమున నీవు నాకొఱ కఖండ తపమొనరించితివి. శూర్పణఖ వైననీవు కుబ్జగ జన్మించి నీయఖండతపఃప్రభావమువలన ఈజన్మలో నాయనుగ్రహమునకు పాత్రురాలవైతివి. దేవీ! నీవు తత్‌క్షణమే పాంచభౌతిక దేహమును త్యజించి జరామృత్యుజన్మరహిత దివ్య దేహధారిణివై గోలోకపరంధామమును జేరి నాయిష్టసఖి వైనగోపికవు కమ్ము" అనియనుగ్రహించెను. తత్‌క్షణమే కుబ్జ దివ్యదేహధారిణియై గోలోకమునుండి యరుదెంచిన రత్ననిర్మితవిమానాము నధిరోహించి పరంధామమునుజేరి చంద్రముఖి యను గోపికగ మారిపోయెను.

పిమ్మట శ్రీకృష్ణుడు వైష్ణవభక్తుని మందిరమున కరుదెంచెను. కంస రాజుసౌధములో భయవిహ్వాలు డైన కంసునకు నిద్రావస్థలో అనేకదుఃస్వప్నములు గోచరించినవి, ఆదుఃస్వప్నము లన్నియు మృత్యుసూచకములే. స్వప్నములో సూర్యు డాకసమునుండి భూమిపై బడి నాల్గుఖండములైనట్లు, చంద్రుడు భూమి పై బడి దశఖండము లైనట్లు కంసుడు గాంచెను. హస్తములలో పాశమును, ఖడ్గమును ధరించి వికృతాకారులై యున్న పురుషులను కంసుడు గాంచెను. ఒక విధవశూద్రస్త్రీ ఖండితనాసికయై, సున్నమునే తిలకముగ ధరించి శ్వేతారుణోర్ధ్వకేశినియై, లోలజిహ్వయై, హస్తములందు ఖడ్గమును, గళమునందు ముండమాలను ధరించి కంసునకు స్వప్నమున గోచరించెను. గార్దభమును, మహిషమును, వృషభమును, సూకరమును, భల్లూకమును, కాకమును, గ్రద్దను, వానరమును, శ్వేతశునకమును, శృగాలమును, నక్రమును, భస్మపుంజమును, అస్థులసమూహమును, తాటిపండ్లను, కేశములను, కార్పాసమును (ప్రత్తి), ఆరిపోయిన బొగ్గులను, ఉల్కలను, చితిపైనుంచిన శవమును, అర్థభాగమే జ్వలించినకాష్ఠమును, కుమ్మరివానిచక్రమును, శుష్కించినకాష్ఠము, కుశములను, తృణములను, భ్రమించుఘటమును, ఆక్రోశించు శవమస్తకమును, అగ్నిచే ప్రజ్వరిల్లుస్థానమును, శుష్కజలాశయమును, దగ్ధమత్స్యమును, లోహమును, దావానలముచే జ్వలించి ఆరిపోయినవనమును గలితకుష్ఠుడైన దిగంబరశూద్రుని, అత్యంతరోషయుక్తుడై విడివడినశిఖగలవాడై తన్ను శపించుబ్రాహ్మణుని, అత్యంతకుపితు డైన సన్యాసిని, యోగిని, వైష్ణవుని కంసనృపాలుడు స్వప్నమున గాంచెను. ఇట్టిదుఃస్వప్నములచే నిద్ర భంగముకాగా శ్రీకృష్ణుడు తన్నునిశ్చయముగ సంహ

[illegible] భయముతో కంసుడు కంపింపదొడంగెను. భయముతో కంసు [illegible] శ్రీకృష్ణస్మరణముం దే తత్పరుడయ్యెను. ప్రాతఃకాలముననే [illegible] దుఃస్వప్నములను తనబంధువులకు, శ్రేయోభిలాషు [illegible] రానున్న దుర్నిమిత్తమునకు దుఃఖింపదొడంగిరి.

[illegible] భూమిలో ప్రేక్షకు లాసీనులగుటకు ఆసనములను నిర్మిం [illegible] ద్వారమువద్ద శ్రీకృష్ణుని నిరోధించుట కొకమత్తగజమును, [illegible] మల్లరాక్షసులను, అసంఖ్యాకాస్త్రశస్త్రకోవిదు లైన [illegible] నియోగించెను. తదుపరి ధనుర్యజ్ఞమునకై మంగళకృత్యము [illegible] నిర్వర్తించెను. కంసుడు వికరాళకరవాలమును ధరించి సభా [illegible] సింహాసనాసీను డైయుండగా పురోహితులు ధనుర్యజ్ఞమును [illegible]. ఆహూతు లైన నరేశ్వరులు, బ్రాహ్మణులు, మునీశ్వరులు, [illegible] లైన పురుషులు తమతమయాసనముల నలంకరించిరి. [illegible] సమయముననే బలరామునితో శ్రీకృష్ణపరమాత్మ ఆసభాద్వార [illegible] కువలయాపీడమును, చాణూరముష్టికులను, కంససైన్యమును [illegible] లీలాపూర్వకముగ సంహరించి సభాభవనమును ప్రవేశించెను. [illegible] పరమాత్మను, పరమేశ్వరునిరూపమున దర్శించిరి. తమ [illegible] దే సచ్చిదానందవిగ్రహమును వీక్షింతురో ఆస్వరూప [illegible] దర్శించి ధన్యులైరి. ఆహూతు లైన నరేశ్వరులకు శ్రీ [illegible] లైన దణ్డధారియై దర్శనమొసంగెను. తలిదండ్రు [illegible] పాలువారు బాలునిగ దర్శించిరి. కామినులదృష్టికి శ్రీ [illegible] లావణ్యశీలాధాముడై గోచరించెను. కంసునకు కాల [illegible] మొసంగెను. కంసునిసహోదరులకు శత్రువులవలె గోచరిం [illegible] ప్రాణప్రియుడై గోచరించెను.

శ్రీ [illegible] పరమాత్మ కిశోరమువలె సభాభవనమును బ్రవేశించి సభాసీనులై [illegible], [illegible]లకు, మాతాపితలకు, గురుజనులకు నమస్కరించెను. [illegible] మధ్యమున విరాజిల్లుచున్న శివధనువు నవలీలగ విరచెను. [illegible] ధ్వనించిన తుములనాదముచే మథురానగర [illegible]. కంసు డీఘటనను గాంచి యత్యంతదుఃఖితుడు [illegible] లత్యంతహర్షయుక్తులైరి. దేవర్షీ! శ్రీకృష్ణుడు దక్షిణ

హస్తమున సుదర్శనచక్రమును ధరించి కంసుని సమీపింప దొడంగెను. ఆజగన్నాథుడు కంసుని తన భక్తునిరూపమున గాంచెను. శ్రీకృష్ణభయవిహ్వలుడై కంసుడు శ్రీకృష్ణనామమునే అవిచ్ఛిన్నముగ స్మరింపదొడంగెను. శ్రీకృష్ణ పరమాత్మ భక్తులకు జీవనబంధువు. ఆకృపానిధానుడు కృపతో గంసుని రత్న సింహాసనముపైనుండి క్రిందకు నీడ్చెను. ఆసమయములో కంసునకు జగత్తంతయు శ్రీకృష్ణమయముగ గోచరించెను. వానికర్మబంధము లన్నియు పటాపంచలైనవి. శ్రీకృష్ణుడు లీలాపూర్వకముగ కంసుని యాక్షణమందే సంహరించెను.

నారదా! కంసుని యుత్కృష్టతేజము శ్రీకృష్ణచరణారవిందములందు ప్రవిష్టము కాగా ఆదైత్యద్వేషి దివ్యదేహధారియై, విమానారూఢుడై పరంధామము జేరెను. తదనంతరము కంసునకు దేహసంస్కార మొనరించి శ్రీకృష్ణుడనేకదానము లొనరించి పదచ్యుతుడైన తన మాతామహుడైన ఉగ్రసేనుని మరల సకలసామ్రాజ్యమునకు పట్టాభిషిక్తునిగ నొనరించెను. చంద్రవంశకులోద్భవుడైన యుగ్రసేనుడు మరల యాదవులకు రాజేంద్రుడయ్యెను.

కంసునిమాత, భార్యలు, తండ్రి, బంధువులు, సోదరీమణులు, సోదరులు, సోదరులభార్యలు కంసుడు మరణించుట గాంచి యనేకవిధముల దుఃఖించి యిట్లుపల్కిరి. "రాజేంద్రా! కంసభూపాలా! లెమ్ము. మరల రత్నసింహాసనము నలంకరించి మాకు దర్శనమొసంగుము. భగవంతునకు విరోధివై అకాలమరణముపాలై యేల మమ్ము వీడినావు?

శ్లో॥ బ్రహ్మాది స్తమ్బపర్యన్తమసఖ్యం విశ్వమేవ చ।
సర్వం చరాచరాధారం యః సృజత్యేవ లీలయా॥ 99

బ్రహ్మేశశేషధర్మాశ్చ దినేశశ్చ గణేశ్వరః।
మునీన్ద్రనివహో దేవేన్ద్రో ధ్యాయతే యమహర్నిశమ్॥ 100

వేదాః స్తువన్తి యం కృష్ణం స్తౌతి భీతా సరస్వతీ।
స్తౌతి యం ప్రకృతిస్త్రష్టా ప్రాకృతం ప్రకృతేః పరమ్॥ 101

స్వేచ్ఛామయం నిరీహం చ నిర్గుణం చ నిరంజనమ్।
పరాత్పరం బ్రహ్మ పరమాత్మానమీశ్వరమ్॥ 102

నిత్యం జ్యోతిః స్వరూపం చ భక్తానుగ్రహవిగ్రహమ్।
నిత్యానన్దం చ నిత్యం చ నిత్యమక్షయవిగ్రహమ్॥ 103

రించు నని భయముతో గంసుడు కంపింపదొడంగెను. భయముతో కంసు డహర్నిశములు శ్రీకృష్ణస్మరణమందే తత్పరుడయ్యెను. ప్రాతఃకాలముననే కంసుడు తనకు సంభవించినదుఃస్వప్నములను తనబంధువులకు, శ్రేయోభిలాషులకు వివరింపగా వా రందఱు రానున్నదుర్నిమిత్తమునకు దుఃఖింపదొడంగిరి.

కంసుడు రంగభూమిలో ప్రేక్షకు లాసీనులగుటకు ఆసనములను నిర్మించెను. సభాద్వారమువద్ద శ్రీకృష్ణుని నిరోధించుట కొకమత్తగజమును, చాణూరముష్టికులను మల్లరాక్షసులను, అసంఖ్యాకాస్త్రశస్త్రకోవిదు లైన సైనికులను వినియోగించెను. తదుపరి ధనుర్యజ్ఞముకొఱకై మంగళకృత్యము లారంభించి సభను నిర్మించెను. కంసుడు వికరాళకరవాలమును ధరించి సభామధ్యములో రత్నసింహాసనాసీను డైయుండగా పురోహితులు ధనుర్యజ్ఞమును ప్రారంభించిరి. ఆహూతు లైన నరేశ్వరులు, బ్రాహ్మణులు, మునీశ్వరులు, ప్రజలు, ధర్మాత్ము లైన పురుషులు తమతమయాసనముల నలంకరించిరి. నారదా! ఆసమయముననే బలరామునితో శ్రీకృష్ణపరమాత్మ ఆసభాద్వారమున కరుదెంచి కువలయాపీడమును, చాణూరముష్టికులను, కంససైన్యమును తృటికాలములో లీలాపూర్వకముగ సంహరించి సభాభవనమును ప్రవేశించెను. పరమయోగులు ఆపరమాత్మను, పరమేశ్వరునిరూపమున దర్శించిరి. తమ హృదయకమలములందే సచ్చిదానందవిగ్రహమును వీక్షింతురో ఆస్వరూపమునే తమసమక్షమున దర్శించి ధన్యులైరి. ఆహూతు లైన నరేశ్వరులకు శ్రీకృష్ణుడు సర్వశాసకు డైన దణ్డధారియై దర్శనమొసంగెను. తలిదండ్రులాపరమేశ్వరుని పాలుద్రావు బాలునిగ దర్శించిరి. కాములదృష్టికి శ్రీకృష్ణుడు కందర్పకోటిలావణ్యలీలాధాముడై గోచరించెను. కంసునకు కాలపురుషునివలె దర్శనమొసంగెను. కంసునిసహోదరులకు శత్రువులవలె గోచరించెను. యాదవులకు ప్రాణప్రియుడై గోచరించెను.

శ్రీకృష్ణపరమాత్మ కిశోరమువలె సభాభవనమును బ్రవేశించి సభాసీను లై యున్న మహర్షులకు, ద్విజులకు, మాతాపితలకు, గురుజనులకు నమస్కరించెను. పిమ్మట ఆరంగస్థలమధ్యమున విరాజిల్లుచున్నశివధనువు నవలీలగ విరచెను. శివధనువు భంగమైనప్పు డుద్భవించిన తుములనాదముచే మథురానగరమంతయు గంపించెను. కంసు డీహఠాత్సంఘటనను గాంచి యత్యంతదుఃఖితుడు కాగా నందయశోద లత్యంతహర్షయుక్తులైరి. దేవర్షీ! శ్రీకృష్ణుడు దక్షిణా

హస్తమున సుదర్శనచక్రమును ధరించి కంసుని సమీపింప దొడంగెను. ఆజగన్నాథుడు కంసుని తన భక్తునిరూపమున గాంచెను. శ్రీకృష్ణ భయవిహ్వలుడై కంసుడు శ్రీకృష్ణనామమునే అవిచ్ఛిన్నముగ స్మరింపదొడంగెను. శ్రీకృష్ణ పరమాత్మ భక్తులకు జీవనబంధువు. ఆకృపానిధానుడు కృపతో కంసుని రత్న సింహాసనముపైనుండి క్రిందకు నీడ్చెను. ఆసమయములో కంసునకు జగత్తంతయు శ్రీకృష్ణమయముగ గోచరించెను. వానికర్మబంధము లన్నియు పటాపంచలైనవి. శ్రీకృష్ణుడు లీలాపూర్వకముగ కంసుని యాక్షణమందే సంహరించెను.

నారదా! కంసుని యుత్కృష్ట తేజము శ్రీకృష్ణచరణారవిందములందు ప్రవిష్టము కాగా ఆదైత్యద్వేషి దివ్యదేహధారియై, విమానారూఢుడై పరంధామము జేరెను. తదనంతరము కంసునకు దేహసంస్కార మొనరించి శ్రీకృష్ణు డనేకదానము లొనరించి పదచ్యుతుడైన తన మాతామహుడైన ఉగ్రసేనుని మరల సకలసామ్రాజ్యమునకు పట్టాభిషిక్తునిగ నొనరించెను. చంద్రవంశకులోద్భవుడైన యుగ్రసేనుడు మఱల యాదవులకు రాజేంద్రుడయ్యెను.

కంసునిమాత, భార్యలు, తండ్రి, బంధువులు, సోదరీమణులు, సోదరులు, సోదరులభార్యలు కంసుడు మరణించుట గాంచి యనేకవిధముల దుఃఖించి యిట్లుపల్కిరి. "రాజేంద్రా! కంసభూపాలా! లెమ్మూ. మఱల రత్నసింహాసనము నలంకరించి మాకు దర్శనమొసంగుము. భగవంతునకు విరోధివై అకాలమరణముపాలై యేల మమ్ము వీడినావు?

శ్లో॥ బ్రహ్మాదిస్తమ్బపర్యన్తమసఙ్ఖ్యం విశ్వమేవ చ ।
సర్వం చరాచరాధారం యః సృజత్యేవ లీలయా ॥ 99

బ్రహ్మేశశేషధర్మాశ్చ దినేశశ్చ గణేశ్వరః ।
మునీన్ద్రవర్గో దేవేన్ద్రో ధ్యాయతే యమహర్నిశమ్ ॥ 100

వేదాః స్తువన్తి యం కృష్ణం స్తౌతి భీతా సరస్వతీ ।
స్తౌతి యం ప్రకృతిర్భ్రష్టా ప్రాకృతం ప్రకృతేః పరమ్ ॥ 101

స్వేచ్ఛామయం నిరీహం చ నిర్గుణం చ నిరంజనమ్ ।
పరాత్పరం బ్రహ్మ పరమాత్మానమీశ్వరమ్ ॥ 102

నిత్యం జ్యోతిః స్వరూపం చ భక్తానుగ్రహవిగ్రహమ్ ।
నిత్యానన్దం చ నిత్యం చ నిత్యమక్షయవిగ్రహమ్ ॥ 103

సోఽవతీర్ణో హి భగవాన్ భారావతరణాయ చ ।
గోపాలబాలవేషశ్చ మాయేశో మాయయా ప్రభుః ॥ 104

స యం హన్తి చ సర్వేశో రక్షితా తస్య కః పుమాన్ ।
స యం రక్షతి సర్వాత్మా తస్య హన్తా న కోఽపి చ ॥ 105

బ్రహ్మమొదలు కీటకపర్యంతము గల సకలచరాచరప్రాణులకు ఆధారభూతములైన విశ్వముల నన్నింటిని లీలాపూర్వకముగ సృష్టించువాడు, బ్రహ్మశివశేషధర్మసూర్యగణేశాదిదేవతలచేత, మునీంద్రులచేత, దేవేంద్రులచేత అహర్నిశములు ధ్యానింపబడువాడు, వేదములచేత, సరస్వతిచేత స్తుతింపబడువాడు ప్రకృతిదేవికూడహర్షోల్లసితయై యెవనిదివ్యగుణములగానమొనరించునో, ప్రకృతికే అతీతుడు, ప్రాకృతస్వరూపుడు, స్వేచ్ఛామయుడు, నిర్గుణుడు, నిరంజనుడు, పరాత్పరుడు, పరబ్రహ్మము, పరమాత్మయు, ఈశ్వరుడు, నిత్యజ్యోతిస్స్వరూపుడు, భక్తులను అనుగ్రహించుటకొఱకే దివ్యసచ్చిదానంద విగ్రహమును ధరించినవాడు, నిత్యానందమయుడు, నిత్యరూపుడు, నిత్యమైన అక్షరమైన శరీరధారియు, మాయాపతి నగు గోవిందుడే భూభారమును హరించుటకు మాయామానుష గోపబాలవేషమున అవనిపై నవతీర్ణుడయ్యెను. ఆసర్వేశ్వరుడైనప్రభువు సంహరింపదలచినవానిని ఎవరు రక్షింపగలరు? సర్వాత్మకుడైన శ్రీహరి ఎవనిని రక్షించునో, వారిని సంహరించువారెవరును ఉండబోరు.

మునీశ్వరా! ఇట్లు భగవంతుని స్తుతించి కంసబంధువులు మౌనమువహించిరి. రాజపరివారము బ్రాహ్మణులకు సంతర్పణగావించి ధనధాన్యవస్తువాహనములను దానము లొసంగిరి.

సర్వాత్మకుడైన శ్రీకృష్ణుడు తనమాతాపితలను బంధవిముక్తులుగనొనరించి వారికి సాష్టాంగదండప్రణామము లర్పించి యత్యంతభక్తితో మస్తకము వంచి యనేకవిధముల స్తుతించి యిట్లుపల్కెను.

శ్రీ కృష్ణుడు పలికెను:-

శ్లో॥ పితరం మాతరం విద్యామన్త్రిదం గురుమేవ చ ।
యా న పుష్ణాతి పురుషో యావజ్జీవం చ సోఽశుచిః ॥ 109

సర్వేషామపి పూజ్యానాం పితా వన్ద్యో మహాన్ గురుః ।
పితుః శతగుణైర్మాతా గర్భధారణపోషణాత్ ॥ 110

శ్లో॥ మాతా చ పృథివీరూపా సర్వేభ్యశ్చ హితైషిణీ ।
నాస్తి మాతుః పరో బన్ధుః సర్వేషాం జగతీతలే ॥ 111

విద్యామన్త్రప్రద సత్యం మాతుః పరతరో గురుః ।
న హి తస్మాత్పరః కోఽపి వన్ద్యః పూజ్యశ్చ వేదతః ॥ 112

తల్లిదండ్రులను, విద్యాదాతను, మంత్రదాత యైన గురువును పోషింపని వాడు జీవితపర్యంతము పాములనుండి పరిశుద్ధుడు కాడు. పూజ నీయులందు తండ్రి వందనీయుడు గురువు. కాని గర్భమున ధరించి పోషించినందువలన తల్లి తండ్రికంటె నూఱురెట్లు అధికవందనీయురాలు, శ్రేష్ఠురాలు, మాతృదేవత పృథ్వివంటి క్షమాశీల, సర్వులను సమరూపమున దర్శించు జనని, కావున జీవునకు ఈభూమిపై మాతృదేవతకంటె మిన్న యైన బంధువు మఱియొకడు లేడు. తల్లికంటె ఆధ్యాత్మిక విద్యాప్రదాత, మంత్రప్రదాత శ్రేష్ఠులు ఆదరణీయులు నను వచనముగూడ సత్యమే, వేదానుసారము గురువును మించిన వందనీయుడు, పూజనీయుడు మఱియొకడు లేడు.

మునీశ్వరా! ఇట్లు ప్రవచించి శ్రీకృష్ణపరమాత్మ తల్లి యైన దేవకీదేవికి అనేక ప్రణామము లర్పించి మౌనము వహించెను. తదనంతరము దేవకీవసుదేవులు బలరామకృష్ణులను తమ యొడిలో గూర్చుండ బెట్టుకొని వారికి ఉత్తమ మిష్టాన్నములను ప్రసాదించిరి. పరబ్రహ్మ మైన శ్రీకృష్ణుడు అమాయక బాలునివలె తల్లి యొడిలో నోదిగి యాసీనుడై ఆమెయొసంగిన మిష్టాన్నములను సాదరముగ భుజించెను. భగవంతుని దివ్యలీల లెఱుంగుట ఎవనితరము? దేవకీవసుదేవులు నందునకు, గోపకుమారులకు అత్యంతాదరముతో ఆతిథ్య మొసంగి వారిని సత్కరించిరి. తదనంతరము మంగళకృత్యములను సంపన్న మొనరించి సద్బ్రాహ్మణులకు సంతర్పణలు గావించి వారిని అసంఖ్యాక ధనకనకవస్త్ర వాహనములచే సత్కరించిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో శ్రీకృష్ణుడు కంసుని
వధించుట యను డెబ్బది రెండవ అధ్యాయము
సంపూర్ణము

# డెబ్బదిమూడవ అధ్యాయము
## నందశోకమోచనము

నారాయణఋషి పలికెను :-

నారదా! తదనంతరము పుత్రులను వీడి మఱలిపోలేక శోకాతురుడై దుఃఖించుచు చేష్టాశూన్యుడైన నందుని శ్రీకృష్ణబలరాములాధ్యాత్మికాది దివ్యయోగములద్వారా ఊరడింపనారంభించిరి.

శ్రీకృష్ణుడు పలికెను :-

తండ్రీ! ప్రసన్నుడవై నే నుపదేశించువచనముల నాలకింపుము, హృదయదౌర్బల్యమైన శోకమును పరిత్యజింపుము, నీహృదయమున హర్షమునకు స్థానము నొసంగుము. నే నుపదేశించు దివ్యజ్ఞానమును సావధానచిత్తుడవై గ్రహింపుము. ఈమహాజ్ఞానమును పూర్వకాలమందు పుష్కరతీర్థములో నేను బ్రహ్మశేషగణేశ మహేశ దినేశ మునీశ యోగీశాదులకు ప్రసాదించితిని. ఈప్రాకృతికసంసారమం దెవ రెవరికి పుత్రులు? ఎవ రెవరికి తండ్రి? ఎవ రెవరికి తల్లి? ఈ పుత్రాదిసంబంధములు ఏయేకారణములవలన సంభవింపగలవు?

శ్లో॥ ఆయాన్తి యాన్తి సంసారం పరం స్వకృతకర్మణా ॥ 5

కర్మానుసారాజ్జన్తుశ్చ జాయతే స్థానభేదతః ।
కర్మణా కోఽపి జన్తుశ్చ యోగీన్ద్రాణాం నృపస్త్రియామ్ ॥ 6

ద్విజపత్న్యాం క్షత్రియాయాం వైశ్యాయాం శూద్రయోనిషు ।
తిర్యగ్యోనిషు కశ్చిచ్చ కశ్చిత్పశ్వాదియోనిషు ॥ 7

దేహధారులు తమతమపూర్వకృత శుభాశుభకర్మప్రేరితులై ఈ సంసారమందు జన్మింపగలరు, పరలోకగమన మొనరింపగలరు. కర్మానుసారముగనే వారు విభిన్నములైన ఉచ్చనీచస్థానములందు జన్మింతురు. కొందఱు తమశుభకర్మలవలన యోగీంద్రులకులమందు జన్మింపగలరు. మఱికొందఱు రాజవంశములందు జన్మింపగలరు. కొందఱు బ్రాహ్మణులై, క్షత్రియులై, వైశ్యులై లేదా శూద్రులై జన్మను గ్రహింపగలరు, మఱికొందఱు పశుపక్ష్యాది తిర్యక్యోనులందు జన్మింపగలరు.

మమైవ మాయయా సర్వే సానన్దా విషయేషు చ ।
దేహత్యాగే విషణ్ణాశ్చ విచ్ఛేదే బాన్ధవస్య చ ॥ 8

శ్లో॥ ప్రజాభూమి ధనాదీనాం విచ్ఛేదో మరణాధికః ।
నిత్యం భవతి మూఢశ్చ న చ విద్వాన్ శుచా యుతః ॥ 9

సర్వజీవులు నామాయవలన విషయములందే ఆనందమనుభవింతురు, కాని దేహత్యాగకాలమం దత్యంత విషాద మనుభవింతురు. బంధుజనులతో వియోగము సంభవించినను దేహధారు లత్యంతకష్ట మనుభవింతురు. సంతాన భూమిధనాదుల విచ్ఛేదము జీవులకు మరణముకంటె నధిక కష్టదాయకముగ గోచరించును. కేవలము మూఢు లైనవారుమాత్రమే ఇట్టి శోకగ్రస్తులు కాగ లరు, కాని విద్వాంసు లైనవారుచలింపరు.

శ్లో॥ మద్భక్తో భక్తియుక్తశ్చ మద్యాజీ విజితేన్ద్రియః ।
మన్మన్త్రోపాసకశ్చైవ మత్సేవానిరతః శుచిః ॥ 10

మద్భయాద్వాతి వాతోఽయం రవిర్భాతి చ నిత్యశః ।
భాతి చన్ద్రో మహేన్ద్రశ్చ కాలభేదే చ వర్షతి ॥ 11

వహ్నిర్దహతి మృత్యుశ్చ చరత్యేవ హి జన్తుషు ।
బిభర్తి వృక్షః కాలేన పుష్పాణి చ ఫలాని చ ॥ 12

నాయనన్యభక్తులు సదా నాభజనమునందే సంలగ్నులై నన్ను గూర్చి యజ్ఞ మొనరించుచు జితేంద్రియులై నామంత్రోపాసకులై నిరంతరము నాసేవా సంలగ్ను లై యుందురు. అట్టివారు పరమ పవిత్రులు. నాభయమువలనే వాయువు చలించును, సూర్యచంద్రులు ప్రతిదినము ప్రకాశింతురు, ఇంద్రుడు భిన్నభిన్న సమయములందు వర్షించును, అగ్ని జ్వలించును, మృత్యువు సర్వజీవుల దేహములందు స్వేచ్ఛగా విహరించును. నాభయమువలననే వృక్షములు సమయానుసారముగ పుష్పించి ఫలింపగలవు.

శ్లో॥ నిరాధారశ్చ వాయుశ్చ వాయురాధారశ్చ కచ్ఛపః ।
శేషశ్చ కచ్ఛపాధారః శేషాధారశ్చ పర్వతాః ॥ 13

తాదాధారశ్చ పాతాలాః సప్త ఏవ హి పఙ్క్తితః ।
నిశ్చలం చ జలం తస్మాజ్జలస్థా చ వసున్ధరా ॥ 14

సప్తస్వర్గం ధరాధారం జ్యోతిశ్చక్రం గ్రహాశ్రయమ్ ।
నిరాధారశ్చ వైకుణ్ఠో బ్రహ్మాణ్డేభ్యః పరోవరః ॥ 15

తత్పరశ్చాపి గోలోకః పంచాశత్కోటియోజనాత్ ।
ఊర్ధ్వం నిరాశ్రయశ్చాపి రత్నసారవినిర్మితః ॥ 16

వాయు వేయాధారములేకనే వీచుచున్నది. వాయ్వాధారముపై కచ్ఛపము, కచ్ఛపాధారముపై శేషుడు, శేషునియాధారముపై పర్వతములు నిలచియున్నవి. పంక్తిబద్ధములై యున్న సప్తపాతాళములు పర్వతాధారముపై స్థితములై యున్నవి. పాతాళమువలన జలములు సుస్థిరములైనవి. జలాధారముపై పృథ్వి భ్రమించుచున్నది. ఈ వసుంధరయె సప్తస్వర్గములకు నాధారభూమి (కర్మభూమి). జ్యోతిశ్చక్రము (నక్షత్రమండలము) వివిధగ్రహముల యాధారముచే నిలచియున్నది; కాని వైకుంఠ మేయాధారము లేకయే సుప్రతిష్ఠితమై యున్నది. ఆదివ్యలోకము సమస్తబ్రహ్మాండములకంటె నతీతము, అత్యంత శ్రేష్ఠము. వైకుంఠముకంటె నావల గోలోకపరంధామ మున్నది. గోలోకము వైకుంఠముపై నేబదికోట్లయోజనముల దూరమున ఏ ఆధారము లేక నిలచి యున్నది. ఆగోలోక పరంధామము దివ్యచిన్మయ రత్నసార తత్త్వముచే నిర్మింపబడెను.

ఆదివ్యలోకములో సప్తద్వారములు, సప్తసారములు, సప్తపరిఖలు, లక్షలాది ప్రాకారములు కలవు. ఆదివ్యలోకమందు విరజానది ప్రవహించుచున్నది. గోలోకము మనోహర రత్నమయ శతశృంగ మను పర్వతముచే నావృత మై యున్నది. శతశృంగ శిఖరము లొక్కొక్కటి దశదశ సహస్ర యోజన విస్తీర్ణము గలిగి యున్నవి. ఆపర్వతము కోట్లకొలది యోజనముల యెత్తుగనున్నది. ఆపర్వత పంక్తి పొడవు కోట్లకొలది యోజనములకంటె వంద రెట్లు అధికము, వెడల్పు లక్షలాది యోజనములు. ఆధామమందే బహుమూల్య దివ్యరత్నములద్వారా నిర్మింపబడిన రాసమండలము చంద్రమండలమువలె వర్తులాకారమున కలదు. రాసమండల విస్తారము పదివేల యోజనములు. ఆదివ్య ప్రదేశము పుష్పఫలభరిత వృక్షములచే, పారిజాతవనములచే, వేలకొలది కల్ప వృక్షములచే, పుష్పోద్యానములచే పరివేష్టితమై యున్నది. ఆపుష్పోద్యానములు నానావిధ పుష్పవృక్ష సమాయుక్తములై సుగంధములు వెదజల్లుచు నత్యంత మనోహరముగ గనబడుచున్నవి. ఆరాసమండల ప్రదేశమందు మూడుకోట్ల రత్న నిర్మిత భవనములు గలవు. ఆభవనములను రక్షించుటకు ఆసంఖ్యాక గోపికలు నియుక్తులై యున్నారు. ఆప్రదేశములో రత్నమయ ప్రదీపములు ప్రకాశము నొసంగుచున్నవి. ప్రత్యేక భవనమందు రత్న నిర్మిత శయ్య కలదు. ఆగృహము లన్నియు నానావిధ భోగ సామగ్రుల గూడి యున్నవి.

రాసమండల ప్రదేశమందు, అన్నివైపుల అమృతభరిత కూపములు వందలకొలది
కలవు. గోలోకమందెన్ని గృహములు కలవో నెవరు లెక్కింపగలరు? కేవలము
రాధామందిరమే బహుమూల్యరత్న నిర్మిత భవనములచే సుశోభితము, అత్యంత
సుందరము, రమణీయము, రత్ననిర్మిత స్తంభ పంక్తి సమన్వితము, నానాప్రకార
చిత్రవిచిత్ర చిత్రములచే నలంకృతము, మాణిక్యముక్తా జటితము, వజ్రహార
ములచే నలంకృతము, రత్నమయ ప్రదీపములచే ప్రకాశితము, దివ్యరత్నములచే
నిర్మిత సోపానసమన్వితము, అత్యంత సుందరము. ఆభవనము మూడు అగడ్త
లచే మూడుదుర్గమ ద్వారములచే, పదునారు కక్షలచే సంయుక్తము, ప్రత్యేక
ద్వారమందు లోపల బయట నియమింపబడిన పదునారులక్షల గోపికలు
కార్యార్థినులై భ్రమించుచుందురు. వారగ్నిశుద్ధ దివ్యవస్త్రధారిణులు, రత్న
మయ సర్వాలంకార విభూషితలు, ప్రతప్త సువర్ణ సమానశరీర కాంతియుక్తలు.
రాధాదేవి దాసీజనము కూడ నచ్చోయుండును. వీరందఱిలో నిండియున్న
యంతఃపుర మత్యంత సుందరము. ఆభవన ప్రాంగణము బహుమూల్యరత్న
నిర్మితము; శ్రీరాధాభవన మత్యంత మనోహరము, అమూల్యరత్నమయ
స్తంభములచే సుశోభితము, ఫలపల్లవ సంయుక్తము, రత్ననిర్మిత మంగళ కలశ
ములచే నలంకృతము, రత్ననిర్మిత వేదికలచే విభూషితము, సుందర బహు
మూల్యరత్నమయ దర్పణములచే నలంకృతము. అమూల్య చిన్మయ రత్న
నిర్మిత సుందర సదనము సకలభవనములం దత్యంత శ్రేష్ఠము.

ఆదివ్య భవనమందు రత్నమయ సింహాసనారూఢయై శ్రీరాధ విరా
జిల్లును, లక్షలకొలది గోపికలు ఆమె సేవలయందు నియుక్తలైయుందురు.
రాధాదేవి కోటానుకోట్ల పూర్ణచంద్రుల శోభచే సంపన్నురాలు, ఆమె యంగ
కాంతి చంపకపుష్పమువలె గౌరవర్ణముగలది, ఆమె బహుమూల్య రత్ననిర్మిత
భూషణవిభూషిత, అమూల్యరత్నజటిత వస్త్ర పరిధాన. ఒకహస్తమున రత్న
దర్పణమును, దక్షిణహస్తమందు రత్నమయ క్రీడాకమలమును రాధ లీలగ
ధరించును. ఆమెలలాటముపై దానిమ్మ పుష్పములవలె నరుణవర్ణముతో,
సిందూరబిందువు లలంకరింపబడి యత్యంత మనోహరముగ శోభిల్లుచున్నవి.
సిందూరబిందువులతో కస్తూరీ చందన సుందర బిందువులుకూడ ఆమె ఫాల
సౌందర్యమును వృద్ధిచేయు చున్నవి. ఆమెశిరముపై గల వేణి మాలతీ
మాలలచే నలంకృతమై యుండును. రాధాదేవి యనేక గోపికలద్వారా సేవ

లొందును. ఆమె సేవలందు నియుక్తలైన గోపిక లందఱు రాధా సమానలే. సమస్త దేవతలయం దత్యంతశ్రేష్ఠురాలైన శ్రీరాధ నాప్రాణాధిష్టాత్రి. ఆమె సుదాముని శాపమువలన నీసమయమున అవనిపై వృషభానునందినీ రూపమున నవతరించెను. నాతో నామెకు నూఱుసంవత్సరములు వియోగము సంభవింప గలదు. తండ్రీ! నూఱుసంవత్సరము లవధిలోనే నేను దివ్యలీలలచే భూభారము హరింపగలను. తదనంతరము నేను శ్రీరాధను, నిన్ను (నందుని), యశోదను, గోపగోపీ గణములను, కళావతీ వృషభానులను, అన్యబంధువులను, భక్తజనులను వెంటనిడుకొని గోలోకము జేరగలను. తండ్రీ! ఈవిషయమును నీవు ప్రసన్నతా పూర్వకముగ యశోదకు గూడ దెలియజెప్పుము. మహాభాగా! శోకమును వీడి వ్రజవాసులతో వ్రజమునకు ప్రస్థాన మొనరింపుము.

శ్లో॥ అహమాత్మా చ సాక్షీ చ నిర్లిప్తః సర్వజీవిషు ॥ 46
జీవో మత్ప్రతిబిమ్బశ్చ ఇత్యేవం సర్వసమ్మతమ్ ।

ప్రకృతిర్మద్వికారా చ సాప్యాహం ప్రకృతిః స్వయమ్ ॥ 47

యథా దుగ్ధే చ ధావల్యం న తయోర్భేద ఏవ చ ।
యథా జలే తథా శైత్యం యథా వహ్నౌ చ దాహికా ॥ 48

యథాఽకాశే తథా శబ్దో భూమౌ గన్ధో యథా నృప ।
యథా శోభా చ చన్ద్రే చ యథా దినకరే ప్రభా ॥ 49
యథా జీవ స్తథాత్మానం తథైవ రాధయా సహ ।
త్యజ త్వం గోపికాబుద్ధిం రాధాయాం మయి పుత్రతామ్ ॥ 50
అహం సర్వస్య ప్రభవః సా చ ప్రకృతిరీశ్వరీ ।

నేనే సర్వుల కాత్మను సాక్షిని. సర్వజీవధారులయం దుండియు వారి నుండి నేను నిర్లిప్తుడను. జీవులు నా ప్రతిబింబములే; ఇదియే సర్వసమ్మత సిద్ధాంతము. ప్రకృతి నావికారమే; అనగాప్రకృతికూడ నేనే. క్షీరములందు ధవళత్వమున్నట్లు, క్షీరములకు ధవళత్వమునకు భేదము లేనట్లు జలములో శీతలత్వము, అగ్నిలో దాహికాశక్తి, ఆకాశమందు శబ్దము, భూమియందు గంధము, చంద్రునియందు శోభ, సూర్యునియందు ప్రభ, జీవునియందు ఆత్మ అభిన్నముగ నుండునట్లే రాధతో నేను అభిన్నుడనని తెలిసికొనుడు. నీవు రాధను సాధారణగోపికగా, నన్ను కేవలము నీపుత్రునిగ దలంపకుము. నేను సర్వోత్పాదకుడనైన పరమేశ్వరుడను, రాధ ఆద్యాప్రకృతి యగునీశ్వరి.

తండ్రీ! సుఖప్రదాయని యైన నా విభూతియోగము నాలకింపుము. ఈ దివ్యయోగమును నేను ప్రథమమున అవ్యక్తజన్ము డైన బ్రహ్మ కుపదేశించితిని.

శ్లో॥ కృష్ణోఽహం దేవతానాం చ గోలోకే ద్విభుజః స్వయమ్ ॥ 52

చతుర్భుజోఽహం వైకుణ్ఠే శివలోకే శివః స్వయమ్ ।
బ్రహ్మలోకే చ బ్రహ్మోఽహం సూర్యస్తేజస్వినామహమ్ ॥ 53

నేను సకలదేవతలందు శ్రీకృష్ణుడను. గోలోకములో స్వయముగ ద్విభుజరూపమున విరాజిల్లుచుందును, వైకుంఠములో చతుర్భుజు డగు శ్రీమహావిష్ణురూపమున నివసింతును. శివలోకములో నేనే శివుడను, బ్రహ్మలోకములో నేనే బ్రహ్మను, సకలతేజస్వులందు నేనే సూర్యుడను.

శ్లో॥ పవిత్రాణామహం వహ్నిర్జలమేవ ద్రవేషు చ ।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి సమీరః శీఘ్రగామినామ్ ॥ 54

యమోఽహం దణ్డకర్తౄణాం కాలః కలయతామహమ్ ।
అక్షరాణామకారోఽస్మి సామ్నాం చ సామ ఏవ చ ॥ 55

పవిత్రులందు నే నగ్నిని, ద్రవపదార్థములందు జలమును, ఇంద్రియములందు మనస్సును శీఘ్రగాములయందు సమీరము (వాయువు)ను నేనే. దండించువారిలో యముడను నేను. కాలగణికులందు కాలమును నేను, అక్షరములందు ''అ'' కారమును నేను, సామములందు సామమే నేను.

శ్లో॥ ఇన్ద్రశ్చతుర్దశేన్ద్రేషు కుబేరో ధనినామహమ్ ।
ఈశానోఽహం దిగీశానాం వ్యాపకానాం నభస్తథా ॥ 56

సర్వాన్తరాత్మా జీవేషు బ్రాహ్మణశ్చాశ్రమేషు చ ।
ధనానాం చ రత్నమహమమూల్యం సర్వదుర్లభమ్ ॥ 57

తైజసానాం సువర్ణోఽహం మణీనాం కౌస్తుభః స్వయమ్ ।
సాలగ్రామ స్తథార్చ్యానాం పత్రాణాం తులసీతి చ ॥ 58

పుష్పాణాం పారిజాతోఽహం తీర్థానాం పుష్కరః స్వయమ్ ।
వైష్ణవానాం కుమారోఽహం యోగీన్ద్రాణాం గణేశ్వరః ॥ 59

సేనాపతీనాం స్కన్దోఽహం లక్ష్మణోఽహం ధనుష్మతామ్ ।
రాజేన్ద్రాణాం చ రామోఽహం నక్షత్రాణామహం శశీ ॥ 60

పదునల్వు రింద్రులలో మహేంద్రుడను, సంపన్నులయందు కుబేరుడను క్పాలకులయం దీశానుడను, వ్యాపక తత్త్వములయం దాకాశమును, జీవుల

యందు సర్వాంతరాత్మను, వర్ణాశ్రమములయందు బ్రాహ్మణుడను, ధనములందు బహుమూల్యరత్నమును, తేజఃపదార్థములందు సువర్ణమును, మణులందు కౌస్తుభమును, పూజ్యప్రతిమలందు సాలగ్రామమును, పత్రములందు తులసీదళమును, పుష్పములందు పారిజాతమును, తీర్థములందు పుష్కరమును, వైష్ణవులందు కుమారుడను, యోగీంద్రులందు గణేశ్వరుడను, సేనాపతులందు స్కందుడను, ధనుర్ధారులందు లక్ష్మణుడను, రాజేంద్రులందు శ్రీరామచంద్రుడను, నక్షత్రములలో చంద్రుడను నేనే.

శ్లో॥ మాసానాం మార్గశీర్షోఽహమృతూనామస్మి మాధవః ।
వారే ష్వాదిత్యవారోఽహం తిథిష్వేకాదశీతి చ ॥ 61

సహిష్ణూనాం చ పృధివీ మాతాహం బాంధవేషు చ ।
అమృతం భక్ష్యవస్తూనాం గవ్యేష్వాజ్యమహం తథా ॥ 62

కల్పవృక్షశ్చ వృక్షాణాం సురభీ కామధేనుషు ।
గఙ్గాఽహం సరితాం మధ్యే కృతపాపవినాశినీ ॥ 63

మాసములందు మార్గశీర్షమాసము, ఋతువులందు వసంతఋతువు, దినములందు రవివారము, తిథులందు ఏకాదశీతిథి, సహనశీలులందు పృథ్వి బాంధవులందు మాతృదేవత, భక్ష్యవస్తువులందు అమృతము. గోవునుండి ప్రకటితము లగు భక్ష్యపదార్థములందు ఘృతము, వృక్షములందు కల్పవృక్షము, కామధేనువులయందు సురభి, నదులందు పాపవినాశనియైన గంగానది నేనే యైయున్నాను.

శ్లో॥ వాణీతి పణ్డితానాం చ మన్త్రిణాం ప్రణవస్తథా ।
విద్యాసు బీజరూపోఽహం సశ్యానాం ధాన్యమేవ చ ॥ 64

అశ్వత్థః ఫలినామేవ గురూణాం మన్త్రిదః స్వయమ్ ।
కశ్యపశ్చ ప్రజేశానాం గరుడః పక్షిణాం తథా ॥ 65

అనన్తోఽహం చ నాగానాం నరాణాం చ నరాధిపః ।
బ్రహ్మర్షీణాం భృగురహం దేవర్షీణాం చ నారదః ॥ 66

రాజర్షీణాం చ జనకో మహర్షీణాం శుక స్తథా ।
గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥ 67

బృహస్పతిర్బుద్ధిమతాం కవీనాం శుక్ర ఏవ చ ।
గ్రహాణాం చ శనిరహం విశ్వకర్మా చ శిల్పినామ్ ॥ 68

మృగాణాం చ మృగేన్ద్రోఽహం వృషాణాం శివవాహనమ్ ।
ఐరావతో గజేన్ద్రాణాం గాయత్రీ ఛన్దసామహమ్ ॥ 69

వేదాశ్చ సర్వశాస్త్రాణాం వరుణో యాదసామహమ్ ।
ఊర్వశ్య ప్సరసా మేవ సముద్రాణాం జలార్ణవః ॥ 70

సుమేరుః పర్వతానాం చ రత్నవత్సు హిమాలయః ।
దుర్గా చ ప్రకృతీనాం చ దేవీనాం కమలాలయా ॥ 71

శతరూపా చ నారీణాం మత్ప్రియాణాం చ రాధికా ।
సాధ్వీనామపి సావిత్రీ వేదమాతా చ నిశ్చితమ్ ॥ 72

పండితులందు నేను పాండిత్యపూర్ణవాణిని, మంత్రములందు ఓంకారమును, విద్యలందు బీజస్వరూపమును, సస్యములందు ధాన్యరూపుడను; ఫలవంతములగు వృక్షములందు అశ్వత్థవృక్షమును, గురువులందు మంత్రదాత యైన గురుడను నేను; ప్రజాపతులయందు నేనే కశ్యపుడను, పక్షులందు గరుత్మంతుడను, నాగులందు అనంతుడను, నరులందు నరేశ్వరుడను, బ్రహ్మర్షులయందు భృగువును, దేవర్షులందు నారదుడను, రాజర్షులందు జనకుడను, మహర్షులయందు శుకుడను, గంధర్వులయందు చిత్రరథుడను, సిద్ధులయందు కపిలమహర్షిని, బుద్ధిమంతులయందు బృహస్పతిని, కవులయందు శుక్రాచార్యుడను, గ్రహములయందు శనిని, శిల్పులయందు విశ్వకర్మను, మృగములయందు మృగేంద్రుడను, వృషభములయందు శివవాహన మైన నందీశ్వరుడను, గజరాజులయందు ఐరావతమును, ఛందములయందు గాయత్రిని, సర్వశాస్త్రములయందు వేదమును నేనే; జలచరులయందు రాజు నైన వరుణుడను నేను, అప్సరసలయందు ఊర్వశిని నేను, సముద్రములయందు జలధిని నేను; పర్వతములందు సుమేరు పర్వతమును నేను, రత్నసంపన్న శైలములయందు హిమాలయమును నేను, ప్రకృతులయందు దుర్గను నేను, దేవతలయందు లక్ష్మిని నేను, నారీమణులందు శతరూపను నేను, నాప్రియతములయందు రాధికను నేనే, స్త్రీలయందు నిశ్చయముగ నేనే వేదమాత యైన సావిత్రిని.

శ్లో॥ ప్రహ్లాదశ్చాపి దైత్యానాం బలిష్ఠానాం బలిః స్వయమ్ ।
నారాయణర్షిర్భగవాన్ జ్ఞానినాం ముఖ్య ఏవ చ 73

హనుమాన్ వానరాణాం చ పాణ్డవానాం ధనంజయః ।
మనసా నాగకన్యానాం వసూనాం ద్రోణ ఏవ చ ॥ 74

ద్రోణో జలధరాణాం చ వర్షాణాం భారతం తథా ।
కామినాం కామదేవోఽహం రమ్భా చ కాముకీషు చ ॥ 75

గోలోకశ్చాస్మి లోకానా ముత్తమః సర్వతః పరః ।
మాతృకాసు శాన్తిరహం రతిశ్చ సున్దరీషు చ ॥ 76

ధర్మోఽహం సాక్షిణాం మధ్యే సన్ధ్యా చ వాసరేషు చ ।
దేవేష్వ హం చ మాహేన్ద్రో రాక్షసేషు విభీషణః ॥ 77

కాలాగ్నిరుద్రో రుద్రాణాం సంహారో భైరవేషు చ ।
శంఖేషు పాంచజన్యోఽహం అఙ్గేష్వపి చ మస్తకః ॥ 78

పరం పురాణసూత్రేషు చాహం భాగవతం వరమ్ ।
భారతం చేతిహాసేషు పంచరాత్రేషు కాపిలమ్ ॥ 79

స్వాయంభువో మనూనాం చ మునీనాం వ్యాసదేవకః ।
స్వధాఽహం పితృపత్నీషు స్వాహా వహ్నిప్రియాసు చ ॥ 80

యజ్ఞానాం రాజసూయోఽహం యజ్ఞపత్నీషు దక్షిణా ।
శస్త్రాస్త్రజ్ఞేషు రామోఽహంజమదగ్నిసుతో మహాన్ః ॥ 81

పౌరాణికేషు సూతోఽహం నీతిమత్స్వఙ్గిరా మునిః ।
విష్ణువ్రతంవ్రతానాం చ బలానాం దైవమేవ చ ॥ 82

దైత్యులందు నేను ప్రహ్లాదుడను, బలవంతులందు బలిని, జ్ఞానులందు నారాయణఋషిని, వానరులందు హనుమను, పాండవులందు అర్జునుడను, నాగకన్యలయందు మనసాదేవిని, వసువులందు ద్రోణుడను, మేఘములందు ద్రోణుడను, వర్షములందు భారతవర్షమును నేనే, కాముకులందు మన్మథుడను, కాముకీ స్త్రీలయందు రంభను నేను, సమస్తలోకములలో నుత్తమమైన అన్నింటికంటె నతీతమైన గోలోకము నేనే, మాతృకలందు శాంతిని సుందరీమణులందు రతిని నేను, సాక్షులందు ధర్మము నేను, దినమునందుగల క్షణములలో సంధ్యాకాలము నేను, దేవతలందు ఇంద్రుడను నేను, రాక్షసులందు విభీషణుడను నేను, రుద్రులందు కాలాగ్నిరుద్రుడను నేను, భైరవులందు సంహారభైరవుడను నేను, శంఖములందు పాంచజన్యము నేను. సర్వాంగములందు మస్తకము నేను, సకలపురాణములందు శ్రీమద్భాగవత మహాపురాణము నేను, ఇతిహాసములందు మహాభారతము నేను, పాంచరాత్రములందు కాపిలము నేను, మనువులందు స్వాయంభువమనువు నేను, మునులందు వ్యాసదేవుడను నేను, పితృపత్నులందు స్వధను, అగ్నిప్రియలందు స్వాహాను, యజ్ఞములందు

రాజసూయము, యజ్ఞపత్నులందు దక్షిణ నేనే. అస్త్రశస్త్రజ్ఞులందు జమదగ్ని నందను డైన పరశురాముడను, పౌరాణికులందు సూతుడను, నీతిజ్ఞులందు అంగీరసుడను, వ్రతములందు విష్ణువ్రతమును నేనే. బలవంతులయందు దైవబలమును నేనే.

శ్లో॥ ఓషధీనామహం దూర్వా తృణానాం కుశమేవ చ ।
ధర్మకర్మసు సత్యంచ స్నేహపాత్రేషు పుత్రకః ॥ 83

అహం వ్యాధిశ్చ శత్రూణాం జ్వరో వ్యాధిష్వహం తథా ।
మద్భక్తిష్వపి మద్దాస్యం వరేషు చ వరః స్మృతః ॥ 84

ఆశ్రమాణాం గృహస్థోఽహం సన్యాసీ చ వివేకినామ్ ।
సుదర్శనం చ శస్త్రాణాం కుశలం చ శుభాశిషామ్ ॥ 85

ఐశ్వర్యాణాం మహాజ్ఞానం వైరాగ్యం చ సుఖేష్వహమ్ ।
మిష్టవాక్యం ప్రీతిదేషు దానేషు చాఽఽత్మదానకమ్ ॥ 86

సంచయేషు ధర్మకర్మ కర్మణాం చ మదర్చనమ్ ।
కఠోరేషు తపశ్చాహం ఫలేషు మోక్ష ఏవ చ ॥ 87

అష్టసిద్ధిషు ప్రాకామ్యమహం కాశీ పురీషు చ ।
నగరేషు తథా కాంచీ స దేశో యత్ర వైష్ణవః ॥ 88

సర్వాధారేషు స్థూలేషు అహమేవ మహాన్విరాట్ ।
పరమాణురహం విశ్వే మహాసూక్ష్మేషు నిత్యశః ॥ 89

వైద్యానామశ్వినీపుత్రౌ చౌషధీషు రసాయనమ్ ।
ధన్వంతరిర్మన్త్రవిదాం విషాదః క్షయకారిణామ్ ॥ 90

రాగాణాం మేఘమల్లారః కామోద స్త్రిప్రియాసు చ ।
మత్పార్షదేషు శ్రీదామా మద్బన్ధుష్వహముద్ధవః ॥ 91

ఓషధులందు దూర్వను, తృణములందు కుశమును, ధర్మకర్మలందు సత్యమును, స్నేహపాత్రులందు పుత్రుడను, శత్రువులందు వ్యాధిని, వ్యాధులందు జ్వరమును, నాభక్తులందు దాస్యభక్తిని, వరములందు వరమును, ఆశ్రమములందు గృహస్థాశ్రమమును, వివేకులందు సన్యాసిని, శస్త్రములందు సుదర్శనమును, శుభాశీర్వాదములందు కుశలమును నేను. ఐశ్వర్యములందు మహాజ్ఞానమును, సుఖములందు వైరాగ్యమును, ప్రసన్నత్వము నొసంగువారలందు మధురవచనమును, దానములందు ఆత్మదానమును, సంచయములందు ధర్మ

కర్మసంచయమును, సర్వకర్మలందు పూజనమును, కఠోరకర్మలందు తపస్సును, ఫలములందు మోక్షమును, అష్టసిద్ధులందు ప్రాకామ్యమును, పురములయందు కాశీపురిని, నగరములందు కాంచీనగరమును, దేశములందు వైష్ణవ దేశమును, స్థూలాధారములందు మహావిరాట్పురుషుడను, జగములందు గల యత్యంత సూక్ష్మపదార్థములందు పరమాణువును, వైద్యులందు అశ్వినీకుమారుడను ఔషధములయందు రసాయనమును, మంత్రవేత్తలందు ధన్వంతరిని, వినాశకరము లైన దుర్గుణములందు విషాదమును, రాగములందు మేఘమల్హార రాగమును, రాగిణులందు కామోదమును, నాపార్షదులందు శ్రీదాముడను, నాబంధువు లందు ఉద్ధవుడను నేనే.

శ్లో॥ పశుజన్తుషు గౌశ్చాహం చన్దనం కాననేషు చ ।
తీర్థపూతశ్చ పూతేషు నిశ్శంక్కేషు చ వైష్ణవః ॥ 92
న వైష్ణవాత్ పరః ప్రాణీ మన్మన్త్రోపాసకశ్చ యః ।
వృక్షేష్వఙ్కురరూపోఽహమాకారః సర్వవస్తుషు ॥ 93
అహం చ సర్వభూతేషు మయి సర్వే చ సన్తతమ్ ।
యథా వృక్షే ఫలాన్యేవ ఫలేషు చాఙ్కురస్తరోః ॥ 94
సర్వకారణరూపోఽహం న చ మత్కారణం పరమ్ ।
సర్వేశోఽహం న మేఽరీశో హ్యహం కారణకారణమ్ ॥ 95
సర్వేషాం సర్వబీజానాం ప్రవదన్తి మనీషిణః ।
మన్మాయా మోహితజనా మాం న జానన్తి పాపినః ॥ 96

పశుజీవులందు గోవును, వనములందు చందనవనమును, పవిత్రప్రదేశము లందు తీర్థమును, నిశ్శంకులందు వైష్ణవుడను నేను. వైష్ణవులకంటే అత్యున్నత ప్రాణి మఱియొకటి లేదు. విశేషముగ నాదివ్యనామమంత్రోపాసన మొనరించు వారు సర్వశ్రేష్ఠులు. నేను వృక్షములం దంకురమును, సర్వవస్తువులందు వాని ఆకారమును, సమస్తభూతములందు నానివాసము కలదు, నాయందు సర్వజగ ములు వ్యాపించియున్నవి. వృక్షములో ఫలము, ఫలములో అంకురము నున్నట్లు సర్వకారణములకు నేనే కారణస్వరూపుడను, నాకు మఱియొక కారణము లేనేలేదు. నేనే సర్వులకు నీశ్వరుడను, నాకు ఈశ్వరుడు మఱి యొకడు లేడు. కారణములకుకారణమును నేనే. పురుషులు నన్నే సర్వులకు సమస్తజీవులకు పరమకారణ మనికీర్తింతురు, నామాయచే మోహితు లైన పాపులు నన్ను తెలిసికొనలేరు.

శ్లో॥ పాపగ్రస్తేన దుర్బుద్ధ్యా విధినా వంచితేన చ ॥
స్వాత్మాహం సర్వజన్తూనాం స్వాత్మాహం నాదృతః స్వయమ్ ॥ 97
యత్రాహం శక్తయస్తత్ర క్షుత్పిపాసా దయస్తథా ।
గతే మయి తథా యాన్తి నరదేహే యథాను గాః ॥ 98

నేను సర్వజంతువులకు ఆత్మను; కాని దుర్బుద్ధులు, దురదృష్టముచే వంచితులైన పాపగ్రస్తజీవులు నన్ను అనగా తమయాత్మను గూడ ఆదరింపలేరు. నేనుండు శరీరమందే సర్వశక్తులు, క్షుత్పిపాసాదులు ఉండగలవు; నేను శరీరమును వీడిన తక్షణమే రాజు ననుసరించు సేవకులవలె చైతన్యాదిశక్తు లన్నియు దేహమును వీడి పోగలవు.

వ్రజరాజా! నందరాజా! నాతండ్రీ! నే నుపదేశించిన యీమహా జ్ఞానమును హృదయమున నిలుపుకొని వ్రజమునకు మఱలి పొమ్ము, వ్రజమును జేరి దీనిని రాధకు, యశోదామాతకు నుపదేశింపుము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

శ్రీకృష్ణపరమాత్మ యనుగ్రహించిన మహాజ్ఞానమును బొంది నంద నృపాలుడు తన యనుయాయులతో వ్రజమునకు మఱలిపోయెను. వ్రజమును జేరి నందుడు ఆమహాజ్ఞానమును రాధా యశోదలకు బోధించెను. నారదా! ఆమహాజ్ఞానము నాలకించిన సర్వజనులు తమతమ శోకములను బరిత్యజించిరి.

శ్లో॥ కృష్ణో యద్యపి నిర్లిప్తో మాయేశో మాయయా రతః ॥ 101

శ్రీకృష్ణుడు నిర్లిప్తుడైనను మాయకు స్వామి; అందువలన ఆయన మాయ కొఱకు అనురక్తుడైనట్లు బాహ్యముగ గోచరింపగలడు.

యశోద పుత్రవియోగము సహింపలేక శ్రీకృష్ణుని తక్షణమే తోడ్కొని రావలసినదిగ నందుని మఱల బంపెను. యశోదాప్రేరితుడై నందుడు మథురా నగరికి మఱలివచ్చి బ్రహ్మచే స్తుతింపబడిన సామవేదోక్త స్తోత్రముచే పరమానంద స్వరూపుడైన, నందనందనుడైన మాధవుని స్తుతించెను, తరువాత పుత్రుని సమక్షమున నిలుచుండి పుత్రవ్యామోహము వీడలేక పలువిధముల దుఃఖింప దొడంగెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో నందశోకమోచన మను
డెబ్బది మూడవ అధ్యాయము
సంపూర్ణము

# డెబ్బదినాల్గవ అధ్యాయము

## పాంచభౌతిక మైన యీదేహము మిథ్య యని శ్రీకృష్ణపరమాత్మ నందున కుపదేశించుట

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

శ్లో॥ శ్రీకృష్ణః పరమానన్దః పరిపూర్ణతమః ప్రభుః ।
పరమాత్మా చ పరమో భక్తానుగ్రహకాతరః ॥ 1

భువో భారావతరణే నిర్గుణః ప్రకృతేః పరః ,
పరాత్పరస్తు భగవాన్ బ్రహ్మేశశేషవన్దితః ॥ 2

నారదా! శ్రీకృష్ణపరమాత్మ పరమానందమయుడు, పరిపూర్ణతముడైన ప్రభువు, భక్తానుగ్రహకాతరుడు. పృథ్వీభారమును హరించుటకే యవనిపై నవతరించిన భగవంతుడు, ప్రాకృతికగుణ నిర్గుణుడు, ప్రకృతికే అతీతుడు, పరాత్పరుడు. బ్రహ్మశివశేషాదులు కూడ ఆయన దివ్యచరణారవిందములకే వందనము లర్పింతురు.

నందు డొనరించిన స్తుతి నాలకించి జగదీశ్వరు డత్యంత సంతుష్టుడయ్యెను. శ్రీకృష్ణుడు నందునకు పంచభూతముల గుఱించి, నశ్వర మైన ప్రాకృతిక పదార్థముల గుఱించి యుపదేశింప నారంభించెను.

శ్రీ కృష్ణుడు పలికెను :

తండ్రీ! శోకమును, భ్రమను బరిత్యజించి వ్రజమునకు మఱలిపొమ్ము. నే నుపదేశింపబోవు పరమసత్యజ్ఞానమును ఏకాగ్రమనస్కుడవై యాకర్ణింపుము. ఈ యాధ్యాత్మిక జ్ఞానము శోకగ్రన్థులను విచ్ఛేద మొనరింపగలదు.

శ్లో॥ వాయుశ్చ భూమిరాకాశో జలం తేజశ్చ పంచకమ్ ।
ఉక్తాః శ్రుతిగణై రేతైః పంచభూతైశ్చ నిత్యశః ॥ 5

వాయువు, భూమి, ఆకాశము, జలము, తేజస్సు నిత్యములైన పంచభూతములని శ్రుతులు ప్రవచించినవి.

శ్లో॥ సర్వేషాం దేహినాం తాత దేహశ్చ పాంచభౌతికః ।
మిథ్యా భ్రమః కృత్రిమశ్చ స్వప్నవన్మాయయాన్వితః ॥ 6
దేహం గృహ్ణన్తి సర్వేషాం పంచభూతాని నిత్యశః ।
మాయా సజ్కేతరూపం తదభిజ్ఞానం భ్రమాత్మకమ్ ॥ 7

తండ్రీ! సర్వదేహధారుల దేహములు పాంచభౌతికములు, కృత్రిమములు, మిథ్యాభ్రమవంటివి, మాయాన్వితములు, స్వప్నతుల్యములు, సర్వుల దేహములు నిత్యము పంచభూతముల వలననే నిర్మింపబడును. పంచభూత నిర్మితములైన యీనశ్వర దేహములు మాయాసంకేత రూపములు, భ్రమాత్మకములు.

శ్లో॥ కో వా కస్య సుతస్తాత కా స్త్రీ కస్యపతిస్తు వా ।
కర్మణా భ్రమణం శశ్వత్ సర్వేషాం భువి జన్మనీ ॥ 8

కర్మణా జాయతే జన్తుః కర్మణైవ ప్రలీయతే ।
సుఖం దుఃఖం భయం శోకం కర్మణా చ ప్రపద్యతే ॥ 9

తండ్రీ! ఎవ రెవరికి సుతుడు, ఎవ రెవరికి స్త్రీ, ఎవ రెవరికి పతి, సర్వదేహధారులు తమతమ కర్మలవలన భువిపై జన్మించి జననమరణ చక్రమందు భ్రమించుచున్నారు. కర్మవలననే జీవుడు దేహధారికాగలడు, కర్మవలననే విముక్తుడు కాగలడు. సుఖములు, దుఃఖములు, భయము, శోకము దేహధారికి కర్మవలననే ప్రాప్తించును.

శ్లో॥ కేషాం వా జన్మస్వర్గేషు కేషాం వా బ్రహ్మణో గృహే ।
కేషాం విప్రేషు క్షత్రేషు కేషాం వా వైశ్యశూద్రయోః ॥ 10

అతినీచేషు కేషాం వా కేషాం కృమిషు విట్సు చ ।
పశుపక్షిషు కేషాం వా కేషాం వా క్షుద్రజన్తుషు ॥ 11

పునః పునర్భ్రమన్త్యేవ సర్వే తాత స్వకర్మణా ।
కరోతి కర్మ నిర్మూలం మద్భక్తో మత్ప్రియః సదా ॥ 12

ఎవరికి స్వర్గమందు జన్మలభించును? ఎవరికి బ్రాహ్మణ గృహమందు జన్మ లభించును? విప్రులగృహమం దెవరికి జన్మ లభించును? క్షత్రియులగృహమం దెవరికి జన్మ లభించును? అతినీచయోనులం దెవరికి జన్మ లభించును? క్రిమికీటకములయం దెవరికి జన్మ లభించును? పశుపక్ష్యాదులం దెవరికి జన్మ లభించును ? క్షుద్రజంతువులయోనులందు ఎవరికి జన్మ లభించును? ఎవరికైనను ఈ జన్మలన్నియు తమతమకర్మానుసారముగనే లభించును. తండ్రీ! స్వకర్మవలననే జీవులందఱు మాటిమాటికి జన్మించెదరు, మరణించెదరు. నాభక్తులు మాత్రమే తమకర్మలనన్నింటిని సదా నిర్మూలించుకొనగలైదరు.

శ్లో॥ కృతం త్రేతా ద్వాపరశ్చ కలిశ్చేతి చతుర్యుగమ్ ।
పంచవింశత్సహస్రాణాం యుగాన్తే నిధనం మనోః ॥ 13

మనోః సమం మహేన్ద్రస్య పరమాయుర్వినిర్మితమ్ ।
చతుర్దశేన్ద్రవిచ్ఛిత్తౌ బ్రహ్మణో దినముచ్యతే ॥ 14

ఏవం పరిమితా రాత్రిః కాలవిద్భిర్వినిర్మితా ।
ఏవం పరిమితా మాసా వర్షం చ పరినిశ్చితమ్ ॥ 15

బ్రహ్మణశ్చ వర్షశతం పరమాయుర్వినిర్మితమ్ ।
నిమేషమాత్రం కాలోఽయం బ్రహ్మణో నిధనే మమ ॥ 16

బ్రహ్మాదితృణపర్యన్తం సర్వం విశ్వే వినిశ్చితమ్ ।
సత్యోఽహం పరమాత్మా చ భక్తానుగ్రహవిగ్రహః ॥ 17

కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అనునవియే చతుర్యుగములు. ఇరువదియైదు వేలయుగములు గడచిన ఒకమనువు ఆయుర్దాయము పరిపూర్ణము కాగలదు. మనువు ఆయుర్దాయము, మహేంద్రుని యాయుర్దాయము సమానమే యని నిర్ణయింపబడెను. పదునల్వురింద్రులు గతించిన బ్రహ్మకు ఒకపగ లని చెప్పబడెను. అంతకాలమే బ్రహ్మకు రాత్రిగ నిర్ణయింపబడినది. ఈ కాలమానప్రకారముగ నెలలుగడచి, వర్షములు గడచిన నూఱుసంవత్సరములు బ్రహ్మాయుర్దాయముగ నిర్ణయింపబడెను. బ్రహ్మాయుర్దాయపర్యంతకాలము నాకు (శ్రీకృష్ణునకు) ఒక నిమేషకాలము మాత్రమే యని గ్రహింపుము. బ్రహ్మాదితృణపర్యంత మున్న సర్వవిశ్వములు అనిశ్చితములు. నేనే సత్యస్వరూపుడ నైన పరమాత్మను. భక్తులను అనుగ్రహించుటకొఱకే సచ్చిదానంద విగ్రహుడనైతిని.

శ్లో॥ మన్మన్త్రోపాసకః సత్యో దేహం త్యక్త్వా ధరాసు చ ।
యాన్త్యేవ హి గోలోకం ఛిత్త్వా కర్మ పురాతనమ్ ॥ 18

అసంఖ్యబ్రహ్మణాం పాతే న భవేత్తస్య పాతనమ్ ।
గృహ్ణాతి నిత్యం స్వం దేహం జన్మమృత్యుజరాపహమ్ ॥ 19

నామంత్రోపాసకు లైన యనన్యభక్తు లవనిపై పాంచభౌతికదేహమును వీడి పురాకృతకర్మల నన్నింటిని నిర్మూలన మొనరించుకొని గోలోకము జేరగలరు. అసంఖ్యాకు లైన బ్రహ్మలు గతించినను నాయనన్యభక్తులు నశింపరు. వారు జన్మమృత్యుజరారహితమైన, నిత్యమైన, అక్షర మైన దేహమును ధరింతురు.

శ్లో॥ న నష్ట మమ భక్తానామశుభం విద్యతే క్వచిత్ ।
నిత్యం సుదర్శనం తాంశ్చ పరిరక్షతి సర్వతః ॥ 20

మత్తో హి బలవాన్ భక్తశ్చిన్తితోఽహం న చిన్తితః ।
అహం స్వామీ చ తస్యైవ న మే స్వామీ పితా ప్రసూ ॥ 21

పుత్రబుద్ధిం పరిత్యజ్య భజ మాం బ్రహ్మరూపిణమ్ ।
ఛిత్త్వా చ కర్మనిగడం గోలోకం తద్ వ్రజ స్వయమ్ ॥ 22

నన్దరాజా! నాభక్తుల కెపుడును అశుభము సంభవింపదు. నిత్యము నాచే వినియోగింపబడిన సుదర్శనచక్రము వారిని సంరక్షించును. నాకంటే నాభక్తుడే బలవంతుడు. వారికొఱకు నేనే చింతింతును, కాని నాభక్తులు సదా చింతారహితులే. నేనే నీకు స్వామిని, నీవు నాకు స్వామివి కావు, తండ్రివి కావు. నాయెడల పుత్రభావము పరిత్యజించి పరబ్రహ్మస్వరూపుడ నైన నన్ను సదా భజింపుము. కర్మబాధనములను ఖండించుకొని స్వయముగ గోలోకము జేరుము.

నే నుపదేశించిన యీజ్ఞానమును యశోదామాతకు, గోపగోపికలకు నుపదేశింపుము. వా రందఱితో గూడి నీవు శోకమును పరిత్యజింపుము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :-

ఇట్లు ప్రవచించి శ్రీకృష్ణుడు యాదవసభామధ్యమున మౌనము వహించెను. అపుడు ఆనందమగ్ను డైన నందుడు మఱల పరమాత్మ నిట్లు ప్రశ్నించెను. "పరమానందస్వరూపా! గోవిందా! నేను మూఢుడను, నీవు వేదోత్పాదకుడ వైన పరబ్రహ్మవు. నీచరణకమలములు లభించు జ్ఞానము నుపదేశింపవలసినదిగ ప్రార్థించుచున్నాను." నారదా! నందుని యభ్యర్థనము నాలకించి సర్వజ్ఞు డైన శ్రీకృష్ణపరమాత్మ ఆయనకు శ్రుతిదుర్లభమైన ఆహ్నికకృత్యజ్ఞానమును ప్రవచింపనారంభించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో మానవదేహము మిథ్యయని
నందున కుపదేశించుట యను డెబ్బది నాల్గవ
అధ్యాయము సంపూర్ణము

---

# డెబ్బదియైదవ అధ్యాయము

## ఆహ్నిక కృత్యముల వర్ణనము

శ్రీ కృష్ణుడు పలికెను :-

తండ్రీ! వేదములం దత్యంతగోపనీయమైన, పురాణములం దత్యంత దుర్లభమైన పరమాద్భుతజ్ఞానము నుపదేశించెద నవధరింపుము. సాధ్వీగాని స్త్రీ మోక్షమార్గమునకు అవరోధము, భ్రమకు, మాయకు సుందరభూమి వంటిది. అట్టి వారిపై నెప్పుడును విశ్వాసముంచరాదు. వ్రజరాజా! కులటలు సదా హరిభక్తికి విరుద్ధముగ వర్తింతురు. వారు సర్వనాశమునకు బీజస్వరూపిణులు. అట్టివారిని విశ్వసించుట యుచితముకాదు.

ప్రతిదినము బ్రాహ్మముహూర్తముననే నిద్రమేల్కాంచి రాత్రి యందు ధరించిన వస్త్రములను త్యజించి; శుద్ధవస్త్రములను ధరించి హృదయకమలమం దిష్టదేవుని, బ్రహ్మరంధ్రమందు పరమగురుని చింతింపవలెను. మనమునందే వారిని చింతించి ప్రాతఃకాల కృత్యములను పరిపూర్ణ మొనరించుకొని, నిర్మలజలములందు స్నాన మొనరింపవలెను.

శ్లో॥ న సఙ్కల్పం చ కురుతే భక్తః కర్మనికృన్తనః । 6

"కర్మలను ఖండించునాథ భక్తుడు ఏకోటికలను సంకల్పింపడు." అట్టివాడు పవిత్రనదీజలములందు స్నానమాచరించి భగవంతుని స్మరించి, సంధ్యావందన మాచరించి గృహమునకు మరలిరాగలడు. గృహమున కేతెంచినపుడు పాదములను ప్రక్షాళన మొనరించుకొని గృహప్రవేశ మొనరింపవలెను. అనంతరము పరిశుద్ధమైన వస్త్రములను ధరించి మోక్షమునకు గారణభూతుడ నైన నన్ను పూజింపవలెను. సాలగ్రామమందు, మణియందు, యంత్రమందు, ప్రతిమయందు, జలమందు, బ్రాహ్మణునందు, గోవునందు, గురువునందు నన్ను దర్శించి నాపూజనొనరింపవలెను. కలశమందుగాని, అష్టదళకమలమందుగాని, చందననిర్మితపాత్రయందుగాని నాపూజనొనరింపవచ్చును. సర్వత్ర పూజాసమయమందు నన్నావాహన మొనరింపవలెను; కాని సాలగ్రామశిలలో జలమందు పూజింపదలచిన నన్నావాహన మొనరింపబనిలేదు. మంత్రానురూపముగ ధ్యానశ్లోకములను పఠించి నన్ను ధ్యాన మొనరించినపిమ్మట ప్రతి షోడ

శోపచారములను క్రమముగ సమర్పించి భక్తిభావముతో మూలమంత్రము ద్వారా నన్ను పూజింపవలెను. నాతోనే ప్రథమావరణమందు శ్రీదాముని, సుదాముని, వసుదాముని, వీరభానుని, శూరభానుని (పంచగోపకుమారులు) పూజింపవలెను. తదనంతరము సునంద నందకుముద సుదర్శను లను పంచపార్ష దులను పూజింపవలెను. లక్ష్మి, సరస్వతి, దుర్గ, రాధ, గంగ, పృథ్వి మొద లగు దేవతలనుగూడ పూజింపవలెను. పిమ్మట గురువును, తులసీదేవిని; శివుని, కార్తికేయుని, వినాయకుని, నవగ్రహములను, దశదిక్పాలకులను, ఆరాధింపవలెను.

శ్లో॥ దేవషట్కం చ సమ్పూజ్య సర్వాదౌ విఘ్నవిఘ్నతః ।
గణేశం చ దినేశం చ వహ్నిం విష్ణుం శివం శివామ్ ॥ 14

శృతౌ వినిర్మితాన్ దేవాన్ మోక్షదాన్ కర్మకృన్తనాన్ ।
గణేశం విఘ్ననాశాయ సూర్యం వ్యాధివినాశనే ॥ 15

వహ్నిం పాప్తినిమిత్తేన శాన్తౌ శుద్ధౌ భవేద్ధ్రువమ్ ।
విష్ణుం మోక్షనిమిత్తేన జ్ఞానదానాయ శఙ్కరమ్ ॥ 16

బుద్ధిముక్తినిమిత్తేన పార్వతీం పూజయేత్సుధీః ।
పుష్పాంజలిత్రయం దత్వా స్వస్తోత్రం కవచం పఠేత్ ॥ 17

సర్వప్రథమమున విఘ్ననివారణకొఱకు గణేశ్వరుని, సూర్యుని, అగ్నిని, విష్ణువును, శివుని, పార్వతిని (ఆఱుగురు దేవతలు) పూజింపవలెను. వేదోక్తులైన యీ యాఱుగురు దేవతలు కర్మబంధములను ఛేదింపగలరు, మోక్షమును ప్రసాదింపగలరు. విఘ్ననాశముకొఱకు గణేశ్వరుని, రోగనివారణముకొఱకు సూర్యుని, అభీష్టసిద్ధికొఱకు, అంతఃకరణశుద్ధికొఱకు అగ్నిదేవుని, మోక్షముకొఱకు విష్ణుదేవుని, జ్ఞానముకొఱకు శివుని, బుద్ధిముక్తులకొఱకు పార్వతీదేవిని విద్వాంసులైన పురుషులు పూజింపవలెను. మూడుపర్యాయములు పుష్పాంజలులు సమర్పించి ఆయాదేవతలను వారివారి స్తోత్రకవచములను పఠించి ఆరాధింపవలెను.

గురువునకు నమస్కరించి పూజించినపిమ్మట దేవతలకు ప్రణామము లర్పింపవలెను. నిత్యకర్మలను పరిపూర్ణమొనరించుకొని దేవపూజనొనరించిన పిమ్మట విద్వాంసుడైన పురుషుడు నిర్లిప్తుడై సుఖపూర్వకముగ యథాప్రాప్త కార్యములను నిర్వర్తించుకొనవలెను. నే నుపదేశించిన యీనిత్యకర్మ వేదప్రణీ

తము, ఈ యాహ్నికాచారము నవలంబించినవారికి నిశ్చయముగ ఆత్మశుద్ధి కలుగును.

బుద్ధిమంతుడైన పురుషుడు, మలమూత్రములను, గుప్తాంగములను, స్త్రీ వివిధాంగములను, కటాక్షాదులను దర్శింపరాదు; ఎందువలెననగా ఇవియన్నియు వినాశమునకు బీజములు, విపత్తులకు కారణములుగదా! దినమందు స్త్రీతో సమాగమమొనరింపరాదు; పగలు స్త్రీ సమాగమ మొనరించిన రోగము లుత్పత్తికాగలవు, నేత్రములందు, కర్ణములందు పీడ ఉద్భవించును. ఆకాశమందొక నక్షత్ర ముదయించు సమయమున ఆనక్షత్రమును వీక్షింపరాదు; వీక్షించినచో రోగభయములు కల్గును, దైవవశమువ ఏకతారను వీక్షించిన దేవతలదర్శనముచే భగవంతునిస్మరణచే నేడుపర్యాయములు నారదనామజపముచే అరిష్టమును నివారణ మొనరించుకొనవచ్చును.

అస్తమించుసమయమున సూర్యచంద్రులను వీక్షింపరాదు. ఆసమయమున వారినిగాంచిన రోగముత్పత్తికాగలదు. కృష్ణపక్షమందు చంద్రోదయ కాలములో అర్థచంద్రుని దర్శింపరాదు; దర్శించినచో రోగములు సంభవింపగలవు. జలములో సూర్యచంద్రుల ప్రతిబింబములను అవలోకించిన మనుష్యులకు శోకము కలుగును, కావున జలములందు సూర్యచంద్రప్రతిబింబముల నవలోకింపవలదు. ఇతరుల మైథునకార్యమును వీక్షించిన సహోదరవియోగము సంభవించును. కావున వీక్షింపరాదు.

శ్లో॥ ఏకత్రశయనస్థానం భోజనం చ గతిం తథా ।
న కుర్యాత్ పాపినా సార్థం సర్వం నాశస్య లక్షణమ్ ॥ 26
ఆలాపాద్గాత్రసంస్పర్శాచ్ఛయనాశ్రయభోజనాత్ ।
సంచరన్తి ధ్రువం పాపాస్తైలబిన్దురివామ్భసా ॥ 27

పాపాత్మునితో నొకప్రదేశమున శయనించుట, ఆసీనులగుట, భుజించుట, భ్రమించుట నిషిద్ధము; ఆకర్మాచరణము లన్నియు నాశనమునకు లక్షణములు, తైలబిందువు జలములో బడి వ్యాపించునట్లు పాపాత్మునితో సంభాషించిన, స్పృశించిన, శయనించిన, ఆసీనులైన, భుజించిన వానిపాపములు రెండవవానికి అవశ్యముగ సంభవింపగలవు.

క్రూరజంతుసమీపగమనము దుఃఖములకు కారణము. దుష్టునితో స్నేహము శోకప్రదము; బ్రాహ్మణులను, గోవులను, విశేషముగ వైష్ణవులను

హింసింపరాదు; అట్టిహింస సర్వనాశనమునకు కారణము కాగలదు. దేవతల, దేవపూజకుల, బ్రాహ్మణుల, వైష్ణవుల ధనాపహరణము సర్వనాశనమునకు హేతువుకాగలదు. దాన మొనరించిన బ్రాహ్మణవృత్తిని అపహరించు వారు అఱువదివేల సంవత్సరములు కీటకములై దుఃఖింపగలరు. పురోహితునకు దాన మొనరించుటకు సంకల్పించిన దక్షిణ తక్షణమే ఇచ్చివేయవలెను, లేనిచో ఒక రాత్రిగడిచిన అది రెండింతలు, ఒకమాసము గడిచిన నూరింతలు, రెండు మాసములు గడచిన వేయిరెట్లు కాగలదు. సద్బ్రాహ్మణులను హింసించిన అవశ్యము వంశహాని గలుగును. అట్టి క్రూరుడైన మనుష్యుడు దరిద్రుడు కాగలడు. దేవతలను గాంచి, బ్రాహ్మణులను గాంచి తలవంచని మనుష్యుడు శోకమును పొందగలడు, గురునియెడల భక్తిభావముంచని వారు రౌరవాది నరకము లనుభవింపగలరు.

దురాచారిణీ! మూఢురాలైన స్త్రీమాత్రమే శ్రీహరిస్వరూపుడైన తన భర్తను ఆదరింపదు సరికదా కఠిన వచనములతో వానిని బాధించును, అట్టిస్త్రీ కుంభీపాక నరకమును బొందగలదు. వాణిద్వారా భర్తను నిందించిన స్త్రీ కాకము కాగలదు. భర్తను హింసించినస్త్రీ సూకరము కాగలదు. భర్తపై క్రోధము వహించినస్త్రీ సర్పిణి కాగలదు. భర్తయెదుట దర్పమును ప్రదర్శించిన స్త్రీ గర్ధభికాగలదు, కువాక్యములను పల్కు స్త్రీ కుక్కురి కాగలదు. విష ప్రయోగ మొనరించు స్త్రీ అంధురాలు కాగలదు. పతివ్రత యైనస్త్రీ నిశ్చయముగ భర్తతో సహా వైకుంఠమునకు వెడలగలదు.

శ్లో॥ శివం దుర్గాం గణపతిం సూర్యం విప్రం చ వైష్ణవమ్ ॥
విష్ణుం నిన్దన్తి యో మూఢో స మహారౌరవం వ్రజేత్। 46
పితరం మాతరం పుత్రం సతీం భార్యాం గురుం తథా ॥
అనాథాం భగినీం కన్యాం వినిన్ద్య నరకం వ్రజేత్। 47
విప్రభక్తి విహీనాశ్చ క్షత్రవిట్ శూద్రయోనిజః ॥
హరి భక్తివిహీనాశ్చ పచ్యన్తే నరకే ధ్రువమ్। 48
పతిభక్తి విహీనాశ్చ యువత్యశ్చ నరాధమాః ॥ 49

శివుని, పార్వతిని, గణేశ్వరుని, సూర్యుని, బ్రాహ్మణుని, వైష్ణవుని, ష్ణుదేవుని నిందించువాడు మహారౌరవనరక మనుభవింపగలడు. తల్లిని, తండ్రిని, త్రుని, సాధ్వి యగు పత్నిని, గురువును, అనాధస్త్రీని, సహోదరిని, పుత్రికను దించిన మనుష్యుడు నరకగామి కాగలడు. భగవద్భక్తి రహితుడై వైశ్య

శూద్ర బ్రాహ్మణులందు భక్తిభావములేక వర్తించు క్షత్రియు డవశ్యముగ నరకమనుభవింపగలడు. ఈధర్మ మన్యవర్ణముల వారికి వర్తించును. ఆదశయే పతిభక్తిశూన్యయైన, నరాధముకాలైన స్త్రీకి కూడ సంభవింపగలదు.

సాలగ్రామచరణామృతమును పానమొనరించుచు విష్ణుప్రసాదమును నిత్యము భుజించుచుండువారు తీర్థములనే పవిత్రమొనరింపగలరు. ఆసత్పురు షులు తమ పూర్వాంతరములవారిని తరింపజేసి పృథ్విని సహిత ముద్ధరింపగలరు. ఏకాదశినాడు భుజింపక విష్ణుప్రసాదమును భుజించువారు నిశ్చయముగ అడుగడు గున అశ్వమేధయజ్ఞఫలమును పొందగలరు. ఏకాదశి, శ్రీకృష్ణజన్మాష్టమి వ్రతములను పాటించువారు తమనూఱుజన్మల పాపములనుండి విముక్తులు కాగలరు. ఇం దేమాత్రము సంశయము లేదు. వారు తమ బాల్యావస్థయందు, కౌమారావస్థయందు, యువావస్థయందు, వృద్ధావస్థయందు నొనరించిన పాపము లన్నింటినుండి ముక్తులు కాగలరు. రోగపీడితులైనవారికి, వృద్ధులకు, బాలకు లకు వ్రతసమయమున ఉపవాసనియమము వర్తింపదు. అట్టివారు బ్రాహ్మణు లకు భోజనము పెట్టిన ఉపవాసఫలమును పొందగలరు. ఉపవాసముచేయుటకు సమ ర్థులైనను శివరాత్రి, శ్రీరామనవమి, ఏకాదశి, జన్మాష్టమీాదినములయందు భుజించువారు మహారౌరవనరకమును పొందగలరు. అమావాస్య, పూర్ణిమ, సంక్రాంతి, అష్టమీాదినములయందు స్త్రీని, తైలమును, మాంసమును సేవించిన మనుష్యుడు చండాలజన్మను బొందగలడు. తన జీవితములో నల్వురు పురుషు లతో రమించు స్త్రీని వేశ్యగ భావింపవలెను. అట్టిస్త్రీ దేవతలకు, పితరులకు పూజాదులను నిర్వర్తించుటకు అధికారిణి కాదు.

ప్రాతఃకాల సంధ్యాకాలములయందు సంధ్యోపాసనచేయనివారి ద్విజో చితకర్మలన్నింటిని బహిష్కరింపవలెను. సంధ్యాహీనుడైన ద్విజుడు అప విత్రుడై సమస్తకర్మల కయోగ్యుడు కాగలడు. అతడు దినమం దొనరించిన సమస్తకర్మలు నిష్ఫలములు కాగలవు. రామమంత్రహీనుడైన బ్రాహ్మ ణుడు నరకగామి కాగలడు. నదిమధ్యంలో, వృక్షమూలములో, మంచినీటిసమీాప మున. దేవాలయసమీాపమున, పంటతో నిండియున్నభూమిపై మలమును విడువ రాదు.

దీపమును. శివలింగమును, సాలగ్రామమును, మణిని, దేవప్రతిమను, పుష్పమాలికను. సువర్ణమును, శంఖమును, భూమిపై నుంచరాదు. పగలు,

రెండుసంధ్యలందు నిద్రించువారు, స్త్రీసహవాస మొనరించుపురుషుడు అనేక జన్మలవఱకు రోగియై దరిద్రుడు కాగలడు.

శ్లో॥ మృద్భస్మగోశకృత్పిష్టైస్తథా వాలుకయాపి వా ।
కృత్వా లిఙ్గం సకృత్పూజ్య వసేత్ కల్పశతం దివి ॥ 82
సహస్రపూజనాత్ సోఽపి లభతే వాంఛితం ఫలమ్ ।
లక్షం చ పూజయేద్యస్తు శివత్వం లభతే ధ్రువమ్ ॥ 83
జీవన్ముక్తో భవేద్విప్రో లిఙ్గమభ్యర్చయేత్తు యః ।
శివపూజావిహీనాశ్చ బ్రాహ్మణో నరకం వ్రజేత్ ॥ 84
మత్పూజితం ప్రియతమం శివం నిన్దన్తి యే నరాః ।
పచ్యన్తే నిరయే తావద్యావద్వై బ్రహ్మణః శతమ్ ॥ 85

మట్టితో, భస్మముతో, గోమయముతో, పిండముతో, ఇసుకతో, శివలింగముచేసి పూజించుపురుషుడు నూఱుకల్పముల పర్యంతము స్వర్గమందు నివసింపగలడు. సహస్రలింగములను పూజించినమనుష్యుడు మనోవాంఛితఫలమును పొందగలడు. ఒక లక్ష శివలింగములను పూజించిన భక్తుడు శివత్వమును బొందగలడు. శివలింగపూజచేయు బ్రాహ్మణుడు జీవన్ముక్తుడు కాగలడు. శివపూజారహితు డైన బ్రాహ్మణుడు నరకగామికాగలడు. నాచే పూజింపబడు నాప్రియతము డైన శివుని నిందించువాడు నూఱ్ఱుబ్రహ్మల ఆయుఃపర్యంతము నరకయాతనల ననుభవింపగలడు.

శ్లో॥ సర్వేషు ప్రియమాత్రేషు బ్రాహ్మణశ్చ మమ ప్రియః ।
బ్రాహ్మణాచ్చ ప్రియా లక్ష్మీ సతతం వక్షసి స్థితా ॥ 88
తతోఽధికా ప్రియా రాధా ప్రియా భక్తాస్తతోఽధికాః ।
తతోఽధికః శఙ్కరో మే నాస్తి మే శఙ్కరాత్ ప్రియః ॥ 89
మహాదేవ మహాదేవ మహాదేవేతి వాదినః ।
పశ్చాద్యామి చ సన్త్రస్తో నామశ్రవణలోభతః ॥ 90
మనో మే భక్తమూలే చ ప్రాణా రాధాత్మికా ధ్రువమ్ ।
ఆత్మా మే శఙ్కరస్థానాం శివః ప్రాణాధికశ్చ మే ॥ 91
ఆద్యా నారాయణీ శక్తిః సృష్టిస్థిత్యన్తకారిణీ ।
కరోమి చ యయా సృష్టిం మయా బ్రహ్మాదిదేవతాః ॥ 92
యయా జయతి విశ్వం చ యయా సృష్టిః ప్రజాయతే ।
యయా వినా జగన్నాస్తి మయా దత్తా శివాయ సా ॥ 93

సర్వులయందు నాకు ప్రియులైనవారియందు బ్రహ్మ నాకు ప్రేమపాత్రుడు. బ్రహ్మకంటె నాకు ప్రేమపాత్రురాలైన లక్ష్మి సదా నా వక్షఃస్థలమునందే నివసించును. లక్ష్మికంటె రాధ నాకత్యంతప్రియురాలు, రాధకంటె నాకు నా యనన్యభక్తు లత్యంతప్రియులు. భక్తులకంటె భక్తాగ్రగణ్యుడైన శివుడు నాకత్యంతప్రియుడు. శంకరునికంటె మించినప్రేమపాత్రులు నాకు మరియొకరు లేరు. మహాదేవ, మహాదేవ, మహాదేవయనుచు జపించుపురుషుని శివనామశ్రవణలోభినై నేను సదా అనుసరింతును. శివనామ మాలకించిన నాకత్యంతతృప్తి కల్గును. నామనస్సు సదా భక్తుని చెంతయుండును. ప్రాణులు రాధామయము, ఆత్మయే శంకరుడు. శంకరుడు నాకు ప్రాణములకంటె నధికప్రియుడు. సృష్టిపాలనసంహార మొనరించుశక్తి ఆదినారాయణిశక్తి. ఆమె ద్వారానే బ్రహ్మాదిదేవతాములను ఈ సకలచరాచరసృష్టిని నిర్మింపగల్గుచున్నారు. ఏదేవిని ఆశ్రయించిన జగమునకు విజయము లభించునో, ఏదేవి వలన సృష్టిసంభవించునో, ఏదేవి లేనిచో సంసారములయస్తిత్వమే లేదో ఆయాద్యాదిశక్తిని నేను శివున కర్పించితిని.

శ్లో॥ దయా నిద్రా చ క్షుత్తృప్తి స్తృష్ణా శ్రద్ధా క్షమా ధృతిః ।
తుష్టిః పుష్టి స్తథా శా న్తిర్లజ్జాధిదేవతా హి సా ॥ 95

వైకుణ్ఠే సా మహాలక్ష్మీ ర్గోలోకే రాధికా సతీ ।
మర్త్యే లక్ష్మీశ్చ క్షీరోదే దక్షకన్యా సతీ చ సా ॥ 95

సా దుర్గా మేనకా కన్యా దైన్యదుర్గతినాశినీ ।
స్వర్గలక్ష్మీశ్చ దుర్గా సా శక్రాదీనాం గృహే గృహే 96

సా వాణీ సా చ సావిత్రీ విద్యాధిష్ఠాతృదేవతా ।
వహ్నౌ సా దాహికా శక్తిః ప్రభాశక్తిశ్చ భాస్కరే ॥ 97

ఆమెయే నిద్ర, దయ, క్షుత్పిపాసలు, తృష్ణ, శ్రద్ధ, క్షమ, ధృతి, తుష్టి, పుష్టి, శాంతి, లజ్జ మొదలగు శక్తుల కధిదేవత. ఆశక్తియే వైకుంఠములో మహాలక్ష్మి, గోలోకములో రాధిక, మర్త్యలోకములో మర్త్యలక్ష్మి, క్షీరసాగరమం దుదయించిన శ్రీమహాలక్ష్మి, ఆమెయే దక్షకన్యక యైన సతీదేవి. ఆమెయే మేనకకన్యక, దైన్యదుర్గతివినాశని యైన దుర్గాదేవి, స్వర్గమునం దాదుర్గయే ఇంద్రాదులకు స్వర్గలక్ష్మి, ప్రతిగృహమునందు గృహలక్ష్మి. ఆమెయే వాణి, ఆమెయే సకలవిద్యాధిష్ఠాతృదేవత యైన సావిత్రి, ఆమెయే అగ్నియందు దాహికాశక్తి, భాస్కరునందు ప్రభాశక్తి.

శ్లో॥ శోభాశక్తిః పూర్ణచన్ద్రే జలే శక్తిశ్చ శీతతా ।
సస్యప్రసూతా శక్తిశ్చ ధారణా చ ధరాసు సా ॥ 98
బ్రాహ్మణశక్తిర్విప్రేషు దేవశక్తిః సురేషు సా ।
తపస్వినాం తపస్యా సా గృహిణాం గృహదేవతా ॥ 99
ముక్తిశక్తిశ్చ ముక్తానా మాశా సాంసారికస్య సా ।
మద్భక్తానాం భక్తిశక్తిర్మయి భక్తిప్రదా సదా ॥ 100
నృపాణాం రాజ్యలక్ష్మీశ్చ వణీజాం లభ్యరూపిణీ ।
పారే సంసారసిన్ధూనాం త్రయీ తత్త్వావతారిణీ ॥ 101
తత్సు సద్బుద్ధిరూపా సా మేధాశక్తిస్వరూపిణీ ।
వ్యాఖ్యాశక్తిః శ్రుతా శాస్త్రే దాతృశక్తిశ్చ దాతృషు ॥ 102
క్షత్రాదీనాం విప్రభక్తిః పతిభక్తి సతీషు చ ।
ఏవం రూపా చ యా శక్తిర్మయా దత్తా శివాయ సా ॥ 103

ఆమెయే పూర్ణచంద్రునియందు శోభాశక్తి, జలములందు శీతలశక్తి, భూమియందు సస్యమును పండించుశక్తి, విప్రులందు బ్రాహ్మణశక్తి, సురలందు దేవశక్తి, తాపసులందు తపోశక్తి. గృహవాసుల కామెయే గృహదేవత. ముక్తిని కాంక్షించు ముముక్షువుల కామె ముక్తిశక్తి, సాంసారికులకు ఆశాశక్తి. మద్భక్తులందు భక్తిశక్తిస్వరూపిణియై సదా భక్తిని ఆమెయే ప్రసాదించును. ఆయాద్యాశక్తి నరేశ్వరులకు రాజ్యలక్ష్మి, వణిజులకు లాభస్వరూపిణి, సంసారసాగరమునుండి జీవులను తరింపజేయగల తత్త్వావతారరూపిణి. దేహధారులకు సద్బుద్ధిస్వరూపిణి. ఆమెయే జీవులకు మేధాశక్తిస్వరూపిణి, ఆశక్తియే శ్రోతలందు వ్యాఖ్యాశక్తి, దాతలందు దాతృశక్తి, ఆమెయే క్షత్రియులందు విప్రభక్తి, సతీసాధ్వులందు పతిభక్తి. ఈ సకలశక్తిస్వరూపిణిని నేను శివునియనన్యభక్తికియనుగ్రహించి ఆయనకు ప్రసాదించితిని. తండ్రీ! ఇట్లు నీకు పరమాధ్యాత్మికజ్ఞానమును బోధించితిని. నీవింకే విషయములను శ్రవణ మొనరింపగోరుచున్నావో ప్రశ్నింపుము. నీప్రశ్న లన్నింటికి సవిస్తరముగ సమాధానముల నిచ్చెదను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో ఆహ్నికకృత్యముల
వర్ణన మను డెబ్బదియైదవ అధ్యాయము
సంపూర్ణము

# డెబ్బదియారవ అధ్యాయము

## -: శుభాశుభ దర్శన ఫల వర్ణనము :-

శ్రీ నారదుడు పలికెను:

సర్వేశ్వరా! ఎవరిని దర్శించిన పుణ్యము ప్రాప్తించునో, ఎవరెవరిని దర్శించిన పాపము కల్గునో వారందఱి పరిచయము నొసంగుము. ఈ విషయములను శ్రవణమొనరించుటకు నామనము అత్యంత కుతూహాల మగుచున్నది.

శ్రీ శ్రీకృష్ణుడు పలికెను:

నారదా! ఉత్తమ బ్రాహ్మణుని, తీర్థములను, అనన్యవైష్ణవుని, దేవప్రతిమను, సూర్యదేవుని, సాధ్వీస్త్రీని, నిష్కళంక సన్యాసిని, యతీశ్వరుని, బ్రహ్మచారిని, గోమాతను, అగ్నిని, గురుదేవుని, గజరాజును, సింహమును, శ్వేతాశ్వమును, శుకమును, కోకిలను, ఖంజరీటమును, హంసను, మయూరమును, నీలకంఠమృగమును, శంఖపక్షిని, వత్ససహిత గోవును, అశ్వత్థవృక్షమును, పతివ్రతసంపన్న నారీమణిని, తీర్థయాత్ర చేయు మనుష్యుని, ప్రదీపమును, సువర్ణమును, మణిని, ముత్యములను, వజ్రమును, మాణిక్యములను, తులసీవృక్షమును, తులసీపత్రములను, శ్వేతపుష్పమును, ఫలములను, శ్వేతధాన్యమును, ఘృతమును, దధిని, మధువును, జలభరిత ఘటమును, (పూర్ణకుంభము) దర్పణమును, జలములను, శ్వేతపుష్పమాలను, గోరోచనమును, కర్పూరమును, రజతమును, జలాశయమును, పుష్పభరితవనమును, శుక్లపక్షచంద్రుని, అమృతమును, చందనమును, కస్తూరిని, కుంకుమను, ధ్వజమును, అక్షయవటవృక్షమును, దేవవృక్షమును, దేవాలయమును, దేవజలాశయమును, దేవాశ్రిత భక్తుని, దేవఘటమును, శంఖమును, దుందుభిని, స్ఫటికమణిని, కుశమూలకమును, గంగ మృత్తికను, కుశలను, రాగిని, పురాణపుస్తకమును, శుద్ధబీజమంత్ర సహిత విష్ణుయంత్రమును, స్నిగ్ధ దూర్వాక్షతలను, రత్నమును, తపస్విని, సిద్ధమంత్రమును, సముద్రమును, కృష్ణసారమృగమును, సుగంధిత పవనమును, యజ్ఞమును, పవిత్రోత్సవమును, గోమూత్రమును, గోదుగ్ధమును, గోమయమును, గోధూళిని, గోశాలను, గోఖురమును, పండియున్న పొలములను, పద్మినీ స్త్రీని, శ్యామలవర్ణమును, సుందరవేషమును, సుందరవస్త్రములను, దివ్యవస్త్రాభరణ భూషిత యైన స్త్రీని, క్షేమంకరిని, గంధమును, దూర్వాక్షత

తండులములను, సిద్ధాన్నమును, పరమాన్నమును దర్శించిన పుణ్యము లభింపగలదు.

కార్తీకపూర్ణిమా దినమున రాధాదేవి శుభప్రతిమను పూజించుట, దర్శించుట, ఆవిగ్రహమునకు వందనముల నమర్పించుట, మనుష్యుని జన్మ జన్మల బంధములనుండి ముక్తునిగ నొనరింపగలదు. అట్లే ఆశ్వయుజమాసమున శుక్లపక్షాష్టమినాడు హింగుళమందు శ్రీదుర్గాదేవి ప్రతిమను దర్శించిన మానవుడు తనజన్మలను ఖండన మొనరించుకొనగలడు.

శ్లో॥ కార్తికే పూర్ణిమాయాం చ రాధికాప్రతిమాం శుభామ్ ।
సమ్పూజ్య దృష్ట్వా నత్వా చ కరోతి జన్మఖణ్డనమ్ ॥ 20

కార్తీకపౌర్ణమిాదినమున శ్రీరాధాదేవి శుభప్రతిమను పూజించిన, లేదా దర్శించిన వందనము లర్పించిన మనుష్యుడు తన జన్మజన్మల బంధనముల నుండి ముక్తుడు కాగలడు.

శ్లో॥ హిఙ్గులాయాం తథాష్టమ్యామిషే మాసి సితే శుభే ।
శ్రీదుర్గాప్రతిమాం దృష్ట్వా కరోతి జన్మ ఖణ్డనమ్ ॥ 21

ఆశ్వయుజమాసములో శుక్లపక్షాష్టమీతిథినాడు హింగులమందు శ్రీదుర్గాదేవి శ్రీవిగ్రహమును దర్శించిన మానవులను జన్మలనుండి విముక్తి లభింపగలదు.

శ్లో॥ శివరాత్రౌ చ కాశ్యాం చ విశ్వనాథస్య దర్శనమ్ ।
కృత్వోపవాసం పూజనం చ కరోతి జన్మఖణ్డనమ్ ॥ 22

శివరాత్రినాడు కాశీపురిలో విశ్వనాథుని దర్శించి, యీపవిత్రదినమున ఉపవసించి, వానిని పూజించిన మానవుడు జననమరణ చక్రమునుండి విముక్తుడు కాగలడు.

శ్లో॥ జన్మాష్టమీ దినే భక్త్యా దృష్ట్వా హరిం విష్ణుం సనాతనమ్ ।
ప్రణమ్య పూజాం కృత్వా చ కరోతి జన్మఖణ్డనమ్ ॥ 23

జన్మాష్టమీదినమున భక్తుడు నన్ను విష్ణుస్వరూపుని దర్శించిన, నాకు ప్రణామము లర్పించిన నన్ను పూజించిన జన్మజన్మల బంధనములనుండి విముక్తుడుకాగలడు.

శ్లో॥ పౌషేమాసి శుక్లరాత్రౌ యత్ర యత్ర స్థలే నరః ।
పద్మాయాః ప్రతిమాం దృష్ట్వా కరోతి జన్మఖణ్డనమ్ ॥
సప్తజన్మ భవేత్తస్య పుత్ర పౌత్రః ధనేశ్వరః ॥ 24

పుష్యమాసమందు శుక్లపక్షరాత్రి యెక్కడైనను శ్రీమహాలక్ష్మీ ప్రతిమను దర్శించి ఆరాధించినవారు జన్మరాహిత్యము పొందగలరు. వారి పుత్రులు, పౌత్రులు ఏడుతరములపర్యన్తము ధనేశ్వరులై విరాజిల్లగలరు.

శ్లో॥ ఉపోష్యైకాదశీం స్నాత్వా ప్రభాతే ద్వాదశీదినే ।
దృష్ట్వా కాశ్యామన్నపూర్ణాం కరోతి జన్మఖణ్డనమ్ ॥ 25

కాశీపురిలో ఏకాదశీదినమున ఉపవసించి, ద్వాదశినాటి ప్రాతఃకాలమునసే స్నానమొనరించి అన్నపూర్ణాదేవిని దర్శించిన జన్మరాహిత్యము లభింపగలదు.

శ్లో॥ చైత్రే మాసి చతుర్దశ్యాం కామరూపేషు పుణ్యదే ।
దృష్ట్వా నత్వా భద్రకాళీం కరోతి జన్మఖణ్డనమ్ ॥ 26

చైత్రమాసమందు చతుర్దశినాడు పుణ్యప్రదాయకమగు కామరూపదేశములో భద్రకాళిని దర్శించి ఆరాధించిన జన్మరాహిత్యము లభింపగలదు,

శ్లో॥ అయోధ్యాయాం చ రామం మాం శ్రీరామనవమీదినే ।
సమ్పూజ్య నత్వా దృష్ట్వా చ కరోతి జన్మఖణ్డనమ్ ॥ 27

శ్రీరామనవమి దినమున అయోధ్యాపురిలో శ్రీరామచంద్రుడనైన నన్ను దర్శించిన, పూజించిన నాకు నమస్కరించిన జీవునకు జన్మఖండనము కాగలదు.

శ్లో॥ దత్త్వా విష్ణుపదే పిణ్డం విష్ణుం యశ్చ ప్రపూజయేత్ ।
పితౄణాం స్వాత్మనశ్చైవ కరోతి జన్మఖణ్డనమ్ ॥ 28

గయలోని విష్ణుతీర్థమందు పితృదేవతలకు పిండముల నర్పించి శ్రీమహావిష్ణువునైన నన్ను పూజించువారు జన్మరాహిత్యమును పొందగలరు.

శ్లో॥ ప్రయాగే ముణ్డనం కృత్వా దానం చ కురుతే యది ।
ఉపోష్య నైమిశారణ్యే కరోతి జన్మఖణ్డనమ్ ॥ 29

ప్రయాగలో శిరోముణ్డన మొనరించుకొని, నైమిశారణ్యములో నుపవసించి దానము లొనరించిన మనుష్యుడు పునర్జన్మను నివారించుకొనగలడు.

శ్లో॥ ఉపోష్య పుష్కరే స్నాత్వా కిం వా బదరికాశ్రమే ।
సమ్పూజ్య దృష్ట్వా మామేకం కరోతి జన్మఖణ్డనమ్ ॥

పుష్కరతీర్థమందు, బదరికాశ్రమతీర్థమందు స్నానమొనరించి ఉపవసించి నన్ను పూజించి నాశ్రీవిగ్రహమును దర్శించిన మానవుడు నిశ్చయముగ భవసాగరమును దరింపగలడు.

శ్లో॥ సిద్ధిం కృత్వా చ బదరీం భుక్త్వా బదరికాశ్రమే ।
దృష్ట్వా మత్ప్రతిమాం నన్ద కరోతి జన్మఖణ్డనమ్ ॥ 31

బదరికాశ్రమమందు సిద్ధిబొంది బదరీఫలములను భుజించి నాశ్రీవిగ్రహమును దర్శించువారు జీవన్ముక్తులు కాగలరు.

శ్లో॥ దోలాయామానం గోవిన్దం పుణ్యే బృన్దావనే చ మామ్ ।
దృష్ట్వా సమ్పూజ్య నత్వా చ కరోతి జన్మఖణ్డనమ్ ॥ 32

పవిత్రబృందావనములో ఊయలపై డోలాయమానుడనైయున్న నన్ను గోవిందుని దర్శించి, నమస్కరించి, పూజించువారు జన్మరాహిత్యమును పొందగలరు.

శ్లో॥ భాద్రే దృష్ట్వా చ మంచస్థం మామేవ మధుసూదనమ్ ।
సమ్పూజ్య నత్వా భక్తశ్చ కరోతి జన్మఖణ్డనమ్ ॥ 33

భాద్రపదమాసమందు మంచముపై ఆసీనుడనైయుండు నన్ను మధుసూదనుని ఏభక్తుడైతే దర్శించి, నమస్కరించి, పూజించునో, అతడు నిశ్చయముగ జన్మరాహిత్యమును బొందగలడు.

శ్లో॥ రథస్థం చ జగన్నాథం యో ద్రక్ష్యతి కలౌ నరః ।
సమ్పూజ్య నత్వా భక్త్యా చ కరోతి జన్మఖణ్డనమ్ ॥ 34

కలియుగములో మనుష్యుడు రథయాత్ర సమయమున రథారూఢుడనై విరాజిల్లు నన్ను జగన్నాథుని దర్శించి, భక్తిభావముతో నమస్కరించి, పూజించినచో నిశ్చయముగ జననమరణ నివారణ మొనరించుకొనగలడు.

శ్లో॥ ఉత్తరాయణసంక్రాన్త్యాం ప్రయాగే స్నాన మాచరేత్ ।
సమ్పూజ్య నత్వా మామేవ కరోతి జన్మఖణ్డనమ్ ॥ 35

ఉత్తరాయణ కాలములో సంక్రాంతినాడు ప్రయాగలో స్నాన మాచరించి నన్ను వేణీమాధవుని దర్శించి, నమస్కరించి, పూజించినవారు జన్మరాహిత్య మొందగలరు.

శ్లో॥ కార్తీక పూర్ణిమాయాం చ దృష్ట్వా మత్ప్రతిమాం శుభామ్ ।
ఉపోష్య కృత్వా పూజాం చ కరోతి జన్మఖణ్డనమ్ ॥ 36

కార్తీకపౌర్ణమినా డుపవసించి నాశుభప్రతిమను దర్శించి పూజించిన వారు తమ జన్మఖండన మొనరించుకొనగలరు.

శ్లో॥ చన్ద్రభాగాసమీపే చ మాఘ్యాం చ మాం నమేత్ సుధీః ।
రాధయా సహ మాం దృష్ట్వా కరోతి జన్మఖణ్డనమ్ ॥ 37

చంద్రభాగానదీ సమీపమున మాఘమాసములో అమావాస్యా పూర్ణిమ లందు రాధాసహితుడ నైన నన్ను శ్రీకృష్ణుని దర్శించిన, నాకు వందనముల నర్పించిన, నన్ను పూజించిన దేహధారి జన్మరాహిత్యమును బొందగలడు.

శ్లో॥ రామేశ్వరం సేతుబన్ధ ఆషాఢీ పూర్ణిమాదినే ।
ఉపోష్య దృష్ట్వా సమ్పూజ్య కరోతి జన్మఖణ్డమ్ ॥ 38

స్వర్గేవిద్యాధరా రాత్రౌ నృత్యన్తి చ ముహుర్ముహుః ।
ప్రణామం కర్తుమీశం తం సమాయాతి విభీషణః ॥ 39

గాయన్తి కిన్నరా రాత్రౌ గన్ధర్వాశ్చ మనోహరమ్ ।
ప్రణమాం కర్తుమీశం తం సమాయాతి చ మాధవః ॥ 40

దృష్ట్వా సాక్షాద్వసన్తం చ సర్వేశం చన్ద్రశేఖరమ్ ।
జీవన్ముక్తో భవేదన్తే ప్రయాతి హరిమన్దిరమ్ ॥ 41

సేతుబంధ తీర్థమం దాషాఢ పూర్ణిమాదినమున ఉపవాస పూర్వకముగ రామేశ్వరుని దర్శించి, పూజించు సౌభాగ్యమును పొందినవారు తమ పునర్జన్మ లను ఖండించుకొనగలరు. రామేశ్వరమందు రాత్రిసమయమున స్వర్గవిద్యాధరీ కన్యలు వారు నారాధించుచు నృత్యమొనరింతురు. ఈశ్వరునకు ప్రణామము లర్పించుటకు దైత్యేశ్వరు డైన విభీషణుడు రామేశ్వరమునకు అరుదెంచును. నిశీథ సమయమున రామేశ్వరములో గంధర్వులు, కిన్నరలు శివప్రీత్యర్థము మధుర గానముల నొనరింతురు. ఈశ్వరునకు ప్రణామము లర్పించుటకొఱకై స్వయముగ మాధవుడే అరుదెంచును. సాక్షాత్తుగ రామేశ్వరములో విరాజిల్లు చంద్ర శేఖరునిదర్శించి పూజించువారు జీవన్ముక్తులై, అంత్యకాలమందు శ్రీహరి పరంధామము చేరగలరు.

శ్లో॥ దీననాథం దినకరం కోణార్కే చోత్తరాయణే ।
ఉపోష్య దృష్ట్వా సమ్పూజ్య కరోతి జన్మనః క్షయమ్॥ ॥ 42

ఉత్తరాయణ పుణ్యకాలమందు కోణార్కతీర్థములో విరాజిల్లుదీన నాథు డైన సూర్యుని దర్శించి ఉపవాసపూర్వకముగ పూజించువారు తమ పునర్జన్మదుఃఖమునుండి విముక్తులు కాగలరు.

శ్లో॥ కృషికోష్ఠే సువసనే కలవిఙ్కే వసున్ధరే ।
విస్పన్దకే రాజకోష్ఠే నన్దకే పుష్పభద్రకే ॥ 43

పార్వతీ ప్రతిమాం దృష్ట్వా కార్తికేయం గణేశ్వరమ్ ।
నన్దినం శఙ్కరం దృష్ట్వా కరోతి జన్మనఃఫలమ్ ॥ 44

ఉపోష్య ప్రతిసమ్పూజ్య దృష్ట్వా స్తుత్వా చ తౌ నతః ।
పారాణం చ దధి ప్రాశ్య కరోతి జన్మనఃఫలమ్ ॥ 45

కృషిగోష్ఠ సువసన కలవింక యుగంధర విస్పందక రాజకోష్ఠ నందక పుష్పభద్రక తీర్థములందు పార్వతీకార్తికేయ గణేశ్వర నంది శంకరుల శ్రీవిగ్రహములను దర్శించిన మనుష్యులు తన జన్మను సఫలమొనరించుకొనగలరు. ఆప్రదేశములలో నుపవసించి పార్వతీశివులను దర్శించి పూజించి స్తుతించి, దధి నారగించి పారణమొనరించినవారిజన్మ సఫలము కాగలదు.

శ్లో॥ త్రికూటే మణిభద్రే చ పశ్చిమోదధి సన్నిధౌ ।
సముపోష్య దధి ప్రాశ్య మాం దృష్ట్వా ముక్తిమాప్నుయాత్ ॥ 46

త్రికూటముపైన మణిభద్రతీర్థమందు పశ్చిమసముద్ర తటసమీపమున ఉపవాసపూర్వకముగ నన్ను దర్శించి, దధి నారగించి పారణమొనరించువారు మోక్షమునొందగలరు.

శ్లో॥ ప్రతిమాసు మదీయాసు పార్వతీప్రతిమాసు చ ।
జీవం సంన్యస్య సమ్పూజ్య కరోతి జన్మనఃక్షయమ్ ॥ 47

శివదుర్గాలయం దత్త్వా మదీయం చ విశేషతః ।
శివసంస్థాపనం కృత్వా కరోతి జన్మనః క్షయమ్ ॥ 48

నాయొక్క, పార్వతీదేవియొక్క ప్రతిమలందు జీవచైతన్యన్యాస మొనరించి పూజించువారు తమ జన్మలను క్షయమొనరించుకొనగలరు. శివునికొఱకు దుర్గాదేవికొఱకు విశేషముగ నాకొఱకు (శ్రీకృష్ణునికొఱకు) మందిరములను నిర్మించువారు, ఆమందిరములలో శివాది ప్రతిమలను ప్రతిష్ఠించువారు జన్మ రాహిత్య మొందగలరు.

శ్లో॥ పుష్పోద్యానం చ శఙ్ఖం చ సేతుం ఖాతం సరోవరమ్ ।
విప్రసంస్థాపనం కృత్వా కరోతి జన్మనః ఫలమ్ ॥ 49

పుష్పోద్యానములను, శంఖములను, సేతువును, బావులను, సరోవరములను, నిర్మించి బ్రాహ్మణులకు స్థానమును, వృత్తిని దానమొనరించువారిజన్మ సఫలముకాగలదు.

తండ్రీ! బ్రాహ్మణునకు జీవికను (బ్రతుకుతెఱువును) ప్రసాదించిన లభించుఫలమును వేదపురాణములైనను, మహాత్ములైనను, దేవతలైనను ఎఱుగజాలరు. భూమిపై ధూళికణములను గుణింపవచ్చును, వర్ష బిందువులను లెక్కింపవచ్చును; కాని బ్రాహ్మణునకు జీవికను, స్థానమును బ్రసాదించిన లభించు పుణ్యఫలమును గుణించుట విధాతకైనను అసాధ్యమే. బ్రాహ్మణునకు జీవికను బ్రసాదించి మనుష్యుడు జీవన్ముక్తుడు కాగలడు, సుస్థిరసంపత్తియుక్తుడు కాగలడు, పరలోకమందు నాల్గుమోక్షములకు నధికారికాగలడు. అట్టి పుణ్యాత్ముడు నాదాస్యభక్తిని పొంది చిరకాలము వైకుంఠములో సుఖింపగలడు. పరమాత్మనైన నావలె ఆభక్తుడు పతనమొందడు. ఉత్తముడైన, అనాథుడైన, పండితుడైన బ్రాహ్మణకుమారునకు వివాహమొనరించువారికి నిశ్చయముగ మోక్షము లభించును. ఛత్రమును, పాదుకలును, సాలగ్రామమును, కన్యనుదానముచేయుటచే గలుగు ఫలము,పృథ్వీదానఫలముతో సమానమగును. గజరాజును దానమొనరించిన, గజరాజశరీరమం దెన్నిరోమములుకలవో, యన్నిసంవత్సరములు స్వర్గమున నుండు నని శాస్త్రములందు ప్రసిద్ధము. శ్వేతాశ్వదానము గజదానపుణ్యమందు సగము. అన్యాశ్వములదానము శ్వేతాశ్వదానఫలమందు సగము. కపిలగోవును దానమొనరించుట గజరాజదానముతో సమానము. ధేనువును దానమొనరించినను అంతఫలమే లభింపగలదు. సామాన్యగోదానము ధేనుదానమందు సగ మని చెప్పబడెను. గోవత్స సహితముగ గోదాన మొనరించిన భూదానఫలము లభించును. బ్రాహ్మణునకు భోజనము నొసంగిన సంపూర్ణ దానఫలము లభింపగలదు.

శ్లో॥ అన్నదానాత్ పరం దానం న భూతం న భవిష్యతి ॥ 64

నాత్ర పాత్రపరీక్షా స్యా న కాలనియమః క్వచిత్ ।
అన్నదానే శుభం పుణ్యం దాతుః పాత్రం త్వపాతకీ ॥ 65

అన్నదానం చ ధన్యం స్యాద్ద్రిమా వైకుణ్ఠహేతుకమ్ । 65 1/2

అన్నదానమును మించినమఱియొక దానములేదు, ఉండదు, ఉండబోదు. అన్నదాన మొనరించుసమయమున పాత్రాపాత్రపరీక్ష అవసరము లేదు. అన్నదానమును పొందుటకు అందఱును అధికారులే. అన్నదాన మొనరించుటకు దేశకాలనియమాదులు లేవు, ఆకలిగొన్నవారికి సదా అన్నదాన మొనరింపవచ్చును. అన్నదానమువలన దాతకు సతతము పుణ్యము లభించును.

అన్నదానమును గ్రహించువ్యక్తికి గూడ ప్రతిగ్రహదోషము సంభవింపదు. భూతలమునపై అన్నదానము ధన్యము, ఆయన్నదానమే వైకుంఠప్రాప్తికి హేతువు; దరిద్రుడైన, కుటుంబయుక్తుడైన విప్రునకు వస్త్రదాన మొనరించిన యావస్త్రములో నెన్నిసూత్రము లుండునో అన్నిసంవత్సరములు దాత వైకుంఠమందు, సురమ్యాచంద్రలోకమందు, వరుణలోకమందు సుఖింపగలడు. లోహపాత్రమిదలో సువర్ణమయమైనవత్తి నుంచి శ్రీహరిప్రీత్యర్థము ఘృత సహితదీపదాన మొనరించువారు నాదివ్యధామమును జేరగలరు. ఆసనమును దాన మొనరించిన స్వర్గసౌఖ్యములు పొందగలరు. తాంబూలదాన మొనరించిన నూఱువర్షములు స్వర్గభోగము లనుభవింపగలరు. మాల్యదానము లొనరించిన, ఫలములను దాన మొనరించిన నిశ్చయముగ స్వర్గముపొందగలరు. సామాన్య శయ్యను దాన మొనరించిన నూఱు సంవత్సరములు స్వర్గసౌఖ్యము లనుభవింప గలరు. గృహమును దాన మొనరించిన, అన్నదాన మొనరించిన అఖండశుభము కలుగగలదు. ఈదానములన్నింటివలన దీర్ఘకాలము శ్రేష్ఠలోక ప్రాప్తికలుగును ఈదానములను నిష్కామభావముచే అనుష్ఠాన మొనరించిన దేహధారికి నిశ్చయముగ భగవత్ప్రాప్తియగును. వ్రజరాజా! నీవు హృదయదౌర్బల్య మును వీడి ప్రసన్నుడవై వ్రజభూమికి మఱలిపొమ్ము. వ్రజములో అఖండాన్న దాన మొనరించి చరితార్థుడవుకమ్ము. తండ్రీ! ఇట్లు నేను శుభదర్శనఫలములను, పుణ్యవర్ధకదానములను వర్ణించితిని, నీచులైనవారికి దీనిని జెప్పరాదు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మఖండములో శుభాశుభ దర్శనఫల
వర్ణన మను డెబ్బదిఆఱవ అధ్యాయము
సంపూర్ణము

---

# డెబ్బదియేడవ అధ్యాయము
## సుస్వప్న దర్శన ఫలము

నందుడు పలికెను :-

ప్రభూ! ఏ యేస్వప్నములవలన నెట్టిపుణ్యము లభించునో, ఏ యేస్వప్న ములవలన మోక్షమునకు, సుఖమునకు సూచన లభించునో, ఏ యేస్వప్నములు శుభకరములో ఆయాస్వప్నములను వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ కృష్ణుడు పలికెను :-

తండ్రీ! వేదములయందు సామవేదము సమస్తకర్మలకు శ్రేష్ఠమని శ్రుతి వచనము, కాణ్వశాఖలో మనోహరపుణ్యఖండములో గూడ నీవిషయవర్ణ నము కలదు. దుఃస్వప్నములు, పుణ్యఫలప్రదాయకము లైనసుస్వప్నములు కాణ్వశాఖయందు వర్ణింపబడినట్లే ప్రవచించెద నవధరింపుము. ఈ స్వప్నా ధ్యాయ మధికపుణ్యప్రదము. కావున సావధానుడ వై శ్రవణమొనరింపుము. ఈ అధ్యాయశ్రవణమువలన మానవునకు గంగాస్నానఫలము లభించును.

రాత్రిమొదటిజాములో గాంచినస్వప్నములు ఒకసంవత్సరకాలములో ఫలింపగలవు. రెండవజాములో గాంచినస్వప్నములు ఎనిమిదిమాసములలోను, మూడవజాములో గాంచినస్వప్నములు మూడుమాసములలోను, నాల్గవ జాములో గాంచినస్వప్నములు ఒకపక్షముదినములలోను ఫలింపగలవు. అరుణో దయసమయమందు గాంచినస్వప్నములు పదిదినములలో ఫలింపగలవు. ప్రాతః కాలమున స్వప్నమును గాంచినవెంటనే నిద్రమేల్కాంచిన ఆస్వప్నములు తత్కాలమే ఫలములను ప్రసాదింపగలవు. పగలు మనములో ప్రగాఢముగ జేసినయాలోచనలు అవశ్యము స్వప్నములందు లక్షితములు కాగలవు. తండ్రీ! మనోవ్యథతో లేదా రోగములతో పీడింపబడువ్యక్తులు గాంచినస్వప్నములు నిస్సందేహముగ నిష్ఫలములే. జడతుల్యు డైనవాడు, మలమూత్రవేగముచే బీడితుడైనవాడు, భయముచే వ్యాకులు డైనవాడు, నగ్నముగ నిద్రించు వాడు, ముక్తకేశు డైనవాడు గాంచినస్వప్నము లేఫలములను ప్రసాదింపవు. నిద్రాళు డైనమనుష్యుడు స్వప్నమును గాంచి మఱల నిద్రించిన లేదా మూఢుడై ఆసమయముననే మఱియొకరికి తాను గాంచినస్వప్నమును వర్ణించిన ఆస్వప్నములు ఫలములను ప్రసాదింపవు. నీచపురుషునితోగాని, శత్రువుతో

గాని, మూర్ఖునితోగాని, స్త్రీతోగాని లేదా రాత్రిసమయముననే మఱియెవరి తోనైన స్వప్నవిషయములను బహిర్గతమొనరించిన మనుష్యునకు విపత్తు, దుర్గతి, రోగభయకలహములు, ధనహాని, చోరభయము మొదలగునవి సంభవింపగలవు.

వ్రజేశ్వరా! స్వప్నములో గోవును, గజమును, అశ్వమును, ప్రాసాద మును, పర్వతమును గాంచిన లేదా వృక్షములపై నధిరోహించినట్లు, భుజించి నట్లు, రోదించినట్లు గాంచిన ధనప్రదమనబడెను. హస్తములలో వీణను ధరించి గానమొనరించినట్లు, సస్యభరితభూమిని దర్శించిన భూప్రాప్తికి సూచకము లని భావింపవలెను. స్వప్నములో శరీర మస్త్రశస్త్రములచే గాయము లైనట్లు ఆగాయముల నుండి రక్తము ప్రవహించినట్లు గాంచిన ధనప్రాప్తిసూచకము లని తెలిసికొనవలెను. స్వప్నములో నగమ్యయైనస్త్రీతో సమాగమము భార్యాప్రాప్తికి సూచన. స్వప్నములో మూత్రసిక్తులైనట్లు, వీర్యపాతమొన రించినట్లు, నరకప్రవేశమొనరించినట్లు, నగరమునుగాని, లేదా అరుణసముద్రము నందుగాని ప్రవేశించినట్లు, అమృతమును పానమొనరించినట్లు దర్శించినవారు నిద్రమేల్కాంచగనే శుభసమాచార మాకర్ణింపగలరు. వారికి ప్రచురధనము లభింపగలదు. స్వప్నములో గజమును, రాజును, సువర్ణమును, వృషభమును, ధేనువును, దీపమును, అన్నమును, ఫలమును, పుష్పములను, కన్యను, ఛత్రమును, ధ్వజమును, రథమును గాంచినమనుష్యులు కీర్తినివిపులసంపత్తిని పొందగలడు. పూర్ణకుంభమును, బ్రాహ్మణుని, అగ్నిని, పుష్పములను, తాంబూలమును, మందిరమును, శ్వేతధాన్యమును, నటుని, నర్తకిని, స్వప్నము నందు దర్శించిన లక్ష్మీప్రాప్తియగును. గోదుగ్ధములను, ఘృతమును దర్శించి నను సంపద గలుగును. స్వప్నములో కమలపత్రముపై పరమాన్నమును, ఘృత మును, క్షీరములను, దధిని, మధువును, మిష్టాన్నమును భుజించినట్లు దర్శించిన మనుష్యుడు భవిష్యత్తులో నవశ్య మున్నతాధికారి కాగలడు. ఛత్రమును, పాదుకలను, తీవ్రఖడ్గమును పొందినట్లు స్వప్నమువచ్చిన ధాన్యలాభ సూచక మని గ్రహింపవలెను. లీలాపూర్వకముగ జలములో నీదినట్లు స్వప్నముగాంచిన వాడు భవిష్యత్తులో మంత్రిపదవి నలంకరింపగలడు. ఫలభరిత మైన వృక్షము సర్పము ధనప్రాప్తి సూచకము. స్వప్నములో సూర్యుని లేదా చంద్రుని దర్శించిన రోగములనుండి విముక్తి లభింపగలదు.

ఆడ గుజ్జమును, కుక్కుటమును, క్రౌంచమును స్వప్నమున గాంచిన భార్యా లాభము గలుగును. స్వప్నములో తమ పాదములు సంకెళ్ళతో బంధింపబడినట్లు గాంచినవారికి ప్రతిష్ఠ పుత్రులు లభింపగలరు. నదీతటముపై ప్రాతిన మైన కమల పత్రములో దధిమిశ్రితమైన యన్నమును లేదా పరమాన్నమును భుజించినట్లు స్వప్నమున గాంచిన వాడు భవిష్యత్తులో నరేశ్వరుడు కాగలడు. జలౌకమును (జలగను), వృశ్చికమును, సర్పమును, స్వప్నములో గాంచిన ధనపుత్ర విజయ ప్రతిష్ఠలు లభించు నని గ్రహింపవలెను. శృంగములు గడ్డములు గల్గిన పశువులను, సూకరములను, వానరములను, స్వప్నమున గాంచి, వానివలన పీడింపబడిన మనుష్యుడు నిశ్చయముగ ప్రచురధనరాశిని పొందగలడు. స్వప్నములో మత్స్యమును, మాంసమును, ముత్యములను, శంఖమును, చందనమును, వజ్రమును, మధువును, రక్తమును, సువర్ణమును, ఫల పుష్పభరిత మైన తీగను, మామిడి ఫలమును గాంచిన ధనము లభించును. విగ్రహమును శివలింగమును స్వప్నములో దర్శించిన మనుష్యునకు ధనము విజయము ప్రాప్తింపగలవు. ప్రజ్వలితాగ్నిని దర్శించిన మనుష్యుడు ధనమును, బుద్ధిని, లక్ష్మీకటాక్షమును పొందగలడు. ఆమలకమును (ఉసిరికను), కమలమును దర్శించిన అవి ధనప్రాప్తి సూచకములు. దేవత, ద్విజుడు, గోవు, పితరులు, సంప్రదాయ చిహ్నధారి యైన పురుషుడు స్వప్నములో నేవస్తువు నైతే ప్రసాదించునో నిజ జీవితమందు గూడ ఆవస్తువే లభింపగలదు. శ్వేత వస్త్రములను ధరించి, శ్వేత పుష్పమాలికలతో, శ్వేతానులేపనముతో నలంకృత లైన సుందరీమణులు స్వప్నములో నేపురుషుని యాలింగన మొనరించుకొందురో, వానికి సుఖసంపదలు ప్రాప్తింపగలవు. స్వప్నములో పీతాంబరములను, పీతపుష్పమాలను, పీతవర్ణానులేపనమును ధరించినస్త్రీ తన్ను ఆలింగన మొనరించినట్లు గాంచిన వానికి కళ్యాణప్రాప్తి యగును. స్వప్నములో భస్మను, మాడి, అస్థికలు గాక మిగిలిన శ్వేతవస్తువులు ప్రశంసనీయములే, కపిలగోవు, గజము, అశ్వము, బ్రాహ్మణుడు, దైవము గాక శేషించిన నల్లని వస్తువులు అత్యంత నిందితము లని గ్రహింపుము. రత్నమయభూషణ విభూషిత మైన దివ్యబ్రాహ్మణ జాతీస్త్రీ మందస్మిత ముఖారవిందముతో నెవని గృహమున ప్రవేశించునో వానికి ప్రియపదార్థములు కల్గును. బ్రాహ్మణుడు దైవస్వరూపుడు, బ్రాహ్మణి దేవకన్యక. బ్రాహ్మణుడు బ్రాహ్మణి ప్రసన్నులై చిరునవ్వులు చిందించుచు స్వప్నములో నెవనికి ఫలమును ప్రసాదించెదరో

వానికి నిశ్చయముగ పుత్రప్రాప్తి యగును. తండ్రీ! బ్రాహ్మణుడు స్వప్నములో నెవరికి శుభాశీర్వాదము నొసంగునో వారికి అవశ్యము ఐశ్వర్యము కల్గును. స్వప్నములో సంతుష్టుడైన బ్రాహ్మణు డెవని గృహమును ప్రవేశించునో వారి గృహములో నారాయణుడు, శివుడు, బ్రహ్మ ప్రవేశింపగలరు, వారికి సంపత్తి, మహాయశము, అడుగడుగున సుఖము, సమ్మానము, గౌరవము ప్రాప్తింపగలవు. స్వప్నములో నకస్మాత్తుగ గోవును గాంచిన భూమి పతివ్రతాస్త్రీ లభింపగలదు. స్వప్నములో నేపురుషుని గజరాజు తనతొండముతో నెత్తి తనపై ఆసీనునిగ జేయునో ఆతడు నిశ్చయముగ రాజ్యమును పొందగలడు. సంతుష్టుడైన బ్రాహ్మణుడు స్వప్నములో తనను ఆలింగనమొనరించు కొనినట్లు, హస్తములో పుష్పములను ప్రసాదించినట్లు గాంచిన వానికి నిశ్చయముగ సంపత్తి, విజయము, యశము, సుఖము లభింపగలవు. వానికి తీర్థస్నాన పుణ్యముకూడ లభించును.

స్వప్నములో తీర్థమును, సౌధమును, రత్నమయగృహమును దర్శించిన వారికి పూర్వోక్త ఫలమే లభించును. స్వప్నములో నైవరైనను పూర్ణకలశమును ప్రసాదించిన గ్రహీతకు పుత్ర సంపత్తి కలుగును. ఎవరి గృహమునకు పత్నీ సహితముగ బ్రాహ్మణు డఱుదెంచునో వారిగృహమునకు పార్వతీ సహితముగ శివుడు, లక్ష్మీ సహితముగ నారాయణు డఱుదెంచినటులే భావింపవలెను. బ్రాహ్మణుడు, బ్రాహ్మణి స్వప్నములో నెవనికి ధాన్యము, పుష్పాంజలి, ముత్యముల హారము, పుష్పమాల, చందనమును ప్రసాదింతురో వారికి అన్ని వైపులనుండి లక్ష్మీ లభించును. స్వప్నములో గోరోచనమును, పతాకమును, చెఱకు గడలను, సిద్ధాన్నమును బొందినటుల గాంచు వారికి నిశ్చయముగ లక్ష్మీప్రాప్తి యగును. స్వప్నములో బ్రాహ్మణుడు, బ్రాహ్మణి యెవని మస్తకముపై ఛత్రము నుంచెదరో, అక్షతలను చల్లెదరో లేదా అమృతదధి భరితము లైన యుత్తమ పాత్రలను సమర్పింతురో వారికి రాజ్యప్రాప్తి యగును. స్వప్నములో శ్వేతమాలను, చందనమును ధరించు వారు రాజ్యమును పొందగలరు. స్వప్నములో రత్నమయభూషణ విభూషితయై యెనిమిది సంవత్సరముల ప్రాయముగల కన్య సంతుష్టురాలై యెవనికి పుస్తకమును ప్రసాదించునో వాడు విశ్వవిఖ్యాత కవియై పండితుడు కాగలడు. ఎవనిని స్వప్నములో ఆమె తల్లివలె చదివించునో వాడు సరస్వతీ పుత్రుడై సర్వోత్తముడగు పండితుడు కాగలడు. విద్వాంసుడైన బ్రాహ్మణుడు స్వప్నములో తండ్రివలె చదివించినవారు

వాస్తముగ విద్వాంసులు కాగలరు. స్వప్నములో మార్గముపై లేదా ఇతరత్రా పుస్తకమును జూచి గ్రహించిన వారు విఖ్యాతులై పండితులు కాగలరు. స్వప్నములో బ్రాహ్మణుడు బ్రాహ్మణి యెవరికి మహామంత్రోపదేశ మొనరించెదరో ఆపురుషుడు విద్వాంసుడై గుణవంతుడై ధనవంతుడు కాగలడు. బ్రాహ్మణుడు స్వప్నములో నెవనికి మంత్రమును లేదా శిలాప్రతిమను ప్రసాదించునో వారికి మంత్రసిద్ధి కల్గును. బ్రాహ్మణుడైన వాడు స్వప్నములో బ్రాహ్మణునుదర్శించి వందనము లర్పించి, వారి నుండి శుభాశీర్వాదమును పొందునో అతడు మహాకవియై పండితుడు కాగలడు. స్వప్నములో బ్రాహ్మణుడు సంతుష్టుడై ఎవనికి శ్వేతధాన్యయుక్త భూమిని ప్రసాదించునో ఆతడు రాజుకాగలడు.

స్వప్నములో బ్రాహ్మణుడెవనిని రథముపై గూర్చుండబెట్టుకొని నానా విధ స్వర్గములను దర్శింపజేయునో, వారు చిరంజీవు లయ్యెదరు, వారి యాయుర్దాయము సంపదలు నిశ్చయముగ వృద్ధినొందగలవు. స్వప్నములో సంతుష్టుడైన బ్రాహ్మణుడెవనికి తనకన్యను ప్రసాదించునో ఆతడు సదాధనాఢ్యుడై రాజు కాగలడు. స్వప్నములో సరోవరమును, సముద్రమును, నదిని, నదమును, శ్వేతసర్పమును, శ్వేతపర్వతమును దర్శించు వారికి లక్ష్మి ప్రాప్తించును. స్వప్నమందు తానుమరణించినట్లు గాంచినవారు చిరంజీవులు కాగలరు. స్వప్నములో రోగులను దర్శించినవారు రోగహీనులు కాగలరు. స్వప్నములో సుఖులైనట్లు దర్శించిన దుంఖితులు కాగలరు. దివ్యనారి స్వప్నములో దర్శన మొసంగి నీవే నాస్వామి వని సంబోధించు సమయమున మేల్కాంచినవారు అవశ్యము రాజు కాగలరు. స్వప్నములో కాళికనుదర్శించి స్ఫటికమాలను ఇంద్ర ధనువును, వజ్రమును పొందిన మనుష్యు డవశ్యముగ నత్యంత ప్రతిష్ఠయుక్తుడు కాగలడు. స్వప్నములో నెవనిని బ్రాహ్మణుడు నీవు నాదాసుడవు గమ్మని సంబోధించునో, ఆతడు నాదాస్యభక్తిని పొంది వైష్ణవుడు కాగలడు. స్వప్నావస్థలో బ్రాహ్మణుడు శివవిష్ణు స్వరూపుడు, బ్రాహ్మణి లక్ష్మిపార్వతిస్వరూపిణి, శ్వేతవర్ణస్త్రీ, వేదమాతయైన సావిత్రి, గంగా సరస్వతీ స్వరూపిణి. గోపికావేషధారిణి యైన బాలిక సాక్షాత్తుగ శ్రీరాధాస్వరూపమే. గోపబాలకుడు స్వప్నములో దర్శన మొసంగిన ఆతడు నాస్వరూపమే యని గ్రహింపవలెను. స్వప్నవిజ్ఞాన కోవిదు

లైన విద్వాంసు లీరహస్యమునే ప్రకాశిత మొనరించిరి. తండ్రీ! ఇట్లు నేను పుణ్యప్రదాయకము లైన యుత్తమ స్వప్నములను వర్ణించితిని. నీవు ఏ యే విషయములను అవధరింప గోరుచున్నావో తెల్పిన వాని నన్నింటిని సవిస్తర ముగ వర్ణింపగలను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ
జన్మఖండములో సుస్వప్నదర్శన ఫలవర్ణనమను
డెబ్బదిఏడవ అధ్యాయము సంపూర్ణము



# డెబ్బదియెనిమిదవ అధ్యాయము

## అధ్యాత్మిక జ్ఞానోపదేశము

నందుడు పలికెను :-

జగన్నాథా, శ్రీకృష్ణా ! వేదముల సారభాగములైన, లౌకిక వైదిక నీతిసారతత్త్వములైన సుస్వప్నవర్ణనములను అవధరించితిని. వత్సా! ఏస్వప్న ములను దర్శించిన పాపము కల్గునో, ఏకర్మము లొనరించిన పాపములు సంభ వించునో వానిని వర్ణింపవలసినదిగ గోరుచున్నాను. వేదానుసారులైన సంతప్త మనుష్యులు నీముఖారవిందమునుండి వేదశాస్త్రజ్ఞానము నాకర్ణింపగోరుచు న్నారు; ఎందువలెననగ నీవు వేదములకే జనకుడవు, వైదికసత్పురుషులకు, బ్రహ్మాదిదేవతలకు, మానులకు, సకలలోకములకు నీవే జన్మదాతవు. వత్సా! నీవియోగముచే నాహృదయములో విరహాగ్నిని గలుగజేసితివి కాని ఈ సమ యమున నీముఖారవిందమునుండి బహిర్గతమైన ప్రమాణభూతవచనామృత ముచే నాతనువు, మనము అభిషిక్తములైనవి. సమస్తమనోవాంఛితఫలప్రద ములు, బ్రహ్మాదిదేవతలకు స్వప్నమునందుగూడ దుర్లభము లైన నీచరణకమ లములు నేడు నాచక్షువులసమక్షమున విరాజిల్లుచున్నవి. దేవా! వర్తమాన కాలము గతించిన ఈ పాతకునకు నీచరణారవిందముల దర్శనసౌభాగ్యము మఱల నెట్లులభింపగలదు? మలమూత్రభరితమైన యీశరీరము కర్మబంధ నములచే బంధింపబడియున్నది.

దేవాదిదేవా! బ్రహ్మాదిదేవతలకు స్వామి వైన నీతో సంభాషించు శుభావసరము నావంటిపాపికి మఱల లభింపగలదా? మహేశ్వరా! కృపానిధీ నన్ను గరుణింపుము, నాకర్మబంధనములను ఖండింపుము. నీవు నా కుమారుడ వని భావించి నీయెడల నేనొనరించిన దుర్నీతిపూర్ణవ్యవహారములను, అపరాధ ములను కరుణాంతరంగుడవై క్షమింపుము. బ్రహ్మశివశేషాదులు, మహర్షులు, మునివర్యులు నీచరణారవిందములనే చింతించుచుందురు. సరస్వతి శ్రుతులు నిన్ను స్తుతించుటలో అసమర్థులైనచో నేనెంతటివాడను?

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :-

ఇట్లు శ్రీకృష్ణుని ప్రార్థించి ముకుళితహస్తుడై తన సముఖమున నిలు చుండియున్ననందుని గాంచి జగత్పతి యగు శ్రీకృష్ణపరమాత్మ ఉత్తమమగు నాధ్యాత్మికజ్ఞానము నిట్లుపదేశింపదొడంగెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :-

తండ్రీ ! లోకమునం దున్న తండ్రులందఱిలో నీవే శ్రేష్ఠుడవు. సర్వ శ్రేష్ఠా, వ్రజేశ్వరా! అజ్ఞానమును వీడి నే నుపదేశింపబోవు నుత్తమకళ్యాణ జ్ఞానము నవధరింపుము. ఈజ్ఞానము జ్ఞానులకుకూడ పరమదుర్లభము, వేద శాస్త్రములందుగూడ నత్యంతగోపనీయ మని ప్రవచింపబడెను. నీవు నాయనన్య భక్తుడవు, కావున యీమహాజ్ఞానమును నీ కుపదేశించుచున్నాను. తండ్రీ! ప్రసన్నుడవై యేకాగ్రచిత్తముతో నీమహాజ్ఞానము నవధరించి మనన మొనరించు కొనుము. ఈ విద్యాభ్యాసమువలన జన్మమృత్యుజరారోగములచే విముక్తి లభించును. మహారాజా, వ్రజేశ్వరా! సుస్థిరుడవై యీమహాజ్ఞానమును బొంది శోకమోహరహితుడవై పరమానందనిమగ్నుడవై వ్రజమునకు మఱలిపొమ్ము.

శ్లో॥ జలబుద్బుదవత్సర్వం సంసారం సచరాచరమ్ ।
ప్రభాతే స్వప్నవన్మిథ్యా మోహకారణమేవ చ ॥ 17

మిథ్యాకృత్రిమనిర్మాణహేతుశ్చ పాంచభౌతికః ।
మాయయా సత్యబుద్ధ్యా చ ప్రతీతిం జాయతే నరః ॥ 18

కామక్రోధలోభమోహైర్వేష్టితః సర్వకర్మసు ।
మాయయా మోహితః శశ్వత్ జ్ఞానహీనశ్చ దుర్బలః ॥ 19

ఈ చరాచర జగములు జలబుద్బుదములవలె నశ్వరములు; ప్రాతఃకాల స్వప్నములవలె మిథ్యలు, మోహమునకు గారణములు, పాంచభౌతికము లైన దేహములు, సంసార నిర్మాణహేతువులు గూడ మిథ్యలే, అనిత్యములే యని గ్రహింపుము. మాయామోహితు డైన జీవుడు ఈ మిథ్యాజగములే సత్యములని భావించును. అతడు సమస్తకర్మలయందు గామక్రోధలోభ మోహములచే వేష్టితుడు, మాయచే సదా మోహితుడు, జ్ఞానహీనుడు, దుర్బలుడు నై యున్నాడు.

శ్లో॥ నిద్రాతన్ద్రీక్షుత్పిపాసాక్షమాశ్రద్ధాదయాదిభిః ।
లజ్జాశాన్తిధృతిః పుష్టిః తుష్టిశ్చాఽఽభిశ్చ వేష్టితః ॥ 20
మనోబుద్ధిచేతనాభిః ప్రాణజ్ఞానాత్మభిః సహ ।
సంసక్తః సర్వదేవైశ్చ యథా వృక్షశ్చ వాయసైః ॥ 21

నిద్ర, తంద్ర, క్షుధ, పిపాస, క్షమ, శ్రద్ధ, దయ, లజ్జ, శాంతి, ధృతి, పుష్టి, తుష్ట్యాదులచే గూడ దేహధారియైన జీవుడావృతుడై యుండును. వృక్షము కాకాదిపక్షుల కాశ్రయమైనట్లు మనస్సు, బుద్ధి, చేతనత్వము, ప్రాణము, జ్ఞానము, ఆత్మసహితులగు సర్వదేవతలు ఈ శరీరము నాశ్రయించియే నివసింతురు.

శ్లో॥ అహమాత్మా చ సర్వేశః సర్వజ్ఞానాత్మకః స్మృతః ।
మనో బ్రహ్మా చ ప్రకృతిర్బుద్ధిరూపా సనాతనీ ॥ 22
ప్రాణా విష్ణుశ్చేతనా సా పద్మా తు చాధిదేవతా ।
మయి స్థితే స్థితాః సర్వే గతాస్తేఽపి గతే మయి ॥ 23
అస్మాభిశ్చ వినా దేహః సద్యః పతతినిశ్చితమ్ ।
పాంచభౌతో విలీనశ్చ పంచభూతేషు తత్క్షణమ్ ॥ 24

శరీరములో సర్వేశ్వరుడ నైన నేనే పూర్ణజ్ఞానస్వరూప మైన యాత్మను బ్రహ్మయే మనస్సు, సనాతనియగు ప్రకృతియే బుద్ధి, ప్రాణములే విష్ణువు, చైతన్యమున కధిష్ఠాత్రీదేవి శ్రీమహాలక్ష్మి. శరీరములో నే నున్నంతవఱకే సర్వులు నుండెదరు. నేను వెడలిపోయిన సర్వుల దేహమును ఆక్షణమునే వీడెదరు. మే మందరము దేహమును వీడి వెడలిపోయిన శరీరము తత్కాలమే పతనముకాగలదు. ఇందేమాత్రము సంశయము లేదు. పంచభూతాత్మిక మైన యాదేహ మాక్షణమందే పంచభూతములందు విలీనమగును.

శ్లో॥ నామ సంకేతరూపం చ నిష్ఫలం మోహకారణమ్ ।
శోకశ్చాజ్ఞానినాం తాత జ్ఞానినాం నాస్తి కించన ॥ 25

నిద్రా దయః శక్తయశ్చ తాః సర్వాః ప్రకృతేః కలాః ।
లోభా దయోహ్యధర్మాం శా స్తథాఽహంకార పంచమః ॥ 26

నామములు కేవలము సంకేతరూపములు, అవి నిష్ఫలములు, మోహము లకు గారణములు తండ్రీ! అజ్ఞానులే నశ్వరశరీరము కొఱకై శోకింతురు; కాని జ్ఞాని యైన వాడు కించిన్మాత్రమైనను దుఃఖింపడు. నిద్రాది శక్తు లన్నియు ప్రకృతికళలే. కామక్రోధలోభ మోహములు, నైదవది యైన యహంకారము అధర్మము యొక్క-యంశలు.

శ్లో॥ తే బ్రహ్మవిష్ణురుద్రాంశా గుణాః సత్త్వాదయస్త్రయః ।
జ్ఞానాత్మకః శివో జ్యోతిరహమాత్మా చ నిర్గుణః ॥ 27

యదా విశామి ప్రకృతౌ తదాహం సగుణః స్మృతః ।
సగుణా విషయా విష్ణుబ్రహ్మరుద్రాదయ స్తథా ॥ 28

ధర్మో మదంశో విషయీ శేషః సూర్యః కలానిధిః ।
ఏవం సర్వే మత్క-లాంశా మునిమన్వాదయః సురాః ॥ 29

సత్త్వాదిత్రిగుణములు క్రమముగ బ్రహ్మవిష్ణు రుద్రాంశలు. జ్యోతిర్మయు డైన సదాశివుడు జ్ఞానస్వరూపము, నేనే నిర్గుణ మైన యాత్మను. నేను ప్రకృతిలో ప్రవేశించునపుడు నన్ను సగుణు డందురు. విష్ణుబ్రహ్మరుద్రాదులు సగుణులు. నాయంశాసంభూతులైన ధర్మదేవత, ఆదిశేషుడు సూర్యుడు, చంద్రుడు మొదలగువారు విషయు లనబడిరి. ఇట్లే సర్వమహర్షులు మనువులు, దేవతలు మొదలగువారు నాకలాంశరూపులు.

శ్లో॥ సర్వదేహే ప్రవిష్టోఽహం న లిప్తః సర్వకర్మసు ।
జీవన్ముక్తశ్చ మద్భక్తో జన్మమృత్యుజరాహరః ॥ 30

సర్వసిద్ధేశ్వరః శ్రీమాన్ కీర్తిమాన్ పణ్డితః కవిః ।
చతుస్త్రింశద్విధః సిద్ధః సర్వకర్మోపహారకః ॥ 31

నేను సమస్తశరీరములందు ఆత్మనై వ్యాపించి యున్నను ఆదేహధారుల సర్వకర్మల యందు నిర్లిప్తుడను. కేవలము నాయనన్యభక్తుడే జీవన్ముక్తుడు కాగలడు, అతడు జన్మమృత్యు జరావ్యాధులను నివారణ మొన రించు కొనగలడు. భక్తుడు సర్వసిద్ధులకు స్వామి, శ్రీమంతుడు, కీర్తిమంతుడు

విద్వాంసుడు, కవి, ముప్పదినాల్గు సిద్ధులుకలవాడు, సమస్తకర్మలను నివారించు కొనగలవాడగును. అట్టి సిద్ధభక్తునకు నేనే స్వయముగ లభింతును; ఎందువలె ననగ అతడు నన్ను దక్క-యే యితర వస్తువుల నైనను వాంఛింపడు.

తండ్రీ! సిద్ధు లిఱువది రెండు విధములు, ఆసిద్ధులను సిద్ధమంత్రము నుపదేశించెద నవధరింపుము. అణిమ. లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, మహిమము, ఈశిత్వము, వశిత్వము. కామావసాయితము, దూరశ్రవణము, పరకాయప్రవేశము, మనోయాయిత్వము, సర్వజ్ఞత్వము, అభీష్టసిద్ధి, అగ్నిస్తంభనము, జలస్తంభనము, చిరజీవత్వము, వాయుస్తంభనము, క్షుత్పిపాస నిద్రా స్తంభనము, వాక్సిద్ధి, ఇచ్ఛానుసారమును మరణించిన ప్రాణిని పిలుచుట, సృష్టికరణము, ప్రాణాకర్షణము అనునవి యిఱువది రెండు విధముల సిద్ధులనబడెను.

(మంత్రము)

శ్లో॥ ఓం సర్వేశ్వరాయ సర్వవిఘ్నవినాశనే మధుసూదనాయ స్వాహా.।

ఈసిద్ధ మంత్ర యత్యంత నిగూఢము, సర్వులకు మనోవాంఛలను పరిపూర్ణ మొనరించు కలవృక్ష సదృశము. సామవేదమందీ మంత్రము ప్రవచింపబడెను. ఈమంత్రనుష్ఠానము సిద్ధులకు సర్వ సిద్ధి ప్రదాయకమైనట్టిది. ఈ మహామంత్ర జపముచే యోగులు మహర్షులు దేవతలు సిద్ధినొందగలరు. సత్పురుషులైనవారు ఒకలక్షపర్యాయము లీమంత్రమును జపించిన మంత్రసిద్ధి పొందగలరు. నారాయణ క్షేత్రములో హవిష్యాన్నమును భుజించుచు నీమంత్రమును జపించిన శీఘ్రమే మంత్రసిద్ధి యగును. తండ్రీ! నీవు కాశీయందుగల మణికర్ణికా తీర్థమునకు జని యీమంత్రమును జపింపుము. పవిత్ర గంగాప్రవాహముచే ప్లావిత మైన నాలుగెకరముల భూమినే నారాయణక్షేత్రమందురు ఆక్షేత్రమునకు నారాయణుడే స్వామి. ఆపవిత్ర ప్రదేశములో మరణించిన మనుష్యునకు జ్ఞానము ముక్తి లభింపగలదు. ఆపవిత్రప్రదేశములో మంత్రజప మొనరించిన మనుష్యుడు జీవన్ముక్తుడు కాగలడు; ఇందేమాత్రము సంశయము లేదు.

తండ్రీ! ఎవరిని దర్శించిన పాపములు సంప్రాప్తించునో వర్ణించెద నాకర్ణింపుము. దుఃస్వప్నములు కేవలము పాపములకు బీజములు, విఘ్నములకు గారణములు. గోబ్రాహ్మణహత్య గావించిన వానిని, కృతఘ్నుని, కుటిలుని,

దేవమూర్తి నాశకుని, మాతృపితృహంతకుని, పాపాత్ముని, విశ్వాసఘాతకుని, అసత్యసాక్ష్యము పల్కువానిని, అతిథిని మోసగించువానిని, దేవబ్రాహ్మణ ధనములు అపహరించువానిని, అశ్వత్థవృక్షముఖండించువానిని, దుష్టుని, శివకేశవులను నిందించువానిని, దీక్షారహితుని, ఆచారహీనుని, సంధ్యారహితద్విజుని, దైవములు అర్పించినపదార్థములచే జీవించువానిని, వృషభములను పూన్చు బ్రాహ్మణుని, దర్శించిన పాపములు సంభవింపగలవు. పతిపుత్రరహితను, ముండితనాసికకలదానిని, దైవబ్రాహ్మణనిందకురాలిని, పతిభక్తివిహీనను, విష్ణుభక్తివిహీనను, వ్యభిచారిణిని దర్శించినను పాపము కల్గును.

సదా క్రోధించువానిని, జారజుని, చోరుని, మిథ్యావాదిని, శరణాగతుని హింసించువానిని. శూద్రస్త్రీతో సంబంధ మున్న బ్రాహ్మణుని, బ్రాహ్మణస్త్రీగామి యైనశూద్రుని, వడ్డీవ్యాపారముచేయుద్విజుని, అగమ్యాస్త్రీతో సమాగమ మొనరించుదుష్టనరాధముని గాంచిన పాపములు సంభవించును.

శ్లో॥ మాతా సపత్నీమాతా చ శ్వశ్రూశ్చ భగినీ సుతా ।
గురుపత్నీ పుత్రపత్నీ సోదరస్య ప్రియా సతీ ॥ 51

మాతృష్వసా పితృష్వసా భగినేయప్రియా తథా ।
మాతులానీ వహోఢా చ పితృవ్యస్త్రీ రజస్వలా ॥ 52

పితృమాతృప్రసూశ్చైవ నాగమ్యాష్షోడశ స్మృతాః ।
కీర్తితాః సామవేదే చ పరిహార్యాః సతాం వ్రజ ॥ 53

ఏతా దృష్ట్వా చ స్పృష్ట్వా చ బ్రహ్మహత్యాం లభేన్నరః ।
తస్మాద్దైవేన తా దృష్ట్వా సూర్యం దృష్ట్వా హరిం స్మరేత్ ॥ 54

కామతో యది పశ్యన్తి పిబన్త్యేతే భవన్తి వై ।
తస్మాత్సన్తో న పశ్యన్తి పాపభీతా వ్రజేశ్వర ॥ 54

తల్లి, పినతల్లి, అత్త, సోదరి, గురుపత్ని, కోడలు, సహోదరునిభార్య, [illegible], తండ్రి తల్లి, భాగినేయునిభార్య, మేనమామభార్య, పరస్త్రీ, పినతండ్రిభార్య, రజస్వలాస్త్రీ, పితామహి, మాతామహి మొదలగువీరలందరు అగమ్యలని సామవేదమందు ప్రవచింపబడెను. సత్పురుషు లైనవారు వీరంద[illegible]. కామభావముతో వీరిని దర్శించినను, స్పృశించినను మనుష్యునకు బ్రహ్మహత్యాపాతకము సంభవించును; కావున దైవవశమున వీరిపై

కామ దృష్టి కల్గిన తక్షణమే సూర్యుని దర్శించి శ్రీహరిని స్మరింపవలెను. కామపూర్వకముగ వీరిని దర్శించువారు నిందనీయులయ్యెదరు. వ్రజేశ్వరా! అందువలననే శాపభయాతురులై సాధుపురుషులు వీరలను కుదృష్టితో వీక్షింపరు.

విద్వాంసులైనవారు గ్రహణసమయమున సూర్యచంద్రులను దర్శింపరు. ప్రథమాష్టమ, సప్తమ, ద్వాదశ, నవమి, దశమ స్థానములందు సూర్యుడున్న వారు సూర్యుని దర్శింపరాదు (గ్రహణ సమయములో). జన్మనక్షత్రములో నష్టమ చతుర్థ స్థానములందు చంద్రుడున్న గ్రహణసమయమున చంద్రుని దర్శింపరాదు. భాద్రపదమాసములో శుక్లపక్ష, కృష్ణపక్ష, చతుర్థి దినమున ఉదయించు చంద్రుడు నష్టచంద్రుడనబడెను, కావున ఆచంద్రోదయమును దర్శింపరాదు. తండ్రీ! ఆదినమున తెలిసికూడ చంద్రుని వీక్షించిన వారికి దుష్కరమగు కళంకము సంప్రాప్తించును. దైవవశమున ఆచంద్రోదయమును వీక్షించిన మనుష్యుడు క్రిందచెప్పబోవు మంత్రముచే పవిత్ర మైన జలములను పాన మొనరింపవలెను. అట్లొనరించిన తత్కాలమే యతడు శుద్ధుడు నిష్కళంకుడు కాగలడు.

మంత్రము॥

సింహః ప్రసేనమవధీత్ సింహో జామ్బవతా హతః
సుకుమారక మా రోదీ స్తవ హ్యేష స్యమన్తకః ॥

సుందరకుమారా! ఈమణికొఱకు సింహము ప్రసేనుని సంహరించెను. ఆసింహమును జాంబవంతుడు సంహరించెను; కావున నీవు రోదింపకుము. ఇపుడే స్యమన్తకమణిపై నీకే యధికారము కలదు. ఈమంత్రముతో పవిత్ర మొనరింపబడిన జలములను అవశ్యము పానమొనరింపవలెను. తండ్రీ! నీవు యేవిషయములను శ్రవణమొనరింప గోరుచున్నావో తెల్పుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ
జన్మఖండములో ఆధ్యాత్మిక జ్ఞానోపదేశమను
డెబ్బది ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

# డెబ్బదితొమ్మిదవ అధ్యాయము

## -: సూర్యగ్రహణాఖ్యానము :-

[illegible] పలికెను:

శ్రీకృష్ణా! నీవు సకలదేవతలకు జనకుడవు. జగన్నాథా! సూర్యచంద్రులు [illegible] గ్రహణయుక్తులగుటకు గల కారణములను వివరింపవలసినదిగ [illegible]చున్నాను.

శ్రీకృష్ణుడు పలికెను:

[illegible]రాజా! పురాతనేతిహాసములను ప్రవచించెదను సావధానుడవై [illegible]ము. ఈ యాఖ్యానములను శ్రవణ మొనరించినవారు నిష్కళంకులై, [illegible]ఫలమును పొందగలరు. సర్వపాతకులను దర్శించి లభించు పాపము[illegible] [illegible]యాఖ్యానముల శ్రవణమాత్రముననే భస్మీభూతము కాగలదు. పూర్వ[illegible] సమయమున జమదగ్ని మహర్షి తన యర్ధాంగి యగు రేణుకను [illegible] విహారార్థమై నర్మదానది తటమునకు జనెను. రేణుక నవయౌవన[illegible], [illegible], సౌందర్యరాశి, రత్నభూషణసంయుక్త, సుస్మితముఖార[illegible]. [illegible]చంపకవర్ణ, సంపూర్ణచంద్రానన, అతీవసూక్ష్మాంబరధారిణి, [illegible]. ఇట్టి తన యర్ధాంగిని గాంచి జమదగ్ని మహర్షి పులకిత[illegible] [illegible] రతిక్రీడ కుపక్రమించెను. గగనమున [illegible] సూర్యభగవానుడు వీరిద్దరిని గాంచి [illegible] "మహర్షీ! నీవు బ్రహ్మదేవునకు [illegible]. శుద్ధుడవు, వేదాంగకర్తవు, [illegible], మహాతపస్వివి, తేజస్వివి, సువ్రతసమాయుక్తుడవు, [illegible] పగటియందే యేల మైథున మొనరించుట [illegible] సమయమున మైథునము దోషకర మని వేదప్రవచనము. [illegible]ము త్యజించుట పాడి గాదు. మనుష్యులందఱు మీరు [illegible] ప్రకారమే కార్యములను నిర్వర్తించుచుండగ [illegible]చున్నారు. నేను ధర్మమునకు సాక్షిని, కావున [illegible] వలదని వారించుచున్నాను."

సూర్యుని వచనముల నాలకించి జమదగ్నిమహర్షి మైథునకార్యమును విరమించినవాడై యత్యంత క్రోధయుక్తుడై తన సమక్షమున విప్రరూపియై నిలబడి యున్న సురలలో తేజస్వియైన సూర్యుని గాంచి యిట్లు పల్కెను. "ధర్మశాస్త్ర విషయమై నాకు ధర్మములను బోధించుటకు నీవేపాటి పండితుడవు? నేను సర్వశాస్త్రజ్ఞాతను, చతుర్వేదములు నాకు కరతలామలకములే! ధర్మాధర్మములు నాకు అవగతములే. నన్నాజ్ఞాపించుటకు నీ వెంతటివాడవు? వాసుదేవ భక్తుడనై నన్ను భగవంతుడు దక్క ఆజ్ఞాపించువారు మఱియొకరు లేరు. పరమ వైష్ణవుల కెన్నడు నశుభము కలుగదు. హరియే స్వయముగ సుదర్శన చక్రధారియై సదా తనభక్తులైన వైష్ణవులను రక్షించును. బ్రహ్మాది దేవతలనే ఆజ్ఞాపించగల నాకు నీవెంత? నేను సంకల్పించిన మహేంద్రాది సకల దేవతలను భస్మమొనరింపగలను. ప్రకృతి కతీతుడైన శ్రీకృష్ణుడొక్కడే నన్నాజ్ఞాపింపగలడు. నేడు నీవు మాసంతోషమును భంగమొనరించితివి, కావున నీవు రాహుగ్రస్తుడవు కాగలవు, గ్రహణమువలన మేఘములవలన నీ తేజము నిస్తేజమై పృథ్విపైకి ప్రసరింపగలదు. నీకు గర్వభంగము కాగలదు."

జమదగ్ని పల్కిన వచనముల నాలకించి సూర్యుడు హస్తములను ముకుళించిన వాడై మునిపుంగవుని సంబోధించి యిట్లు స్తుతించెను. "అవధ్యా! సర్వధర్మజ్ఞా! ధన్యా! మాన్యా! నీవే నారాయణుడవు, హరుడవు, స్వయం బ్రహ్మవు, గణేశ్వరుడవు, ఆదిశేషుడవు, ధర్మదేవతవు, సనాతనుడవు, విప్ర రూపినైన జనార్దనుడ వని నిన్ను స్తుతించుచున్నాను. వైష్ణవోత్తమా! నన్ను క్షమింపుము. బ్రాహ్మణులు మాకు పూజనీయులు, కాని వైష్ణవులైన బ్రాహ్మణులు క్రోధమువహింపరాదు. నీవు విప్రులందు పూజనీయుడవు, నేను సురలందు పూజనీయుడను. మనము పరస్పరము స్నేహపాత్రులమై మెలగవలెను. అయినను మీరు స్వధర్మము నాచరించు నన్ను నిష్కారణముగ శపించినారు. నేను మీకు ప్రతిశాపము నిచ్చుచున్నాను. నేను మిమ్ములను శపించని యెడల జనులు సూర్యుడు నిస్తేజుడని అవహేళనచేయగలరు. క్షత్రియుని యస్త్రముచే మీరు మరణింపగలరు."

సూర్యునిశాప మాలకించి జమదగ్నిమహర్షి శంకరునివలన నీకు పరాజయము సంభవింపగల దని మఱల శపించెను. వీరిద్దరికలహ ముపశమింపజేయుటకు స్వయముగ బ్రహ్మయే వారియెదుట సాక్షాత్కరించి యిట్లుపల్కెను.

“[illegible]! పరస్పరవివాదము లిక చాలింపుడు. సూర్యదేవా! పగలు నీవు [illegible] మాత్రమే మేఘము లడ్డురాగా నిస్తేజుడవై మేఘములు తొలగిన [illegible] ప్రకాశింపగలవు. గ్రహము లడ్డురాగా నీకు గ్రహణము కల్గె నని [illegible] జనులు భావింతురు. నీవు రాహుగ్రస్తుడవైతి వని భ్రమించెదరు, కాని [illegible] పూర్ణతేజముతో విరాజిల్లెదవుగాక. నీభార్యానిమిత్తము శ్వశురుని వలన నీ తేజము మలినము కాగలదు. మాలి, సుమాలి యనుదానవులతో యుద్ధసమయమున శంకరునివలన నీకు పరాజయము సంభవింపగలదు. జమదగ్ని మహర్షీ! నీకు కార్తవీర్యార్జునిచే మరణము సంభవింపగలదు. తదనంతరము మహాతేజస్వి యైన నీకుమారుడు డిఱువదియొక్క పర్యాయములు పృథ్విని [illegible]క్షత్రియముగా నొనరింపగలడు.”

ఇట్లు ఇద్దరికి శాపపరిణామములను ప్రవచించి బ్రహ్మదేవు డంతర్ధానము కాగా, సూర్యజమదగ్నులు తమతొందరపాటునకు పశ్చాత్తప్తులై తమతమస్థలములకు చేరిరి. తండ్రీ! ఇపుడు చంద్రగ్రహణాఖ్యానమును వర్ణించెద నాలకింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో సూర్యగ్రహణాఖ్యా
మను డెబ్బదితొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము

---

# ఎనుబదియవ అధ్యాయము

## చంద్రగ్రహణాఖ్యాన వర్ణనము

శ్రీకృష్ణుడు పలికెను :-

నందరాజా! పూర్వకాలమున దేవగురు వగు బృహస్పతిపత్నియైనతార [illegible]మందాకినీతీరములో స్నానమొనరించుటకరుదెంచెను. ఆమె నవ యౌవనసంపన్నురాలు, రత్నభూషణవిభూషిత, వరసూక్ష్మాంబరధారిణి, [illegible], సుస్మిత, సౌందర్యవతి. యామె మాలతీమాలికల నలంకరించుకొని, [illegible]పై సిందూరతిలకము నిడుకొని, ఫాలభాగమును చారుచందన

బిందువులతో నలంకరించి యత్యంతోజ్జ్వలముగ కన్పడుచుండెను. రత్నేంద్ర సారనిర్మితము లైనకంకణమంజీరములను తనహస్తములందు, పాదములందు ధరించియుండెను. కర్ణములందు రత్నకుండలములను వక్షఃస్థలముపై మణిహారమును ధరించి యాసుకోమలి, చంద్రముఖి, కామాధర, కాముకి, బాల, గజేంద్రగమనముతో తటమున కఱుదెంచి స్నాన మాచరింపబోదొడంగెను. ఆసమయమున గురువునకు ప్రణామము లర్పించి మఱలిపోవు చంద్రుడు మార్గమధ్యములో మందాకినీ జలములలో జలక్రీడలాడుచున్న గురుపత్ని యగు తారసౌందర్యమును గాంచి కామమోహితుడై జ్ఞానము లుప్తముకాగా ఆమెను సమీపించి తనమనోభావమును బహిర్గత మొనరించెను. చంద్రుని నీచ మనోభావమును తెలిసికొనిన తార ఆశ్చర్యచకితురాలై వాని నిట్లు నివారించెను. "చంద్రా! సురకులవినాశకా! నన్ను వీడుము, నేను గురుపత్నిని. బ్రాహ్మణిని, పతివ్రతా పరాయణురాలను. గురుపత్ని సమాగమమువలననూఱుబ్రహ్మహత్యల పాతకము సంభవించును.

శ్లో॥ గురుపత్నీ విప్రపత్నీ యది సా చ పతివ్రతా।
బ్రహ్మహత్యా సహస్రం చ తస్యాః సఙ్గమేన లభేత్ ॥ 22

గురుపత్నితో, విప్రపత్నితో, పతివ్రతతో, బలవంతముగ సంగమించిన, ఆసంగమమువలన నూఱుబ్రహ్మహత్యా పాతకములు సంభవింపగలవు.

నీ యీపాపకార్యము నాలకించిన సురగురువు నిన్ను భస్మమొనరింపగలడు. పాపాత్ముడా! స్వధర్మమును రక్షించుకొనుము, తల్లినైననన్ను వీడుము.

తార యెంతగ వారించినను కామబాణపీడితు డైనచంద్రుడు సరకుగొనక ఆమెను చెఱబట్టెను. తార యత్యంతకుపితురాలై కళంకితుడవుగమ్మని, యక్ష్మారోగయుక్తుడవుగమ్మని, రాహుగ్రస్థుడవై గ్రహణసంయుక్తుడవుగమ్మని చంద్రుని శపించెను. అయినను చంద్రుడు తన దుష్టమనోరథమును వీడలేదు. ఆమెను చెఱబట్టి తనవెంటనిడుకొని జనుచుండగ మార్గమధ్యమున వారికి బలిచక్రవర్తిగృహమునుండి మఱలివచ్చుచున్న శుక్రాచార్యుడెదురయ్యెను. సమక్షమున ఆచార్యుని గాంచి చంద్రుడు తనకు శరణము నొసంగవలసినదిగ శుక్రాచార్యునిచరణముల నాశ్రయించెను. శరణాగతు డైన చంద్రు డొనరించిన దుష్కృత్యమును గాంచి శుక్రాచార్యు డిట్లుపల్కెను. కుమారా! నాహితవచనముల నాలకింపుము. గురుపత్ని యైన తారను తక్షణమే త్యజిం

పుము. గురుపత్ని తల్లితో సమానము, కావున నాయుపదేశము నాలకించి యీమెను వీడి నీ వొనరించిన పాపమునకు ప్రాయశ్చిత్తమొనరించుకొనుము.

శ్లో॥ సతీనాం గురుపత్నీనాం గ్రహణే చ బలేన చ ।
బ్రహ్మహత్యా సహస్రాణాం పాతకం లభతే జనః ॥ 37
కుమ్భీపాకే చ పచ్యన్తే యావద్వై బ్రహ్మణః శతమ్ ।

పతివ్రతాస్త్రీనికాని, గురుభార్యనుకాని బలత్కరించిన, గ్రహించిన, సహస్రబ్రహ్మహత్యాపాతకములకు గుఱియై నూఱుబ్రహ్మలయాయుః పర్యంతము కుంభీపాకనరక మనుభవింపవలెను.

కావున నాహితవచనముల నాలకించి నీమనమును మార్చుకొని మాతృసమానురాలైన తారను చెఱనుండి విడిపించుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో చంద్రగ్రహణాఖ్యాన
మను యెనుబదియవ అధ్యాయము
సంపూర్ణము

---

# ఎనుబదియొకటవ అధ్యాయము

## తారవిముక్తి కొఱకు శుక్రాచార్యుని చెంతకు దేవత లఱుదెంచుట

శ్రీకృష్ణుడు పలికెను:

రత్నమాలానదీ తీరమున గల పుణ్యాశ్రమ సమీపమున శుక్రాచార్యుడు చంద్రునితో సంభాషించుచున్న సమయమున తారవిముక్తి కొఱకై అపారసుర సైన్యము లాకాశమార్గమునుండి యాప్రదేశమున కఱుదెంచినవి. మూడుకోట్ల పతాకములతో, శతకోటి మహారథములతో, శతకోటిగజేన్ద్రములతో, శతకోటి వివిధ రథములతో, అంతకు వందరెట్లుగ అశ్వదళములతో, అంతకంటె పలురెట్లు పదాతులతో ఆసురసైన్య మలరారుచున్నది. శంఖధ్వనులతో, దుందుభిధ్వనులతో, డిండిమ ధ్వనులతో ఆప్రదేశమంతయు ప్రతిధ్వనించెను. ఐరావతారూఢుడై మహేంద్రుడు, శ్వేతాశ్వము నధిరోహించి ధర్మదేవుడు,

రథముల నధిరోహించి కుబేరుడు, వరుణుడు, అగ్ని, పవనుడు, మహిషము నధిరోహించి యముడు, స్యందనముపై దివాకరుడు, గజేన్ద్రునిపై ఈశానుడు, నాగవాహనముపై ననంతుడు, ఆదిత్యవసురుద్ర సిద్ధ గంధర్వ కిన్నెరులను తోడ్కొని సురసైన్యముతో నఱుదెంచిరి. ఆమహాసైన్యమును గాంచి శుక్రాచార్యుడు భయపడవల దని నిశాకరున కభయ మొసంగెను.

వృషభవాహనా రూఢుడై యఱుదెంచు సర్వశంకరుడైన హరుని శుక్రాచార్యుడు దర్శించెను. హస్తములందు త్రిశూలపట్టిశములను ధరించి, వ్యాఘ్రచర్మాంబరధారియై శివుడు భాసించుచుండెను. భూతపతి పరమ తేజ స్స్వరూపుడు, భక్తానుగ్రహవిగ్రహుడు, సర్వసమ్పత్ప్రదాత, సర్వజ్ఞుడు, సర్వ కారణుడు, సర్వేశ్వరుడు, సర్వపూజ్యుడు, సర్వరూపుడు, శరణాగత పరిత్రాణ పరాయణుడు, సనాతనుడు. బ్రహ్మతేజముతో ప్రజ్వరిల్లుచు సస్మితముఖార విందముతో నలరారుచున్న హరుని గాంచి శుక్రాచార్యుడు శివచరణములపై బడి ప్రణామము లర్పించెను. మహేశ్వరుడు శుక్రాచార్యు నాశీర్వదించి ఆచార్యు డొసంగిన రత్నసింహాసనము నలంకరించెను. ఆసమయముననే అఱు దెంచుచున్న బ్రహ్మదేవుని శుక్రాచార్యుడు వీక్షించెను. జగత్స్రష్ట శాంతుడు. స్వయముగ విధాత ఆయన రత్నస్యందనము నధిరోహించి, వహ్నిశుద్ధవస్త్ర పరీధానుడై, రత్నమాలావిభూషితుడై ప్రసన్నుడై, సుస్మితుడై ప్రకాశించు చుండెను. విధాత జగములకే యీశ్వరుడు, కర్మలకు ఫలప్రదాత, తాపసులందు తపస్స్వరూపుడు, వేద జనకుడు, పరమ మనోహరుడు. బ్రహ్మదేవుని సాదరముగ శుక్రాచార్యు డాహ్వానించి హస్తములు ముకుళించి నమస్కరించి రత్నసింహా సన మర్పించెను. తదనంతరము అసురాచార్యుడు మహేశ బ్రహ్మదేవులకు అనేక పూజల నొనరించి స్తుతించెను. శుక్రాచార్యుని సంబోధించి జగద్విధాత యిట్లుపల్కెను. "కుమారా! నేను ప్రవచించు హితకర వచనముల నాలకింపుము, చంద్రు డొనరించిన దుర్నీతి త్రిజగములం దత్యంత లజ్జాకరము. వేదములందు బహిష్కరింప బడిన కర్మస్నాన మాచరించు గురుపత్నియు, పతివ్రతయు నైన తారను బలాత్కరించుట క్షమింపరాని దుష్కృత్యము. ఆపాపాత్మునకు శరణము నొసంగిన నీకు పాపము సంభవింపగలదు. తారావిమోచనార్థమై యఱుదెంచిన యపారదేవ సేనావాహినిని గాంచుము. కుమారా! శివుడు, నేను తారావిమోచనార్థమే నీకడ కేతెంచితిమి.

తదనంతరము శంకరు డిట్లుపల్కెను "శుక్రాచార్యా! చంద్రుడాచరించిన యీదుష్కృత్యము క్షంతవ్యముకాదు. విప్రశ్రేష్ఠా! నీవు నీకళ్యాణమును గోరెదవేని నిన్నాశ్రయించిన చంద్రుని యీక్షణమే పరిత్యజింపుము, లేని వానిశిరమును త్రిశూలలతో ఖండించెదను. నేను క్రోధమువహించిన చో బ్రహ్మాదులైనను ఎవరు రక్షింపలేరు, ఈ చంద్రుడెంత? ఉతథ్యమహర్షి శాపము వలన బృహస్పతిభార్యనపహరించుట జరిగెను.

శ్లో॥ శరణాగతదీనార్తం న హి రక్షేద్యదీశ్వరః ।
పచ్యతే నిరయే తావద్యావదిన్ద్రాశ్చతుర్దశ ॥ 32
అత్ర నాస్తి విచారో మే పాపిష్ఠే శరణాగతే ।
పాపీ యం శరణం యాతి స పాపీ చ న సంశయః ॥ 33

దీనుడై శరణుజొచ్చినవానిని రక్షింపనివారు పదునల్వురింద్రుల ఆయుః పర్యంతము నరకమనుభవింపగలరు. కాని పాపాత్ముడు శరణుజొచ్చిన అభయము నొసంగువాడుకూడ పాపియగుదురు, కావున, విప్రశార్దూలా! మాతృగామియైన యీవానిని నీయాశ్రమమునుండి బహిష్కరింపుము. సాధ్విశిరోమణియైన తారను తక్షణమే బృహస్పతి కర్పింపుము."

మహాదేవుని యీ దేశము నాలకించి శుక్రాచార్యుడు భక్తిభావసమన్వితుడై శంకరుని నిట్లు స్తుతింపదొడంగెను. "సురాసురగణములకు, సర్వులకు ఇంద్ర! జగత్పతీ! నీవు దక్క అన్యు లెవ్వరు సురాసురులను శాసింపగలరు? నీవే సర్వశాసకుడవు, సంహర్తవు, పరంజ్యోతివి, పరబ్రహ్మవు, దివ్యగుణసంయుక్తుడవు, ప్రాకృతికగుణరహితుడవు, పరమాత్మా! నీవే గుణభేదస్వరూపముగ మూర్తిభేదములలో బ్రహ్మవిష్ణుశివాత్మకుడవైతివి. ప్రభూ బలిద్వారమున నీవే ద్వారపాలివై ప్రకాశించుచున్నావు. నాకు నీవే స్వయముగ లీలగ అఖండశ్రీని ప్రసాదించితివి. శంకరా! శాంతింపుము. నన్ను క్షమింపుము. బ్రాహ్మణుడ నైన నాపై మీ కేలకోపము. దేవా! నాశరీరములో ప్రాణమున్నంతవఱకు నాశరణాగతు డైన చంద్రుని పరిత్యజింపను. దీను డైన శరణాగతుని పరిత్యజించుట యత్యంత లజ్జాకరవిషయము, పాపమునకు హేతువు. మహేశ్వరా! నీపాదములను నే నాశ్రయించుచున్నాను. దేవా! నీచిత్తమెచ్చిన ట్లొనరింపుము."

శుక్రాచార్యుని ప్రార్థనల నాలకించిన శంకరుడు ప్రసన్నుడయ్యెను. తా నొనరించిన దుష్కృత్యమునకు పశ్చాత్తప్త హృదయుడై చంద్రుడు తారను బరిత్యజించి శంకరుని చరణముల నాశ్రయించెను. ఆశుతోషు డైన హరుడు శుక్రాచార్యుని, చంద్రుని యనుగ్రహించి వారలకు తనచరణరజమును ప్రసాదించి పునీతులుగ నొనరించెను. యోగీంద్రు డైన హరుడు యోగబలముచే చంద్రుని రెండు భాగములుగ విభజించి యర్ధభాగమును తన శిరమునం దుంచు కొనినవాడై మిగిలిన యర్ధభాగమును బ్రహ్మ సమక్షమునం దుంచెను. సర్వ దేవతా సమక్షమున లజ్జితు డైన చంద్రుడు క్షీరసాగరములో తన దేహమును బరిత్యజించెను. తనకుమారుడు మరణించుట గాంచి అత్రిమహర్షి చింతాక్రాంతు డై దుఃఖిపగా ఆయన యశ్రువులు క్షీరసాగరమందు బడినవి. ఆయశ్రువులనుండి క్షీరసాగరములో నిష్పాపియై చంద్రుడు మఱల ప్రాదుర్భవించెను. పవిత్రు డైన నిశాకరుడు బ్రహ్మను, శంకరుని అభిషేకించి, పూజించి యనేకవిధముల స్తుతించెను. ఆ దేవసభామధ్యమున యత్యంత ప్రసన్నుడై మహాదేవుడు చంద్రు నుద్దేశించి యిట్లు పల్కెను. "చంద్రా! స్వస్థానమునకు మఱలిపొమ్ము. తారా శాపమువలన నీకు అవశ్యము యక్ష్మరోగము సంభవింపగలదు, ఎందువలెననగా పతివ్రతయైన స్త్రీశాపము వ్యర్థముకాదు, కాని నా యాశీర్వాదమువలన నీవు మఱల రోగవిముక్తి నొందగలవు. నీవు భాద్రపద శుక్లచతుర్థినాడు గురుపత్ని యైన తారను బలాత్కరించితివి, కావున యాదినమున నిన్ను దర్శించినవారికి యవశ్యముగ పాపముగల్గును, శుభాశుభ కర్మల ననుభవింపనిదే యవినశింపవు. తారాపహరణ పాపకార్యమువలన నీకు సంభవించిన కళంకము మృగాకృతిగ యుగయుగముల పర్యంతము నీయం దుండగలదు.

తదుపరి హరుడు సాధ్వి యైన తార నుద్దేశించి యిట్లు పల్కెను. "తారా! చంద్రునివలన నీకు సంక్రమించిన సద్యోగర్భము ఫలించిన యనంతరమే నీవు పరిశుద్ధురాల వయ్యెదవు.

శ్లో॥ అకామతో బలాత్ సాధ్వీ న స్త్రీ జారేణ దూష్యతి।
కామతో నరకం యాతి యావచ్చన్ద్రదివాకరౌ ॥ 59

అకామిని యైన స్త్రీ పరపురుషునిచే బలాత్కరింప బడినను జారత్వమున కామె దూషితురాలు కాదు. కాని స్త్రీ కామాసక్తయై పరపురుషునితో చరించిన నిశ్చయముగ సూర్యచంద్రు లున్నంతవఱకు నరక మనుభవింపగలదు."

తదనంతరము సకలదేవతలు బ్రహ్మమహేశ్వరులు తమతమ స్థానముల కరిగిరి. బృహస్పతి తారను పరిగ్రహించి నిజాశ్రమమునకు జనెను. తార కనకప్రభ సన్నిభుడైన పుత్రుని బ్రసవించెను. చంద్రుడు బ్రహ్మ మహేశ్వరు లకు అనేక ప్రణామము లర్పించి తనకుమారుని పరిగ్రహించెను. నందరాజా! ఇట్లు నీకు పుణ్యప్రదమైన యీ యాఖ్యానమును వర్ణించితిని. ఈ యాఖ్యానము నాలకించినవారు నిష్కళంకులు కాగలరు. వారు ధన్యులై యశస్వులై ఆయుష్మంతులై సర్వసంపద్యుక్తులయ్యెదరు. ఈ యాఖ్యానము శోకహారము, హర్షకరము, మంగళప్రదము. తండ్రీ! శోకమును బరిత్యజించి స్వగృహమునకు మరలిపొమ్ము. వ్రజేశ్వరా! నేను వర్ణించినజ్ఞానవిషయముల నన్నింటినీ నాతల్లి యగు యశోదకు, గోపికాగణములకు బోధింపుము. నాయాజ్ఞాప్రభావమువలన సదాహర్షయుక్తుడవై వర్ధిల్లుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో శుక్రాచార్యుని చెంతకు
దేవత లరుదెంచుట యను ఎనుబదియొకటవ
అధ్యాయము సంపూర్ణము

---

# ఎనుబదిరెండవ అధ్యాయము

## దుస్స్వప్న వర్ణనము

శ్రీ నందుడు పలికెను :-

దేవా! మహాభాగా! నీ యనుగ్రహమువలన సర్వమును శ్రవణ మొనరింప గల్గితిని. దుఃస్వప్నవిషయములను వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ కృష్ణుడు పలికెను :-

వ్రజేశ్వరా! స్వప్నములో హర్షాతిరేకముతో నట్టహాసమునుగాని, వివాహమునుగాని, మనోనుకూలనృత్యగానములనుకాని దర్శించినవానికి విపత్తులు నిశ్చితములు. స్వప్నములో దంతములు ఖండింపబడినట్లు, అవి పతనమైనట్లు గాంచినవారికి ధనహాని, శరీరకష్టము సంభవింపగలదు. నూనెలో స్నాన

మాచరించి, గార్దభమునుగాని, ఒంటెనుగాని, మహిషమునుగాని అధిరోహించి దక్షిణదిశగ పయనించినట్లు స్వప్నము గాంచినవానికి నిస్సందేహముగ మరణము కల్గును. స్వప్నములో నవ్వునుగాని, నూనెనుగాని గాంచిన యాపదల నెదుర్కొనవలసివచ్చును. దిగంబరిని, కృష్ణవర్ణురాలిని, ఖండితనాసిక యైన శూద్రవిధవను స్వప్నములో దర్శించిన మనుష్యునకు శోకముకల్గును. స్వప్నములో బ్రాహ్మణుడు బ్రాహ్మణి కోపించినట్లు దర్శించిన మనుష్యునకు విపత్తులు వాటిల్లగలవు, లక్ష్మి వారిగృహమును వీడి పోగలదు. వన్యపుష్పములను బాగుగ పుష్పభరిత మైన కలశమును, దూదిని, తెల్లనివస్త్రములను, కలలో గాంచినమనుష్యునకు దుఃఖము సంభవించును. నల్లని వస్త్రములను ధరించి కృష్ణవర్ణముగలస్త్రీ నవ్వుచున్నట్లు, పాడుచున్నట్లు స్వప్నములో గనబడిన మనుష్యునకు మృత్యువు కల్గును. స్వప్నములో దేవగణములు నర్తించినట్లు, గానమొనరించినట్లు, నవ్వినట్లు, పరుగిడినట్లు గనబడినవానిశరీరము మృత్యువాత పడగలదు. స్వప్నములో కృష్ణపుష్పమాలను, కృష్ణాంగరాగముచే సుశోభిత యైన కృష్ణవస్త్రధారిణి యైనస్త్రీ తన్ను ఆలింగనమొనరించినట్లు గాంచినవారికి మృత్యువు సంప్రాప్తించును. మృతవత్సమును, మనుష్యునికపాలమును, అస్థిమాలను స్వప్నములో గాంచినవారికి విపత్తులు సంభవింపగలవు. గార్దభములనుగాని, యొంటెలనుగాని పూంచినరథముపైన అధిష్ఠించినట్లు స్వప్నములో గాంచిన ఆక్షణమే మేల్కాంచినవారు మృత్యువునొందగలరు. తాను హవిష్యమందు, మధువునందు, క్షీరములందు, గుడము (బెల్లము) నందు అభ్యంగన మొనరించినట్లు గాంచిన నిశ్చయముగ పీడింపబడగలడు. రక్తపుష్పమాలికలను, రక్తాంబరములను ధరించినస్త్రీ రక్తాంగరాగమును శరీరమం దలంకరించుకొని తన్ను ఆలింగనమొనరించినట్లు గాంచినవారు రోగగ్రస్తులు కాగలరు. ఖండిత నఖములను, కేశములను, నిర్వాణాంగారములను (ఆరినబొగ్గులు), భస్మపూర్ణ చితిని స్వప్నములో గాంచినమనుష్యుడు అవశ్యముగ మృత్యువాతపడగలడు. శ్మశానమును, కాష్ఠమును, శుష్కతృణములను, లోహమును, నల్లని సిరాను, నల్లనియశ్వమును స్వప్నములో గాంచిన దుఃఖము కల్గును. పాదుకలను, లలాటాస్థికను, రక్తవర్ణ పుష్పమాలికను, మాషమును గాంచిన శరీరమందు గాయములుగాని వ్రణములుగాని సంభవింపగలవు. స్వప్నములో కటకమును, కాకమును, భల్లూకమును, వానరమును, నీలవర్ణము

...కొన్నను, గాత్రమాలమును గాంచిన వ్యాధులు సంభవింపగలవు. స్వప్నములో ...పొందిన వాత్రిలను, గాయములను, శూద్రుని, కుష్ఠురోగిని, సామాన్యరోగిని, రక్తవస్త్రములను, జటాధారిని, సూకరమును, మహిషమును, గార్దభమును, గాఢాంధకారమును, మహాఘోర మృతజీవిని, యోని చిహ్నములను గాంచిన మనుష్యుడు నిశ్చయముగ విపత్తులలో చిక్కగలడు. కువేషధారులు ...పాశములనే అస్త్రములుగా ధరించిన యమదూతలను దర్శించిన మనుష్యునకు మృత్యువుకల్గును. బ్రాహ్మణుడు, బ్రాహ్మణి, బాలకన్య, బాలకుడు. ...మున దుఃఖించినట్లు గాంచిన వారికి దుఃఖములు సంప్రాప్తించును. రక్తవర్ణ పుష్పములను, కృష్ణ వర్ణ పుష్పమాలికలను, శస్త్రములను ధరించిన ...ను, వికృతాకార స్వరూపిణి యైన మ్లేచ్ఛస్త్రీని దర్శించిన నిస్సందేహముగా మృత్యువు సంభవించును. వాద్యములను, నృత్యమును, గానమును, గాయకుని, రక్తవర్ణ వస్త్రములను, మ్రోగింపబడు మృదంగమును స్వప్నములో గాంచిన వానికి అవశ్యము దుఃఖములు సంప్రాప్తింపగలవు. ప్రాణరహిత మైన శిశువును గాంచిన మృత్యువు లభించును. మత్స్యములను ధరించినటుల స్వప్నములో గాంచినవారికి సోదరుని మరణము ధ్రువము. గాయము లైన వానిని, శిరము లేని మొండెమును, ముండిత శిరస్కుని, స్వప్నములో గాంచినవారికి మృత్యువు కల్గును. మరణించిన పురుషుడుకాని లేదా మరణించిన కృష్ణ వర్ణ భయంకర మ్లేచ్ఛనారినిగాని ఆలింగన మొనరించినట్లు స్వప్నములో గాంచినవారికి మరణము నిశ్చయము. దంతములు భగ్నమైనట్లు, కేశములు పతనమైనట్లు స్వప్నములో గాంచినవారికి ధనహాని, శరీరకష్టము కలుగును. సింహములు, దంష్ట్రలుకల్గిన జీవివలన నుపద్రవము సంభవించినట్లు స్వప్నములో గాంచినవారికి రాజభయము సంభవించును. ఛిన్నవృక్షమును శిలావృష్టిని, తుషమును, క్షురమును, ఎఱ్ఱని నిప్పుకణములను, భస్మవృష్టిని స్వప్నములో గాంచినవారికి దుఃఖములు ప్రాప్తింపగలవు. గృహముగాని, పర్వతముగాని పతనమైనట్లు, భయంకరధూమకేతువును, ఖండితభుజములుగల మనుష్యుని స్వప్నములో గాంచినవారు దుఃఖము లనుభవింతురు.

స్వప్నములో రథమును, గృహమును, పర్వతమును, వృక్షమును, గోవును, ఏనుగును, గుఱ్ఱమును ఆకాశమునుండి భూమిపైబడినట్లు గాంచిన

వారికి ఆపద సంభవించును. భస్మయుక్తములు, అంగారయుక్తములు నగు అగడ్తలయందు, క్షౌరకుండములందు, దూళిరాశిపైన, ఎత్తున నుండి తాను పడినట్లు కలగన్నవారికి మృత్యువు సంభవింపగలదు. శిరముపై గల తన ఛత్రమును దుష్టుడు అపహరించినటుల కలగన్న వారియొక్క తండ్రి, గురువు, రాజు నశింపగలరు. ఎవరిగృహమును వత్ససహిత గోవు భీతురాలై వీడునో, వాని గృహమునుండి లక్ష్మి మఱలిపోగలదు, వానికి మృత్యువు నిశ్చితము. జ్యోతిష్కుడైన బ్రాహ్మణుడు, బ్రాహ్మణి, గురుడు, కోపించిన తన్ను శపించినట్లు కలగన్నవారికి విపత్తులు కల్గును. ఎవనిశరీరముపై శతృవులు, కాకములు, కుక్కుటములు, భల్లూకములు దాడివెడలినట్లు గాంచెదరో వారికి మృత్యువు సంభవింపగలదు. స్వప్నములో తనపై మహిషము, భల్లూకము, ఒంటె,సూకరము, గార్ధభము కోపించి దాడివెడలినట్లు గాంచినవారు రోగముల పొందగలరు.

శ్లో॥ రక్తచన్దనకాష్ఠాని ఘృతాయుక్తాని జుహోతి యః ।
గాయత్ర్యాశ్చ సహస్రేణ తేన శాన్తిర్విధీయతే ॥ 42

సహస్రధా జపేద్యో హి భక్త్యైనం మధుసూదనమ్ ।
నిష్పాపో హి భవేత్సోఽపి దుఃస్వప్నః సుఖవాన్ భవేత్ ॥ 43

రక్తచందన కాష్ఠములను ఘృతములో ముంచి గాయత్రీ యన్త్రమును వేయిమారు లుచ్చరించుచు, అగ్నియందు హవన మొనరించు వారి దుఃస్వప్నజనిత దోషములు శాంతింపగలవు. భక్తిపూర్వకముగ మధుసూదనుని దివ్యనామములను వేయి పర్యాయములు జపించిన వారు నిష్పాపులయ్యెదరు, వారు గాంచిన దుఃస్వప్నము లన్నియు సుఖదాయకములు కాగలవు.

శ్లో॥ అచ్యుతం కేశవం విష్ణుం హరిం సత్యం జనార్దనమ్ ।
హంసం నారాయణం చైవ హ్యేతన్నామాష్టకం శుభమ్ ॥ 44

శుచిః పూర్వముఖః ప్రాజ్ఞో దశకృత్వశ్చ యో జపేత్ ।
నిష్పాపోఽపి భవేత్ త్సోఽపి దుఃస్వప్నః శుభవాన్ భవేత్ ॥ 45

విద్వాంసులు పవిత్రులై పూర్వాభిముఖులై అచ్యుత, కేశవ, విష్ణు, హరి, సత్యము, జనార్దన, హంస, నారాయణ, అను నీ యష్ట శుభనామములను పదిపర్యాయములు జపించినచో వారి పాపములు నశించి వారు గాంచిన దుఃస్వప్నములు శుభకరములుగ మారిపోగలవు.

శ్లో॥ విష్ణుం నారాయణం కృష్ణం మాధవం మధుసూదనమ్ ।
హరిం నరహరిం రామం గోవిన్దం దధివామనమ్ ॥ 46

భక్త్యా చేమాని భద్రాణి దశనామాని యో జపేత్ ।
శతకృత్వో భక్తియుక్తో జప్త్వా నీరోగతాం వ్రజేత్ ॥ 47

లక్షధా హి జపేద్యో హి బన్ధనాన్ముచ్యతే ధ్రువమ్ ।
జప్త్వా చ దశలక్షం మహావన్ధ్యా ప్రసూయతే ॥ 48

హవిష్యాశీ యతః శుద్ధో దరిద్రో ధనవాన్ భవేత్ ।
శతలక్షం చ జప్త్వా చ జీవన్ముక్తో భవేన్నరః ॥
శుద్ధో నారాయణక్షేత్రే సర్వసిద్ధిం లభేన్నరః ॥ 49

భక్తిపూర్వకముగ విష్ణు, నారాయణ, కృష్ణ, మాధవ, మధుసూదన, హరి, నరహరి, రామ, గోవింద, దధివామన అనునీపదిమంగళనామములను నూఱుపర్యాయములు జపించువారు రోగరహితులు కాగలరు. ఈదివ్యనామముల నొకలక్షపర్యాయములు జపించినవారు బంధనములనుండి ముక్తులు కాగలరు. పదిలక్షలపర్యాయములు జపించిన మహావంధ్యయైనస్త్రీ పుత్రుని ప్రసవింపగలదు. శుద్ధుడై హావిష్యమును భుజించుచు ఈ దివ్యనామములను జపించినదరిద్రుడు ధనవంతుడు కాగలడు. శుద్ధముగ నీదివ్యనామములను కోటిపర్యాయములు జపించినమనుష్యుడు జీవన్ముక్తుడు కాగలడు. నారాయణక్షేత్రములో పరిశుద్ధుడై యీదివ్యనామముల జపమొనరించినమనుష్యునకు సర్వసిద్ధులు సులభముగ లభింపగలవు.

శ్లో॥ ఓం నమః శివం దుర్గాం గణపతిం కార్తికేయం దినేశ్వరమ్ ।
ధర్మం గఙ్గాం చ తులసీం రాధాం లక్ష్మీం సరస్వతీమ్ ॥ 50

నామాన్యేతాని భద్రాణి జలే స్నాత్వా చ యో జపేత్ ।
వాంఛితం చ లభేత్సోఽపి దుఃఖస్వప్నః శుభవాన్ భవేత్ ॥ 51

జలములలో స్నానమొనరించి ఓంనమః యనుచు "శివ దుర్గ గణపతి కార్తికేయ దినేశ్వర ధర్మ గఙ్గ, తులసి, రాధ, లక్ష్మి, సరస్వతి దివ్యమంగళ" యనునామములను జపించువారిసకలమనోరథములు సిద్ధింపగలవు. వారు గాంచినదుఃస్వప్నములన్నియు శుభప్రదములు కాగలవు.

మంత్రము : ఓం హ్రీం శ్రీం క్లీః పూర్వం దుర్గతినాశిన్యై మహామాయాయై స్వాహా

శ్లో॥ కల్పవృక్షో హి లోకానాం మన్త్రః సప్తదశాక్షరః ।
శుచిశ్చ దశధా జప్త్వా దుఃస్వప్నః సుఖవాన్ భవేత్ ॥ 52

శతలక్షజపేనైవ మన్త్రసిద్ధిర్భవేన్నృణామ్ ।
సిద్ధమన్త్రీస్తు లభతే సర్వసిద్ధిం చ వాంఛితామ్ ॥ 53

"ఓం హ్రీం శ్రీం క్లీః దుర్గతినాశినై మహామాయాయై స్వాహా"

ఈసప్తదశాక్షరమంత్రము దేహధారులకు కల్పవృక్షసమము. పవిత్ర పూర్వక మగు నీ మహామంత్రమును పదిపర్యాయములు జపించిన దుఃస్వప్న ములు సుఖదాయకములు కాగలవు. ఒక కోటిపర్యాయములు జపించినమను ష్యుడు మంత్రసిద్ధి నొందగలడు. తా నభిలషించుసకలసిద్ధులను ఈసిద్ధమంత్రము వలన అనాయాసము గ పొందగలడు.

శ్లో॥ ఓం నమో మృత్యుంజయాయేతి స్వాహాన్తం లక్షధా జపేత్ ।
దృష్ట్వా చ మరణం స్వప్నే శతాయుశ్చభవేన్నరః ॥ 54
పూర్వోత్తరముఖో భూత్వా స్వప్నం ప్రాజ్ఞే ప్రకాశయేత్ ॥

"ఓం నమో మృత్యుంజయాయ స్వాహా, అను నీ మంత్రమును ఒక పర్యాయము జపించు వాడు స్వప్నములో మరణము దర్శించినను నూఱు సంవత్సరములు జీవింపగలడు. పూర్వాభిముఖుడై విద్వాంసునితో తన స్వప్న విషయములను చెప్పవచ్చును." కాని తాగుబ్రోతుతో, దుర్గతి ప్రాప్తునితో, నీచునితో, దైవబ్రాహ్మణ నిందకునితో, మూర్ఖునితో, స్వప్న శుభాశుభము లను దెలియని వానితో చెప్పరాదు,

అశ్వత్థవృక్ష సమీపమున, పితృస్థానముచెంత. దైవస్థానముచెంత జ్యోతిష్కుని యెదుట, బ్రాహ్మణుని యెదుట, ఆర్య పురుషుని యెదుట, వైష్ణవుని యెదుట, మిత్రుని యెదుట పగలు మాత్రమే తాను గాంచిన స్వప్న ములను బహిర్గత మొనరింపవలెను. తండ్రీ! ఇట్లు నేను పవిత్ర స్వప్నప్రసంగ మును వర్ణించితిని. ఈ యాఖ్యానము పాపనాశకము, ధనప్రదాయకము, యశోవర్ధకము, ఆయుర్వర్ధకము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ జన్మఖండములో దుఃస్వప్న వర్ణనమను ఎనుబదిరెండవ అధ్యాయము సంపూర్ణము

# ఎనుబదిమూడవ అధ్యాయము

## -: వర్ణాశ్రమములు :-

శ్రీ నందుడు పలికెను:

కుమారా! నీకు కళ్యాణమగుగాక! వేదము లెట్లుద్భవించినవో? బ్రహ్మాదు లెట్లు ప్రాదుర్భవించిరో జెప్పుము. ఎందువలెననగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లొనరించు ధర్మములను, సన్యాసులు, బ్రహ్మచారులు, వైష్ణవులు, సత్పురుషులు, పతివిహీన లైన వృద్ధస్త్రీలు, పతివ్రతా శిరోమణులు, గృహస్థులు, గృహస్థపత్నులు, విశేషముగ శిష్యులు, తల్లిదండ్రుల యెడల పుత్రులు, కన్యలు ఆచరింపదగు ధర్మములను కృపతో బ్రవచింపవలసినదిగ ప్రార్థించు చున్నాను. దేవా! స్త్రీ లెన్నివిధములు? భక్తులయం దెన్ని భేదములు కలవు? బ్రాహ్మణు లెన్ని రకములుగ కలరు? సంభాషణ మెన్ని విధములు? నిత్య మేది? కృత్రిమ మేది? నాయీ సందేహముల నన్నింటిని క్రమముగ నివారింపవలసినదిగ గోరుచున్నాము.

శ్రీ కృష్ణుడు పలికెను :-

శ్లో॥ సన్ధ్యాపూతః సదా విప్రః కురుతే మమ సేవనమ్ ।
నిత్యం భుంక్తే మత్ప్రసాదమనివేద్య కదా చ న ॥ 6

అన్నం విష్ఠా జలం మూత్రం యద్విష్ణోరనివేదితమ్ ।
విష్ణుప్రసాదభోజీ చ జీవన్ముక్తశ్చ బ్రాహ్మణః ॥ 7

నందమహారాజా! సదా సంధ్యావందనమాచరించుచు పవిత్రుడై నిత్యము నాసేవానిమగ్నుడై నాప్రసాదమును భుజించువాడు బ్రాహ్మణుడని తెలిసికొనుము. ఆతడు నాకు నివేదించనిదే ఎపుడును ఆహారము నారగింపడు, ఎందువలెననగా విష్ణువున కర్పింపని అన్నము మలసమానము జలములు మూత్రసమానము. అందువలన విష్ణుప్రసాదమును భుజించుసద్బ్రాహ్మణుడు జీవన్ముక్తుడు కాగలడు.

శ్లో॥ నిత్యం తపస్యానిరతః శుచిః శాన్తశ్చ శాస్త్రవిత్ ।
వ్రతతీర్థాశ్రితో ధర్మీ నానాధ్యాపన సంయుతః ॥ 8

విష్ణుమన్త్రం గృహీత్వా చ కృత్వా చ గురుసేవనమ్ ।
గృహీత్వా తదనుజ్ఞాం చ పశ్చాద్భవతి సద్గృహీ ॥ 9

నిత్యము తపస్సునందు సంలగ్నుడై యుండుట, పవిత్రుడై మెలగుట, శమపరాయణత్వము, శాస్త్రజ్ఞానము, వ్రతాచరణము, తీర్థసేవనము, నానా ప్రకారాధ్యాపన కార్యము బ్రాహ్మణుని కర్తవ్యములు. అట్టి ధర్మాత్ముడైన బ్రాహ్మణుడు విష్ణుమంత్ర దీక్షవహించి, ఆచార్యుని సేవించి, గురుదేవుని యనుజ్ఞ పొందిన యనంతరమే గృహస్థు కావలెను.

శ్లో॥ దక్షిణాం నిత్యపూజానాం గురవే చ నివేదయేత్ ।
గురూణాం పోషణం నిత్యం కర్తవ్యం నాత్ర సంశయః ॥ 10

ఆచార్యుని సేవించి దక్షిణ నొసంగి సత్కరింపవలెను. నిస్సందేహముగ గురుజనులను పాలించి పోషించుట దేహధారుల ప్రాథమిక కర్తవ్యము.

శ్లో॥ సర్వేషామపి వన్ద్యానాం పితా చైవ మహాన్ గురుః ।
పితుః శతగుణై ర్మాతా మాతుః శతగుణైః సురః ॥ 11
మన్త్రద స్తన్త్రదశ్చైవ సురాణాం చ చతుర్గుణః ।
నారాయణశ్చ భగవాన్ గురుః ప్రత్యక్ష ఈశ్వరః ॥ 12

సమస్త వందనీయులయందు తండ్రియే మహాగురువు, కాని తండ్రికంటె తల్లి వందరెట్లు అధికురాలు, తల్లికంటె అభీష్టదైవము వందరెట్లు అధికుడు, అభీష్ట దేవునికంటె మంత్ర తంత్ర జ్ఞానభక్తి ప్రదాతయైన యాచార్యుడు నాల్గురెట్లు శ్రేష్ఠుడు, ప్రత్యక్ష రూపములో గురువే ఐశ్వర్యశాలియైన శ్రీమన్నారాయణుడు.

శ్లో॥ ఉద్దేశే దీయతే తస్మై సురాయేతి శ్రుతౌ శ్రుతమ్ ।
ప్రత్యక్షభోక్తా స్వగురుః స్వయం దేహీ జనార్దనః ॥ 13

దేవతలకు హావిర్భాగము లర్పింపవలెనన్న వారి నుద్దేశించి మరియొకరికి (అగ్నికి) అర్పింపవలె నని శ్రుతివచనము, కాని మనయెదుట ప్రత్యక్షభోక్తాగా నున్న స్వగురువే స్వయముగ జనార్దన స్వరూపు డని గ్రహించి, ఆయనకు సర్వస్వమును అర్పింపవలెను.

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురురేవ స్వయం శివః ।
గురౌ చ సర్వదేవాశ్చ తిష్ఠన్తి సతతం ముదా ॥ 14
గురౌ తుష్టే హరిస్తుష్టో యస్మిం స్తుష్టే చ దేవతాః ।
గురుః పుత్రసమం స్నేహం శిష్యేషు న కరిష్యతి ॥
లభతే బ్రహ్మహత్యాం చ భుంక్తే కృత్వా చ నాఽఽశిషమ్ ॥ 15

గురువే బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే శివుడు, సర్వదేవతలు సదా గురువునందే హర్షపూర్వకముగ నివసింతురు. ఏదేవాదిదేవుడు సంతుష్టుడైన సకలదేవతలు సంతుష్టు లయ్యెదరో ఆశ్రీహరి కూడ గురుడు ప్రసన్నుడైన

తాను ప్రసన్నుడు కాగలడు. శిష్యులపై పుత్రసమాన ప్రేమను చూపని యెడల, శుభాశీర్వాదముల నొసంగని యెడల గురువకు బ్రహ్మహత్యా పాతకము సంభవించును.

శ్లో॥ స్వధర్మనిరతో విప్రో బ్రాహ్మణశ్చ సదా శుచిః।
విష్ణుసేవీ సదా విప్ర స్తదన్యోఽప్య శుచిః సదా ॥ 18

సదా తనధర్మమందు తత్పరుడై, బ్రహ్మజ్ఞుడై విష్ణుసేవ నొనరించువాడు పరమ పవిత్రుడు. అట్టి బ్రాహ్మణుడు దక్క అన్యులు అపవిత్రులే.

వృషభములను పూంచువారు, శూద్రులకు అన్నమును వండువారు, దేవమూర్తుల కర్పించిన ద్రవ్యములచే జీవన నిర్వాహ మొనరించుకొనువారు, సంధ్యారహితులు, ఉత్సాహహీనులు, దినమందు నిద్రించువారు నగు బ్రాహ్మణులు శూద్రులతో సములు.

శ్లో॥ సాలగ్రామ మహామన్త్రిం కృత్వా పూజాం విధానతః।
భుంక్తే నైవేద్యశేషశ్చ తత్పాదోదకమేవ చ ॥ 19
హరేః పాదోదకం పీత్వా తీర్థస్నానీ భవేన్నరః।
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి ॥ 20
స స్నాతః సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దీక్షితః।
సాలగ్రామశిలాతోయైర్యోఽభిషేకం సమాచరేత్ ॥ 21
గఙ్గా జలాద్దశగుణం సాలగ్రామజలం వ్రజ।
నిత్యం భుంక్తే చ యో విప్రో జీవన్ముక్తః సురైః సమః ॥ 22

విధిపూర్వకముగా సాలగ్రామ మహాయంత్రమునకు నిత్యము పూజలొనరించుచు సాలాగ్రామార్పిత నైవేద్యమును, చరణోదకమును సేవించువారు సర్వపాపములనుండి విముక్తులు కాగలరు. వారికి విష్ణులోకము లభించును, ఎందువలెననగ శ్రీహరి చరణామృత పానమొనరించిన మనుష్యుడు తీర్థస్నాత కాగలడు. సాలగ్రామ శిలాభిషేకజలములను తమపై సంప్రోక్షణచేసికొను వారు సర్వతీర్థములందు స్నానమాచరించినట్లే, సర్వయజ్ఞ దీక్షాగ్రహణ మొనరించినట్లే. వ్రజేశ్వరా! సాలగ్రామ శిలాభిషేజకలము గంగాజలము కంటె పదిరెట్లు శ్రేష్ఠము. సాలగ్రామ జలములను నిత్యము పానమొనరించు బ్రాహ్మణుడు దైవసముడు జీవన్ముక్తుడు కాగలడు.

శ్లో॥ విప్రాణాం నిత్యకృత్యం చ విష్ణోర్నైవేద్యభోజనమ్।
యత్నేన పూజనం తస్య తత్పాదోదకసేవనమ్ ॥ 23
నిత్యం త్రిసధ్యం కురుతే భక్త్యా చ మమ పూజనమ్।
ఏకాదశ్యాం న భుంక్తే చ మమ వై జన్మవాసరే ॥ 24

శివరాత్రౌ చ హే తాత శ్రీరామనవమీదినే ।
న చ భుంక్తే వ్రతీ యో హి జీవన్ముక్తో హి స ద్విజః ॥ 25
పృథివ్యాం యాని తీర్థాని తస్య పాదే చతాని చ ।
విప్రపాదోదకం పీత్వా తీర్థస్నాయీ భవేన్నరః ॥ 26

బ్రాహ్మణుల నిత్యకర్మలేవనగా; నిత్యము శ్రీహరిని యత్నపూర్వకముగ పూజించుట, విష్ణువున కర్పించిననైవేద్యమునే భుజించుట, నిత్యము శ్రీహరిచరణోదకపానమొనరించుట, నిత్యము త్రికాలసంధ్యావందనమాచరించుట, నిత్యము భక్తిపూర్వకముగ నన్ను (శ్రీకృష్ణుని) ఆరాధించుట, నాజన్మాష్టమీ (శ్రీకృష్ణజన్మాష్టమీ) దినమున, ఏకాదశినాడు ఉపవాసమొనరించుట. తండ్రీ! వ్రతపరాయణుడై శివరాత్రి, శ్రీరామనవమీ దినములందు ఉపవాసమొనరించిన బ్రాహ్మణుడు జీవన్ముక్తుడు కాగలడు. భూతలమందున్న పవిత్రతీర్థములు అట్టివిప్రునిచరణములందే నివసింపగలవు; కావున యట్టి సద్బ్రాహ్మణుని చరణోదకపాన మొనరించిన మనుష్యుడు తీర్థస్నానికాగలడు

విష్ణుప్రసాదమును భుజించుబ్రాహ్మణుడు పృథ్విని, తీర్థములను, మనుష్యులను పవిత్రమొనరించి తాను స్వయముగ జీవన్ముక్తుడుకాగలడు. విష్ణుమంత్రము నుపాసించుబ్రాహ్మణుడే వైష్ణవుడు. ఆవైష్ణవబ్రాహ్మణుని బుద్ధి యత్యంతోత్కృష్టము; కావున వానిని మించినపురుషుడు మఱియొకడు లేడు. ఏక్షేత్రమునకైనను వెడలి పునశ్చరణపూర్వకముగ శ్రీమన్నారాయణ జపమొనరించువారు తాము తరించుటేకాక తమవారినెందఱినో ఉద్ధరింపగలరు. అట్టి యేకనిష్ఠగల వైష్ణవుడు తన పూర్వపురుషులను లక్షమందిని ఉద్ధరింపగలడు.

శ్లో॥ ద్విజాః సురా మమ ప్రాణా భక్తః ప్రాణాత్ పరః ప్రియః ।
విశ్వేషు ప్రియపాత్రేషు న మే భక్తాత్ పరః ప్రియః ॥ 40

బ్రాహ్మణులు, దేవతలు నాప్రాణసములు; కాని నాయనన్యభక్తులు నాకు నాప్రాణములకంటె నధికప్రియులు. సమస్తలోకములందు నాకెంతో ప్రియపాత్రులు కలరు, వారందఱిలో నాయనన్యభక్తుని మించినప్రియుడు నాకు మఱియొకడు లేడు.

విష్ణుభక్తిరహితులైనవారు విష్ణుమంత్రదీక్షగ్రహణమొనరింపరాదు. ఉత్తమబుద్ధిసంపన్నుడైనపురుషుడు ఉదాసీనుడైన, దురాచారియైన యాచా

ర్యునినుండి మంత్రదీక్షను దీసికొనరాదు. దైవవశమున నట్టి గురువునుండి మంత్రదీక్షదీసికొనిన మనుష్యుడు నిశ్చయముగ ధనహీనుడు కాగలడు. బ్రాహ్మణులభోజనము సదా మాంసరహితహవిష్యాన్న మైయుండవలెను; ఎందువలెననగా మాంసమును పరిత్యజించిన బ్రాహ్మణుడు తేజస్సులో సూర్య సముడు కాగలడు. నిజమైన బ్రాహ్మణుడు మొదట ప్రదేశమును బాగుగ సంస్కృత మొనరించి తదుపరి భోజనమును వండి పవిత్రస్థానములో నాభోజన మును భక్తిపూర్వకముగ నాకు నివేదించి నాప్రసాదమును ఆదరపూర్వకముగ నన్యులకు నొసగి, తదనంతరమే స్వయముగ భుజించును. ఇతరులకు బెట్టక తానే స్వయముగ భుజించువాడు తాగుబోతుతో సము డని గ్రహింపుము.

చంద్రసూర్యగ్రహణ సమయములందు లేదా జాతాశౌచమృతాశౌచ సమయములం దపవిత్రమనుష్యునిచే స్పృశింపబడిన భోజనమును, భ్రష్టద్రవ్యముల ను శీఘ్రమే పరిత్యాగ మొనరింపవలెను. పిమ్మట పవిత్ర మొనరింపబడినవస్త్రము లను ధరించి పాదప్రక్షాళనము గావించుకొని శుద్ధులైన పిమ్మట పవిత్రస్థానములో భుజింపవలెను. ద్విజాతులైన వారు సూర్యుడు ప్రకాశించుచుండగ, అనగా పగలు రెండు పర్యాయములు భుజింపరాదు; ఎందువలెననగ అట్లు భుజించి నచో కర్మలు నిష్ఫలములగును, భోక్త నరక మనుభవింపగలడు. హవిష్యాన్న మును భుజించు సంయమశీలుడు శ్రాద్ధదినము నందు, యాత్రా సమయమందు, యుద్ధసమయమందు, నదీతటముపై రెండవ పర్యాయము భోజనమును, మైథున మును పరిత్యాగ మొనరింపవలెను. అనన్య విష్ణు భక్తులైన, బుద్ధిమంతులైన సద్బ్రాహ్మణునకే దాన మొనరింపవలెను. కాని శూద్రస్త్రీపతియు, శూద్ర పురోహితుడు, సంధ్యాహీనుడు, దుష్టుడు, వృషభములను పూనుచు వాడు, దైవ ప్రతిమ కర్పించిన ద్రవ్యములచే జీవించువాడు నగు బ్రాహ్మణునకు దానము చేసిన నరకమును పొందగలడు. తండ్రీ! కన్యను అమ్ముకొనువాడు అందరికంటె నధిక పాపాత్ముడు, మూల్యము గైకొని కన్యాదాన మొనరించువాడు మహాఘోర వాది నరకముల బడగలడు, కన్యశరీరమం దెన్నిరోమములు కలవో అన్ని సంవత్సరము లాతడు కుంభీపాక నరక మనుభవింప గలడు. కావున బుద్ధిమంతు డైన మనుష్యుడు యోగ్యవరునకే కన్యాదాన మొనరింపవలెను, వ్రజేశ్వరా! ఇవియే వేదములద్వారా వర్ణింపబడిన బ్రాహ్మణవైష్ణవ ధర్మములు.

క్షత్రియు లైనవారు సదా యత్నపూర్వకముగ బ్రాహ్మణులను సేవింపవలెను, శ్రీమన్నారాయణుని పూజింపవలెను, ధర్మయుక్తులై రాజ్యమును పరిపాలింపవలెను, రణరంగములో భయరహితులై చరింపవలెను, నిత్యము దానముల నొనరింపవలెను, శరణాగతులను రక్షింపవలెను, దుఃఖితు లైన ప్రజలను పుత్రులవలె లాలింపవలెను, శస్త్రాస్త్రనిపుణు లై యుండవలెను, రణపరాక్రమకోవిదు లై యుండవలెను. క్షత్రియులు ధర్మతత్పరులై ధర్మకార్యముల నొనరింపవలెను. సదసద్వివేకబుద్ధిసంపన్నుడైన, నీతిశాస్త్రజ్ఞానకోవిదు డైన సత్పురుషుని యాదరించి తమసభలలో నున్నతపదవులలో నియోగింపవలెను. రాజు సదా చతురంగబలములను యత్నపూర్వకముగ పాలింపవలెను. యుద్ధము కోరకై అన్యులనాహ్వానించిన యుద్ధదానవిముఖులు కారాదు. ఎందువలెననగ యుద్ధములో ప్రాణత్యాగమొనరించినక్షత్రియులు యశస్కరులై స్వర్గము నొందగలరు.

శ్లో॥ వైశ్యానామపి వాణిజ్యమీశ్వరః కృషిపాలనే ।
విప్రదేవార్చనం దానం తపస్యా వ్రతసేవనమ్ ॥ 94

వైశ్యులధర్మమువ్యాపారము, వ్యవసాయము, సద్బ్రాహ్మణులను, దేవతలను పూజించుట, దానము లొనరించుట, తపమొనరించుట వ్రతములను పరిపాలించుట.

శ్రామికవర్గమే శూద్రు లనిగ్రహింపుము; బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులతో సహకరించుట వారి ధర్మము. బ్రాహ్మణుని హింసించి వానిధనముపై నధికారము వహించుశూద్రుడు చండాలత్వమున పొందగలడు. విప్రధనాపహారియైన శూద్రుడసంఖ్యాకజన్మలపర్యంతము నీచయోనులందుపరిభ్రమింపగలడు. బ్రాహ్మణస్త్రీలతోగాని, మాతృసమురాలైనస్త్రీతోగాని వ్యభిచరించినవాడు నూర్గురుబ్రహ్మలఆయుఃపర్యంతము కుంభీపాకనరక మనుభవింపగలడు.

సన్యాసుల ధర్మములను ప్రవచించెద నవధరింపుము: మనుష్యుడు దండమును గ్రహించినమాత్రముననే నారాయణ స్వరూపుడుకాగలడు. నన్ను ధ్యానమొనరించు సన్యాసి తన పూర్వకర్మలను నిర్మూలన మొనరించుకొని తన వర్తమానకర్మలనుచ్ఛేదన మొనరించుకొని తుదకు నాలోకము జేరగలడు. వ్రజరాజా! వైష్ణవుని చరణస్పర్శచే తీర్థములు తత్కాలమే పవిత్రములగునట్లు సన్యాసి పాదస్పర్శచే పృథ్వి తత్కాలమే పావనముకాగలదు; సన్యాసిని స్పృశిం

చిన మనుష్యుడు పాపరహితుడు కాగలడు, సన్యాసికి భోజనము నర్పించిన అశ్వమేధయజ్ఞఫలము సంప్రాప్తియగును. అకస్మాత్తుగ సన్యాసిని దర్శించి వానికినమస్కరించిన రాజసూయయజ్ఞఫలము ప్రాప్తించును, సన్యాసిని, యతిని, బ్రహ్మచారిని దర్శించిన, స్పృశించిన అట్టిఫలమే కల్గును. సన్యాసియైనవాడు ఆకలి కల్గినచో గృహస్థునికడకుజని వాని నాహారమర్థింపవలెను. గృహస్థు ప్రసాదించిన యేపదార్థములనైనను సానందముగ స్వీకరింపవలెను. గృహస్థుని మిష్టాన్నములను యాచింపరాదు. గృహస్థులపై కోపింపరాదు, గృహస్థులధనమును గ్రహింపరాదు. ఒక వస్త్రమునే ధరింపవలెను, ఇచ్ఛారహితుడై చరింపవలెను, లోభమోహములను బరిత్యజింపవలెను, సుఖదుఃఖములను సమముగ భావింపవలెను, ఒకరాత్రికంటె నెక్కువకాలమే ప్రదేశమునందును వసింపరాదు, వసించినప్రాతఃకాలముననే మఱియొక ప్రదేశమునకు జనవలెను. వాహనము నధిరోహించువాడు, గృహస్థునుండి ధనమును గ్రహించువాడు, గృహమును నిర్మించి స్వయముగ గృహస్థాశ్రమమును స్వీకరించువాడునగు సన్యాసి ధర్మభ్రష్టుడైనట్లే భావింపవలెను. వ్యవసాయమొనరించువాడు వ్యాపారమొనరించువాడు కుకర్మలనొనరించువాడునగుసన్యాసి తనస్వధర్మమునుండి పతితుడై భ్రష్టుడు కాగలడు.

తండ్రీ! పతివ్రతాపరాయణియైన బ్రాహ్మణ విధవాస్త్రీ అనుసరింపదగిన ధర్మముల నుపదేశించెద నవధరింపుము.

శ్లో॥ నారాయణస్యసేవాం చ కురుతే నిత్యమేవ చ ॥ 96
తన్నామోచ్చారణం శశ్వత్కురుతేఽనన్యభక్తితః ।
పుత్రతుల్యం చ పురుషం సదా పశ్యతి ధర్మతః ॥ 97

నిత్యము నారాయణుని స్మరింపవలెను. ప్రతిదినము నారాయణుని సేవింపవలెను. అనన్యభక్తిపూర్వకముగ నారాయణుని దివ్యనామసంకీర్తన మొనరింపవలెను. సదా ధర్మానుసారముగ పరపురుషుని పుత్రసమునిగ దర్శింపవలెను.

శ్లో॥ ఏకాదస్యాం న భోక్తవ్యం కృష్ణజన్మాష్టమీ దినే ॥ 98
శ్రీరామస్య నవమ్యాం తు శివరాత్రౌ పవిత్రయా ।
అఘోరయాం చ ప్రేతాయాం చన్ద్రసూర్యోపరాగయోః ॥ 99
భ్రష్టం ద్రవ్యం పరిత్యజ్య భుజ్యతు పరమేవ చ ।

శ్లో॥ తామ్బూలం విధవాస్త్రీణాం యతీనాం బ్రహ్మచారిణామ్ ॥ 100
సన్యాసీనాం చ గోమాంససురాతుల్యం శ్రుతౌ శ్రుతమ్ ।

ఆమెపవిత్రురాలై ఏకాదశి, శ్రీ కృష్ణజనాష్టమి, శ్రీరామనవమి, శివరాత్రి, భాద్రపదమాస కృష్ణపక్షచతుర్ధశి, నరకచతుర్ధశి, చన్ద్రసూర్య గ్రహణాదినములందు భుజింపరాదు. భ్రష్టపదార్థములను బరిత్యాగ మొనరించి అతిరిక్తములైన యుత్తమపదార్థములనే భుజింపవలెను. విధవాస్త్రీ, యతి, బ్రహ్మచారి సన్యాసులకు తాంబూలసేవనము, గోమాంససమమని, మదిరా తుల్య మని శ్రుతివచనము.

శ్లో॥ పరమార్థం పరం చైవ నిబోధ కథయామి తే ॥ 106

అధ్యాపనమధ్యయనం శిష్యాణాం పరిపాలనమ్ ।
గురూణాం సేవనం నిత్యం ద్విజదేవార్చనం తథా ॥ 107

సిద్ధాన్తశాస్త్రనైపుణ్యం భావనం స్వాత్మతోషణమ్ ।
వ్యాఖ్యానాం పరిశుద్ధం చ గ్రన్థాభ్యాస్తం చ సంతతమ్ ॥ 108

వ్యవస్థా పరిశుద్ధ్యార్థం విచారో వేదసమ్మతః ।
శాస్త్రార్థాచరణం చైవ కర్తవ్యం స్వయమేవ చ ॥ 109

దేవాహ్నికేషు నైపుణ్యం వేదాచరణమీప్సితమ్ ।
వేదోక్తభక్షణం చైవ పవిత్రాచరణం సదా ॥ 110

తండ్రీ! మీకు పరమోత్కృష్టము లైనపరమార్థముల నుపదేశించెదను శ్రవణ మొనరింపుడు. సదా అధ్యాపనము, అధ్యయనము, శిష్యపరిపాలనము, గురుజనులను సేవించుట, నిత్యము దేవతలను, ద్విజులను పూజించుట, సిద్ధాన్త శాస్త్రములందు నిపుణత్వము పెంపొందించుకొనుట, స్వాత్మతోషణము (ఆత్మానందము), సర్వదా శుద్ధవ్యాఖ్యాన మొనరించుట, నిరంతరము గ్రంథము లను బఠించి, అభ్యసించుట, మానవవ్యవస్థను ఉద్ధరించుటకు, పరిశుద్ధ మొనరించుటకు వేదసమ్మతపవిత్రవిచారములను కల్గియుండుట, స్వయముగ శాస్త్రాను సారముగ ఆచరించుట, దేవకార్యములయందు, నిత్యకర్మలందు నిపుణత్వము, వేదానుసారముగ ఆచారవ్యవహారముల ననుసరించుట, వేదోక్తపదార్థములనే భుజించుట, పవిత్రకర్మల నొనరించుట మొదలగుకర్మ లన్నియు పరమార్థా చరణములని గ్రహింపుము.

శ్లో॥ పతివ్రతానాం యో ధర్మ స్తం నిబోధ వ్రజేశ్వర ।
నిత్యం తు భర్తుర్యాత్సుక్యాత్తత్పాదోదకమీప్సితమ్ ॥ 111
భక్తి భావేన సతతం భో క్తవ్యం తదనుజ్ఞయా ।
వ్రతం తపస్యాం దేవార్చాం పరిత్యజ్య ప్రయత్నతః ॥ 112
కుర్యాచ్చరణసేవాం చ స్తవనం పరితోషణమ్ ।
తదాజ్ఞారహితం కర్మ న కుర్యాద్ వైరతః సతీ ॥ 113

వ్రజేశ్వరా! పతివ్రతలధర్మములను ప్రవచించెద నవధరింపుము. పతివ్రతయైనస్త్రీ నిత్యము పతియెడల ఉత్సుకత కలదియై భర్తచరణోదకపాన మొనరించి భక్తిపూర్వకముగ భర్తయనుజ్ఞ గైకొని భుజింపవలెను. భర్తయాజ్ఞ లేనియెడల ప్రయత్నపూర్వకముగ వ్రతములనైనను తపములనైనను, దేవతార్చనయైనను పరిత్యాగముచేసి చరణసేవలచే, స్తుతిచే అన్నివిధములుగ భర్తను సంతుష్టిపఱచవలెను. సతి పతియనుజ్ఞ లేనిదే వైరభావముతో నేకర్మనైనను ఆచరింపరాదు.

శ్లో॥ నారాయణాత్ పరం కాన్తం ధ్యాయతే సతతం సతీ ।
పరపుంసాం ముఖం చైవ సువేషపురుషం పరమ్ ॥ 114
యాత్రాం మహోత్సవం నృత్యం నర్తనం గాయనం వ్రజ ।
పరక్రీడాం చ సతతం న హి పశ్యతి సువ్రతా ॥ 115
యద్భక్ష్యం స్వామినో నిత్యం తదేవాపి యోషితామ్ ।
న హి త్యజేత్తు తత్సంగం క్షణమేవ చ సువ్రతా ॥ 116
ఉత్తరే నోత్తరం దద్యాత్ స్వామినశ్చ పతివ్రతా ।
క్షుధితం భోజయేత్ కాన్తం దద్యాత్ పానం చ భోజనమ్ ॥ 117
న బోధయేత్తం నిద్రాళుం ప్రేరయేన్నైవ కర్మసు ॥

సాధ్వి తనభర్తను సదా నారాయణునికంటె నధికునిగ భావించి సేవించును. వ్రజనాథా! ఉత్తమవ్రత పరాయణురాలైనసతి పరపురుషుని ముఖమునుగాని, సుందరవేషధారి యైనసౌందర్యశాలి యైనపురుషుని, యాత్రయందుగాని, మహోత్సవమందుగాని, నృత్యమందుగాని, నర్తకులందుగాని, గాయకులందుగాని, పరక్రీడలందుగాని చూడదు. భర్తకుప్రియ మైనయాహారమునే సదా పతివ్రతకూడ సేవింపవలెను. పతివ్రత క్షణకాలమైనను పతినుండి యెడబాటుకారాదు. భర్తకు ఉత్తరప్రత్యుత్తరముల నొసంగరాదు.

పతివ్రతాస్త్రీ భర్త ఆకలిగొన్న భోజనమునిడవలెను: భోజనముకొఱకు ఉత్తమపదార్థములను సిద్ధమొనరించి పాన మొనరించుటకు పరిశుద్ధజలముల నీయవలెను. నిద్రించుభర్తను నిద్రమేల్కొల్పరాదు. గృహకార్యనిర్వహణార్థము భర్తను ఆజ్ఞాపింపరాదు.

శ్లో॥ పుత్రాణాం చ శతగుణం స్నేహం కుర్యాత్ పతిం సతీ ।
పతిర్బన్ధుర్గతిర్భర్తా దైవతం కులయోషితః ॥ 119

శుభం దృష్ట్వా సుధాతుల్యం కాన్తం పశ్యతి సున్దరీ ।
సస్మితం వదనం కృత్వా భక్తిభావేన యత్నతః ॥ 120

పురుషాణాం సహస్రం చ సతీ స్త్రీ చ సముద్ధరేత్ ।
పతిః పతివ్రతానాం చ ముచ్యతే సర్వపాతకాత్ ॥ 121

నాస్తి తేషాం కర్మభోగః సతీనాం వ్రతతేజసా ।
తయా సార్ధం చ నిష్కర్మీ మోదతె హరిమన్దిరే ॥ 122

సతి పుత్రులకంటె వందరెట్లు అధికముగ భర్తను ప్రేమింపవలెను. ఎందువలెననగ కులాంగనకు పతియే బంధువు, ఆశ్రయుడు, పోషణకర్త, దైవము. పతివ్రతస్త్రీ అమృతసముడైన, శుభకరుడైన తనభర్తను దర్శించి గొప్పయత్నముతో భక్తిపూర్వకముగ చిరునవ్వులు చిందించుచు ఆయననే వీక్షించును. సతీస్త్రీ తన నూఱుతరములవారిని ఉద్ధరింపగలదు. అంతియేకాదు సాధ్వీశిరోమణులభర్తలు సమస్తపాపములనుండి ముక్తులుకాగలరు; ఎందువలెననగ పతివ్రతాశిరోమణుల పాతివ్రత్యదివ్యతేజము వారిసమస్తకర్మభోగములను సమాప్తమొనరింపగలదు. ఇట్లు వారు కర్మరహితులై తమతమ పతివ్రతాపత్నులతో శ్రీహరి దివ్యపరంధామమందు ఆనంద మనుభవింపగలరు.

## : ప తి వ్ర త మ హి మ :

శ్లో॥ పృథివ్యాం యాని తీర్థాని సతీపాదేషు తాన్యపి ।
తేజశ్చ సర్వదేవానాం మునీనాం చ సతీషు చ ॥ 123

తపస్వినాం తపః సర్వం వ్రతీనాం యత్ఫలం వ్రజ ।
దానే ఫలం యద్ దాతౄణాం తత్సర్వం తాసు సంతతమ్ ॥ 124

వ్రజేశా! పృథ్విపైనున్నదివ్యతీర్థము లన్నియు సతీసాధ్వీచరణములందే నివసింపగలవు. సర్వదేవతల, మహర్షుల తేజస్సు పతివ్రతాస్త్రీలయందు ఎల్లపుడు విరాజిల్లుచుండును. తాపసులతపము, వ్రతోపవాసాదులచే వ్రతులకు సంక్ర

మించుఫలము, దానములొనరించుటవలన దాతలకు లభించుపుణ్యము మొదలగునవియన్నియు సదా పతివ్రతలందు విద్యామానము లైయుండును.

శ్లో॥ స్వయం నారాయణః శమ్భుర్విధాతా జగతామపి ।
సురాః సర్వే చ మునయో భీతాస్తాభ్యాం చ సంతతమ్ ॥ 125
సతీనాం పాదరజసా సద్యః పూతా వసున్ధరా ।
పతివ్రతాం నమస్కృత్వా ముచ్యతే పాతకాన్నరః ॥ 126

స్వయముగ నారాయణుడు, శివుడు, జగద్విధాత యగు బ్రహ్మ, సర్వదేవతలు, మునులుకూడ పతివ్రతలన్న భీతినొందెదరు. సతులచరణధూళి స్పర్శమాత్రముననే పృథ్వి తత్కాలమే పావనమగును. పతివ్రతకు నమస్కరించిన మనుష్యుడు పాతకములనుండి విముక్తినొందగలడు.

శ్లో॥ త్రైలోక్యం భస్మసాత్కర్తుం క్షణేనైవ పతివ్రతా ।
స్వతేజసా సమర్థా సా మహాపుణ్యవతీ సదా ॥ 127
సతీనాం చ పతిః సాధుః పుత్రో నిఃశంక ఏవ చ ।
న హి తస్య భయం కించిద్ దేవేభ్యశ్చ యమాదపి ॥ 128
శతజన్మ పుణ్యవతాం గేహే జాతా పతివ్రతా ।
పతివ్రతాప్రసూః పూతా జీవన్ముక్తః పితా తథా ॥ 129

పతివ్రత తన ప్రచండ తేజముచే క్షణకాలములోనే త్రిలోకములను భస్మమొనరింపగలదు. ఆమె సదా మహాపుణ్యవతియైయుండును. ప్రతివ్రతల భర్తలు, పుత్రులు సదా సాధువులై చరింపగలరు; వారికి దేవతలవలనగాని, యమునివలనగాని ఎన్నడును భయము సంభవింపదు. నూరుజన్మలపర్యంతము మహాపుణ్య మొనరించిన పుణ్యాత్ములగృహమందే పతివ్రతాస్త్రీ జన్మింపగలదు. పతివ్రత జన్మించిన ఆమెతల్లి పవిత్రురాలుకాగలదు, తండ్రి జీవన్ముక్తుడు కాగలడు.

## : పతివ్రతా స్త్రీ ఆచరణములు :

శ్లో॥ సతీ స్త్రీ ప్రాతరుత్థాయ త్యక్త్వా చ రాత్రివాససమ్ ।
భర్తారం చ నమస్కృత్య కరోతి స్తవనం ముదా ॥ 130
గృహకార్యం తతః కృత్వా స్నాత్వా ధౌతే చ వాససీ ।
గృహీత్వా శుక్లపుష్పం చ భక్తితః పూజయేత్ పతిమ్ ॥ 131

శ్లో॥ స్నాపయిత్వా సుపూతేన జలేన నిర్మలేన చ ।
తస్మై దత్త్వా ధౌతవస్త్రం తత్పాదౌ క్షాలయేన్ముదా ॥ 132

ఆసనే వాసయిత్వా చ దత్త్వా భాలే చ చన్దనమ్ ।
సర్వాఙ్గలేపనం కృత్వా దత్త్వా మాల్యం గలేఽపి చ ॥ 133

సామవేదోక్తమన్త్రేణ భోగద్రవ్యైః సుధోపమైః ।
సమ్పూజ్య భక్తితః కాన్తం స్తుత్వా చ ప్రణమేన్ముదా ॥ 134

ఓం నమః కాన్తాయ శాన్తాయ సర్వదేవాశ్రయాయ స్వాహా ।
ఇత్యనేనైవ మన్త్రేణ దత్త్వా పుష్పం చ చన్దనమ్ ॥ 135

పాద్యార్ఘ్యం ధూపదీపౌ చ వస్త్రం నైవేద్యముత్తమమ్ ।
జలం సువాసితం శుద్ధం తామ్బూలం చ సువాశితమ్ ॥ 136
దత్త్వా స్తోత్రం పఠేద్ యద్యత్కృతం వై పాద్యమేవ చ ।

సతీస్త్రీ ప్రాతఃకాలముననే నిద్ర మేల్కాంచి రాత్రిధరించిన వస్త్రములను పరిత్యజించి శుద్ధవస్త్రములను ధరించి భర్తకు నమస్కరించి హర్షపూర్వకముగ స్తుతింపవలెను. తదుపరి గృహకృత్యములను సంపన్నమొనరించుకొని స్నాన మాచరించి పరిశుద్ధవస్త్రములను ధరింపవలెను. తదనంతరము శ్వేత పుష్పములతో భక్తిపూర్వకముగ భర్తను పూజింపవలెను. పవిత్రనిర్మలజలములలో పతిని స్నానమాచరింపజేసి భర్తకు పరిశుద్ధవస్త్రముల నొసంగి ఆయన పాదములను ప్రక్షాళనమొనరింపవలెను. భర్తకు ఉచితాసన మొసంగి లలాటమందు చందనతిలకము నిడి సర్వాంగములందు సుగంధానులేపన మొనరించి గళమును పుష్పమాలతో నలంకరించి మంత్రోచ్చారణపూర్వకముగ అమృతోపమయములైన పదార్థముల నర్పించి భక్తిభావసహితయై బాగుగ భర్తను పూజింపవలెను.

తదనంతరము భర్తను స్తుతించి హర్షముతో ఆయన చరణములకు నమస్కరింపవలెను. ఓం నమఃకాన్తాయ, శాన్తాయ సర్వదేవాశ్రయాయ స్వాహా అను నీమంత్రమును బఠించుచు పుష్పములను, చందనమును, పాద్యమును, అర్ఘ్యమును, ధూపమును, దీపమును, వస్త్రములను, ఉత్తమనైవేద్యములను, శుద్ధసుగంధితజలములను, సువాశితతాంబూలమును సమర్పించి పతిస్తోత్రము పఠింపవలెను. పతికి సమర్పించు సర్వసేవాసమయములందు ఈమంత్రము నుచ్చరింపవలెను.

: పతి స్తోత్రము :

శ్లో॥ ఓం నమః కాన్తాయ భర్త్రే చ శిరశ్చన్ద్రస్వరూపిణే ॥ 137
నమః శాన్తాయ దాన్తాయ సర్వదేవాశ్రయాయ చ ।
నమో బ్రహ్మస్వరూపాయ సతీప్రాణపరాయ చ ॥ 138
నమస్యాయ చ పూజ్యాయ హృదా ధారాయ తే నమః ।
పంచప్రాణాధిదేవాయ చక్షుషస్తారకాయ చ ।
జ్ఞానాధారాయ పత్నీనాం పరమానందరూపిణే ॥ 139
పతిర్బ్రహ్మ పతిర్విష్ణుః పతిరేవ మహేశ్వరః ।
పతిశ్చ నిర్గుణాధారో బ్రహ్మరూప నమోఽస్తు తే ॥ 140
క్షమస్వ భగవాన్ దోషం జ్ఞానాజ్ఞానకృతం చ యత్ ।
పత్నీబన్ధో దయాసిన్ధో దాసీదోషం క్షమస్వ మే ॥ 141
ఇదం స్తోత్రం మహాపుణ్యం సృష్ట్యాదౌ పద్మయా కృతమ్ ।
సరస్వత్యా చ ధరాయ గఙ్గాయ చ పురా వ్రజ ॥ 142
సావిత్ర్యా చ కృతం పూర్వం బ్రహ్మణే చాపి నిత్యశః ।
పార్వత్యా చ కృతం భక్త్యా కైలాసే శఙ్కరాయ చ ॥ 143
మునీనాం చ సురాణాం చ పత్నీభిశ్చ కృతం పురా ।
పతివ్రతానాం సర్వాసాం స్తోత్రమేతచ్ఛుభావహమ్ ॥ 144
పతివ్రతా చ స్తుత్వా చ తీర్థస్నానఫలం లభేత్ ।
ఫలం చ సర్వం తపసాం వ్రతానాం చ వ్రజేశ్వర ॥ 145
ఇదం స్తుత్వా నమస్కృత్వా భుంక్తే సా తదనుజ్ఞయా ।
ఉక్తః పతివ్రతాధర్మో గృహిణాం శ్రూయతాం వ్రజ ॥ 146

ఓం చంద్రశేఖర స్వరూపుడైన, ప్రియతముడైన పతికి నమస్కారము, నాథా! నీవు శాన్తుడవు, ఉదారుడవు, సంపూర్ణ దేవతలకు ఆశ్రయుడవు; నీకు ప్రణామములు. సతీప్రాణాధారా! బ్రహ్మస్వరూపా నీకు అభివాదనము. నీవు నమస్కారయోగ్యుడవు, పూజనీయుడవు, హృదయాధారుడవు, నాపంచ ప్రాణములకే అధిదేవతవు, నాకంటిపాపవు, జ్ఞానాధారుడవు, పత్నికి పరమానందస్వరూపుడవైననీకు నమస్కారము. పతియే బ్రహ్మ, పతియే విష్ణువు, పతియే మహేశ్వరుడు, పతియే నిర్గుణాధారబ్రహ్మస్వరూపము; నాథా! నాప్రణామములను స్వీకరింపుము. దేవా! నావలన తెలిసికాని, తెలియకకాని

యేయపరాధము లైనను చేసినచో నాతప్పులను క్షమింపుము, నీవు దయా సాగరుడవు; కావున ఈదాసియొక్క యపరాధములను క్షమింపుము.

వ్రజేశ్వరా! పూర్వకాలము సృష్ట్యారంభ సమయమున ఈమహాపుణ్యమయ స్తోత్రమును పద్మ (లక్ష్మి) స్తుతించెను. సరస్వతి, గంగ, పృథ్వి ఈస్తోత్రముచే భర్త నారాధించిరి. పూర్వకాలమందు సావిత్రికూడ నిత్యము ఈస్తోత్రము ద్వారా బ్రహ్మను స్తుతించెను. కైలాసముపై పార్వతీదేవి భక్తిపూర్వకముగ శంకరుని స్తుతించెను. ప్రాచీన కాలమందు మునిపత్నులు, దేవాంగనలు కూడ తమ తమ భర్తలను ఈస్తోత్రముద్వారానే స్తుతించిరి, కావున పతివ్రతలందఱికి ఈస్తోత్రము అఖండ శుభప్రదము. వ్రజేశ్వరా! పతివ్రతా స్త్రీ ఈస్తోత్రము ద్వారా భర్తను స్తుతించి అనాయాసముగ సకలతీర్థస్నాన ఫలములను సంపూర్ణ తపః ఫలములను సకలవ్రత ఫలములను పొందగలదు. ఇట్లు స్తుతించి నమస్కరించి పతియనుజ్ఞ బొందిన పిమ్మట సతి భుజింపవలెను. వ్రజరాజా! ఈప్రకారముగ నేను పతివ్రతా ధర్మములను వర్ణించితిని, గృహస్థుల ధర్మములను ప్రవచించెద శ్రవణమొనరింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ
జన్మఖండములో వర్ణాశ్రమ ధర్మములను ఎనుబదిమూడవ
అధ్యాయము సంపూర్ణము



## ఎనుబదినాల్గవ అధ్యాయము

శ్లో॥ ద్విజదేవార్చనం చైవ కరోతి సతతం గృహీ ।
స్వధర్మాచరణం చైవ చాతుర్వర్ణ్యం చ నిత్యశః ॥ 1

కుర్వన్తి గృహిణా మాశాం సర్వే దేవాదయస్తథా ।
అకృత్వాఽతిథిపూజాం చ గృహస్థశ్చ సదాఽ శుచిః ॥ 2

పితరః కర్మకాలే చాతిథికాలే చ దేవతాః ।
సర్వే గృహస్థ మాయాన్తి నిపానమివ ధేనవః ॥ 3

సమాయాతి ప్రయత్నేన సాయాహ్నే క్షుధితోఽతిథిః ।
పూజాం లబ్ధ్వాఽఽశిషం కృత్వా ప్రయాతి గృహిణో గృహాత్ ॥ 4

అకృత్వాఽతిథిపూజాం చ గృహీ భవతి పాతకీ ।
త్రైలోక్యజనితం పాపం లభతే నాత్ర సంశయః ॥ 5

నందరాజా! గృహస్థుడైనపురుషుడు సదా విప్రులను దేవతలను పూజించుచు చాతుర్వర్ణ్యధర్మానుసారముగ స్వధర్మపరిపాలనమందు తత్పరుడై యుండును కావుననే దేవతలాదిగాగల సకలప్రాణులు గృహస్థులపైనే తమ యాశల నిడుకొని జీవింతురు. గృహస్థు అతిథిని ఆదరించి సత్కరించి సదా పవిత్రుడు కాగలడు. పితృకార్యసమయములందు, అతిథిపూజాసమయములందు సకలదేవతలు దప్పికగొన్న గోవులు జలాశయమును సమీపించునట్లే గృహస్థు గృహమును పావనమొనరింతురు. ఆకలిగొన్న యతిథి ప్రయత్నపూర్వకముగ సాయంకాలము గృహస్థు గృహమును ప్రవేశించి వానిచే ఆదరసత్కారముల బొంది గృహస్థును ఆశీర్వదించి వానిగృహమును వీడిపోగలడు. అతిథిపూజ నొనరింపనియెడల గృహస్థు పాపములను పొందగలడు. త్రిలోకములయం దుత్పన్నమైనసకలపాపములు అతిథిని తిరస్కరించిన గృహస్థు అనుభవింప గలడు, ఇందు లేశమైనను సంశయము లేదు.

శ్లో॥ అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ ప్రతినివర్తతే । 6
పితరస్తస్య దేవాశ్చ వహ్నయశ్చ తథైవ చ ॥

నిరాశాః ప్రతిగచ్ఛన్తి గృహిణోఽతిథయో గృహాత్ ।
స్వాత్మనః పాతకం దత్త్వా పుణ్యమాదాయ గచ్ఛతి ॥ 7

తస్మాత్ కృత్వా సర్వసేవాం దేవాదీంశ్చ శుభాశయః ।
పోష్యాణాం భరణం కృత్వా పశ్చాద్ భుంక్తే స ధర్మవిత్ ॥ 8

యస్య మాతా గృహే నాస్తి భార్యా చ పుంశ్చలీ తథా ।
అరణ్యం తేన గన్తవ్యమరణ్యాద్ దుఃఖదం గృహమ్ ॥ 9

పతిం ద్వేష్టి సదా దుష్టా విషతుల్యం చ పశ్యతి ।
దదాతి తస్మై నాహారం భర్త్సనం కురుతే సదా ॥ 10

ఎవనిగృహమునుండి అతిథి నిరాశతో మరలిపోవునో వానిగృహమును వానిపితరులు, దేవతలు, అగ్నులు, పరిత్యజింతురు. ఆదరింపని గృహస్థుకు తనపాపములను ప్రసాదించి అతిథి గృహస్థుపుణ్యమును హరించి మరలిపోగలడు. కావుననే విచారసంపన్నుడైన ధర్మజ్ఞుడైనగృహస్థు మొదట దేవతాదులను సేవించి పిదప ఆశ్రితవర్గమును పోషించి స్వయముగ భుజించును. ఎవనిగృహములో మాతృదేవత యుండదో, భార్య పుంశ్చలియై చరించునో ఆగృహస్థు

గృహమును పరిత్యజించి వనవాసమున కరగుట ఉచితము; ఎందువలెననగ వానికి అట్టిగృహము ఘోరారణ్యముకంటే దుఃఖప్రదము. దుష్టురాలైన భార్యమాత్రమే పతిని ద్వేషించుచు భర్తను విషతుల్యునిగ జూచును. అట్టిస్త్రీ భర్తకు ఆహారము బెట్టక సదా కటువచనములచే వానిహృదయము నొప్పించును.

శ్లో॥ గృహిణీనాం సదాచారం శ్రూయతాం తచ్ఛ్రుతౌ శ్రుతమ్ !
గృహిణీ పతిభక్తా చ దేవబ్రాహ్మణపూజితా ॥ 14

సా శుద్ధా ప్రాతరుత్థాయ నమస్కృత్య పతిం సురమ్ ।
ప్రాఙ్గణే మఙ్గలం దద్యాద్ గోమయేన జలేన చ ॥ 15

గృహకృత్యం చ కృత్వా చ స్నాత్వాఽఽగత్య గృహం సతీ ।
సురం విప్రం పతిం నత్వా పూజయేద్ గృహదేవతామ్ ॥ 16

గృహకృత్యం సునిర్వృత్య భోజయిత్వా పతిం సతీ ।
అతిథిం పూజయిత్వా చ స్వయం భుంక్తే సుఖం సతీ ॥ 17

వ్రజేశ్వరా! శ్రుతులయందు వర్ణింపబడిన గృహస్థపత్నుల సదాచారములను నవధరింపుము. గృహిణి సదా పతిపరాయణయై దేవబ్రాహ్మణులను పూజించును. అట్టి శుద్ధాచరణ సంపన్నురాలైన స్త్రీ ప్రాతఃకాలమందే నిద్రమేల్కాంచి దైవమునకు, భర్తకు నమస్కరింపవలెను. తదుపరి గోమయముచే, శుద్ధజలములచే గృహమును పవిత్రమొనరించి మంగళకార్యములను సంపన్నమొనరింపవలెను. తదనంతరము గృహకృత్యములను నిర్వర్తించుకొని స్నానమాచరించి దైవమునకు బ్రాహ్మణునకు, భర్తకు నమస్కరించి గృహదేవతను పూజింపవలెను. ఇట్లు సాధ్వీనారి గృహకార్యములనుండి నివృత్తయై భర్తకు స్వాదిష్ట భోజనము నొసంగి అతిధులను సేవించి స్వయముగ, సుఖపూర్వకముగ భుజింపవలెను.

## :- పుత్రుని కర్తవ్యము :-

శ్లో॥ పుత్రైశ్చ పూజితస్తాతః శిష్యైశ్చ పూజితో గురుః ।
ఆజ్ఞయా కురుతే కర్మ పుత్రః శిష్యశ్చ భృత్యవత్ ॥ 18

న కుర్యాన్నరబుద్ధిం చ గురౌ పితరి సంతతమ్ ।
పితా మాతా గురుర్భార్యా శిష్యః పుత్రః సదాఽక్షమః ॥ 19

అనాథా భగినీ కన్యా నిత్యం పోష్యా గురుప్రియా ।
ఏవం చ కథితం తాత సర్వేషాం ధర్మ ముత్తమమ్ ॥ 20

పుత్రులు సదా తండ్రిని పూజింపవలెను. అట్లే శిష్యులు గురువును పూజింపవలెను. కుమారుడుగాని, శిష్యుడుగాని గురువును, తండ్రిని సేవకునివలె సేవించుచు వారి యాజ్ఞానుసారముగ కార్యములను నిర్వర్తింపవలెను. తండ్రి యెడల, ఆచార్యుని యెడల ఎప్పుడును మనుష్యభావము నుంచరాదు. తండ్రిని తల్లిని, ఆచార్యుని, శిష్యుని, తన్ను తాను నిర్వహించుకొనుటలో అసమర్థుడైన పుత్రుని, అనాథ యైన సహోదరిని, కన్య యైన కుమార్తెను, గురుపత్నిని నిత్యము పోషణమొనరించుట మనుష్యుని ప్రథమకర్తవ్యము. తండ్రీ! ఇట్లు నేను అందఱుపరిపాలింపదగిన ఉత్తమధర్మములను వర్ణించితిని.

వ్రజేశ్వరా! స్త్రీజాతి సహజముగ శుద్ధము. స్త్రీలయందు పతివ్రతా స్త్రీలు పరమపావనులు. సృష్ట్యాదియందు బ్రహ్మయొకేవిధముగ సకలజాతులను సృష్టించెను. స్త్రీ లంద ఱుత్తమబుద్ధిసంపన్నలై పవిత్రనారీమణులై ప్రకృత్యంశచే ప్రాదుర్భవించిరి. కేదారకన్య శాపవశమున ధర్మము నశింపగ కుపితు డైన బ్రహ్మ మరల స్త్రీజాతి నిర్మాణమొనరించెను.

శ్లో॥ కృత్వా స్త్రీ త్రివిధా జాతిర్బ్రహ్మణా నిర్మితా పురా ।
ఉత్తమా ప్రథమా సా చ మధ్యమా చాధమా వ్రజ ॥ 26

ఉత్తమా పతిభక్తా సా కించిద్ధర్మసమన్వితా ।
ప్రాణాన్తేఽపి న కురుతే తం జారమయశస్కరమ్ ॥ 27

గురుణా రక్షితా యత్నాజ్జారం చ న భజేద్భయాత్ ।
సా కృత్రిమా మధ్యమా చ యథా కించిత్ పతిం భజేత్ ॥ 28

స్థానం నాస్తి క్షణం నాస్తి నాస్తి ప్రార్థయితా నరః ।
తేన హే నన్ద తాసాం చ సతీత్వముపజాయతే ॥ 29

అధమా పరమా దుష్టాఽత్యన్తా సద్వంశజా తథా ।
అధర్మశీలా దుఃశీలా దుర్ముఖా కలహాన్వితా ॥ 30

పతిం భర్త్సయతే నిత్యం జారం చ సేవతె సదా ।
దుఃఖం దదాతి కాన్తాయ విషతుల్యం చ పశ్యతి ॥ 31

జారద్వారముపాయేన హన్తి కాన్తం మనోహరమ్ ।
ధర్మిష్ఠం చ వరిష్ఠం చ గరిష్ఠం చ మహీతలే ॥ 32

విద్యుదాభా జలే రేఖా తస్యాః ప్రీతి స్తథైవ చ ।
అధర్మయుక్తా సతతం కపటం వక్తి నిశ్చితమ్ ॥ 39

వ్రతే తపసి ధర్మే చ న మనో గృహకర్మణి ।
న గురౌ న చ దేవేషు జారే స్నిగ్ధం చ చంచలమ్ ॥ 40

స్త్రీజాతిస్త్రివిధానాం చ కథా చ కథితా మయా ।
భక్తానాం త్రివిధానాం చ లక్షణం శ్రూయతామితి॥ 41

బ్రహ్మ స్త్రీలను నిర్మాణమొనరించి వారిని మూడువర్గములుగ విభజించెను. వారిలో మొదటివర్గమువారు ఉత్తమస్త్రీ లనబడిరి. రెండవ వర్గమువారు మధ్యమ లనబడిరి, మూడవవర్గమువారు అధమ లనబడిరి. ధర్మసంపన్నురా లైనస్త్రీ పతిభక్తురాలై చరించును, అట్టి సాధ్వి ప్రాణాపాయము సంభవించినను అపకీర్తికర మైనజారత్వము నంగీకరింపదు. గురుజనులద్వారా యత్నపూర్వకముగ రక్షిత మైయున్నకారణమున, భయవశమున జారపురుషుని సమీపింపక తనభర్త యెడల కొంతప్రేమకలిగి వర్తించుస్త్రీ కృత్రిమా లేక మధ్యమ నారీయనబడును. నందమహారాజా! అట్టిస్త్రీలు స్థానాభావమువలన సమయము లభింపనందువలన జారపురుషుడు లభింపనంతవఱకు తమసతీత్వమును రక్షించుకొనగలరు. అధమవర్గస్త్రీలు పరమదుష్టురాండ్రు, అధర్మపరాయణలు, దుష్టస్వభావలు, కఠినవచస్కలు, కలహకారిణులు. వారు సదా ఉపపతిని సేవించుచు తమపతులను నిందించుచు వారిని విషతుల్యులుగ నెంచి యనేక కష్టములను గలిగింతురు. అట్టిసీచస్త్రీభర్త రూపవంతుడైనను, ధర్మాత్ముడైనను, ప్రశంసనీయు డైనను, మహాపురుషు డైనను తనయుపపతి ద్వారా తన భర్తను తుదముట్టించుటకు ప్రయత్నించును. అట్టిస్త్రీప్రేమ మెరపువలె, జలముల పైనిడినరేఖవలె క్షణభంగురము. అధమవర్గస్త్రీ సదా అధర్మమునందు తత్పరయై నిశ్చితముగ కఠినవచనములను పల్కును. ఆమెమనము వ్రతములను గాని, తపములను గాని, ధర్మాచరణములను గాని, గృహకార్యములను గాని యభిలషింపదు, గురువునెదుట దేవతలసమక్షమున తలను వంచదు. తండ్రీ! ఇట్లు నేను త్రివర్గము లైనస్త్రీలను వర్ణించితిని. ఇపుడు మూడుప్రకారములు గనున్న భక్తులలక్షణములను వచించెద నవధరింపుము.

శ్లో॥ తృణశయ్యారతో భక్తో మన్నామగుణకీర్తిషు ।
మనో నివేశయేత్కృత్వా సంసారసుఖకారణమ్॥ 42

ధ్యాయేతే మత్పదాబ్జం చ పూజయేద్భక్తిభావతః ।
అహైతుకీం తస్య దేవాః సంకల్పరహితస్య చ ॥ 43

సర్వసిద్ధిం న వాంఛన్తి తేఽణిమాదికమీప్సితమ్ ।
బ్రహ్మత్వమమరత్వం వా సురత్వం సుఖకారణమ్॥ 44

దాస్యం వినా న హీచ్ఛన్తి సాలోక్యాదిచతుష్టయమ్।
నైవ నిర్వాణముక్తిం చ సుధాపాన మభీప్సితమ్ ॥ 45

వాంఛన్తి నిశ్చలాం భక్తిం మదీయామతులామపి ।
స్త్రీపుం విభేదో నాస్త్యేవ సర్వజీవేషు భిన్నతా ॥ 46

తేషాం సిద్ధేశ్వరాణాం చ ప్రవరాణాం వ్రవరాజేశ్వరా ।
క్షుత్పిపాసాదికం నిద్రా లోభమోహాదికం రిపుమ్ ॥ 47

త్యక్త్వా దివానిశం మాం చ ధ్యాయన్తే చ దిగమ్బరాః ।

తృణశయ్యా రతుడైన యనన్య భక్తుడు సాంసారిక సుఖ కారణములను త్యజించి సదా తనమనమును నాదివ్యగుణ నామ సంకీర్తనయందే సంలగ్నమొనరించును. నాభక్తుడు సదా నాదివ్యచరణకమల ధ్యానరతుడై భక్తి భావసహితముగ నాపూజలందు తత్పరుడైయుండును. దేవతలానిష్కామ భక్తుని యహైతుకపూజ నత్యంతప్రీతితో గ్రహింతురు. నాయనన్యభక్తుడణిమాదిసర్వాభీష్టసిద్ధులనుగాని, సుఖములకు గారణభూతము లైనబ్రహ్మత్వ, అమరత్వ, దైవత్వములను గాని వాంఛింపడు. వానికి హరిదాస్యము దక్క సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యాది మోక్షము లైనను అభిలాష యోగ్యములుకావు. అతడు నిర్వాణముక్తినైనను, అమృతపానమునైనను ఆకాంక్షింపడు. వానికి అతులనీయముగు నానిశ్చలభక్తియందే సదా లాలస యుండును. వ్రజేశ్వరా! అట్టి సిద్ధేశ్వరులందు స్త్రీపురుష భేదములేదు జీవభేదము లేదు. వారు దిగంబరులై క్షుత్పిపాసానిద్రాదులను, లోభ మోహాదిశత్రువులను త్యజించి అహర్నిశములు నాధ్యానమునందే నిమగ్నులై వర్తింతురు.నందబాబా! ఇవి యన్నియు నా సర్వశ్రేష్ఠభక్తుని లక్షణములు.

శ్లో॥ స మద్భక్తతమో నన్ద శ్రూయతాం మధ్యమాదితమ్ ॥
నాఽఽసక్తః కర్మసు గృహీ పూర్వప్రాక్తనతః శుచిః । 48
కరోతి సతతం చైవ పూర్వకర్మనికృన్తనమ్ ॥
న కరోత్యపరం యత్నాత్ సంకల్పరహితః స చ । 49

సర్వం కృష్ణస్య యత్కించిన్నాహం కర్తా చ కర్మణః॥
కర్మణా మనసా వాచా సతతం చిన్తయేదితి । 50

ధ్యానభక్తశ్చ తన్ధ్యానః స చ ప్రాకృతికః శ్రుతౌ॥
యమం వా యమదూతం వా స్వప్నేఽపి న చ పశ్యతి । 51

పురుషాణాం సహస్రం చ పూర్వభక్తః సముద్ధరేత్ ॥
పుంసాం శతం మధ్యమశ్చ తచ్చతుర్థం చ ప్రాకృతః । 52

భక్తశ్చ త్రివిధస్తాత కథితశ్చ తవాజ్ఞయా ॥ 53

ఇపుడు మధ్యమాదిభక్తుల లక్షణములను శ్రవణమొనరింపుము. పూర్వజన్మలం దొనరించిన శుభకర్మల ప్రభావమువలన బవిత్రుడై గృహస్థకర్మలందాసక్తుడు గాక, సదా పూర్వకర్మలను ఖండింపగల కర్మలనొనరించుచు యత్నపూర్వకముగ బంధనము లగుకర్మల నాచరింపక చరించు నా భక్తుడు మధ్యమశ్రేణికిచెందినవాడు. వానికి యేకర్మఫలములందును ఆసక్తి యుండదు. అతడు కర్మలన్నింటిని శ్రీకృష్ణార్పణముగ మనోవాక్కులతో నర్పించి తాను కర్తను కానని తెలిసికొని చరించును. ఇట్టి భక్తునికంటె నీచకోటికి చెందిన యన్యభక్తులను ప్రాకృతిక భక్తులందురు. ప్రాకృతికభక్తు లనగాఅధమవర్గము వారని గ్రహింపవలెను. వీరు సకామభక్తులు. ఉత్తమవర్గభక్తుడు తనవేలకొలది పూర్వపురుషులనుసహితము ఉద్ధరింపగలడు. వానికి స్వప్నమందైనను యమదర్శనము యమదూతలదర్శనముసంభవింపదు. మధ్యమవర్గమునకు చెందినభక్తుడుతన నూఱుతరముల వారిని మాత్రమే తరింపజేయగలడు. ప్రాకృతిభక్తు డనగ అధమభక్తుడు. అతడుతనయఱువదియైదుతరములవారినే ఉద్ధరింపగలడు.తండ్రీ! నీయాజ్ఞానుసారముగ నేను త్రివిధము లైనభక్తులలక్షణములను వర్ణించితిని.

ఇపుడు సావధానుడవై బ్రహ్మాండనిర్మాణాఖ్యానమును గూర్చి మదీయ మధురవాక్ప్రవంతిని నీశ్రవణపుటములతో పానమొనరింపుము. నందబాబా! భక్తజనులు సంకల్పమాత్రముననే సకల బ్రహ్మాండ నిర్మాణ రహస్యములను, ప్రయోజనములను తెలిసికొనగలరు. మహర్షులు, దేవతలు, మహాత్ములు అకుంఠితపరిశ్రమవలన సృష్టిరహస్యమును కొంతమాత్రమే అవగతమొనరించుకొనగలరు. పరిపూర్ణముగ నీయఖండవిశ్వనిర్మాణజ్ఞానమనంతస్వరూపుడ నైన నాకు, బ్రహ్మకు, మహేశ్వరునకు కలదు. మేముతక్క ధర్మదేవత, సనత్కుమారుడు, నరనారాయణఋషులు, కపిలమహర్షి, గణేశ్వరుడు, దుర్గ,

లక్ష్మి, సరస్వతి, వేదములు, వేదమాతసావిత్రి, సర్వజ్ఞురా లైనరాధ మొదలగు వారుకూడ సృష్టిరహస్యమును తెలిసికొనియున్నారు. వీరుదక్క అన్యుల కీవిశ్వరహస్య మగోచరము. ఉత్కృష్టబుద్ధిసంపన్ను లైనవిద్వాంసులుకూడ సృష్టివైషమ్యార్థమును పరిపూర్ణముగ దెలిసికొనుట కసమర్థులే.

ఆకాశము, ఆత్మ, నిత్యము లైనట్లే దశదిశలు నిత్యము లనిగ్రహింపుము. ప్రకృతి నిత్యమైనట్లే సమస్తవిశ్వగోళములు నిత్యములే. గోలోకము నిత్యమైనట్లే వైకుంఠశివలోకములు నిత్యములే. ఒకానొకసమయమున సకలసృష్టికి ముందు నేను గోలోకపరంధామమందు క్రీడించుచుండగ నావామాంగమునుండి షోడశ వర్షీయురాలగుదివ్యస్త్రీప్రాదుర్భవించినది. ఆమె అత్యంతసుందరి, రమణులందు సర్వశ్రేష్ఠ. ఆమెదివ్యశరీరవర్ణము శ్వేతచంపాపుష్పసమానగౌరవర్ణము. ఆమె కాంతి శరత్పౌర్ణిమాచంద్రులకాంతిని మించియున్నది. ఆకన్యయనేకదివ్య రత్నాభరణభూషితయై అగ్నిశుద్ధ వస్త్రపరీధానయై నాయెదుట సాక్షాత్కరించినది. ఆమె సర్వాంగములు దివ్యములు, మనోహరములు, అత్యంత కుసుమ కోమలములు. ఆమెప్రసన్నముఖముపై మందహాసము శోభించుచున్నది. ఆమె చరణకమలముల అధోభాగము సుందరమై పారాణిచేనలంకృతమైయుండెను. ఆవిశాలాక్షి దివ్యసౌందర్యశాలిని, గజేంద్రగమనయైయుండెను. ఆదివ్యసుందరి రాసక్రీడాశుభసమయమున ప్రాదుర్భవించి న న్ను ముందుండి బంధించెను. ఆకారణమువలననే పురాతత్త్వవేత్తలు ఆమెను రాధ యనికీర్తించిరి,పూజించిరి. ఆమెప్రకృతి పరమప్రసన్నము; అందువలననే అయ్యాశ్వరి ప్రకృతియని కీర్తింపబడెను. ఆమె సమస్తకార్యములయందు సమర్థురాలగుటచే శక్తి నామముతో విఖ్యాతి గాంచెను. ఆమెసర్వులకు నాధారస్వరూపిణి, సర్వరూపిణి పరమమంగళయోగ్య; సర్వమంగళములను ప్రసాదించుటయందు దక్షురాలు, కావున ఆమెను మూర్తిభేదముతో సరస్వతియు నైయున్నది. వేదములను ఉత్పన్నమొనరించిన కారణమున అమె వేదమాత యనునామమున ప్రసిద్ధికెక్కెను. ఆమెయే సావిత్రి సకల లోకములను పోషణ మొనరించు గాయత్రి, పూర్వకాలమం దయ్యాద్యా ప్రకృతి దుర్గ డను మహాసురుని సంహరించిన కారణమున ఆమె దుర్గగా విఖ్యాతి గాంచెను. ఆసతి ప్రాచీనకాలములో సర్వదేవతల తేజమునుండి యావిర్భూత యైన కారణమున ఆద్యాప్రకృతి యని గణుతి గాంచెను. ఆమె అసురులను మర్దింపగలదు, సమస్తానందములను

ప్రసాదింపగలదు, దుఃఖములను, దారిద్ర్యమును వినాశమొనరింపగలదు, శత్రువులకు భయమును గలుగజేయగలదు, భక్తులకు అభయము నొసంగ గలదు, ఆదేవి పరమానంద స్వరూపిణి, ఆశక్తియే సతీరూపమున దక్షకన్యగ నావిర్భవించి మఱల హిమరాజకుమారిగ సాక్షాత్కరించి పార్వతి యను నామమున ప్రసిద్ధిగాంచెను. ఆవిశ్వ శక్తియే సర్వాధార స్వరూపిణి. పృథ్వి, తులసి, గంగ, మొదలగువా రందఱు ఆమె కళోత్పన్నలే. సర్వ స్త్రీల యావిర్భావము అమెనుండియే సంభవించెను, తండ్రీ! ఏశక్తితో సంపన్నుడనై భగవంతుడనై నేను మాటిమాటికి సృష్టి చేయగల్గుచున్నానో, ఆమెను రాసమధ్యమున దర్శించి ఆమెతో నేను దివ్యరాసక్రీడ నొనరించితిని, ఆసమయ మున మాయిర్వురి దివ్యశరీరముల నుండి బయల్వెడలిన శ్రమజలము వేగముగ అథోభాగమందు గల బ్రహ్మాండ గోలోకమును నింపివైచెను, ఆజలాశయమే రాధా సరోవర నామమున విఖ్యాతికెక్కెను.

వ్రజేశ్వరా! మొదట సర్వ బ్రహ్మాండములు జలమగ్నములే. ఆసమయ మున సృష్టి జరుగలేదు, రాసక్రీడాసమయములో నాయఖండ దివ్యతేజము రాధయందు ప్రవేశింపగా ఆమెనుండి యొకపరమాద్భుత డింభ మావిర్భవించెను. డింభమును గాంచి కోపించి యాదేవి దానిని విశ్వ గోలకమందు బడవైచెను. తండ్రీ! జలములందు బడిన యాడింభమే సర్వాధార స్వరూప మైన మహా విరాట్టుగ నావిర్భవించెను. నాసంతానము జలమందు బడుట గాంచి నేను రాధను శపించితిని. నాశాపకారణమున రాధ సంతానహీన యైనది. వ్రజేశ్వరా! అందువలననే డింభమునుండి ప్రాదుర్భవించిన మహావిరాట్పురుషుని నుండియే దుర్గ, లక్ష్మి, సరస్వతి మొదలగు దేవాంగనలందఱు క్రమముగ కళాకళాంశ లచే నుత్పన్నులైరి.

వ్రజేశా! అమహావిరాట్పురుషుడు నాచే నొసంగబడిన అంగుష్ఠామృత మును పానమొనరించి తదనంతరము స్వకర్మాను సారముగ స్థావర రూపుడై ఆజలములందే శయనింప దొడంగెను, యోగబలమువలన జలములే ఆయనకు శయ్యలైనవి, ఉపధానములైనవి, ఆయన రోమకూపము లన్నియు జలభరితము లైనవి. మహావిరాట్పురుషుని యొక్కొక్క రోమకూప జలములందు ఒక్కొక్క క్షుద్రవిరాట్పురుషుడు శయనించును. ఆక్షుద్ర విరాట్పురుషుని నాభినుండి సహస్రదళ కమల ముద్భవింపగా ఆకమలములో సురశ్రేష్ఠు డైన బ్రహ్మ

జన్మించెను. అందువలననే ఆయన కమలోద్భవుడను నామమున ప్రసిద్ధిగాంచెను. కమలమధ్యమున యావిర్భవించిన బ్రహ్మతానెవరినుండి యుద్భవించెనో, తనజననీ జనకు లెవరో, సహోదర బంధువులెవరో తెలిసికొనలేక చింతాగ్రస్తుడై మూడులక్షల దివ్యవర్షములు ఆకమలమందే భ్రమించెను. తదనంతరము నా యాదేశానుసారముగ కమల సంభవుడైదులక్షల దివ్యవర్షములు అఖండ తపము ద్వారా నన్ను స్మరింపగా నేను నా దివ్యమంత్రము నొసంగితిని. బ్రహ్మ జితేంద్రియుడై కఠోరనియమయుక్తుడై, పవిత్రుడై నాప్రసన్నత కొఱకు నాదివ్యనామము నేడులక్షల దివ్యవర్షముల పర్యంతము కమల మధ్యమున జపించెను. తదుపరి బ్రహ్మ నాయనుగ్రహమునకు పాత్రుడై సృష్టికార్యమును సంపన్నమొనరించెను. నామాయా బలమువలననే ప్రత్యేక బ్రహ్మాండమందు బ్రహ్మ విష్ణు శివ దిక్పాల ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, నవగ్రహములు, అష్టవసువులు, త్రికోటిదేవతలు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు, యక్షులు, గంధర్వులు, కిన్నరులు, భూత ప్రేతాది రాక్షసులు, సకలచరాచరజీవులు ఆవిర్భవించిరి. ప్రత్యేకవిశ్వమందు క్రమముగ నేడుస్వర్గములు, సప్తసాగర సంయుక్తయు స్వర్ణ భూమియుక్తయు సప్తద్వీపవతియు నగు పృథ్వి, సప్తపాతాళ ములు కలవు. వీనియన్నింటిచే బ్రహ్మాండము నిర్మింప బడెను. ప్రతివిశ్వమందు చంద్రుడు, సూర్యుడు, గంగాదితీర్థములు, పుణ్యక్షేత్ర మైన భారతవర్షము సృష్టింపబడెను. ప్రజేశ్వరా! మహావిష్ణు శరీరమం దెన్నిరోమకూపములు గలవో, అన్ని విశ్వములు ఉన్న వని గ్రహింపుము.

ప్రాకృతము లైనయీయసంఖ్యాకజగముల కావల చిన్మయవ్యోమమం దూర్ధ్వభాగమున వైకుంఠశివలోకములు నాసంకల్పమాత్రమున నిర్మింపబడి యేయాధారము లేక యున్నవి. వేదములుకూడ ఆదివ్యలోకములను వర్ణింప లేవు. నిశ్చయముగ కుయోగులకు, భక్తివిహీనులకు ఆదివ్యలోకదర్శనము దుర్లభము. ఆదివ్యలోకములపైన పరమవిచిత్రగోలోకపరంధామము యేఆధా రము లేక నాసంకల్పమాత్రమున నిలచియున్నది. ఆదివ్యపరంధామము శతశృంగపర్వతయుక్తము, పుణ్యమయబృందావనముచే పునీతము. గోలోక ములో రమణీయరాసమండలము, పవిత్రవిరజానదికలవు. గోలోకపరంధామము చిన్మయరత్ననిర్మితము. విశ్వకర్మ యైనను దర్శింపని దివ్యహర్మ్యములు చింతా మణీసారతత్త్వనిర్మితములై యున్నవి. ఆలోకము గోపగోపికలచే, కామధేనువు

లచే బరివేష్టితము. ఆప్రదేశములో నసంఖ్యాక కల్పవృక్షములు, పారిజాతవన ములు, సరోవరములు, పుష్పోద్యానములు నున్నవి. ఆలోకమందు గల దివ్య మందిరములు గోపగోపీజనములతో, రత్నప్రదీపములతో పుష్పశయ్యలతో, కస్తూరీకుంకుమయుక్త సుగంధితచందన గంధములతో, క్రీడోపయుక్త భోగ పదార్థములతో, రమణీయసుగంధ యుక్తధూపములతో, సువాసితజలము లతో, కర్పూరతాంబూలాదులతో, పుష్పమాలలతో, రత్నజటితదర్పణము లతో నిండి శోభించుచున్నవి. అమూల్యరత్నాభరణవిభూషితలై అగ్నిశుద్ధ వస్త్రపరిధానలై, సర్వాలంకారభూషితలై రాధాదేవిదాసీలుసదా ఆగృహము లను రక్షించుచుందురు. వ్రజరాజా! ఆలోకము అత్యంతరమణీయము. చంద్ర మండలమువలె వర్తులాకారము. బహుమూల్య చిన్మయ రత్నములచే నిర్మింప బడెను. ఆప్రదేశము కస్తూరీ కుంకుమయుక్తమై సుందర సుగంధిత చందనాదు లచే సమర్చితమై సదా విరాజిల్లు చుండును. ఆప్రదేశము ఫలపల్లవ మంగళ కలశయుక్తము. అసంఖ్యాక కదళీఫల స్తంభములచే నలంకృతము. చందన పల్లవ తోరణములచే, చందన యుక్త పుష్పమాలలచే నాచ్ఛాదితము.

దివ్యగోలోక పరంధామములో చందన వృక్షములతో వేష్టితమై కల్ప వృక్షములచే శోభించు రమణీయ బృందావనము కలదు. బృందావనము సుందర మందార పుష్పములచే, కామధేనువులచే మనోహర పుష్పవాటికలచే, రమణీయ క్రీడా సరోవరములచే, పరమసుందర క్రీడా భవనములచే సుశోభితమై యున్నది. ఆరాసమండల మధ్యమున ఏకాంతముగ రాసక్రీడా యోగ్యమగు సుందర రాసమండలమున్నది. రక్షక రూపమున నియుక్తలైన యసంఖ్యాక గోపిక లారాసమండల రక్షణయందు నిమగ్నలై యుందురు. రాసమండల మధ్యమున ఏకాంత ప్రదేశములో నొకరమణీయ మైన అక్షయవట వృక్షము కలదు. సర్వమనో వాంఛనలను పరిపూర్ణ మొనరింపగల అయ్యక్షయ వటము గోపికలకు కల్పవృక్ష సదృశము. ఆప్రదేశములో బృందావన వినోదిని యైన నాప్రాణాధి దేవతయైన రాధ తన యసంఖ్యాక దాసీగణములతో అక్షయవట వృక్షఛాయలో క్రీడించును. విరజాతట ప్రాంతమునుండి శీతల జలములను స్పృశించిన శీతల మంద సుగంధిత వాయువు రాసమండలమును సదా పవిత్ర మొనరించును. ఆరాధాదేవియే వర్తమానకాలములో వృషభాను కుమార్తెయై ప్రాదుర్భవించినది. వ్రజేశ్వరా! బ్రహ్మాది సకలదేవతలు, సిద్ధేంద్రులు, మునీం

ద్రులు, సిద్ధగణములు గుణముద్వారా, బలముద్వారా, జ్ఞానయోగముద్వారా, విద్యద్వారా, సదా అయ్యాద్యా పకృతి శక్తినే ఆరాధింతురు. తండ్రీ, నా యీ ప్రియ నాసమానురాలు, కావున ఆమె సర్వవందనీయురాలు. నందబాబా! యిట్లు నేను యథోచితముగ సంక్షిప్త రూపమున సర్వబ్రహ్మాండముల ప్రాదుర్భావాఖ్యానమును ప్రవచించితిని. నీవు మఱి యేయేవిషయములను ఆకర్ణింప గోరుచున్నావో వాని నన్నింటినీ వర్ణింపగలను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ
జన్మఖండములో గృహస్థ, గృహిణీ, శిష్య, పుత్రకన్యా
ధర్మములను ఎనుబదినాల్గవ అధ్యాయము
సంపూర్ణము



## ఎనుబదియైదవ అధ్యాయము

### :- కర్మవిపాక వర్ణనము :-

నందుడు పలికెను :-

మహాభాగా! నాల్గువర్ణములవారి భక్ష్యాభక్ష్యపదార్థములను, సమస్త ప్రాణుల కర్మవిపాకములను ప్రవచింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీకృష్ణుడు పలికెను :-

తండ్రీ! నేను వేదోక్తములైన నాల్గువర్ణములవారి భక్ష్యాభక్ష్యాదులను యథోచితరూపమున వర్ణించెద సావధానుడవై శ్రవణమొనరింపుము. లోహపు పాత్రలో జలములను, గోక్షీరములను, దధిని, ఘృతమును, మధువును, గుడమును, నారికేళజలములను, ఫలములను, మూలాదిపదార్థములను స్వీకరించుట నిషిద్ధము. లోహపుపాత్రలోని సర్వపదార్థములు అభక్ష్యములు కాగలవు. కాల్చినయన్నము, వేడిచేసినబదరీఫలములు కూడ అభక్ష్యములే. కంచుపాత్రలో నారికేళజలము, తామ్రపాత్రలో మధువు, ఘృతముదక్క మిగిలిన సర్వగవ్యపదార్థములు మదిరాతుల్యములు కాగలవు. తామ్రపాత్రలో పాలుద్రా

వుట, ఎంగిలి పదార్థముల నుంచుట, నేతితో గలసినయన్నమును భుజించుట, ఉప్పుకలసిన పాలను (విరిగిన) త్రాగుట నిషిద్ధము. ఈపదార్థము లభక్ష్యములు కాగలవు. మధువుకలసిన ఘృతము, నూనెకలసిన గుడము అభక్ష్యములు. త్రాగగా మిగిలిన అవశిష్టజలములనుత్రాగుట, శయ్యపైనాశీనులై జపాదులను నిర్వర్తించుట విద్వాంసు నపురుషులు పరిత్యజింపవలెను. ఉత్తమ బుద్ధిసంపన్నుడైనపురుషుడు పగలు రెండుపర్యాయములు, రెండుసంధ్యలందు, అర్ధరాత్రి భుజింపరాదు. త్రాగునట్టిజలము, గుడము, క్షీరములు, మధువు మొదలగు పదార్థములు ఒకచేతిలోనుండి మఱియొక చేతిలోకి మార్చిన క్షణమందే అభక్ష్యములు కాగలవు. శ్రుతి ననుసరించి వెండిపాత్రలో నుంచిన కర్పూరము అభక్ష్యమగును. అన్నమును బెట్టువ్యక్తి భుజించువానిని స్పృశించిన ఆభోజనము అభక్ష్యము కాగలదు. బ్రాహ్మణులైనవారు గేదెపాలను, పెరుగును, నేతిని, వెన్నను భుజింపరాదు. పాసిన అన్నము, జలము, పాలు, సర్వులకు నిషిద్ధములే. అసంస్కృత లవణము, నూనె అభక్ష్యములు; కాని యగ్నిచే సంస్కరింపబడిన పవిత్ర వ్యంజనము లన్నియు సర్వులకు భక్ష్య యోగ్యములే. చెడినజలములు, పురుగులుబడిన నీరు, అపవిత్రజలములు సర్వులకు అపేయములు. శ్రీహరి కర్పింపనిదే యేపదార్థము నైనను బ్రాహ్మణులు, యతులు, బ్రహ్మచారులు, వైష్ణవులు భుజింపరాదు. తండ్రీ! ఏపదార్థములో నైనను, మధువులో, క్షీరములలో, దధిలో, ఘృతములో పిపీలకములు బడినచో ఆపదార్థములను భుజింపరాదు. పండిన ఫలములను కాకులు స్పృశించిన భుజింపరాదు. కాకముచే నుచ్ఛిష్ట మొనరింపబడిన సర్వ పదార్థములు సర్వులకు నభక్ష్యములే. అపవిత్రము లైన సకల పదార్థములను తత్కాలమే పరిత్యజింపవలెను. వ్రజేశ్వరా! ఇట్లు నేను భక్ష్యా భక్ష్య పదార్థములను గుఱించి వర్ణించితిని.

తండ్రీ! శ్రుత్యనుసారముగ కుకర్మల విపాక మత్యంత దుష్కరము. ఈవిషయములో నాల్గువేదములు, నాల్గువిధము లైన మతములను ప్రకటించినవి. వేదాభిప్రాయ మేమనగా.

శ్లో॥ నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి ।
అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ॥　　36

కోటికల్పములు గతించినను అనుభవింపనిదే కర్మలు నశింపవు; కావున తనచే నొనరింపబడిన శుభాశుభకర్మల ఫలములను దేహధారి యవశ్యముగ అనుభవింపక తప్పదు.

పవిత్రతీర్థములు, దేవతలు మనుష్యుల కర్మలను నివారించుటలో కొంత సహకరింపగలరు. నదులు మదిరా పాత్రములను పావనమొనరింపనట్లే మద్యముఖులైన వారిని ఏతీర్థములైనను, దేవతలైనను, ఏప్రాయశ్చిత్తములైనను పవిత్ర మొనరింపలేవు.

శ్లో॥ న నష్టం దుష్కృతం కర్మ సుకృతేన చ కర్మణా ।
న నష్టం సుకృతం కర్మ కృతేన దుష్కృతేన చ ॥ 41

"ఉత్తమకర్మ లాచరించినంత మాత్రమున తా నొనరించిన దుష్కర్మలు నశింపవు. దుష్కర్మ లొనరించినంత మాత్రమున సుకర్మలు నశింపవు" యజ్ఞ వ్రత తపోపవాసాదు లాచరించినను, తీర్థస్నానము లొనరించినను, దాన జప నియమముల నిర్వర్తించినను, పృథ్వీ ప్రదక్షిణ మొనరించినను, పురాణములను పుణ్యోపదేశములను శ్రవణ మొనరించినను, గురువును, దైవమును పూజించినను, స్వధర్మము నాచరించినను, అతిధిసత్కార మొనరించినను బ్రాహ్మణులను పూజించి సత్కరించినను దేహధారి తా నొనరించిన దుష్కర్మఫలముల నుండి తప్పుకొనలేడు, ఆచరించిన కర్మఏదైనను అనుభవింపక తప్పదు. తండ్రీ! సద్విప్రునకు నొసంగినవి పూర్ణరూపమున మఱల ప్రాప్తించును; ఎందువలెననగా దానమును గ్రహించు సద్విప్రుడు క్షేత్రసముడు, వాని కొసంగిన దానము బీజ సదృశము.

శ్లో॥ ఏకేన కర్మణా తాత స్వర్గం ప్రాప్నోతి మానవః ।
కర్మణా న హి మోక్షం చ తదేవ మమ సేవయా ॥ 46

"జనకా! మనుష్యుడు సత్కర్మలద్వారా కేవలము స్వర్గమును బొందగలడు; కాని మోక్షము జీవులకు కర్మలవలన లభింపదు." అది కేవలము నా సేవల వలనే సులభము కాగలదు. పుణ్యకర్మ లొనరించిన స్వర్గము, దుష్కర్మ లొనరించిన నరకము, కుత్సిత కర్మ లొనరించిన వ్యాధులు, నీచయోనులందు జన్మము సంప్రాప్తింపగలవు, దుష్కర్మ ఫలముల ననుభవించిన పిమ్మట జీవుడు పవిత్రుడు కాగలడు.

ఇచ్ఛానుసారముగ పాపముల నొనరించువారు, గోహంతకులు, గోశరీరమం దెన్నిరోమములుండునో, అన్నిసంవత్సరముల పర్యంతము దందశూక మను నరక మనుభవింపవలెను. ఆనరకములో విషసర్పములు కాట్లువేయుచుండగ ప్రచండ విషజ్వాలలచే పాపులు దుఃఖింపగలరు. తదనంతరము వారానరకమును వీడి అంతేకాలము గోయోనిలో కీటకముగ జన్మించి కష్టము లనుభవింపగలరు. పిమ్మట ఒకలక్ష సంవత్సరముల పర్యంతము కుష్టురోగులై, చండాలురై తుదకు సద్బ్రాహ్మణుల కాతిథ్య మొసంగి రోగరహితులు, పవిత్రులు కాగలరు. బ్రహ్మహత్య చేసిన నీచుడు నాల్గులక్షల సంవత్సరములు మలమందు కీటకమై తదుపరి మ్లేచ్ఛుడై తదనంతరము దీర్ఘకాల మంధుడై యసంఖ్యాక దుఃఖముల ననుభవింపగలడు. నాల్గులక్షలమంది విప్రులకు అన్నదాన మిడిన పిమ్మటే ఆపాపి నేత్రముల పొంది మఱల పవిత్రుడు కాగలడు. స్త్రీహత్య యొనరించిన వానిని వేదములు మహాపాతకు డని ఘోషించినవి. స్త్రీహత్యచేసినపాపాత్ము డాస్త్రీ శరీరమం దెన్ని రోమములుండునో, అన్ని సంవత్సరములపర్యంతము కాలసూత్ర మనునరక మనుభవింపగలడు. అంతకాలమే అతడు వివిధనీచయోనులందు జన్మింపగలడు. నూఱు సంవత్సరముల పర్యంతము అన్నదానమొనరించిన పిమ్మట అతడు మరల పవిత్రుడు కాగలడు. భ్రూణ (శిశు) హత్యచేసినమహాపాపి శునీముఖ మను నరక మనుభవింపగలడు. ఆనరకములో బహుకాలము నిశితశస్త్రములచే బీడింపబడి తుదకు నూఱుసంవత్సరము లశ్వయోనిలో కీటకముగ జన్మింపగలడు. పిమ్మట రోగగ్రస్తునిగ జన్మించి సువర్ణదానమొనరించిన మఱల పవిత్రుడు కాగలడు. యుద్ధములోకాకుండగ క్షత్రియునిగాని, బ్రాహ్మణునిగాని సంహరించినవారు తత్తశూలనరకమనుభవింపగలరు. ఆనరకములో నొకవేయిసంవత్సరములు దుఃఖములననుభవించి, పిమ్మట నూఱుసంవత్సరము మదమత్తగజమై చరించి తుదకు రక్తదోషయుక్తుడు, శూద్రుడునై గజదానమువలన మఱల పవిత్రుడు కాగలడు. వైశ్యుని, శూద్రుని సంహరించువారు, వైశ్యబ్రాహ్మణులను హింసించువారు మహాపాపమునకు గుఱియై నూఱుసంవత్సరముల పర్యంతము క్రిమికుండ మనునరకమనుభవింపగలరు. అనంతరము వారు క్రిమిరోగయుక్తులై నూఱుసంవత్సరములు కిరాతులై దుఃఖముల ననుభవింపగలరు. వ్రజరాజా! తదనంతరము వారేబదిసంవత్సరములపర్యంతము మందాగ్ని

యుక్తులై, దుర్బలులై క్రుశోదరులై, దరిద్రులై యిడుముల బడగలరు. తీర్థ సేవనము లొనరించి దానధర్మములచే వారు పాపవిముక్తులై పవిత్రులు కాగలరు.

తండ్రీ! అశ్వత్థవృక్షమును ఖండించువారు బ్రహ్మహత్యాపాతకములో నాల్గవభాగమునకు గుఱికాగలరు. వారు నిశ్చయముగ అశిపత్ర మనునరక మనుభవింపవలెను. అసత్యసాక్ష్యమునిచ్చువారు, కృతఘ్నులు, అతికృతఘ్నులు, విశ్వాసఘాతకులు, మిత్రఘాతకులు, బ్రాహ్మణధనాపహారులు మహాపాపులనబడిరి. వీరు వేలకొలదిసంవత్సరములు కుంభీపాకనరక మనుభవింపవలెను. ఆనరకములో పాపుల నహర్నిశములు యమకింకరులు వేడినూనెలో బడవైచి యపారదుఃఖములను నొసంగగలరు. ఆప్రదేశములో పాపులు వ్యాధిగ్రస్థులై సర్పములచే పీడింపబడెదరు. అనంతరము వారు వేయికోట్లజన్మలు గ్రద్దలై జన్మింపగలరు. తరువాత నూఱుజన్మలు సూకరములై, మఱినూఱుజన్మలు హింస్రకజంతువులై తుదకు రోగగ్రస్తులైన శూద్రులై జన్మింపగలరు. దాన ధర్మములవలన వారు మఱల పాపవిముక్తులు కాగలరు. ఇతరులవస్త్రములను, గవ్యపదార్థములను, వెండిని, సువర్ణమును అపహరణమొనరించువారు, శూద్రుల ధన మపహరించినవారు మహాపాపయుక్తులై నూఱు సంవత్సరముల పర్యంతము మూత్రకుండ మను నరక మనుభవించి మఱల వేయిసంవత్సరములు గుడ్లగూబగా జన్మింపగలరు. వ్రజరాజా! వారు కుష్ఠురోగయుక్తులై బహు కాలము కష్టము లనుభవించి మఱల సువర్ణదానముచే రోగ విముక్తులు కాగలరు. భక్ష్య పదార్థములను అపహరించువారు నిశ్చయముగ పశువులై జన్మింపగలరు. ధాన్యమును అపహరించువా రేడు జన్మలవరకు అత్యంత దుఃఖితులై, కృపణులై యనేక కష్టము లనుభవింపగలరు. సువర్ణము నపహరించిన మానవుడు కుష్ఠురోగయుక్తుడై పతితుడు కాగలడు.

అగమ్యా స్త్రీతో సమాగమ మొనరించు పాపాత్ముడు అసంఖ్యాక సంవత్సరములు రౌరవాది మహాభయంకర నరకముల ననుభవింపగలడు. తదుపరి వేయిసంవత్సరములు కులటాస్త్రీయోనికీటకమై, లక్షసంవత్సరములు మలకీటకమై పిమ్మట పశుయోనిలో జన్మించెదరు. తదనంతరము మ్లేచ్ఛులై నీచ శూద్రులై రోగగ్రస్తబ్రాహ్మణులై తుదకు పవిత్రతీర్థసేవన మొనరించి పాప విముక్తులుకాగలరు; కాని వారి పాపఫల స్వరూపమున వారివంశము

నిర్వంశము కాగలరు. అట్టి పాపులు నిరంతర మన్నదాన మొనరించిన పవిత్రులై పుత్రుల నొందగలరు. క్రోధించు మానవు డేడుజన్మల పర్యంతము గార్ధభమై జన్మించును. కలహించు మానవుడు ఏడు జన్మల వరకు కాకమై భ్రమించును. లోహమును హరించువాడు సంతానహీనుడు కాగలడు. తండ్రీ! బ్రాహ్మణుని, ఆచార్యుని, ద్వేషించు పాపి పేనుగ జన్మింపగలడు. పుంశ్చలీ స్త్రీతో సమాగమ మొనరించు జారుడు రౌరవ నరక మనుభవించి నిరర్ధక కీటకమై జన్మించి పరిభ్రమించగలడు, అట్లే కులట రౌరవనరక మనుభవించి ఏడు జన్మల వరకు క్రమముగ విధవయై, వన్ధ్యయై, అస్పృశ్యయై, జాతిహీనయై దుఃఖముల ననుభవింపగలదు. ఆచారహీను డైన మనుష్యుడు యవనుడై జన్మించును, హింసకుడు అంగవిహీనుడై దుఃఖించును, దీక్షావిహీనుడు మూగవాడై జన్మించును. కుదృష్టి సారించువాడు అంధుడగును, అహంకారి కర్ణహీను డగును, వేదములను నిందించువాడు బధిరు డగును. ఇతరుల వచనములను ఖండించువాడు మూగవాడగును. దుష్టవచనములను బల్కువాడు దంతహీనుడగును, సత్యమును దాచువాడు జిహ్వాహీనుడగును, గ్రంథములను అపహరించువాడు మూర్ఖుడై రోగగ్రస్తుడు కాగలడు, దాన మిడి మఱల పరిగ్రహించువాడు, వాగ్దాన మిడి మాట చెల్లింపనివాడు మ్లేచ్ఛుడై జన్మించి తుదకు ఘోరనరకముల ననుభవింపగలరు.

వ్రజేశా! ఇతరులకు బెట్టక తానే మధుర పదార్థములను భుజించువారు కాలసూత్ర మను నరక మనుభవింపగలరు. భూమిని హరించువాడు, దాన మిడిన భూమిని మఱల గ్రహించువాడు కాలసూత్ర మనుభవింపగలరు. త్రికాల సంధ్యాహీను డైన బ్రాహ్మణుడు ప్రాతఃకాలమందు, దినమందు, సంధ్యాకాల మందునిద్రించువాడు, యజ్ఞోపవీతమునుహరించువాడు, అశుద్ధముగసంధ్యయొనరించువాడు, వేదవేదాంగమును నిందించువాడు నిశ్చయముగ నరకగాములు కాగలడు. శూద్రుడై బ్రాహ్మణితో వ్యభిచరించువాడు కుంభీపాక నరక మనుభవింపగలడు. దైవమునకు ఉచితపూజ యొనరింపక అపవిత్ర నైవేద్యములను సమర్పించినవాడు, అసత్యవాది యైన శూద్రుడు కాగలడు; కావున విద్వాంసులైన వారు దుష్కర్మ విపాకములను బాగుగ తెలిసికొని కుకర్మల నొనరింపక సావధాను లై చరింపవలెను.

వ్రజేశ్వరా! మట్టితోగాని, భస్మముతోగాని, గోమయముతోగాని, పిండములతోగాని, ఇసుకతోగాని శివలింగమును నిర్మించి యొకపర్యాయము

పూజించిన మాత్రముననే మనుష్యుడు కల్పపర్యంతము స్వర్గ మనుభవింపగలడు. పిమ్మట భూమికి స్వామియై, మహావిద్వాంసు డైన బ్రాహ్మణుడై జన్మింప గలడు. నూఱులింగములను పూజించిన మనుష్యుడు భారతవర్షములో రాజై జన్మింపగలడు. వేయిలింగములను పూజించిన చిరకాలము స్వర్గసుఖము లను భవించి, తుదకు భారతవర్షములో రాజేంద్రుడు కాగలడు. పదివేల లింగములను పూజించిన రాజాధిరాజు కాగలడు. లక్షలింగములను అర్చించిన చక్రవర్తి కాగలడు, నిష్కామియై భక్తిపూర్వకముగ లింగార్చన మొనరించిన కర్మబంధములను ఖండించుకొనగలడు. తీర్థస్నానములు, దానములు, బ్రాహ్మణ భోజనములు, నారాయణార్చనము మున్నగు సత్కర్మలచే మానవుడు సద్వంశ సంజాతుడై తపఃప్రభావమువలన సద్బ్రాహ్మణుడై, శమదమాది నియమముల వలన జితేంద్రియుడై, నిష్కామయుక్త మగు అనన్యదాస్య భక్తిచే పరమవైష్ణవుడు కాగలడు. ఆభాగవతోత్తముని చరణస్పర్శమాత్రముననే వసుంధర సహితము పవిత్రము కాగలదు. అట్టి జీవన్ముక్తు డైన వైష్ణవుడు తీర్థములనే పవిత్ర మొనరించి తన పూర్వీకులను పవిత్రులుగా చేయగలడు. తండ్రీ! ఇది శ్రుతివచనము. అత్యంత క్రూరుడు, దురాచారి. దేవబ్రాహ్మణద్వేషి ఒకవేయి సంవత్సరములు సర్పమై పరిభ్రమింపగలడు. కులటాస్త్రీలకు మాతలై లేక దూతికలై జీవించువారు కాలసూత్రనరక మనుభవించి అనేకనీచ యోనులందు పరిభ్రమించెదరు. ఇతరులభూమిని దానముచేయువాడు మొసలియై జన్మించును.

ఏకాదశీవ్రతము నాచరింపని బ్రాహ్మణుడు పతితుడగును. తనయాహారముకంటె రెట్టింపుభోజనమును దాన మొసగినవాడు పవిత్రుడు కాగలడు. భాద్రపదకృష్ణాష్టమి అనగా నాజన్మదినమున భుజించుమానవునకు నిస్సందేహముగ పాపము సంభవించును. శివరాత్రినాడు, శ్రీరామనవమినాడు భుజించినను అట్టిపాపమే సంభవించును. శక్తిహీను లైనకారణమున ఉపవాస మొనరించుట కసమర్థులలైనవారు హవిష్యాన్నమును భుజించి న న్నారాధించి అన్నదాన మొనరింపవచ్చును. ఈకర్మలవలన వారు పాపవిముక్తులు పరిశుద్ధులు కాగలరు. యత్నపూర్వకముగ నాదివ్యనామసంకీర్తన మొనరించువారికి ఆదినములలో భోజనదోషమంటదు. దైవమూర్తులను అపహరించువాడు ఏడుజన్మలవరకు అంధుడై, దరిద్రుడై, రోగగ్రస్తుడై, బధిరుడై, మూగయై దుఃఖించును. సద్బ్రాహ్మణుని, భాగవతోత్తముని, దేవప్రతిమను గాంచినతక్షణమే నమస్క-

రింపని నరాధముడు అపవిత్రుడు కాగలడు. మహాత్ము లరుదెంచిన నిలువబడి స్వాగతము పల్కనిమనుష్యుడు మహాపాపమునకు గుఱికాగలడు. శివుని ద్వేషించువాడు, దైవప్రతిమల కర్పించిన ద్రవ్యములచే జీవితమునుగడుపుకొను వాడు ఏడుజన్మలవరకు కుక్కటముగా జన్మింపగలడు. పితరులకు, దేవతలకు, వేదోక్తపూజ నొనరింపనిపాపి రౌరవనరక మనుభవింపగలడు. దంభయుక్తుడై దైవమును పూజించి భక్తిపూర్వకముగ ఆచార్యుని గౌరవింపని పాపి దేవతల శాపమునకు గుఱికాగలడు. దైవప్రతిమల కర్పించినద్రవ్యములచే జీవించు పూజారి భయంకర దేవద్రోహియై పూజాఫలశూన్యుడు కాగలడు.

వ్రజేశ్వరా! దీపము నార్పినవాడు ఏడుజన్మలవరకు మిణుగురుపురుగై జన్మించును. ఇష్టదేవతకు నివేదింపక ఆరగించిన మానవుడు ఏడుజన్మలవరకు పశువుగ జన్మించును. విద్వాంసుల సత్కవిత్వమును విమర్శించువాడు ఏడు జన్మలు మండూకముగ జన్మించును. అసత్యముపలికి తాను విద్వాంసుడ నని యితరులను నమ్మించి పౌరోహిత్యముచేయు పాపి ఏడుజన్మలపర్యంతము నీచ యోనులందు ఉండును. కన్యను విక్రయించు నీచమానవుడు సూర్యచంద్రు లున్నంతవరకు నరక మనుభవింపవలెను. ఒకపర్యాయ మైనను నాదివ్య నామము స్మరించనినీచుడు అనేకనీచయోనులందు జన్మించి దుఃఖింపగలడు. ఇతరులపై నీలాపనిందల నారోపించువారు, దైవమును, బ్రాహ్మణుని నిందించువారు మహాపాపమునకు గుఱికాగలరు. కుత్సితాచరణయుక్తులు పవిత్ర రహితులు మ్లేచ్ఛులై జన్మించెదరు.

శ్లో॥ కామతో యోషితాం శ్రోణీస్తనాస్యే యశ్చ పశ్యతి ।
స భవేద్ దృష్టిహీనశ్చ పరత్రాపి నపుంసకః ॥ 101

కామభావముతో పరస్త్రీ కటిప్రదేశమును, స్తనములను, ముఖమును, వీక్షించువాడు మఱుజన్మములో దృష్టిహీనుడై నపుంసకుడై దుంఖించును.

జ్ఞానహీను డైనను విద్వాంసునివలె అభిచారికకర్మలను నిర్వర్తించు వాడు, హింసకుడై చరించువాడు, పదివేల సంవత్సరములు అంధతామిశ్రనరక మనుభవింపగలడు. శాస్త్రజ్ఞు డైన జ్యోతిష్కుడు లోభవశమున అనృత మాడిన ఏడుజన్మలవరకు వానరుడై జన్మించును. నిజధర్మమందు సదా తత్పరుడై జీవించు బ్రాహ్మణుడు అగ్నికంటె పరమపవిత్రుడు అత్యంత తేజస్వియు కాగలడు. అసద్బ్రాహ్మణుని గాంచిన దేవత లైనను కంపింతురు. నదులందు

గంగ, తీర్థములందు పుష్కరతీర్థము పురములయందు కాశి, జ్ఞానులయందు శంకరుడు, శాస్త్రములందు వేదము, వృక్షములందు అశ్వత్థవృక్షము, సకల తపములందు నాపూజ, వ్రతములందు ఉపవాసవ్రతము శ్రేష్ఠములైనట్లే సర్వులందు స్వధర్మపరాయణు డైన సద్బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు. సమస్తపుణ్యములు, వ్రతములు, తీర్థములు ఆభాగవతోత్తమునిచరణములందే నివసించును. మద్భక్తు డైన బ్రాహ్మణునిచరణరజము పరిశుద్ధము, రోగవినాశకము. వాని శుభాశీర్వాదము సకలకళ్యాణప్రదము. తండ్రీ! నీయాజ్ఞను మన్నించి నేను కర్మ విపాకములను వర్ణించితిని. ఈకర్మవిపాకాఖ్యానము నాలకించి వాచకుని సత్క రించువారు అఖండపుణ్యమును బొందగలరు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ జన్మఖండలో కర్మవిపాక వర్ణనమును ఎనుబదిఅయిదవ అధ్యాయము సంపూర్ణము



# ఎనుబదియారవ అధ్యాయము

## కేదార కన్యోపాఖ్యానము

నందుడు పలికెను:

ప్రభూ! నీవు స్త్రీప్రసంగసమయమున కేదారకన్యను ప్రస్తావించి పిమ్మట కర్మవిపాకమును వివరించితివి. ఈ కేదారకన్య యెవరు? భూపాలు డైనకేదారు డెవరు? ఏవంశమందు దానరేశ్వరుడు జన్మించెను? విస్తారపూర్వకముగ కేదార కన్యచరితమును వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీకృష్ణుడు పలికెను:

నందబాబా! సృష్ట్యాదియందు బ్రహ్మకు స్వాయంభువ మనువు పుత్రునిగ జన్మించెను. స్త్రీలయందు ధన్యురాలైన, మాననీయురా లైన శతరూపయే ఆయన భార్య, ఆదంపతులకు ప్రియంవ్రతుడు, ఉత్తానపాదుడు నను ఇద్దరు పుత్రులు కలిగిరి. ఉత్తానపాదుని కుమారుడే మహాయశస్వియు,

పరమభాగవ తోత్తముడైన ధ్రువచక్రవర్తి, ధ్రువుని కుమారుడు నందసావర్ణి, నందసావర్ణిపుత్రుడే కేదారుడు, కేదారుడు స్వయముగ విష్ణుభక్తుడు, సప్తద్వీప వతియైన పృథ్వికి ఏకైకాధిపతి, తనరాజ్యములోని అందరి శుభముల నాకాంక్షించి యానరేశ్వరుడు ప్రతిదినము రాజదర్బారులో సువర్ణరత్నాలంకారములచే విభూషితములైన శృంగములుగల వయస్సులోనున్న గోవులను సద్బ్రాహ్మణులకు సమర్పించును. ప్రాతఃకాలమునుండి సాయంకాలమువరకు బ్రాహ్మణులకు స్వాదిష్టభోజనముల సమర్పించెడి వాడు. యాచకులకు ధనకనకవస్తు వాహనము లను దానమొనరించెడివాడు. రాజు జితేంద్రియుడై, విష్ణుభక్తి పరాయణుడై కేవలము ఫలములను, మూలములను ఆహారముగ గైకొని సర్వస్వము నాకు సమ ర్పించి అహర్నిశములు నాదివ్యనామ సంకీర్తనయందు సంలగ్నుడైయుండెడి వాడు. ఆనరేశ్వరుడు నాప్రీత్యర్థమై యజ్ఞ మొనరించు సమయమున ఆయజ్ఞకుం డమునుండి శ్రీమహాలక్ష్మి కన్యరూపమున తనకళతో నావిర్భవించెను. ఆమె దివ్యరత్నాభరణవిభూషిత, అగ్నిశుద్ధవస్త్రపరిధాన. ఆకన్య కేదారుని సంబో ధించి, మహారాజా! నేను నీకొమరిత నని పల్కెను. నరేశ్వరుడు పరమానంద భరి తుడై ఆదివ్యకన్యనుపూజించి తనపుత్రికగ గ్రహించెను. అయోనిజ యైన యాకన్య తల్లిదండ్రులయనుజ్ఞ గైకొని తపమాచరించుటకు యమునా తటమందు గల పుణ్యవనమునకు వెళ్ళెను. ఆవనము బృందాదేవి తప మాచరించిన ప్రదేశము గావున బృందావనమయ్యెను. కేదారకన్య ఆపవిత్ర ప్రదేశములో సర్వ వరులలో శ్రేష్టుడ నైన నన్నే వరునిగ నాకాంక్షించి ఘోరతప మాచరింప దొడంగెను. జగద్విధాత యగు బ్రహ్మ ఆమెకు త్వరలోనే కృష్ణ ప్రాప్తియగునని వరమును ప్రసాదించెను. బ్రహ్మ ఆమెను పరీక్షించుటకు ధర్మదేవత నాదేశింపగా, ధర్మదేవత సుందరబ్రాహ్మణయువకుడై కేదారకన్యను సమీపించి యిట్లు పల్కెను. "సుందరీ! నీవెవరిపుత్రికవు? నీనామధేయ మేది? ఏకాంతముగ నీ వెందులకు నివసించుచున్నావు? సుందరీ! నీవు ఏమికోరి తప మాచరించు చున్నావు? నీకు కళ్యాణ మగు గాక! నీమనోభీష్టములను తెలిపినచో నేను వరములను ప్రసాదింపగలను.

ధర్మదేవత పల్కినపల్కుల నాలకించి బృందాదేవి యిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "విప్రవరా! నేను కేదారరాజకన్యను, నానామధేయము బృంద. శ్రీహరినే ప్రాణేశ్వరునిగ పొందుటకు నే నీ బృందావనములో నివసించుచు

నేకాంతమందు తప మాచరించుచున్నాను. కావున బ్రాహ్మణోత్తమా! నీవు నాకు అట్టివరమును ప్రసాదించుటకు సమర్థుడవైన తక్షణమే యాదివ్యవరమును నా కొసంగి నన్ను కృతార్థురాలిగ నొనరింపుము. లేనియెడల నీమార్గమున నీవు జనుము. నన్ను ఈ ప్రశ్నల నన్నింటిని అడుగుటవలన నీ కేమిలాభము?" బృందా దేవి ప్రత్యుత్తరము నాలకించి ధర్మదేవతయిట్లు పలుకనొడంగెను.

ధర్మదేవత పలికెను :-

బృందా! ఇచ్ఛారహితుడు, తర్కాతీతుడు, అఖండైశ్వర్యసంపన్నుడు, ప్రాకృతికనిర్గుణుడు, ప్రాకృతికనిరాకారుడు, భక్తానుగ్రహదివ్యవిగ్రహుడు నగునాపరమాత్మను పతిరూపమున బడయుటకు లక్ష్మీసరస్వతులుదప్ప అన్యు లెవరు సమర్థులు? వైకుంఠనాథుడైన చతుర్భుజుడైన భగవంతునకు వీరిద్దరు భార్యలు. గోలోకములో ద్విభుజుడై, మురళీగానవినోదియై, కిశోరగోపవేష ధారియై, పరిపూర్ణతముడై విరాజిల్లు శ్రీకృష్ణపరమాత్మయర్ధాంగి, పరాత్ప రియు నగు మహాలక్ష్మి రాధ యనిగ్రహింపుము. ఆమె పరబ్రహ్మస్వరూపిణి. శ్యామసుందరుడు, ఆత్మబలసంపన్నుడు అఖండైశ్వర్యశాలి, శమపరాయ ణుడు, పరమసౌందర్యవిగ్రహుడు, శతకోటి మన్మథాకారుడు, అమూల్యదివ్య రత్నాభరణవిభూషితుడు, సత్యస్వరూపుడు, అవినాశి, రమణీయపీతాంబరధారి, సకలసంపత్ప్రదాత యగునాజగన్నాథుని సేవలందు రాధాదేవి నిత్యము సంల గ్నురాలైయుండును. శ్రీకృష్ణుడు ద్విభుజ, చతుర్భుజరూపములుగ విభక్తు డైనాడు. ఆయనయే స్వయముగ చతుర్భుజరూపమున వైకుంఠములో, ద్విభుజ రూపమున గోలోకములో విరాజిల్లును. ఇరువదియెనుమదేలయుగములు గతించిన ఇంద్రుని యాయుర్దాయము పరిపూర్ణము కాగలదు. అట్టి పదునల్వురింద్రుల శాసనకాలము లోకవిధాత యైన బ్రహ్మకు ఒకపగలు. అంతకాలమే బ్రహ్మ దేవున కొకరాత్రి కాగలదు. అట్టి ముప్పదిదినము లొకమాసమై, పండ్రెండు మాసములు వర్షమై, అట్టి వర్షములు నూరు పరిపూర్ణమైన బ్రహ్మయొక్క పూర్ణాయుర్దాయ మని తెలిసికొనగలరు. ఆ బ్రహ్మాయువు ఎవని కొకనిమేష కాలమో, సనకాది మహర్షులు జీవితపర్యంత మెవనిసేవలందు నిమగ్ను లైయున్నను కోట్లకొలదికల్పములు గతించినను ఏవిభుడు వారలకు సాధ్యుడు కాలేదో, సహస్రముఖసమన్వితు డైనయాదిశేషుడు కోట్లకొలది కల్పములు భక్తిపూర్వకముగ అహర్నిశములు జపించినను ఏపరాత్పరుడు, దురారాధ్యుడు,

సకలహితకారి యగుభగవానుడు సాధ్యుడు కాలేదో, వేదోత్పాదకు డైన విధాత,ఫలదాత,సంపూర్ణ సంపత్ప్రదాత,జగత్స్రష్ట తనచతుర్ముఖములతో స్తుతించినను ఏపరబ్రహ్మము సాధ్యుడు కాలేదో ఆశ్రీమన్నారాయణుడు, వేదములకే అనిర్వచనీయుడు కాలునకుగూడకాలుడు. ఆయన యెవరికైనను అసాధ్యుడే.

బృందాదేవీ! ఆయనయే తనకళచే రుద్రరూపము ధరించి జగత్సంహార మొనరించుచున్నాడు. రుద్రదేవుడు తన పంచముఖములచే సదా ఆపరబ్రహ్మమునే ధ్యానించుచుండును. హరునికంటె నధికప్రియులు భగవంతునకు మఱియొకరు లేరు. ఆపరమేశ్వరునకే సచ్చిదానంద విగ్రహుడు సాధ్యుడు కాలేదు; అయినచో మఱియొకరెంత? బృందా!సర్వశక్తి స్వరూపిణియు, దుర్గతినాశనియు, పరబ్రహ్మస్వరూపిణియు, ఈశ్వరియు, మూలప్రకృతియు, నారాయణియు, విష్ణుమాయయు, వైష్ణవియు, సనాతనియు నగు దుర్గాదేవి తనచే భ్రమణశీలయైన జగత్తును సదా త్రిప్పుచుండును. ఆదుర్గాదేవి కూడ భక్తి పూర్వకముగ అహర్నిశము లాజగన్నాథుని స్తుతియందు సంలగ్నురాలై యుండును. గజాననుడైన గణేశ్వరుడు షణ్ముఖములు కల్గిన కార్తికేయుడు భక్తిసహితముగ యథాశక్తి ఆపరమాత్మ స్తుతియందు నిమగ్నులై యుందురు. సర్వప్రథమమున పూజలొందు సంపూర్ణ దేవతలకు స్వామియైన జ్ఞానులకే గురువైన, గణములకే స్వామియైన, దేవతలకే ఆధిపతియైన గణేశ్వరుడు ఎవని ధ్యానమందు సదా రతుడై యుండునో, పరమేశ్వరియగు సరస్వతి కూడ ఎవనిని స్తుతించుటలో అసమర్థురాలో; లక్ష్మి యహర్నిశము లెవని చరణ కమలములను సేవించునో; ఎవని కటాక్ష మాత్రముననే సర్వజగములు పరిపూర్ణములై కళ్యాణమయము లైనవో; ఎవని భయముచే వాయువు వీచునో, ఎవని భయముచే సూర్యుడు తపించునో, ఇంద్రుడు వర్షించునో, అగ్ని జ్వలించునో, మృత్యువు ప్రాణులందు చరించునో; ఎవని సేవ లొనరించి పృథ్వి సర్వులకు ఆధారస్వరూపిణియై రత్నగర్భయైనదో; ఎవని భయముచే సముద్రములు తమ పరిధిలో నున్నవో, పర్వతములు నిశ్చలముగ నున్నవో; ఎవని చరణ కమలముల సేవచే గంగ పావనియై, తీర్థస్వరూపిణియై, ముక్తి ప్రదాయనియై, సకలలోక పాపహారిణియై, విరాజిల్లెనో; ఎవని స్మరణమువలన, ఎవనిని సేవించినందువలన తులసి పరమ పవిత్రురాలైనదో; ఎవనిభయమువలన నవగ్రహములు, దిక్పాలకులు, కంపింతురో; సకల బ్రహ్మాండములందు తమతమ వివ్యక్త ధర్మములను నిర్వర్తించు

నసంఖ్య బ్రహ్మ విష్ణుశివశేష సురేశ్వరముని మానవ గణాదులు ఆపరమాత్మ యగు శ్రీకృష్ణుని కళ కళాంశలు అని గ్రహింపుము. కళ్యాణీ! నీవు ప్రకృతికే యతీతు డైన యాపరమేశ్వరుని భర్తగ పొందవలె నని యేల వ్యర్థప్రయత్న మొనరించెదవు? గోలోకవాసిని యైన రాధకే ఆయన సాధ్యుడు, మఱియొక రెంతటివార లైనను భగవంతుని సిద్ధించుకొనలేరు.

ఇట్లు పల్కి మాయావేషధారి యైన ధర్మదేవత బృందాదేవిని పరీక్షించుటకు ఆమె కసంఖ్యాక భోగములను ప్రసాదించెద నని ప్రలోభము లిడి తనను పతిగా స్వీకరింపు మని ప్రార్థించెను. తదనంతరము ధర్మదేవత బృందాదేవిని సమీపింప యత్నించెను. వ్రజేశ్వరా! ధర్మదేవత యభిప్రాయము కేవలము బృందాదేవిని పరీక్షించుటయే. తరుణ బ్రాహ్మణుని యావిపరీత చేష్టలను గాంచి రాజకన్య కోపముతో రక్తపంకజ లోచనయైనది. ఆమె హితకరములైన, సత్యములైన, యోగ్యములైన, యశస్కరములైన ధర్మార్థ వచనములను ఆవిప్రుని కిట్లు చెప్పెను.

శ్రీ బృందాదేవి పలికెను:

మహాభాగా! నన్ను సమీపింపకుము. నీవు సర్వజాతులందును శ్రేష్ఠుడ వైన బ్రాహ్మణుడవు. బ్రాహ్మణుల ధర్మములు తపమాచరించుట, సత్యపరాయణత్వము, వేదోక్త వ్రతాచరణము, ధైర్యధారణము మొదలైనవి. పరస్త్రీల యెడల ఆకర్షితులగుట అధార్మికుల స్వభావము. విప్రవరా! అధర్మమువలననే దుష్టునకు అమంగళములు ప్రాప్తించును. దుర్మార్గుడు తత్కాలము విజయము పొందినను అనతికాలములోనే తన దుష్కర్మలకు ఫలిత మనుభవించి నిశ్చయముగ నశించును, బలపూర్వకముగ పతివ్రతలను బలాత్కరించువారు మాతృగాము లనబడెదరు. వారికి నూఱు బ్రహ్మహత్యా పాతకములు సంభవించుట నిశ్చయము. సూర్యచంద్రు లున్నంతవరకు ఆపాపాత్ములు కుంభీపాక నరకములో యమయాతనల ననుభవింతురు. యమదూతలు లోహదండములచే నాపాపుల శిరములను బద్ధులుగావించి వారిని వేడినూనెలో పడవైచెదరు, అయినను పాపులు ధరించిన యాతనా శరీరము నశింపదు. విప్రోత్తమా! నీ వాశించు క్షణిక సుఖము చిరకాలము దుఃఖములను గలిగించి సర్వనాశన మొనరింపగలదు. కావుననే ధర్మాత్ము లైన పురుషులు అగమ్యా గమనజన్య దుఃఖమును వాంఛింపరు.

జ్ఞానదుర్బలుడ వైన బ్రాహ్మణుడా! నీకు కళ్యాణమగుగాక!
నాయాలోచనను వీడి నీదారిన నీవు పొమ్ము.

శ్లో॥ యథా దీపశిఖం దృష్ట్వా కీటః పతతి నిశ్చితమ్ ॥ 88
మిష్టం దృష్ట్వా బడీశాగ్రే లుబ్ధమీనో మృగో యథా ।
యథా విషాక్తం భక్ష్యం చ భుంక్తే భోక్తుభుభుక్షితః ॥ 89
గృహ్ణాతి దుష్టో దుష్టం చ విషకుమ్భం పయోముఖమ్ ।
తథాదృష్ట్వా పరస్త్రీణాం ముఖపద్మం మనోహరమ్ ॥ 90
వినాశబీజం మోహేన భ్రాన్తో భవతి లమ్పటః ।

దీపకాంతిని దర్శించి పతంగములు నిశ్చయముగ దీపముపై బడునట్లు; లోభి యైనమీనము, మృగము, గాలముయొక్క అగ్రభాగము నున్న మిష్టాన్నమును చూచి దానిని మ్రింగవలెనని అభిలషించు నట్లు; ఆకలిగొన్న మనుష్యుడు విచక్షణలేక విషమిశ్రిత భోజనమును భుజించునట్లు, పైకి తెల్లనిపాలవలె కనిపించుచున్న విషమిశ్రిత కుంభమును గ్రహించునట్లు, లంపటుడైన పురుషుడు వినాశమునకు గారణ మైన పరస్త్రీ ముఖారవిందమును గాంచి మోహావశమున భ్రాంతి నొంది నశించును.

శ్లో॥ ముఖం చ రుచిరం స్త్రీణాం శ్రోణీయాగ్మం స్తనౌ తథా ॥ 91
కామాధారం నాశబీజమధర్మస్థలమేవ చ ।
భగం నరకకుణ్డం చ లాలామూత్ర సమన్వితమ్ ॥ 92
దుర్గన్ధయుక్తం పాపం చ యమదణ్డస్య కారణమ్ ।

స్త్రీల సుందరముఖము, నితంబములు, స్తనములు, కామవాసనల కాధారములు, సర్వనాశనమునకు గారణములు, అధర్మమునకు స్థానములు. మలమూత్ర సంయుక్తము, దుర్గంధ భరితము, పాపమునకు, యమదండమునకు గారణములు నగుస్త్రీల యోని నరకకుండ సదృశ మని గ్రహింపుము.

బ్రాహ్మణా! ఏకాంత మని భావించి నన్ను నీవు సమీపింప యత్నించుచున్నావు. ఈప్రదేశమున సమస్తదేవతలు, లోకపాలకులు, సకల కర్మశాసకుడు సాక్షి యైన ధర్మదేవత, స్వయముగ శ్రీహరిచే నియుక్తుడైన దండధరు డగు యముడు, శ్రీకృష్ణుడు, జ్ఞానస్వరూపు డైన మహేశ్వరుడు, దుర్గ, బుద్ధి, మనస్సు, బ్రహ్మ, ఇంద్రియములు నున్నవి. వీరందఱు సర్వప్రాణులందు దేహధారు లొనరించు కర్మలకు సాక్షిరూపమున నున్నారు; కావున

బ్రాహ్మణా! ఏ ప్రదేశము గుప్తము? ఏ ప్రదేశము రహస్యమయము? విప్రా! నీకు కళ్యాణ మగుగాక! నీవు సంకల్పమును వీడి మరలి పొమ్ము, నేను నిన్ను ఈక్షణ మందే భస్మ మొనరింపగలను, కాని బ్రాహ్మణులు వధింపదగినవారుకా రని తలంచితిని. కావున కుమారా! నీవు సుఖముగ నీ ప్రదేశమును వీడి మరలిపొమ్ము. ద్విజా! నేను మూటయెనిమిదియుగములనుండి తప మాచరించు చున్నాను. వర్తమానకాలమున నాకు తలిదండ్రులు లేరు. వారి గోత్రము లైనను లేవు. సర్వులకు అంతరాత్మస్వరూపు డైన శ్రీకృష్ణుడే నన్ను సదా రక్షించును. శ్రీకృష్ణునిచే స్థాపింపబడినధర్మమే నిత్యము నారక్షణ యందు తత్పరుడైయుండును. సూర్యుడు, చంద్రుడు, పవనము, అగ్ని, బ్రహ్మ, శివుడు, దుర్గ మొదలగు వీ రందఱు నన్ను రక్షించుచున్నారు. హంసలను శ్వేతవర్ణముతో, శుకములను పచ్చనివర్ణముతో, మయూరములను వివిధ వర్ణములతో సృష్టించిన, భగవానుడు నన్ను రక్షించును. అనాథలను, బాలకులను, వృద్ధులను, దేవతలు సదా రక్షింతురు, కావున స్త్రీ నని తలచి ధర్మదేవత నన్ను పరిత్యజించి వెడలలేదు.

తదనంతరము శ్రీబృందాదేవి పతివ్రతాధర్మమును ప్రశంసించి దురా చారములను నిందించి క్రోధముతో బ్రాహ్మణరూపధారి యైన ధర్మదేవత నిట్లు శపించెను. "దురాచారపరాయణా! నాశమునుబొందెదవుగాక! నాశ మునుబొందెదవుగాక." యని బృంద మఱల శపించుట కుద్యుక్తురాలు కాగా స్వయముగ సూర్యుడే వారియెదుట సాక్షాత్కరించి ఆమెను శాంతింపజేసెను. ఆక్షణమందే బ్రహ్మశివసూర్యేంద్రాది దేవత లాప్రదేశమున కరుదెంచి ధర్మ దేవత క్షమింపు మని బృందాదేవిని ప్రార్థించిరి. ధర్మదేవత బ్రాహ్మణరూప మును ధరించి కేవలము నిన్ను పరీక్షించుట కరుదెంచెనని, ఆయనమనస్సులో నెట్టి మాలిన్యము లే దని విన్నవించుకొనిరి. ధర్మదేవత నశించిన జగమునందు సనాతనధర్మజీవనము నశించునని, ధర్మమునకు జీవనదాన మొసంగు మని యాదేవిని ప్రార్థించిరి. సర్వదేవతలను వీక్షించి బృందాదేవి యిట్లుపల్కెను. "దేవతలారా! ఈబ్రాహ్మణుడు ధర్మమని, నన్ను పరీక్షించుట కరుదెంచినా డని నాకు తెలియదు. ఆకారణమువనే నేను క్రోధవశమున వీనిని శపించితిని, అయినను మీయందలికృపవలన తప్పక ధర్మదేవతకు జీవనదాన మొనరించెదను; నాయందు సత్యము ఉన్నచో నావ్రతములు సత్యమైనచో తపము శుద్ధమైనచో

ఆపుణ్యసత్యతపఃప్రభావములవలన ఈబ్రాహ్మణుడు దుఃఖరహితుడగుగాక! నిత్యమూర్తియు సర్వాత్ముడునగు శ్రీమన్నారాయణుడు జ్ఞానాత్మకు డైన శివుడు, సత్యస్వరూపు డైన ఈద్విజవరుడు సంతాపరహితు లగుగాక! బ్రహ్మ సత్యమైన, ప్రకృతి సత్యమైనచో సర్వదేవతలు సత్యమైన, యజ్ఞము సత్యమైన, తపము సత్యమైన ఈబ్రాహ్మణునికష్టము లన్నియు అంతరించుగాక.''

ఇట్లుపల్కి బృంద ధర్మదేవతన తన యొడిలో నిడుకొని ఆయనకు తన శాపవశమున సంభవించిన కష్టమును గాంచి దుఃఖింప దొడంగెను. ధర్మదేవుని యర్థాంగి యైన మూర్తి అత్యంత దుఃఖితయై యాప్రదేశమున సాక్షాత్కరించి విష్ణుచరణముల నాశ్రయించి యిట్లు ప్రార్థించెను. ''జగన్నాథా! నీవు కరుణా సాగరుడవు. దీనబాంధవా! కృపామూర్తీ! నాపై నీకృపను ప్రసరింప జేయుము. నాపతి దేవుని శీఘ్రముగ సతీశాపమునుండి రక్షింపుము. పతిహీనురా లైన నారి యాభవసాగరమందు పాపాత్మురాలిగ భావింపబడును. పతి లేనిస్త్రీ నేత్రములు లేని ముఖమువలె, ప్రాణరహితమైన శరీరమువలె శోచనీయమగును.

శ్లో॥ మితం దదాతి హి పితా మితం భ్రాతా మితం సుతః ।
మితం బన్ధుర్మితం మాతా సర్వదాతా పతిః ప్రభుః ॥ 32

''తలిదండ్రులు, సోదర బంధువులు, పుత్రులు మొదలగు వారు పరిమిత సుఖమునే స్త్రీకి నొసంగ గలరు, కాని సర్వస్వమును, సర్వసుఖములకు నొసంగు టకు స్త్రీకి భర్తయే సమర్థుడు.'' ఇట్లు భగవంతుని ప్రార్థించి మూర్తిదేవి విలపింప దొడంగెను. మూర్తి ప్రార్థనలను నాలకించి సర్వాత్మకు డైన, ప్రకృతికే అతీతు డైన భగవంతుడు బృందా దేవి నుద్దేశించి యిట్లుపల్కెను. ''సుందరీ నీవఖండ తపము ద్వారా బ్రహ్మసమానాయుః సంపన్నురాల వైతివి. కావున నీ యాయుర్ధాయము ధర్మదేవత కొసంగి స్వయముగ గోలోకమునకు వెడలుము. గోలోకసరంధామములో నీతపఃఫల ప్రభావమువలన సర్వేశ్వరుడ నైన నన్ను పొందగలవు, సుముఖీ! గోలోకమందు బహుకాలము సుఖించి వరాహ కల్పములో నీవు రాధకు ఛాయా సంభూతవై, వృషభాను కన్యవై అవనిపై నవతరించెదవుగాక. ఆసమయమున నాకళాంశచే జన్మించి రాయణుడు నీపాణిని గ్రహించును. రాసక్రీడా సమయమున నీవు రాధాదేవితోను సర్వ గోపికలతోను కూడి మజల నాసామీప్యముననుభవింబగలవు. శ్రీదాముని శాపవశమున ధరణిపై నవతరించిన రాధ వాస్తవముగ స్వస్వరూపిణి యైన రాధయే, నీవు ఆమెకు ఛాయవై మెలగుము. రాధావివాహ సమయమున వాస్తవిక రాధ నిన్ను తన స్థానమునం దుంచి తను అంతర్ధానము కాగలదు. కావున రాయణుడు కేవలము ఛాయా స్వరూపిణి నైన నీపాణిగ్రహణ మొనరిం

చును. మోహావశులైన జనులు నిన్నుదర్శించి రాధయని భ్రమింతురు. రాధాదేవి దివ్యదర్శనము ఎంతటివారలకైనను దుర్లభమే. రాధాదేవి ఛాయయేరాయణుని భార్యగా వర్తించును. నిజమైన రాధ సదా నాహృదయ పీఠము నధిష్టించి విరాజిల్లును.''

విష్ణుభగవానుని యీవచనముల నాలకించి బృంద ధర్మదేవతకు తన పరిపూర్ణాయువునొసంగెను. బృందాదేవి యనుగ్రహామువలన పునర్జీవితుడై ధర్మదేవత ప్రతప్తసువర్ణ కాంతితో ప్రకాశించెను. ఆయన సౌందర్యమినుమడించెను. దేవతల నుద్దేశించి బృందాదేవి యిట్లుపల్కెను. ''దేవతలారా! నాశాపము నుల్లంఘించుట యత్యంతపతినము. సావధానచిత్తులై నావచనములను శ్రవణముచేయుడు. నావాక్యములు మిథ్యలు కావు. నేను క్రోధవశమున మూడుపర్యాయము క్షీణించెదవుగాక యని శపించి మఱల శపించుట కుద్యుక్తురాలను కాగా సూర్యదేవుడు నన్ను వారించెను. నాశాపఫలానుసారముగ ధర్మదేవత సత్యయుగములో పరిపూర్ణుడైవిరాజిల్లును, కాని త్రేతాయుగములో మూడుపాదములతో, ద్వాపరమందు రెండుపాదములతో, కలియుగ ప్రథమమందు ఒక్కపాదముతో విరాజిల్లగలడు. కలియుగాంతభాగములో ధర్మదేవత షోడశాంశమాత్రముగనే యుండగలడు. మరల సత్యయుగములో రిపూర్ణుడు కాగలడు. నాముఖమునుండి మూడుపర్యాయములు క్షీణ శబ్దము బయల్వెడలినది; ఆక్రమముగనే ధర్మదేవత క్షీణించును. నేను మఱల శపించుట కుద్యుక్తురాలనకాగా సూర్యదేవుడు నన్ను వారించెను; ఈకారణమువలన ధర్మదేవత కలియుగాంతమున పరిపూర్ణముగ నశింపక కళామాత్రముగనే యుండగలడు.''

నందబాబా! ఆసమయముననే గోలోకమునుండి యరుదెంచిన యత్యంతసుందర విమానమును సర్వదేవతలు గాంచిరి. ఆవిమాననిర్మాణమమూల్యరత్నసారతత్వముచే గావింపబడెను. విమానమును గాంచి బృందాదేవి యీప్రదేశముననున్న హరిశంకరబ్రహ్మాదులకు నమస్కరించి విమానము నధిరోహించి గోలోకమును జేరెను. తదనంతరము సర్వదేవతలు తమతమ ధామముల కరిగిరి. తండ్రీ! నీవు మఱి యేవిషయములను అవధరింప నభిలషించుచున్నావో తెల్పుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ జన్మఖండలో కేదార కన్యోపాఖ్యాన మను ఎనుబదిఆఱవ అధ్యాయము సంపూర్ణము



# ఏనుబదియేడవ అధ్యాయము

## శ్రీకృష్ణుని సచ్చిదానందవిగ్రహ నిరూపణము

నందుడు పలికెను :-

ప్రభూ! నీవు స్వయముగ వేదాతీతుడవు; కావుననే వేదములు, బ్రహ్మ, శివశేషాదిదేవతలు, మునిసిద్ధాదులు నిన్ను తెలిసికొనజాలకున్నారు. నీ వెవరు? నీ వైన మేమి? ఈవిషయములను దెలిసికొనవలె నని నామనస్సు మిగులనుత్కంఠతతో నున్నది; కావున యీనిర్జనస్థానములో నీవు నీవృత్తాంత మంతయు యథార్థరూపమున వర్ణించి నన్ను కృతార్థునిగ జేయుము.

శ్రీ నారాయణఋషి పలికెను :-

నారదమునీంద్రా! ఆసమయమున శ్రీకృష్ణుని దర్శించుటకు అచటికి పులహుడు, పులస్త్యుడు, క్రతువు. భృగువు, అంగిరసుడు, ప్రచేతసులు, వశిష్ఠుడు, దుర్వాసుడు, కణ్వుడు, కాత్యాయనుడు, పాణిని, కణాదుడు, గౌతముడు, సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, కపిలుడు, ఆసురి, ఓఢుడు, పంచశిఖుడు, విశ్వామిత్రుడు, వాల్మీకి, కశ్యపుడు, పరాశరుడు, విభాండకుడు, మరీచి, శుక్రుడు, అత్రి, బృహస్పతి, గార్గ్యమహర్షి, వాత్స్యమహర్షి, వ్యాసదేవుడు, జైమిని, ఋష్యశృంగుడు, యాజ్ఞవల్క్యుడు, శుకుడు, సౌభరి, భరద్వాజుడు, సుభద్రకుడు, మార్కండేయుడు, లోమసుడు, విటంకనుడు, శతానందుడు, వామదేవుడు, భాగురి, సంవర్తుడు, ఉతథ్యుడు, నరుడు, నేను (నారాయణుడు), నీవు (నారదుడు), జాబాలి, పరశురాముడు, అగస్త్యుడు, పైలమహర్షి, యుధామన్యుడు, గౌరముఖుడు, ఉపమన్యువు, శ్రుతశ్రవుడు, మైత్రేయుడు, చ్యవనుడు, కరథుడు, కరుడు మొదలగు మునీశ్వరు లరుదెంచిరి. వత్సా! వా రందఱు అఖండబ్రహ్మతేజముచే ప్రజ్వరిల్లుచున్నారు. మహాత్ములయాగమనమును గాంచిన శ్రీకృష్ణపరమాత్మ తత్‌క్షణమే యాసనమునుండి లేచి ముకుళితహస్తుడై వారికి నమస్కరించి, వారాసీనులగు ఆదరముగ రమణీయరత్న సింహాసనముల నొసంగెను. ఆసనములపై సుఖాసీనులైనమహర్షులను పేరుపేరున కుశలప్రశ్నల నడగి వారిని పూజించి భగవంతుడు స్వయముగ వారినడుమ ఆసీనుడయ్యెను. ఆసమయమున వారందఱు గగనములో నొకసముజ్జ్వలతేజోరాశి నిగాంచిరి. వత్సా! నారదా! ఆ తేజోమండలముమధ్యలో సువర్ణకాంతిసమన్వితు డైన పంచవర్షీయుడైన సన

త్కుమారుడు నగ్న బాలకునిరూపమున సాక్షాత్కరించెను. ఆమహాత్ముని గాంచి మునిమండలి, స్వయముగ శ్రీకృష్ణుడు లేచి నిలువబడి నమస్కరించి స్వాగతముపల్కిరి. సనత్కుమారుడు సభాసమ లందఱిని యాశీర్వదించి మధురవచనములతో నిట్లుపల్కెను. "మునివరులారా! మీకు కళ్యాణమగుగాక! మీరొనరించినతపములకు అభీష్టఫలములు ప్రాప్తించుగాక! కాని కళ్యాణములకే కారణస్వరూపు డైన శ్రీకృష్ణుని కుశలప్రశ్నలడుగుట నిష్ఫలము. ఈసమయమున మీరందఱు సర్వదా కుశలురే; ఎందువలెననగ ప్రకృతి కతీతుడైనను కేవలము తన భక్తుల ననుగ్రహించుటకు సచ్చిదానందవిగ్రహమును ధరించినవాడు, ప్రాకృతికనిర్గుణుడు, ఇచ్ఛారహితుడు, పృథ్వీభారమును హరించుట కిపుడవతరించినవాడు నగునాపరమాత్మను దర్శించుచున్నారు."

సనత్కుమారునిమధురవాక్కుల నాలకించి శ్రీకృష్ణుడిట్లు ప్రశ్నించెను "విప్రశ్రేష్ఠా!సర్వశరీరధారులకు కుశలప్రశ్న అభీష్ట మైననావిషయములో నెందులకు కాదు,, భగవంతుని ప్రశ్న మాలకించి సనత్కుమారుడిట్లుపల్కెను "జగన్నాథా! ప్రాకృత శరీరధారులను కుశలమడుగుట సర్వాదా శుభప్రదము. కాని ఎవని శరీరము నిత్యమో, సత్యమో, చిన్మయమో, ఆనందమయమో, సకలమంగళప్రదమో, ఆయనను కుశలమడుగుట నిరర్థకము,,

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :—

విప్రవరా! శరీరధారులందఱు ప్రాకృతికులనబడిరి, నిత్యస్వరూపిణి యైన ప్రకృతి లేనిదే శరీరనిర్మాణము సంభవింపదుగదా!

స న త్కు మా రు డు ప లి కె ను :-

దేవా!శుక్రశోణితములచేనుత్పన్నములైనవానినే ప్రాకృతికశరీరము లనవలెను.కాని ప్రకృతికిస్వామియు, ప్రకృతికికారణమునగు ఆయనవిగ్రహ మెట్లు ప్రాకృత మగును? దేవాదిదేవా నీవుసర్వకారణకారణుడవు, ఈశ్వరుడవు సచ్చిదానందవిగ్రహుడవు, అనాదివి, అనంతుడవు, అప్రమేయుడవు, గోవిందుడవు సర్వావతారములకు బీజస్వరూపుడవు, అక్షరుడవు, అవినాశివి, స్వయముగ భగవానుడవు.నీవు నిత్యుడవని, సనాతనుడవని, జ్యోతిస్వరూపుడవని, పరమోత్కృష్టుడవని, పరమాత్మవనిఈశ్వరుడ వనివేదములు కీర్తించుచున్నవి.

దేవా! మాయాపతివైన, ప్రాకృతికనిరుణుడి వైన, పరాత్పరుడ వైన నీవు ఆత్మ మాయద్వారా స్వగుణస్వరూపమును ధరించితి. వేదవేదాంగములు వేదజ్ఞులు ఘోషించుచున్నారు.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :-

విప్రవరా! నేను వసుదేవునిపుత్రుడనైన వాసుదేవుడను నాశరీర మేల ప్రాకృతికము కాదు? నాకేలకుశలప్రశ్న మభీష్టముకాదు?

స న త్కు మా రు డు ప లి కె ను :-

జగన్నాథా! ఎవనిరోమకూపములందు సమస్తవిశ్వములు నున్నవో; ఎవరు సర్వమునకు నివాసస్థానమో వానిని, వాసు, అందురు, ఆవాసునకు దైవ మైనపరబ్రహ్మమునే వాసుదేవుడనిరి. జగన్నాటకసూత్రధారీ! వాసుదేవుడను నీదివ్యనామము నాల్గువేదములందు, సకలపురాణములందు, ఇతిహాసములందు, విరాజమానమైయున్నది. వేదములందు నీస్వరూపము ప్రాకృతిక మనినిరూపింప బడలేదు. సచ్చిదానంద విగ్రహా నీవిగ్రహము ప్రకృతికంటెనతీతము, నిత్యము, సత్యము, చిన్మయము, ఆనందమయము, నీకు, నీదివ్యనామమునకు, నీదివ్య చరితములకు, నీదివ్యవిగ్రహమునకు భేదము లేదు. పరమాత్మా! ఈమతమునకు సకలమహర్షులు, ధర్మదేవతలు సర్వదేవతలు, సూర్యచంద్రాదులు సాక్షులు.

భృ గు మ హ ర్షి ప లి కె ను :-

విప్రేంద్రా! మహాత్మా! సనత్కుమారా! నీవు ధన్యుడవు. వైష్ణవులందగ్ర గణ్యుడవు; నీవుచెప్పినది పరమసత్యము. నీకు అఖండస్వాగతము, మహాత్మా! ఏనిమిత్తమున మీరీప్రదేశమునకు ఏగుదెంచితిరి?

స న త్కు మా రు డు ప లి కె ను :-

మహర్షులారా! శ్రీకృష్ణచంద్రా! నే నీసమయమున నిచటకు ఎందుల కరుదెంచితినో చెప్పెద వినుడు.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :-

మహాత్మా! నీవు సర్వధర్మజ్ఞాతవు, సర్వజ్ఞుడవు విద్వాంసులందు సర్వ శ్రేష్ఠుడ వైననీకు సకలము విదితమే; కావున యే ప్రయోజనముకొఱకు ఈప్రదే శమున కరుదెంచితివో తెలుపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

సనత్కుమారుడు పలికెను :-

దేవా! నీవు ధన్యుడవు. సర్వలోకములయందు మాన్యుడవు. ఈశ్వరులకును ఈశ్వరుడవు నీవే, విశ్వములందు నిన్ను మించినవారు మఱియొకరు లేరు.

తదనంతరము మునులు ప్రశ్నింపగ సనత్కుమారు డిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "మహర్షులారా! పరమధన్యుడు, మాన్యుడు, విధాతలకే విధాత, సర్వమున కాది, సర్వమునకు కారణము, సర్వము, పరమాత్మయు పరిపూర్ణతము డైన ప్రభువు, జగన్నాథుడు నగు నా శ్రీకృష్ణుని దర్శనార్థమే నేను మధుర కరుదెంచితిని.'' సనత్కుమారుడు పల్కిన వచనములను విని శ్రీకృష్ణసహితులైన సర్వమహర్షులు మందహాసముచేసిరి నందుడు పరమాశ్చర్యచకితుడయ్యెను. శ్రీకృష్ణుని స్వస్వరూపము నర్థము జేసికొనిననందుడు ఆయనయెడల పుత్రభావమును పరిత్యజించి పరబ్రహ్మ మైనభగవంతుని వీడలేక మరల దుఃఖితుడై యిట్లుపల్కెను.

శ్రీ నందుడు పలికెను :-

దేవేశ్వరా! కుజన్ముడు తనగృహమందు గల యమూల్యరత్నముల మూల్యమును తెలిసికొననట్లే నేను మోహమునబడితిని. నీవు ప్రకృతికే అతీతుడవు; కావున తెలిసియు తెలియక నేమ నీయెడల నొనరించిన యపరాధములను క్షమింపుము. పరాత్పరా! నిన్ను వీడి గోకులమునకు మరలిపోలేను. గోకులమునకు మరలిపోయినచో యశోదకు, నీ ప్రేయసియగురాధికకు, గోపగోపికలకు నే నేమని ప్రత్యుత్తర మొసంగగలను?

నారదా! ఇట్లు పల్కి నందుడు భగవంతుని వీడి పోలేక దుఃఖితుడై ఆసభామధ్యమున మూర్ఛిల్లగా శ్రీకృష్ణపరమాత్మ అత్యంతాదరముతో నందునకు శైత్యోపచారముల నొనరించి సమాధానపఱచసాగెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ జన్మఖండములో శ్రీకృష్ణుని సచ్చిదానంద విగ్రహ నిరూపణమను ఎనుబదిఏడవ అధ్యాయము సంపూర్ణము



# ఎనుబదియెనిమిదవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు నందునకు దుర్గాస్తోత్రము నొసంగుట

శ్రీ కృష్ణుడు పలికెను :-

తండ్రీ! చేతనత్వమును పొందుము. చరాచరసహితమైన యీప్రపంచమంతయుజలబుద్బుదమువలె క్షణభంగురము. కావున మహాభాగా! మోహమును పరిత్యజింపుము. పరాత్పరస్వరూపిణి, బ్రహ్మస్వరూపిణి, పరమోత్కృష్ట, ముక్తిప్రదాయని, సనాతని, సమస్తమోహమును ఖండింపగల, విష్ణుమాయయైన ఆమహామాయను స్తుతింపుము. నందబాబా! త్రిపురాసుర సంగ్రామసమయమున భయంకరరణరంగములో విజయము లభింపని శంకరుడీస్తోత్రముద్వారా మహామాయను స్తుతించి ఆమెప్రభావమువలన త్రిపురాసురులను వధించెను. ఈస్తోత్రరాజము అజ్ఞానవినాశకము, సంపూర్ణమనోరథప్రదము. తండ్రీ! ఆస్తోత్రమును నీ కుపదేశించెద నవధరింపుము.

శ్రీ నందుడు పలికెను :-

జగదీశ్వరా! నీవు వేదకర్తవు, నిర్గుణుడవైన పరాత్పరుడవు, సర్వదుఃఖములనునివారింపగల విభూతిని, యశస్సును, మనోరథసిద్ధిని ప్రసాదింపగలజగజ్జననియు దుర్గతినాశినియు నగు మహాదేవియొక్క పరమదుర్లభము, గోపనీయము, పరమోత్తమము నైనయాస్తోత్రమును నీభక్తుడ నైననాకు అవశ్యముగ నొసంగుము.

శ్రీ కృష్ణుడు పలికెను :-

వైశ్యేంద్రా! పూర్వకాలములో శ్రీ మన్నారాయణుని యుపదేశానుసారముగ బ్రహ్మప్రేరణతో రణరంగమధ్యమున విజయము లభింపని శంకరుడు ఏస్తోత్రముచే మహామాయను స్తుతించి విజయమును బొందెనో, మోహపాశములను ఖండింపగల యాపరమాద్భుత స్తోత్రమును వర్ణించెద శ్రవణమొనరింపుము. శత్రుమధ్యమున వివశుడై యున్న శివునిగాంచి నారాయణుడు యాస్తోత్రమును బ్రహ్మ కుపదేశించి హరునకు ప్రసాదింప వలసినదిగ ఆదేశించెను. రణమధ్యమున విజయము నొందక పరితపించుశివునకు బ్రహ్మ యీ స్తోత్రము నుపదేశించి యిట్లాదేశించెను. "శంకరా! సకల సంకటములను శాంతింపజేయగల, ఆద్యురాలైన, మూలప్రకృతియైన పరబ్రహ్మస్వరూపిణియైన

దుర్గతినాశిని దుర్గను స్తుతింపుము. మహాదేవా! శ్రీహరిప్రేరణచే నేను నిన్ని ట్లాదేశించుచున్నాను. ఎందువలననగ శక్తియోగములేనిదే జయము చేకూరదు" బ్రహ్మవచనముల నాలకించి శంకరుడు శుద్ధగంగాజలములలో స్నాన మాచరించినవాడై అగ్నిశుద్ధవస్త్రములనుధరించి పాదప్రక్షాళన మొనరించుకొని హస్తమందు కుశల నిడుకొని ఆచమన మొనరించెను. ఇట్లు పవిత్రుడై శంకరుడు భక్తిపూర్వకముగ శిరమును వంచి బద్ధాంజలియుక్తుడై పరబ్రహ్మము నైనన్ను ధ్యానించి దుర్గ నిట్లు స్తుతింపదొడంగెను.

## ః శ్రీ మహాదేవ ఉవాచః

శ్లో॥ రక్ష రక్ష మహాదేవి దుర్గే దుర్గతినాశిని ।
మాం భక్తమనురక్తం చ శత్రుగ్రస్తే కృపామయి ॥ 15

విష్ణుమాయే మహాభాగే నారాయణి సనాతని ।
బ్రహ్మస్వరూపే పరమే నిత్యానన్దస్వరూపిణి ॥ 16

త్వం చ బ్రహ్మాదిదేవానామమ్బికే జగదమ్బికే ।
త్వం సాకారే చ సగుణో నిరాకారే చ నిర్గుణమ్ ॥ 17

మాయయా పురుషస్త్వం చ మాయయా ప్రకృతిః స్వయమ్ ।
తయోః పరం బ్రహ్మ పరం త్వం బిభర్షి సనాతని ॥ 18

వేదానాం జననీ త్వం చ సావిత్రీ చ పరాత్పరా ।
వైకుణ్ఠే చ మహాలక్ష్మీః సర్వసమ్పత్స్వరూపిణీ ॥ 19

మర్త్యలక్ష్మీశ్చ క్షీరోదే కామినీ శేషశాయినః ।
స్వర్గేషు స్వర్గలక్ష్మీస్త్వం రాజలక్ష్మీశ్చ భూతలే ॥ 20

నాగాదిలక్ష్మీః పాతాలే గృహేషు గృహదేవతా ।
సర్వసస్యస్వరూపా త్వం సర్వైశ్వర్యవిధాయినీ ॥ 21

రాగాధిష్టాతృదేవీ త్వం బ్రహ్మణశ్చ సరస్వతీ ।
ప్రాణానామధిదేవీ త్వం కృష్ణస్య పరమాత్మనః 22

గోలోకే చ స్వయం రాధా శ్రీకృష్ణస్యైవ వక్షసి
గోలోకాధిష్ఠితా దేవీ బృన్దాబృన్దావనే వనే॥ 23

శ్రీరాసమణ్డలే రమ్యా బృన్దావనవినోదినీ ।
శతశృఙ్గాధిదేవీ త్వం నామ్నా చిత్రావలీతి చ ॥ 24

దక్షకన్యా కుత్ర కల్పే కుత్ర కల్పే చ శైలజా ।
దేవమాతాఽదితి స్త్వం చ సర్వాధారా వసున్ధరా ॥ 25

త్వమేవగఙ్గా తులసీ త్వం చ స్వాహా స్వధా సతీ ।
త్వదంశాంశాంశకలయా సర్వదేవాదియోషితః ॥ 26

స్త్రీరూపం చాతిపుంరూపం దేవీ త్వం చ నపుంసకమ్ ।
వృక్షాణాం వృక్షరూపా త్వం సృష్టా చాఙ్కురరూపిణీ ॥ 27

వహ్నౌ చ దాహికాశక్తిర్జలే శైత్యస్వరూపిణి ।
సూర్యే తేజః స్వరూపా చ ప్రభారూపా చ సంతతమ్ ॥ 28

గన్ధరూపా చ భూమౌ చ ఆకాశే శబ్దరూపిణీ ।
శోభాస్వరూపా చన్ద్రే చ పద్మసంఘేచ నిశ్చితమ్ ॥ 29

సృష్టౌ సృష్టిస్వరూపా చ పాలనే పరిపాలికా ।
మహామారీ చ సంహారే జలే చ జలరూపిణీ ॥ 30

క్షుత్త్వం దయా త్వం నిద్రా త్వం తృష్ణా త్వం బుద్ధిరూపిణీ ।
తుష్టిస్త్వం చాపి పుష్టిస్త్వం శ్రద్ధా స్త్వం చ క్షమా స్వయమ్ ॥ 31

శాన్తిస్త్వం చ స్వయం భ్రాన్తిః కాన్తిస్త్వం కీర్తిరేవ చ ।
లజ్జా త్వం చ తథా మాయా భుక్తిముక్తిస్వరూపిణీ ॥ 32

సర్వశక్తిస్వరూపా త్వం సర్వసమ్పత్ప్రదాయినీ ।
వేదేఽనిర్వచనీయా త్వం త్వాం న జానాతి కశ్చన 33

సహస్రవక్త్రస్త్వాం స్తోతుం న చ శక్తః సురేశ్వరి ।
వేదే న శక్తాః కో విద్వాన్ న చ శక్తా సరస్వతీ ॥ 34

స్వయం విధాతా శక్తో న నచ విష్ణుః సనాతనః ।
కిం స్తౌమి పంచవక్త్రేణ రణత్రస్తో మహేశ్వరి 35

కృపాం కురు మహామాయే మమ శత్రుక్షయం కురు ।

దుర్గతులను వినాశ మొనరింపగల మహాదేవీ! దుర్గా! నేను శత్రుగ్రస్తుడనైతిని, కావున కృపామయీ! అనురక్తభక్తుడనైన నన్ను రక్షింపుము, రక్షింపుము. మహాభాగా! నీవు జగదంబికవు, విష్ణుమాయవు, నారాయణివి, సనాతనివి, బ్రహ్మస్వరూపిణివి, నిత్యానందస్వరూపిణివి, పరమవు. దేవీ! నీవు బ్రహ్మాదిదేవతలకు జననివి. నీవే సగుణరూపమున సాకారమైతివి, నిర్గుణరూపమున నిరాకారమైతివి; సనాతనీ! నీవు మాయకు వశీభూతవై, పురుషునిగ

మాయతో స్వయముగ ప్రకృతివయ్యెదవు. ఈపురుషప్రకృతులకే అతీతుడైన అపరాబ్రహ్మమునే నీవు సదా ధారణయొనరింతువు. నీవే వేదములకు జనని యైనసావిత్రివి, వైకుంఠమందు సమస్తసంపత్స్వరూపిణివైన మహాలక్ష్మివి, క్షీరసాగరములో శేషశాయియగు నారాయణునకు ప్రియతమమైన మర్త్యలక్ష్మివి, స్వర్గములో భూతలముపై రాజ్యలక్ష్మివి. నీవే పాతాళమందు నాగాదలక్ష్మివి, గృహములందు గృహదేవతవు, సర్వసస్యస్వరూపిణివి, సమస్తైశ్వర్యప్రదాయనివి. నీవే బ్రహ్మకు రాగాధిష్ఠాత్రీదేవి యైనసరస్వతివి, పరమాత్మ యగుశ్రీకృష్ణునకు ప్రాణాధిదేవివి. నీవే గోలోకములో శ్రీకృష్ణుని వక్షఃస్థలముపై విరాజిల్లు గోలోకాధిష్ఠాత్రీదేవి యైన రాధవు. బృందావనములో గల రాసమండలములో నర్తించు సౌందర్యశాలిని యైన బృందావనవినోదినివి, చిత్రావళినామమున ప్రసిద్ధిగాంచిన శతశృంగపర్వతమున కధిదేవివి, నీవేయొక కల్పములో దక్షకన్యవు, మఱియొక కల్పములో హిమరాజకుమారివి. వేద, మాతయగు అదితి, సర్వాధార స్వరూపిణి యైన పృథ్వికూడ నీవే. నీవే గంగవు, తులసివి, స్వాహావు, స్వధవు, సతివి. దేవాంగనలు నీయంశల అంశకళనుండి ఉత్పన్నులైరి. దేవీ! స్త్రీపురుషనపుంసకరూపము లన్నియు నీరూపములే. నీవు వృక్షములందు వృక్షస్వరూపిణివి, అంకుర రూపమున ఆవిర్భవించితివి. నీవే అగ్నియందు దాహికశక్తివి, జలములందు శీతలత్వము, సూర్యునందు తేజస్సు, కాంతి. నీవే పృథ్వియందు గంధరూపము, ఆకాశమందు శబ్దరూపము, చంద్రునందు, కమలసమూహములందు సదా శోభారూపము, సృష్టియందు సృష్టిస్వరూపము; పాలనమందు పరిపాలికవు నీవే. సంహారకాలమందు నీవే మహామారివి, జలములందు జలస్వరూపిణివి. నీవే క్షుధవు, నీవే దయవు, నీవే నిద్రవు, నీవే తృష్ణవు, నీవే బుద్ధిస్వరూపిణివి, నీవే తుష్టివి, నీవే పుష్టివి, నీవే శ్రద్ధవు, నీవే స్వయముగ క్షమవు, నీవే స్వయముగ శాంతివి, భ్రాంతివి, కాంతివి, కీర్తివి, లజ్జవు, భోగమోక్షస్వరూపిణి యైనమాయవు. నీవే సర్వశక్తిస్వరూపిణివి, సర్వసంపత్ప్రదాయినివి. వేదములందుగూడ నీవు అనిర్వచనీయవు; కావున ఎవరైనను నిన్ను యదార్థరూపమున తెలిసికొనలేరు. సురేశ్వరీ! సహస్రముఖసమన్వితుడైన ఆదిశేషుడైనను నిన్ను స్తుతింపలేడు. వేదములైనను నిన్ను వర్ణింపలేవు, సరస్వతి యైనను నిన్ను స్తుతింపలేదు; అయినచో నెంతటి విద్వాంసు లైనను నిన్నెట్లు స్తుతింపగలరు.

మహేశ్వరీ! ఏదేవిని స్వయముగ బ్రహ్మయైనను, భగవంతు డైనవిష్ణువై నను స్తుతిచేయలేరో, ఆదేవిని రణరంగములో వ్యాకులుడనైననేను నాపంచము ఖముల ద్వారా ఎట్లు స్తుతింపగలను? కావున మహామాయా! నీవు నన్ను కరుణించి నాశత్రువులను నాశమొనరింపుము.

శ్లో॥ ఇత్యుక్త్వా చ సకరుణం రథస్థే పతితే రణే ॥ 36

ఆవిర్బభూవ సా దుర్గా సూర్యకోటిసమప్రభా ।
నారాయణేన కృపయా ప్రేరితా పరమాత్మనా ॥ 37

శివస్య పురతః శీఘ్రం శివాయ చ జయాయ చ ।
ఇత్యువాచ మహాదేవి మాయాశక్త్యాఽసురం జహి ॥ 38

కరుణాసహితు డైఇట్లుస్తుతించి రణరంగములో రథముపై వివశుడైయున్న శివుని యెదుట సూర్యకోటి సమప్రభయగుదుర్గ ప్రాదుర్భవించెను. ఆసమయ మున పరమాత్మయగు నారాయణుడు కృపాపరవశుడై ఆమెను ప్రేరేపించెను. అపుడు ఆమహాదేవి యెదుట సాక్షాత్కరించి ఆయనకు మంగళము, విజయము సిద్ధింపజేయువర మొసంగెను, "శివా! మాయాశక్తి నాశ్రయించి అసురులను సంహరింపుము." శంకరా! నీకు కళ్యాణమగుగాక! నీవు సర్వదేవతలందు శ్రేష్ఠుడవు. నీమనోభీష్టవరము నర్థింపుము. నేను నీకు విజయమును ప్రసాదించెదను. జగజ్జనని యభయము నాలకించి సంతుష్టాంతరంగుడై మహాదేవు డిట్లు వరమర్థించెను. "పరమేశ్వరీ! నీవు ఆదిసనాతనీశక్తివి. కావున దైత్యులకు వినాశమగుగాక, ఈ వరమునే ప్రసాదింపుము. మహేశ్వరుని యభీష్టము నాలకించి భగవతి ఆయన నిట్లుఅనుగ్రహించెను. "మహాభాగా! నీవు స్వయముగ భగవంతుడవు, విధాతవు, జ్యోతిర్మయుడ వైన పరమేశ్వరుడవు; కావున శ్రీహరిని స్మరించి అవలీలగ దైత్యులను వధింపుము."

త్రిపురాసుర సంగ్రామ మధ్యమున సర్వవ్యాపి యైనవిష్ణువు తనయొక కళచే వృషభరూపుడై ఆవిర్భవించి విరథు డైనశంకరునకు వాహనమైనాడు. శ్రీమన్నారాయణు డసురులను సంహరించుటకు హరునకు ఒక దివ్యాస్త్రము నొసంగెను. శంకరుడు మనములో శ్రీమహావిష్ణువును, దుర్గను స్మరించి ఆమహా స్త్రమును త్రిపురాసురునిపై ప్రయోగించెను. అస్త్రఘాతముచే ఆమహాదైత్యుడు ధరణికొరిగెను. దేవతలందరు హరుని యనేకవిధముల స్తుతించి పుష్పవృష్టిగా వించిరి. శంకరునకు దుర్గ త్రిశూలమును, విష్ణువు పినాకమును, బ్రహ్మ శుభా

శీర్వాదములను నొసంగిరి. సకలదేవతలు హర్షముతో నర్తించిరి, గంధర్వులు కిన్నరులు గానమొనరించిరి.

తండ్రీ! ఆశుభసమయముననే యీ స్తవరాజము ప్రాదుర్భవించెను. ఈ స్తవము విఘ్నములను, విఘ్నము లొనరించువారిని, శత్రువులను సంహరింపగలదు. ఈ స్తవము పరమైశ్వర్యదాయకము, సుఖప్రదము, పరమశుభదాయకము, నిర్వాణమోక్షప్రదాయకము, హరిభక్తిప్రదము, సర్వసిద్ధిప్రదము, అత్యంతశ్రేష్ఠము, గోలోకవాసమును ప్రసాదింపగలదు. ఈ స్తవమును స్తుతించిన పార్వతి సదా ప్రసన్నురాలు కాగలదు. ఈస్తోత్రము మనుష్యుల లోభ మోహ కామ క్రోధ కర్మాదుల మూలములను ఖండింపగలదు, బలమును బుద్ధిని ప్రసాదింపగలదు, జననమరణములను నాశమొనరింపగలదు, ధన పుత్రస్త్రీ భూమ్యాదిసమస్తసంపదలను ప్రసాదింపగలదు, శోకదుఃఖములను హరింపగలదు, సర్వసిద్ధులను ప్రసాదింపగలదు. సర్వోత్తమ మైనయీస్తోత్రరాజమును పఠించిన మహావంధ్యకూడ సంతానవతి యగును, బంధితుడు బంధవిముక్తుడగును, దుఃఖితుడు నిశ్చయముగ భయవిముక్తుడు కాగలడు, రోగములు నశింపగలవు, దరిద్రుడు ధనవంతుడు కాగలడు. మహాసాగరములో నౌకాభంగమైన, దావాగ్నినడుమ దగుల్కొనిన మనుష్యుడీస్తోత్రమును స్తుతించిన మృత్యువాతబడడు. వైశ్యేంద్రా! ఈస్తోత్రప్రభావమున మనుష్యుడు దస్యులనడుమనున్నను, శత్రువులు ముట్టడించినను, క్రూరజంతువులు వెంబడించినను రక్షింపబడగలడు. తండ్రీ! కేవలము గోలోకప్రాప్తిని ఆకాంక్షించి మీరు నిష్కాములై యీస్తోత్రమును నిత్యము పఠించిన మీకు ధరణిపైనే పార్వతి స్వయముగ దర్శన మొసంగి మీయభీష్టమును పరిపూర్ణ మొనరింపగలదు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :-

విప్రేంద్రా! దేవర్షీ, నారదమునీంద్రా! శ్రీకృష్ణుని యుపదేశముల నాలకించి అఖండానందభరితుడైననందుడు ఈస్తోత్రముద్వారా సర్వసంపదలను బ్రసాదింపగలపార్వతిని స్తుతించెను. బ్రహ్మనందనా! జననియగు దుర్గ నందుని యెడల సంతుష్టురాలై ఆయనకు గోలోకవాసమను అభీష్టవరమును బ్రసాదించెను. అంతియెకాదు ఆకరుణాస్వరూపిణి ఆయనకు వేదములందుగూడ దుర్లభ

మైన పరమజ్ఞానమును పరమదుర్లభ మగు శ్రీకృష్ణభక్తిని, దాస్యమును, మహాత్మ్యమును, సిద్ధిని ప్రసాదించెను. సకలదేవతలు, మహర్షిగణములు నంద నందనుని అనేకవిధముల స్తుతించి తమతమ ధామముల కరిగిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ జన్మఖండములో శ్రీకృష్ణుడు నందునకు దుర్గాస్తోత్ర మొసంగుటయను ఎనుబదిఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము



## ఎనుబదితొమ్మిదవ అధ్యాయము

### శ్రీకృష్ణనంద సంవాదము

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! అనేకవిధముల నందునకు తత్వబోధ యొనరించి శ్రీకృష్ణ పరమాత్మ తుదకిట్లు పలికెను.

శ్రీ కృష్ణుడు పలికెను :-

శ్లో॥ గచ్ఛ గచ్ఛ గృహం గచ్ఛ వ్రజరాజ వ్రజం వ్రజ ।
సర్వం తత్త్వం త్వయా జ్ఞాతం దృష్టాశ్చ మునయః సురాః ॥ 1

శ్రుతం మే ధన్యమాఖ్యానం నానాఖ్యానం సుదుర్లభమ్ ।
మత్కృతం బాలభావేన చాపరాధం చ తత్క్షమ్ ॥ 2

యత్సుఖం న కృతం తాత పితోర్మిశ్చ నృపమన్దిరే ।
కృతం సుఖం తత్పరం చ స్వర్గాదపి సుదుర్లభమ్ 3

మదీయం ప్రియవాక్యం చ ప్రహ్వాత్వం వినయం నయమ్ ।
పరిహాసం బహుతరం యశోదాం గోపికాగణమ్ ॥ 4

బాలకానాం సమూహం చ రాధాం చాపి విశేషతః
ఏకత్ర చ స్థితం తేషు బన్ధువర్గేషు కర్మణా ॥ 5

ఇహైవాపి సుఖం భుక్త్వా గచ్ఛ గోలోకముత్తమమ్ ।
సార్ధం యశోదయా తాత రోహిణ్యా గోపికాగణైః ॥ 6

గోపానాం బాలకైః సార్ధం వృషభానేన గోపకైః ।
రాధామాత్రా కలావత్యా రాధయా సహ యాస్యసి ॥ 7

త్యక్త్వా చ పార్థివం దేహం దివ్యదేహం విధాయ చ ।
అయోనిసమ్భవా రాధ రాధామాతా కలావతీ ॥ 8

యాస్యత్యేవ హి తేనైవ నిత్యదేహేన నిశ్చితమ్ ।
పితౄణాం మానసీ కన్యా ధన్యా మాన్యా కలావతీ ॥ 9

నందబాబా! ఇపుడు నీవు దుర్లభజ్ఞానసంయుక్తుడవైన కారణమున మోహమును త్యజించి ప్రసన్నమనస్కుడవై వ్రజవాసులతో గలసి వ్రజమునకు మఱలిపొమ్ము, మఱలిపొమ్ము. స్వగృహమును జేరుము, వ్రజమునకు దయచేయుము. ఇపుడు మీకు సర్వతత్త్వములజ్ఞానము లభించినది. మీరు మునులను, దేవతలను దర్శించి నాద్వారా నానాప్రకారేతిహాసములను, ధనవర్ధకాఖ్యానములను, జన్మపాపములను నివారింపగల దుర్గాదేవి స్తోత్రమును శ్రవణమొనరించితిరి. తెలిసికొనుటకు యోగ్యములైన సర్వతత్త్వములను మీకు నేను హర్షయుక్తుడనై సుఖపూర్వకముగ వర్ణించితిని. నేను బాల్యచాపల్యముచే మీయెడల అపరాధము లొనరించినయెడల వానిని క్షమింపుడు. తండ్రీ! నే నే సుఖమును రాజభవనములో పొందగలనో, నాజననీజనకులవలన అనుభవింపగలనో, స్వర్గముకంటెగూడ శ్రేష్ఠమైన పరమదుర్లభసుఖములను మీవద్ద అనుభవించితిని. నాప్రియవచనములు, నమ్రత, వినయము, భయము, పరిహాసములు, యశోద, గోపికలు, గోపబాలురు విశేషముగ రాధ మొదలగువారందఱు వ్రజమునందే గలరు. తండ్రీ! సకలబంధువర్గముతో గర్మానుసారముగ నిక్కడే సుఖముల ననుభవించి తుద కుత్తమగోలోకము జేరుము. యశోద, రోహిణి, గోపికలు, గోపబాలకులు, వృషభానుడు, గోపాలురు, మీరు ఈపార్థివదేహములను త్యజించి దివ్యదేహధారులై కలావతీ రాధలతో గలసి గోలోకపరంధామము జేరెదరుగాక. రాధ రాధామాతయైన కలావతి అయోనిసంభవలు; కావున వారు తమనిత్యదేహములతోనే గోలోకము జేరగలరు. రాధాజననియైన కళావతి పితరులమానసీకన్య కావున ధన్యురాలు, మాననీయురాలు.

అట్లే సీతాదేవితల్లి. దుర్గాదేవిజనని మేనక, దుర్గ, తార, సీత అయోనిసంభవలు ధన్యలు. మేనాదేవి కలావతి ధన్యవాదములకు పాత్రులు.

తండ్రీ! ఇట్లు నేను పరమదుర్లభమైన గోపనీయమైన ఆఖ్యానమును వర్ణించితిని. నేను, దుర్గ మీకు వరములను గూడ ప్రసాదించితిమి.

శ్రీకృష్ణునివచనముల నాలకించి శ్రీకృష్ణభక్తుడైన వ్రజేశ్వరుడు ఆ భక్తవత్సలుడైన జగదీశ్వరునితో మఱల యిట్లుబల్కెను.

నందుడు పలికెను :-

ప్రభూ! శ్రీకృష్ణా! నాల్గుయుగములలో ఏ యేసనాతనధర్మములు కలవు? ఆధర్మములను, కలియుగాంతమున కలియొక్క-గుణములను, దోషములను, పృథ్వీధర్మమును, ప్రాణులయొక్క- గతులను క్రమముగ, విస్తారముగ నాకుపదేశింపుము.

నందుని ప్రార్థనల నాలకించి కమలనయనుడైన శ్రీకృష్ణపరమాత్మ అత్యంతప్రసన్నుడై ఆయనకు మధురభరితమైన, విచిత్రమైన ఆఖ్యానమును వర్ణింపనారంభించెను.

ఇది శ్రీ మదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ
జన్మఖండములో శ్రీకృష్ణ నందసంవాదమను ఎనుబదితొమ్మిదవ
అధ్యాయము సంపూర్ణము.

---

# తొంబదియవ అధ్యాయము

## చతుర్యుగ ధర్మకథనము

శ్రీకృష్ణుడు పలికెను :-

సత్యయుగములో ధర్మములు, ఆచరణములు

శ్లో॥ శృణు నన్ద ప్రవక్ష్యామి సానన్దం మానసం యథా ।
కథాం రమ్యాం సుమధురాం పురాణేషు పరిష్కృతామ్ ॥ 1

పరిపూర్ణతమో ధర్మో ధార్మికాశ్చ కృతే యుగే ।
పరిపూర్ణతమం సత్యం పరిపూర్ణతమా దయా ॥ 2

అతీవ ప్రజ్వలద్రూపా వేదాశ్చత్వార ఏవ చ ।
వేదాఙ్గ శ్చాపి వివిధాశ్చేతిహాసాశ్చ సంహితాః ॥ 3

పురాణాని సురమ్యాణి పంచరాత్రాణి పంచ చ ।
రుచిరాణి సుభద్రాణి ధర్మశాస్త్రాణి యాని చ ॥ 4

విప్రా వేదవిదః సర్వే పుణ్యవన్తస్తపస్వినః ।
నారాయణం తే ధ్యాయన్తి స్మంత్రం చ జపన్తి చ ॥ 5

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాశ్చతుర్వర్ణాశ్చ వైష్ణవాః ।
శూద్రా బ్రాహ్మణభృత్యాశ్చ సత్యధర్మపరాయణః ॥ 6

రాజానో ధార్మికాశ్చైవ ప్రజాపాలన తత్పరాః ।
గృహ్ణన్త్యేవ ప్రజానాం చ షోడశాంకరాన్నృపాః ॥ 7

కరశూన్యాశ్చ విప్రాశ్చ పూజ్యాః స్వచ్ఛన్దగామినః ।
సతతం సర్వశస్యాఢ్యా రత్నాధారా వసున్ధరా ॥ 8

నందబాబా! పురాణములలో ప్రవచింపబడిన యత్యంతమధుర రమణీయాఖ్యానమును వర్ణించెదను, మీరు ప్రసన్నమనస్కులై శ్రవణమొనరింపుడు. సత్యయుగములో ధర్మము, సత్యము, దయ పరిపూర్ణములై విరాజిల్లినవి. ప్రజలు ధర్మపరాయణులై వర్తించిరి. నాల్గువేదములు, వేదాంగములు, వివిధేతిహాసములు సంహితలు గౌరవింపబడినవి. రమణీయములైనపంచరాత్రములు, సకల పురాణములు, ధర్మశాస్త్రములు మొదలగు నవియన్నియు నత్యంతరుచికరములై మంగళప్రదాయకములైనవి. సకలబ్రాహ్మణులు వేదవేదాంగ పారంగతులై, పుణ్యవంతులై, తపస్వులై, నారాయణునందే తమ మనస్సులను లీన మొనరించి ఆయనధ్యానజపములందు సదానిమగ్నులై జీవించిరి. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు సమభావముతో విష్ణుభక్తులై విరాజిల్లిరి. శూద్రులు సత్యధర్మతత్పరులై బ్రాహ్మణులను సేవించిరి. పరిపాలకులు ధార్మికులై సదా ప్రజలను పాలించుటలో తత్పరులై మెలగిరి. వారు ప్రజల ఆదాయమందు కేవలము పదునాఱవ భాగమునే కర(పన్ను)రూపమున గ్రహించిరి. బ్రాహ్మణులు కరములను చెల్లింపవలసిన పనిలేదు, ఎందువలెననగ వారు పూజ్యులు స్వేచ్ఛాగాములు. పృథ్వి సదా సర్వవిధములగు ధాన్యములచే సంపన్నురాలై రత్నగర్భయై వర్ధిల్లెను.

శ్లో॥ గురుభక్తాశ్చ శిష్యాశ్చ పితృభక్తాః సుతాస్తథా ।
యోషితః పతిభక్తాశ్చ పతివ్రత పరాయణాః ॥ 9

ఋతౌ సమ్భోగినః సర్వే న స్త్రీలుబ్ధా న లమ్పటాః ।
న భయం దస్యుచౌర్యాణాం న తత్ర పారదారికాః ॥ 10

తరవః పూర్ణఫలినః పూర్ణక్షీరాశ్చ ధేనవః ।
బలవంతో జనాః సర్వే దీర్ఘాః సౌన్దర్యసంయుతాః ॥ 11

లక్షవర్షాయుషః కేచిత్ పుణ్యవన్తో హ్యారోగిణః ।
యథా విప్రా విష్ణుభక్తా స్త్రివర్ణా విష్ణుసేవినః ॥ 12

జలపూర్ణా సదా నద్యః సతతం కన్దరా స్తథా ।
తీర్థపూతాశ్చతుర్వర్ణా స్తపః పూతా ద్విజాతయః ॥ 13

మనఃపూతాశ్చ నిఖిలాః ఖలహీనం జగత్రయమ్ ।
సత్కీర్తిపరిపూర్ణం చ యశస్యం మఙ్గలాన్వితమ్ ॥ 14

శిష్యులు గురుభక్తులు, పుత్రులు పితృభక్తులు, స్త్రీలు పతిభక్తులు పతివ్రతాపరాయణలు. సకలజనులు ఋతుకాలమందే తమతమపత్నులతో సమాగమమొనరించెడివారు, పురుషులు స్త్రీలోభులుకారు, స్త్రీలంపటులు కారు. సత్యయుగములో పరస్త్రీతో మైథున మొనరించుపురుషులు గాని, దోపిడిగాండ్రు గాని, దొంగలుగాని లేరు. వృక్షములు పూర్ణరూపమున ఫలించెడివి, గోవులు పరిపూర్ణముగ క్షీరములను ప్రసాదించెడివి. మనుష్యులందఱు బలవంతులై, దీర్ఘాయువులై, సౌందర్యవంతులై జీవించిరి. కొందఱు పుణ్యాత్ములు రోగరహితులై లక్షలకొలది సంవత్సరములు జీవించిరి. బ్రాహ్మణులు విష్ణుభక్తులైనట్లే క్షత్రియులు, వైశ్యులు, శూద్రులుకూడ విష్ణుసేవకులే. నదీనదములు సదా జలభరితములై ప్రవహించెడివి. గృహములు తపోధనులచే పరిపూర్ణములై ప్రకాశించెడివి. నాల్గువర్ణములవారు తీర్థయాత్రల నొనరించి తమ్ముతాము పవిత్రులుగ జేసికొనెడివారు. ద్విజాతీయులు (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు) తప మాచరించి పావనులైరి. సర్వులమనస్సులు పవిత్రములై వర్ధిల్లినవి. మూడులోకములు దుష్టరహితములై ఉత్తమకీర్తితో పరిపూర్ణములై, యశస్కరములై మంగళసంపన్నములై వర్ధిల్లినవి.

శ్లో॥ పితరః సర్వకాలేషు తిథికాలేషు దేవతాః ।
సర్వకాలేష్వతిథయః పూజితాశ్చ గృహే గృహే ॥ 15

త్రివర్ణా విప్రభక్తాశ్చ విప్రభోజనతత్పరాః ।
బ్రాహ్మణస్యముఖం క్షేత్రమనూషరమకణ్టకమ్ ॥ 16

నారాయణోత్కీర్తనేన హర్షయుక్తా స్తదుత్సవే ।
న దేవానాం ద్విజానాం చ విదుషాం తత్ర నిన్దకాః ॥ 17

నాఽఽత్మప్రశంసకాః కేచిత్ సర్వే పరగుణోత్సుకాః ।
న శత్రవో జనానాం చ సర్వే సర్వహితైషిణః ॥ 18

పురుషా యోషితశ్చాపి న హి మూర్ఖాశ్చ పణ్డితాః ।
న దుఃఖినో జనాః సర్వే సర్వేషాం రత్నమన్దిరమ్ ॥ 19

మణిమాణిక్యరత్నౌఘరత్నస్వర్ణ సమన్వితమ్ ।
న భిక్షుకా న రోగార్తాః శోకహీనాశ్చ హర్షితాః ॥ 20

న హి భూషణహీనాశ్చ నరా నార్యశ్చ కేచన ।
న పాపినో న ధూర్తాశ్చ క్షుధార్తా న కుత్సితాః ॥ 21

జరాహీనాః ప్రాణినశ్చ శశ్వద్యౌవ్వన సంస్థితాః ।
ఆధివ్యాధివిహీనాశ్చ నిర్వికారాశ్చ దేహినః 22

యదుక్తో వై సత్యయుగే ధర్మః సత్యం దయాదికమ్ ।
పాదహీనాశ్చ త్రేతాయం సత్యార్ధం ద్వాపరేఽపి చ ॥ 23

గృహస్థులగృహములలో సర్వావసరములందు పితరులకు, నిర్దిష్టతిథులందు దేవతలకు, సర్వసమయములలో నతిథులకు పూజలొనరింపబడెడివి. క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు బ్రాహ్మణులను సేవించి వారికి భోజనము నొసంగెడివారు. ఎందువలెననగ ఆయుగములో బ్రాహ్మణునిముఖము పవిత్రము, ఊసరహితమునైన అకంటకక్షేత్రసమానము. సకలజనులు ఉత్సవములలో హర్షయుక్తులై నారాయణుని దివ్యనామసంకీర్తన మొనరించెడివారు. ఆ కాలములో నెవ్వరైనను దేవతలనుగాని బ్రాహ్మణులనుకాని, విద్వాంసులను కాని నిందించెడివారు కారు. ఎవరైనను తమను తాము ప్రశంసించుకొనెడివారు కారు. అందఱు ఇతరుల గుణములను ప్రశంసించుటలో నుత్సాహమును ప్రదర్శించెడివారు. మనుష్యులకు శత్రువులు లేరు. అందఱు పరస్పరహితైషులై జీవించిరి. పురుషులు గాని, స్త్రీలుగాని మూర్ఖులుగాక పండితులై వర్తించెడివారు. మనుష్యులందరు సుఖించిరి. అందఱకు రత్ననిర్మిత గృహములుకలవు. ఆగృహములు సదా మణిమాణిక్యరత్నసువర్ణభరితములై యుండెడివి. ఆకాలములో బిక్షుకులు, రోగగ్రస్తులు లేరు. అందఱు శోకరహితులై, హర్షమగ్నులై జీవించిరి. పురుషులు, స్త్రీలెప్పుడును ఆభూషణరహితులైయుండలేదు. ఆకాలములో పాపులు ధూర్తులు క్షుధార్తులు నిందకులు లేరు. ప్రాణులకు వృద్ధావస్థలేమి, వారు నిరంతరము నవయౌవ్వన సంపన్నులై విరాజిల్లిరి. సకల దేహ

ధారులు ఆధివ్యాధిరహితులై (మానసిక, శారీరకవ్యాధిరహితులై) నిర్వికారులై జీవించిరి. ఇట్లు సత్యయుగములో సత్యదయాది ధర్మములు పూర్ణరూపమున విరాజిల్లినవి. అవి త్రేతాయుగములో ఒకపాదములేనివైనవి. ద్వాపరయుగములో రెండుపాదములు క్షీణించినవి.

కలియుగ స్వరూపము, ఆచరణములు.

శ్లో॥ ధర్మైకపాచ్చ ప్రథమే కలేశ్చాపి కృశోఽబలః ।
దుష్టానాం దస్యుచౌర్యాణా మఙ్కురః ప్రభవేద్ వ్రజ ॥ 24

అధర్మనిరతాః కేచిద్భీతాః సంగోపిన స్తథా ।
భీతా గుప్తాశ్చ పుంశ్చల్యో భీతాశ్చ పరదారికాః ॥ 25

ధర్మిష్ఠానాం భయం శశ్వదధర్మిష్ఠాశ్చ కమ్పితాః ।
స్వల్పధర్మరతా భూపాః స్వల్పవేదరతా ద్విజాః ॥ 26

వ్రతధర్మరతాః కేచిత్సర్వే స్వచ్ఛన్దగామినః ।
యావ త్తిష్ఠ న్తి తీర్థాని యావ త్తిష్ఠ న్తి సాధవః ॥ 27

యావ త్తిష్ఠ న్తి గ్రామాణాం దేవాః శాస్త్రాణి పూజనమ్ ।
తావత్కించి త్తపః సత్యం స్వర్గధర్మాంశ ఏవ చ ॥ 28

కలియుగప్రారంభములో ధర్మము నిర్బలమై కృశించినదై ఏకపాదావశిష్టమై యుండగలదు. వ్రజేశ్వరా! ఆసమయములో దుష్టులు, దస్యులు, చోరులు బయలుదేరగలరు. ప్రజ లధర్మపరాయణులై ప్రవర్తించెదరు. వారిలో గొందఱు భయవశమున తమపాపములను దాచిపెట్టుటకు యత్నించెదరు. కులటలు భయభీతలై చాటుగ పాపముల నాచరించెదరు. పరపురుషులు దరిజేర్చిన దుశ్చారిణు లైనస్త్రీలు భయభీతలై దుష్కర్మల నొనరించెదరు. ధర్మాత్ములు సదా భయము నొందెదరు, పాపులుకూడ భయము నొందెదరు. రాజులందు నామమాత్రమే ధర్మము ఉండగలదు, బ్రాహ్మణులవేదనిష్ఠ క్షీణింపగలదు, వారిలో నల్పసంఖ్యాకులు మాత్రమే వ్రతములను, ధర్మములను పరిపాలించెదరు. తక్కిన వారందఱు తమతమ యిష్టమొచ్చినటుల చరించెదరు. తీర్థములు, సత్పురుషులు అవనిపై నున్నంతవఱకు గ్రామదేవతలు, శాస్త్రములు, పూజావిధులు వసుంధరపైనున్నంతవఱకు; కొంతకొంత తపము, సత్యము స్వర్గప్రదధర్మములు అంశామాత్రముగ నుండగలవు.

శ్లో॥ కాలేర్దోషనిధేస్తాత గుణ ఏకో మహానపి ।
మానసం చ భవేత్ పుణ్యం సుకృతం న హి దుష్కృతమ్ ॥ 29

తండ్రీ! సకలదోషములకు నిలయమైన యీకలియుగములో నొకమహా గుణముకూడ గలదు; కలియుగములో మానసికధర్మము పుణ్యప్రదమగును, కాని మానసికపాపము దేహధారి నంటదు (మానసికపుణ్య మనగ మనస్సులో సత్సంకల్పములు గలుగుట. మానసికపాప మనగ మనసులో దురాలోచనలను ఆలోచించుట.)

శ్లో॥ అధర్మః పరిపూర్ణశ్చ తదన్తే చ కలౌ పితః ।
ఏకవర్ణా భవిష్యన్తి వర్ణాశ్చత్వార ఏవ చ ॥ 34

న మన్త్రపూతోద్వాహశ్చ న హి సత్యం న చ క్షమా ।
స్త్రీస్వీకారరతో నిత్యం గ్రామ్యధర్మప్రధానతః ॥ 35

న యజ్ఞసూత్రం తిలకం బ్రాహ్మణానాం చ నిత్యశః ।
సన్ధ్యాశాస్త్రవిహీనాశ్చ విప్రవంశాః శ్రితా అపి ॥ 36

సర్వైః సార్ధం చ సర్వేషాం భక్షణం నియమచ్యుతమ్ ।
అభక్ష్యభక్షా లోకాశ్చ చతుర్వర్ణాశ్చ లమ్పటాః ॥ 37

నారీషు న సతీ కాచిత్పుంశ్చలీ చ గృహే గృహే ।
కరోతి తర్జనం కాన్తం భృత్యతుల్యం చ కమ్పితమ్ ॥ 38

పుత్రేణ భర్త్సితస్తాతః శిష్యేణ భర్త్సితో గురుః ।
ప్రజాభిస్తాడితో భూపో భూపేన తాడితాః ప్రజాః ॥ 39

దస్యుచోరైశ్చ దుష్టైశ్చ శిష్టాశ్చ పరిపీడితాః ।
సస్యహీనా చ వసుధా క్షీరహీనాశ్చ ధేనవః ॥ 40

స్వల్పక్షీరే ఘృతం నాస్తి నవనీతం చ నిత్యశః।
సత్యహీనా జనాః సర్వే నిత్యం మిథ్యా వదన్తి చ ॥ 41

తండ్రీ! కలియుగాంతమందు అధర్మము పరిపూర్ణరూపమున వ్యాప్తి నొందగలదు. ఆసమయములో నాలుగువర్ణములు కలసి ఒకవర్ణమే కాగలదు. వేదమంత్రోచ్చారణచే పవిత్రముగ వివాహములు నిర్వర్తింపబడవు. సత్యము, క్షమ అంతర్ధానములు కాగలవు. గ్రామ్యధర్మప్రధానతవలన సదా వివాహములు స్త్రీఅంగీకారముపైననే ఆధారపడియుండును. బ్రాహ్మణులు యజ్ఞోపవీతమును, తిలకమును ధరింపరు. వారు సంధ్యావందనమాచరింపక శాస్త్రహీనులై జీవింతురు.

వారివంశములు నామమాత్రముగనే శేషించగలవు. అందఱు నియమముల నుల్లంఘించి కలసి భుజించెదరు. నాల్గువర్ణములవారు తినరానిపదార్థముల భుజించుచు పరస్త్రీగాములై చరించెదరు. స్త్రీలయందు పతివ్రత లుండబోరు. ప్రతి గృహమునందు కులటలు జన్మించి తమభర్తలను సేవకులుగ భావించి సదా నిందించెదరు. కుమారుడు తండ్రిని, శిష్యుడు ఆచార్యుని అవహేళనము చేయు చుందురు. ప్రజలు ప్రభుత్వమును, ప్రభుత్వము ప్రజలను పరస్పరము పీడించు కొనుచుందురు. దుష్టులు, దొంగలు,దస్యులు సత్పురుషులను అనేకవిధముల హింసించెదరు. పృథ్వి అన్నహీనకాగలదు, గోవులు క్షీరహీనములుకాగలవు. క్షీరోత్పత్తి బాగుగా నశించి సదా ఘృతమునకు, నవనీతమునకు అభావ మేర్ప డగలదు. మనుష్యు లందఱు సత్యహీనులై సదా అనృతములను పల్కెదరు.

శ్లో॥ శౌచసంధ్యాశాస్త్రహీనా బ్రాహ్మణా వృషవాహకాః ।
సూపకారాశ్చ శూద్రాణాం శూద్రాణాం శవదాహకాః ॥ 43

శూద్రస్త్రీనిరతాః శశ్వచ్ఛూద్రా-విప్రవధూరతాః ।
ఖాదన్తి యస్య విప్రస్య భక్ష్యం చ పరిపాచకాః ॥ 44

మాతుః పరాం తస్య పత్నీం శూద్రా గృహ్ణన్తి లమ్పటాః ।
భృత్యశ్చ హత్వా రాజానాం స్వయం రాజా భవిష్యతి ॥ 45

సర్వే స్వచ్ఛన్దనిరతాః శిశ్నోదరపరాయణాః ।
వఞ్చరా వ్యాధియుక్తాశ్చ కుత్సితాశ్చ కుచైలకాః ॥ 46

విశీర్ణమన్త్రలిప్తాశ్చ మిథ్యామన్త్రప్రహారకాః ।
జాతిహీనాశ్చ గురవో వయోహీనాశ్చ నిన్దకాః ॥ 48

రాజనశ్చాపి మ్లేఛ్ఛాశ్చ యవనౌ ధర్మనిన్దకాః ।
సత్కీర్తిమపి సాధూనాం కుర్వన్త్యున్మూలనం ముదా ॥ 49

పితృదేవద్విజాతీనామతిథీనాం చ నిత్యశః ।
పూజా నాస్తి గురూణాం చ పితోశ్చపూజనంస్త్రియాః ॥ 50

బ్రాహ్మణులు పవిత్రతాహీనులై సంధ్యావందన మాచరింపక శాస్త్ర జ్ఞానహీనులై వృషభములను పూన్చెదరు, వంటల నొండెదరు, సదా శూద్రు లతో గలసిచరించెదరు. శూద్రులు బ్రాహ్మణపత్నులను కామించెదరు. వంటవాండ్రు, పరస్త్రీలంపటు లైనశూద్రులు బ్రాహ్మణునిఅన్నము భుజించి వాని సుందరపత్నినే పొందుటకు యత్నించెదరు. సేవకులు పరిపాలకుని వధించి

స్వయముగ అధికారమును హస్తగత మొనరించుకొందురు. సకలప్రజలు స్వేచ్ఛాచారులై శిశ్నోదరపరాయణులై, రోగగ్రస్తులై, అపవిత్రులై, ఖండిత మంత్రసంయుక్తులై, మిథ్యామంత్రప్రచారకులై ప్రవర్తించెదరు. జాతిహీనులు. అవస్థాహీనులు, నిందకులు ఆచార్యులైచరించెదరు. ధర్మమును నిందించు యవనులు మ్లేచ్ఛులు పాలకులై సత్పురుషుల ఉత్తమకీర్తిని సహితము సమూలముగ నాశనమొనరింపగలరు. ప్రజలు పితరులకు, దేవతలకు, ద్విజాతీయులకు, అతిథులకు గురుజనులకు, తలిదండ్రులకు పూజ లొనరింపరు; వారు సదా స్త్రీసౌందర్యారాధనయందే సంలగ్నులై చరింపగలరు.

స్త్రీబన్ధూనాం గౌరవం చ స్త్రీణాం చ సతతం పితః ।
చోరః సత్కులజాతిశ్చ బ్రాహ్మణో దేవహారకః ॥ 51

మానం వహన్తి లోభేన యుగే ధర్మేణ కౌతుకాత్ ।
దేవాయతనహీనం చ జగత్సర్వం భయాకులమ్ ॥ 52

అరాజకం చ దుర్నీతం సతతం కలిదోషతః ।
బుభుక్షితాః కుచైలాశ్చ దరిద్రా వ్యాధినో నరాః ॥ 53

హింస్రజన్తు భయాద్భీతా జనాః సర్వే చ పాపినః ॥ 54

సర్వే చ ఫలలోభిష్టాః పుంశ్చల్యాః కలహప్రియాః ।
రూపవత్యో న కామిన్యో నరాశ్చాపి న రూపిణః ॥ 55

నద్యో నదాః కన్దరాశ్చ తడాగాశ్చ సరోవరాః ।
జలపద్మవిహీనాశ్చ జలహీనా ఘనాస్తథా ॥ 56

అపత్యహీనా నార్యశ్చ కాముక్యో జారసంయుతాః ।
అశ్వద్ధచ్ఛేదినః సర్వే వృక్షహీనా వసున్ధరా ॥ 57

ఫలహీనాశ్చ తరవః శాఖాస్కన్ధవిహీనకాః ।
ఫలాని స్వాదుహీనాని చాన్నాని చ జలాని చ ॥ 58

మానవాః కూటవక్తారో నిర్దయా ధర్మవర్జితాః ।
తదన్తే ద్వాదశాదిత్యాః సంహరిష్యన్తి మానవాన్ ॥ 62

సర్వాం జన్తూంశ్చ తాపేన బహువృష్ట్యా వ్రజేశ్వర ।
అవశిష్టా చ పృథివీ కథామాత్రావశేషితా ॥ 63

కలౌ గతే చ పృథివీ క్షేత్రం వర్షాగతే తథా ।
పునః సత్యప్రవృత్తిశ్చ భవిష్యతి క్రమేణ వై ॥ 64

తండ్రీ! స్త్రీలసహోదరులు, బంధువులు ఆమె కాత్మబంధువు లయ్యెదరు, స్త్రీలకే సదా గౌరవము లభింపగలదు. ఉత్తమకులములో నుత్పన్నులైనవారే దొంగలయ్యెదరు. బ్రాహ్మణులు దైవద్రవ్యములను హరించెదరు. కలియుగములో ప్రజలు కౌతుక వశమున లోభయుక్తులై ధర్మమును, మానమును నామమాత్రముగ ధరించినటుల నటింతురు. సర్వజగత్తు దేవమందిర శూన్యమై భయాకులము కాగలదు. కలిదోషము వలన, దుర్నీతికారణమున అరాజకత్వము వ్యాపింపకలదు. మనుష్యులు ఆకలిగొన్నవారై అపవిత్రులై, దరిద్రులై, రోగగ్రస్తులై జీవించెదరు. సకలమనుష్యులు పాపపరాయణులై క్రూరజంతువులచే భయభీతులై చరించెదరు. అందఱు ప్రతిఫలాపేక్షనే కాంక్షించెదరు. కులటలకు కలహములే ప్రియములు కాగలవు. పురుషులందుగాని, స్త్రీలయందుగాని యదార్థసౌందర్య ముండబోదు. నదులలో, నదములలో కందరములలో, తటాకములలో, సరోవరములలో జలములు క్షీణింపగలవు. కమలములు అదృశ్యములు కాగలవు, మేఘములు జలశూన్యము లగును. స్త్రీలు సంతానహీనలై కామినులై జారపురుషులతో సంబంధ మిడుకొని జీవించెదరు. ప్రజలందఱు నిస్సంకోచముగ అశ్వత్థవృక్షములను ఖండించెదరు. పృథ్వి వృక్షహీనము కాగలదు. వృక్షములు శాఖాస్కంధరహితములై ఫలపుష్పహీనము లైయుండగలవు. ఫలములందు, అన్నములందు, జలములందు రుచి నశింపగలదు. మనుష్యులు కటువచనములు పల్కువారై, నిర్దయులై, ధర్మహీనులై, ప్రవర్తించెదరు. వ్రజేశ్వరా! కలియుగాంతమున ద్వాదశాదిత్యులు ప్రాదుర్భవించి ప్రచండతాపముద్వారా బహువృష్టిద్వారా మనుష్యులను, సమస్తజంతువులను సంహరించెదరు. ఆసమయములో పృథ్విజీవజంతుహీనమై నామమాత్రావశిష్టము కాగలదు. వర్షానంతరము క్షేత్రము శూన్యమగునట్లే కలియుగానంతరము పృథ్వి యంతయు జీవశూన్యము కాగలదు. అపుడు మఱల క్రమముగ సత్యయుగమారంభమగును.

శ్లో॥ ఇత్యేవం కథితం సర్వం గచ్ఛ తాత వ్రజం సుఖమ్ ।
అహం దుగ్ధముఖో బాలః పుత్ర స్తే కథయామి కిమ్ ॥ 65
నవనీతం ఘృతం దుగ్ధం దధి తక్రం పరిష్కృతమ్ ।
స్వస్తికం శుభకర్మాహం మిష్టాన్నం చ సుధోపమ్ ॥ 66
మిష్టద్రవ్యం చ యత్కించిత్ పితృదేవనిమిత్తకమ్ ।
భుక్తం బలాచ్ఛ తత్సర్వం బాలానాం రోదనం బలమ్ ॥ 67

తత్ క్షమస్వాపరాధం మే బాలదోషః పదే పదే ।
త్వం పితా తవ పుత్రోఽహం యశోదాజననీ మమ ॥ 68

మదీయం పరిహాసం చ యశోదాం రోహిణీం వద ।
కుమారస్యాత్రచ్ఛ తం సర్వం సోఽహమిత్యేవమీప్సితమ్ ॥ 69

కీర్తయిష్యసి తత్సర్వం సర్వం గోకులవాసినమ్ ।
కుత స్త్వం గోకులే వైశ్యో నన్దో వైశ్యాధిపో నృపః ॥ 70

వాసుదేవసుతోఽహం చ మథురాయామహో కుతః ॥ 71

పిత్రా మే కంసభీతేన త్వద్గృహే చ సమర్పితః ।
పితుః పరః పితా త్వం చ మాతా మాతుః పరాపి వా ॥ 72

మయా దత్తేన జ్ఞానేన పార్వత్యా చ వ్రజేశ్వర ।
త్యజ మోహం మహాభాగ గచ్ఛ తాత సుఖం గృహమ్ ॥ 73

తండ్రీ! ఇట్లు నేను నాల్గుయుగధర్మములను ప్రవచించితిని, ఇపుడు మీరు సుఖపూర్వకముగ వ్రజమునకు మఱలిపొండు. నేను శిశువును, మీపుత్రుడను, నే నెట్లు ధర్మవిషయములను ప్రవచింపగలను? వ్రజములో మనగృహములోని నవనీతమును, ఘృతమును, దధిని, క్షీరములను, మధుర పదార్థములను, పిండివంటలను, శుభకర్మలకు యోగ్యములైన అమృతోపమ మిష్టాన్నములను, మీరు పితరులకొఱకు, దేవతలకొఱకు వండిన మధురాతి మధురపదార్థములను అన్నింటిని నేను భుజించెడివాడను. బాలకులకు రోదనమే బలము, కావున నాయపరాధముల నన్నింటినీ క్షమింపుడు. పసివారు అడుగడు గున అపరాధము లొనరింతురు. మీరు నాకు తండ్రి, నేను మీకుమారుడను, యశోద నామాతృదేవత. తక్షణమే మీరు వ్రజమునకు మఱలిపోయి ఈకుమారునినుండి ఆలకించిన సకలవిషయములను యశోదకు రోహిణికి తెలియజెప్పుము; తదనంతరము గోకులవాసు లందఱు ఈవిషయములను ఆకర్ణించి కీర్తింపగలరు. గోకులములో వైశ్యకులసంభవు లైన, వైశ్యకులాధి పతియైన గోకులాధిపతియైన నందరా జెక్కడ? మథురలో ఆవిర్భవించిన వసు దేవపుత్రుడ నైననే నెక్కడ? కంసునిభయమువలన నాతండ్రి వసుదేవుడు నేను జన్మింపగనే నన్ను మీగృహమునకు జేర్చెను, కావున మీరు నాజనకునికంటే అధికులు, యశోద నాజననికంటె శ్రేష్ఠురాలు. మహాభాగా, వ్రజేశ్వరా!

మీకు నేను, పార్వతీదేవి, జ్ఞానోపదేశ మొనరించితిమి. కావున తండ్రీ! అజ్ఞాన బలముచే మోహమును బరిత్యజించి సుఖముగ స్వగృహమునకు మఱలిపొండు.

నందుడు పలికెను :-

ప్రియతమా! కృష్ణా! నీవు రమణీయ బృందావనమును, పుణ్యమహోత్సవములను, గోకులమును, గోసమూహములను, పరమసుందర యమునాతటమును, గోపికలకు, నీకత్యంతప్రియ మైన పరమసుందరమైన, రాసమండలమును, గోపాంగనలను, గోపబాలకులను, యశోదను, రోహిణిని నీ ప్రియురా లైన రాధను జ్ఞప్తికి తెచ్చుకొనుము. కుమారా! నీప్రాణములకంటె నధికప్రియురా లైనరాధ నెట్లుమరువగలవు? వత్సా! ఒక్కపర్యాయ మైనను కొన్నిదినముల వఱకై నను గోకులమునకు మఱలిరమ్ము.

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

ఇట్లుపలికి నందుడు శ్రీకృష్ణుని తనయంకమునకొర్చుండబెట్టుకొని శోకవిహ్వాలుడై జగన్నాథుని తన యశ్రువులచే నభిషేకించెను. తదనంతరము స్నేహమునకు వశుడై పరమాత్మను ఆలింగన మొనరించుకొని ఆనందముగ నాజగదానందకరుని రెండుకపోలములను తనివిదీర చుంబింపదొడంగెను. అపుడు పరమానందస్వరూపు డైన శ్రీకృష్ణపరమాత్మ నందుని సబోధించి యిట్లుపల్కెను.

ఇది శ్రీ మదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ జన్మఖండములో చతుర్యుగ ధర్మకథనమను తొంబదియవ అధ్యాయము సంపూర్ణము.

---

## తొంబదియొకటవ అధ్యాయము
## దేవకీవసుదేవులు నందుని ఊరడించుట

శ్రీకృష్ణుడు పలికెను :-

తండ్రీ! కర్మఫలభోగానుసారముగ సంయోగములు వియోగములు దేహధారులకు సంభవించును. కర్మఫలమువలెనే వియోగము సంభవించిన వారి దర్శనము క్షణకాలములోలభించును. ఆకర్మానుభవము నెవరు ఖండింపగలరు?

తండ్రీ! ఉద్ధవుడు గమనాగమన ప్రయోజనములను ప్రవచింపగలడు, కావున నేను ఆయనను శీఘ్రముగ గోకులమునకు బంపెదను. ఉద్ధవుడు గోకులమునకు జని యశోదను, రోహిణిని గోపికలను, గోపకుమారులను, నాప్రాణాధిక ప్రియురాలగు రాధను సమాధానపఱచి ఊరడింపగలడు. శ్రీకృష్ణు డిట్లునందుని సమాధానపఱచుచుండగ ఆప్రదేశమునకు వసుదేవుడు, దేవకి, బలదేవుడు, ఉద్ధవుడు, అక్రూరుడు మొదలగువారరుదెంచిరి. నందు నుద్దేశించి వసుదేవు డిట్లుపల్కెను.

వ సు దే వు డు ప లి కె ను :-

నందరాజా! నీ వాత్మబలసంపన్నుడవు, జ్ఞానివి, నాకుబంధువుడవు, సఖుడవు; కావున మోహమును త్యజించి స్వగృహమునకు వెడలుము. శ్రీకృష్ణుడు నాకు కుమారుడైనట్లే నీకును పుత్రుడే. మిత్రుడా! మధురానగరము గోకులమునకు దూరముగాదు. గోకులము మధురానగరమునకు ముఖద్వారము వంటిది, కావున నందరాజా! ఆనందమహోత్సవసమయములందు మీరు మీపుత్రుని దర్శింపవచ్చును.

శ్రీ దే వ కి ప లి కె ను :-

నందరాజా! శ్రీకృష్ణుడు మాకు కుమారుడైనట్లే మీకును తనయుడే యనుట నిర్వివాదాంశము. అయినచో మీ రేల శోకించుచున్నారు? శ్రీకృష్ణబలరాములు మీగృహములో నేకాదశవర్షములు సుఖముగ నివసించి మిమ్ము ఆనందపఱచినారు. ఇపుడు కొన్నిరోజులవియోగమునకే యేలశోకించెదరు? మీరు సపరివారముగ మీ యభీష్టానుసారముగ మధురానగరిలోనే మాగృహమునందే యుండి పూర్ణచంద్రసమానకాంతి సమన్వితమైన బాల శ్రీకృష్ణుని దివ్యముఖారవిందమును సదా దర్శించుచు మీజన్మలను సఫలీకృత మొనరించుకొనుడు.

శ్రీకృష్ణపరమాత్మ ఉద్ధవు నిట్లాదేశించెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :-

ఉద్ధవా! నీవు సుఖముగ గోకులమునకు బయలుదేరుము. భద్రా! నీకు కళ్యాణమగుగాక! నీవు గోకులము జేరి శోకమును ఖండింపగల నాయాధ్యాత్మిక జ్ఞానోపదేశముచేసి యశోదను, రోహిణిని, గోపబాలురను, గోపికలను, నాప్రాణాధికప్రియ యగు రాధను సమాధాన పఱచుము. వియోగశోకము

భరింపలేని నా తండ్రి యగు నందుడు దేవకియాజ్ఞానుసారముగ మధురానగరి యందే యుండగలడు. నీవు నా నివేదనను, నందుడు మధురానగరిలోనే నా చెంత నివశించుటను యశోదకు విన్నవింపుము.

ఇట్లు ఆదేశించి శ్రీకృష్ణపరమాత్మ తలిదండ్రులతో అంతఃపురమును ప్రవేశించెను. నారదా! ఉద్ధవుడు ఆరాత్రిగడచినపిదప ప్రాతఃకాలముననే రమణీయబృందావనమునకు బయలుదేరుట కుద్యుక్తుడయ్యెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ జన్మఖండములో దేవకీవసుదేవులు నందుని ఊరడించుట యను తొంబదియొకటవ అధ్యాయము సంపూర్ణము



## తొంబదిరెండవ అధ్యాయము
## రాధా స్తోత్రము

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! శ్రీకృష్ణపరమాత్మ యాదేశానుసారముగ ఉద్ధవుడు ప్రాతః కాలముననే నిద్రమేల్కాంచినవాడై ఆహ్నికాదులను పరిపూర్ణ మొనరించు కొని, హర్షపూర్వకముగ గణేశ్వరునకు ప్రణామము లర్పించి శ్రీమన్నారాయణుని, శంకరుని, దుర్గాదేవిని, శ్రీమహాలక్ష్మిని, గంగాదేవిని, సరస్వతీ దేవిని మనస్సున స్మరించి తాను బయలుదేరుదిశకు ప్రభువైనమహేశ్వరుని ధ్యానించి మంగళశకునములను గాంచుచు గోకులమునకు బయలుదేరెను. ఉద్ధవునకు మార్గములో దుందుభిధ్వనులు, ఘంటాశబ్దములు, శంఖధ్వనులు, మంగళధ్వనులు, హరినామసంకీర్తనము శ్రవణానందముగ వినిపించెను. పతీ పుత్రవతి యైనసాధ్వి ప్రజ్వలితదీపమును ధరించి ఆయనకు ఎదురువచ్చెను. ఉద్ధవుడు మార్గమధ్యములో పుష్పమాలికలను, దర్పణమును, జలభరిత పూర్ణకుంభమును, దధిని, ఫలములను, దూర్వాంకురములను, శుక్లధాన్యము లను, రజతమును, కాంచనమును, మధువును, బ్రాహ్మణసమూహమును,

కృష్ణసారమృగమును, వృషభమును, ఘృతమును, గజరాజును, నరేశ్వరుని, శ్వేతాశ్వమును, పతాకమును, నకులము (ముంగిస)ను, నీలకంఠమృగమును, శ్వేతపుష్పములను, చందనాదికళ్యాణప్రదద్రవ్యములను దర్శించుచు బృందావన మను వనమును జేరెను. ఆవనములో అరుణవర్ణముచే ప్రకాశించు అక్షరమైన, కోమలమైన, పుణ్యప్రదమైన, అభీష్టతీర్థమైన, భాండీరవటవృక్షమును గాంచెను. పిమ్మట ఎఱ్ఱనికంకణములను ధరించిన సుందరవేషధారులైన గోపబాలకులను గాంచెను. వా రందఱు బాలకృష్ణునినామమునే స్మరించుచు భగవంతుని వియోగము భరింపలేక దుఃఖించుచుండిరి. వారిని యోదార్చి ఉద్ధవుడు ఆనందపూర్వకముగ నగరమును ప్రవేశించి నగరమధ్యమం దున్న విశ్వకర్మచే నిర్మింపబడిన నందునిదివ్యగృహమును గాంచెను. ఆగృహము మణులతో, రత్నములతో నిర్మింపబడెను. గృహమునం దంతట ముత్యములు, మాణిక్యములు, వజ్రములు తాపడ మొనర్పబడియున్నవి. ఆభవనము అమూల్యరత్ననిర్మిత మనోహర కలశములచే సుశోభితమగుచున్నది. నానావిధము లైన శిల్పకళలు ద్వారములపై శోభించుచున్నవి. రథారూఢు డైన యుద్ధవుడు సానందముగ నందప్రాంగణమును ప్రవేశించి రథము దిగి నిలువబడెను. ఉద్ధవుని గాంచి యశోద, రోహిణి సాదరముగ నాహ్వానించి కుశలము నడిగి ఆసనాది షోడశోపచారముల నర్పించి గౌరవించిరి. తదనంతరము వా రుద్ధవుని నందుడేడని, బలరామకృష్ణు లెందులకు రాలే దని ప్రశ్నింప దొడంగిరి. అందులకు ఉద్ధవుడు 'యశోదాదేవి ! మధురానగరిలో అందఱు కుశలమే. నందుడు పరమానందభరితుడై శ్రీకృష్ణబలరాములతో మధురానగరియందే యున్నాడు. శ్రీకృష్ణబలరాములతో గలసి వారు కొంత ఆలస్యముగ వ్రజమున కఱుదెంచగలరు. ఎందువలననగ శ్రీకృష్ణబలరాముల ఉపనయనసంస్కారమువఱకు వారు అక్కడనే యుండగలరు. నేను మీకుశల సమాచారములను తెలిసికొని మధురకు మఱలి పోగల,' నని పల్కెను. ఈశుభసమాచారము నాలకించి రోహిణీయశోదలు అఖండానంద భరితలైరి. నానాసంఖ్యాక రత్నములను, సువర్ణములను, వస్త్రములను దాన మొనరించిరి. తదనంతరము అమృతోపమయములగు అనేక మిష్టాన్నములచే యుద్ధవునకు ఆతిథ్య మొసంగి ఆయనను ఉత్తమమణులచే, రత్నములచే, వజ్రములచే సత్కరించిరి. సకలమంగళకార్యములను సంపన్న మొనరించి, బ్రాహ్మణులను రావించి వేదపఠన మొనరించిరి. పిమ్మట వారు

ఆనందపూర్వకముగ అనేకోపహారములచే నైవేద్య, పుష్పధూపదీప చందన వస్త్ర తాంబూలాదులచే, మధు గోక్షీర ఘృతాదులచే బ్రాహ్మణులద్వారా సర్వవ్యాపియైన శంకరుని పూజించిరి. మునీశ్వరా! అంతియేకాదు వారు షోడశోపచార సామగ్రులచే ననేకప్రకారద్రవ్యములచే బృందావనాధిష్ఠాత్రీదేవిని పూజించిరి. శ్రీకృష్ణునిశుభమునకొఱకు బ్రాహ్మణులకు పాలిచ్చు నూఱు గేదెలను, ఒకవేయి మేకలను, పదునైదువేల శుద్ధమేషములను, నూఱు గోవులను, నూఱు సువర్ణముద్రలను దక్షిణగనొసంగిరి.

తదనంతరము ఉద్ధవుడు యశోదారోహిణులను, గోపబాలకులను, గోపవృద్ధులను, గోపికలను సమాధానపఱచి రాధను దర్శించుటకు రాసమండలమును జేరెను. చంద్రమండలమువలె మండలాకారముతో శోభించుచు, వందలాదికదళీ స్తంభములచే నలంకరింపబడి ప్రకాశించు రాసమండలమును ఉద్ధవుడు దర్శించెను. శ్రీకృష్ణుడే వచ్చెనా ? యనిభ్రమించి. అనేక గోపికలు ఉద్ధవుని వీక్షించిరి. గోపికలందరు, శ్రీకృష్ణవియోగముచే దుఃఖితలై ఆయనకొఱకే నిరీక్షించుచునుండుట ఉద్ధవుడు గాంచెను. తదనంతరము ఉద్ధవుడు యమునకు ప్రదక్షిణముల నర్పించి చందనచంపక కేతకీమాధవీ అశోకకర్ణికాదివనములను దర్శించెను. రమణీయ బృందావనములో పయనించుచు ఆయన ఆనందపూర్ణ మనస్కుడై నాగేశ్వరలవంగసాల, హింతాల పనస రసాల మందరాది కాననములను దర్శించెను. ఇట్లు అనేక కాననములను గడచి యుద్ధవుడు రమణీయ కుంజవనమును దర్శించి యత్యంతసుందరమధువనమును బ్రవేశించెను. మరల బదరీవనమునకు జని, పిమ్మట కదళీవనమును బ్రవేశించి ఆ వనములో నేకాంత ప్రదేశమున గల శ్రీరాధాపవిత్రాశ్రమమును దర్శించెను. ఆ యాశ్రమదివ్య విలక్షణశోభను దర్శించి ఆశ్చర్యచకితుడై యుద్ధవుడు రాధాదేవియంతఃపుర ద్వారమును సమీపింపగా రాధాసఖులు ఆయనకు స్వాగతముపల్కి రాధా మందిరమునకుజేర్చిరి. ఉద్ధవుడు జగజ్జనని యగు రాధను తన సమక్షమున గాంచి యఖండానందభరితుడై పులకితగాత్రుడయ్యెను. రాధ చంద్రకళవలె అత్యంతసౌందర్యవతి, ఆమెనేత్రములు ప్రఫుల్లకమలసదృశములు. ఆసుకుమార వతి రత్నాభూషణములనన్నింటిని త్యజించి కేవలము సువర్ణవర్ణయుక్తములైనకుండలములనే ధరించి విరహజనితదుఃఖకారణమున అరుణవర్ణముఖారవిందయై భూమిపై బడి నిరాహారిణియై శ్రీకృష్ణునికై రోదించుచుండెను.

ఆమెకు బాహ్యజ్ఞానములేదు. రాధఓష్ఠములు, కంఠము శుష్కములైనవి. రాధను ఈ విరహావస్థలో గాంచిన ఉద్ధవుని సర్వాంగములు పులకించినవి. ఆయన భక్తిపూర్వకముగ శిరమును వంచి రాధకు నమస్కరించినవాడై ఇట్లు స్తుతింపదొడంగెను.

## ఉద్ధవ ఉవాచ

శ్లో॥ వన్దే రాధా పదామ్భోజం బ్రహ్మాదిసురవన్దితమ్ ।
యత్కీర్తికీర్తనేనైవ పునాతి భువనత్రయమ్ ॥ 64

నమో గోలోకవాసిన్యై రాధికాయై నమో నమః ।
శతశృఙ్గనివాసిన్యై చన్ద్రావత్యై నమో నమః ॥ 65

తులసీవనవాసిన్యై బృన్దారణ్యై నమో నమః ।
రాసమణ్డలవాసిన్యై రాసేశ్వర్యై నమో నమః ॥ 66

విరజాతీరవాసిన్యై బృందాయై చ నమో నమః ।
బృన్దావనవిలాసిన్యై కృష్ణాయై చ నమో నమః ॥ 67

నమః కృష్ణప్రియాయై చ శాన్తాయై చ నమో నమః ।
కృష్ణవక్షఃస్థితాయై చ తత్ప్రియాయై నమో నమః ॥ 68

నమో వైకుణ్ఠవాసిన్యై మహాలక్ష్మ్యై నమో నమః ।
విద్యాధిష్ఠాతృదేవ్యై చ సరస్వత్యై నమో నమః ॥ 69

సర్వైశ్వర్యాధిదేవ్యై చ కమలాయై నమో నమః ।
పద్మనాభప్రియాయై చ పద్మాయై చ నమో నమః ॥ 70

మహావిష్ణోశ్చ మాత్రే చ పరాద్యాయై నమో నమః ।
నమః సిన్ధుసుతాయై చ మర్త్యలక్ష్మ్యై నమో నమః ॥ 71

నారాయణప్రియాయై చ నారాయణ్యై నమో నమః ।
నమోఽస్తు విష్ణుమాయాయై వైష్ణవ్యై చ నమో నమః ॥ 72

మహామాయా స్వరూపాయై సమ్పదాయై నమో నమః ।
నమః కళ్యాణరూపిణ్యై శుభాయై చ నమో నమః ॥ 73

మాత్రే చతుర్ణాం వేదానాం సావిత్ర్యై చ నమో నమః ।
నమోఽస్తు బుద్ధిరూపాయై జ్ఞానదాయై నమో నమః ॥ 74

నమో దుర్గవినాశిన్యై దుర్గాదేవ్యై నమో నమః ।
తేజస్సు సర్వదేవానాం పురా కృతయుగే ముదా ॥ 75

శ్లో॥ అధిష్టాన కృతాయై చ ప్రకృత్యై చ నమో నమః ।
నమస్త్రిపురహారిణ్యై త్రిపురాయై నమో నమః ॥ 76

సున్దరీషు చ రమ్యాయై నిర్గుణాయై నమో నమః ।
నమో నిద్రాస్వరూపాయై నిర్గుణాయై నమో నమః ॥ 77

నమో దక్షసుతాయై చ నమః సత్యై నమో నమః ।
నమః శైలసుతాయై చ పార్వత్యై చ నమో నమః ॥ 78

నమో నమస్తపస్విన్యై హ్యుమాయై చ నమో నమః ।
నిరాహారస్వరూపాయై హ్యపర్ణాయై నమో నమః ॥ 79

గౌరీలోకవిలాసిన్యై నమో గౌర్యై నమో నమః ।
నమః కైలాసవాసిన్యై మాహేశ్వర్యై నమో నమః ॥ 80

నిద్రాయై చ దయాయై చ శ్రద్ధాయై చ నమో నమః ।
నమో ధృత్యై క్షమాయై చ లజ్జాయై చ నమో నమః ॥ 81

తృష్ణాయై క్షుత్స్వరూపాయై స్థితికర్త్ర్యై నమో నమః ।
నమః సంహారరూపిణ్యై మహామార్యై నమో నమః ॥ 82

భయాయై చాభయాయై చ ముక్తిదాయై నమో నమః ।
నమః స్వధాయై స్వాహాయై శాన్త్యై కాన్త్యై నమో నమః ॥ 83

నమస్తుష్ట్యై చ పుష్ట్యై చ దయాయై చ నమో నమః ।
నమో నిద్రాస్వరూపాయై శ్రద్ధాయై చ నమో నమః ॥ 84

క్షుత్పిపాసాస్వరూపాయై లజ్జాయై చ నమో నమః ।
నమోధృత్యై క్షమాయై చ చేతనాయై నమో నమః ॥ 85

సర్వశక్తిస్వరూపిణ్యై సర్వమాత్రే నమో నమః ।
అగ్నౌదాహస్వరూపాయై భద్రాయై చ నమో నమః ॥ 86

శోభాయైపూర్ణచన్ద్రే చ శరత్పద్మే నమో నమః ।
నాస్తి భేదో యథా దేవీ దుగ్ధధవల్యయోః సదా 87

యథైవ గన్ధభూమ్యోశ్చ యథైవ జలశైత్యయోః ।
యథైవ శబ్దనభసోర్జ్యోతిః సూర్యకయోర్యథా ॥ 88

లోకే వేదే పురాణే చ రాధామాధవయోస్తథాః ।
చేతనం కురు కళ్యాణీ దేహి మాముత్తరం సతి ॥ 89

ఇత్యుక్త్వా చోద్ధవ స్తత్ర ప్రణనామ పునః పునః
ఇత్యుద్ధవకృతం స్తోత్రం యః పఠేద్ భక్తిపూర్వకమ్ ॥ 90

ఇహలోకే సుఖం భుక్త్వా యాత్యన్తే హరిమన్దిరమ్ ।
న భవేద్బన్ధువిచ్ఛేదో రోగః శోకః సుదా రుణః ॥ 91

ప్రోషితా స్త్రీ లభేత్ కాన్తం భార్యాభేదీ లభేత్ ప్రియామ్ ।
అపుత్రో లభతే పుత్రాం నిర్ధనో లభతే ధనమ్ ॥ 92

నిర్భూమిర్ల భతే భూమిం ప్రజాహీనో లభేత్ ప్రజామ్ ।
రోగాద్ విముచ్యతే రోగీ బద్ధో ముచ్యేత బన్ధనాత్ ॥ 93

భయాన్ముచ్యతే భీతస్తుముచ్యేతాపన్న ఆపదః ।
అస్పష్టకీర్తిః సుయశా మూర్ఖో భవతి పణ్డితః ॥

బ్రహ్మాదిదేవతలచే వందితములు, తమ కీర్తికీర్తనముచే త్రిభువనము లను పవిత్రముచేయునట్టివి యగు శ్రీరాధాదేవియొక్క చరణకమలములకు నమస్కరించెదను. గోకులములో నివసించు రాధాదేవికి మాటిమాటికి నమస్కారము. శతశృంగముపై నివసించు చంద్రవతికి నమస్సులు. తులసీవనమందు, బృందావనమందు విరాజిల్లు దేవికి నమస్కారము, రాసమండలనివాసిని యగు రాసేశ్వరికి నమస్కారము, విరజాతటవాసినియగుబృందకు నమస్కారము, బృందావన విలాసినియగు కృష్ణకు నమస్కారము. కృష్ణప్రియకు నమస్కారము, శాంతకు, కృష్ణవక్షఃస్థలముపై నివసించు కృష్ణప్రియకు, వైకుంఠ వాసినికి, మహాలక్ష్మికి, విద్యాధిష్ఠాత్రీయగు సరస్వతికి నమస్కారము, సమస్తైశ్వర్యములకు అధిదేవి యైనకమలకు నమస్కారము, పద్మనాభునిప్రియురాలైన పద్మకు అనేకానేకప్రణామములు. మహావిష్ణువునకు జననియగు రాధకు నమస్కారము. సింధుసుతకు నమస్కారము, మర్త్యలక్ష్మికి నమస్కారము. నారాయణప్రియయగు నారాయణికి నమస్కారము. విష్ణుమాయకు నానమస్కారములు, వైష్ణవికి, మహామాయాస్వరూపిణియగుసంపదకు, కళ్యాణరూపిణికి నమస్కారము. నాల్గువేదములకు జనని యైనసావిత్రికి నమస్కారము. దుర్గతినాశినియగు దుర్గాదేవికి అనేకానేక నమస్కారములు. సత్యయుగములో ఏదేవి సర్వదేవతల తేజస్సులలో అధిష్ఠించియున్నదో ఆదేవికి, ప్రకృతికి నమస్కారము, త్రిపురహారిణికి నమస్కారము, త్రిపురకు నమస్కారము. సుందరీమణు లందు పరమసుందరియగు నిర్గుణకు నమస్కారము, నిద్రాస్వరూపిణికి నమస్కారము, నిర్గుణకు నమస్కారము. దక్షసుతకు సత్యకు శైలసుతకు పార్వతికి అనేకానేక నమస్కారములు. గౌరీలోకములో విలాసముల నొనరించు గౌరీదేవి

నీవు, కైలాసవాసినీ మాహేశ్వరీ, నిద్రా, దయ, శ్రద్ధా నీవు, ధృతీ, క్షమ, లజ్జా నీవు, తృష్ణా, క్షుత్స్వరూపా, స్థితికారిణీ సంహారకారిణీ మహామారీ! భయా! అభయా! ముక్తిదా! స్వధా! స్వాహా! శాంతీ! కాంతీ! తుష్టీ! పుష్టీ! దయా! నిద్రాస్వరూపిణీ! క్షుత్పిపాసాస్వరూపిణీ! లజ్జా! చేతనా! క్షమా! నీకు నమస్కారము. దేవీ! నీవు సర్వజననివి, సర్వశక్తిస్వరూపిణివి నీకు నమస్కారము, అగ్నిలో దాహికాశక్తిరూపమున యుండు దేవీ! నీకు నమస్కారము, భద్రా! నీకు నమస్కారము. పూర్ణచంద్రునిలో, శరత్కాల కమలములో శోభారూపమున యుండు శోభా! నీకు నమస్కారము, దేవీ! క్షీరములకు, క్షీరములధవళత్వమునకు, గంధమునకు, భూమికి, జలములకు, శీతలత్వమునకు, శబ్దమునకు, ఆకాశమునకు, సూర్యునకు, ప్రకాశమునకు ఎప్పుడును భేదములేదు అట్లే రాధామాధవులకు భేదములే దనిలోకములు వేదములు, పురాణములు ఘోషించును. కావున కళ్యాణీ! చైతన్యము పొందుము సతీ! నాకు ప్రత్యుత్తర మొసంగుము.

ఇట్లుప్రార్థించి ఉద్ధవుడు ఆమెచరణకమలములకు ప్రణామములర్పించెను. ఉద్ధవునిచే స్తుతింపబడిన యీస్తోత్రమును పఠించువారిలోకములో సకలసుఖముల ననుభవించి అంత్యకాలమందు వైకుంఠము చేరగలరు. వారికి బంధువియోగముగాని, రోగములుగాని, శోకములుగాని సంభవింపవు. ఈస్తోత్రపఠన మాహాత్మ్యమువలన పరదేశములకు వెడలిన తన భర్తను ఆ స్త్రీ కలసికొనగలదు. నిర్ధనునకు ధనముకల్గును. భూహీనునకు భూమి లభించును, ప్రజాహీనునకు ప్రజలు లభించెదరు. రోగి రోగములచే విముక్తుడు కాగలడు. బంధితుడు బంధవిముక్తుడు కాగలడు, ఆపదలోనున్నవాడు ఆపదలనుండి రక్షింపబడగలడు. అస్పష్టకీర్తియుక్తుడు ఉత్తమయశస్వి కాగలడు. మూర్ఖుడు పండితుడు కాగలడు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ జన్మఖండములో శ్రీరాధాస్తోత్ర మను తొంబదిరెండవ అధ్యాయము సంపూర్ణము



# తొంబదిమూడవ అధ్యాయము

## -: రాధోద్ధవ సంవాదము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదా! ఉద్ధవు డొనరించిన స్తోత్రము నాకర్ణింపగనే రాధాదేవికి బాహ్యజ్ఞానము కల్గెను. తన సమక్షమున శ్రీకృష్ణుని రూపురేఖలు గల ఉద్ధవుని గాంచి రాధాదేవి యిట్లు ప్రశ్నించెను.

శ్రీ రాధాదేవి పలికెను:

వత్సా! నీ నామధేయ మేమి? ఎవరు పంపగ నిటు వచ్చితివి? ఏ ప్రదేశమునుండి అరుదెంచితివి? నీ విటు వచ్చుటకు కారణమేమి? నీ సర్వాంగములు, రూపురేఖలు శ్రీకృష్ణునివలె నున్నవి, అందువలన నీవు శ్రీకృష్ణ పార్షదుడ వని నే తెలుసుకొంటిని. కుమారా! బలరామ కృష్ణుల కుశల సమాచారములను తక్షణమే వర్ణింపుము. నందు డే కారణముచే మధురానగర మందే యున్నాడు? శ్రీకృష్ణుడు మరల యీ రమణీయ బృందావనమునకు మరలి వచ్చునా? నేను పూర్ణచంద్ర సమానసుందర ముఖారవిందుని మరల దర్శింపగలనా? రాసమండలములో ఆయనతో మరల క్రీడింప గలనా? సఖులతో కలసి ప్రాణనాధునితో మరల జలవిహారము లొనరింపగలనా? శ్రీనంద నందనుని దివ్యాంగములకు మరల చందనానులేపన మొనరింపగలనా?

ఉద్ధవుడు పలికెను:

సుముఖీ! నేను క్షత్రియుడను, నన్ను ఉద్ధవు డందురు. నీశుభ సమాచారముల నెఱుంగుటకే శ్రీకృష్ణపరమాత్మ న న్నిటకు బంపగ నేను నీకడ కరుదెంచితిని. నేను శ్రీహరిపార్షదుడను. దేవీ! శ్రీకృష్ణబలదేవ నందాదులు సర్వులు కుశలమే.

శ్రీ రాధాదేవి పలికెను:

ఉద్ధవా! ఈ సమయములోగూడ ఆ యమునాతటమే కలదు. ఆ సుగంధితమలయ పవనములే వీచుచున్నవి. కేళికదంబముల మూలములును కూడ అవియే. ఆయన యభీష్ట మైన పుణ్యమయ రమణీయ బృదావనము కూడ నున్నది. ఆ పుంస్కోకిల కలరవములు, చందనచర్చిత మైన శయ్య

నాల్గువిధములైన భోజ్యపదార్థములు, మధువు, దురంతుడు, దుఃఖప్రదుడైన మన్మథుడుకూడ నున్నారు. రాసమండలములో ఆరత్నదీపము లింకను ప్రకాశించుచున్నవి. ఉత్తమమణులచే నిర్మింపబడిన క్రీడామందిరములుకూడ నున్నవి. గోపాంగనలందఱు శ్రీకృష్ణునికొఱకు నిరీక్షించుచున్నారు. పూర్ణ చందుడ్రు ప్రకాశించుచున్నాడు. సుగంధపుష్పములద్వారా అలంకరింపబడిన చందనచర్చిత మగుశయ్యకూడ కలదు. సువాసితతాంబూలము, సుగంధ మాలతీమాలికలు, శ్వేతవింజామరలు, దర్పణములు, వజ్రమణిజటిత మనోహర హారములు, అనేక రమణీయోపకాననములు, సుందరక్రీడాసరోవరములు, సుగంధపుష్పవాటికలు, మనోహర కమలముల పంక్తులు మున్నగు సకలవైభవములు సిద్ధముగనున్నవి, కాని యేమిప్రయోజనము? నాప్రాణవల్లభా! నీ వెక్కడనున్నావు?' ఈదాసివలన నేయపరాధము ఘటిల్లెను? నావలన నిశ్చయముగనే అపరాధము జరిగియుండవచ్చును; ఎందువలెననగ ఈదాసి అడుగడుగున అపరాధము నొనరించునదే.

ఇట్లు విలపించి రాధాదేవి శ్రీకృష్ణవియోగదుఃఖమును భరింపలేక మఱల అచేతనురాలయ్యెను. ఉద్ధవుడామె కనేకోపచారముల నొనరించి మఱల చైతన్యమును కలుగజేసెను. రాధాదేవి దివ్యమాధుర్యభావమును గాంచి క్షత్రియశ్రేష్ఠుడైన ఉద్ధవుడు పరమాశ్చర్యచకితుడయ్యెను. ఆసమయములో రాధాదేవికి ఆమెసప్తసఖులు వింజామరలచే సేవించిరి. అసంఖ్యాకగోపికలనేక విధముల రాధను సేవించిరి. రాధాదేవియొక్క దివ్యమధురానుభూతిని గాంచి యుద్ధవుడు వినయపూర్వకముగ అమృతసమానము లగు ప్రియవచనముల నిట్లుపలెక్కను.

ఉద్ధవుడు నలికెను:-

దేవీ! సకలదేవాంగనల కధీశ్వరివని, పరమకోమలివని, సిద్ధయోగినివని, సర్వశక్తిస్వరూపిణివని, మూలప్రకృతివని, ఈశ్వరివని, గోలోకసుందరివని నేతెలిసికొంటిని. జననీ! నీవు శ్రీకృష్ణునకు ప్రాణప్రియవు, ఆయన హృదయ నివాసినివి. కేవల మనన్యభక్తుడైన శ్రీదాముని శాపమును సత్యమొనరించుటకే అవనిపై నవతరించినావు. మాతా! నేను హృదయములకు బరమానంద మును బ్రసాదింపగల శుభసమాచారములను వర్ణించెదను. నీవు సఖులతోగూడి

సుస్థిరచిత్తముతో శ్రవణ మొనరింపుము. ఆశుభవార్త దుఃఖరూపమైన దావా గ్నిలో జిక్కినవారికి అమృతవృష్టివంటిది, విరహవ్యాధిగ్రస్తులకు ఉత్తమ రసాయనమువంటిది. సకలలోకపావనీ! వసుదేవుని నిమంత్రణానుసారముగ శ్రీకృష్ణబలరాముల ఉపనయనసంస్కార మహోత్సవమువఱకు నందుడు మథురానగరియందే యుండగలడు. ఈమంగళకార్యములు సాంగోపాంగముగ సంపన్న మొనరించి తదనంతరము నందుడు పరమానందస్వరూపులైన శ్రీకృష్ణ బలరాములను వెంటనిడుకొని హర్షపూర్వకముగ గోకులము జేరగలడు. గోకులము జేరగనే శ్రీకృష్ణపరమాత్మ యశోదకు ప్రణామములర్పించి నిశీథిలో హర్షసమన్వితుడై యాపుణ్యమయ బృందావనమునకు దయచేయగలరు. సతి! రాధికా! నీవు శీఘ్రమే శ్రీకృష్ణుని ముఖారవిందమును దర్శింపగలవు. ఆ సమయమున నీ విరహదుఃఖములు నశింపగలవు; కావున మాతా! నీవు నీచిత్తమును ధృఢ మొనరించుకొని యత్యంతదారుణశోకమును బరిత్యజింపుము. మఱల ప్రసన్నురాలవై అగ్నిశుద్ధరమణీయవస్త్రములను ధరించి అమూల్యరత్ననిర్మితములైన ఆభూషణములను ధరింపుము. కస్తూరీకుంకుమములచే సంయుక్తమైన చందనానులేపనమును శ్రీయంగములం దలంకరించుకొని మాలతీమాలలచే విభూషితవై కేశశృంగార మొనరించుకొనుము. కళ్యాణీ! ఇట్లు కపోలముల నలంకరించుకొనుము. నుదుటిపై కస్తూరీచందనయుక్తసిందూరమును ధరించి కళ్యాణతిలకములచే నలంకృతవు కమ్ము. పాదములకు పారాణిబెట్టుకొనుము. సతీ! శోకమును, కమలపుష్పశయ్యను బరిత్యజించి లెమ్ము, రత్నసింహాసన మలంకరించుము. దేవీ! మనస్సులో శ్రీకృష్ణుని స్మరించి విశుద్ధములైన మధురపదార్థములను భుజించి, సంస్కారయుక్తస్వచ్ఛజలపాన మొనరించి, సువాసిత తాంబూల మారగింపుము. దేవేశ్వరీ! ఏశయ్యపైనగ్నిశుద్ధవస్త్రము కలదో, ఏశయ్య మాలతీమాలికలచే సుశోభితమగునో, కస్తూరిచందనాది సుగంధిత ద్రవ్యములచే సువాశితమగునో, నాల్గువైపులమాలతీమాలలచే, వజ్రహారములచే విభూషిత మైయుండునో, సుందరమణులచే, ముత్యములచే, మాణిక్యములచే జటిత మైయుండునో, ఏశయ్య ఉపధానము (దిండు) పుష్పమాలలచే నలంకరింపబడి యుండునో, ఏశయ్య సకలమంగళయోగ్యమో, అమూల్యరత్ననిర్మితమో. పరమమనోహరమో ఆదివ్యశయ్యపై సదా గోపికలద్వారా సేవితురాలవై నిశ్చింతగ హర్షసమన్వితవై శయనించుము. జగజ్జననీ! నీప్రియ

సఖీమణులు, అనన్యభక్తిపరాయణ లైన గోపికలు నిరంతరము నీకు సేవ లొనరించుచు నీచరణకమలములను సేవించెదరు.

నారదా! ఇట్లు మధురవచనముల బల్కి బ్రహ్మాది దేవతలు నమస్కరించు రాధాదేవిచరణకమలములకు అనేక ప్రణామము లర్పించి యుద్ధవుడు మౌనము వహించెను. ఉద్ధవుని మధురవచనముల నాలకింపగనే రాధాదేవి ముఖముపై విషాదరేఖ లంతరించి చిరునవ్వులు చిందులాడినవి. ఆమె యుద్ధవునకు అమూల్యదివ్యవస్త్రాభరణములను, రత్నములను, హారములను, దివ్యభోజనమును, శుద్ధజలములను, తాంబూలాదులను సమర్పించి శుభాశీర్వాద మొసంగెను. తదనంతరము రాధ ఉద్ధవునకు శ్రీకృష్ణవర్ణితదివ్యజ్ఞానోపదేశ మొనరించి, లక్ష్మిని, మిధ్యను, కీర్తిని, సిద్ధిని, శ్రీహరిదాస్యమును, శ్రీహరిచరణములందు నిశ్చలభక్తిని శ్రేష్ఠతమ పార్షదపదమును వరములుగ ప్రసాదించెను. ఇట్లు ఉద్ధవు ననుగ్రహించి రాధాదేవి శోకమును, కమలసమన్విత శయ్యను బరిత్యజించి శుద్ధజలస్నాన మొనరించి అగ్నిశుద్ధవస్త్రములను ధరించి అమూల్యరత్నాభరణములచే విభూషితయై వజ్రహారములను, మనోహర రత్నమాలలను ధరించి, సుగంధితచందనానులేపన మొనరించుకొని శృంగారించుకొనెను. ఆసమయమున ఆమెశరీరదివ్యకాంతి ప్రతప్తసువర్ణసదృశమై వందలాది చంద్రుల పకాశమును మించి ప్రకాశించెను. అసంఖ్యాదిగోపిక లామెను పరివేష్టించియుండగ రాధాదేవి రత్నసింహాసనము నలంకరించి హర్షమగ్ను లైన యుద్ధవుని అనేకప్రకారముల సత్కరించి యిట్లుప్రశ్నించెను.

రా ధా దే వి ప లి కె ను :-

ఉద్ధవా! కపటరహితుడవై సత్యము బల్కుము. నిజముగ శ్రీహరి మఱల యీప్రదేశమునకు దయచేసెదరా? నీవు భయమువీడి బాగుగ సత్యమును ప్రవచింపుము. ఈ ఉత్తమసభామధ్యములో సత్యమునే పల్కుము.

శ్లో॥ వరం కూపశతాద్వాపి వరం వాపీ శతాత్క్రతుః ।
వరం క్రతుశతాత్పుత్రః సత్యం పుత్రశతాత్కిల ॥ 76
న హి సత్యాత్పరో ధర్మో నానృతాత్పాతకం పరమ్ ॥ 77

నూఱుభావులకంటె ఒక జలాశయము శ్రేష్ఠము, నూఱు జలాశయము లకంటె ఒకయజ్ఞము శ్రేష్ఠము, నూఱు యజ్ఞములకంటె ఒకసత్పుత్రుడు

శ్రేష్ఠుడు, నూర్గురు సత్పుత్రులకంటె సత్యము అత్యంతశ్రేష్ఠము. సత్యమును మించిన దర్మము మఱియొకటిలేదు. అసత్యమును మించిన పాపము మఱియొకటి లేదు.

ఉద్ధవుడు పలికెను:-

మాతా! నిశ్చయముగ శ్రీహరి యీప్రదేశమునకు మఱల దయచేయ గలడు. నీవు ఆయనదివ్యదర్శనము నొందుటకూడ సత్యమే. ఆసమయమున శ్రీహరి దివ్యముఖావలోకన మొనరింపగనే నిశ్చయముగ నీసంతాపము దూరము కాగలదు. మాతా! నీవిరహతాప మంతయు ఈశుభవార్త నాల కింపగనే నశించును. ఇక నీవు దుస్తరమైనచింతను వీడి నానాప్రకారభోగజనిత సుఖముల నుపభోగింపుము. నేను మధురకు జని శ్రీహరిని యీప్రదేశమునకు బంపెదను. మాతా! నాకికసెల విమ్ము. నేను శ్రీహరి సమీపమున కేగి యీవృత్తాంత మంతయు యథోచితరూపమున వర్ణించెదను.

శ్రీరాధాదేవి పలికెను:

వత్సా! నీవు పరమమనోహరమైన మధురాపురికి మఱలి పోవు చున్నావు. కావున కొంతసమయ మాగి స్థిరత్వముగ నాదుఃఖభరితకథ నాల కింపుము. కుమారా! విరహముచే దుఃఖించు నీదీనురాలిని మరువకుము. నీవు నిశ్చయముగ నాప్రాణేశ్వరుని బంపగలవని యకుంఠితవిశ్వాసముతో నావిష యముల నన్నింటిని నీయెదుట బహిర్గత మొనరించుచున్నాను: లేనిచో స్త్రీల మనస్సులందు గలభావముల నెంతటివిద్వాంసులైనను దెలిసికొనగలరా ? వేదములే ఎవనిని వర్ణించుటలో అసమర్థములో. ఆజగన్నాథుని శాస్త్రము లేమనిప్రవచింపగలవు? కాని పుత్రా! నివు మధురకు జని నావిరహదుఃఖమును శ్రీకృష్ణునకు వర్ణింపగలవు. నేను నాదుఃఖముల నన్నింటిని నీకు చెప్పెద నాల కింపుము. ఉద్ధవా! నాకు గృహమునందు, వనమునందు, భేదము ప్రతీత మగుటలేదు. ఏదిజలమో. ఏదిస్థలమోకూడ నేను తెలిసికొనలేకున్నాను. విరహదుఃఖముచే పీడింపబడునేను రాత్రియను, పగలను జ్ఞానరహితనై సూర్య చంద్రోదయములనుగూడ కానలేకున్నాను. ఈసమయమున శ్రీహరి శుభ సమాచారము నాలకించి తత్క్షణమే చైతన్యవంతురాలనైతిని. నాయంత రంగములో శ్రీకృష్ణునిదివ్యమంగళరూపమును దర్శించుచున్నాను, మధుర

మురళీరవము నాలకించుచున్నాను. కులమును, లజ్జను, భయమును త్యజించి సదా **శ్రీహరిచరణకమలధ్యానమందే** నిమగ్నురాల నైయున్నాను.

సమస్తలోకములకు ఈశ్వరుడు ప్రకృతికి అతీతుడు నగుశ్రీహరి చెంతనుండగ నేను మాయకు వశీభూతురాలనై ఆజగన్నాధునియథార్థస్వరూపమును దెలిసికొనలేకపోయితిని. వేదములు, బ్రహ్మాదిదేవత లెవనిచరణకమలములనే ధ్యానింతురో ఆయననే నేను క్రోధమునకు వశీభూతనై నిష్ఠూరములాడితిని. అట్టినాయాప్రవర్తనము నిప్పటివఱకు హృదయమును కంటకమువలె బాధించుచున్నది.

శ్లో॥ తత్పదామ్భోజసేవాభిర్గుణప్రస్తావతోఽపి వా ॥
తద్భక్త్యా యత్క్షణో నీతో ధ్యాతో ధ్యానేన పూజయా ॥ 90

తత్రాపి మఙ్గలం సర్వం హర్షమాయుర్వ్యవస్థితమ్ ।
విఘ్నం ద హ్నాది సన్తాపస్తద్విచ్ఛేదే సదోద్ధవా ॥ 91

ఉద్ధవా! ఆయనచరణకమలములసేవయందే, గుణకీర్తనములందే, ఆయనభక్తియందే, ధ్యానపూజాదులందే ఏక్షణములు వ్యతీతములగునో, ఆక్షణములలోనే సర్వమంగళములు ఆనందము, జీవనముసుండును. ఆయనతో విచ్ఛేదమైనచో సదా హృదయములో విరహాసంతాపము విఘ్నములు సంభవించును.

ఇపుడు మఱల నాకట్టియభీష్టక్రీడలభించునా! అట్టిప్రేమసౌభాగ్యములు నిర్జనస్థానములలో ఆయనతో మఱల సమాగమము సంభవించునా? ఉద్ధవా! నన్ను వీడి జనిననందనందనునితో నేను మఱల బృందావనవిహార మొనరింపను. ఆయనవక్షఃస్థలముపై చందనానులేపన మొనరింపను. శ్రీకృష్ణుని మాలలచే అలంకరింపను, ఆయనముఖకమలమును వీక్షింపను. నేను శ్రీహరితో మాలతీకేతకీ చందనాదికాననములలో మఱల విహరింపను. రాసమండలమును ప్రవేశింపను. మలయసుగంధయుక్తమందిరములను ప్రవేశింపను. శ్రీహరితో రమణీయమాధవీవనములో రహస్యమయ మధుకాననములో, మనోహర శ్రీఖండకాననములో, పుష్పభద్రకవనములో, విష్పందక కాననములో, భద్రకవనాదులలో, హాహ్వాళి యొనరింపను. వసంతఋతువందు వికసించిన యామాధవీలత యెక్కడ? శ్రీకృష్ణునితో విహరించిన యావసంతరాత్రి యేమైనది? వసంతఋతు వేమయ్యెను? మాధవా! శ్రీకృష్ణా! నీ వెచట కేగితివి?

ఇట్లు శ్రీకృష్ణుని స్మరించుచు రాధ ఆయనపై ప్రణయకోపము వహించి ఆయన చరణకమలధ్యానమందే సంలగ్నురాలైనది. మఱల విరహదుఃఖ మావహింపగా ఆమె సర్వాంగములు పులకించినవి. రాసేశ్వరి దుఃఖించుచు అచేతనురాలయ్యెను.

ఇది శ్రీ మదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ జన్మఖండములో రాధోద్ధవ సంవాద మను తొంబదిమూడవ అధ్యాయము సంపూర్ణము.

---

## తొంబదినాల్గవ అధ్యాయము

### గోపికా సంభాషణము

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

మునీశ్వరా! రాధాదేవి మఱల మూర్ఛిల్లుట గాంచిన యుద్ధవునకు విస్మయము భయము కలిగినవి. ఉద్ధవుడు రాధాదేవిని నిజమైనభక్తురాలిగను తను నామమాత్రపుభక్తునిగను గ్రహించి ఆమెను దర్శించి సర్వజగములు తుచ్ఛములని తెలిసికొనెను. తదనంతరమును రాధకు చేతనత్వము గల్గించుటకై ఉద్ధవు డిట్లు బల్కెను.

ఉద్ధవ ఉవాచ:

శ్లో॥ చేతనం కురు కళ్యాణీ జగన్మాతార్న మోఽస్తు తే ।
త్వమేవ పాశ్రి క్తనం సర్వం కృష్ణం ద్రక్ష్యసి సామ్ప్రతమ్ ॥ 3

త్వత్తో విశ్వం పవిత్రం చ త్వత్పాదరజసా మహీ ।
సుపవిత్రం త్వద్వదనం పుణ్యవత్యశ్చ గోపికాః ॥ 4

శ్లో॥ లోకాస్త్వామేవ గాయన్తి సంగీతైర్మఙ్గలస్తవైః ।
త్వత్సత్కీర్తి చ దేవాశ్చ సనకాద్యాశ్చ సంతతమ్ ॥ 5

కృతపాపహరాం పుణ్యాం తీర్థపూజాం చ నిర్మలామ్ ।
హరిభక్తిప్రదాం భద్రాం సర్వవిఘ్నవినాశినీమ్ ॥ 6

త్వమేవ రాధా త్వం కృష్ణ స్త్వం పునాన్ప్రకృతిః పరా ।
రాధామాధవయోర్భేదో న పురాణే శ్రుతౌ తథా 7

కళ్యాణీ ! చేతనత్వము నొందుము. జగన్మాతా ! నీకు నమస్కారము. జననీ ! నీవే పూర్వజన్మకృతసమస్తకర్మవు. ఇపుడు నీకు శ్రీకృష్ణదర్శనము నిశ్చయముగ ప్రాప్తింపగలదు. నీదర్శనమాత్రముననే విశ్వము పవిత్రమైనవి. నీచరణరజస్పర్శచే పృథ్విపావనమైనది. నీముఖారవిందము పరమపవిత్రము. నిన్ను స్పృశించినమాత్రముననే గోపాంగనలు, గోపకన్యలు పుణ్యవతులైరి. సకలప్రజలు గీతములద్వారా, మంగస్తోత్రములద్వారా నీదివ్యగుణనామ సంకీర్తన మొనరించుచున్నారు. సమస్తపాపములనునశింపజేయునది పుణ్యమయమైనది, తీర్థపూజాస్వరూపమైనది, నిర్మలమైనది, హరిభక్తిప్రదాయకమైనది, కళ్యాణప్రదమైనది, సర్వవిఘ్నవినాశకమైనదియగు నీదివ్యకీర్తిని సనకాదిమహర్షులు సదావర్ణించెదరు. జననీ ! నీవే రాధవు, నీవే కృష్ణుడవు, నీవే పురుషుడవు, నీవే పరాప్రకృతివి. పురాణములందుగాని, శ్రుతులందుగాని రాధామాధవులందు భిన్నత్వము నిరూపింపబడలేదు. (అనగా రాధామాధవులు అభిన్నులు.)

రాధ మఱల మూర్ఛిల్లుట గాంచి మాధవి యనురాధాసఖి ఆమెనిట్లు ఊరడింపనారంభించెను.

మా ధ వి ప లి కె ను :

కళ్యాణీ ! శ్రీకృష్ణుడు చోరు డమ్మా! ఆయనలో ఏయుత్తమరూపము వేషభూషలు కలవమ్మా? ఆయనముఖవైభవ మేపాటిదమ్మా? ఆయనపరాక్రమ మెంత ? ఐశ్వర్య మెంత ? దుర్లంఘ్యమగు శౌర్య మెంత ? ఆయన యందు ఏసిద్ధికలదు ? ఆయన ఏమంత్రప్రసిద్ధుఁ డు ? నీయనురూపగుణములు ఆయనయం దేమికలవు ? ఎచటనుండియో అఱుదెంచి ఆనల్లనివాడుమఱల ఎచటకో మఱలిపోయెను. ఆతడు గోపవేషధారి యైనబాలకుడేగదా ! రాజపుత్రుడుగాని, విశిష్టపురుషుడుగాని కాడుకదా ! నీ వేలవ్యర్థముగ ఆనందనందను డైనగోపాలునిచింతలో బడినావు.

శ్లో॥ ఆత్మానం రక్ష యత్నేన కః ప్రియః హ్యాత్మన పరః 20

దేవీ ! యత్నపూర్వకముగ నీవునీయాత్మను రక్షించుకొనుము; ఆత్మకంటె అధికప్రియమైనది మఱియొకటి లేదు.

తదనంతరము మాలతి యనుసఖి శ్రీకృష్ణుని నిందించుచు చివరకు రాధతో నిట్లనెను. "మాధురాలా! వ్యర్థముగ నీవెవనిచింతలో పడితివి. అత్యంత దారుణమైన యాశోకమును వీడుము. యత్నపూర్వకముగ నిన్ను నీవు రక్షించుకొనుము, ఆత్మకంటె ప్రియమైనవస్తువు మఱియొకటి లేదు," మాధవి మాలతులు పల్కిన శ్రీకృష్ణనింద నాలకించి పద్మావతి, చంద్రముఖి యను రాధాసఖులు శ్రీరాధాదేవికిగల శ్రీకృష్ణప్రేమను ప్రశంసించుచు ఇట్లు పల్కిరి. "సఖులారా! మాసఖి ఆహారమును పరిత్యజించి శ్రీకృష్ణప్రేమ పీడితయై కేవలము శ్వాసలచే జీవించుచున్నది, కావున మీరు శ్రీకృష్ణుని ప్రశంసింపుడు: శ్రీకృష్ణునిదివ్యనామస్మరణచే ఆయనగుణగానశ్రవణముచే మన సఖియగురాధకు మఱల చైతన్యము లభించును. తదనంతరము శశికళ యను గోపిక శ్రీకృష్ణుని ప్రశంసించుచు మాధవితో ఇట్లుపల్కెను.

శ్లో॥ త్వం కిం మాధవి జానసి కృష్ణమాత్మానమీశ్వరమ్ ।
యం తం బ్రహ్మాదయో దేవా వేదాశ్చత్వార ఎవ చ ॥ 34

ధ్యాయన్తి సంతతం సన్తః పాదపద్మం సురేప్సితమ్ ।
పద్మా సరస్వతీ దుర్గా సోఽనన్తోఽపి మహేశ్వరః ॥ 35

యం న జానన్తి సిద్ధేన్ద్రా మునీన్ద్రా మనవస్తథా ।
సర్వాత్మనః కుతో రూపం నిర్గుణస్య కుతో గుణాః ॥ 36

సత్యయుక్తం చ సత్యస్య యత్తదేవ యథోచితమ్ ।
ధత్తే భారావతరణే పృథివ్యాశ్చ మనోహరమ్ ॥ 37

సుఖమాహ్లాదకం రమ్యం భక్తానుగ్రహవిగ్రహమ్ ।
కిమనిర్వచనీయం చ రూపం జనమనోహరమ్ ॥ 38

కోటికన్దర్పలావణ్యం లీలాధామ శుభాశ్రయమ్ ।
యత్పాదపద్మమధురం మధు మన్దాకినీజలమ్ ॥ 39

దధ్రే శిరసి భక్త్యా చ సర్వేశః శఙ్కరః పరః ।
శశ్వత్కరోతి వైరాగీ తీర్థకీర్తేశ్చ కీర్తనమ్ ॥ 40

క్షణం నృత్యతి భక్త్యా చ పంచవక్త్రేణ గాయతి ।
ఆహారం భూషణం వస్త్రం పరిత్యజ్య దిగమ్బరః ॥ 41

బ్రహ్మజ్యోతిః స్వరూపం చ ధ్యాత్వా శుభ్రం సునిర్మలమ్ ।
బ్రహ్మా చ తపసా జన్మ నయత్యేవ హి సేవయా ॥ 42

శేషః సనత్కుమారశ్చ సిద్ధసంఘశ్చ యోగవిత్ ॥ 43

మాధవీ! సర్వేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మను నీవెట్లు తెలిసికొనగలవు? బ్రహ్మాది దేవతలు, నాల్గువేదములు ఎవనిధ్యానమందు సదామగ్నములైయుండునో, దేవతలు కాంక్షించు ఎవనిచరణకమలములను భక్తజనులు సదా ధ్యానింతురో; పద్మ, సరస్వతి, దుర్గ, అనంతుడు, సిద్ధేంద్రులు, మునీంద్రులు, మనువులు, మహేశ్వరుడు ఎవనిని తెలిసికొనలేకపోయిరో; పరమాత్మ యగునా శ్రీకృష్ణుని నీ వేమి తెలిసికొనగలవు? సర్వాత్మ యగు వానికి రూప మెట్లుండును? నిర్గుణుడైనవానికి గుణములెట్లుండును? సత్యస్వరూపుడైనభగవంతుని దివ్యస్వరూపము సుఖదాయకము, ఆహ్లాదజనకము, అత్యంతరమణీయము, భక్తానుగ్రహకారకము, పరమలీలాధామము, మంగళములకే ఆశ్రయ స్థానము; ఆదేవాదిదేవునిలావణ్యము కోటానుకోట్లమన్మధులను మించి యుండును, ఆజనమనోహరుని రూపమును మించిన అనిర్వచనీయరూపము మఱి యొకటి లేదు; ఆమనోహర సచ్చిదానందవిగ్రహముతోనే శ్రీకృష్ణపరమాత్మ పృథ్వీభారము తొలగించుటకు అవనికి దయచేసినాడు. పరిశుద్ధ మందాకినీ సుస్వాదుజలములు ఆయన పాదపద్మములను క్షాళనముచేయునట్టివి. ఆదివ్యజలములను పరాత్పరుడైన, సర్వేశ్వరుడైన శంకరుడు భక్తిపూర్వకముగ తనశిరస్సుపై ధరించి విరక్తుడై సదా ఆత్మస్వరూపుడైనశ్రీకృష్ణుని దివ్యగుణనామ సంకీర్తన మొనరించుచు ఆహారభూషణవస్త్రాదులను పరిత్యజించి దిగంబరుడై భక్త్యావేశములో ఒకక్షణము నృత్యమొనరించును, మఱియొకక్షణము గానమొనరించును. బ్రహ్మ శేషుడు సనత్కుమారుడు, యోగవేత్తలు, సిద్ధులు మొదలగువారందరు ఆపురుషోత్తముని పరమనిర్మల శుభ్రబ్రహ్మజ్యోతి స్వరూపమును ధ్యానించుచు తపమొనరించుచు దాస్యభావముద్వారా తమజీవనములను పావనమొనరించుకొనుచుందురు, ఆశ్రీకృష్ణపరమాత్మ మహిమను ఎవరు తెలిసికొనగలరు?

పిమ్మట సఖిసుశీల శ్రీకృష్ణుని ప్రశంసించుచు ఇట్లుపల్కెను.

శ్లో॥ నిర్మంచనార్హం న భవేత్తస్య కామశతం శతమ్ ।
చన్ద్రోఽశ్వినీ కుమారో వా రూపేషు కేన గణ్యతే ॥ 44

అసంఖ్యేషు చ విశ్వేషు బ్రహ్మవిష్ణుశివాదయః ।
మునయో మనవః సిద్ధా భక్తాః సన్తశ్చ సంతతమ్ ॥ 45

ధ్యాయన్తే యత్పదామ్భోజం నిర్గుణస్యాఽఽత్మనశ్చ వై।
వేదాః స్తోతుం న శక్తాశ్చ యమీశం చ సరస్వతీ ॥ 46

జడీభూతా చ భీతా చ స్తవనేన క్షమాపయేత్ ।
సహస్రవక్త్రః స్తవనే కమ్పితశ్చ నిరన్తరమ్ ॥ 47

దేవానాం జనకో బ్రహ్మా స్తోత్రేణ తస్య హీశ్వరః ।
తం సత్యం నిత్యమీశం చ మాధవీ పరినిన్దతి ॥ 48

అపవిత్రా సభా భూతా గోపీనాం జీవనం వృథా ।
రాధ పుణ్యవతీ రాధా ధ్యాయతే యం దివానిశమ్ ॥ 49

యన్నామస్మృతిమాత్రేణ కోటిజన్మార్జితం సఖి ।
కృతపాపభయం శోకః ప్రణశ్యతి న సంశయః ॥ 50

ఆయన సచ్చిదానంద దివ్యవిగ్రహసౌందర్యమునకు అసంఖ్యాకులైన మన్మథులే సరిరారు. చంద్రులైన, అశ్వనీకుమారులైన రూపములో లెక్కలోనివారు కారు. అసంఖ్యాక విశ్వములందు విరాజిల్లు బ్రహ్మవిష్ణు శివాది దేవతలు, మునులు, మనువులు, సిద్ధులు, భక్తులు, మహాత్ములు మొదలగువారు సతతము ఆనిర్గుణుని, నిరామయుని పదామ్భోజములనే ధ్యానించుచుందురు. వేదములు సరస్వతి ఆసర్వేశ్వరుని స్తుతించుటలో అశక్తులు, సహస్రవక్త్రుడైనను ఆదేవాదిదేవుని స్తుతించుటకు కంపించును. వేదోత్పాదకుడు, ఈశ్వరుడైన బ్రహ్మ ఆ శ్రీకృష్ణుని సదా స్తుతించుచుండును. ఆసత్య నిత్య పరమేశ్వరుడైన శ్రీకృష్ణుని ఈమాధవి నిందించుచున్నది. కావున ఈసభ అపవిత్రమైనది, గోపికలజీవనమే వ్యర్థమైనది. సకలగోపికలందు కేవలము రాధాదేవియే అఖండపుణ్యవతి; ఆమె అహర్నిశములు శ్రీకృష్ణుని ధ్యానమందే సంలగ్నయై యుండును. ఆజగన్నాథుని నామస్మరణమాత్రమున కోటానుకోట్ల జన్మలలోని పాపపుంజము, భయము, శోకము పరిపూర్ణముగ నశింపగలవు. ఇందు లేశమాత్రమైనను సంశయము లేదు.

సుశీల పల్కిన శ్రీకృష్ణప్రశంస నాలకించి రత్నమాల పులకితయై యిట్లుపల్కెను.

శ్లో॥ దధార వామహస్తేన శైలం గోవర్ధనం హరిః ।
ఏతేః కిం తద్యశః శౌర్యం జగతాం జనకస్య చ ॥ 51

శైలానాం చ సహస్రంయో భేత్తుం శక్తశ్చ దైత్యరాట్ ।
లీలామాత్రేణ తేషాం చ లక్షం హన్తుం క్షమో హరిః ॥ 52

యదంశకలయా జాతః సూకరోవిష్ణురీశ్వరః ।
వసుధాం దశనాగ్రేణ చోద్దధార చ లీలయా ॥ 53

శైలానాం చ సహస్రాణి యత్ర సన్తి మహీతలే ।
దైత్యాశ్చ వాఽప్యసంఖ్యాశ్చ వీరాః శూరాస్తథైవ చ ॥ 54

తేనైవ కర్మణా తస్య న శౌర్యం న చ పౌరుషమ్ ।
న యశశ్చ ప్రశంసా వా సఖి సర్వాత్మనాఽఽత్మనా ॥ 55

సఖీ! తనవామహస్తముతోనే గోవర్ధనపర్వతమును అవలీలగ హరి యెత్తినాడు. జగములకే నాయకుడైన ఆయనయశమును, శౌర్యమును ఎంచనేల? దైత్యులను సంహరించు దైత్యరాట్టు అయిన శ్రీకృష్ణపరమాత్మ వేలకొలది శైలముల నైనను అవలీలగ నెత్తగల శక్తిసమన్వితుడు. లీలగనే లక్షలాదిదైత్యులను తృటిలో సంహరింప గలడాహరి. ఆయన కళనుండి ఆవిర్భవించిన సర్వేశ్వరుడైన విష్ణువు సూకరావతారము దాల్చి తనదంష్ట్రిపై అవలీలగ వసుధనే ధరించి, ఉద్ధరించెను. వేలకొలది శైలముల నైనను, మహీతలము నైనను లీలగ ఆయన ధరింపగలడు. వీరులైన, శూరులైన దైత్యులు అసంఖ్యాకులైనను ఆజగన్నాథుడు లీలగ సంహరింపగలడు. ఇవి యన్నియు ఆయన దివ్యకర్మలే. ఆసర్వాత్మకుని శౌర్యమును, పౌరుషమును ఎంచనేల? ప్రశంసింపనేల?

పారిజాతోవాచ :-

శ్లో॥ సప్తద్వీపా చ వసున్ధరా సశైలవనసాగరా ।
కాంచనీభూమిసహితా సర్వాధారా మనోహరా ॥ 56

సప్త స్వర్గాశ్చ వివిధా బ్రహ్మలోకావధి ప్రియే ।
విచిత్రాః సున్దరాశ్చైవ పాతాలానాం చ సప్త చ ॥ 57

ఏతైః పరిమితం విశ్వం బ్రహ్మాణ్డం బ్రహ్మణా కృతమ్ ।
మహద్విష్ణోర్లోమకూపే తదేవం చాణువత్స్థితమ్ ॥ 58

తస్య యావన్తి లోమాని తాని విశ్వాని సన్తి చ ।
స ఏవ షోడశాంశశ్చ కృష్ణస్య పరమాత్మనః ॥ 59

తస్యైవ కిం యశః శౌర్యం మహిమానమనూపమమ్ ।
వక్తుం శక్తో గోపకన్యా చ కిం వా జానాతి మాధవీ ॥ 60

సర్వమునకు ఆధారమై, మనోహరమై, శైలవనసాగరములచే సంపన్నమై, కాంచనభూమిసహితమై, సప్తద్వీపములను, సప్తస్వర్గములను, బ్రహ్మలోకాది వివిధలోకములను కలిగి సుందరమైన, సప్తపాతాళములచే సంపన్నమైన పరిమితవిశ్వబ్రహ్మాండము బ్రహ్మచే సృజింపబడెను. అట్టిబ్రహ్మాండము శ్రీమహావిష్ణువు రోమకూపమందు అణువువలె విరాజిల్లును. ఆ శ్రీమహావిష్ణుశరీరమందు ఎన్ని అసంఖ్యాకరోమములు కలవో, అన్ని యసంఖ్యాకవిశ్వములు ఆయన రోమకూపములలో నున్నవి. ఆ శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణునకు షోడశాంశమాత్రుడే. అయినచో శ్రీకృష్ణునియశమును, శౌర్యమును, అనుపమమహిమాదులను ఎవరైనను వర్ణింపగలరా? ఆయనమహిమ ఈ గోపకన్యయగు మాధవి కేమి తెలియును?

గోపకన్యలు తన కథనమును విమర్శించుట నాలకించి మాధవి తాను జగన్నాథుని నిందింపలేదని, తనవాక్యములలోని రహస్యముల నిట్లు ఆ గోపికా సభామధ్యములో ప్రవచించెను.

మాధవి పలికెను:-

శ్లో॥ మయా యదుక్తం న జ్ఞాత్వా మూఢా జల్పన్తి గోపికాః ।
ఉద్ధవ శృణు మే వాక్యం యన్మయా కథితం శుభమ్ ॥ 61

స్వేచ్ఛయా సగుణో విష్ణుః స్వేచ్ఛయా నిర్గుణో భవేత్ ।
ధువో భారావతరణే గోపవేషః శిశుర్విభుః ॥ 62

యది వేదాః పురాణాని సిద్ధాః సన్తశ్చ సంతతమ్ ।
బ్రహ్మేశశేషభక్తాశ్చ న జానన్తి యమీశ్వరమ్ ॥ 63

తం కిం జానామి మూఢాఽహం యత్కుమారీ గోపకన్యకా ।
తథాఽపి మద్వచః సత్యం శ్రూయతాం వత్స తత్త్వతః ॥ 64

అనిర్వచనీయం చ రూపం శౌర్యం యశో బలమ్ ।
దివ్యం వేషం చ సిద్ధిం చాప్యన్యో వా యోగుణో హరేః ॥ 65

స్వేచ్ఛామయస్య తస్యైవ సగుణస్య చ సామ్ప్రతమ్ ।
అనిర్వచనీయం చ వర్తతే తద్విశేషణమ్ ॥ 66

శ్లో॥ నిర్గుణస్య చ విష్ణోశ్చ దేహహీనస్య స్వాత్మనః ।
వర్తతే చ కిమాఖ్యేయం తస్య రూపాదికం చ కిమ్ ॥ 67

మాం నిన్దతి మహామూఢా న బుద్ధ్వా వచనం మమ ।
ఏషా జానాతి కిం మూఢా తం సత్యం ప్రకృతేః పరమ్ ॥ 68

జ్యోతిః స్వరూపం పరమం పరమాత్మానమీశ్వరమ్ ।
తమనిర్వచనీయం చ భక్తానుగ్రహవిగ్రహమ్ ॥ 69

యత్పాదపద్మం పద్మా సా త్రైలోక్యజననీ పరా ।
సేవతే కమ్పితా భీతా దాసీవత్స తతం భియా ॥ 70

విష్ణుమాయా చ ప్రకృతి ర్మూలరూపా సనాతనీ ।
బ్రహ్మస్వరూపా పరమా భీతా దక్షిణపార్శ్వతః ॥ 71

సరస్వతీ జడీభూతా భీతా చ పరమేశ్వరీ ।
స్తోతుం న శక్తా వేదా కిం స్తువన్తి పరమేశ్వరమ్ ॥ 72

నేను పల్కిన పల్కులను అర్థముచేసికొనలేక మూఢురాండ్రైనగోపికలు నన్ను నిందించినారు. శుభప్రదములైన నావాక్యములభావమును ప్రవచించుచున్నాను. ఉద్ధవా ! సావధానుడవై అవధరింపుము. విష్ణువు (శ్రీకృష్ణుడు) స్వేచ్ఛగ సగుణుడు గాగలడు, స్వేచ్ఛగ నిర్గుణుడు కాగలడు. భూభారమును తొలగించుటకే ఆవిభుడు శిశురూపమున గోపవేషధారియై అవతరించినాడు. వేదములు, పురాణములు, సిద్ధులు, మహాత్ములు, బ్రహ్మశేషాదులు, భక్తులు ఈ యీశ్వరుని పరిపూర్ణముగ తెలిసికొనలేకపోయినారు. అయినచో ఆపరబ్రహ్మమును మూఢురాలనైన, శ్రామికురాలనైన, గోపకన్యనైననే నేమి తెలిసికొనగలను? అయినను సత్యములైన నావచనములను వత్సా! నీ వీక్షణమున ఆలకింపుము. ఆయన రూపము, శౌర్యము, యశము, బలము, వీర్యము, వేషము అనిర్వాచనీయములు, దివ్యములు. స్వేచ్ఛామయుడై సగుణరూపమును ధరించిన ఆహరిగుణమేదైనా చెప్పగల్గినది ఉంటే ఆయన గుణములను వర్ణించుటయే. అనిర్వచనీయమైన ఆపరమాత్మయొక్క అసంఖ్యాకవిశేషణముల నెవరు వర్ణింపగలరు? ఆమహావిష్ణువు నిర్గుణుడు, ప్రాకృతిక దేహహీనుడు, అట్టి ఆయనరూపాదులను ఏమని మనము వర్ణింపగలము? కావుననే నేను, ఆయన వైభవ మేపాటిదని, పరాక్రమెంతయని, శౌర్య మెంతయని? ఆయన గోపవేషధారియని, బాలకుడనీ, చోరుడని పల్కినాను. నావచనములలోని భావము

లను గ్రహింపలేక ఈమూఢురాండ్రైనగోపికలు నన్ను నిందించుచున్నారు. నిత్యుడైన, ప్రకృతికంటె అతీతుడైన ఆపరబ్రహ్మమును ఈమూఢురాండ్రెట్లు తెలిసికొనగలరు! శ్రీకృష్ణుడు జ్యోతిస్స్వరూపుడు, పరమాత్మ, ఈశ్వరుడు. అనుగ్రహనిగ్రహుడు అనిర్వచనీయుడు. ఎవని పాదపద్మములను త్రైలోక్యజననియైనపద్మ దాసివలె సదా భయభీతురాలై సేవించునో, ఎవని దక్షిణపార్శ్వమున బ్రహ్మస్వరూపిణియైన, పరమవిష్ణుమాయయైన, సనాతనియైన మూలప్రకృతియగు ఈశ్వరి భీతితో విరాజిల్లునో, ఎవనిని స్తుతించుటలో పరమేశ్వరియగు సరస్వతిసహితము భీతురాలై జడురాలుకాగలదో, ఏపరమేశ్వరుని స్తుతించుటలో వేదములైనను అశక్తములో ఆశ్రీకృష్ణుని ఎవరు స్తుతింపగలరు?

మాధవి పల్కిన వచనముల నాలకించి ఉద్ధవుని సర్వాంగములు పులకించినవి. ఆమహాత్ముడు భక్తివిహ్వాలుడై, ఆనందబాష్పసమన్వితుడై మాధుర్యభక్తిభావమును పొందెను. తదనంతరము పరమేశ్వరుడైన శ్రీకృష్ణుని ధ్యానించి భక్తిసంపదలో గోపికలు పరమోన్నత లనిగ్రహించి వారియెదుట తాను అత్యంతతుచ్ఛుడ నని భావించి భక్తిపూర్వకముగ శ్రీకృష్ణమాధుర్య భక్తి యనెడు సంపద గల్గిన గోపికల నిట్లు ప్రశంసించెను.

ఉద్ధవుడు పలికెను :-

శ్లో॥ ధన్యం యశస్యం ద్వీపానాం జమ్బూద్వీపం మనోహరమ్ ।
యత్ర భారతవర్షం చ పుణ్యదం శుభదం తథా ॥ 75

వణిజాం చ పుణ్యకృతం వాణిజ్యస్థలమీప్సితమ్ ।
అత్ర కృత్వా సుపుణ్యం చ భుంక్తేఽన్యత్ర శుభం ఫలమ్ ॥ 76

ద్వీపములందు జంబుద్వీప మత్యంతధన్యము, యశోయుక్తము, పరమ మనోహరము. ఆజంబుద్వీపములో విరాజిల్లు భారతవర్ష మఖండపుణ్యప్రదము, శుభప్రదము. భారతవర్షము మహావాణిజ్యస్థలము, వణిజులకు ఈప్సితవాణిజ్యము లొనరించుటకు ఇదిపుణ్యభూమి. ఈపవిత్రభారతవర్షములోనే సుపుణ్యకర్మ నొనరించి దేహధారులు ఆదివ్యకర్మలశుభఫలములను అన్యదేవలోకములందు అనుభవింపగలరు.

శ్లో॥ ధన్యం భారతవర్షం తు పుణ్యదం శుభదం వరమ్ ।
గోపికాపాదరజసా పూతం పరమనిర్మలమ్ ॥ 77

శ్లో॥ తతోఽపి గోపికా ధన్యా మాన్యా యోషిత్సు భారతే ।
నిత్యం పశ్యన్తి రాధాయాః పాదపద్మం సుపుణ్యదమ్ ॥ 78

షష్టివర్షసహస్రాణి తపస్తప్తం చ బ్రహ్మణా ।
రాధికాపాదపద్మస్య రేణునాముపలబ్ధయే ॥ 79

గోలోకవాసినీ రాధా కృష్ణప్రాణాధికా పరా ।
తత్ర శ్రీదామశాపేన వృషభానుసుతాఽధునా ॥ 80

యే యే భక్తాశ్చ కృష్ణస్య దేవా బ్రహ్మాదయస్తథా ।
రాధాయాశ్చాపి గోపీనాం కలాం నార్హన్తి షోడశీమ్ ॥ 81

కృష్ణభక్తిం విజానాతి యోగీన్ద్రశ్చ మహేశ్వరః ।
రాధా గోప్యశ్చ గోపాశ్చ గోలోకవాసినశ్చ యే ॥ 82

కించిత్సనత్కుమారశ్చ బ్రహ్మ చేద్విషయా తథా ।
కించిదేవ విజానన్తి సిద్ధా భక్తాశ్చ నిశ్చితమ్ ॥ 83

ధన్యోఽహం కృతకృత్యోఽహమాగతో గోకులం యతః ।
గోపికాభ్యో గురుభ్యశ్చ హరిభక్తిం లభేఽచలామ్ ॥ 84

మథురాం చ న యాస్యామి తీర్థకీర్తేశ్చ కీర్తనమ్ ।
శ్రోష్యామి కింకరో భూత్వా గోపీనాం జన్మజన్మని ॥ 85

న గోపీభ్యః పరో భక్తో హరేశ్చ పరమాత్మనః ।
యాదృశీం లేభిరే గోప్యో భక్తిం నాన్యే చ తాదృశీమ్ ॥ 86

సకలవర్షములందు పుణ్యప్రదమైన, మంగళప్రదమైన భారతవర్షమత్యంతశ్రేష్టము. భరతభూమి గోపికలచరణకమలములరజముచే పావనమై, పరమనిర్మలమై అత్యంతధన్యమైనది. ఈ భారతవర్షములో గల సకల స్త్రీలందు కేవలము గోపికలే ధన్యురాండ్రు, మాన్యురాండ్రు; ఎందువలననగ వారు నిత్యము ఉత్తమపుణ్యప్రదము లైన శ్రీరాధాచరణకమలదర్శన సౌభాగ్యవతులు. ఆజగన్మాతయగు రాధాచరణకమలరజస్సునుపొందుటకొఱకే బ్రహ్మ అఱువదివేల దివ్యవర్షములు తప మాచరించెను. పరాశక్తియైన రాధామాత గోలోకనివాసిని, శ్రీకృష్ణప్రాణాధికప్రియ. ఎవరెవరు శ్రీకృష్ణ భక్తులో వారందరు కూడ రాధాదేవిభక్తులే. సకలబ్రహ్మాదిదేవత లందరు గోపికల పదునాఱవ కళకైనను సరిరాలేరు. శ్రీకృష్ణభక్తిరహస్యము పూర్ణ రూపముగ యోగిరాజైన మహేశ్వరునకు, జననియగు రాధాదేవికి గోపికి

వాసు లైన గోపగోపికలకు తెలిసియున్నది. బ్రహ్మ, సనత్కుమారాదులు కొంతమాత్రమే తెలిసికొనగల్గిరి. సిద్ధులు, భక్తులుకూడ కించిన్మాత్రమే అవగతమొనరించుకొనగల్గినారు.

ఈగోకులమున కేతెంచి నేను కృతకృత్యుడను, ధన్యుడను నైతిని. గురుస్వరూపిణు లైనయీగోపికలనుండి నాకు అవిచలమైన హరిభక్తి ప్రాప్తించినది. పరమాత్మయందు అనన్యభక్తి పొందిన నేను కృతార్థుడ నైతిని. మధురకు మఱలిపోవలె ననుఇచ్ఛనాకు లేదు. నేను జన్మ జన్మలందు మహాసౌభాగ్యసంపన్న లైన యీగోపికలకు కింకరుడ నై జన్మించి తీర్థశ్రవు డైనశ్రీకృష్ణపరమాత్మ దివ్య గుణనామసంకీర్తనల నాలకించి పరమానంద మనుభవించెను; ఎందువలననగా గోపికలను మించిన శ్రీహరిభక్తులు అన్యులుమఱియెవ్వరు లేరు. గోపికలకు ప్రాప్తించిన శ్రీకృష్ణునిమాధుర్యభక్తి మఱియెవ్వరిప్రారబ్ధమందు లేదు.

తదనంతరము రాధాజనని యైనకళావతి తాను అయోనిజనని, రాధ అయోనిజయని ప్రకటించెను. రాధ సుదామునిశాపవశమున అవనిపై అవతరించితినని, తాను సనత్కుమారునిశాపవశమున అవనిపై అయోనిజనై అవతరించితినని తెలిపెను. శ్రీకృష్ణుని అనేకవిధముల ప్రశంసించెను. తదనంతరము తులసి శ్రీకృష్ణునిప్రభావము నిట్లువర్ణించెను.

తులసీ ఉవాచః :

శ్లో॥ సర్వప్రాణిషు దేవాశ్చ తిష్ఠన్త్యేవ పృథక్పృథక్ ।
ప్రాణో విష్ణుశ్చ విషయీ మనో బ్రహ్మ చ చేతనా ॥ 6

ప్రకృతిస్బుద్ధిరూపా చ సర్వశక్త్యాధి దేవతా ।
జ్ఞాన స్వరూపః శమ్భుశ్చ స్వయం ధర్మశ్చ పూరుషః ॥ 7

నిర్గుణః పరమాత్మా చ తద్బ్రహ్మ ప్రకృతేః పరమ్ ।
స ఏవ కృష్ణా సాక్షీ చ కర్మణాం జీవినామపి ॥ 8

భోక్తా చ సుఖదుఃఖానాం జీవ స్తత్ప్రతిబిమ్బకః ।
చక్షుషోశ్చన్ద్రసూర్యౌ చ జిహ్వాయాం చ సరస్వతీ ॥ 9

వసున్ధరా త్వచి సదా బాహ్వోస్తే లోకపాలకాః ।
ఆత్మనశ్చాపి తే సర్వే పరిచారకరూపిణః ॥ 10

ఆత్మన్యేవ ప్రియాస్తే చ సర్వే గచ్ఛన్తి జీవినః ।
యథా సంసది సంసారే నిరదేహ (వ) మివానుగాః ॥ 11

శ్లో॥ తస్మాత్సర్వాత్మనాఽఽత్మానం భజన్తి సంతతం సదా ।
స న్తశ్చ పరయా భక్త్యా ధ్యాయన్తే యోగినో ముదా ॥ 12

కర్మిణాం కర్మణాం సాక్షీ కుతః కర్మ చ గోపనమ్ ।
అన్తర్యామీ చ కృష్ణశ్చ ప్రచారం కురుతే ముదా ॥ 13

సర్వప్రాణులందు దేవతలు వెఱువేఱు స్థానములలో విరాజిల్లుచుందురు. దేహధారియందు గలప్రాణమే విష్ణువు. బ్రహ్మయే విషయయుక్తమైన మనస్సు, చేతనము. సర్వశక్త్యాధిదేవత యైనప్రకృతి బుద్ధిస్వరూపము, జ్ఞాన రూపమే శివుడు. స్వయముగ ధర్మము పురుషరూపమున నుండును. నిర్గుణుడు, పరమాత్మ, పరబ్రహ్మము, ప్రకృతికంటె అతీతు డైనకృష్ణపరమాత్మ దేహ ధారియందు ఆత్మయై వానిసకలకర్మలకు సాక్షీరూపమున విరాజిల్లుచుండును. సుఖదుఃఖముల ననుభవించుజీవుడు ఆ శ్రీకృష్ణపరమాత్మప్రతిబింబమే. చక్షువు లందు సూర్యచంద్రులు, జిహ్వాగ్రముపై సరస్వతి, త్వక్కునందు వసుంధర, బాహువులందు, హస్తములందు లోకపాలకులు, పరిచారకులరూపమున నివసించుచు పరబ్రహ్మస్వరూపమైన ఆత్మను సదా సేవింతురు. వారికి ఆత్మయే అత్యంతప్రియము. దేహధారి నాశ్రయించి వానిబంధువు లనుసరించునట్లే దేహమునందు విరాజిల్లుచున్న సకలదేవతలు ఆత్మను అనుసరింతురు. భక్తులు అనన్యభక్తితో, యోగులు ధ్యానముతో సర్వాత్మలకు ఆత్మయైన ఆశ్రీకృష్ణునే సదా భజింతురు. శ్రీకృష్ణపరమాత్మ అంతర్యామి, కర్మల నొనరించువారికర్మ లన్నింటికి సాక్షికావున మనము చేయునేకర్మ యైనను గోప్యముగ నుండ దనివారు సదా ముదముతో ప్రచార మొనరించుచుందురు.

తులసి యొనరించిన శ్రీకృష్ణప్రశంస నాలకించి కాళిక యనుసఖి యిట్లు పల్కెను; "ఉద్ధవా! బాలకులు, యువకులు, వృద్ధులు సకలదేవతలు, సిద్ధులు మొదలగువా రందరు ఆపరమేశ్వరు డైనశ్రీకృష్ణుని నిశ్చయముగ అంగీకరింతురు. ఈసమయము మూర్ఛితురా లైన రాధకు చేతనత్వమును కలిగించుట అత్యంతయుక్తము, కావున అందులకు ప్రధానయుక్తిద్వారా రాధకు చైతన్యమును కలిగింపుము."

గోపికల ఉపదేశామృతము నాలకించి కృతార్థు డైన యుద్ధవుడు శ్రీకృష్ణ ప్రేమవిహ్వల యై మూర్ఛితురా లైనరాధను మేల్కొలుపుచు ఇట్లుపల్కెను. "కళ్యాణీ! చైతన్యమునుపొందుము. జగన్మాతా! ఈదీనుని గాంచుము. నేను

కృష్ణభక్తులదాసానదాసుడ నైన ఉద్ధవుడను. మాతా! నన్ను కరుణింపుము. నామనోవాక్కాయములు అంగీరింపకున్నను నేను మధురకు మఱలిపోకతప్పదు; నేను స్వతంత్రుడను గాను, కీలుబొమ్మవలె పరాధీనుడను. వృషభములు వృష వాహునకు వశములైనట్లే నేను శ్రీకృష్ణునకు అధీనుడను, సదా ఆయిన యాజ్ఞానువర్తిని.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ జన్మఖండములో గోపికాసంభాషణ మను తొంబదినాల్గవ అధ్యాయము సంపూర్ణము



## తొంబదియైదవ అధ్యాయము

### రాధ తన దుఃఖమును ఉద్ధవునకు తెలుపుట

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

నారదా! ఉద్ధవుని వచనములు వినగనే రాధ చైతన్యమును పొంది ఉత్తమసింహాసనము నలంకరించెను. సప్తగోపికలు వింజామరలద్వారా రాధా దేవిని సేవింపదొడంగిరి. రాధ దుఃఖితయై ఉద్ధవునితో నిట్లుపలికెను.

శ్రీ రాధాదేవి పలికెను:-

వత్సా! నీవు మధురకు మఱలిపొమ్ము. కానిమధురను జేరి నన్ను మఱవకుము. తల్లి నైన నన్ను మరచుట ఈభవసాగరములో నీకు దానిని మించిన మఱియొకయధర్మము లేదు. నీవు తత్క్షణమే మధురను జేరి పరమా నందస్వరూపు డైన శ్రీకృష్ణునకు నాదుఃఖముల నన్నిటిని నివేదించి నాప్రాణ నాథుని ఇచటకు తీసికొనిరమ్ము. శ్రీకృష్ణవియోగజన్యదుఃఖము ఎంత తీవ్రమో, నేను దక్క అన్యు లెట్లు తెలిసికొనగలరు? మూడులోకములందు గల స్త్రీలలో నన్నుమించిన శోకవతి మఱియొకతి లేనే లేదు. కుమారా, ఉద్ధవా! నావంటి దుఃఖితలు లేనేలేరు. ఏస్త్రీ నామానసికవ్యథ నాలకించి విశ్వసింపగలదు? స్త్రీలలోగూడ ఈరాధసమానురాలైన దుఃఖితురాలు, సుఖ

సౌభాగ్యహీనురాలు, విరహసంతప్త మఱియొకతె లేదు, ఉండబోదు. వత్సా! ఎవని నామశ్రవణమాత్రముననే నాపంచప్రాణములు ప్రహృష్టము లగునో, ఎవని స్మరణవలనే అవి ప్రఫుల్లములగునో, ఆత్మ స్నిగ్ధమగునో; ఏనాథుడు స్పృశించగనే నాకు త్రిభువనములందు యశము ప్రాప్తించెనో, ఆపరమేశ్వరుని ఎంత సౌభాగ్యమును పొందినను విస్మరింపగలనా? తండ్రీ! త్రిలోకములను జయింపగల రూపగుణసంపన్నుడు, బ్రహ్మసృష్టికి శక్యముకానివాడు, బ్రహ్మనే సృష్టించినవాడు, కల్పవృక్షముకంటే మిన్నయైన సర్వసంపత్ప్రదాత, శాంతుడు, లక్ష్మీకాంతుడు, మనోహరుడు, సర్వేశ్వరుడు, సర్వకారణస్వరూపుడు, పరమైశ్వర్యశాలియైన పరమాత్మ, బ్రహ్మకేవిధాత, ఆనాస్వామియగు శ్రీకృష్ణుని ఏప్రలోభముల బడి మరువగలను?

తండ్రీ! బ్రహ్మశివశేషాదులు సదా ఎవనిచరణకమలధ్యానమందే రతులై యుందురో, ఆప్రభువును నేను ఎట్టిసుఖలోభమువలన విస్మరింపగలను? పుత్రా! ఎవనియనుపమమనోహరరూపమును సదా స్వప్నములో దర్శింతునో, సర్వమును త్యజించి అహర్నిశములు ఎవనిధ్యానమందు నిమగ్నరాలనై యుందునో, ఎవనిగుణకీర్తనములవలన పర్వతములే కరిగి జలము లగునో, శుష్కకాష్ఠములు ద్రవిత ములగునో, మృతవృక్షములు చిగురించునో, వాయువు స్తంభించునో, సూర్యుడు సాగరము స్థగితము లగునో, ఆప్రియతముని నేను ఏసమృద్ధిని బొంది మరచిపోగలను? భక్తవరా! ఎవరు కాలమునకే కాలమో, ప్రళయకాలమేఘమో, సంహారకర్తయో, శివునకు సృష్టికర్తయగు బ్రహ్మకు స్వామియో, ఎవరు స్వాధీనుడో స్వతంత్రుడో, స్వయమాత్మా నామాంకితుడో, ఆప్రభువును నేను ఎట్టి సంపదలను పొందినను మరువగలనా? ఆశ్రీకృష్ణపరమాత్మ దూరమైన నే ననుభవించు వియోగజన్యదుఃఖమును శాంతింపజేయుటకు యదార్థజ్ఞాన మేదియు లేదు. ఎట్టి విద్వాంసులైనను నన్నూరడింపలేరు. సావిత్రీసరస్వతులైనను నన్నూరడింపలేరు. వేదవేదాంగములైనను నాకు ధైర్యమును ప్రసాదింపలేవు, అయినచో భక్తులెంత? దేవతలెంత? సహస్రముఖసమన్వితుడైన ఆదిశేషుడైనను, వేదోత్పాదకుడైన బ్రహ్మయైనను, యోగీంద్రుల గురువులకే గురుడైన శంకరుడైనను, జితేంద్రియుడైన గణేశ్వరుడైనను నాదుఃఖము తెలిసికొనలేరు, నన్నూరడింప లేరు. ఈ యపారదుఃఖ మనుభవించినవారికే ఈదుఃఖతీవ్రత తెలియగలదు.

ఏమార్గములేని వారి కేదిగతి? సుఖదుఃఖములు, శుభాశుభములు మొదలగు నవియన్నియు కాలముద్వారానే సంభవింపగలవు. అంతియేకాదు, జగము లందు సర్వపదార్థములు ఏకాలమునకు వశీభూతము లై యున్నచో, ఆ కాలము దుర్నివారము.

వత్సా! నీవు వ్రజమును పరిత్యజించి మధురకు పోవలె నని సంకల్పించిన లెమ్ము. సుఖపూర్వకముగ ఆరమణీయ మధురానగరమునకు బొమ్ము; చిరకాలము శ్రీకృష్ణునినుండి దూరముగా నుండుట ఘోరదుఃఖమునకు హేతువు కాగలదు: శ్రీకృష్ణవియోగముచే సుఖము లభింపదు. ఉద్ధవా! తత్క్షణామే మధురాపురిని జేరి జన్మమృత్యుజరావ్యాధులను వినాశ మొనరింపగల శ్రీకృష్ణపరమాత్మయొక్క ముఖచంద్రుని దర్శించి ధన్యుడవుగమ్ము.

రాధ పల్కిన శ్రీకృష్ణ విరహజన్య దుఃఖవాక్కుల నాలకించి ఉద్ధవుడు కూడ అత్యంతశోకవశుడై దుఃఖింపదొడంగెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణజన్మఖండములో
రాధ తన దుఃఖమును ఉద్ధవునకు తెలుపుట యను
తొంబదియైదవ అధ్యాయము సంపూర్ణము.



## తొంబదియాఱవ అధ్యాయము

## రాధ ఉద్ధవునకు భవతదుణోపాయము

## -: నుపదేశించుట :-

శ్రీ నారాయణఋషి పలికెను:

రాధా పదాంభోజములపై తల నుంచి పులకాంకిత శరీరుడై అనన్య భక్తుడైన ఉద్ధవుడు ఆమెను వీడి మధురకు బోలేక దుఃఖింపదొడంగెను. తదనంతరము శ్రీకృష్ణుని స్మరించి సాశ్రుపూర్ణ నయనుడై మధురకు మఱలపోవుచున్న ఉన్మత్తుడైన ఉద్ధవుని గాంచి ప్రేమవిహ్వల యై మాధవి గోపిక ఇట్లు పల్కెను.

మా ధ వి ప లి కె ను :-

భక్తాగ్రేసరా! క్షణ మాగి యథోచితము లగు నావాక్యముల నాలకింపుము. నిగూఢములైన, సుదుర్లభము లైనపురాణములందు, వేదములందు గోపనీయములైన నీ మనోవాంఛితపరమజ్ఞానరహస్యములను త్రిజగన్మాతయగు రాధికను ప్రశ్నించి తెలిసికొనుము.

ఆసభామధ్యములో మాధవీగోపిక ఆదేశించిన యాదేశప్రకారము అత్యంతశాంతసమన్వితుడైన ఉద్ధవుడు త్రిభువనజననియగు రాధ నిట్లు ప్రశ్నించెను.

ఉ ద్ధ వు డు ప లి కె ను :-

శ్లో॥ ఏకాకీ భవమాయాతి యాత్యేకాకి పునః పునః ।
ప్రాణీ కర్మానురోధేన స్వకర్మఫల భుక్పుమాన్ ॥ 6

కర్మణా జాయతే జన్తుః కర్మణైవ ప్రలీయతే ।
సుఖం దుఃఖం భయం శోకం కర్మణైవాభిపద్యతే ॥ 7

జన్తుర్భోగావశేషేణ భోగం భుంక్తే భవేషు చ ।
పునశ్చ కర్మణో భోగాత్సమాయాతి చ యాతి చ ॥ 8

రత్నాదికం చ యత్కించిన్మహ్యం దత్తం త్వయా సతి ।
మయా సార్ధం న యాత్యేవ తేన మే కిం ప్రయోజనమ్ ॥ 9

భవాబ్ధితారణే దేవీ భవతీ రమణీశ్వరా ।
కర్ణధారః స్వయం కృష్ణః సర్వేషాం పారకారకః ॥ 10

కించిద్దానం దేహి మహ్యం భవాబ్ధిపారకారణమ్ ।
ప్రాప్య ప్రసాదం యాస్యామి మథురాం కృష్ణమూలకమ్ ॥ 11

యాం యాం కాలగలిం మాతః సురాణాం చ నృణామపి ।
పితౄణాం బ్రహ్మలోకస్య తదూర్ధ్వస్య చ తాం వద ॥ 12

తామేవ దుస్తరాం ఘోరాం తీర్త్వా యామి హరేః పదమ్ ।
ఏవం భూతముపాయం చ దేహి మే కమలాలయే ॥ 13

యూరతో యత్పదామ్భోజం ధ్యాయన్తే చ దివానిశమ్ ।
దేవా బ్రహ్మేశశేషా ధ్యాన్తం తద్వశీక్షస్థలస్థితా॥ 14

ప్రాణి స్వకర్మానుసారముగ తా నొనరించిన కర్మఫలముల ననుభవించుటకు ఈజగములో ఏకాకిగానే జన్మించును. ఆతడు మరల ఏకాకిగానే మరణిం

చును. అత డట్లే మాటిమాటికి జన్మించుచు, మరణించుచు నుండును. కర్మవలననే జీవుడు దేహధారియై జన్మించును, కర్మవలననే ఆతడు మరణించి దేహమును వీడును. సుఖములు, దుఃఖములు, భయము, శోకము కర్మలవలననే సంప్రాప్తించును. జీవుడు తాను జన్మించిన జన్మలో ఎంతమాత్ర మైనను కర్మ భోగము మిగిలియున్న దాని ననుభవించుటకు మఱల ఈసంసారములో జన్మించును. మఱల కర్మలనాచరించి, ఆకర్మభోగానుసారముగ ఇతరలోకములకు వెళ్ళుచు మఱల ఈసంసారములోనే జన్మించుచుండును. ఓసతీ! నీవు నాకు రత్నాదులను ప్రసాదించినను ఏమిప్రయోజనము? అవి జీవి దేహమును వీడిచను సమయమున వెంటరావు. ఈ భవసాగరమును తరింపజేయుటకు ఒకేఒక నావ కలదు. ఆనావను నడపువాడు శ్రీకృష్ణు డొక్కడే, ఆయనయే జీవుని ఈ భవసాగరమునుండి తరింపజేయగలడు: కావున మాతా! ఆభవసాగరమును తరించుటకు నావవంటి మహాభక్త్యాత్మికజ్ఞానమున్నచో, దానినే నా కుప దేశింపుము. నీనుండి ఆప్రసాదమును గ్రహించి మూలపురుషు డైన శ్రీకృష్ణ పరమాత్మ విరాజిల్లు మధురానగరమునకు పోయెదను. మాతా! మానవులకు, దేవతలకు కాలగతిని సూచించునది, పితృలోకములకు, బ్రహ్మలోకములకు, ఊర్ధ్వలోకములకు మార్గమేర్పరచునదియగు జ్ఞానము నుపదేశింపుము. ఈఘోరసంసారసాగరమును తరించి హరిని జేరునుపాయము నాకు ప్రసాదింపుము. బ్రహ్మశివశేషాదులు దూరములో నుండి ఆయనపదపంకజములను సదా ధ్యానించుచున్నారు. దేవీ! నీవు ఆయనవక్షఃస్థలములోనే విరాజిల్లుచున్నావు. కావున ఆమహాజ్ఞానమును నాకు నీవే ఉపదేశింపగలవు.

ఉద్ధవుని వచనముల నాలకించి కమలాలయ యగు రాధ సజలనయనములతో ఇట్లు తన యుపదేశామృతమును ప్రారంభించెను.

రా ధా దే వి ప లి కె ను :-

శ్లో॥ శుద్ధాం కాలగతిం వత్స జానాతి భగవాన్ హరిః ।
బ్రహ్మా మహేశః శేషశ్చ వేదాశ్చత్వార ఏవ చ ॥ 17

కించిద్వేదానుసారేణ సన్తో జానన్తి పుత్రక ।
శ్రూయతాం కృష్ణవక్త్రేణ గోలోకే రాసమణ్డలే ॥ 18

శ్లో॥ గోలోకే చాపి వైకుణ్ఠే బ్రహ్మలోకే చ సామ్ప్రతమ్ ।
యా చ దృష్టా కాలగతిస్తామేవ కథయామి తే ॥ 19

నృణాం పితౄణాం దేవానాం బ్రహ్మలోకాదికస్య చ ।
బహిర్లోకస్య బ్రహ్మణ్డాత్పాతాలానాం చ నిశ్చితమ్ ॥ 20

దురత్యయాం కాలగతిం యేనోపాయేన పణ్డితాః ।
నిరస్తరన్తి బుధశ్రేష్ఠ కథయామి నిశామయ ॥ 21

భజన్తి జగతాం నాథం కాలకాలం జగద్గురుమ్ ।
నిర్గుణం చ నిరీహం చ పరమాత్మానమీశ్వరమ్ ॥ 22

సద్యః పతతి దేహోఽయం వినా యేన సదాత్మనా ।
తం నిషేవ్య కాలగతిం తరత్యేవ హి కేవలమ్ ॥ 23

ఉద్ధవా! మాధవివచనముల నాలకించి నన్ను ప్రశ్నించుచున్నావా? స్త్రీలు అబలలు. అట్టి స్త్రీనైన నేను నీ కేజ్ఞానమును ప్రసాదింపగలను? శుద్ధమైనకాలగతిని శ్రీకృష్ణుడే పరిపూర్ణముగ తెలిసినవాడు. బ్రహ్మ, మహేశ్వరుడు, ఆదిశేషుడు మొదలగువారుకూడ కాలజ్ఞానసంపన్నులే. కుమారా! వేదానుసారముగ భక్తులు ఆకాలగతిని కొంత తెలిసికొనగల్గిరి. గోలోకరాసమండలమధ్యములో శ్రీకృష్ణపరమాత్మ ముఖారవిందమునుండి ఏకాలగతిని ఆలకించితినో, గోలోకములో వైకుంఠములో, బ్రహ్మలోకములో ఏకాలగతిని దర్శించితినో దానిని వర్ణించెద నవధరింపుము. పితృలోకవాసులకైనను, దేవలోకవాసులకైనను, బహిర్లోకవాసులకైనను, బ్రహ్మాండము మొదలు పాతాళమువరకును కాలము నిశ్చితము. దురత్యయమైన ఆకాలగతి యెంతటి విద్వాంసులకైనను దుర్లంఘనీయమే. ఓబుధశ్రేష్ఠా! దుర్లంఘనీయమైన ఆకాలగతిని ఏయుపాయముచే దాటవచ్చునో నే నుపదేశించెదను. సావధానుడవై ఆలకింపుము. నిర్గుణుడు, నిరీహుడు, పరమాత్మ, ఈశ్వరుడు, సకలజగన్నాథుడు, కాలమునకే కాలుడు, అయిన శ్రీకృష్ణపరమాత్మను సదా భజించుటయే, సేవించుటయే కాలగతిని తరించుటకు ఏకైకోపాయము.

శ్లో॥ ఆయుర్హరతి సర్వేషాం ప్రాణినాం రవిరేవ చ ।
శ్రీహరేః శుద్ధభక్తానాం సతాం పుణ్యవతాం వినా ॥ 24

విధేర్మానసికాన్పుత్రాంశ్చతురః పశ్య పుత్రిక ।
సనకాదిన్భాగవతాన్వేషాం చ సుస్థిరం వయః ॥ 25

రుద్రాద్యాన్వయసా నిత్యాం జ్ఞానినాం చ గురోర్గురూమ్ ।
బాలాననుపనీతాంశ్చ పంచపర్షశిశూన్యథా ॥ 26

అభ్యన్తరే మహాస్ఫీతాన్సస్మితాంశ్చ దిగమ్బరాన్ ।
శ్రీకృష్ణధ్యానపూతాశ్చ తీర్థపూతాంశ్చ వైష్ణవాన్ । 27

వేదవేదాఙ్గశాస్త్రాణాం చింతాహీనాన్ప్రఫుల్లితాన్ ।
భక్త్యా దివానిశం శశ్వద్ధరిభావేన తత్పరాన్ ॥ 28

బాహ్యపూజావిహీనాంశ్చ పూజాన్మానసికాం స్తథా ।
మృత్యుంజయాన్మహాభాగాన్కాలవ్యాలజిత స్తథా ॥ 29

సనకం చ సనన్దం చ తృతీయం చ సనాతనమ్ ।
పరం సనత్కుమారం చ యే స్మరన్తి చ సర్వశః ॥ 30

తీర్థస్నానఫలం లబ్ధ్వా ముచ్యతే కృతపాతకాత్ ।
హరిభక్తిర్భవేత్తేషాం హరిదాస్యం లభన్తి చ ॥ 31

కుమారా! సూర్యుడు సర్వప్రాణుల ఆయుర్దాయములను అహర్నిశములు క్షీణింపజేయును; కాని శ్రీహరిశుద్ధభక్తులగు ఆ సత్యవ్రతపరాయణులపై, పుణ్యవంతులపై ఆయన ప్రభావము పనిచేయదు. ఉదాహరణస్వరూపమున బ్రహ్మమానససంభూతులైన, భగవద్భక్తులైన సనకసనందనాది భాగవతోత్తములను వీక్షింపుము. వారు ఉపనయనసంస్కారరహితులైన పంచవర్షీయ శిశువులవలె సదా బాలరూపమున విరాజిల్లుచుందురు. వారు ఆయవస్థయందే ఏకాదశరుద్రులకు ద్వాదశాదిత్యులకు, మహాజ్ఞానులగు గురువులకుకూడ గురువులైనారు. వారి హృదయము లత్యంతసువిశాలములు. వారు ప్రసన్నముఖారవిందులు, దిగంబరవేషధారులు, శ్రీకృష్ణధ్యానపవిత్రగాత్రులు; వారు విష్ణుభక్తిపరాయణులైన వైష్ణవశిఖామణులు, తీర్థములను సహితము పునీత మొనరింపగల మహాత్ములు. వారలకు వేదవేదాంగములందుగాని, శాస్త్రములందుగాని ధ్యాస లేదు, వారిమనస్సు సదా ప్రఫుల్లితమై అహర్నిశములు భక్తిపూర్వకముగ శ్రీహరి దివ్యధ్యానమందే సంలగ్నమై యుండును. వారి నామధేయములు సనక, సనన్దన, సనాతన, సనత్కుమారులు. వీరిని మనఃపూర్వకముగ స్మరించు వారికి తీర్థస్నానజనితఫలము ప్రాప్తించును, వారు తా మొనరించిన పాపములనుండి విముక్తు లయ్యెదరు, హృదయములందు హరిభక్తి ఉద్భవించిన వారు హరిదాస్యసౌభాగ్యసంపన్నులు కాగలరు.

శ్లో॥ మృకణ్డుబాలకం పశ్య కర్మణా చ ద్విజోత్తమమ్ ।
దశవర్షాయుషం తీవ్రం జ్వలన్తం బ్రహ్మతేజసా ॥ 32

హరిసేవనతః పశ్చాత్సప్తకల్పాన్తజీవినమ్ ।
ఓఢుం పంచశిఖం పశ్య లోమశం చాఽఽసురిం తథా ॥ 33

సర్వకర్మవిహీనం చ హరిసేవనతత్పరమ్ ।
శతకల్పాయుషం చైవ ధ్యాయమానం హరేః పదమ్ ॥ 34

తదనంతరము మృకండునిపుత్రుడైన, కర్మచే ద్విజవరుడైన మార్కండేయుని వీక్షింపుము. ఆయన తన కర్మవశమున పదిసంవత్సరముల ప్రాయము నుండి లక్షలాదిసంవత్సరములవఱకు బ్రహ్మతేజముతో ప్రజ్వలితుడై ప్రకాశించుచున్నాడు. ఆభాగవతోత్తముడు శ్రీహరియనన్యసేవచే ఏడుకల్పముల ఆయుర్దాయము కలవాడైనాడు; తదనంతరము ఓఢుని, పంచశిఖుని, లోమశుని, ఆసురిని వీక్షింపుము. వారు సర్వకర్మలను పరిత్యజించి శ్రీహరిసేవయందే తత్పరులై సదా శ్రీహరిచరణకమలధ్యానరతులై యుందురు. ఈ మహానుభావుల ఆయుర్దాయము నూరుకల్పము లని గ్రహింపుము.

శ్లో॥ జమదగ్నేః సుతం పశ్య రామం తం చిరజీవినమ్ ।
హనుమన్తం బలిం వ్యాసమశ్వత్థామానమేవ చ ॥ 35

విభీషణం కృపం విప్రం జామ్బవన్తం చ భల్లుకమ్ ।
హరిభావనయా చైతే శుద్ధాః సుచిరజీవినః ॥ 36

తదుపరి జమదగ్నినందను డైన పరశురాముని, హనుమంతుని, బలిని వ్యాసుని, అశ్వత్థామను, విభీషణుని, విప్రవరు డైన కృపాచార్యుని, భల్లూకాధిపతి యైన జాంబవంతుని వీక్షింపుము. వీరందరు శ్రీహరిదివ్యగుణనామసంకీర్తన మాచరించి పరిశుద్ధులై చిరంజీవులైనారు.

శ్లో॥ సిద్ధేన్ద్రేషు మునీన్ద్రేషు నరేష్వన్యేషు చోద్ధవ ।
హరిభావనశుద్ధాశ్చ సర్వే తే చిరజీవినః ॥ 37

ప్రహ్లాదం పశ్య దైత్యేషు హిరణ్యకశిపోః సుతమ్ ।
హరిద్విషో దురన్తస్య హరిభావనతత్పరమ్ ॥ 38

చిరాయుషం కాలజితం పశ్యాన్యం చాప్యసంఖ్యకమ్ ।
అనేకజన్మతపసా లబ్ధ్వా జన్మ చ భారతే ॥ 39

యే హరిం తం న సేవన్తే తే మూఢాః కృతపాపినః ।
వాసుదేవం పరిత్యజ్య విషయే నిరతో జనః ॥ 40

త్యక్త్వాఽమృతం మహామూఢో విషం భుంక్తే నిజేచ్ఛయా ।
కస్య స్త్రీ కస్య వా పుత్రః కస్య వా బాన్ధవాస్తథా ॥ 41

కః కస్య బన్ధుర్విపది శ్రీకృష్ణేన వినా భువి ।
తస్మాత్సన్తః సదా కృష్ణం భజన్త్యేవ దివానిశమ్ ॥ 42

జన్మమృత్యుజరావ్యాధిహరం సర్వహరం పరమ్ ।
కాలస్య తరణోపాయం భజనం పరమాత్మనః ॥ 43

ఆనన్దనన్దస్యైవ పరిపూర్ణతమస్య చ ।

ఉద్ధవా వీరుదక్క సిద్ధేంద్రులలో, నరేంద్రులలో, అన్యమనుష్యులలో సదా శ్రీహరినే భావించి పరిశుద్ధులైన వారందరు చిరంజీవులే. తుదకు దైత్యులలో శ్రీహరిని సదా ద్వేషించుదురాచారసంపన్నుడైన హిరణ్యకశిపునియొక్కకుమారుడైన భక్తప్రహ్లాదుని వీక్షింపుము. ఆయన సదా శ్రీహరి దివ్యగుణనామసంకీర్తన ధ్యానాదులందే తల్లీనుడై అఖండభక్తిప్రభావమువలన చిరంజీవియై కాలమునే జయించినాడు. అనేకానేక జన్మలతపఃఫల స్వరూపమున పుణ్యభారతవర్షములో జన్మించియు శ్రీహరిని కీర్తింపనివారు, ఆయనను సేవింపనివారు పరమమూర్ఖులని పాపాత్ములని గ్రహింపుము. వాసుదేవుని పరిత్యజించి విషయసేవనమందే లీను డగువాడు మహామూర్ఖుడు. స్వేచ్ఛానుసారముగ అమృతమును త్యజించి విషపాన మొనరించు అజ్ఞాని. ఈ భూతలముపై ఎవ రెవరికి స్త్రీ? ఎవ రెవరికి పుత్రుడు? ఎవ రెవరికి సోదరులు? ఎవ రెవరికి మిత్రులు? విపత్కాలములో శ్రీకృష్ణపరమాత్మదక్క అన్యు లెవరైనను ఎవరికిని బంధువులు కారు, సహాయకులు కారు. ఆజగన్నాథుడే తనభక్తజనులను సంకటములనుండి ఉద్ధరింపగలడు. కావుననే మహాత్ములు అహర్నిశములు శ్రీకృష్ణ దివ్యగుణనామసంకీర్తన మొనరింతురు; శ్రీకృష్ణపరమాత్మ జన్మలను, మృత్యువును, వార్ధక్యమును, రోగములను నివారింపగలడు, సర్వదుఃఖహారియైన పరమేశ్వరుడు, ఆనందమునే ఆనందింపజేయగల పరిపూర్ణతముడైన శ్రీకృష్ణుని దివ్యగుణనామసంకీర్తనమే కాలమును జయింపగల ఏకైకోపాయ మని గ్రహింపుము.

వత్సా! నాజ్ఞానమునకు గోచర మైనంతవరకు నిగూఢ మైనకాలగమన మును వర్ణించెద నవధరింపుము. కుమారా! నరలోకవాసులకు, పితృలోకవాసులకు, సురలోకవాసులకు, నాగలోకవాసులకు, బ్రాహ్మణులకు, రాక్షసాదులకుగూడ నిగూఢ మైన కాలజ్ఞానవిషయమును ఉపదేశింపబోవుచున్నాను సావధానచిత్తముతో ఆకర్ణింపుము. ఎవని రోమకూపములలో అసంఖ్యాకములైన విశ్వములు ఉన్నవో, సర్వమునకు పరమస్థానమైన, సర్వులకు ఆధారమైన మహావిరాట్ పురుషు డాతడే. అన్నింటికంటే పరమసూక్ష్మము పరమాణువు, పరమాణువుకంటే అత్యంతసూక్ష్మము మఱియొకటిగలదు. దానినే అనన్యభక్తియోగముద్వారా తెలిసికొనవలెను. కాలారంభమునకు సహిత మావల ఏవిధముగను ఊహింపనలవికాని తత్త్వ మొకటియున్నది, ఆతత్త్వమే చిట్టచివరిదనికూడ గ్రహింపుము. అన్నిటికంటే అతిసూక్ష్మమైన పరమాణువులోగూడ అసంఖ్యాకవిశేషము లుండును, అవి యన్నియు పరస్పరసంబంధము లేక వర్తించును. వాటికంటే ఆతత్త్వము అతిసూక్ష్మాతిసూక్ష్మము. వత్సా! పరమాత్మ యైన పరబ్రహ్మము అత్యంత సూక్ష్మరూపమున సర్వత్ర సదా విరాజిల్లుచు నుండును.

రెండు పరమాణువుల ప్రమాణకాలమునే ద్వ్యణుక మందురు, మూడు ద్వ్యణుకములు ఒకత్రసరేణు వగును, మూడు త్రసరేణువులను మనీషులు తృటి యనిరి. నూఱుతృటులు ఒకవేధ యగును, మూడువేధలు ఒకలవ మగును, మూడులవములు ఒకనిమేష మగును; మూడు నిమేషములు ఒకక్షణ మగును ఐదుక్షణములు ఒకకాష్ఠ మగును, పదికాష్ఠములు ఒకలఘు వగును, పంచదశలఘువులు ఒకదండ మగును.

నాలుగు మినపగింజలబరువు గలబంగారముచే చేయబడిన నాలుగు అంగుళముల పరిమాణముగలకమ్మిద్వారా ఆఱుపలములపరిమాణము గల రాగిపాత్రకు రంధ్రము చేయవలెను. దానిద్వారా ఆపాత్రలోనికి ఒకేప్రస్థర పరిమిత మగుజల మెన్నిక్షణములలో ప్రవేశించునో నీటిలోని కాపాత్ర యెన్ని క్షణములలో మునుగునో ఆకాలమును దండమందురు. అట్టి రెండుదండములే ఒక ముహూర్తము, అఱువది దండములకాలమే ఒకతిథి. తిథిలో ఎనిమిదవ భాగమే జాము, నాల్గుజాములు ఒకరాత్రి, మఱినాల్గుజాములు ఒకపగలు కాగలదు. పంచదశతిథు లనగపక్షము, రెండుపక్షము లొకమాసము. అవియే

శుక్లపక్షము, కృష్ణపక్షము. రెండుమాసములు ఒక ఋతు వగును, ఆఱు ఋతువు లొక సంవత్సర మగును. ఆఋతువులే వసంత, గ్రీష్మ, వర్ష, శరద్, హేమంత, శీతాకాలములు. వర్షము లైదువిధములని కాలనిరూపణ మొనరింపబడెను. అవియే సంవత్సరము, ప్రవత్సరము, ఇలావత్సరము, అనువత్సరము, వత్సరము. పండ్రెండు మాసములు ఒక అబ్ద మగును, ఆమాసము లేవనగ వైశాఖము, జ్యేష్ఠము, అషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తీకము, మార్గశీర్షము, పుష్యము, మాఘము, ఫాల్గుణము చైత్రము. చైత్రవైశాఖ మాసములు వసంతఋతువు, జ్యేష్ఠఆషాఢ మాసములు గ్రీష్మఋతువు, శ్రావణ భాద్రపద మాసములు వర్షఋతువు, ఆశ్వయుజ, కార్తికమాసములు శరదృతువులు, మార్గశీర్షపౌష్య మాసములు హేమంత ఋతువు, మాఘ పాల్గుణమాసములు శిశిరఋతువు.

ఒక అబ్దమునకు అయనములు రెండు. అవియే ఉత్తరాయణము, దక్షిణాయనము. మాఘాదులైన ఆఱుమాసములు ఉత్తరాయణము. శ్రావణాదులైన ఆఱుమాసములు దక్షిణాయనము. మాఘమాసము మొదలు ఆషాఢమువఱకు క్రమముగ దినము (పగలు) వృద్ధి నొందును. శ్రావణము మొదలు పుష్యమాసము వఱకు క్రమముగ రాత్రికాలము వృద్ధినొందును. పూర్ణిమాంతము వరకు శుక్లపక్ష మందురు, పూర్ణిమాంతము నుండి అమావాస్య వరకు కృష్ణపక్ష మందురు. ప్రథమము, ద్వితీయము, తృతీయము, చతుర్థి, పంచమి, షష్టి, సప్తమి, అష్టమి. నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, అమావాస్య లేక పూర్ణిమ, ఇవియే తిథులపేర్లు.

కుమారా! జీవుల ఆయుః ప్రమాణములను వర్ణించెద నవధరింపుము. నరుల యొక్క ఒకమాసము పితృలోకవాసులకు ఒకరాత్రి పగలు నగును. శుక్లపక్షమే వారికి దినము (పగలు) కృష్ణపక్షమే రాత్రి. నరుల యొక సంవత్సరము సురలకు ఒకరాత్రి పగలు నగును, ఉత్తరాయణమే పగలు, దక్షిణాయనమే రాత్రి. డెబ్బదియొక్క దివ్య చతుర్యుగములు ఒకమన్వంతర మగును, మనువు ఆయుర్దాయము ఇంద్రుని యాయుర్దాయముతో సమానము. ఇఱువదియైదు వేలయేబది మానవచతుర్యుగములుగతించిన ఇంద్రుని యాయుర్దాయము సంపూర్ణము కాగలదు. ఆకాలమే బ్రహ్మకు ఒకపగలు అంతకాలమే రాత్రియగును, అట్టి ముప్పది దినములు మాసమై, పదిరెండు మాసములు

సంవత్సరమై, అట్టి సంవత్సరములు నూఱుగతించిన బ్రహ్మ ఆయుర్దాయము పరిసమాప్తి కాగలదు. ఒకబ్రహ్మ పతన మైన వైకుంఠవాసులకు ఒకదినముతో సమానము,ఆకాలమె శ్రీహరికి ఒకనిమేష కాలము. వైకుంఠ శివ గోలోకము లకు సూర్యప్రకాశము అవసరము లేదు.ఆ్రదేశములలో సూర్యగతి లేదు. చిన్మయవ్యోమస్థితములైన ఆదివ్యలోకములు శ్రీకృష్ణపరమాత్మదివ్యాంగజనిత ములైన అఖండతేజపుంజములచే ఉద్భాసితము లగుచున్నవి. పరమాత్మ మందిరములోనికిజనిన యపుడే ఆలోకవాసులకు రాత్రి ఆజగన్నాథుడే కాల స్వరూపుడు, భగవంతుడు, పరమాత్మ, సచ్చిదానంద విగ్రహుడు.

కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము, ఇవియే నాల్గుయుగములు. ఉద్ధవా! కృతయుగకాల పరిణామము నాల్గువేలయెనిమిది వందల దివ్యసంవత్సరములు. అనగా దేవతలకు నాల్గువేలయెనిమిదివందల సంవత్సరములు గడచినపిమ్మట కృతయుగము సమాప్తము కాగలదు. పదు నేడులక్షలయిఱువదియెనిమిదివేలసంవత్సరములు కృయుగములోని మానవుల పరిమాణము. మూడువేల ఆఱువందల దివ్యసంవత్సరములు త్రేతాయుగ కాల పరిమాణము. పండ్రెండులక్షల తొంబదియాఱువేల సంవత్సరములు త్రేతా యుగములోని మానవుల కాల మనికాలకోవిదులు నిర్ణయించిరి. రెండువేల నాల్గువందల దివ్యసంవత్సరములు ద్వాపరయుగకాలము. ఎనిమిదిలక్షల అఱు వదినాల్గువేల సంవత్సరములు ద్వాపరయుగములోని మానవులకాలము. ఒక వేయి రెండువందల దివ్యసంవత్సరములు కలియుగకాలము. నాల్గులక్షల ముప్పదిరెండువేల సంవత్సరములు కలియుగములో మానవులకాల మని కాల విదులు నిర్ణయించిరి. ఉద్ధవా! చిన్మయవ్యోమములో నెల్లప్పుడునుండు అణు రహిత గోలోకాది దివ్యలోకములలో గ్రహగతి లేదు. రాశిచక్రము పరిభ్ర మింపదు. సూర్యచంద్రులగతి లేదు, అనగా ఆదివ్యలోకములలో కాలప్రభా వము లేనేలే దని గ్రహింపుము. ప్రాకృతికనిర్మితములైన ఈ యశాశ్వత బ్రహ్మాండములలో జన్మించుచు మరణించుచు జననమరణచక్రమున దగు ల్కొని దుఃఖించుజీవులు భక్తిజ్ఞానవైరాగ్యయుక్తులై హరినామసంకీర్తనచే పునీతులై ఈప్రాకృతిక లోకములనుండి దివ్యశరీరధారులై ఆనిత్యలోకము లకు వలసపోవలయును. ఇదియే జన్మరాహిత్యము. జన్మరాహిత్యమునకు

సులభమార్గము భక్తిప్రధానములైన జ్ఞానవైరాగ్యములే. భక్తిజ్ఞానవైరాగ్య ముల సమ్మిళితతత్త్వమే శ్రీకృష్ణపరమాత్మయందు మాకు గల మాధుర్య భక్తి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ జన్మఖండమందు రాధ ఉద్ధవునకు భవతరణోపాయము నుపదేశించుట యను తొంబదియాఱవ అధ్యాయము సంపూర్ణము.



## తొంబదియేడవ అధ్యాయము
## శ్రీ రాధోద్ధవ సంవాదము

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! ఉద్ధవుడు మఱలిపోవుట కుద్యుక్తుడగుట గాంచి శ్రీహరి ప్రియ మహాసతియగు రాధ సకలగోపికాసహితముగ సముద్విగ్నమైనది. ఆమెహృదయము దుఃఖభరితమయ్యెను. రాధ శీఘ్రమే సింహాసనముపై నుండి లేచినదియై ఉద్ధవునిమస్తకముపై తన దక్షిణహస్తము నుంచి శుభాశీస్సుల నొసంగెను. తదనంతరము కోమలదూర్వాంకురములను, అక్షతలను, శ్వేతధాన్య ములను, పుష్పములను, మంగళద్రవ్యములను, ఫలములను, పల్లవములను, దధి నవనీతక్షీరములను తీసికొనిరావలసినదిగ గోపికలనాజ్ఞాపించెను. సకలపదార్థము లను తెప్పించి రాధాదేవి ఉద్ధవునకు శుభార్థమై గంధమును, సిందూరమును, కస్తూరిని, చందనమును, ఫలపల్లవయుక్తము జలపూర్ణము సుశోభితమగు మంగళకలశమును, దర్పణమును, పుష్పమాలను, ప్రజ్వలితదీపమును, ఎఱ్ఱని చందనమును, పతీపుత్రవతియగుస్త్రీని, సువర్ణమును, రజతమును దర్శింప జేసెను. తదనంతరము దుఃఖితహృదయముతో మహాసాధ్వియగు రాధ, సాశ్రు పూర్ణలోచనుడై తనచరణకమలములపై బడిన ఉద్ధవుని గాంచి హితకరములైన, సత్యములైన, గోపనీయములైన మంగళవచనముల నిట్లుపలికెను.

రా ధా దే వి ప లి కె ను:-

వత్సా! నీమార్గము మంగళమయ మగుగాక! నీకు సదాశుభములే ప్రాప్తించుగాక! నీవు శ్రీహరినుండి అఖండజ్ఞానమును పొంది శ్రీకృష్ణుకు పరమప్రియభక్తుడ వయ్యెదవుగాక!

శ్లో॥ కృష్ణే భక్తిః కృష్ణదాస్యం వరేషు చ వరం వరమ్ ।
శ్రేష్ఠా పంచవిధా ముక్తేర్హరిభక్తిర్గరీయసీ ॥ 8

బ్రహ్మత్వాదపి వేదత్వాదిన్ద్రత్వాదమరాదపి ।
అమృతాత్ సిద్ధిలాభాచ్చ హరిదాస్యం సుదుర్లభమ్ ॥ 9

అనేకజన్మతపసా సమ్భూయ భారతే ద్విజ
హరిభక్తిం యది లభేత్ తస్య జన్మ సుదుర్లభమ్ ॥ 10

సఫలం జీవనం తస్య కుర్వతః కర్మణః క్షయమ్ ।
పితౄణాం చ సహస్రాణాం స్వస్య మాతుశ్చ నిశ్చితమ్ ॥ 11

మాతామహానాం పుంసాం చ శతానాం సోదరస్య చ ।
బాన్ధవస్యాపి పత్న్యాశ్చ గురూణాం శిష్యభృత్యయోః ॥ 12

శ్రీకృష్ణునియెడల అనన్యభక్తి, దాస్యము అనునవి సకలవరదానములందు ఉత్తమవరములు; ఎందువలననగ హరిభక్తి (సాలోక్య, సార్ష్టి, సామీప్య, సారూప్య, ఏకత్వము లను) ఐదువిధము లైనముక్తులకంటె కూడ శ్రేష్టము, అత్యంత మహత్వపూర్ణము. శ్రీహరిదాస్యము బ్రహ్మత్వముకంటె. దేవత్వముకంటె, ఇంద్రత్వముకంటె, అమరత్వముకంటె, అమృతముకంటె, సకలసిద్ధిలాభములకంటె అత్యంతశ్రేష్టము, పరమదుర్లభము. అనేకజన్మల తపఃఫలస్వరూపమున భారతవర్షములో జన్మించి హరిభక్తి లభించువానిజన్మ పరమదుర్లభము. తన కర్మలను క్షయమొనరించుకొన గలనావ్యక్తి తన జీవితమును సఫలమొనరించుకొనుటయేగాక, తన పితరులను, మాతృమూర్తులను, మాతామహులను, అసంఖ్యాలైన పూర్వజులను, సహోదరులను బంధువులను, పత్నిని, గురుజనులను, శిష్యులను, భృత్యులను నిశ్చయముగ పునీతులుగ నొనరించి ఉద్ధరింపగలడు.

శ్లో॥ తత్కర్మశోభనం వత్స యచ్చ కృష్ణే సమర్పణమ్ ।
తత్కర్మశోభనం శుద్ధం కృష్ణసన్తోషణం యతః ॥ 13

శ్లో॥ సంకల్పసాధనం కర్మ సమ్ప్రీతివిధిపూర్వకమ్ ।
తదేవ మఙ్గలం ధన్యం పరిణామసుఖావహమ్ ॥ 14

తద్ వ్రతం తత్తపః సత్యం తద్భక్తిః పూజనం తథా ।
తదుద్దేశ్యమనశనం కేవలం దాస్యకారణమ్ ॥ 15

వత్సా! శ్రీకృష్ణునకు సమర్పింపబడిన కర్మలే ఉత్తమకర్మలనిగ్రహింపుము : ఏకర్మలవలన శ్రీకృష్ణపరమాత్మ సంతుష్టుడగునో ఆకర్మలే అత్యంతశుద్ధములు, శోభనములు. శ్రీకృష్ణునకు అర్పింపబడి సంకల్పసిద్ధి నొసంగగల కర్మలే మంగళకరములు, ధన్యములు, పరిణామమందు సుఖప్రదములు : శ్రీకృష్ణప్రీతికొఱకు ఒనరింపబడినవ్రతములు, ఉపవాసములు, తపములు, సత్యభాషణము, భక్తి, పూజనములు, ఆరాధనలు నిశ్చయముగ ఆయనయనన్యదాస్యసౌభాగ్యప్రాప్తికి కారణములు కాగలవు.

సమస్తపృథివీదానం ప్రాదక్షిణ్యం భువస్తథా ।
సమస్తతీర్థస్నానం చ సమస్తం చ వ్రతం తపః ॥ 16

సమస్తయజ్ఞకరణం సర్వదానఫలం తథా ।
సమస్తవేదవేదాఙ్గపఠనం పాఠనం తథా ॥ 17

భీతస్థం రక్షణం చైవ జ్ఞానదానం సుదుర్లభమ్ ।
అతిథీనాం పూజనం చ శరణాగతరక్షణమ్ ॥ 18

సర్వదేవార్చనం చైవ వన్దనం జపనం మనోః ।
భోజనం విప్రదేవానాం పురశ్చరణపూర్వకమ్ ॥ 19

గురుశుశ్రూషణం చైవ పిత్రోర్భక్తిశ్చ పోషణమ్ ।
సర్వం శ్రీకృష్ణదాస్యస్య కలాం నార్హతి షోడశీమ్ ॥ 20

సమస్త పృథ్వీదానములు, భూ ప్రదక్షిణములు, సమస్త తీర్థస్నానములు, సమస్త వ్రతములు, తపములు, సమస్త యజ్ఞానుష్ఠానములు, సంపూర్ణ దానఫలములు, సమస్త వేదవేదాంగ పఠన పాఠనములు, ఆర్తత్రాణ పరాయణత్వము, పరమదుర్లభజ్ఞానదానము, అతిథిసత్కారము, శరణాగతరక్షణము సర్వదేవతలను అర్చించి వందనము లర్పించిన ఫలము, మనోజయము, పునశ్చరణపూర్వకముగ బ్రాహ్మణులకు దేవతలకు నివేదనముల నర్పించుట, గురుశుశ్రూష నొనరించుట, తల్లిదండ్రుల యెడల భక్తిగలిగియుండుట వారినిపాలించుట, పోషించుట మొదలగు సత్కర్మ లన్నియు శ్రీకృష్ణదాస్య సౌభాగ్యమునకు పదునాఱవ కళకైనను సరిరావు ;

శ్లో॥ తస్మాదుద్ధవ యత్నేన భజ కృష్ణం పరాత్పరమ్ ।
నిర్గుణం చ నిరీహం చ పరమాత్మాన మీశ్వరమ్ ॥ 21

నిత్యం సత్యం పరం బ్రహ్మ ప్రకృతేః పరమీశ్వరమ్ ।
పరిపూర్ణతమం శుద్ధం భక్తానుగ్రహవిగ్రహమ్ ॥ 22

కర్మిణాం కర్మణాం సాక్ష్యప్రదం నిర్లిప్తమేవ చ ।
జ్యోతిఃస్వరూపం పరమం కారణానాం చ కారణమ్ ॥ 23

సర్వస్వరూపం సర్వేశం సరసమ్పత్ప్రదం శుభమ్ ।
భక్తిదం దాస్యదం స్వస్య నిజసమ్పత్ప్రదమ్ ॥ 24

విసృజ్య జ్ఞాతిబుద్ధిం చ మాత్సర్యమశుభప్రదమ్ ।
భజ తం పరమానన్దం సానన్దం నన్దనన్దనమ్ ॥ 25

వేదే కైథుమీశాఖాయాం తస్య నామ్నాం సహస్రకమ్ ।
నన్దనన్దననామోక్తం కృతౌ విఘ్నం సుదుర్లభమ్ ॥ 26

కావున ఉద్ధవా! నీవు యత్నపూర్వకముగ ఆపరాత్పరుడైన శ్రీకృష్ణుని భజింపుము. ఆయన నిర్గుణుడు, ఇచ్ఛారహితుడు, పరమాత్మ, ఈశ్వరుడు, అవినాశి, అక్షరుడు, సత్యుడు, పరబ్రహ్మము, ప్రకృతికి అతీతుడు, పరమేశ్వరుడు, పరిపూర్ణతముడు, శుద్ధుడు భక్తానుగ్రహవిగ్రహుడు, సకల దేహధారులకర్మలకు సాక్షి, నిర్లిప్తుడు, జ్యోతిఃస్వరూపుడు, కారణములకు పరమకారణుడు, సర్వరూపుడు, సర్వేశ్వరుడు, సర్వసంపత్తి ప్రదాత, శుభదాయకుడు, యనన్యభక్తులకు భక్తి, దాస్యము, తనసంపత్తి ప్రసాదించు దైవము; కావున అశుభకరములైన మాత్సర్యాదులను, జ్ఞాతిబుద్ధిని విసర్జించి ఆనందపూర్వకముగ ఆపరమానంద స్వరూపుడైన నందనందనుని భజింపుము. వేదమందుగల కైథుమిశాఖలో ఆయన సహస్రదివ్యనామములు నందనందనుని నామములుగ వర్ణింపబడెను.

నారదా! యదార్థదివ్యజ్ఞానమనగ ఏదియో రాధముఖారవిందము నుండి శ్రవణ మొనరించి ఉద్ధవుడు పరమవిస్మితుడై సంపూర్ణ దివ్యజ్ఞాన పరిపూర్ణుడైనాడు. తదనంతర మాయన దండమువలె భూమిపై బడి సాష్టాంగ దండప్రణామములచే అనేకపర్యాయములు రాధాదివ్యచరణారవిందములకు నమస్కృతు లర్పించెను. ఆసమయమున భక్తిభావముచే ఉద్ధవునిసర్వాంగములు పులకరించినవి. ఆయన నేత్రములనుండి అస్రుధారలు ప్రవహింపనొడంగినవి.

ఆయన ప్రేమకు వశుడై రాధావియోగజన్యశోకమును తలంచి వ్యథితుడై ఉచ్చస్వరముతో రోదింపసాగెను. ఉద్ధవునియెడల ప్రేమగలరాధ, సకల గోపికలుకూడ దుఃఖింపసాగిరి. ఉద్ధవుడు అనన్యభక్తిసమన్వితుడై భక్తి భావముచే అచేతనుడై మూర్ఛిల్లెను. తత్క్షణమే రాధ ఉద్ధవుని కూర్చుండబెట్టి ఆయనముఖారవిందముపై జలకణములను జల్లి ఆయనకు చైతన్యమును ప్రసాదించెను. తదనంతర మామె 'వత్సా! చిరంజీవివి కమ్మ'ని ఉద్ధవుని ఆశీర్వదించెను. ఆపుడు ఉద్ధవుడు మూర్ఛనుండి సేదదీరినవాడై దుఃఖిత లైనగోపికలు గల సభామధ్యములో రాధతో పరమార్థప్రదము లైన వచనముల నిట్లుపల్కెను.

ఉద్ధవుడు పలికెను:

పరమదుర్లభమగు జంబూద్వీపము సకలద్వీపములందు ధన్యము, ప్రశంస నీయము; ఆద్వీపములో సర్వులు ఆకాంక్షించు శ్రేష్ఠభారతవర్షము కలదు. ఆహా! ఆ భారతవర్షములో శ్రీరాధా చరణకమల రజముచే పావనమై, స్పర్శచే పునీత మైన బృందావన మను పుణ్యవనము కలదు. సకలదేవతా వాంఛితమైన తీర్థపావనీ యగు శ్రీరాధ చరణకమల రజముచే పావనమైన ఆ బృందావనము త్రిలోకములందు ధన్యము, మాన్యము, శ్రేష్ఠము, పూజనీయము.

శ్లో॥ ధన్యో యశస్యో ద్వీపానాం జమ్బూద్వీపః సుదుర్లభః ।
యత్ర భారతవర్షం తు సర్వేషామీప్సితం వరమ్ ॥ 24

ఆహో! భారతవర్షే తు పుణ్యం బృన్దావనం వనమ్ ।
రాధాపాదాబ్జసంస్పర్శరజః పూతం సురేప్సితమ్ ॥ 25

ధన్యా మాన్యా చ పృథివీ త్రిషు లోకేషు పూజితా ।
రాధయా స్త్రీర్థపూతాయాః పాదాబ్జరజసా వరా ॥ 26

పూర్వకాలములో గోలోకవాసు లైన శ్రీరాధాకృష్ణులను దర్శింపవలె ననెడి యాకాంక్షచే బ్రహ్మపుష్కర క్షేత్రములలో వేదోక్త విధ్యనుసారముగ భక్తి సమన్వితుడై అఱువదివేల దివ్య సంవత్సరములు తప మొనరించెను. కానీ ఆసమయమున ఆయనకు (బ్రహ్మకు) గోలోకము కాని, రాధాకృష్ణులు కాని కలయందైనను గోచరము కాలేదు, తదనంతర మాయనను లీలాపూర్వక ముగ సత్యస్వరూపిణియైన ఆకాశవాణి ఇట్లాదేశించెను. "బ్రహ్మదేవా!

వరాహకల్ప మాసన్న మైనపుడు భారతవర్షములో పుణ్య బృందావన మధ్యమున పరమరమణీయ రాసోత్సవ సమయమున నీకు శ్రీరాధా కృష్ణులు నిస్సందేహముగ దివ్యదర్శన మొసంగ గలరు" ఆకాశవాణి నాలకించి బ్రహ్మ తపము చాలించి తనలోకమునకు మఱలి పోయెను. సమయ మాసన్న మైన పిమ్మట బ్రహ్మకు శ్రీకృష్ణదర్శనము లభించెను. శ్రీరాధాకృష్ణుల దర్శనమును పొంది హృదయము ప్రసన్నము కాగా ఆయన చిరకాల మనోరథము పరిపూర్ణమయ్యెను.

శ్లో॥ గోపానాం గోపికానాం చ సఫలం జన్మ జీవనమ్ ।
నిత్యం పశ్యన్తి తే పాదపద్మం బ్రహ్మాది దుర్లభమ్ ॥ 42
మాననీం రాధికాం సన్తః సదా సేవన్తి నిత్యశః ।
యోగీన్ద్రాశ్చ మునిన్ద్రాశ్చ సిద్ధేన్ద్రావైష్ణవా స్తథా ॥ 43
సతీం పుణ్యాం తీర్థపూతాం స్వతఃశుద్ధాం సుదుర్లభామ్ ।
సులభం యత్పదామ్భోజం బ్రహ్మాదీనాం సుదుర్లభమ్ ॥ 44

ఈ గోపకుమారుల, గోపికల జన్మలు, జీవనములు సఫలములైనవి, బ్రహ్మాదిదేవతలకు గూడ దుర్లభములైన శ్రీరాధా చరణకమలములను నిత్యము వీరు దర్శింతురు. యోగీంద్రులు మునీంద్రులు, సిద్ధేంద్రులు, వైష్ణవ భక్తులు మొదలగువారందఱు మాననీయురాలైన, పుణ్యస్వరూపిణియైన, సకల తీర్థపావనియైన స్వతఃశుద్ధురాలైన, అత్యంత దుర్లభ యైన రాధాదేవిని నిరంతరము సేవించు చుందురు. బ్రహ్మాదిదేవతలకైనను దుర్లభము లైన శ్రీరాధా చరణకమలములు వారికి అనన్య భక్తిదాస్యమువలన సులభముగ లభించును.

సర్వేశ్వరు డైన పరమాత్మ శ్రీకృష్ణుడు ఏదేవి చరణకమల నఖములను పారాణిచే అలంకరించెనో; గోలోకములో నున్న శతశృంగ పర్వతముపై రాసమండల మధ్యములో స్వయముగ శ్రీకృష్ణుడే సుదుర్లభ స్తోత్రముద్వారా ఏదేవిని స్తుతించెనో, స్వయముగ శ్రీకృష్ణుడే ఏదేవి చరణకమలములను కోమల దూర్వాంకురములతో, అక్షతలతో, గంధ చందనములతో, పారిజాత పుష్పములతో పూజించిరో; ఏదేవి ముప్పదియాఱు సఖులకు స్వామినియో, ముప్పదివేల కోట్ల గోపికలకు అధీశ్వరియో; ఆదేవి నామధేయమే రాధ, ఆమె శ్రీకృష్ణుని ప్రాణప్రియ, సకలదేవతలకు గూడ పరమపూజ్యురాలు. ఆసర్వ

శ్రేష్ఠురాలైన రాధాదేవిని ఏపాపి ద్వేషించునో, నిందించునో, పరిహాస మొనరించునో వానికి నూఱు బ్రహ్మహత్యా పాతకములు సంభవించును; ఇందు లేశమాత్ర మైనను సంశయము లేదు. అట్టిపాపి పాపఫల స్వరూపముగ కుంభీపాక రౌరవాది నరకములలో తన యేడు తరముల వారితో కలసి పదునల్గురింద్రుల ఆయుర్దాయము వఱకు దుఃఖముల ననుభవింపగలడు తదనంతరము ఆపాపాత్ముడు ఒకసహస్ర దివ్యవర్షముల పర్యంతము మలకీటకమై చివరకు కులటాయోని కీటకమై రక్తమలములను ఆస్వాదించుచు దుఃఖించును. ఆపాపాత్మునకు నిష్కృతి లేదు.

ఇట్లు రాధామాహాత్మ్యమును వర్ణించి ఉద్ధవుడు తన జననిని వీడిపో శోక మొందసాగెను. సాశ్రుపూర్ణ నయను డైనఉద్ధవుని గాంచి అఖండ కరుణాస్వరూపిణి, శ్రీకృష్ణవియోగ దుఃఖితురాలైన రాధ కన్నులనుండి అశ్రుధారలు ప్రవహించుచుండగ ఉద్ధవునితో మఱల ఇట్లు పల్కెను. "వత్సా! నీ విక మధురకు మఱలిపొమ్ము. మాధవుని జేరి మా శోకగాథలను వినిపింపుము. కుమారా! నాకు మఱల గోవిందుని దివ్యదర్శనము లభించునట్లు యత్న మొనరింపుము.

శ్లో॥ నిష్ఫలం చ గతం జన్మ గచ్ఛ మిథ్యా దురాశయా ।
ఆశా హి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖమ్ ॥ 66

మంచిది ఇక బయలుదేరుము, నాజన్మ మిథ్య, దురాశచే నిష్ఫలముగ గడచిపోయినది; ఆశయే పరమదుఃఖము, నిరాశయే పరమ సుఖము.

తదనంతరము రాధ గోవిందుని ధ్యానమందు సంలగ్నమై జీవన్మృతురాలైనది. హరివియోగమును భరింపలేని రాధ మఱల నయనములనుండి అశ్రుధారలు ప్రవహింపగా దుఃఖింపసాగెను. రోదించు రాధకు అనేక ప్రణామము లర్పించి అత్యంత దుఃఖిత హృదయముతో ఉద్ధవుడు యశోదా భవనమునకు బయలుదేరెను. నారదా! ఉద్ధవుడు మఱలిపోయినంతనె రాధ మఱల మూర్ఛిల్లెను. ఆమె చైతన్యము లుప్తమైనది. ఆమె సర్వప్రాణములు శ్రీకృష్ణుని ధ్యానమందు సంలగ్నమైనవి. మునీశ్వరా! అప్పుడు గోపికలు తమ కమల సదృశనేత్రములను అశ్రుజలములతో నింపుకొని రాధాదేవిని జలయుక్త కమలములశయ్యపై శయనింపజేసిరి. కాని, రాధస్పర్శ మాత్రముననే ఆమె అంగజనిత విరహజ్వాలలచే ఆ శయ్య భస్మమైనది

మణుల సఖులు రాధను సుకోమల స్థానముపై శయనింపజేసి చందనమిశ్రిత జలములను అమెపై సంప్రోక్షణ మొనరించిరి. కాని ఆసుగంధిత చందనయుక్త జలములు కూడ శ్రీకృష్ణవిరహ సంతప్తయగు రాధ శరీరమును దాకగనె శుష్కించినవి. ఆ సమయమున ఉద్ధవుడు లేని రాధ శ్రీకృష్ణునికై నిరీక్షించుచు క్షణ మొక యుగముగ గడుపదొడంగెను. రాధ "హా, ఉద్ధవా హా, ఉద్ధవా ! నీవు శీఘ్రముగ జని శ్రీహరికి నాదశను విన్నవించి నా ప్రాణేశ్వరు డైన శ్రీకృష్ణుని తోడ్కొని మఱలిరమ్మనుచు" పలవరింపదొడంగెను. అత్యంత సంతాపకారణమున మూర్ఛిల్లి దీనాలాపములు బల్కు రాధను గాంచి సకలగోపికలు ఆమెను హృదయమునకు హత్తుకొని రోదింపదొడంగిరి. తదనంతరము రాధకు శ్రీకృష్ణ దివ్యనామ సంకీర్తనచే స్మృతి కల్గించి గోపికలు ఆమె నూరడింప దొడంగిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని
శ్రీకృష్ణ జన్మఖండమందు శ్రీరాధోద్ధవ సంవాదమను
తొంబదియేడవ అధ్యాయము సంపూర్ణము.



# తొంబదియొనిమిదవ అధ్యాయము

## శ్రీకృష్ణ ఉద్ధవ సంభాషణము

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

నారదా! తదనంతరము ఉద్ధవుడు యశోదామందిరమును, జేరి ఆమెకు ప్రణామము లర్పించి శీఘ్రముగ హర్షయుక్తుడై మధురానగరమునకు బయలు దేరెను. గోకులములో గల ఖర్జూరకాననము వామభాగమునుండి పయనించి యమునాతటము జేరి పవిత్రయమునాజలములలో స్నాన మాచరించి ఆహారమును భుజించినవాడై మధురానగరము జేరు మార్గమున ప్రస్థాన మొనరించెను. మధురానగరము జేరి అంతఃపురములో ఏకాంతప్రదేశమున గల అక్షయవటవృక్షఛాయలో రత్నసింహాసనాసీనుడై యున్న గోవిందుని

గాంచెను. ఆసమయమున ఉద్ధవుడు అత్యంతశోకమగ్నుడై యున్నకారణమున నేత్రములనుండి అశ్రుధారలు ప్రవహింపగ దుఃఖింపదొడంగెను. ఉద్ధవుని రాకను, గాంచిన శ్రీకృష్ణుని మనస్సు ప్రఫుల్లమైనది. అపు డాయన మందస్మితముఖారవిందుడై ఉద్ధవు నిట్లు ప్రశ్నించెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :-

ఉద్ధవా! రమ్ము, రమ్ము, నీవు కుశలమేగదా? రాధ జీవించియే యున్నదా! విరహతాపముచే సంతప్తలైన, కళ్యాణమయులైన గోపికలు ఎట్లు జీవనమును గడపుచున్నారు? గోపబాలకులకు, గోవత్సములకు మంగళమే కదా? పుత్రవిరహముచే దుఃఖితురాలైన నాజనని యశోద ఎట్లున్నది! నిన్ను గాంచగనే నామాతృమూర్తి ఏమిపల్కెనో బాగుగ ప్రవచింపుము. నీవామె ప్రశ్నలకు ఏ యేసమాధానములను పల్కితివి? నాతల్లి నన్ను గురించి ఏమిపల్కెను? యమునాతటమును, బృందావన మనుపుణ్యవనమును, జనశూన్యమైన శీతల మంద సుగంధపవనములచే వ్యాప్తమైన రమణీయరాసమండలములను, కుంజకుటీరములచే పరివేష్టింపబడియున్న, మధుపముల ఝుంకారములచే సదాప్రతిధ్వనించు క్రీడాసరోవరమును, వికసిత కుసుమములచే పరిపూర్ణమై భాసించు పుష్పవాటికలను కన్నుల గరవుదీర దర్శించితివా! ఉద్ధవా! గోపబాలకులకు క్రీడాకేంద్రమైన భాండీరవనములో ఆత్యంతసఘనచాయను ప్రసాదించు వటవృక్షమును గాంచితివా? గోష్ఠములను, గోకులమును, గోవులసముదాయములను వీక్షించితివా! రాధ జీవించి యున్నచో నిన్ను గాంచగనే నా కేసందేశము బంపెను? సోదరా! అస్థిరమైన నామనస్సు నూరడించుటకు ఈసమాచారముల నన్నింటిని క్రమముగ వర్ణింపుము? గోపకుమారులు నీ కేమని జెప్పినారు? నాపితృసమానులైన గోపవృద్ధులు నా కేసందేశము బంపిరి? తండ్రీ! బలదేవునిజనని రోహిణీదేవి యేమిపల్కెను? తదితరప్రియబంధువుల పక్షు లేమనిరి? గోకులములో నీవు మధురభోజనమును భుజించితివా? యశోద, రాధ నీకు నేయే అపూర్వవస్తువులను ఉపహారములుగ ప్రసాదించిరి? వా రేవిధముగ సంభాషించిరి? వారి ప్రవచనము లెంతమధురములు? ఉద్ధవా! గోపకుమారులకు, గోపికలకు, గోపవృద్ధులకు, రాధకు, నాజనని యగు యశోదకు నాయెడల ఎటువంటి ప్రేమ కలదు? నాతల్లి నన్ను స్మరించుచున్నదా? జననిరోహిణి నన్ను జ్ఞాపకముచేసి

కొనుచున్నదా? ప్రేమవిరహముచే వ్యాకుల మైననారాధ నన్ను స్మరించుచున్నదా? గోపగోపికలు, గోపబాలకులు నన్ను తలంచుచున్నారా? నేను లేకపోయినను గోపబాలకులు భాండీరవనములో, వటవృక్షఛాయలో క్రీడించుచున్నారా? బ్రాహ్మణపత్నులు అర్పించిన అమృతోపమగు అన్నమును గోపగోపికలతో గలసి ఏప్రదేశములో భుజించితినో, ఆపవిత్రప్రదేశమును గాంచితివా? ఇంద్రయాగస్థలమైన గోవవర్ధనమును, బ్రహ్మగోవులను అపహరించిన ప్రదేశమును దర్శించితివా?

శ్రీకృష్ణపరమాత్మ ప్రశ్నించిన ప్రశ్నలన్నింటిని, ఆలకించి ఉద్ధవుడు శోకయుక్తములైన; మధురభరితములైన వచనములలో శ్రీకృష్ణునితో నిట్లు పల్కెను.

ఉ ద్ధ వు డు ప లి కె ను :-

నాథా! నీవు ఎవరెవరి నామములను స్మరించితివో, ఏ యే యుత్తమస్థలములను వర్ణించితివో వారిని, ఆపవిత్రస్థానములను ఇచ్ఛానుసారముగ, తనివిదీర దర్శించి ఈభారతవర్షములో జన్మించిననాజన్మను, నాజీవితమును సఫలమొనరించుకొంటివి. కృష్ణా! భారతవర్షమునకే సారరూపమైన, పుణ్యమయపవిత్రబృందావనక్షేత్రమును దర్శించి ధన్యుడనైతిని. వ్రజభూమిలో బృందావనమునకు సారస్వరూపమైన, పరమరమణీయరాసమండలమును గాంచితిని. రాసమండలమునకే సారస్వరూపిణులైన, గోలోకవాసినులైన శ్రేష్ఠగోపికలను దర్శించితిని. సకలగోపికలకు సారభూతయురాసేశ్వరి యైనరాధామాతను సందర్శించి చరితార్థుడ నైతిని. దీనజనబాంధవా! కదళీవనములో, ఏకాంతస్థలములో, చందనచర్చితజలయుక్తభూమిపై, కమలదళములశయ్యపై అత్యంతఖిన్నురాలై పడియున్నరాధను గాంచితిని. ఆమె రత్నాభరణములను త్యజించి కేవలము శ్వేతవస్త్రమును ధరించి అత్యంతమలినయై, దుర్బలయై ఆహారమును త్యజించి జీర్ణోదరయై వేడినిట్టూర్పులను విడచుచు నీవిరహముచే అత్యంతదుఃఖితురా లై నీదివ్యనామస్మరణయందే సదా సంలగ్నయైయున్నది. ఆమెసఖులు నిరంతరము శ్వేతచామరములచే, చందనాదులచే ఆమెసేవలయందు విమగ్నలై యున్నారు. రాధయొక్క విరహదుఃఖమును నేనేమనివర్ణింపగలను? ఇట్లు విరహతాపముచే పీడింపబడు శ్రీరాధ నీవు లేనిదే ఒకక్షణ మైనను జీవింపగలదా? ఆమెకు ఇది జలము, ఇది స్థలము రాత్రి, పగలు అను

బాహ్యజ్ఞానమే లేదు. ఎవరు మనుష్యులో, ఎవరు పశువులో; ఎవరు తనవారో ఎవరు పరులోయని గ్రహించు స్థితిలో కూడ ఆమె లేదు. రాధ బాహ్యజ్ఞాన శూన్యయై అహర్నిశములు నీచరణకమలధ్యానమందే నిమగ్నురాలై యున్నది. ఆమహాసాధ్వియశము త్రిలోకములందు ఉజ్వలముగ ప్రకాశించుచున్నది. ఆమె మరణముకూడ ఆఖండకీర్తిదాయకము. కాని జగన్నాథా! అజ్ఞానులైన దస్యులుకూడ ఈవిధముగ స్త్రీహత్య నొనరింపవలె ననిఆకాంక్షింపరు; కావున నీవు శీఘ్రముగ అభీష్టకదళీవనమునకు బొమ్ము, రాధ ననుగ్రహింపుము. పరమేశ్వరా! నీపరాయణయైన రాధను ఇడుముల బెట్టుట పాడిగాదు. ఆమె అన్నివిధముల పీడింపబడి అనాధయైనది.

శ్లో॥ న హి రాధా పరాభక్తా న భూతా న భవిష్యతి ॥ 30

కృష్ణా! రాధను మించిన అనన్యభక్తులు మఱియొకరు లేరు, ఉండరు, ఉండబోరు.

వసంతఋతువు, కిరణధారుడగు చంద్రుడు, సుగంధితపవనము ఆమెకు దాహకరములైనవి. ప్రతప్తసువర్ణమువలె ప్రకాశించు ఆమె అంగకాంతి ఈ సమయమున కాటుకవలె శ్యామలమైనది. ఆమె కృష్ణవర్ణ కేశములు సువర్ణము వలె మారిపోయినవి. ఆమె ఉత్తమ వస్త్రములను, శృంగారమును త్యజించి నీవిరహతాపమందే సంతప్తురాలై దుఃఖించుచున్నది.

శ్లో॥ స్వయం విధాతా త్వద్భక్తః సురాణాం ప్రవరో విభుః ॥ 34
త్వద్భక్తః శంకరో దేవో యోగీన్ద్రాణాం గురుర్గురుః ।
సనత్కుమార స్త్వద్భక్తో గణేశో జ్ఞానినాం గురుః ॥ 35
మునీన్ద్రాశ్చ శతవిధా స్త్వద్భక్తా ధరణీతలే ।
త్వద్భక్తా యాదృశీ రాధా న భక్తా స్తాదృశోఽపరః ॥ 36
జాయతే యాదృశీ రాధా స్వయం లక్ష్మీర్న తాదృశీ ।

శ్రీకృష్ణా! దేవతలయందు సర్వశ్రేష్ఠుడైన బ్రహ్మ నీభక్తుడు, యోగీంద్రులగురువులకే గురువైనశంకరుడు నీభక్తుడు. జ్ఞానులందు శ్రేష్ఠులైనగణేశ్వరుడు సనత్కుమారుడుకూడ నిన్ను భజింతురు. అవనిపై గల మునీంద్రులందరు నీదివ్యనామ సంకీర్తయందే సంలగ్నులై యుందురు. కాని రాధ విన్నే భక్తితో ఆరాధించునో అట్టి భక్తిగలిగిన భక్తుడు మఱియొకడు ఎచ్చటను లేడు. రాధ నీధ్యానమందు సంలగ్నరాలై యుండునట్లు లక్ష్మి కూడ నుండలేదు.

మహాభాగా! నీవు అవశ్యముగ అటు దెంచెదవని నేను రాధాసమక్షమున వాగ్దానమొనరించితిని; కావున నీవు నా ప్రార్థనలను మన్నించి శీఘ్రముగ గోకులమునకు జని రాధకు నీదివ్యదర్శన మొసంగి నావచనమును సార్థక మొనరింపుము.

ఉద్ధవుడు పల్కినవచనముల నాలకించి మాధవుడు నవ్వి వేదోక్తములైన, హితకరములైన, సత్యవ్రతసదృశములైన పల్కుల నిట్లుపల్కెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

ఉద్ధవా! నీవు చేసిన వాగ్దానమును నే నవశ్యముగ సఫలమొనరించెదను. నేను స్వప్నములో యశోదకు సకలగోపికలకు; రాధకు దర్శన మొసంగెదను. నాదర్శన మాత్రముననే వారు శోకమును పరిత్యజించి అఖండానందభరితులు కాగలరు.

శ్రీకృష్ణు డొసంగిన వాగ్దానమును గ్రహించి శోకమును వీడి ఉద్ధవుడు అత్యంతప్రసన్నుడై స్వగృహమునకు మరలిపోయెను. శ్రీకృష్ణపరమాత్మ స్వప్నములో యశోదకు, తదితరగోకులవాసులకు సాక్షాత్కరించి వారిదుఃఖములను నివారించి ప్రమోదమును ప్రసాదించెను. ఆసచ్చిదానందవిగ్రహుడు రాధాదేవికి స్వప్నములో గోచరించి ఆమెను అనేకవిధముల ఊరడించి ఆమెకు పరమదుర్లభజ్ఞానము నుపదేశించెను. స్వప్నములో గోపికలతో కలసి అనేక దివ్యక్రీడల నొనరించి వారిని సంతుష్టులునుగ నొనరించెను. నిద్రామగ్నురాలై యున్నయశోద స్తన్యపాన మొనరించి ఆమెకు అఖండతృప్తిని ప్రసాదించెను. గోపబాలకులకు గోపవృద్ధులకు దర్శనమొసంగి వారిని సమాధానపరచి అంతర్హితుడయ్యెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని
శ్రీకృష్ణ జన్మఖండములో శ్రీకృష్ణోద్ధవ సంవాదమను
తొంబదియెనిదవ అధ్యాయము సంపూర్ణము.



# తొంబదితొమ్మిదవ అధ్యాయము

## భగవంతుని ఉపనయన మహోత్సవములో శ్రీ గణేశ్వరుని అభిషేకము

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదా! సదా సంయమతత్పరుడు, యదువంశీయుల కులపురోహితుడు మహాతపస్వియు నగుగర్గమహర్షి వసుదేవుని భవనమున కరుదెంచెను. ఆమహాత్ముని శిరముపై జటలు, హస్తములలో దండము, ఛత్రము శోభిల్లుచున్నవి. ఆయన శుక్లయజ్ఞోపవీతధారియై శ్వేతదంతయుక్తుడై, శ్వేతవస్త్రధారియై బ్రహ్మతేజముచే ఉద్దీప్తుడగుచున్నాడు. మహర్షి యాగమనమును గాంచి దేవకీ వసుదేవులు రత్నసింహాసనములను డిగ్గినవారై భక్తిపూర్వకముగ ఆయన కనేకప్రణామము లర్పించి రత్నసింహాసనము నొసంగి సత్కరించిరి. తదుపరి మధుపర్కమును, కామధేనువును, అగ్నిశుద్ధవస్త్రములను అర్పించి చందన పుష్పమాలికలద్వారా ఆమహాత్ముని భక్తిభావసహితముగ పూజించిరి. తదనంతరము యత్నపూర్వకముగ ఆయనకు మృష్టాన్నములను, ఉత్తమపదార్థములను నివేదించి సుగంధతాంబూలము నొసంగి అతిథిసత్కార మొనరించిరి. దేవకీ వసుదేవులసేవలచే అత్యంతసంతుష్టుడై గర్గమహర్షి తల్లిదండ్రుల ననుసరించి యున్నశిశుప్రాయులైన బలరామకృష్ణులను గాంచి అంతఃకరణములోనే ప్రణామము లర్పించి దేవకీవసుదేవులతో నిట్లుపల్కెను. "వసుదేవా! బలరామ సహితుడై అనంతకోటిసూర్యప్రభలతో ప్రకాశించువిశుద్ధాచారసంపన్నుడు సర్వశ్రేష్ఠుడైన నీకుమారుడైన శ్రీకృష్ణుని గాంచుము. శ్రీకృష్ణుని వయస్సు ఉపనయనసంస్కారయోగ్యమైనది, కావున ఆవిషయమై తక్షణమే ఆలోచింపుము."

గర్గమహర్షి యాదేశము నాలకించ వినీతభావముతో వసుదేవు డిట్లు పల్కెను. "గురుదేవా! నీవు యదువంశజులకు పరమపూజ్యుడవైన ఆచార్య దేవుడవుకావున సత్పురుషులచే ప్రశంసనీయమైన, శుద్ధమైన ఉపనయన యోగ్యమైనశుభముహూర్తమును నిర్ణయించి ఆశుభ కార్యమునుసంపన్న మొనరింపుము." వసుదేవుని అభ్యర్థన నాలకించి అత్యంతసంతుష్టుడై గర్గమహర్షి ఇట్లుప్రత్యుత్తర మొసంగెను. "వసుదేవా! ఎల్లుండి శుభముహూర్తము; ఆదినమునకు చంద్రుడు సకలనక్షత్రములు అనుకూలములు, ఆదినము సత్పురుషులకుకూడ

ఇష్టమే. కావుని ముహూర్తమందే నీవు జగదానందకారకునకు ఉపనయన సంస్కార మొనరింపుము. ఆశుభమహోత్సవమునకు యత్నపూర్వకముగ సకల సామగ్రిని సంపాదించి సర్వబంధువులకు ఆహ్వాన పత్రికలను బంపుము".

గర్గమహర్షి యాదేశానుసారముగ ఆక్షణమందే వసుతుల్యుడైన వసుదేవుడు సకలబంధువులకు, దేవతలకు, మహర్షులకు ఆహ్వానపత్రికలను బంపెను. తదనంతరము దధినవనీతఘృతక్షీరమధువులను నదీనదప్రమాణములలో ఏకత్రితమొనరించెను.నానావిధోపహారరాసులను సంసిద్ధమొనరించెను.అంతియే కాదు మణులను, మాణిక్యములను, సువర్ణములను, రత్నములను, వజ్రములను, ఆభూషణములను, వస్త్రములను, అసంఖ్యాకములుగ ప్రోవుచేసెను. భక్తవత్సలుడైన శ్రీకృష్ణుడు కూడ తన మనసులో సకలదేవగణముసలను, మునీంద్రులను, శ్రేష్ఠసిద్ధులను, పరమభక్తులను స్మరించెను. శుభముహూర్తమాసన్నముకాగానే పరమాత్మ తలంచినవా రందరు ఆప్రదేశములో ఉపస్థితులైరి. మునిశ్రేష్ఠులు, బంధువులు, నరేశ్వరులు, దేవతలు, దేవకన్యలు, నాగకన్యలు, రాజకుమార్తెలు విద్యాధరులు, గంధర్వులు ఆమహోత్సవమునకు ఏతెంచిరి. వీరేగాక బ్రాహ్మణులు, యాచకులు, స్తోత్రపాఠకులు, యతులు, బ్రహ్మచారులు, సన్యాసులు, అవధూతలు, యోగులు నరుదెంచిరి. తదుపరి భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, అశ్వత్థామ, కృపాచార్యుడు, పత్నిపుత్రసహితముగ ధృతరాష్ట్రుడు, హర్షశోకసమాయుక్తహృదయముతో పుత్రసహితముగ కుంతి, విభిన్నదేశపాలకులు, రాజకుమారు లరుదెంచిరి. నారదా! వారేగాక అత్రి, వశిష్ఠుడు, చ్యవనుడు, మహాతపస్వి యగు భరద్వాజుడు, యాజ్ఞవల్క్యుడు, భీముడు, గార్గ్యుడు, వత్సుడు, పుత్రసహితుడగు ధర్మదేవత, జైగీషవ్యుడు, పరాశరుడు, పులహుడు, పులస్త్యుడు, అగస్త్యుడు, సౌభరి, సనక, సనందన, సనాతన, సనత్కుమారులు, ఓఢుడు; పంచశిఖుడు, దుర్వాసుడు, ఆఙ్గిరసుడు, వ్యాసుడు, వ్యాసనందనుడైనశుకదేవుడు, కుశికుడు, కౌశికుడు, పరశురాముడు, ఋష్యశృఙ్గుడు, విభాండకుడు; శృఙ్గుడు, వామదేవుడు, గుణసాగరుడైనగౌతముడు, క్రతువు, యతి, ఆరుణి, శుక్రాచార్యుడు బృహస్పతి, వామనుడు, పారిభద్రుడు, వాల్మీకి, పైలుడు, వైశంపాయనుడు, ప్రచేతనుడు, పురుజిత్తు, భృగువు, మరీచి, మధుజిత్తు, ప్రజాపతి యగు కశ్యపుడు, దేవమాతయైన అదితి, దైత్యజననియగు దితి, సుమంతును, సుభానుడు, ఏకుడు, కాత్యాయనుడు, మార్కండేయుడు,

లోమశుడు, కపిలుడు, పరాశరుడు, పాణిని, పార్గియాత్రుడు, మునివరుడైన పారిజాతుడు, సంవర్తుడు, ఉతథ్యుడు, వరుడు, నేను (నారాయణఋషి), విశ్వామిత్రుడు, శతానందుడు, జాబాలి, తైత్తిరి, యోగులకు, జ్ఞానులకు ఆచార్యుడైన బ్రహ్మసంభూతుడైన సాందీపని, ఉపమన్యువు, గౌరముఖుడు, మైత్రేయుడు, శృతశ్రవుడు, కథుడు, కచుడు, కరథుడు, ధర్మజ్ఞుడైనభరద్వాజుడు మొదలగు వారందరు శిష్యపరివారములతో వసుదేవునిగృహము చేరిరి. ఇందరు మహాత్ములను గాంచి దేవకీవసుదేవులు సాష్టాంగదండప్రణామము లర్పించిరి.

అసమయముననే హంసవాహనారూఢుడైన ప్రసన్నముఖుడైన బ్రహ్మ, రత్ననిర్మిత విమానారూఢుడై పార్వతీసహితముగ శంకరుడు స్వయముగ నంది, మహాకాలుడు, వీరభద్రుడు, సుభద్రకుడు, మణి భద్రుడు, పారిభద్రుడు, కార్తికేయుడు, గణేశ్వరుడు, ఐరావత గజరాజు నధిరోహించి మహేంద్రుడు, ధర్మదేవుడు, చంద్రుడు, సూర్యుడు, కుబేరుడు, వరుణుడు, పవనుడు, అగ్ని, సంయమనీపురాధిపతి యగు యముడు, జయంతుడు, నలకూబరుడు, సర్వగ్రహాధి దేవతలు, అష్టవసువులు, గణసహితముగ ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అనంతుడు మొదలగు వారందరు దయచేసిరి. వారిని గాంచి వసుదేవుడు భక్తిపూర్వకముగ శిరమువంచి అనేక ప్రణామము లర్పించెను. హర్షపులకిత గాత్రుడై, సాశ్రుపూర్ణలోచనుడై వసుదేవుడు ఆ దేవతాశ్రేష్ఠుల నిట్లు ప్రార్థింప దొడంగెను.

వ సు దే వు డు ప లి కె ను :

పరబ్రహ్మము, పరంధాముడు, పరమేశ్వరుడు, పరాత్పరుడు, లోక ప్రతిపాలకుడు, వేదోత్పాదకుడు, సృష్టికర్తయు, సృష్టికారణుడు, సనాతనదైవము నగు ఆబ్రహ్మదేవుడే స్వయముగ నాగృహమునకు దయచేసినాడు. ఆహా! నాసౌభాగ్యము. ఎవడు సకలదేవతలకు, మహర్షులకు, మునీంద్రులకు, సిద్ధేంద్రులకు ఆచార్యుడో, స్వప్నమందుకూడ ఎవనిచరణకమలదర్శనము క్షణమాత్రమునకైనను పరమదుర్లభమో, ఎవనిస్మరణమాత్రముననే సకలఅనిష్టములు తొలగిపోగలవో, ఆసదాశివుడు నాగృహమును పావనమొనరించెను, నేను చరితార్థుడనైతిని. ఎవరిస్మరణమాత్రముననే మనుష్యులు సమస్తసంకటములను

తరించిశుభయుక్తులు కాగలరో, సర్వప్రథమమున ఏదైవము పూజలొందునో ఎవరు సర్వదేవతలందు వరేణ్యుడో, ఎవనిని భక్తిపూర్వకముగ మంత్రముల ద్వారా కలశముపై ఆవాహనమొనరించిన మంగళములు కల్గునో, ఎవరు విఘ్న వినాశకుడో ఆగణేశ్వరుడు నాగృహమును పావనమొనరించెను. సకలదేవతా రాధకులైన కార్తికేయాదులందరు నాపై అనన్యకృపతో వేంచేసరి. సకలదేవ లకు పూజనీయురాలు పరాత్పరియు, సర్వశ్రేష్ఠురాలగు మహాలక్ష్మికూడ నాగృహమునకు వేంచేసినది. ఏదేవి సర్వలోకములకు అదిస్వరూపిణియో, సర్వ శక్తిస్వరూపిణియో, మూలప్రకృతియో, ఈశ్వరియో, పరాత్పరలయందు సర్వశ్రేష్ఠురాలో, పరబ్రహ్మస్వరూపిణియు, శరత్కాలములో ఏదేవిచరణ ములను భక్తిపూర్వకముగ ఆరాధించిన మనుష్యుడు తన అభీష్టసిద్ధిపొంద గలడో, ఏదేవి పరమాద్యయో, కృపామయియో, కృపాపరవశయై భారత భూమిపై అవతీర్ణమైనదో, ఆభక్తవత్సలయగు పార్వతీదేవి సర్వదేవతలతో, గణములతో, నాగృహమునకు వేంచేసి నన్ను తరింపజేసినది. దుర్గా! దేవి నీశుభాగమనమువలన నేను ధన్యుడనైతిని, కృతార్థుడనైతిని, నాజీవనము సఫలమైనది.

ఇట్లు వసుదేవుడు కంఠమునకు వస్త్రమును చుట్టుకొని హర్షపూర్వక ముగ క్రమముగ సంకలదేవతలను, మహర్షులను విప్రులను స్తుతించి వారికి రత్నసింహాసనముల నొసంగి సత్కరించెను. తదుపరి క్రమముగ అందరకు విధి పూర్వకముగ పూజ లొనరించెను. తదుపరి భక్తిభావహృదయసంపన్నుడై రత్నములను, మణులను, మాణిక్యములను, వజ్రములను, ఆభూషణములను, వస్త్రములను, సుగంధితచందనమును, పుష్పమాలికలను, బ్రహ్మాదిదేవతలకు, మహర్షులకు, బ్రాహ్మణులకు, పురోహితులకు, పురోహితప్రముఖుడైనగర్గ మహర్షికి సమర్పించెను. పిమ్మట ఆసభాసదులందరు, సభామధ్యమున అత్యున్నతరత్నసింహాసనముపై గణేశ్వరుని ప్రథమపూజకొఱకు ఆసీనునిగ నొనరించి సప్తతీర్థజలములచే పుష్పచందనయుక్తశీతలసువాసితస్వర్గగంగా జలములచే, పుష్కరపుణ్యమయజలములచే, సాగరజలములచే, పంచామృత ములచే, సువర్ణకలశములచే భక్తిభావసహితముగ, మంత్రపునశ్చరణపూర్వ కముగ అభిషేకమొనరించిరి, తదనంతరము వారు గణనాథునకు అగ్నిశుద్ధ వస్త్రములను, దివ్యరత్నవిభూషములను, పారిజాతపుష్పహారములను, గంధ

మును, చందనమును, కుసుమములను, రత్నమాలికలను, అంగుళీయకమును సమర్పించిరి. నారదా! తదనంతరము సమస్తదేవతలకు ఆధిపతి, శుభప్రదుడు, విఘ్నవినాశకుడు, శాంతస్వరూపుడు, పరమైశ్వర్యసంపన్నుడు, సనాతనుడు పార్వతీనందనుడునగు గణేశ్వరుని వసుదేవు డనేకవిధముల స్తుతించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని
శ్రీకృష్ణ జన్మఖండమందు భగవదుపనయనములో
గణేశాభిషేక మను తొంబది తొమ్మిదవ
అధ్యాయము సంపూర్ణము.



## నూఱవ అధ్యాయము

### భగవదుపనయనములో బ్రహ్మాదిదేవతలు భగవంతుని స్తుతించుట

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

నారదా! జగజ్జననియగు పార్వతీదేవి రాకనుగాంచి అదితి, దితి, దేవకి, రోహిణి, రతి, సరస్వతి, యశోద, లోపాముద్ర, అరుంధతి, అహల్య, తార, మొదలగునారీశిరోమణులు ప్రేమతో స్వాగతముపల్కినవారై, కుశల సమాచారములను ప్రశ్నించి, అనేకనమస్కారము లర్పించి ఆహ్వానించిరి. తదనంతరము వారందరు పార్వతిని తోడ్కొని రత్ననిర్మితభవనమున ప్రవేశించి పరమేశ్వరికి రత్నసింహాసన మర్పించి రత్నములచే, ఆభూషణములచే, వస్త్రములచే, పుష్పమాలికలచే సత్కరించి ఆమె ననేకవిధముల పూజించిరి, దేవకి జగన్మాత చరణారవిందములందు ఇంద్రుడు కొనితెచ్చిన పారిజాత పుష్పములను సమర్పించిరి. నుదుట సిందూరతిలకమునుంచి, లలాటముపై చందనబిందువులను రచించి, కస్తూరీకుంకుమాదులచే ఆమె నలంకరించిరి. ఆమెకు మృష్టాన్నభోజనముల నర్పించి, సువాశితశీతలజలములను, కర్పూరాదులచే సువాశితమైన శ్రేష్టతాంబూలమును సమర్పించిరి. పార్వతి చరణకమలములకు పారాణిని అలంకరించి శ్వేతవింజ్యామరలచే వీచుచు సేవించిరి.

ఉత్తమవ్రతపాలకా! నారదా! ఇట్లు దేవకీవసుదేవులు పార్వతి ననేక విధముల పూజించి తదనంతరము వారు క్రమముగ మునిపత్నులను, పతీ పుత్రవతీ సహితముగ స్త్రీలను, రాజకన్యకలను, దేవకన్యకలను, సౌందర్య సంపన్నురాండ్రైన నాగకన్యకలను, మునికన్యకలను, సహోదరబంధువుల కన్యకలను విధిగా పూజించిరి. వసుదేవుని యంతఃపురములో నానాప్రకార సుందరమంగళవాద్యములు మార్మ్రోగినవి. బ్రాహ్మణులు లేకత్రితులై సకల మంగళ కార్యములను సంపన్నమొనరించిరి. దేవకీవసుదేవులు, మధురానగరి లోని గ్రామదేవతలైన భైరవిని, మంగళచండిని, షష్ఠీదేవతలను షోడశోప చారముల ద్వారా పూజించిరి. వేదపండితులు సుమనోహరముగ వేదపఠనము చేయుచుండగ పుత్రవత్సలయగు దేవకి స్వర్గగంగాజలములచే పూర్ణమైన సువర్ణకలశమును హస్తములందు ధరించి శ్రీకృష్ణబలరాములను అభిషేకించిరి. తదుపరి దివ్యవస్త్రములచే, చందనాదిసుగంధద్రవ్యములచే, బహుమూల్య రత్ననిర్మితమనోహరాభూషణములచే దివ్యబాలకుల నలంకరించిరి. నారదా! ఇట్లు జననిద్వారా అలంకరింపబడి దివ్యాభరణవిభూషితులై శ్రీకృష్ణబలరాములు, సకలదేవతలు, మహర్షులు, రాజన్యులు, ప్రజలు ఆసీనులైయున్న దివ్యసభను ప్రవేశించిరి. జగదీశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మ సభాప్రవేశము చేయుటగాంచి స్వాయముగ బ్రహ్మ, శంకరుడు, ఆదిశేషుడు, ధర్మదేవత, సూర్యుడు మొదలుగా గలసకలసభాసదులు వినీతభావముతో లేచి నిలువబడి స్వాగతముపల్కిరి. జగన్నాథుని దివ్యసచ్చిదానందవిగ్రహమును దర్శింపగనే సకలదేవతలు, మహర్షిగణములు, కార్తికేయుడు, గణేశ్వరుడు, బ్రహ్మ, సదాశివుడు, అనంతాదులు, క్రమముగ పరమేశ్వరుడైన శ్రీకృష్ణు నిట్లు స్తుతింపదొడంగిరి.

## బ్రహ్మోవాచ

శ్లో॥ నాథానిర్వచనీయోఽసి భక్తానుగ్రహవిగ్రహ ।
వేదానిర్వచనీయం చ కస్త్వాం స్తోతుమిహేశ్వరః ॥ 19

జగన్నాథా! నీవు అనిర్వచనీయుడవు, భక్తానుగ్రహ విగ్రహుడవు, వేదములు కూడ నిన్ను వర్ణింపలేక పోయినవి, సకలమహేశ్వరుడవైన నిన్ను నే నేమని స్తుతింపగలను ?

## శ్రీ మ హా దే వ ఉ వా చ

శ్లో॥ దేహేషు దేహినం శశ్వత్ స్థితం నిర్లిప్తమేవ చ ।
కర్మిణాం కర్మణాం శుద్ధం సాక్షిణం సాక్షితం విభమ్ ॥
కిం స్తౌమి రూపశూన్యం చ గుణశూన్యం చ నిర్గుణమ్ ॥ 20

దేవా ! దేహధారుల దేహములందు నిర్లిప్తుడవై సదాయుండువు కర్మ లాచరించువారి యందు, సకల కర్మలకు సాక్షివై విరాజిల్లు చున్నావు, రూపశూన్యుడ వైన, గుణసూన్యుడవైన, నిర్గుణుడవైన నిన్ను నే నేమని స్తుతింపగలను ?

## శ్రీ అ న ం త ఉ వా చ

శ్లో॥ కిం వా జానామ్యహం నాథ త్వామజ్ఞోఽనన్తమీశ్వరమ్ ।
అనన్తకోటిబ్రహ్మాణ్డకారణం దుఃఖతారణమ్ ॥ 21

మహావిష్ణోశ్చ లోమ్నాం చ వివరేషు జలేషు చ ।
సన్తి విశ్వాన్యసంఖ్యాని చిత్రాణి కృత్రిమాణి చ ॥ 22

సన్తి సన్తశ్చ దేవాశ్చ బ్రహ్మవిష్ణు శివాత్మకాః ।
త్వదంశా ప్రతిబిమ్బేషు తీర్థాని భారతం తథా ॥ 23

బ్రహ్మాణ్డైక స్థితోఽహం చ సూక్ష్మనాగస్వరూపకః ।
స్థాపితశ్చ త్వయా కూర్మే గజేన్ద్రే మశకో యథా ॥ 24

పరమాణుపరం సూక్ష్మం విశ్వేషు నాస్తి కుత్రచిత్ ।
మహావిష్ణోః పరం స్థూలం సమో నాస్తి చ కుత్రచిత్ ॥ 25

మహావిష్ణోః పరస్త్వం చ తత్పరో నాస్తి కశ్చన ॥
స్థూలాత్ స్థూలతరో దేవః సూక్ష్మాత్ సూక్ష్మతమో మహాన్ ॥ 26

ఆధారశ్చ మహావిష్ణోర్జలాధారో భవాన్ స్వయమ్ ।
జలాధారో హి గోలోక స్త్వం చ స్థావరరూపధృక్ ॥ 27

సర్వాధారో మహాన్ వాయుః శ్వాసనిఃశ్వాసరూపకః ।
భక్తానుగ్రహదేహస్య నిత్యస్య భవతో విభోః ॥ 28

వక్త్రైర్సహస్రైర్ధ్యాఽథ త్వయా దత్తైః పురైవచ ।
స్తోతుమిచ్ఛామి త్వద్యోగం న దత్తం జ్ఞానమైశ్వరమ్ ॥ 29

శ్రీ అనంతుడు పలికెను:-

అనంతకోటిబ్రహ్మాండకారణా! సకలదుఃఖహరణా! అజ్ఞానినైన నేను సర్వేశ్వరుడవైననిన్నేమి తెలిసికోగలను? మహావిష్ణురోమకూపములలో నున్న జలములలో చిత్రములైన, కృత్రిమములైన, అసంఖ్యాకవిశ్వములు నిండి యున్నవి. ఆయసంఖ్యాక విశ్వములలోగల అసంఖ్యాకదేవతలు, బ్రహ్మవిష్ణు శివాదులు నీయంశసంభూతులు, నీప్రతిబింబములు, పుణ్యతీర్థమైన భారత వర్షమందు కలవారుకూడ నీప్రతిబింబములే. సూక్ష్మనాగస్వరూపుడనై నేను బ్రహ్మాండమునందు నీకృపవలన నున్నాను. మహాకూర్మమును, గజేంద్రములను మశకములవలె నీకరుణవలనే అవలీలగ ధరింపగల్గుచున్నాను.

పరమాణువుకంటె సూక్ష్మమైనది ఈవిశ్వములో మఱియొకటిలేదు. మహావిష్ణువుతో సమమైన స్థూలస్వరూపము మఱియొకటి ఎక్కడైనను లేదు. అట్టి మహావిష్ణువుకంటె నీవు అతీతుడవు. నీకంటె అతీతమైనవి మఱియొకటి లేదు. దేవా! నీవు స్థూలముకంటె అత్యంతస్థూలతముడవు, సూక్ష్మముకంటె అత్యంత సూక్ష్మతముడవు. దేవా! నీవే జలరూపధారివై ఆమహావిష్ణువునకే ఆధారమైయున్నావు. ఈజలములకు ఆధారమైన గోలోకపరంధామము నీవే. ఆగోలోకములో స్థావరరూపమున నీవేయున్నావు. భక్తానుగ్రహదేహధారివైన, నిత్యుడవైన నీశ్వాసలనుండి ఆవిర్భవించిన మహావాయువు సర్వులకు ఆధారము. దేవా! నాకు ఈయనంతముఖములను నీవే ప్రసాదించితివి, ఈయనంతముఖము లతో సదా నిన్నే స్తుతింపవలెనని నేను సదా అభిలషించెదను.

దేవా ఊచుః

శ్లో॥ త్వామనన్తం యది స్తోతుం దేవోఽనన్తో న హీశ్వరః ।
న హి స్వయం విధాతా చ న హి జ్ఞానాత్మకః శివః ॥
సరస్వతీ జడీభూతా కిం కుర్మః స్తవనం వయమ్ ॥ 30

దేవా! నీవు అనంతుడవు. స్వయముగ విధాత యైనను, జ్ఞానాత్మకు డైనశివు డైనను, ఈశ్వరు డైనను, అనంతు డైనను, నిన్ను స్తుతింపలేరు, నిన్ను స్తుతించుటలో సరస్వతి యైనను జడురాలు కాగలదు. అట్టి నిన్ను మే మేమని స్తుతింపగలము?

### మునీన్ద్రా ఊచుః

శ్లో॥ వేదా న శక్తాః స్తోతుం చేత్త్వాం చైవ జ్ఞాతుమీశ్వరమ్ ।
వయం వేదవిదః సన్తః కిం కుర్మః స్తవనం తవ ॥ 31

పరమాత్మవైన, ఈశ్వరుడవైన నిన్ను స్తుతించుటలో వేదములు సహితము అశక్తము లైనచో వేదవిదులమైనమేము ఏమని స్తుతింపగలము?

శ్లో॥ ఇదం స్తోత్రం మహాపుణ్యం దేవైశ్చ మునిభిః కృతమ్ ।
యః పఠేత్సం యతః శుద్ధః పూజాకాలే చ భక్తితః ॥ 32

ఇహలోకే సుఖం భుక్త్వా లబ్ధ్వా జ్ఞానం నిరంజనమ్ ।
రత్నయానం తమారుహ్య గోలోకం స చ గచ్ఛతి ॥ 33

దేవతలు, మహర్షులు నొనరించిన మహాపుణ్యప్రదమైన ఈస్తోత్రమును సంయతచిత్తులు, శుద్ధులునై భక్తితో పూజాకాలములో పఠించువారు ఇహలోకములో సుఖముల ననుభవించి నిరంజన మైనజ్ఞానమును పొంది అంత్యకాలమున రత్నవిమానము నధిరోహించి గోలోకము చేరెదరు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని
శ్రీకృష్ణ జన్మఖండమందు భగవదుపనయనములో
బ్రహ్మాదులు భగవంతుని స్తుతించుట యను
నూఱవ అధ్యాయము సంపూర్ణము.



## నూటయొకటవ అధ్యాయము
## శ్రీరామకృష్ణుల ఉపనయన మహోత్సవము

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :-

మునీశ్వరా! ఇట్లు సకలదేవతలు, మహర్షులు తమతమ మనస్సులందే అనేక విధముల శ్రీకృష్ణుని స్తుతించి సభామధ్యమున పీతాంబరములను ధరించి శోభించు శ్రీకృష్ణపరమాత్మను కన్నులగరవుదీర దర్శించిరి. మెరపుతో కలసిన నూతనజలధరకాంతిసమన్వితు డైనఆనీలమేఘశ్యాముని అఖండఅలౌకిక దివ్య

సౌందర్యము నేనేమనివర్ణింపగలను? బాల శ్రీకృష్ణుడు జలధర దేహుడు, సరసీరుహాక్షుడు, విశాలవక్షుడు, మాళిపించకిరీటధారి, కమనీయకటిసూత్రకంకణ కేయూరసమన్వితుడు, శ్రీవత్సలాంఛనాంచితవిహారుడు, సువర్ణకుండల ప్రభాయుతకుంతలలలాటుడు, యశంబుల దిక్కుల జల్లెడివాడు, వేణునాద వినోది, చతురనటమూర్తి, గోపాలచక్రవర్తి. నారదా! ఆబాలుని పూర్ణేందు రుచిరజాలుని, భక్తలోకపాలకుని, సుగుణాలవాలుని, కృపావిశాలుని జూచి తిలకించి, పులకించి సకలసభాసదులు చోద్యమొందిరి. ఆరాధాకాంతుడు, శ్యామలశరీరుడు, కమనీయమనోహరరూపధారి, మందస్మితముఖారవిందుడై, అనుజబలరామసహితుడై వసుదేవుని యంకముపై ఆసీనుడయ్యెను.

తదనంతరము లగ్నాధిపతి ఉచ్ఛస్థానములో నుండెను. దానికి శుభగ్రహములదృష్టి కేంద్రీకరింపబడుచుండెను. అట్టి శుభముహూర్తమున సకల దేవతల, మహర్షుల, బ్రాహ్మణుల అనుజ్ఞ పొంది వసుదేవుడు ఉపనయన మంగళకార్యమును సంపన్నమొనరించెను. పరమాత్మయొక్క ఉపనయనమహోత్సవములో వసుదేవుడు పురోహితులకు ఆదరముగ వందలకొలది సువర్ణములను దానముచేసెను. సకలదేవతలకు, మహర్షులకు, పురోహితశ్రేష్ఠుడైన గర్గమహర్షికి, గణేశ్వరునకు, సూర్యునకు, అగ్నికి, శంకరునకు, పార్వతికి అనేక ప్రణామము లర్పించెను. తదుపరి ఆదేవసమాజములో ప్రకాశించు అర్హులు ప్రధానదేవతలకు (గణేశ్వరుడు, విష్ణువు, శివుడు, సూర్యుడు, అగ్ని, పార్వతి) భక్తిపూర్వకముగ అక్షతసహితముగ షోడశోపచారముల నర్పించి పూజించెను. వేదమంత్రోచ్చారణపూర్వకముగ పుత్రులకు అధివాసనమును (సుగంధపదార్థానులేపనము అనగ హారిద్రాకార్యము) ఒనరించెను. సకలదేవతలకు, దిక్పాలకులకు, నవగ్రహములకు అనేకపూజల నొనరించి, షోడశమాతృకలకు భక్తిపూర్వకముగ పంచోపచారములను సమర్పించెను. ఘృతముచే ఏడుపర్యాయములు వసుధారనొనరించి, చేదిరాజైనవసువును పూజించి, నమస్కరించి వృద్ధిశ్రాద్ధమును సంపన్నమొనరించి అన్యదైవకార్యములను సంపన్నమొనరించెను.

తదనంతరము వేదోక్తయజ్ఞమాచరించి వసుదేవుడు శ్రీకృష్ణాగ్రజుడైనబలదేవునకు, శ్రీకృష్ణునకు యజ్ఞసూత్ర (జన్నిదము) ముల నలంకరించిరి. సాందీపనిమహర్షి ఆయిద్దరుదివ్యబాలకులకు మంగళవాద్యములు మ్రోగుచుండగ ఓంకారహుంకారశబ్దములమధ్య పవిత్రదివ్యగాయత్రీమంత్రము నుప

జేసెను. జగన్నాథుని ఉపనయనము అఖండమంగళప్రదముగ సంపన్నమైనది. ప్రథమమున పార్వతి మహాదరముతో బహుమూల్యరత్ననిర్మితపాత్రలో ముత్యములను, మాణిక్యములను, వజ్రములను ఉంచి శ్రీకృష్ణునకు, బలదేవునకు భిక్ష నొసంగెను. వసుదేవుడు ఆసహోదరులకు వజ్రనిర్మితహారములను. శ్వేతపుష్పములను, దూర్వాంకురములద్వారా శుభాశీర్వాదములను నొసంగెను. తదనంతరము అదితి, దితి, మునిపత్నులు, దేవకి, యశోద, రోహిణి, సావిత్రి, సరస్వతి మొదలగువారందరు హర్షహృదయలై అనేకమణులను సువర్ణములను భిక్షగ నొసంగిరి. దేవకన్యలు, నాగకన్యలు, రాజకన్యలు, పతివ్రతలు, ఋషిపుత్రులస్త్రీలు, ఇంద్రాణి, వరుణపత్ని, పవనపత్ని, కుబేరపత్ని, స్వాహా, రతి మొదలగువారు అనేకరత్నాభరణములచే విభూషితమైన భిక్షల నొసంగిరి. అప్పుడు బలరామసహితముగ శ్రీకృష్ణుడు భక్తిపూర్వకముగ సర్వులొసంగిన భిక్షను సాదరముగ స్వీకరించి అందులో కొంతభాగము పురోహితశ్రేష్ఠుడైన గర్గమహర్షికి దక్షిణగనొసంగి మిగిలినది ఆచార్యసాందీపనిమహర్షి కొసంగెను. వైదికకార్యమును సంపన్నమొనరించి వసుదేవుడు గర్గమహర్షిని అమూల్యదక్షిణలతో సత్కరించెను. వసుదేవుని గృహములో ఆదరపూర్వకముగ సకలదేవతలకు, మహర్షులకు, బ్రాహ్మణులకు, ప్రజలకు దివ్యసంతర్పణ గావింపబడెను. ఉపనయనమహోత్సవమున కరుదెంచిన వారందరు శ్రీకృష్ణబలరాములను హృదయపూర్వకముగ ఆశీర్వదించి ప్రసన్నులై తమతమనిలయముల కరిగిరి.

అప్పుడు యశోదానందులు బలరామశ్రీకృష్ణులను అంకమున జేర్చి వాత్సల్యభక్తిసమన్వితులై వారిదివ్యముఖారవిందములను తనివితీర చుంబించిరి. [illegible] ఏడి వ్రజమునకు జనవలె ననుతలంపురాగానే వారిద్దరు ఉచ్ఛ్వాసముతో దుఃఖింపదొడంగిరి. పుత్రవాత్సల్యముతో పరితపించు తలిదండ్రులను గాంచి శ్రీకృష్ణపరమాత్మ వారికి ఆశ్వాసన మొసంగి ఇట్లూరడించెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :-

తండ్రీ! నీవు నాకు పరమార్థముగ పితృదేవుడవు, నాతల్లి యశోదయే యశోదా! నీవు నన్ను పాలించి పోషించినమాతృదేవతవు. తలిదండ్రులారా! మీరు ప్రసన్నులై వ్రజమును జేరుడు. నేను బలరామసహితుడనై, వేదవిద్యార్థినై సాందీపనిమహర్షిని సేవించుటకు అవంతీనగరమునకు ప్రస్థానమొన

రించెదను. అచిరకాలములోనే విద్యాసంపన్నుడనై మఱలి వచ్చి మిమ్ములను దర్శింపగలను. తల్లీ! కాలమే దేహధారులకుసమాగమమును కలుగజేయును, ఆకాలమే వియోగమును సంభవింపజేయును. మనుష్యులకు ఏ యే వియోగములు, సంయోగములు, దుఃఖములు, శోకములు, శుభములు మొదలగునవి సంభవించునో వానియన్నింటికి కారణము కర్త కాలమే. తల్లీ! నేను ఏదివ్యతత్త్వమును తండ్రిగారికి ఉపదేశించితినో, ఆతత్త్వము పరమయోగులకైనను దుర్లభము. వారు ఆనందపూర్వకముగ నీకు నే నుపదేశించినతత్త్వమును ప్రవచింపగలరు.

ఇట్లు యశోదానందులను ఊరడించి జగదీశ్వరుడైన శ్రీకృష్ణుడు దేవకీవసుదేవులయనుజ్ఞ గైకొని అనుజసహితముగ విద్యార్థియై సాందీపని మహర్షి యాశ్రమమునకు ప్రస్థానమొనరించెను. తదనంతరము యశోదానందులు వినయపూర్వకముగ దేవకీవసుదేవులతో సంభాషించి దుఃఖితహృదయములతో వ్రజమునకు మఱలిపోవ బయలుదేరిరి. అపుడు యశోదానందులను దేవకీవసుదేవులు ముక్తామణులతో, సువర్ణములతో, మాణిక్యములతో, వజ్రములతో, అగ్నిశుద్ధవస్త్రములతో, రత్నములతో, అనేకోపహారములతో సత్కరించిరి. వసుదేవుడు నందునకు ఆదరపూర్వకముగ శ్వేతాశ్వములను, గజరాజును, సువర్ణనిర్మితమైన ఉత్తమరథమును అర్పించెను. యశోదానందులు రథారూఢులై వ్రజమునకు బయలుదేరగా యమునాతటమువరకు వారిని బ్రాహ్మణులు, దేవకీవసుదేవులు, అంతఃపురస్త్రీలు, ప్రముఖమహిళలు, ప్రజలు, అక్రూరుడు, ఉద్ధవుడు మొదలగువారందరు అనుసరించిరి. యమునాతీరముపై యశోదానందులను వీడిరాలేక మధురాపురివాసులు దుఃఖితులైరి. తదనంతరము వారందరు పరస్పరము ధైర్యముచేసుకొని తమతమగృహముల కరగిరి.

మునీశ్వరా! ఉపనయనమహోత్సవము పరిసమాప్తమైనపిమ్మట కుంతీదేవి వసుదేవునినుండి అనేకానేకరత్నములను, మణులను, సువర్ణములను ఉపహారములుగ బొంది వసుదేవునియనుజ్ఞ గైకొని పుత్రసహితముగ స్వస్థలమునకు బయలుదేరెను. వసుదేవుడు దేవకీనందనుని శుభముగోరి అనేకరత్నములను, మణులను, మాణిక్యములను, వస్త్రములను, సువర్ణములను, ముత్యములను, వజ్రహారములను, మృష్టాన్నములను హర్షపూర్వకముగ బ్రాహ్మణు

లకు, స్తోత్రపాఠకులకు, యాచకులకు దాన మొనరించెను. యత్నపూర్వకముగ మహోత్సవ మొనరించి అఖండహరినామసంకీర్తన, వేదపఠనము గావించెను. తదుపరి యాదవులను యథోచితముగ మనోహరమణిమాణిక్యవజ్రముత్యములచే, వస్త్రములచే సత్కరించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని
శ్రీకృష్ణ జన్మఖండమందు శ్రీరామకృష్ణుల ఉపనయన
మహోత్సవమను నూటయొకటవ అధ్యాయము
సంపూర్ణము.



# నూటరెండవ అధ్యాయము
## శ్రీరామకృష్ణుల విద్యాభ్యాసము

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

బ్రహ్మకులసంభవా! నారదా! శ్రీకృష్ణపరమాత్మ అనుజు డగు బలరామునితో హర్ష సమన్వితహృదయుడై, విద్యార్థియై సాందీపనిమహర్షి యాశ్రమమును జేరి గురుదేవునకు, గురుపత్నికి అనేకనమస్కారముల నర్పించి బహుమానరూపముగ అసంఖ్యాకరత్నమణిమాణిక్య సువర్ణములను సమర్పించి, వారి శుభాశీర్వాదములను పొంది యథోచితవచనముల నిట్లుపల్కెను. "విప్రశ్రేష్ఠా! మీయనుగ్రహమునకు పాత్రులమై మేము అభీష్టవిద్యలను అభ్యసింపవలెనని అభిలషించుచున్నాము. కావున శుభముహూర్తము నిశ్చయించి మాకు యథోచితరూపముగ విద్యాదాన మొనరింపవలసినదిగ మిమ్ముల ప్రార్థించుచున్నాము." అపుడు సాందీపనిమహర్షి బ్రహ్మానందభరితుడై తన యతులిత సౌభాగ్యమును వేనోళ్ళ ప్రశంసించుకొనుచు 'ఓం స్వస్తి' యనిబలరామకృష్ణుల ప్రార్థనలను అంగీకరించెను. తదనంతరము ఆమహర్షి అనుజసహితుడై త్రిలోకైకనాథునకు జగన్నాథునకు మధుపర్కమును, గోవులను, వస్త్రములను అర్పించి చందనానులేపన మొనరించి, మృష్టాన్నములను బెట్టి, సుగంధితతాంబూలము నొసంగెను. ఆనందము పట్టలేక ఆమహర్షి సకలలోకాలోకపరమేశ్వరు నిట్లు స్తుతింపనారంభించెను.

సాందీపని పలికెను:-

శ్లో॥ పరం బ్రహ్మ పరం ధామ పరమేశ పరాత్పర ।
స్వేచ్ఛామయం స్వయంజ్యోతిర్నిర్లిప్తైకో నిరంకుశః ॥ 6

భక్తైకనాథ భక్తేష్ట భక్తానుగ్రహవిగ్రహ ।
భక్తవాంఛాకల్పతరో భక్తానాం ప్రాణవల్లభ ॥ 7

మాయయా బాలరూపోఽసి బ్రహ్మేశశేషవన్దితః ।
మాయయా భువి భూపాల భువో భారక్షయాయ చ ॥ 8

యోగినో యం విదిన్త్యేయం బ్రహ్మజ్యోతిః సనాతనమ్ ।
ధ్యాయన్తే భక్తనివహా జ్యోతిరభ్యన్తరే ముదా ॥ 9

ద్విభుజం మురళీహస్తం సున్దరం శ్యామరూపకమ్ ।
చన్దనోక్షితసర్వాఙ్గం సస్మితం భక్తవత్సలమ్ ॥ 10

పీతామ్బరధరం దేవం వనమాలా విభూషితమ్ ।
లీలాపాఙ్గతరఙ్గైశ్చ నిన్దితానఙ్గ మూర్ఛితమ్ ॥ 11

అలక్తభవనం తద్వత్పాదపద్మం సుశోభనమ్ ।
కౌస్తుభోద్భాసితాఙ్గం చ దివ్యమూర్తిం మనోహరమ్ ॥ 12

ఈషద్ధాస్యప్రసన్నం చ సువేషం ప్రస్తుతం సురైః ।
దేవదేవం జగన్నాథం త్రైలోక్యమోహనం పరమ్ ॥ 13

కోటికన్దర్పలీలాభం కమనీయమనీశ్వరమ్ ।
అమూల్యరత్ననిర్మాణభూషణౌఘేన భూషితమ్ ।
వరం వరేణ్యం వరదం వరదానామభీప్సితమ్ ॥ 14

చతుర్ణామపి వేదానాం కారణానాం చ కారణమ్ ।
పాతార్థం మత్ప్రియస్థానమాగతోఽసి చ మాయయా ॥ 15

పాఠం తే లోకశిక్షార్థం రమణం గమనం రణమ్ ।
స్వాత్మారామస్య చ విభోః పరిపూర్ణతమస్య చ ॥ 16

భక్త ప్రాణవల్లభా! నీవు పరబ్రహ్మవు, పరంధాముడవు, పరమేశ్వరుడవు, పరాత్పరుడవు, స్వేచ్ఛామయుడవు, స్వయంజ్యోతిస్స్వరూపుడవు, నిర్లిప్తుడవు, అద్వితీయుడవు, నిరంకుశుడవు, భక్తులకు ఏకైకస్వామివి, భక్తానుగ్రహమూర్తివి, భక్తులకు ఇష్టదైవమవు, భక్తులసకలమనోరథములను పరిపూర్ణమొనరింపగల కల్పవృక్షమవు. బ్రహ్మశివశేషాదులందరు నీకు అనేకవందనము

[illegible]న్నావు. నీవు పృథ్వీభారముహరించుటకొఱకు ఈభూమిపై ఆత్మమాయచే [illegible]లోకములో అవతీర్ణుడవై, మాయచే భూపాలుడవైతివి. యోగిజనులు [illegible]ను బ్రహ్మజ్యోతిగ తెలిసికొనిరో, భక్తజనులు సదా తమహృదయ కమలములలో ఏజ్యోతిస్స్వరూపుని హర్షపూర్వకముగ ధ్యానింతురో, ఏదేవుడు [illegible], మురళీహస్తుడు; చందనానులిప్తసర్వాంగుడు, సుందరశ్యామ స్వరూపుడు, మందస్మితముఖారవిందుడు, భక్తవత్సలుడు, పీతాంబరధారి, వనమాలావిభూషితుడు, లీలాకటాక్షవీక్షణములలో మన్మథునినైన తిరస్కరించి మూర్ఛిల్ల జేయువాడు, లక్ష్మికకు ఉత్పత్తిస్థానములవలె శోభిల్లుపాదపద్మములు కలవాడు, కౌస్తుభమణికాంతులచే భాసిల్లు శరీరముకలవాడు, మనోహరదివ్య మూర్తి, మందస్మితవదనుడు, సుందరవేషధారి, సకలదేవగణములచే స్తుతింప బడువాడు, దేవాదిదేవుడు, జగదీశ్వరుడు, త్రిలోకములను మోహపెట్టువాడు. [illegible]శ్రేష్ఠుడు, కోట్లకొలది మన్మథులను మించిన కాంతికలవాడు, కమనీయుడు, ఇచ్ఛారహితుడు, స్వయముగ నీశ్వరుడు, అమూల్యరత్నాభరణవిభూషితుడు, శ్రేష్ఠుడు, సర్వోత్తముడు, వరదాత, వరదాతలకే ఇష్టదేవుడు, నాల్గువేదము లకు, సకలకారణములకు కారణుడు నగు అట్టి జగన్నాథుడే దివ్యలీలావశమున విద్యార్థియై విద్యనభ్యసించుటకు నాదరికిజేరెను. ఆహా! ఏమినాసౌభాగ్యము. జగదీశ్వరా! శ్రీకృష్ణపరమాత్మా! నీవు స్వాత్మారాముడవు, సర్వవ్యాపివి, పరిపూర్ణతముడ వైన ప్రభుడవు, భక్తానుగ్రహవిగ్రహుడవు, కావున నీవిద్యా ధ్యయనము, క్రీడలు, రమణము, గమనము, యుద్ధము మొదలుగాగల దివ్య లీలలన్నియు లోకశిక్షార్థమే. సకలవిద్యాప్రదాత వైన నీవు విద్యార్థివై నాధన [illegible]నములను ఖండించితివి.

సాందీపని పలికెను:-

శ్లో॥ అద్య మే సఫలం జన్మ సఫలం జీవనం మమ ।
పాండిత్యం చ సఫలం సఫలం చ తపోవనమ్ ॥ 17

మద్గృహస్థః సఫలో దత్తం యేనాన్నమీప్సితమ్ ।
మహాశ్రమ తీర్థపరం తీర్థపాద పాదాఙ్కితమ్ ।
త్వత్పాదరజసా పూతా గృహాః ప్రాఙ్గణముత్తమమ్ ॥ 18

యస్య త్వత్పాదపద్మం చైవాపయోర్జన్మఖణ్డనమ్ ।
తావద్ దుఃఖం చ శోకశ్చ తావద్భోగశ్చ రోగకః ॥ 19

శ్లో॥ తావజ్జన్మాని కర్మాణి క్షుత్పిపాసాదికాని చ ।
యావత్ త్వత్పాదపద్మస్య భజనం నాస్తిదర్శనమ్ ॥ 20

హే కాల కాల భగవాన్ స్రష్టుః సంహ ర్తురీశ్వరః ।
కృపాం కురు కృపానాథ మాయామోహనికృన్తన ॥ 21

ప్రభో! ఈ దినమునాజన్మ, జీవనము, పాతివ్రత్యము, తపోవనవాసము ధన్యములైనవి, సఫలములైనవి. నేను ఏహస్తముతో నీకు ఈప్సితమిష్టాన్నములను బెట్టితినో, ఆనాదక్షిణహస్తము సఫలమైనది. ఆశ్రమతీర్థపాదుడైన భగవంతుని చరణచిహ్నాంకితమైన ప్రదేశము సకలపవిత్రతీర్థములకంటె అత్యంత శ్రేష్ఠము. దేవాదిదేవా! నీచరణరజస్పర్శచే మాగృహము పావనమైనది, మాతపోవనము సార్థకమైనది. భక్తజనపరిపాలకా! నీచరణకమలములు మాఇరువురకు జన్మమరణనివారకములు; ఎందువలననగ ఎంతవరకు నీదివ్య చరణకమలముల దర్శనములభింపదో, నీదివ్యనామ సంకీర్తనమొనరింపరో, అంతవరకే దుఃఖములు, శోకములు, భోగములు, రోగములు జన్మలు, కర్మలు, క్షుత్పిపాసాదులు కష్టప్రదములగును. (అనగ నీ దివ్యనామ సంకీర్తనచే, దివ్యపాదపద్మదర్శన సౌభాగ్యముచే దేహధారి సకలసంకటముల నుండి, సుఖములనుండి, భోగములనుండి, జననమరణ చక్రమునుండి విముక్తుడు కాగలడు). హే, భగవాన్! నీవు కాలమువకే కాలము, సృష్టికర్తయైన బ్రహ్మకు సంహారకర్తయైన శివునకుకూడ ఈశ్వరుడవు, మాయామోహవినాశకుడవు. కృపానాథా! నాపైనీకృప ప్రసరింపజేయుము.

ఇట్లు భగవంతుని స్తుతించుచుండగ గురుపత్ని సర్వాంగములు పులకించినవి. ఆమెనేత్రములనుండి ఆనందాశ్రుధారలు ప్రవహించినవి. ఆమాతృమూర్తి జగన్నాథుని తనబడిలో పరుండబెట్టుకొని ఆయనకు జనని దేవకివలె, మాతయశోదవలె తన స్తనక్షీరములను ప్రసాదించెను. అపుడు శ్రీకృష్ణపరమాత్మ ఆదంపతుల నిట్లు అనుగ్రహించెను. "మాతా! గురుదేవా! మీారెందులకు ఈ బాలకుల నిట్లు స్తుతించుచున్నారు? నేను మీాబిడ్డవంటివాడను, మీాఅనన్యవాత్సల్యమునకు నేను అత్యంతసంతుష్టుడనైనాను. గురుదేవా! త్వరలో మీారు ఈ ప్రాకృతిక దేహములను త్యజించి జన్మమృత్యుజరారహితమైన దివ్యశరీరధారులై గోలోకమును జేరగలరు."

ఇట్లు గురుదేవునకు, గురుపత్నికి అఖండవరములను ప్రసాదించి శ్రీకృష్ణపరమాత్మ అనుజసహితముగ భక్తితో ఒకమాసకాలములోనే సాందీపనిమహర్షి నుండి సకలశాస్త్రములను అధ్యయనమొనరించెను. తుదకు గురుదక్షిణగ గతములో మరణించిన గురుపుత్రుని తెచ్చి గురువునకు సమర్పించెను. అంతియేకాదు అసంఖ్యాకమణులను, రత్నములను, వజ్రములను, ముత్యములను, మాణిక్యములను, త్రైలోక్యములందు దుర్లభము లైనవస్త్రములను, హారములను, అంగుళీయకములను, సువర్ణముద్రలను. నానావిధాభూషణములను గురువునకు, గురుపత్నికి సమర్పించెను. నారదా! శ్రీకృష్ణుడు ప్రసాదించిన సకలసంపదలను సాందీపనిమహర్షి తనకుమారున కొసంగి తనసహధర్మచారిణితో అమూల్యరత్ననిర్మితరథారూఢుడై దివ్యదేహధారియై ఉత్తమ గోలోకమున కేగెను. గురుదేవుని మహాప్రస్థానమును దర్శించి శ్రీకృష్ణపరమాత్మ అనుజసహితముగ మధురానగరికి మరలివచ్చెను. నారదా! నీవు సదా బ్రహ్మణ్యదేవు డైన శ్రీకృష్ణుని దివ్యపావనచరితములనే శ్రవణమొనరింపుము. సాందీపనిమహర్షి ఆయన సహధర్మచారిణి చేసినస్తోత్రములు అఖండపుణ్యప్రదములు. భక్తిపూర్వకముగ ఈ స్తోత్రములను పఠించుమానవునకు నిస్సందేహముగ శ్రీకృష్ణునియందు నిశ్చలభక్తి కలుగును. ఆపుణ్యప్రభావముచే కీర్తిహీను డైనను పరమయశస్వి కాగలడు, మూర్ఖు డైనను పండితుడు కాగలడు. అతడు ఇహలోకమందు సుఖముల ననుభవించి అంత్యకాలములో శ్రీహరిపదమును పొందగలడు. పరంధామములో వానికి నిత్యము శ్రీహరిదాస్యసౌభాగ్యము సులభమగును, ఇందు లేశమాత్ర మైనను సంశయము లేదు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని
శ్రీకృష్ణ జన్మఖండమందు శ్రీరామకృష్ణుల విద్యాభ్యాస
మను నూటరెండవ అధ్యాయము
సంపూర్ణము.



# నూటమూడవ అధ్యాయము
## ద్వారకాపురి నిర్మాణము

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

నారదా! తదనంతరము సర్వవ్యాపియైన శ్రీహరి బలరామునితో గురుకులమునుండి మధురానగరమునకు మఱలివచ్చి, తలిదండ్రుల కనేకప్రణామము లర్పించి వటవృక్షచ్ఛాయలో ఏకాంతముగ ఆసీను డయ్యెను. ఆసమయములో శ్రీకృష్ణపరమాత్మ బాలగోపవేషమును త్యజించి రాజసవేషధారి అయ్యెను. ఆయన ఆదరసహితముగ గరుత్మంతుని, సాగరుని, విశ్వకర్మను, సుదర్శనమును స్మరించెను. కోటిసూర్యసమాన ప్రకాశమాన మైన సుదర్శన చక్రము శ్రీకృష్ణునికడ కఱుదెంచెను. ఆయ్యుత్తమాస్త్రము శ్రీహరిసదృశ తేజము, శత్రునాశకము, అమోఘము, సకలాస్త్రములందు శ్రేష్ఠము, పరమోత్కృష్టము. తదుపరి రత్ననిర్మితవిమానముతో గరుత్మంతుడు, అసంఖ్యాక శిష్యపరివేష్టితు డై విశ్వకర్మ, భయభీతు డై సాగరుడు, శ్రీహరిసమక్షమున నుండిరి. వా రందరు అనన్యభక్తిపూర్వకముగ శ్రీహరికి శిరములను వంచి ప్రణామము లర్పించిరి. అపుడు సర్వవ్యాపియగు భగవానుడు ఆదరముతో చిరునవ్వులు చిందులాడగ క్రమముగ వారి నిట్లాదేశించెను.

శ్రీ కృష్ణుడు పలికెను:-

మహాభాగా! సముద్రా! నేను ఒకదివ్యనగరనిర్మాణమును సంకల్పించితిని; కావున నగరముకొఱకు నాకు నూఱుయోజనముల విస్తృత మైనభూమి నిమ్ము. కలియుగప్రారంభమున నేను ఆభూమిని అవశ్యముగ నీకు మఱల ప్రసాదింపగలను. విశ్వకర్మా! సముద్రు డొసంగిన స్థానముపై త్రిలోకములందు దుర్లభ మైన, అత్యంత రమణీయ మైన స్త్రీలమనస్సులనే హరింపగల, భక్తులకు మనోవాంఛనీయమైన, వైకుంఠముతో సమముగ పరమఉత్కృష్టమైన, సమస్తస్వర్గములకంటె మిన్నయైన. సర్వులకు అభీష్టమైన దివ్యనగర నిర్మాణ మొనరింపుము. శ్రేష్ఠా! మహాభాగా! గరుత్మంతా! విశ్వకర్మ ద్వారకాపురిని నిర్మాణ మొనరించువరకు నీవు అహర్నిశములు ఆయనచెంతనే యుండి నిర్మాణకార్యములందు సహకరింపుము. చక్రశ్రేష్ఠా! సుదర్శనా! నీవు అహర్నిశములు దుష్టులను శిక్షించుటకు, శిష్టులను రక్షించుటకు నాదక్షిణపార్శ్వమందే ఎల్లపుడు నుండుము.

మునీశ్వరా! జగన్నాథునియాదేశానుసారముగ సుదర్శనముదక్క మిగిలినవా రందరు "ఓం అస్తు" యనిబల్కి తమతమ కార్యములను నిర్వర్తించుటకు వెడలిపోయిరి. మహాభాగా! శ్రీకృష్ణపరమాత్మా! మధురానగరములో కంసునితండ్రి యైన సర్వోత్తము డైన, తనమాతామహు డైన ఉగ్రసేనుని సకలయాదవసామ్రాజ్యమునకు చక్రవర్తిగ పట్టాభిషేక మొనరించెను. తదనంతరము యుక్తిపూర్వకముగ అజేయు డైన జరాసంధుని భీమసేనునిద్వారా సంహారింపజేసి కాలయవనుని ముచికుందుని నేత్రాగ్నికీలలకు ఎరగ చేసి ముచికుందునకు పరంధామమును ప్రసాదించెను. తదనంతరమే విశ్వకర్మ నగరనిర్మాణ మారంభించెను. దేవశిల్పిని నగరనిర్మాణార్థమై శ్రీకృష్ణపరమాత్మ ఇట్లాదేశించెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :-

విశ్వకర్మా! నీవు పద్మరాగములను, మరకతములను, సర్వశ్రేష్ఠములైన ఇంద్రనీలములను, మనోహరములైన పారిభద్రములను, శ్యామ-తములను, గంధకములను, పలంకములను, చంద్రకాంతములను, సూర్యకాంతములను, స్ఫటికనిర్మలశిల్పములను, ఎఱ్ఱని తెల్లని శ్యామలవర్ణయుక్తములైన నీలమణులను, దానిమ్మగింజలవలె ప్రకాశించు ఎఱ్ఱని గోరోచనములను, పద్మబీజములవలె నీలకమలవర్ణముకలిగి కాటుకవలె ప్రకాశించు మణులను, పరిష్కృత వజ్రములను, సప్తసువర్ణమువలె ప్రకాశించు శిలారత్నములను, అమూల్యములైన లేతమెరుపురంగులో పరమసుందరముగ ప్రకాశించు బరువైన, పూజనీయము లైన మణులను ఏకత్రిత మొనరించి వాస్తుశాస్త్రవిధి ననుసరించి మనోవాంఛిత మగు పరమదివ్యనగరమును నిర్మింపుము. ఈ నగరము నూఱు యోజనములవిస్తార మై యుండవలెను. నీవు నగరనిర్మాణ మొనరించునంత వరకు అహర్నిశములు అసంఖ్యాకయక్షులు నానారత్నాదిమణులను, సకల ద్రవ్యములను సమకూర్చుచుండెదరు. కుబేరునిప్రేరణచే అరుదెంచిన ఏడులక్షల యక్షులు, శంకరునిద్వారా పంపబడిన ఏడులక్షల భేతాళులు, ఏడులక్షల కూష్మాండులు, గిరిరాజనందినిద్వారా నియుక్తులైన అసంఖ్యాకదానవులు, బ్రహ్మరాక్షసులు ఈ దివ్యనగరనిర్మాణమందు నీతో సహకరించెదరు. దేవశిల్పీ! కాబోవు నాపదునారువేల నూటయెనిమండుగురు భార్యలకు ఒక దివ్యహర్మ్యము నిర్మింపుము. ఆ శిబిరము నాల్గువైపుల అగడ్తలు గల్గి ఎత్తైన

ప్రాకారములతో పరివేష్టితమై అనేక సింహద్వారములతో, చిత్రవిచిత్ర కృత్రిమ రహస్యద్వారములతో, నిషిద్ధ వృక్షరహితమై ప్రసిద్ధ వృక్షయుక్తమై సకల శుభలక్షణ సంపన్నమై, చంద్రవేధమై అలరారుచుండవలెను.

విశ్వకర్మ పలికెను:-

జగద్గురూ! ప్రశస్తవృక్షములేవో, నిషిద్ధములేవో, శుభప్రదములేవో, అశుభప్రదములేవో వివరముగ వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను. జగదీశ్వరా! ఏయస్తికలద్వారా గృహము శుభప్రదమగును? ఏయస్తికలను స్థాపన మొనరించిన అశుభప్రదమగును? గృహమునకు జలము ఏదిశలో నుండుట శుభదాయకము? ఏదిశలో నుండుట అశుభదాయకము? ఏవృక్షములు ఏదిశలో నున్న కళ్యాణప్రదములు? సురేశ్వరా! గృహముయొక్క ప్రమాణ మెంత యుండవలయును! ఏదిశలో పుష్పోద్యానములు మంగళప్రదములు? జగన్నాథా! ప్రాకారముల, అగడ్తల, ద్వారముల గృహముల ప్రమాణములను వివరింపుము? ప్రభూ! గృహ నిర్మాణములో ఏ యే వృక్షముల యొక్క కాష్టములు ప్రశస్తములు? ఏ యే వృక్ష కాష్టములు (కలప) అమంగళకరములు? ఈవాస్తు శాస్త్ర విజ్ఞానమంతటిని కృపతో ఉపదేశింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

## శ్రీకృష్ణపరమాత్మ విశ్వకర్మ కుపదేశించిన వాస్తుశాస్త్రజ్ఞానము

శ్రీకృష్ణుడు పలికెను:-

శ్లో॥ ఆశ్రమే నారికేలశ్చ గృహిణాం చ ధనప్రదః ।
శిబిరస్య యదీశానే పూర్వే పుత్రప్రద స్తరుః ॥ 34

సర్వత్ర మఙ్గలార్హశ్చ తరురాజో మనోహరః ।
రసాలవృక్షః పూర్వస్మిన్నృణాం సమ్పత్ప్రద స్తథా ॥ 35

శుభప్రదశ్చ సర్వత్ర సురకారో నిశామయ ।
బిల్వశ్చ పనసశ్చైవ జమ్బీరో బదరీ తథా ॥ 36

ప్రజాప్రదశ్చ పూర్వస్మిన్దక్షిణే ధనద స్తథా ।
సమ్పత్ప్రదశ్చ సర్వత్ర యతో హి వర్ధతే గృహీ ॥ 37

దేవశిల్పాచారా! గృహస్థుల గృహములో నారికేళవృక్షము సదా ధనప్రదము, ఆవృక్షమే గృహమునకు ఈశాన్య దిశయందుగాని, పూర్వదిశ

యందుగాని యున్నచో గృహస్తునకు పుత్రప్రద మగును. ఆమనోహర వృక్షరాజము సర్వత్రా మంగళములను ప్రసాదింపగలది. గృహములో పూర్వదిశ యందు మామిడివృక్ష మున్న ఆవృక్షము గృహస్తులకు సంపత్తిప్రదమై సర్వదా శుభదాయకము కాగలదు. బిల్వవృక్షము, పనసవృక్షము, జాంబీర నిమ్మవృక్షము, బదరీవృక్షము, పూర్వదిశయందు సంతానదాయకములు దక్షిణదిశలో ధనప్రదములు, సర్వత్రా గృహస్తులకు సంపత్తి వర్ధకములు.

శ్లో॥ జమ్బ్వావృక్షశ్చ దాడిమ్బః కదల్యామ్రాతక స్తథా ।
బన్ధుప్రదశ్చ పూర్వస్మిన్దక్షిణే మిత్రద స్తథా ॥ 38

సర్వత్ర శుభదశ్చైవ ధనపుత్రశుభప్రదః
హర్ష ప్రదోసునాకిశ్చ దక్షిణే పశ్చిమే తథా ॥ 39

ఈశానే సుఖదశ్చైవ సర్వత్రైవ నిశామయ ।
సర్వత్ర చమ్పకః శుద్ధో భువి భద్రప్రద స్తథా ॥ 40

జామవృక్షము, దానిమ్మవృక్షము, కదళీవృక్షము, ఉసిరిగవృక్షము పూర్వదిశ (తూర్పు) లో నున్న బంధుప్రదములు, దక్షిణదిశలో మిత్రులను వృద్ధిచేయగలవు, సర్వత్రా శుభములను ప్రసాదింప గలవు. సువాక వృక్షము దక్షిణదిశలో ధన, పుత్ర శుభప్రదము, పశ్చిమదిశయందు హర్షదాయకము, ఈశానదిశలో నున్న సుఖదము, భూమిపై చంపక వృక్షము అత్యంత శుద్ధము. సర్వత్రా మంగళకరము.

శ్లో॥ అలాబుశ్చాపి కూష్మాణ్డమాయామ్బుశ్చ నకిం శుకః ।
ఖర్జూరీ కర్కటీ చాపి శిబిరే మఙ్గలప్రదా ॥ 41

వాస్తూకాఖ్య బిల్వాశ్చ వార్తాకశ్చ శుభప్రదః ।
లతాఫలం చ శుభదం సర్వం సర్వత్ర నిశ్చితమ్ ॥

ప్రశస్తం కథితం కారో నిషిద్ధం చ నిశామయ ।
వన్యవృక్షో నిషిద్ధశ్చ శిబిరె నగరేఽపి చ ॥ 42

నారపాదు, గుమ్మడిపాదు, కాకరపాదు, ఆయూంబు, పలాశ, ఖర్జూర వృక్షములు శిబిరములో నున్న మంగళదాయకములు కాగలవు. విశ్వకర్మా! వంగపాదులు, మారేడు వృక్షములు కూడ శుభదాయకములే. ఫలవంతము లైన లత లన్నియు నిశ్చయముగ సర్వత్రా శుభదాయకములు కాగలవు.

శిల్పాచార్యా! ఇట్లు నేను ప్రశస్తవృక్షములను వర్ణించితిని, ఇపుడు నిషిద్ధములను వర్ణించెద నవధరింపుము. గృహములలో వన్యవృక్షము లుండుట సర్వదా నిషిద్ధము.

శ్లో॥ వటో నిషిద్ధః శిబిరె నిత్యం చోరభయం యతః ।
నగరేషు ప్రసిద్ధశ్చ దర్శనాత్పుణ్యద స్తథా ॥ 43

నిషిద్ధః శాల్మలిశ్చైవ శిబిరే నగరే పురే ।
దుఃఖప్రదశ్చ సతతం భూమిపానాం సదాఽపి చ ॥ 44

న నిషిద్ధః ప్రసిద్ధశ్చ గ్రామేషు నగరేషు చ ।
విద్యామతి నిషిద్ధస్తు సతతం దుఃఖద స్తథా ॥ 45

హే కారో తి న్తిడీవృక్షో యత్నా త్తం పరివర్జయేత్
శతేన ధనహానిః శ్యాత్ప్రజాహానిర్భవేద్ధ్రువమ్ ॥ 46

శిబిరేఽతినిషిద్ధశ్చ నగరే కించిదేవ చ ।
న నిషిద్ధః ప్రసిద్ధశ్చ గ్రామేషు నగరేషు చ ॥ 47

విద్యామతి నిషిద్ధశ్చ ప్రాగ్న స్తం పరివర్జయేత్ ।

గృహములో వటవృక్ష ముండుట మంచిదికాదు; ఎందువలననగ అవట వృక్షమువలన చోరభయము సంభవించును. కాని నగరములో ఆవృక్ష ముండుట అత్యంత నుత్తమము; ఆవృక్షదర్శన మాత్రముననే పుణ్యము ప్రాప్తించును. నగరమందుగాని, గ్రామములందుగాని గృహములందుగాని బూరగ వృక్ష ముండుట సర్వదా నిషిద్ధము. ఆవృక్షము సదా పరిపాలకులకు దుఃఖములను ప్రసాదింపగలదు. దేవశిల్పీ! చింతచెట్టు నగరములందుగాని, గ్రామములందుగాని యుండుట ప్రశస్తమే. కాని గృహములో నుండుట మంచిదికాదు. ఆవృక్షము విద్యాబుద్ధులకు వినాశకము, సదా దుఃఖదాయకము. దానివలన నిశ్చయముగ ప్రజ, ధన హానులు సంభవింపగలవు. కావుననే యత్నపూర్వకముగ అవృక్షమును గృహములో పరిత్యజించుట విద్వాంసులకు అత్యంత నుచితము.

శ్లో॥ ఖర్జూరశ్చ గహూశ్చైవ నిషిద్ధః శిబిరే తథా ॥ 48
న నిషిద్ధః ప్రసిద్ధశ్చ గ్రామేషు నగరేషు చ ।
వృక్షశ్చ చణకాదీనాం ధాన్యం చ మఙ్గలప్రదమ్ ॥ 49

శ్లో॥ గ్రామేషు నగరే చాపి శిబిరే చ తథైవ చ ।
ఇక్షువృక్షశ్చ శుభదః సంతతం శుభద స్తథా ॥ 50

అశోకశ్చ శిరీషశ్చ కదమ్బశ్చ శుభప్రదః ।
కచ్చిదారిద్రా శుభదా శుభదశ్చాఽఽర్ద్రిక స్తథా ॥ 51

హరీతకీ చ శుభదా గ్రామేషు నగరేషు చ ।
న వద్యా భద్రదా నిత్యం తథాచాఽఽ లక్ష్మీధ్రువమ్ ॥ 52

ఖర్జూరవృక్షము, కంటకములు కల్గిన వృక్షములు గృహమునం దుండ రాదు; అవి విద్యాబుద్ధులను నశింపజేయగలవు; అందువలన వాటినుండి దూరముగ నుండుటయే మంచిది. గ్రామములలో, నగరములలో శిబిర మొదలగు అన్నివృక్షములు మంగళప్రదములు కాగలవు. గ్రామములందు, నగరములందు, గృహములందు చెఱకు వృక్షములు సదా శుభదాయకములు కాగలవు. అశోకము, శిరీషము, కదంబము, మానవులకు శుభప్రదములు. పసుపు, అల్లము, హరీతకము, ఉసిరికవృక్షములు గ్రామములందు నగరములందు ఉండుట సదా శుభదాయకము, కళ్యాణప్రదము.

శ్లో॥ గజానామస్థి శుభదమశ్వానాం చ తథైవ చ ।
కళ్యాణముచ్చైశ్శ్రవసాం వాస్తౌ స్థాపనకారిణామ్ ॥ 53

న శుభప్రదమన్యేషా ముచ్ఛిన్నకారణం పరమ్ ।
వానరాణాం నరాణాం చ గార్దభానాం గవామపి ॥ 54

కుక్కుటానాం శృగాలానాం మార్జాలాణామభద్రకమ్ ।
భేటకానాం సూకరాణాం సర్వేషాం చ శుభప్రదమ్ ॥ 55

వాస్తుభూములో శంఖుస్థాపన మొనరించువారికి గజాస్థికలు శుభదాయకములు, ఉచ్చైశ్శ్రవాజాత్యశ్వముల అస్థికలు కళ్యాణప్రదములు కాగలవు. ఇవిదక్క అన్యజంతువులఅస్థులు శుభకరములు కావు; అవి వినాశమునకు కారణములు కాగలవు. వానరముల, మనుష్యుల, గార్ధభముల, గోవుల, శృగాల (కుక్కల) ముల, నక్కల, మార్జాలముల అస్థికలు అమంగళకరములు. భేదకముల, సూకరముల అస్థికలు సర్వత్రా శుభప్రదములే,

శ్లో॥ ఈశానే చాపి పూర్వస్మిన్పశ్చిమే చ తథోత్తరే ।
శిబిరస్య జలం భద్రమన్యత్రాశుభ మేవ చ ॥ 56

గృహమునకు తూర్పున, పశ్చిమమున, ఉత్తరమున, ఈశాన్యమున జల ముండుట అత్యంతోత్తమము, ఇవిదక్క అన్యదిశలం దుండుట అశుభప్రదము.

శ్లో॥ దీర్ఘే ప్రస్థే సమానం చ న కుర్యాన్మన్దిరే బుధః ।
చతురస్రే గృహే కారో గృహిణాం ధననాశనామ్ ॥ 58

దీర్ఘప్రస్థః పరిమితో నేత్రైక్యేనాపి సంహృతమ్ ।
శూన్యేన రహితం భద్రం శూన్యం శూన్యప్రదం నృణామ్ ॥ 59

ప్రస్థే హస్తద్వయాత్పూర్వం దీర్ఘే హస్తత్రయం తథా ।
గృహాణాం శుభదం ద్వారం ప్రాకారస్య గృహస్య చ ॥ 60

న మధ్యదేశే కర్తవ్యం కించిన్న్యూనాధికే శుభమ్ ।
చతురస్రం చన్ద్రవేధం శిబిరం మఙ్గలప్రదమ్ । 61

అభద్రదం సూర్యవేధం శిబిరం మఙ్గలప్రదమ్ ।
అభద్రదం సూర్యవేధం ప్రాఙ్గణం చ తథైవ చ ॥ 62

శిల్పాచార్యా! ఏగృహము పొడవు, వెడల్పు సమముగ నుండునో అట్టిగృహమును బుద్ధిమంతులైనపురుషులు నిర్మింపరాదు; నాలుగుపలకలగృహములో నివసించినగృహస్థుయొక్క ధనము నశింపగలదు. గృహముయొక్క పొడవు, వెడల్పు ఒకటి నుండి మఱియొకటి తీసివేసిన శేషము శూన్యరహితమైనచో ఆగృహము శుభప్రదము. లేక శూన్యశేషము మిగిలిన ఆగృహము మనుష్యులకు శూన్యప్రదము కాగలదు. గృహముల వెడల్పులో పశ్చిమదిశవైపు రెండుహస్తములు వదలి పూర్వదిశయందు పొడవులో, దక్షిణమందు మూడుహస్తములు వదలి ప్రాకారద్వారము ఉంచుట శుభదాయకము కాగలదు. గృహమధ్యభాగములో ద్వారమును నిర్మింపరాదు; కొంత మధ్యభాగముకంటె ముందుగాని, వెనుకగాని ద్వారము నుంచుట శుభప్రదము కాగలదు. చతురస్రమైనగృహము చంద్రవేధమైన మంగళప్రదము కాగలదు; కాని మంగళప్రదగృహమైనను సూర్యవేధమైన అమంగళకారకము కాగలదు. అట్లే సూర్యవేధమైన ప్రాంగణముకూడ అమంగళదాయకమగును.

శ్లో॥ శిబిరాభ్యన్తరే భద్రా స్థాపితా తులసీ నృణామ్ । 63
ధనపుత్రప్రదాత్రీ చ పుణ్యదా హరిభక్తిదా ॥

ప్రభాతే తులసీం దృష్ట్వా స్వర్ణదానఫలం లభేత్ ।

గృహములో నాటినతులసీవృక్షము మనుష్యులకు సకలకళ్యాణప్రదాయని యై ధనపుత్రాదులను ప్రసాదించును. ఆదివ్యవృక్షము పుణ్యప్రదము హరిభక్తిప్రదము. ప్రాతఃకాలము తులసిని దర్శించిన సువర్ణదానఫలము లభించును.

శ్లో॥ మాలతీ యూథికా కున్దం మాధవీ కేతకీ తథా ॥ 64

నాగేశ్వరం మల్లికాం చ కాంచనం బకులం శుభమ్ ।

అపరాజితా చ శుభదా తేషా ముద్యానమీప్సితమ్ ॥ 65

పూర్వే చ దక్షిణే చైవ శుభదం నాత్ర సంశయః ।

గృహమునకు పూర్వదిశలో, దక్షిణదిశలో మాలతి, మల్లె, సన్నజాజి, మాధవి, కేతకి, నాగేశ్వరం, మల్లిక, నల్లతుమ్మొత్త, పొగడ, శుభదాయని అపరాజిత (విష్ణుకాంత) మొదలగు పుష్పోద్యానవనములు శుభప్రదము లనుటలో లేశ మైనను సంశయము లేదు.

శ్లో॥ ఊర్ధ్వం షోడశహస్తేభ్యో నైవ కుర్యాద్గృహం గృహీ ॥ 66

ఊర్ధ్వం వింశతిహస్తేభ్యః ప్రాకారం న శుభప్రదమ్ ।

గృహస్థు పదునారుహస్తములకంటె ఎత్తైనగదులను నిర్మింపరాదు. ఇరువదిహస్తములకంటె ఎత్తైన ప్రాకారమును నిర్మించుటకూడ శుభప్రదము కాదు.

శ్లో॥ సూత్రధారం తైలాకారం స్వర్ణకారం చ హీరకమ్ ॥ 67

వటీమూలె గ్రామమధ్యే న కుర్యా త్స్థాపనం బుధః ।

బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం సచ్ఛూద్రం గణకం శుభమ్ ॥ 68

భట్టం వైద్యం పుష్పకారం స్థాపయేచ్ఛిబిరాన్తికే ।

బుద్ధిమంతు డైన పురుషుడు తనగృహసమీపములో, గ్రామము నడుమ వడ్రంగిని, తైలకారుని, స్వర్ణకారుని ఉంచుకొనరాదు; కాని గృహముదగ్గరలో; ప్రక్కన బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, సత్‌శూద్రులను, గణికులను, భట్టులను, వైద్యులను, పుష్పకారులను అవశ్య ముండనీయవలెను.

శ్లో॥ ప్రస్థే చ పరిఖామానం శతహస్తం ప్రశస్తకమ్ ॥ 69

పారతః శిబిరాణాం చ గమ్భీరం దశహస్తకమ్ ।

సజ్కేతపూర్వకం చైవ పరిఖాద్వారమీప్సితమ్ ॥ 70

శ్లో॥ శత్రోరగమ్యం మిత్రస్య గమ్యమేవ సుఖేన చ ।

అంతఃపురమునకు నాల్గువైపుల నూఱుహస్తముల వెడల్పైన పదిహస్తముల లోతైన అగడ్త ప్రశస్తము. ఏద్వారము శత్రువులకు అగమ్యమో, మిత్రులకు సుఖపూర్వకముగ గమ్యమో అట్టి సంకేతముగల ద్వారమును ఆయగడ్తయొక్క అగ్రభాగమున నిర్మింపవలెను.

శ్లో॥ శాల్మలీనాం తిన్త్రిడీనాం హిన్తాలానాం తథైవ చ ॥ 71
నిమ్బానాం సిన్ధువారాణాం బదరీణామథద్రకమ్ ।
ధత్తూరాణాం వటానాం చాప్యేరణ్డానామవాంఛితమ్ ॥ 72
ఏతేషామతిరిక్తానాం శిబిరే కాష్ఠమీప్సితమ్ ।
వృక్షం చ వజ్రహస్తం చ భూధరో వర్జయేదధః ॥ 73
పుత్రదారాధనం హన్యాదిత్యాహ కమలోద్భవః ।
కథితం లోకశిక్షార్థం కురు కాష్ఠం వినా పురీమ్ ॥ 74
శుభక్షణం చాప్యధునా గచ్ఛ వత్స యథాసుఖమ్।

భవననిర్మాణములో శాల్మలీ, చింత, హింతాల (ఒకప్రకారమైన అడవి ఖర్జూరచెట్టు), వేప, సింధువార, మేడి, మఱ్ఱి, ఉమ్మెత్త, ఆముద, వృక్షముల కాష్ఠములను ఉపయోగింపరాదు. ఇవిదక్క అన్యములైన టేకు మొదలగు వృక్షముల కాష్ఠములు ఉపయోగింపవచ్చును. గృహశిల్పజ్ఞానసంపన్నుడైన విద్వాంసుడు కఱ్ఱ, వజ్రహస్తము, శిల, మొదలగునవి ఉపయోగించకనే గృహనిర్మాణ మొనరించుట అత్యంతనుచితము. అవి స్త్రీపుత్రధననాశకము లనికమలసంభవుడైన బ్రహ్మ కథనము. వత్సా! నీ కంతయు విదితమే, కాని ఈ విజ్ఞానము నంతయు నేనులోకశిక్షార్థమై ప్రవచించితిని. ఇక నీవు సుఖపూర్వకముగ బయలుదేరి కాష్ఠములను ఉపయోగింపకనే నగరనిర్మాణ మొనరింపుము. నగరనిర్మాణమునకు ఇదియే శుభముహూర్తము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :-

అపుడు విశ్వకర్మ గరుత్మంతునితో కలసి శ్రీహరి కనేకనమస్కారము లర్పించి సముద్రతీరమును జేరి ఒకమనోహరవటవృక్షముక్రింద రాత్రి శయనించెను.

మునీశ్వరా! గరుత్మంతునకు, విశ్వకర్మకు స్వప్నములో ఆరమణీయద్వారకాపురి కనబడెను. శ్రీకృష్ణపరమాత్మ ఏ యే వాస్తులక్షణములను విశ్వకర్మ

కుపదేశించెనో అవి యన్నియు ఆదివ్యనగరములో విద్యామానములై దృష్టి గోచరములైనవి. ఇట్టి అద్భుతస్వప్నమును గాంచి గరుత్మంతుడు, విశ్వకర్మ నిద్ర మేల్కాంచి తమసమక్షమున సముద్రమధ్యములో నిర్మింపబడియున్న దివ్యద్వారకామహానగరమును గాంచి లజ్జితులైరి. బ్రహ్మసంభవా! భగవంతునిసంకల్పమాత్రముననే ఆదివ్యద్వారకానగర మావిర్భవించెను. సర్వకారణకారణునకు ఒకరిసహాయము కావలయునా? ఆలీలలన్నియు భగవంతుడు లోకశిక్షార్థమై ప్రదర్శించినవే! ఆద్వారకాపురి అత్యంతరమణీయము, శతయోజనవిస్తారము. రత్నములచే, మణులచే, అద్భుతశిల్పచాతుర్యముచే సూర్యతేజమునే తిరస్కరింపగల ఆదివ్యనగరశోభ, ప్రభ బ్రహ్మాదిదేవతల పురములకంటె అత్యంతశ్రేష్ఠము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని
శ్రీకృష్ణ జన్మఖండమందు ద్వారకాపురి నిర్మాణ
మను నూటమూడవ అధ్యాయము
సంపూర్ణము.



## నూటనాలుగవ అధ్యాయము

## ద్వారకానగర ప్రవేశము

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! ఆసమయమున బ్రహ్మ, శంకరుడు, పార్వతి, అనంతుడు, ధర్మదేవత, సూర్యుడు, హుతాశనుడు, కుబేరుడు. వరుణుడు, వాయువు. యముడు, మహేంద్రుడు, చంద్రుడు, రుద్రులు, ఆదిత్యులు, వసువులు, దేవతలు, దైత్యులు, కిన్నరులు మొదలగువారందరు ద్వారకానగరమును దర్శించుటకు వివిధవిమానములపై ఏతెంచిరి. ఆకాశమంతయు ద్వారకను దర్శించుట కఱుదెంచిన వారి విమానములచే నిండెను. భగవంతుని స్మరించుచు ఆప్రదేశమునకు వసుదేవుడు. దేవకి, ఉగ్రసేనుడు, పాండవులు, యశోదా

నందులు, గోపగోపికలు, వివిధ రాజన్యులు, సన్యాసులు, యతులు, అవధూతలు బ్రహ్మచారులు అరుదెంచిరి. వీరేగాక పంచవర్షీయులు బ్రహ్మమానస పుత్రులు, దిగంబరులునగు సనకసనందన సనాతన సనత్కుమారులు, దుర్వాసుడు, కశ్యప ప్రజాపతి, వాల్మీకి, గౌతముడు, బృహస్పతి, శుక్రాచార్యుడు, భరద్వాజుడు, అంగీరసుడు, ప్రచేతసుడు, పులస్త్యుడు, అగస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, మరీచి, శతానందుడు, ఋష్యశృంగుడు, విభాండకుడు, పాణిని, కాత్యాయనుడు, యాజ్ఞవల్క్యుడు, శుకమహర్షి, పరాశరుడు, చ్యవనుడు, గర్గుడు, సౌభరి, గాలవుడు. లోమశుడు మార్కండేయుడు, వామదేవుడు, జైగీషవ్యుడు సాందీపని, ఓఘుడు, పంచశిఖుడు, నేను (నారాయణఋషి నరుడు, విశ్వామిత్రుడు, జరత్కారు, ఆస్తీకుడు, పరశురాముడు, వాస్త్యుడు, సంవర్తకుడు, ఉతథ్యుడు, జైమిని, పైలుడు, సుమంతుడు, వ్యాసమహర్షి, శృంగి, ఉపమన్యుడు, గౌరముఖుడు, కచుడు, ద్రోణుడు, అశ్వత్థామ, కృపాచార్యుడు, మొదలగువారు తమతమ శిష్యసమూహములతో అరుదెంచిరి. వీరేగాక భీష్ముడు, కర్ణుడు, శకుని, నూర్గురు సోదరులతో దుర్యోధనుడు మొదలగు వారందరు ఏతెంచిరి. వారందరు ద్వారకాపురి దివ్యశోభను గాంచి పరమాశ్చర్యచకితులై అట్టిమహానగరము 'న భూతోన భవిష్యతి'యని కీర్తించిరి.

శ్రీకృష్ణపరమాత్మ ఆదేశానుసారముగ ఉగ్రసేనాదులు అహూతులందరికి స్వాగతము పల్కి అనేకవిధముల వారిని సత్కరించిరి. ద్వారకానగరములో సకలదేవతలు, మహర్షులు, రాజన్యులు, ప్రజలు శ్రీకృష్ణుని యాదేశానుసారముగ ఉగ్రసేనుని రత్నసింహాసనాసీనుగ జేసి సప్త తీర్థోదకములను దెప్పించి పూర్ణకుంభములతో వేదమంత్రములు పఠించు చుండగ యాదవ చక్రవర్తిగ అభిషేకించిరి. సకలదేవతలు, రాజన్యులు ఉగ్రసేనాదులకు వివిధోపహారములను సమర్పించిరి. తదనంతరము వసుదేవుడు బ్రాహ్మణులకు, యాచకులకు మణులను, రత్నములను, వస్త్రములను అనేకోపహారములను దానమొనరించెను. వాసుదేవుడు ద్వారకానగర మాహాత్మ్యము నిట్లు ప్రవచించెను.

శ్లో॥ సర్వతీర్థాపరా శ్రేష్ఠా ద్వారకా బహుపుణ్యదా । 59
యస్యాః ప్రవేశమాత్రేణ నరాణాం జన్మఖణ్డనమ్ ॥

దానం చ ద్వారకాయాం చ శ్రాద్ధం చ దేవపూజనమ్ ।
చతుర్గుణం చ తీర్థానాం గఙ్గాదీనాం చ భూమిప ॥ 60

సర్వతీర్థములకంటే ద్వారకానగరము అత్యంతశ్రేష్ఠము, అఖండపుణ్య ప్రదము. ద్వారకానగరమును ప్రవేశించినమాత్రమున నరుడు జన్మరాహిత్యము పొందగలరు. ద్వారకయందు ఒనరింపబడినదానములు, శ్రాద్ధములు, దేవపూజనములు, సకలతీర్థస్నానములు చేయుటవలన గలుగు పుణ్యముకంటె నాల్గురెట్లు అధికఫలమును ప్రసాదింపగలవు. ఉగ్రసేనునిరాజ్యాభిషేకమును, ద్వారకానగరరమ్యమనోహరదివ్యశోభను కన్నులకరవుదీర దర్శించి అందరు పరమానందభరితులై తమతమధామముల గరగిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు ద్వారకానగర ప్రవేశమును నూటనాలుగవ
అధ్యాయము సంపూర్ణము

---

# నూటయైదవ అధ్యాయము

## రుక్మిణీ కళ్యాణ ప్రస్తావన

శ్రీ నారాయణఋషి పలికెను :-

నారదా! విదర్భదేశమును భీష్మకుడనురాజు పరిపాలించుచుండెను. ఆయన నారాయణునియంశచే ఉత్పన్నుడైనరాజన్యుడు. భీష్మకుడు మహాబల పరాక్రమసంపన్నుడు, పుణ్యాత్ముడు, సత్యవ్రతపరిపాలకుడు, సంపత్ప్రదాత, ధార్మికుడు, అత్యంతమహిమాశాలి, సర్వశ్రేష్ఠుడు, సమదర్శి, విదర్భదేశీయ నరేశ్వరులకు చక్రవర్తి. ఆయన కొకపుత్రికజన్మించెను. ఆమెనామధేయము రుక్మిణి. రుక్మిణి సకలనారీమణులందు శ్రేష్ఠురాలు, అత్యంతసౌందర్యవతి, కుసుమకోమలి, మనోహారిణి, సకలసుందరీమణులం దత్యంతపూజనీయురాలు, శ్రీమహాలక్ష్మిపరిపూర్ణాంశ. ఆకన్యారత్నము దినదినప్రవర్ధమానయై అష్టవర్ష యుక్తయైనది. సదా శ్రీహరిదివ్యగుణనామ సంకీర్తనమందే సంలగ్నురాలై యుండుఆమె దివ్యరత్ననిర్మితభూషణవిభూషిత. ఆమె శ్రీయంగములకాంతి తప్తసువర్ణమువలెను ఉద్దీప్తము. స్వతేజముచే ప్రకాశించు ఆదివ్యాంగన శుద్ధసత్త్వస్వరూపిణి, సత్యశీల, పరమశాంత, శమదమపరాయణ, అనంతదివ్య

గుణరాశి. ఆమె శరత్పూర్ణచంద్రునివలె శోభించుచుండెను. రుక్మిణినేత్రములు శరత్కాలవికసితకమలసదృశముగ సువిశాలములు. భీష్మకచక్రవర్తి తనపుత్రిక వివాహయోగ్యురాలైనదని గ్రహించి ఆమె వివాహమును గుఱించి యోచింపదొడంగెను. ఆయన తన పుత్రులను, బ్రాహ్మణులను, పురోహితులను రావించి వారితో యోగ్యవరాన్వేషణ మునుగూర్చి ఇట్లు చర్చింప సాగెను.

భీష్మకుడు పలికెను:-

సభాసదులారా! నాకుమారీరత్న మగురుక్మిణి వివాహయోగ్యవయస్కురాలైనది; కావున నేను మునిపుత్రులందుగాని, దేవపుత్రులందుగాని, రాజపుత్రులందుగాని, రుక్మిణికి అభీష్టవరునిఅన్వేషింప సంకల్పించితిని. కావున మీరు నవయువకుడు, ధర్మాత్ముడు, సత్యసంధుడు, నారాయణపరాయణుడు, వేదవేదాంగవిశేషజ్ఞుడు, పండితుడు, సుందరుడు, శుభాచారసంపన్నుడు, శాంతుడు, జితేంద్రియుడు, క్షమాశీలయుక్తుడు, గుణవంతుడు, దీర్ఘాయువు, మహాకులసంజాతుడు, సర్వత ప్రతిష్టకల్గివాడునగువానిని వరునిగ నిర్ణయించి ఆవరునికొఱకై ప్రయత్నము లొనరింపుడు.

రాజాధిరాజైనభీష్మకుని యాదేశము నాలకించి వేదవేదాంగవిద్వాంసుడు, యదార్థజ్ఞాని, ప్రవచనకుశలుడు, ధర్మాత్ముడు, సమస్తకర్మలందు నిష్ణాతుడు, సంపూర్ణతత్త్వజ్ఞాతుడు. కులపురోహితుడు నగు శతానందుడు రాజుతో నిట్లు పల్కెను;

శతానందుడు పలికెను:-

రాజేంద్రా! నీవు స్వయముగ ధర్మజ్ఞుడవు, ధర్మశాస్త్రములందు నిపుణుడవు; అయినను వేదములందు ప్రవచింపబడిన పరమరహస్యము వర్ణించెద నవధరింపుము. పరిపూర్ణతముడు, పరమేశ్వరుడు, బ్రహ్మకు గూడ విధాతయు, బ్రహ్మశివ శేషాదిసకల దేవతావందితుడు, పరజ్యోతి స్వరూపుడు, భక్తానుగ్రహ మూర్తియు, సమస్తప్రాణులందు విరాజిల్లు పరమాత్మయు, ప్రకృతికంటె అతీతుడు, నిర్లిప్తుడు, ఇచ్ఛారహితుడు, సర్వుల కర్మలకు సాక్షియు నగు ఆనారాయణుడు పృథ్వీభారము హరించుటకు అవనిపై వసుదేవనందనుని రూపమున అవతీర్ణుడయ్యెను. రాజేంద్రా! ఆపరిపూర్ణతమునకు కన్యాదానము చేసి నీవు నీ పూర్వీకులతో కలసి గోలోకపరంధామమును జేరగలవు. ఆయనకు

కుమార్తె నొసగి ఇహలోకమందు సర్వపూజ్యుడవు, గురువునకు ఆచార్యుడవు నై విరాజిల్లి అంత్యకాలమున పరలోకములో సారూప్యముక్తినొందుము. దేవా నీసర్వస్వమును దక్షిణగ నొసంగి శ్రీమహాలక్ష్మి స్వరూపిణి యైన రుక్మిణిని శ్రీకృష్ణ పరమాత్మకు సమర్పించి చరితార్థుడవై జననమరణ చక్రమును దాటుము. రాజా! విధాత ఎనాడో ఈసంబధము నిర్ణయించెను ఈసంబంధము సర్వసమ్మతముగావున శీఘ్రముగ ద్వారకాపురవాసి, శ్రీకృష్ణునికడకు బ్రాహ్మణునిబంపి కళ్యాణ ముహూర్తమునునిశ్చయింపుము. లగ్నపత్రికను వ్రాయింపుము భక్తానుగ్రమూర్తి, ధ్యానానురోధ కారణుడు, నిత్యవిగ్రహధారి సర్వోత్తముడు నగు శ్రీకృష్ణుని సపరివారముగ మీరాజధాని కాహ్వానింపుము నరేశ్వరా! ఇట్లు అపరబ్రహ్మమును దర్శించి నీరాకపోకలను విధ్వంస మొనరించుకొనుము, మహారాజా! నాల్గువేదములు, భక్తులు, దేవగణములు, సిద్ధేంద్రులు, మునీంద్రులు, బ్రహ్మాది దేవతలు ఎవనిని తెలిసికొనలేక పోయిరో, ధ్యాన పూతులైన పరమయోగులు ఎవనిని ధ్యానించినను సాక్షాత్కారము పొంద లేరో, నాల్గువేదములు, సకలశాస్త్రములు, సరస్వతి ఏవని గుణములను గాన మొనరించుటలో అసమర్థులో; సహస్రముఖ సమన్వితు డైన ఆదిశేషుడు, పంచముఖధారి యైనమహేశ్వరుడు, చతుర్ముఖములు కల్గిన బ్రహ్మ, కార్తి కేయుడు, ఋషులు, మునులు, పరమవైష్ణవులు, భక్తజనులు ఎవనిదివ్యగుణ నామసంకీర్తనము సదా యొనరింతురో, ఏజగన్నాథుడు యోగులకు ధ్యానము ద్వారాసాధ్యుడో ఆ శ్రీకృష్ణుని యనంత గుణములలు శిశువునైననేను ఏమని వర్ణింపగలను?

శతానందుని దివ్యవచనముల నాలకింపగనే భీష్మకునిముఖము ప్రఫుల్లిత మయ్యెను. ఆయన సింహాసనమునుండి దిగ్గున లేచినవాడై పురోహితుని సాద రముగ ఆలింగము జేసికొనెను. శతానందుని వరనిర్ణయమునకు భీష్మకచక్రవర్తి అఖండానందభరితుడై ఆయనకు నానావిధరత్నములను సువర్ణములను, వస్త్ర ములను, రత్నభూషణములను, గజరాజును, అశ్వమును, మణినిర్మితరథమును, రమణీయరత్నసింహాసనమును, ధనమును, సస్యపరిపూర్ణమైనభూమిని, గోవులను, అనేకగ్రామములను ఉపహారములుగ సమర్పించెను. అంతలో అధర్మవర్తనుడు, చంచలస్వభావసంపన్నుడు, రాజకుమారుడైన రుక్మి శ్రీకృష్ణప్రశంస నాలకించి అత్యంతకుపితు డయ్యెను. క్రోధవశుడైన వానిముఖము, నేత్ర

ములు రక్తపంకజసదృశములైనవి. వానిశరీరము కంపింపదొడంగెను. రుక్మి సభామధ్యములో సింహాసనము నుండి లేచి తనతండ్రియైన భీష్మకునితో విప్రవరుడైన శతానందునితో ఇట్లుపల్కెను.

రుక్మి పలికెను :-

రాజేంద్రా! ఈభిక్షుకుల, లోభుల, ఆశ్రితుల వచనముల నేల ఆలకించెదవు? హితకరములైన ప్రశంసనీయములైన నామాటల నాలకింపుము. మహాబాహు! కృష్ణుడు శతానందులు కీర్తించినంతటివాడుకాడు. ఆయన భయమునకు లోనై యుక్తి నాశ్రయించి రాజేంద్రుడైన ముచికుందుని సహాయముతో కాలయవనుని వధించి వాని సమస్తైశ్వర్యమును అపహరించెను. ఆకాలయవనుని ధనమును పొందియే శ్రీకృష్ణు డీనాడు ద్వారకలో సంపన్నుడైనాడు. తండ్రీ! ఆతడు జరాసంధుని పరాక్రమమునకు భీతిల్లి సముద్రమధ్యమున ద్వారకా నగరములో దాగెను. కాని అట్టి వందలకొలది జరాసంధులనైనను నేను ఒంటరిగనే క్షణములో లీలగ సంహరింపగలను. అన్యరాజులు నాసమక్షమున ఎంతటివారు? తండ్రీ! నేను దుర్వాసమహర్షి శిష్యుడను. సకలశస్త్రాస్త్ర నిపుణుడను. యుద్ధశాస్త్రజ్ఞాన బలముతో నేను నిశ్చయముగ విశ్వసంహారము చేయుటలో సమర్థుడను. నావంటి బలవంతులు కేవలము పరశురాముడు లేక శిశుపాలుడే. ఆశిశుపాలుడు మహాబలవంతుడు, అఖండశౌర్య సంపన్నుడు, స్వర్గమునే జయింపగల శక్తి కల్గిన వీరుడు, నామిత్రుడు. నరేశ్వరా! వృద్ధుడు దుర్బలుడైన జరాసంధుని సంహరింపజేసి శ్రీకృష్ణుడు శత్రుశూన్యమొనరించినానని యహంకరించుచున్నాడు, తనకు తానే వీరుడనని గర్వించుచున్నాడు. వివాహేచ్ఛతో ఆగోపాలుడు నానగరమును ప్రవేశించిన తక్షణమే పరివార సహితముగ వానిని యమపురికి బంపగలను. వైశ్యజాతీయుడైన నందుని పుత్రునకు, గోపాలకునకు, గోపాంగనాలంపటునకు, గోపబాలకుల ఎంగిలి తినువానికి మీరు మీకన్యను దానముచేయుటకు సమ్మతించుచున్నారు. ఇది మహాశ్చర్యకరమైన విషయము. రాజేంద్రా! ఈ బకవాది వచనముల నాలకించి మీరు మీబుద్ధిని కోల్పోయినారు. ఈబిక్షుక బ్రాహ్మణుడు ఉపదేశించినంత మాత్రమున మీరు మీకన్యను రుక్మిణిని శ్రీకృష్ణున కర్పింపగ నిర్ణయించినారు. అతడు రాజకుమారుడుకాడు, శూరవీరుడు కాడు, కులీనుడు కాడు, పవిత్రాచరణ సంపన్నుడు కాడు, దాత కాడు, ధనవంతుడు కాడు,

యోగ్యుడు కాడు, జితేంద్రియుడు కానేకాడు; కావున భూపాలా! మీరు శ్రీకృష్ణుని పరిత్యజించి శిశుపాలునకు కన్యనొసంగుడు. అతడు సత్కుల సంజాతుడు, రాజాధిరాజకుమారుడు, తనపరాక్రమముచే రుద్రునైన సంతుష్టిపఱచగల ధీశాలి. రాజా! ఇక విలంబము చేయక శీఘ్రముగ లగ్నపత్రికను శిశుపాలున కంపి ముహూర్తమునకు సకలరాజన్యులను, మహర్షులను, సహోదర బంధువులను ఆహ్వానింపుము.

ఇట్లు శ్రీకృష్ణ పరమాత్మను అనేక విధముల దుర్భాషలాడిన రుక్మి వచనములను భీష్మకుడు సరుకుగొనక ఏకాంతముగ పురోహితుని, మంత్రులను సంప్రదించెను. తదనంతరము సర్వులకు అభీష్టమైన శుభలగ్నమును నిర్ణయించి యోగ్యుడైన, అంతరంగికుడైన బ్రాహ్మణుని రహస్యముగ ద్వారకానగరమునకు పంపెను. రాజధానిలో భీష్మక చక్రవర్తి అత్యంత హర్ష యుక్తుడై వివాహ సామగ్రిని ఆయత్తపరచి నాల్గుదిక్కులకు ఆహ్వానములను పంపెను. భీష్మక చక్రవర్తిచే పంపబడిన బ్రాహ్మణోత్తముడైన సుధర్మానామధేయుడు ద్వారకానగరమును జేరి సకల రాజన్యులచే దేవతలచే పరివేష్టిత మైయున్నసభను ప్రవేశించి ఉగ్రసేనునకు తన చక్రవర్తి సందేశమును అందించి మంగళపత్రిక నొసంగెను. ఆ పరమమంగళపత్రికను ఆలకించి ఉగ్రసేను డత్యంతానంద భరితు డయ్యెను. శ్రీకృష్ణునకు రుక్మిణి తగిన అర్ధాంగి యని ఉగ్రసేన వసుదేవ నందాదులు నిర్ణయించి మంగళపత్రికను తోడ్కొని వచ్చిన బ్రాహ్మణుని వేలకోలది సువర్ణముద్రలతో సత్కరించిరి. ద్వారకానగరములో తూర్యమంగళ నాదముల నడుమ శ్రీకృష్ణ రుక్మిణీ కళ్యాణ ముహూర్తమును నిర్ణయింపబడెను ద్వారకానగర వాసు లందరు శ్రీకృష్ణునితో కలసి కళ్యాణ మహోత్సవమునకు బయలుదేరిరి. విదర్భదేశమునకు బయలుదేరిన పెండ్లివారి యురేగింపులో సకలదేవతలు, మహర్షులు, రాజేంద్రులు, యాదవులు, కౌరవులు, పాండవులు, విద్వాంసులైన బ్రాహ్మణులు, శిల్పులు, గాయకులు, గంధర్వులు మొదలగు వారెందరో గలరు. నారదా! ఆయురేగింపులో ఉపబర్హణుడను గంధర్వరాజగు నీవు పాల్గొంటివి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ జన్మఖండమందు రుక్మిణీ కళ్యాణ ప్రస్తావనము నూటయైదవ అధ్యాయము సంపూర్ణము



# నాటఆఱవ అధ్యాయము

## -: రేవతీబలరాముల వివాహము :-

నారాయణ ఋషి పలికెను:-

నారదా! ఆసమయమునందే బ్రహ్మలోకవాసి యైన కకుద్మి తనకన్యకు యోగ్యవరుని వేదకుచు అవనిపై కలుదెంచెను. ఆరాజేంద్రుని పుత్రికయే రేవతి. ఆమె స్థిర యౌవ్వన సంపన్న. అమూల్య రత్నాభరణ విభూషిత, త్రిలోక సౌందర్యవతి, ఆమె యయుర్దాయము ఇరువదియేడు యుగములు గడచిపోయెను. ఆరాజన్యుడు రేవతికి తగినవరుడు శ్రీకృష్ణాగ్రరాజు డైన బలదేవు డని నిర్ణయించి తనకన్యను మహాబలియైన బలదేవునకు కన్యాదాన మొనరించుటకు నిశ్చయించెను. మహర్షులు, సకల దేవతలు ఆసీనులైయున్న సభలో విధిపూర్వకముగ ఆబ్రహ్మలోకవాసి యగు కకుద్మి తనపుత్రికయగు రేవతిని బలరామునకు సహధర్మచారిణిగ చేసెను. తదనంతర మారాజు లక్షలకొలదిగ గజములను, అశ్వములను, రథములను, రత్నభూషణములను, మణిమాణిక్యములను, కోట్లకొలది సువర్ణముద్రలను, సుందర దివ్యవస్త్రము లను వివాహ సందర్భములో తనజామాతకు ఉపహారములుగ అర్పించెను. తదనంతరము వారందరు సపరివారముగ రత్ననిర్మిత రథరూఢులై కుండినీ నగరమును ప్రవేశించిరి. వైవాహిక మంగళకార్యములను సంపన్న మొనరించి దేవకి, రోహిణి, యశోద, అదితి, దితి, శాంతి, జయజయాకారములను పల్కుచు నవదంపతు లైన రేవతీ బలరాములను గృహప్రవేశ మొనరించిరి. దేవకీవసుదేవులు బ్రాహ్మణులకు సంతర్పణలు గావించి అనేకదానము లొనరించిరి.

తదనంతరము దేవతలు, మహర్షులు కుండినీనగరమున కలుదెంచిరి. దేశదేశముల రాజన్యులు అపారసేనావాహినులతో కుండినీనగరమును జేరిరి. శ్రీకృష్ణునికళ్యాణమును తిలకించుట కలుదెంచినవా రందరు నగరసింహ ద్వారమువద్ద సకలసైన్యసమన్వితులై రక్షించుచున్న నల్గురుమహారథులను గాంచిరి. రుక్మి, శిశుపాలుడు, మహాబలియగు దంతవక్త్రుడు, మాయావులందు శ్రేష్టుడు, యుద్ధశాస్త్రమందు నిపుణు డైనసాల్వుడు. ఆసమయమున యుద్ధ మొనరించుటకు సంసిద్ధు డైనరుక్మి వివిధశస్త్రాస్త్రములచే నలం కృత మైనరథము నధిరోహించి శ్రీకృష్ణునితో పాటువచ్చిన సకలరాజన్య

సమన్వితసైన్యమును గాంచి కుపితుడై శ్రీకృష్ణు నిట్లు నిందింపదొడంగెను. "అహో! కాలకృతకర్మను, దైవికమును ఎవరునివారింపగలరు? పశువులకాపరి, గోపికాలంపటుడు, గోపోచ్ఛిష్టభోజనుడు, కులము లేనివాడు, జన్మనిర్ణయము లేనివాడు, రాజకుమారు డనిగాని, మునిపుత్రుడనిగాని నిర్ణయింపదగనివాడు, వసుదేవుని పుత్రుడై వైశ్యునియింట పెరిగినవాడు, ధర్మాత్ముడైన కంసుని సంహరించినవాడు, కంసహత్యవలన బ్రహ్మహత్యాపాతకమును పొందినవాడు నగు శ్రీకృష్ణుడు దేవతలతో, ఋషులతో కలసి మనోహారిణియగు రుక్మిణిని పాణిగ్రహణముచేసికొనుటకు వచ్చుచున్నాడు."రుక్మి శ్రీకృష్ణుని అనేకవిధముల దుర్భాష లాడినట్లే శిశుపాలుడు, శాల్వుడు, దంతవక్త్రుడు అనేకవిధముల నిందించిరి. ఈనీచులు బల్కిన దుర్వచనములనాలకింపగనే శ్రీకృష్ణునితో వేంచేసిన దేవతలకు, మహర్షులకు, రాజులకు, బలదేవసహితులగు యాదవులకు అత్యంతముగ కోపము కల్గెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని
శ్రీకృష్ణ జన్మఖండమందు రేవతీబలరాముల వివాహమను
మను నూటఆఱవ అధ్యాయము
సంపూర్ణము.

## నూటయేడవ అధ్యాయము

### సాల్వాదులను బలదేవుడు మర్ధించుట భీష్మకుడు శ్రీకృష్ణుని స్తుతించుట

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

బ్రహ్మకులైకపావనా! సాల్వాదులొనరించిన శ్రీకృష్ణనింద నాలకింపగనే నాగాయుతబలసంపన్నుడైన బలభద్రుడు రక్తపంకజలోచనుడై ఆగ్రహావేశ పూరితుడై తనహలాయుధప్రహారముచే రుక్మి అధిష్ఠించిన దివ్యాస్త్రశస్త్ర సంపన్నమైన రథమును చూర్ణ మొనరించెను. యాదవసైన్యములు సింహ

నాదము లొనరించుచు, శంఖములను పూరించుచు శత్రుమూకలను దాకి చీల్చి చెండాడినవి. ఆ ఘోరసంగ్రామమధ్యములో సాల్వుడు మరణించెను. బలదేవుడు శిశుపాలదంతవక్త్రులను సంహరింపక వారిని మర్దించి పరాజితులుగ నొనరించి తరిమివేసెను. వారు శ్రీకృష్ణునిచేతిలో మరణింపవలె నని మహాదేవుడు బలదేవుని ఆదేశించెను. రుక్మి యాదవుల పరాక్రమమునకు తాళలేక ప్రాణములను అఱచేతబెట్టుకొని పలాయనము చిత్తగించెను.

అపుడు శతానందుడు నగరముఖద్వారమున కేతెంచి శ్రీకృష్ణసహితులైన సకలయాదవులను, మహర్షులను, దేవతలను వివాహమహోత్సవార్థమై నగరప్రవేశ మొనరింపవలసినదిగ అభ్యర్థించెను. భీష్మక చక్రవర్తి మొదలగువారందరు యాదవాదులకు అఖండస్వాగత మొసంగి ఘనముగ సత్కరించిరి. ఆసమయమున వరునిరూపములో అలంకృతుడైన శ్రీకృష్ణునిశోభ వర్ణింపనలవి కానిది. ఆభక్తానుగ్రహావిగ్రహుడు నవీనజలదశ్యాముడు, పీతవస్త్రధారి, చందనోక్షితసర్వాంగుడు, వనమాలావిభూషితుడు, రత్నకేయూరవలయరత్నమాలాకులోజ్జ్వలుడు, రత్నకుండలయుగ్మడు, రత్నేంద్రసారనిర్మాణక్వణన్మంజీరరంజితుడు, సస్మితుడు, మురళీహస్తుడు, చారులక్షణలక్షితనఖపాద గుల్ఫజానుజంఘోరుడు, కటినాభిమధ్యోదరుడు, సాదరుడు, శ్రీవత్సకౌస్తుభవనమాలికా విరాజితవిశాలవక్షుడు, పుండరీకాక్షుడు, రమ్యామురళీవినోదహస్తుడు, సత్త్వగుణప్రశస్తుడు, బ్రహ్మసూత్రహారకేయూర కటకకంకణకుండల మయూరపిచ్ఛకిరీటాది విభూషణుడు, భక్తజనపోషణుడు, సుందరకపోలఫాలనాసాధరవదనకర్ణుడు, కంబుకంధరుడు, కరుణాగుణబంధురుడు, నవయౌవ్వనసంపన్నుడు, శరత్పూర్ణేందుతుల్యుడు, భక్తానుగ్రహకారకుడు, కోటికందర్పసౌందర్యాధికుడు, సత్యుడు, నిత్యుడు, సనాతనుడు, వరుడు, తీర్థపూతుడు, కీర్తిపూతుడు, బ్రహ్మేశశేషవందితుడు, పరమాహ్లాదకుడు, కోటిచంద్రసమప్రభసమన్వితుడు, ధ్యానాసాధ్యుడు, దురారాధ్యుడు, ప్రకృతికే అతీతుడు, త్రిజగన్మోహనాకారుడైన శ్రీకృష్ణుని దర్శించి సకలయువతులు ప్రేమవశమున మూర్ఛిల్లిరి. ఆ వివాహమహోత్సవమున కేతెంచిన సర్వులు రుక్మిణీ జీవనము ధన్యము, పరమశ్లాఘనీయ మని యనేకవిధముల కీర్తించిరి. మహారాణి యైన భీష్మకపత్ని జామాతను గాంచి పరమప్రసన్నురాలయ్యెను. సకల రాజపరివారముల ముఖములు, నేత్రములు శ్రీకృష్ణుని దర్శింపగనే ఆనందాతి

రేకముచే ప్రఫుల్లితము లైనవి. అందఱు నిర్నిమేషదృష్టితో ఆజగదానంద కారకుని తనివితీర వీక్షింపదొడంగిరి. భీష్మకచక్రవర్తి, సకలపురోహితులు, సచివులు అత్యంత పరమహర్షయుక్తులైరి. వారందరు శ్రీకృష్ణుని ఊరేగింపునకు ఎదురువెళ్ళి సకలదేవతలకు, బ్రాహ్మణులకు, రాజన్యులకు, యాదవులకు అఖండస్వాగతము పల్కి రమ్యహర్మ్యములను విడుదులుగ నొసంగి అమృతోపము లైన భక్ష్యసామగ్రిలతో విందుల నర్పించిరి. అహర్నిశములు అతిథులను సత్కరింపుడు అను శబ్దములతో కుండిననగర మంతయు ప్రతిధ్వనించెను.

విడుదులలో వసుదేవాదులు సకలదేవతలతో, బంధుబాంధవులతో సుఖపూర్వకముగ ఆ రాత్రి విశ్రమించిరి. వారు ప్రాతఃకాలముననే లేచిశౌచాది ప్రాతఃకృత్యములను సమాప్తమొనరించి పవిత్రజలములలో స్నానము లాచరించి, శుద్ధులై, శుద్ధవస్త్రములను ధరించినవారై, సంధ్యావందనాదినిత్యకర్మలను సంపన్న మొనరించిరి. తదనంతరము వేదమంత్రోచ్చారణద్వారా శ్రీహరిమూర్తిప్రతిష్ఠ నొనరించిరి. వసుదేవుడు సర్వదేవతలతో కలసి సర్వమాతృకలను బాగుగ పూజించి వసుధారను ప్రధానమొనరించి వృద్ధిశ్రాద్ధాదిమంగళకృత్యములను సంపన్న మొనరించెను. తదనంతరము వారందరు అమృతోపమయమృష్టాన్నములను భుజించి అప్రతిమసౌందర్యశాలి యైనవరుని అనేకవిధముల శృంగారించి ఊరేగింపుగ కళ్యాణమండపమునకు బయలుదేరిరి.

అట్లే భీష్మకచక్రవర్తికూడ పురోహితులతో వేదమంత్రోచ్చారణపూర్వకముగ సర్వవైవాహికమంగళకార్యములను సంపన్న మొనరించెను. ఆయన హర్షమగ్నుడై భట్టులకు, బ్రాహ్మణులకు, యాచకులకు, మణులను, రత్నములను, సువర్ణములను, ముత్యములను, మాణిక్యములను, వజ్రములను, భోజనసామాగ్రిని, వస్త్రములను, అనుపమోపహారములను దాన మొనరించెను. వివాహమంటపము మంగళవాద్యములచే మార్మోగినది. సకల రాణులు మునిపత్నులు యథోచితవిధిగ వధు వగురుక్మిణిని మనోహరముగ దివ్యరత్నాభరణములచే అలంకరించిరి. ఆసమయములో పరమోదయము హేంద్ర మగుశుభముహూర్త మాసన్నమైనది. ఆముహూర్తము లగ్నాధిపతిసంయుక్తము, శుద్ధశుభగ్రహదృష్టిభరితము, అసద్గ్రహదృష్టిరహితము. ఏముహూర్తములో సకల నక్షత్రములు, క్షణములు శుభములో, చంద్రబలము, తారాబలము విశుద్ధములో, శలాకాదివేధదోషరహితమో అట్టిముహూర్త మాసన్నమయ్యెను.

ఆముహూర్తము పరిణామమందు సుఖప్రదము, వధూవరులకు కళ్యాణకరము. ఆదివ్యముహూర్తములో వరుడైన శ్రీకృష్ణపరమాత్మ సకలబాంధవమహర్షిగణదేవతాపరివేష్టితుడై, భీష్మకుని ప్రాంగణములో ప్రవేశించెను. ఆ సమయమున ఆయనతో దేవతలు; మహర్షులు, బ్రాహ్మణులు, పురోహితులు, బాంధవులు, తలిదండ్రులు, నరేశ్వరులు, గోపకుమారులు మనోహరవేషభూషలచే సుసజ్జితులైనసమవయస్కులైనపార్షదగణములు, భట్టులు, జ్యోతిశాస్త్రవిశారదులు, గణికులు భీష్మకునిప్రాంగణమును ప్రవేశించిరి.

ఆవివాహమంటపము అత్యంతసుందరము, సకలమాంగలికవస్తువులచే సుశోభితము, మనోహరవిచిత్రశిల్పకళద్వారానిర్మితము. వివాహమంటపసౌందర్యమును గాంచి సకలజనులు ముగ్ధులైరి. అపుడు బ్రహ్మాదిసకలదేవతలతో, రాజేంద్రులతో, దానవేంద్రులతో, సనకసనందనాదిమహర్షిగణములతో, శ్రేష్ఠపార్షదులతో పరివేష్టితుడై శ్రీకృష్ణపరమాత్మ రథమును డిగ్గి కళ్యాణమంటపప్రాంగణమును ప్రవేశించెను. శ్రీకృష్ణుని, సకలదేవతలను మహర్షులను, యాదవులను, సర్వేశగులను గాంచి భీష్మకచక్రవర్తి సింహాసనమునుండి లేచి ఎదురేగి తలవంచి నమస్కరించి పెద్దలందరిని క్రమముగ పూజించి ఆహూతులాసీనులగుటకు రత్నసింహాసనములను సమర్పించెను. ఆ సమయములో భీష్మకునినేత్రములు ఆనందాశ్రుభరితములైనవి. ఆయన అంజలి ఘటించి భక్తిసమన్వితుడై సకలదేవతలను, వసుదేవనందనుడైనవాసుదేవుని అనేకవిధముల ఇట్లుస్తుతించెను.

భీష్మకుడు పలికెను :

దేవా ! నేడు నాజన్మ సఫలమైనది, జీవనము సుజీవనమైనది. నా కోటానుకోట్లజన్మలకర్మమూలములు ఖండింపబడినవి; ఆయన లోకవిధాత, సర్వసంపత్ప్రదాత, తాపసులకు తపఃఫలప్రదాత, స్వప్నమునందైనను అయన చరణకమలదర్శనము దుర్లభము, ఆసృష్టికర్త యగుబ్రహ్మ నాప్రాంగణములో విరాజిల్లుచున్నాడు. యోగీంద్రులు, సిద్ధేంద్రులు, సురేంద్రులు, మునీంద్రులు మొదలగువారందరు ధ్యానమునందుకూడ ఎవరిని దర్శింపలేకున్నారో, ఆదేవాదిదేవుడైనశంకరుడు, కాలకాలుడు, మృత్యువునకే మృత్యువు, మృత్యుంజయుడు, సర్వేశ్వరుడైనశివుడు నేడు నాప్రాంగణమునకు దయచేసినాడు. సర్వులహృదయములందు గలఅంతరాత్మాస్వరూపుడైన

విష్ణువు నేడు మాయదృష్టముపలన మాచర్మచక్షువులకు దృష్టిగోచరుడైనాడు. ఎవనిసహస్రఫణములలో ఒకఫణముపై సకలచరాచరవిశ్వము స్థిరమైయున్నదో. సర్వవేదములందు ఎవనిమహిమలకు అంతములేదో, ఆ అనంతుడు నేడు నా ప్రాంగణములో నున్నారు. ఏదైవము సర్వాభీష్టములను పరిపూర్ణ మొనరింపగలవాడో, సర్వప్రథమమున ఎవరికి అగ్రపూజ లభించునో, ఎవరు దేవగణములకు శ్రేష్ఠుడో, ఆగణేశ్వరుడు నాప్రాంగణములో నున్నాడు. ఎవరు మునులందు, వైష్ణవులందు సర్వశ్రేష్ఠులో, సకలజ్ఞానులకు ఆచార్యుడో ఆసనత్కుమారులు నేడు ప్రత్యక్షరూపమున నాప్రాంగణములో నున్నారు. బ్రహ్మయొక్క కుమారులు, పౌత్రులు, ప్రపౌత్రులు, వంశజులు మొదలగువారందరు బ్రహ్మతేజముతో ప్రజ్వరిల్లుచు ఈనాడు నాగృహమున కతిథులై అరుదెంచినారు. అహా! నాయీవాసస్థానము కల్పాంతపర్యంతము తీర్థ తుల్యమైనది. ఎవరిచరణోదకములచే తీర్థములే పావనము లగునో ఆమహాత్ముల చరణకమలములస్పర్శచే నేడు నాగృహము విశుద్ధమైనది. భూమిపై గలసకల తీర్థము లన్నియు సాగరమందు కలవు. సాగరమందు గల ఆతీర్థము లన్నియు సర్వాబ్రహ్మణుని చరణకమలములందు నివసించును. ఏప్రభువు ప్రకృతికే అతీతుడో, బ్రహ్మవిష్ణుశివాదిదైవములకే ధ్యానముద్వారా యైనను అసాధ్యుడో, పరమయోగులకైనను దురారాధ్యుడో, నిర్గుణుడో, నిరాకారుడో, భక్తానుగ్రహవిగ్రహుడో, బ్రహ్మశివశేషాదిసకలదేవగణములు ఎవనిచరణకమలములను సదా ధ్యానింతురో, కుబేరునకైనను, గణేశ్వరునకైనను, సూర్యునకైనను ఏదేవాదిదేవునిదర్శనము దుర్లభమో ఆజగన్నాథుడు, పరిపూర్ణుడైన భగవంతుడు సాక్షాత్తుగదివ్యసచ్చిదానందరూపమున నాగృహమునకు వేంచేసి సకలమానవులకు దృష్టిగోచరుడైనాడు.

ఇట్లు సకలదేవతలను అనేకవిధముల స్తుతించి తుదకు భీష్మకచక్రవర్తి శ్రీకృష్ణునిసమక్షమున నతమస్తకుడై, ముకిళితహస్తుడై, నిలువబడి సామవేదోక్తస్తోత్రముద్వారా ఆపరమేశ్వరు నిట్లుస్తుతింపదొడంగెను.

భీష్మకుడు పలికెను :

శ్లో॥ సర్వాన్తరాత్మా సర్వేషాం సాక్షీ నిర్లిప్త ఏవ చ ।
కర్తౄణాం కర్మణామేవ కారణానాం చ కారణమ్ ॥ 88
కేచిద్ వదన్తి త్వామేకం జ్యోతిరూపం సనాతనమ్ ।
కేచిచ్చ పరమాత్మానం జీవో యత్ప్రతిబిమ్బకః ॥ 89

శ్లో॥ కేచిత్ ప్రాకృతికం జీవం సగుణం భ్రాన్తబుద్ధయః ।
కేచిన్నిత్యశరీరం చ బుద్ధాశ్చ సూక్ష్మబుద్ధయః ॥ 50
జ్యోతిరభ్యన్తరే నిత్యం దేహరూపం సనాతనమ్ ।
కస్మాత్తేజః ప్రభవతి సాకారమీశ్వరం వినా ॥ 51

నీవు సమస్తప్రాణులకు అంతరాత్మవు, సర్వసాక్షివి, నిర్లిప్తుడవు, సకల కర్మ కర్తలకు, కర్మలకు, కారణములకు కారణుడవు. కొందరు నిన్ను ఏకైక సనాతనమైన జ్యోతియని వచింతురు. మఱికొందఱు సకలజీవులు ఎవని ప్రతిబింబములో ఆపరమాత్మయని కీర్తింతురు. కొందరు భ్రాంతిబుద్ధి యుక్తులైన వారు నిన్ను ప్రాకృతిక సగుణజీవమని ఉద్ఘోషించెదరు; కాని సూక్ష్మ బుద్ధి గల వారుజ్ఞానులు నగు నీఅనన్యభక్తులు నీవు నిత్యమైన సచ్చిదానంద విగ్రహుడ వని నొక్కివక్కాణించెదరు. సకలదేవ వందితా! నీవు అఖండజ్యోతి మధ్యమున విరాజిల్లు సనాతనమైన, అక్షరమైన సచ్చిదానంద విగ్రహుడవు; సాకారుడైన ఈశ్వరుడు లేకున్న ఈ అఖండ తేజము ఎచటనుండి ఉత్పన్నమగును అనగా ఈ అఖండ తేజము అంతయు నీ శ్రీఅంగములనుండి ప్రాదుర్భవించినదే.

నారదా! ఇట్లు స్తుతించి భీష్మక చక్రవర్తి శ్రీమహావిష్ణువును స్మరించి హర్షసమన్వితుడై శ్రీమహాలక్ష్మి ద్వారాసమర్చితములైన పాదములకు పాద్యము నొసంగెను. తదుపరిదూర్వాంకుర జల సమన్విత మగు అర్ఘ్యము నొసంగెను. మధుపర్కమును, గోవును సమర్పించి శ్రీకృష్ణుని దివ్యాంగములకు చందనానులేపన మొనరించెను. మహేంద్రుడు ప్రసాదించిన దేవపారిజాత పుష్పమాలను భీష్మకచక్రవర్తితన జామాతగళమున అలంకరించెను. కుబేరు డొసంగిన అమూల్య రత్నదివ్యాభరణములతో భక్తిపూర్వకముగ శ్రీకృష్ణు నలంకరించెను. పూర్వకాలమున అగ్నిదేవు డొసంగిన అగ్నిశుద్ధ యుగ్మ వస్త్రముల భీష్మకుడు శ్రీకృష్ణునకు సమర్పించెను. విశ్వకర్మ నిర్మించిన అఖండ తేజ సమన్విత రత్నమకుటమును భీష్మకుడు శ్రీకృష్ణుని మస్తకముపై నలంకరించెను. తదనంతరమాయన రత్ననిర్మిత సింహాసనమును, నానాపుష్పములను, ధూపములను, రత్న ప్రదీపములను అత్యంతమనోహర నైవేద్యములను ఆదివ్యవరున కొసంగి సప్త తీర్థజలములచే శ్రీకృష్ణుని ఆచమన మొనరింపజేసెను. సువాశిత జలములను, తాంబూలమును, సుందరశయ్యను, వరుడైన శ్రీకృష్ణున కర్పించి భీష్మక చక్రవర్తి షోడశోపచారపూజను సంపన్న మొనరించెను. శ్రీకృష్ణునకు పుష్పాంజలులు సమర్పించి భీష్మకుడు చరితార్థుడయ్యెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని
శ్రీకృష్ణ జన్మఖండమందు, భీష్మకుడు శ్రీకృష్ణుని స్తుతించుట
యను నూటయేడవ అధ్యాయము సంపూర్ణము.

# నూటయొనిమిదవ అధ్యాయము

## శ్రీ రుక్మిణీకళ్యాణము

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! ఆసమయముననే మునిపత్నులు, దేవాంగనలు శ్రీమహాలక్ష్మీస్వరూపిణి యైన రుక్మిణీదేవిని సాదరముగ వివాహమంటపమునకు తోడ్కొనివచ్చిరి. రుక్మిణి రత్నాభరణములచే విభూషితయై అగ్నిశుద్ధవస్త్రములను ధరించి విరాజిల్లుచున్నది. తన సస్మితవదనమును ఆమె రత్నజటిత దర్పణములో చూచుకొనుచు ముఖమును మంగళతిలకముచే అలంకరించుకొని చందనచర్చితయై త్రిభువనమనోహరముగ సభాసదులకు దర్శనమొసంగెను. ఆజగజ్జనని శ్రీ మహాలక్ష్మీస్వరూపిణియగు రుక్మిణీదేవిని దేవేంద్రులు, మునీంద్రులు, సిద్ధేంద్రులు, నృపశ్రేష్ఠులు, సకలప్రజలు దర్శించి చరితార్థులైరి.

రుక్మిణి వివాహమంటపమును జేరగనే తన ప్రాణేశ్వరుడైన శ్రీకృష్ణునకు సప్తప్రదక్షిణముల నొనరించి ఆయన పదపంకజములకు నతమస్తకయై ప్రణమిల్లి భగవంతుని శ్రీ అంగములపై సుకోమల పల్లవములద్వారా చందన మిశ్రితసువాశితశీతల జలములను జల్లెను. అట్లే జగత్పతియగు శ్రీకృష్ణపరమాత్మకూడ శాంతస్వరూపిణి, మందస్మితముఖారవిందయు, నగు రుక్మిణిపై సువాశితశీతల జలములను జల్లెను. శుభముహూర్తమాసన్నము కాగా పతీ పత్నిని, పత్ని పతిని పరస్పరావలోకనమొనరించిరి. తదనంతరము అఖండ తేజముతో ఉద్దీప్తురాలగుచున్న రుక్మిణి లజ్జతో తలను వంచుకొని తండ్రి యొడిలో కూర్చుండెను. నారదా! అపుడు భీష్మకచక్రవర్తి వేదమంత్రోచ్చారణపూర్వకముగ, కన్యాదానవిధితో దేవేశ్వరి యైన రుక్మిణిని పరిపూర్ణతముడైన శ్రీకృష్ణపరమాత్మ కర్పించెను. హర్షహృదయాంతరంగుడై వసుదేవుని యనుజ్ఞ పొంది శ్రీకృష్ణుడు 'స్వస్తి' యని బల్కి భవానిని శంకరుడు పాణిగ్రహణమొనరించినట్లు రుక్మిణిపాణిని గ్రహించి ఆమెను సహధర్మచారిణిగ స్వీకరించెను. ఆప్రదేశమంతయు మంగళవాద్యముల మధురధ్వనులచే ప్రతిధ్వనించెను. ఆకసమునుండి సకలదేవతలు పుష్పవృష్టిగావించిరి. సకలజీవులహృదయములు ఆజగదీశ్వరుని కళ్యాణశుభఘడియలో పరిమానందభరితములైనవి. తదనంతరము భీష్మకచక్రవర్తి పరిపూర్ణతముడు, పరమాత్మయునగు శ్రీకృష్ణు

నకు ఐదులక్షల సువర్ణములను సమర్పించెను. ఇట్లు ఆదివ్య సభలో శ్రీరుక్మిణీకళ్యాణము సంపన్నమొనరించి భీష్మకుడు మోహావశమున తనకుమార్తెను ఆలింగనమొనరించుకొని, ఆమెను వీడలేక దుఃఖించెను. తుదకు ఆనందసమన్వితుడై తనకుమారీరత్నమైన రుక్మిణీదేవిని మనస్ఫూర్తిగ శ్రీకృష్ణున కర్పించి ధన్యుడయ్యెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు రుక్మిణీ కళ్యాణ మను నూటయెనిమిదవ
అధ్యాయము సంపూర్ణము

---

# నూటతొమ్మిదవ అధ్యాయము

## —: శ్రీకృష్ణరుక్మిణీ కళ్యాణ మహోత్సవము :—

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదా! ఆసమయములో రుక్మిణీదేవి జననియు మహారాణియు నగు సుభద్ర అత్యంతానందమగ్నురాలై పతిపుత్ర సహితులగు మహిళలను తోడ్కొని కళ్యాణమంటపమును ప్రవేశించి నిర్మన్థనాది మంగళకార్యములను సంపన్నమొనరించి ఆనవదంపతులను ఒకదివ్య రత్ననిర్మిత హర్మ్యము లోనికి తోడ్కొని పోయెను. అయ్యంతఃపురములో రత్నాభరణ విభూషితలై దివ్య సింహాసనముల నధిష్టించి యున్న దుర్గతినాశనియగు దుర్గను, సరస్వతిని, రతిని, సతిని, రోహిణిని, పతివ్రతలైన దేవపత్నులను, మునిపత్నులను శ్రీకృష్ణుడు గాంచెను. వధూవరుల రాకను గాంచగనే వారందరు వారికి స్వాగతముపల్కి దివ్యరత్న సింహాసనములను సమర్పించిరి. ఆభవనములో ఉపస్థితలై యున్న దేవాంగనలు మునిపత్నులు అంజలి బద్ధలై క్రమముగ మాధవు ననేకవిధముల స్తుతించిరి. మహారాణియగు సుభద్ర వధూవరులకు అమృతోపమాన మృష్టాన్నముల నర్పించి సువాశిత జలములను, కర్పూరయుక్తములగు ఉత్తమ తాంబూలముల నొసంగెను. అనంతరము అచట దుర్గాదేవి మహిళలందరి

ఆజ్ఞచే శ్రీకృష్ణుని హస్తమున ఒకమంగళపత్రిక నుంచి చదువవలసినదిగ ప్రార్థించెను. ఆస్త్రీ సమాజలో విరాజిల్లియున్న శ్రీకృష్ణపరమాత్మ దుర్గాదత్తమైన మంగపత్రిక నిట్లు పఠించెను.

శ్లో॥ లక్ష్మీః సరస్వతీ దుర్గా సావిత్రీ రాధికా సతీ ।
తులసీ పృథీవీ గఙ్గారున్ధతీ యమునాదితిః ॥ 10
శతరూపా చ సీతా చ దేవహూతిశ్చ మేనకా ।
దేవ్యశ్చైతా దమ్పతీనాం కుర్వన్తు మఙ్గలం పరమ్ ॥ 11

లక్ష్మి, సరస్వతి, దుర్గ, సావిత్రి, సతి, రాధిక, తులసి, పృథ్వి, గంగ, అరుంధతి, అదితి, శతరూప, సీత, దేవహూతి, మేనక, వీరందరు దంపతులకు పరమశుభమును కలుగజేయుగాక!

తదనంతరము భీష్మక చక్రవర్తికూడ సకలదేవగణములకు, మహర్షి గణములకు, నరేశ్వరులకు విధిపూర్వకముగ పూజ లొనరించి వారికి ఆదర సహితముగ విందు లర్పించెను. ఆసమయమున కుండినీ నగరములో మంగళ వాద్య ధ్వనులు, రమణీయసంగీతము మార్మోగెను. మరునాటిప్రాతః కాలముననే బ్రహ్మశివశేషాది సకలదేవతలు, మహర్షులు, నరేశ్వరులు, ద్వారకా నగరమునకు బయలుదేరుటకు సంసిద్ధులైరి. రుక్మిణిమాత యైన సుభద్ర తన ప్రియపుత్రిక వియోగమును భరింపలేక ఆమెను ఆలింగనమొనరించుకొని దుఃఖించుచు ఇట్లు పల్కెను.

"వత్సా! నీవు నీతల్లిని పరిత్యజించి యెచటి కేగుచున్నావు? కుమారీ! నేను నిన్ను వీడి క్షణ మైనను జీవింపగలనా? నాప్రియకుమారీ! నన్ను వీడి నీ వెట్లు మనగలవు? నాకుమార్తె వై అవతరించిన జగన్మాతవే నీవు. నీవు శ్రీమహాలక్ష్మివి, ఆత్మమాయచే కన్యారూపమును ధరించి మాగృహమును పావనమొనరించితివి. అమ్మా! నీ విక వసుదేవనందనుని ప్రియురాలవై పుట్టినింటికి, మెట్టినింటికి అఖండకీర్తిచంద్రికలను ప్రసాదింపుము." తదనంతర మామె తన అశ్రుజలములచే రుక్మిణిని ఆప్లావిత మొనరించెను. భీష్మకుని నయనములనుండియు జలములు ప్రవహింపగా అయన తనకుమార్తెను శ్రీకృష్ణుని కప్పగించెను. రుక్మిణీదేవికూడ లీలావశమున దుఃఖిత యైనట్లు నటించెను. నటనసూత్రధారియగు పరమాత్మకూడ దుఃఖము నభినయించెను.

కుమార్తె నప్పగించు సమయమున భీష్మకుడు తన జామాతకు ఒక వేయి గజరాజులను, ఆఱు వేల అశ్వములను, సహస్ర దాసీ జనములను, వందలకొలది పరిచారకులను, అమూల్యరత్న భూషణములను, వేయివజ్రములను, ఐదులక్షల శుద్ధ సువర్ణములను, విశ్వకర్మద్వారా నిర్మితము లైన సువర్ణరత్నజటిత జలపాత్రములను, భోజనపాత్రలను, గోవులను, క్షీరములు ప్రసాదింపగల సవత్స ధేనువులను, ఎన్నియో అమూల్యరమణీయ అగ్నిశుద్ధ వస్త్రములను, ధనకనక వస్తువాహనములను ఉపహారములుగ నొసంగెను. తదనంతరము శ్రీకృష్ణుడు రుక్మిణీ సహితుడై సకలరాజన్యులతో, దేవతలతో, మహర్షులతో గలసి ద్వారకానగరము జేరెను.

వారందరు ద్వారకానగరమును జేరగనే దేవకి, రోహిణి, యశోద, అదితి, దితి, మొదలగు సౌభాగ్యవతులైన స్త్రీలు నవదంపతులకు మంగళ హారతుల నర్పించి వారిని గృహప్రవేశ మొనరింప జేసిరి. ద్వారకానగర మంతయు మంగళధ్వనులచే అఖండ హరినామ సంకీర్తనముచే మార్మ్రోగెను. ఉగ్రసేన వసుదేవాదులు సకల దేవతలకు, మహర్షులకు, నరేశ్వరులకు, బంధువులకు, ప్రజలకు చతుర్విధ (భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య) భోజనముల నొసంగి ఘనముగ సత్కరించి బ్రాహ్మణులకు, భట్టులకు, యాచకులకు సువర్ణ రత్నాదులను గొప్పగ దాన మొనరించిరి. వారొసంగిన ఆతిథ్యమునకు దేవతా సహితముగ సకలజనులు అత్యంత సంతుష్టులై తమతమ వాసములకు ప్రసన్న మనములతో మఱలిపోయిరి. ఇట్లు దేవకీవసుదేవులు సమస్తవైవాహిక మంగళ కార్యములను సాంగోపాంగముగ సంపన్న మొనరించిరి. దేవర్షీ! శ్రీకృష్ణ రుక్మిణీ కళ్యాణోపాఖ్యానమును పఠించిన, శ్రవణ మొనరించిన దేహధారులకు మనోవాంఛితములు నిర్విఘ్నముగ నేరవేరగలవు. నిష్కాము లైనవారికి దివ్యలోక పరంధామము సులభము కాగలదు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు శ్రీకృష్ణ రుక్మిణీ కళ్యాణ మహోత్సవ మను
నూట తొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము

# నూటపదియవ అధ్యాయము

## -: శ్రీకృష్ణయశోదా సంవాదారంభము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదా! శ్రీకృష్ణ రుక్మిణీకళ్యాణ మహోత్సవమునకు అరుదెంచిన వారందరు తమతమధామముల కరిగిన పిదప యశోదానందులు తనప్రియ కుమారుని చెంతకు జనిరి. యశోద ప్రేమభరిత హృదయముతో శ్రీకృష్ణ పరమాత్మ నిట్లు ప్రార్థించెను; "మాధవా! నీవు నీతండ్రి యైన నందునకు అఖండ జ్ఞానమును ఉపదేశించితివి; కాని, కుమారా! నేను నీతల్లిని, కృపానిధీ! నాపై కూడ నీకృపను ప్రసరింపజేయుము. మహాభాగా! నీవు పృథ్విని ఉద్ధరించి భక్తులను రక్షించు దేవాదిదేవుడవు. నేను ఈభయంకర భవసాగరమును తరింపలేక భయపడు చున్నాను.

శ్లో॥ మాయామయీ సా ప్రకృతిర్భవాబ్ధి తరిః
త్వమేవ కర్ణధారశ్చ భక్తోత్తీర్ణే కృపామయ ॥ 4

మాయాస్వరూపిణి యైన ప్రకృతియే ఈభవసాగరమును తరించుటకు ఏకైకసాధన మైన నౌక, నీవే ఆనౌకకు కర్ణధారుడవు (నడుపువాడు), కావున కృపామయా! న న్నుద్ధరింపుము.

యశోద బల్కిన ప్రియవచనముల నాలకించి మహాజ్ఞాను లగుగురువు లకే ఆచార్యుడు పురుషోత్తముడైన శ్రీకృష్ణుడు, మందస్మిత ముఖార విందుడై ఇట్లు పల్కెను. "మాతా! భక్తిప్రాధాన్యము గల జ్ఞానమే సర్వ దేహధారులను ఈభవసాగరమునుండి ఉద్ధరింపగలదు. ఆభక్త్యాత్మక మహాజ్ఞాన మును అద్యాప్రకృతియగు శ్రీరాధ నీ కుపదేశింపగలదు. నీవు శ్రీరాధ యెడల మానవభావమును త్యజించి ఆమె ఆజ్ఞలను పరిపాలించిన నేను మున్ను నందున కుపదేశించిన జ్ఞానమునే నీకుపదేశింపగలదు. కావున మాతా నీవు తండ్రితో కలసి నందవ్రజమునకు వెడలి శ్రీరాధ నాశ్రయింపుము" ఇట్లు యశోద నాదేశించి శ్రీకృష్ణపరమాత్మ యశోదా నందులకు వినీతభావ ముతో అనేక ప్రణామము లర్పించెను.

యశోదానందులు తమగారాలపుత్రుని అనేకవిధముల ఆశీర్వదించి దేవకీవసుదేవులకడ అనుజ్ఞ గైకొని నందవ్రజమునకు బయలుదేరి స్వగృహము

నను బోక సరాసరి శ్రీ రాధాదేవి విరాజిల్లుచున్న కదళీవనమునకు జనిరి. ఆకదళీవనములో చందనచర్చితజలయుక్తకమలదళశయ్యపై శ్రీరాధ అచేతనురాలై శయనించియుండెను. ఆమె సకలాభరణములను పరిత్యజించి కేవలము శ్వేతవస్త్రము ధరించి అహర్నిశములు శ్రీకృష్ణధ్యానమందు నిమగ్నురాలై అన్నపానాదులను సహితము విసర్జించి కృశయై యుండెను. మూర్ఛావస్థలో నున్న ఆమెయోష్ఠములు శుష్కించినవి, నేత్రములనుండి అశ్రుధారలు ప్రవహించుచున్నవి. ఆమె శ్రీకృష్ణునిచరణకమలములను ధ్యానమొనరించుచు, తన మనమును ఆయనయందే సంలగ్న మొనరించి బాహ్యజ్ఞానరహితముగ నుండెను. అప్పుడప్పుడు చైతన్యవంతురాలై శ్రీకృష్ణపరమాత్మ వచ్చుచున్నాడేమో యని మార్గమును వీక్షించును. స్వప్నములో తనప్రియతముని దర్శన సౌభాగ్యమును పొంది ఆనందించును, స్వప్నము భంగముకాగా మరల దుఃఖించును. రాధాదేవిసఖులు ఆమెను పరివేష్టించి ఆమెను సేవలొనరించుచుండిరి. శ్రీరాధాదేవియొక్క యీదివ్యమాధుర్యస్థితిని గాంచి యశోదానందులు పరమాశ్చర్యచకితులైరి. వారు ఆజగజ్జననిని దర్శింపగనే ఆమెయెడల మానవ భావమును వీడి భూమిపై సాష్టాంగపడి పరమభక్తితో అనేక ప్రణామము లర్పించిరి. ఆసమయములో ఈశ్వరేచ్ఛవలన శ్రీరాధాదేవికి చైతన్యము ప్రాప్తించినది. కన్నులు తెరవగా ఆమె తనసమక్షమున అత్యంతభక్తితో ముకుళితహస్తులై నిలబడియున్న యశోదానందులను గాంచి అత్యంతాదరపూర్వకముగ మధురవచనములతో నిట్లుప్రశ్నించెను. "మహాత్ములారా! మీ రెవ్వరు? ఏప్రయోజనముకొఱకు నాయాశ్రమమును పావనమొనరించితిరి? నాకు బాహ్య విషయజ్ఞానము లేదు, ఎవరు మనుష్యులో, ఎవరు పశువులో, ఏది జలమో, ఏది స్థలమో, రాత్రి ఏదో, పగ లేదో తెలియని ఉన్మాదస్థితిలో నే నున్నాను. తుదకు నాకు స్త్రీపురుషనపుంసకభేదముకూడ తెలియుటలేదు."

శ్రీరాధ బల్కినవచనములను ఆలకించి యశోదానందులు ఆశ్చర్య చకితులైరి. అపుడు యశోద శ్రీరాధాదేవిని సమీపించి ఆమెతో ప్రియవచనముల నిట్లుబల్కెను. "శ్రీరాధా! చైతన్యము నొందుము; నిన్ను నీవు యత్నపూర్వకముగ రక్షించుకొనుము; శుభసమయ మాసన్నమైనతక్షణమే నీవు నీప్రాణనాథుని అవశ్యముగ దర్శింపగలవు. సురేశ్వరీ! నీవు నీవంశమును అఖిల విశ్వమును పవిత్రమొనరింపగల్గినావు. నీదివ్యచరణకమలములను సేవించి

ఈగోపికలందఱు అఖండపుణ్యవతు లైనారు. సకలజనులు, నాల్గువేదములు, పురాణములు, భక్తులు, తీర్థములనే పావన మొనరింపగల నీసుమంగళకీర్తిని సదాగాన మొనరించెదరు. బుద్ధిరూపిణీ నేను యశోదను. నాప్రక్కన నున్నవారే నందరాజవరేణ్యులు, నీవు వృషభానునందినివైనరాధవు. సువ్రతే! నావచనముల నాలకింపుము. నేను ద్వారకానగరములో శ్రీకృష్ణుని దర్శించి నీకడకు వచ్చితిని. సతీ! శ్రీహరియే స్వయముగ మమ్ము నీవద్దకు బంపెను. ఆగదాధరుని శుభసమాచారములను, సందేశమును వివరించెద నవధరింపుము. దేవీ! నీకు శీఘ్రమే శ్రీకృష్ణుని దివ్యదర్శనము నిశ్చయముగ లభింపగలదు. మే మిదివఱకు నిన్నాశ్రయించితిమి. దేవీ! చైతన్యము నొంది మాకు అనన్య భక్త్యాత్మకమహాజ్ఞానమును ప్రసాదింపుము. వరాననా! త్వరలో శ్రీహరి నిన్ననుగ్రహింపగలడు. తదనంతరము నీవు శ్రీదాముని శాపమునుండి విముక్తురాలవై భగవంతునితో కలసి దివ్యగోలోకపరంధామము జేరగలవు."

ఇట్లు యశోదాదేవి పల్కినవచనముల నాలకించి గదాధరుని కుశలసమాచారమును పొంది శ్రీకృష్ణునినామస్మరణచే శ్రీరాధాదేవి తన స్వస్వరూపజ్ఞానమును పొందెను. ఆమెఅంతరంగములో శ్రీకృష్ణపరమాత్మను స్మరించుచు అత్యంతశాంతయై మధురవాణితో పరమోత్తమము, అలౌకికభక్త్యాత్మకమునగు మహాజ్ఞానమును ఉపదేశింప నారంభించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మ ఖండమందు శ్రీరాధా యశోదాసంవాదారంభ మను
నూటపదియవ అధ్యాయము
సంపూర్ణము.

---

## నూటపదునొకండవ అధ్యాయము

### —: శ్రీ రాధా గీత :—

శ్రీ రాధా దేవి పలికెను:-

యశోదామాతా! నేను శ్రీకృష్ణవిరహముచే సంతప్తురాలనై చైతన్యరహితురాల నైతిని. కేవలము అబలను, స్త్రీనైన నేను పంచమహా

జ్ఞానములందు సర్వోత్కృష్ట మైనబ్రహ్మశివశేషాదులచే పూజింపబడు భక్త్యాత్మకమహాజ్ఞానము నెట్లు వర్ణింపగలను? అయినను శ్రీకృష్ణపరమాత్మయను గ్రహమువలన నాకు అవగత మైనంతమాత్రమే ఆమహాజ్ఞానమును మీకుపదేశించెదను సావధానచిత్తులై అవధరింపుడు.

శ్లో॥ తస్మాత్సర్వం పరిత్యజ్య భజస్వ పరమేశ్వరమ్ ।
పుత్రబుద్ధి పరిత్యజ్య బ్రహ్మరూపం నిశామయ ॥ 6

యశోదే భవతి సర్వం పరిత్యజ్య చ నశ్వరమ్ ।
గత్వా బృన్దావనం శుద్ధం పుణ్యక్షేత్రం చ భారతమ్ ॥ 7

కృత్వా త్రికాలస్నానం చ నిర్మలే యమునాజలే ।
కృత్వాఽష్టదలపద్మం చ స్నిగ్ధేన చన్దనేన చ ॥ 8

ధ్యానేన గర్గదత్తేన శుద్ధేన మనసా సతి ।
సమ్పూజ్య పరమానన్దం సానన్దం వ్రజ తత్పదమ్ ॥ 9

కృత్వా నికృన్తనం కర్మ పితృభిః శతకైః సహ ।
వైష్ణవేన సహాఽఽలాపం కురుష్వ సతతం సతి ॥ 10

మాతా! శ్రీకృష్ణపరమాత్మయెడల పుత్రబుద్ధిని వీడి ఆయన పరబ్రహ్మస్వరూపమును తెలిసికొని నీసర్వస్వమును పరిత్యజించి ఆపరమేశ్వరుని సదా భజింపుము. యశోదా! నీవు ఈ సకలనశ్వరపదార్థములను పరిత్యాగమొనరించి పుణ్యక్షేత్ర మైన భారతవర్షములో విరాజిల్లు శుద్ధమైన, రమణీయ మైన బృందావనమును జేరుము. బృందావనములో త్రికాలములందు స్నానమాచరించి సుకోమలచందనముతో అష్టదళకమలమును నిర్మించి పరిశుద్ధమనముతో గర్గమహర్షిప్రదత్తమైన ధ్యానముద్వారా పరమానందస్వరూపు డైన శ్రీకృష్ణుని బాగుగ ధ్యానించి ఆయనను పూజించి ఆనందపూర్వకముగ పరమపదమ్ము జేరుము. సతీ! నీవు నీసకలకర్మలమూలములను ఖండించుకొని నీపూర్వీకులను ఉద్ధరింపుము. దేవీ! సదా జగన్నాథునియనన్యభక్తు లైన పరమవైష్ణవులతో వార్తాలాపము లొనరింపుము.

శ్లో॥ వరం హుతవహజ్వాలాం భక్తో వాంఛతి పంజరమ్ ।
వరం చ కణ్టకే వాసం వరం చ విషభక్షణమ్ ॥ 11

హరిభక్తివిహీనానాం న సఙ్గం నాశకారణమ్ ।
స్వయం నష్టో భక్తిహీనో బుద్ధిభేదం కరోతి చ ॥ 12

శ్లో॥ అంకురో భక్తివృక్షస్య భక్తసఙ్గేన వర్ధతే ।
పరం హరికథాలాపపియూషాసేచనేన చ ॥ 13

అభక్తాలాపదీప్తాగ్నిజ్వాలాయాః కలయాఽపి చ ।
అంకురః శుష్కతాం యాతి పునః సేకేన వర్ధతే ॥ 14

తస్మాదభక్తసఙ్గం చ సావధానః పరిత్యజ ।
యథా దృష్ట్వా కాలసర్పం నరో భీత్వా పలాయతే ॥ 15

యశోదే చ ప్రయత్నేన స్వాత్మనః పుత్రమీశ్వరమ్ ।
రామ నారాయణానన్త ముకున్ద మధుసూదన ॥ 16

కృష్ణ కేశవ కంసారే హరే వైకుణ్ఠ వామన ।
ఇత్యేకాదశ నామాని పఠేద్ వా పాఠయేదితి ॥ 17

జన్మకోటిసహస్రాణాం పాతకాదేవ ముచ్యతే ।

భక్తుడు అగ్నిజ్వాల నైనను, పంజరములో బంధింపబడుట నైనను' కంటకములపైః నివసించుట నైనను, విషపానము నైనను చేయ గలడు, కాని హరిభక్తిరహితు లైనవారిసాంగత్యమును అభిలషింపడు; ఆనాసక్తసాంగత్యము సర్వనాశనమునకు కారణము కాగలదు. భక్తిహీను డైన పురుషుడు స్వయముగ నశించుటయేగాక ఇతరులబుద్ధియందుకూడ భేదములను ఉత్పన్న మొనరించును. భక్తునిసాంగత్యమువలన హరికథాలాపామృత సించనము ద్వారా భక్తిరూపమైన వృక్షముయొక్క అంకురము వృద్ధినొందును; కాని భక్తిహీనులతో వార్తాలాపమనెడు ప్రదీప్తాగ్నిజ్వాలస్పర్శచే ఆయంకురము శుష్కించును; మఱల భక్తులసాంగత్యముతో, దివ్యహరికథాశ్రవణముతో, అఖండహరినామసంకీర్తనతో సించన మొనరించినచో ఆభక్త్యంకురము వృద్ధి నొందగలదు. కావున మనుష్యుడు కాలసర్పమును గాంచగనే భయభీతుడై పారిపోవునట్లే దేహధారులు సావధానులై భక్తిహీనులసాంగత్యమును పరిత్యజింపవలెను. యశోదా! పరమాత్మయు, సర్వేశ్వరేశ్వరుడు పరమఐశ్వర్యశాలియునగు నీపుత్రుని అనన్యభక్తితో సదా భజింపుము. రామా, నారాయణా, అనన్తా, ముకుందా, మధుసూదనా, కృష్ణా, కేశవ, కంసారే, హరే, వైకుణ్ఠా, వామనా అనునీ ఏకాదశదివ్యనామములను పఠించువారు లేదా పఠింపజేయువారు తాము అసంఖ్యాజన్మలం దొనరించిన పాపపుంజములనుండి అవశ్యము ముక్తులయ్యెదరు.

శ్లో॥ రాశబ్దో విశ్వవచనో మశ్చాపీశ్వర వాచకః ॥ 18
విశ్వానామీశ్వరో యో హి తేన రామః ప్రకీర్తితః ।
రమతే రమయా సార్థం తేన రామం విదుర్బుధాః ॥ 19
రమాయాం రమణస్థానం రామం రామవిదో విదుః ।
రాశ్చేతి లక్ష్మీవచనో మశ్చాపీశ్వరవాచకః ॥ 20
లక్ష్మీపతిం గతిం రామం ప్రవదన్తి మనీషిణః ।
నామ్నాం సహస్రం దివ్యానాం స్మరణే యత్ఫలం లభేత్ ॥ 21
తత్ఫలం లభతే నూనం రామోచ్చారణ మాత్రతః ।

'రా' శబ్దము సకల విశ్వములకు వాచకము 'మ' శబ్దము ఈశ్వరవాచకము, కావుననే సకలలోకములకు ఈశ్వరుడైన కారణమున ఆపరబ్రహ్మమును రాముడని కీర్తింతురు. ఆసర్వేశ్వరేశ్వరుడు రమాదేవితో రమణ మొనరించును; ఈకారణముననే విద్వాంసు లాయనను రాము డందురు. రమాదేవికి రమణస్థాన మైన కారణమున భగవంతుని తత్త్వవేత్తలు రాము డని వర్ణింతురు. "రా" లక్ష్మీవాచకము, 'మ' ఈశ్వరవాచకము; కావుననే మనీషిగణములు లక్ష్మీపతిని రాముడందురు. సహస్ర దివ్యనామ స్మరణచే ఏఫలము ప్రాప్తించునో, ఆఫల మంతయు నిశ్చయముగ కేవలము రామ శబ్దోచ్చారణ మాత్రముననే లభించును.

శ్లో॥ సారూప్యముక్తివచనో నారేతి చ విదుర్బుధాః ॥ 22
యో దేవోఽప్యయనం తస్య స చ నారాయణః స్మృతః ।
నారాశ్చ కృతపాపాశ్చాప్యయనం గమనం స్మృతమ్ ॥ 23
యతో హి గమనం తేషాం సోఽయం నారాయణః స్మృతః ।
సకృన్నారాయణేత్యుక్త్వా పుమాన్ కల్పశతత్రయమ్ ॥ 24
గఙ్గాదిసర్వతీర్థేషు స్నాతో భవతి నిశ్చితమ్ ।
నారం చ మోక్షణం పుణ్యమయనం జ్ఞానమీప్సితమ్ ॥ 25
తయోర్జ్ఞానం భవేద్ యస్మాత్ సోఽయం నారాయణః ప్రభుః ।

'నార' మనగా సారూప్యముక్తి యని విద్వాంసుల కథనము; ఆసారూప్య ముక్తికి 'అయను'డైనవానినె నారాయణు డందురు. చేసిన పాపములే నారములు ఆపాపములను అధిగమన మొనరించుటయే అయనము. ఏభగవంతుని ఆశ్రయముచే అపాపపుంజములను అధిగమన మొనరింపగలమో ఆయననే నారాయణు

డని కీర్తింతురు. ఒక్క పర్యాయము అనన్యభక్తితో నారాయణ శబ్ద ముచ్చరించిన మనుష్యుడు మూడువందల కల్పముల పర్యంతము గంగాది సమస్త తీర్థస్నాన మొనరించిన ఫలములను పొందగలడు. నారమునే పుణ్యమని మోక్షమని, అయనమునే అభీష్టజ్ఞాన మని అందురు. ఆపుణ్య మోక్ష జ్ఞానాదులు ఎవనివలన లభించునో ఆప్రభువే నారాయణుడు.

శ్లో॥ నాస్త్యన్తో యస్య వేదేషు పురాణేషు చతుర్షు చ ॥ 26
శాస్త్రేష్వన్యేషు యోగేషు తేనానన్తం విదుర్బుధాః ।
ముకుమధ్యయమానం చ నిర్వాణం మోక్షవాచకమ్ ॥ 27

తద్దాతి చ యో దేవో ముకున్దస్తేన కీర్తితః ।
ముకుం భక్తిరసప్రేమవచనం వేదసమ్మతమ్ ॥ 28

యస్తం దదాతి భక్తేభ్యో ముకున్దస్తేన కీర్తితః
సూదనం మధుదైత్యస్య యస్మాత్స మధుసూదనః ॥ 29

ఇతి సన్తో వదన్తీశం వేదే భిన్నార్థమీప్సితమ్ ,
మధు క్లీబం చ మాధ్వీకే కృతకర్మ శుభాశుభే ॥ 30

భక్తానాం కర్మణాం చైవ సూదనం మధుసూదనః ।
పరిణామాశుభం కర్మ భ్రాన్తానాం మధురం మధు ॥ 31

కరోతి సూదనం యో హి స ఏవ మధుసూదనః ।

నాల్గువేదములందు, పురాణములందు, శాస్త్రములందు, యోగగ్రంథములందు, ఆభగవంతుని అంతము లభింపదు; ఈకారణముననే విద్వాంసులాయనను అనంతు డని కీర్తించిరి. 'ముకు' అధ్యయమానమునకు, నిర్వాణమునకు, మోక్షమునకు వాచకము. వీని నన్నింటిని ఆభగవంతుడు ప్రసాదించును. ఈకారణముననే ఆయన ముకుందు డని కీర్తింపబడెను. 'ముకు' అనగా వేద సమ్మత మగు భక్తిరస పూర్ణ ప్రేమయుక్త వచనము; ఆవచనమును ఏభగవంతుడు భక్తులకు ప్రసాదించునో, ఆయననే ముకుందు డందురు. మధుదైత్యుని సంహరించిన కారణమున ఆయన నామము మధుసూదను డయ్యెను. ఇట్లు భక్తులు వేదమందు గల భగవంతుని నామములను విభిన్నార్థములను ప్రతిపాదించిరి. 'మధు' అనగా నపుంసక లింగము, చేసిన శుభాశుభ కర్మలు మాధ్వీకము (మాదకవస్తువు) నకు వాచకము కావున వానిని, భక్తుల కర్మలను

సూదన మొనరించువానినె మధుసూదను డందురు. ఏకర్మలైతే పరిణామమున అశుభములై, భ్రాంతులకు మధురములై దోచుఆకర్మలనె మధు అందురు. ఆకర్మలను సూదన మొనరించువాడె మధుసూదనుడు.

శ్లో॥ కృషిరుత్కృష్టవచనో ణశ్చ సద్భక్తివాచకః ॥ 32
అశ్చాపి దాతృవచనః కృష్ణం తేన విదుర్బుధాః ।
కృషిశ్చ పరమానన్దే ణశ్చ తద్దాస్యకర్మణి ॥ 33
తయోర్దాతా చ యో దేవ స్తేన కృష్ణః ప్రకీర్తితః ।
కోటిజన్మార్జితే పాపే కృషిః క్లేశే చ వర్తతే 34
భక్తానాం ణశ్చ నిర్వాణే తేన కృష్ణః ప్రకీర్తితః ।
నామ్నాం సహస్రం దివ్యానాం త్రిరావృత్త్య చ యత్ఫలమ్ ॥ 35
ఏకావృత్త్యా తు కృష్ణస్య తత్ఫలం లభతే నరః ।
కృష్ణనామ్నః పరం నామ న భూతం న భవిష్యతి ॥ 36
సర్వేభ్యశ్చ పరం నామ కృష్ణేతి వైదికా విదుః ।

'కృషి' ఉత్కృష్టవాచకము, 'ణ' సద్భక్తివాచకము, 'అ' దాతృవాచకము; ఉత్కృష్టమైన సద్భక్తిని ప్రసాదించుదైవము కావున ఆయనను కృష్ణుడందురు. 'కృషి' యనగ పరమానందుడు, 'ణ' యనగ ఆయన దాస్యసౌభాగ్యము. పరమానందమును, దాస్యసౌభాగ్యమును ప్రసాదించుదైవమునే కృష్ణు డందురు. భక్తులకోటిజన్మార్జితపాపములు, క్లేశములే 'కృషి'; వాటి వినాశనమందే 'ణ' శబ్దము వ్యవహరింపబడెను. అందువలన ఆయనను కృష్ణుడనికీర్తించిరి. సహస్రదివ్యనామములను మూడు ఆవృత్తు లొనరించిన ఏఫలము లభించునో, ఆఫల మంతయు కృష్ణనామమును ఒకపర్యాయము స్మరించినమనుష్యునకు సులభముగ లభించును. కృష్ణనామముకంటె ఉత్కృష్ట నామము లేదు, ఉండదు, ఉండబోదు యనివైదికవిదులకథనము. కృష్ణనామము సర్వనామములకంటె అతీతము, అత్యంతోత్కృష్టము.

శ్లో॥ కృష్ణ కృష్ణేతి హే గోపి యస్తం స్మరతి నిత్యశః ॥ 37
జలం భిత్త్వా యథా పద్మం సంసారాదుద్ధరేచ్ఛ సః ।
కృష్ణేతి మఙ్గలం నామ యస్య వాచి ప్రవర్తతే ॥ 38
భస్మీభవన్తి సద్యస్తు మహాపాతకకోటయః ।
అశ్వమేధ సహస్రేభ్యః ఫలం కృష్ణజపస్య చ ॥ 39

శ్లో॥ వరం తేభ్యః పునర్జన్మ నాతో భక్తపునర్భవః ।
సర్వేషామపి యజ్ఞానాం లక్షాణి చ వ్రతాని చ ॥ 40

తీర్థస్నానాని సర్వాణి తపాంస్యనశనాని చ ।
వేదపాఠసహస్రాణి ప్రాదక్షిణ్యం భువః శతమ్ ॥ 41

కృష్ణనామజపస్యాస్య కలాం నార్హన్తి షోడశీమ్ ।
తేషాం లోభాద్భవేత్స్వర్గఫలం చ సుచిరం నృణామ్ ॥ 42

స్వర్గాదవశ్యం పుంసశ్చ జపకర్తుర్హరేః పదమ్ ।
కే జలే సర్వదేహేఽపి శయనం యస్య చాఽఽత్మనః ॥ 43

వదన్తి వైదికాః సర్వే తం దేవం కేశవం పరమ్ ।

గోపీ! కృష్ణ, కృష్ణ యనుచు నిత్యము ఆయనను స్మరించుమనుష్యుడు, కమలము జలములను భేదించి జలముల పైకి ఆవిర్భవించునట్లే నరకమునుండి ఉద్ధరింపబడగలడు. కృష్ణ యను మంగళనామము ఎవనివాణియందుండునో వాని యసంఖ్యజన్మల మహాపాతకములు తక్షణమే భస్మములగును, కృష్ణనామ జపఫలము సహస్రాశ్వమేధయజ్ఞముల ఫలముకంటె శ్రేష్ఠము; ఆయజ్ఞముల వలన పునర్జన్మము అవశ్యముగ లభించును, కాని కృష్ణనామజపముచే భక్తుడు జన్మరాహిత్యము నొంది, ఈ రాకపోకలనుండి విముక్తి నొందగలడు. సమస్త యజ్ఞములఫలము, లక్షలాదివ్రతముల ఫలము, తీర్థస్నానఫలము, సర్వవిధ తపఃఫలము, ఉపవాసఫలము, వేదపఠనఫలము, పృథ్వీప్రదక్షిణాదిఫలము లన్నియు కృష్ణనామజపఫలములోని పదునాఱవకళకైనను సరిరావు. పైన ఉదహరింపబడిన కర్మవలన మనుష్యునకు చిరకాలము స్వర్గసౌఖ్యమనుఫలము లభించును. ఆపుణ్యము క్షీణింపగనే మఱల ఆతడు స్వర్గమునుండి పతనమగుట నిశ్చితము; కాని కృష్ణజపకర్త యైనపురుషుడు తన సర్వకర్మలను నిర్మూలన మొనరించుకొని సునాయాసముగ శ్రీహరిపరమపదము జేరగలడు. 'క' యనగా జలము, శరీరములు; జలములందు, సమస్తశరీరములందుకూడ ఏపరమాత్మ శయనించునో ఆదైవమును వైదికవిదు లందరు కేశవు డనికీర్తించిరి.

శ్లో॥ కంసశ్చ పాతకే విఘ్నే రోగే శోకే చ దానవే ॥ 44

తేషాంమరిర్నిహన్తా చ స కంసారిః ప్రకీర్తితః ।
రుద్రరూపేణ సంహర్తా విశ్వానామపి నిత్యశః ॥ 45

శ్లో॥ భక్తానాం పాతకానాం చ హరి స్తేన ప్రకీర్తితః ।
మా చ బ్రహ్మస్వరూపా యా మూలప్రకృతిరీశ్వరీ ॥ 46
నారాయణీతి విఖ్యాతా విష్ణుమాయా సనాతనీ ।
మహాలక్ష్మీ స్వరూపా చ వేదమాతా సరస్వతీ ।
రాధా వసున్ధరా గఙ్గా తాసాం స్వామీ చ మాధవః ॥ 47

'కంస' శబ్దము పాతకములకు, విఘ్నములకు, రోగములకు, శోకములకు, దానములకు అర్థముగ ప్రయోగింపబడెను. వీనియన్నింటికీ 'అరి' అనగా హనన మొనరించువానినే "కంసారి" అని కీర్తించిరి. ఆదేవాదిదేవుడే రుద్రరూపమున నిత్యము విశ్వములను సంహరించుచు భక్తులపాపములను నశింపచేయును. ఆకారణమువలనే ఆయనను 'హరి' యనిరి. బ్రహ్మస్వరూపిణి మూలప్రకృతిఈశ్వరీ, నారాయణి, సనాతనీవిష్ణుమాయ, మహాలక్ష్మీస్వరూపిణి, వేదమాతా యగు సరస్వతీ, రాధ, వసున్ధరా, గంగా, మొదలగునామములచే విఖ్యాతురాలో ఆమెస్వామినే మాధవు డందురు.

శ్లో॥ బ్రహ్మేశశేషాదిభిరైశ్చ వన్ద్యం ధ్యానైర్న కించిత్సనకాదిభిశ్చ ।
వేదైః పురాణైర్న నిరూపితం చ భజస్వ భక్త్యా నవనీతచోరమ్ ॥ 48
క్వ చాపి దుగ్ధం క్వ దధి ఘృతం వా నవోద్ధృతం వా క్వ చ తక్రమీప్సితమ్ ।
తేషాం క్వ చోరో భవతి క్వ చాపి క్వ బన్ధనం తే భవమూలమధ్యే ॥ 49
న యోగిభిః సిద్ధగణైర్మునీన్ద్రైర్న భక్తసంఘైర్భవపద్మశేషైః ।
యోగైర్న బద్ధో న హి రక్షితుం క్షమైః కథం స బద్ధ స్తవ మూలమధ్యతః ॥ 50
ప్రేమ్ణా సు భక్త్యా స్తవనేన పూజయా భజస్వ పుత్రం తరసా చ భారతే ।
హృత్పద్మమధ్యే స్థితమీశ్వరం పరం ధ్యానేన యత్నేన చ సతతం సతి ॥ 51
వరం వృణుష్వ భద్రం తే య త్తే మనసి వాంఛితమ్ ।
సర్వం దాస్యామి జగతి దేవానామపి దుర్లభమ్ ॥ 52

యశోదా! బ్రహ్మవిష్ణు మహేశ శేషాదులు ఎవరికి వందనము లర్పింతురో; సనకాదిమహర్షు లైనను ధ్యానముద్వారా ఎవరిపరిపూర్ణరహస్యమును తెలిసికొనలేకపోయిరో; ఎవనిని నిరూపణమొనరించుటలో వేదపురాణము లైనను అసమర్థము లైనవో; ఆ వెన్నదొంగను (భక్తులమన మనెడి నవనీతమును దొంగిలించువాడు) అనన్యభక్తిపూర్వకముగ సదా భజింపుము. క్షీరములు, దధి, ఘృతము, నవోద్ధృతము (అపుడపుడుతీసిన నవనీతము), మజ్జిగ

మొదలగునవి ఎక్కడు న్నవి? వానిని దొంగిలించు వా డెక్కడ? నీ వెక్కడ? నీభవబంధనము లెక్కడ? యోగులు, సిద్ధులు, మునీంద్రులు, భక్తులు, బ్రహ్మ, శివ శేషాదులు, యోగముద్వారానైనను ఎవనిని బంధింపలేక పోయిరో ఆ పరబ్రహ్మము రోటి కెట్లు బంధింపబడెనో; కావున సతీ! నీ వీభారతవర్షములో శీఘ్రమే నీహృత్కమలమధ్యములో నున్న పరమేశ్వరుడైన నీకుమారుని ప్రేమద్వారా, భక్తిద్వారా, స్తవముద్వారా, పూజల ద్వారా, ఏకాగ్రధ్యానముద్వారా ఆరాధించిఅహర్నిశములు భజింపుము. గోపీ! నీకు కళ్యాణ మగుగాక నీమనోభీష్టవరముల నర్థింపుము. ఈ సమయమున సకల జగములలో, దేవతలకైనను దుర్లభమైన భక్త్యాత్మికజ్ఞానమునంతటిని నీ కుపదేశించితిని.

య శో దా దే వి ప లి కె ను :-

శ్రీరాధా! శ్రీహరి దివ్యచరణారవిందములందు నిశ్చల భక్తి ఆయన దాస్యసౌభాగ్యములే నాయభీష్టవరములు. దేవాదిదేవీ! నీదివ్యనామ రహస్యార్థమును కూడ నా కుపదేశింప వలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ రా ధా దే వి ప లి కె ను :-

యశోదామాతా! నావరప్రసాదమువలన నీకు శ్రీహరి చరణారవిందములయందు నిశ్చలభక్తి, దుర్లభదాస్య సౌభాగ్యములు అవశ్యముగ ప్రాప్తించుగాక. పూర్వకాలములో నందుడు నన్ను భాండీరవట వృక్షముక్రింద దర్శించిన సమయమున నేను ఆయనకు నాదివ్యనామ రహస్యము నుపదేశించి, ఆరహస్యము అత్యంత గోప్యముగఉంచుమని యాదేశించితిని. నేనే స్వస్వరూపిణియైన శ్రీరాధను, మీరు గాంచు రాయణ గోపపత్ని నాఛాయయే. నారాయణుడు మహాత్ముడు శ్రీహరి యంశజుడు, భగవత్పార్షదుడు.

శ్లో॥ రాశబ్దశ్చ మహావిష్ణుర్విశ్వాని యస్య లోమసు ।
విశ్వప్రాణిషు విశ్వేషు ధా ధాత్రీ మాతృవాచకః ॥ 57
దాత్రీ మాతాఽహమేతేషాం మూలప్రకృతిరీశ్వరీ ।
తేన రాధా సమాఖ్యాతా హరిణా చ పురా బుధైః ॥

ఎవనిరోమకూపములయందు అనంతవిశ్వము లున్నవో, ఆమహావిష్ణువునకు అర్థమే 'రా' శబ్దము; 'ధా' యనగ సకలవిశ్వప్రాణులకు లోకములకు

మాతృవాచకము; కావున నేనే మీరందరుకు క్షీరములను ప్రసాదించు మాతృ దేవతనైన ఆద్యామూలప్రకృతియగు ఈశ్వరిని. ఈకారణమువలనే ఆదికాలము లోనే స్వయముగ శ్రీహరి, విద్వాంసులు నన్ను 'రాధా' యని కీర్తించిరి.

ఇపుడు నేను సుదాముని శాపమును సత్యమొనరించుటకు వృషభాను కన్యనై అవతరించితిని. నూఱు సంవత్సరములు పరిపూర్ణమగు వరకు నాకు శ్రీహరితో వియోగము సంభవించును. నాతండ్రి వృషభానుడు మహాత్ముడు, శ్రీకృష్ణుని పార్షదుడు, నాతల్లి కళావతి పితరుల మానసీకన్య. ఈభారతవర్ష ములో నేను, నాతల్లి అయోనిజలము. మఱల మేము మీయందరితో కలసి శ్రీహరి పరమపదమును చేరగలము. వ్రజేశ్వరీ! నీవు మహాజ్ఞానసంపన్నవైన నీస్వామి యగు వ్రజేశ్వరునితో కలసి వ్రజమునకు మఱలి పొమ్ము; ఎందు వలననగ ఈసమయములో మీయునికి నాధ్యానమునకు అవరోధము కాగలదు.

శ్లో॥ ధ్యానభఙ్గే మహాదోషో నరాణామపి సున్దరీ ॥ 63

సుందరీ! ఇతరులకు ధ్యానభంగమొనరించినమనుష్యులు మహాదోషము లకు గుఱి కాగలరు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ జన్మ ఖండమందు శ్రీరాధా గీతయను నూటపదునొకండవ అధ్యాయము సంపూర్ణము.



## నూటపండ్రెండవ అధ్యాయము

### ప్రద్యుమ్న సంభవము

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

మునీశ్వరా! ద్వారకాపురిని జేరి వసుదేవనందనుడైన శ్రీకృష్ణుడు వసుదేవునియాజ్ఞ గైకొని రుక్మిణితో ఒకదివ్యరత్ననిర్మితభవనములో నివసింపదొడంగెను. ఆదివ్యహర్మ్యము శుద్ధస్ఫటికసమానోజ్జ్వలము, బహు మూల్యరత్ననిర్మితము, నానావిధచిత్రచిత్రితము, అత్యంతరమణీయము. ఆభవ నముపై రత్నకలశములు భాసించుచున్నవి. పూర్వకాలములో శివునిఫాలనేత్రా

గ్నికి భస్మమైనమన్మథుడు శ్రీమహాలక్ష్మీస్వరూపిణి యైన రుక్మిణినుండి శ్రీకృష్ణతేజముతో ప్రాదుర్భవించెను. ఆయన శంబరాసురుని వధించి తన పతివ్రతాపత్నియగురతిని కళ్యాణమాడెను. ఆసమయమున రతి దేవతల యాదేశానుసారముగ మాయావతి యనునామమును ధరించి శంబరాసురుని గృహములో విరాజిల్లుచుండెను. శంబరాసురునిపత్నిగ కేవలము ఆమెఛాయ మాత్రమే యుండును.

నా ర దు డు ప లి కె ను :-

మహాభాగా! కామదేవుడు (ప్రద్యుమ్నుడు) దైత్యేశ్వరుడైనశంబరుని ఎట్లువధించెను? ఆశుభచరితమును సవిస్తరముగ వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :-

నారదా! ప్రద్యుమ్న సంభవానంతరము సప్తదినములు గడవగా దైత్యరాజగు శంబరాసురుడు రుక్మిణీదేవి సూతికా గృహమునుండి బాలకుని హరించి వేగముగ స్వస్థానము జేరెను. ఆదైత్యరాజు పుత్రహీనుడు, కావున అనంత సౌందర్యరాశి యైన బాలకుని జొంది అత్యంత ప్రసన్నుడై వానిని మాయావతి కర్పించెను. ప్రద్యుమ్నుని దర్శింపగనే మాయావతి అత్యంత ప్రసన్నురాలైనది. తదనంతరము సరస్వతీదేవియే స్వయముగ ఏతెంచి మాయావతి (రతి)కి శ్రీకృష్ణపుత్రుడైన కామదేవునకు మీరిర్వురు పతీపత్నులని, శివునికోపమునకు భస్మమైన కామదేవుడే శ్రీకృష్ణుని పుత్రుని రూపమున మఱల ఆవిర్భవించెననియు తెల్పెను. అప్పటినుండి వారిర్వురు పతిపత్నులవలె మెలగదొడంగిరి. సమయానుసారముగ ప్రద్యుమ్నకుమారుడు నవయౌవన సంపన్నుడైనాడు. వీరిర్వురి సంబంధమును తెలిసికొనినవాడై శంబరాసురుడు ప్రద్యుమ్నుని సంహరించుటకు సంసిద్ధుడై వానిపై శివప్రదత్తమైన త్రిశూలమును ప్రయోగించెను. పవనదేవుడు దుర్గను స్మరింపవలసినదిగ ప్రద్యుమ్నుని ఆదేశించెను. ప్రద్యుమ్నుడు ఏకాగ్ర చిత్తముతో దుర్గాదేవిని స్మరింపగ అసురుడు ప్రయోగించిన త్రిశూలము క్షణములో రమణీయ మనోహరమాలయై ప్రద్యుమ్నుని గళము నలంకరించెను. తక్షణమే కామదేవుడు హర్షపూర్వకముగ బ్రహ్మాస్త్రమును ప్రయోగించి శంబరాసురుని వధించి రతీదేవిని తోడ్కొని విమానారూఢుడై ద్వారకాపురము జేరెను. రుక్మిణీదేవి సకలమంగళకార్యము

లను సంపన్న మొనరించి రతీదేవిని, తనకుమారుని, గృహప్రవేశ మొనరింప జేసెను. శ్రీహరి ద్వారకానగరములో మహోత్సవమును జరిపి బ్రాహ్మణులకు, యాచకులకు భూరిదానముల నొసంగి ప్రద్యుమ్నుని రక్షించిన పార్వతిని అనేక విధముల పూజించెను.

నారదమునీంద్రా! తదనంతరము ఆజగన్నాటక సూత్రధారి యగు శ్రీకృష్ణపరమాత్మ శుభలగ్నమునందు క్రమముగ సప్తరమణులను పాణిగ్రహణము చేసెను, వారినామధేయములే కాళింది, సత్యభామ, సత్య,సతీ, నాగ్నజితి, జాంబవతి, లక్షణాదేవి, అష్ట పట్టమహిషుల నుండి క్రమముగ ఒక్కొక్క రాణికి పదుగురు పుత్రులను, ఒకకుమార్తెను కనెను. తదనంతరము శ్రీకృష్ణ పరమాత్మ రాజాధిరాజైన నరకాసురుని సంహరించి రణరంగ మధ్యములో మురాసురుని ప్రాణములను హరించెను. నరకాసురుని యభ్యంతర మందిరములో పదునాఱువేల మంది రాజకన్యలు బంధింపబడి యుండిరి. వారు యువతులు, సకలరత్నాభరణ విభూషితలు, అత్యంత సౌందర్యవతులు శ్రీకృష్ణుని దివ్య చరణారవిందముల నాశ్రయించిన అనన్యభక్తురాండ్రు. మధువనములో ఒకశుభ ముహూర్తమున ఆపదునాఱువేలమందిని పరమాత్మ పరిణయమాడెను. ఆ జగన్నాదుడు ఒక్కొక్క రాణికి పదుగురు కుమారులను, ఒకకన్యను ప్రసాదించెను ఇట్లు శ్రీకృష్ణుని సంతానము అపారముగ నుండెను.

నారదా! ఒకానొకసమయమున దుర్వాసమహర్షి తనమూఁడుకోట్ల మందిశిష్యులతో పరివేష్టితుడై రమణీయద్వారకానగరమున కేతెంచెను. మహర్షియాగమనమును గాంచి ఉగ్రసేనుడు, వసుదేవుడు, శ్రీకృష్ణబలరాములు, అక్రూరుడు, ఉద్ధవుడు, మొదలగువారందరు ఆయనకు అఖండస్వాగతముపల్కి షోడశోపచారములతో పూజించి వినీతులై ప్రణమిల్లిరి. ఆమహర్షి అందరిని ఆశీర్వదించెను. తదనంతరము వసుదేవుడు తనకుమార్తెయైన ఏకానాంశను (కంసుడు సంహరింపక వదలివేసిన పార్వత్యంశసంభూతయైన యశోద కుమార్తె) ఒకశుభముహూర్తములో దుర్వాసమహర్షికి సమర్పించెను. వసుదేవుడు అనేక ముత్యములను, మాణిక్యములను, వజ్రములను, రత్నములను ఉపహారములుగ అర్పించెను. బహుమూల్యరత్నములద్వారా నిర్మితమైనయొక సుందరఆశ్రమమునుకూడ నొసంగెను.

ఒకమారు మునిశ్రేష్ఠు డగు దుర్వాసుడు ఆలోచించి చూడగా శ్రీకృష్ణు డొకచోట రత్ననిర్మిత మగు మనోహరశయ్యపై పవళించియుండెను. ఒకచోట సర్వవ్యాపి యగు భగవానుడు శ్రద్ధగ పురాణమును శ్రవణముచేయుచుండెను. ఒకచోట సుందరమగు అంగణమున మహోత్సవమును నిర్వహించుటలో సంలగ్ను డై యుండెను. ఒకచోట సత్యభామ భక్తితో నొసంగిన తాంబూల మును నములుచుండెను. ఒకచోట శయ్యపై పరుండియుండెను. ఒకచోట రుక్మిణిదేవి శ్వేతవర్ణముగల వింజామరతో ఆయనను సేవించుచుండెను. ఒకచోట పరుండియున్న శ్రీకృష్ణుని చరణములను కాళింది యొత్తుచుండెను. ఇంకను సుధర్మసభలో సుందరరూపమును ధరించి సత్పురుషసమాజమున విరాజిల్లుచుండెను. ఐశ్వర్యశాలి యగుముని అంతట అయనతో సమానరూప మున సంభాషించెను. ఈపరమాద్భుత దృశ్యమును జూచి విప్రవరుడగు దుర్వాసునకు గొప్పవిస్మయము కలిగెను. అప్పు డతడు మరల రుక్మిణీదేవి భవనమున ఆజగగీశ్వరుని స్తుతింపసాగెను.

దుర్వాసమహర్షి పలికెను:-

శ్లో॥ జయ జయ జగతాం నాథ జిత సర్వం జనార్ధన।
సర్వాత్మక సర్వేశ సర్వబీజ పురాతన నిర్గుణ
నిరీహ నిర్లిప్త నిరంజన నిరాకార భక్తానుగ్రహవిగ్రహ
సత్యస్వరూప సనాతన నిత్యస్వరూప నిత్యనూతన
బ్రహ్మేశశేష ధనేశ వందిత పద్మయాశేవితపాదపద్మ
బ్రహ్మజ్యోతిరనిర్వచనీయ వేదావిదిత గుణరూప
మహాకాశసమ్మానసీయ పరమాత్మన్నమోఽస్తు తే ॥ 50

జగదీశ్వరా! నీవు సర్వులపై విజయము నొందు దేవుడవు, జనార్ధనుడవు, సర్వాత్మ స్వరూపుడవు, సర్వేశ్వరుడవు. సర్వకారణుడవు, పురాతనుడవు, గుణ రహితుడవు. ఇచ్ఛ కేఅతీతుడవు, నిర్లిప్తుడవు, నిష్కళంకుడవు, నిరాకారుడవు, భక్తానుగ్రహ విగ్రహుడవు, సత్యస్వరూపుడవు, నిత్యస్వరూపుడవు, సనాతనుడవు, రూపరహితుడవు, నిత్యనూతనుడవు, బ్రహ్మశివ శేషకుబేరవందితుడవు, లక్ష్మి సదా మీచరణకమలముల సేవలందే సంలగ్నురాలై యుండును. నీవే బ్రహ్మ జ్యోతివి, అనిర్వచనీయుడవు, వేదములైనను, నీరూపగుణములను వర్ణింపలేవు, మహాకాశమువలె నీవు సమ్మాననీయుడవు, నీకు జయ మగుగాక, జయ మగుగాక పరమాత్మా! నీకు నా నమస్కారము.

ఇట్లు అనేకవిధముల స్తుతించి ప్రణామము లర్పించి జగన్నాథు డైన శ్రీకృష్ణుని యెదుట దుర్వాసమహర్షి మౌనముగ నిలువబడెను. అపుడు శ్రీకృష్ణపరమాత్మ హితకరమైన, సత్యమైన వేద విహితమైన, సకల సత్పురుషుల ద్వారా మాన్యమైన జ్ఞానము నిట్లు ఉపదేశింప దొడంగెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :-

శ్లో॥ మా మైర్విప్ర శివాంశ స్త్వం కిం న జానాసి జ్ఞానతః ।
అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ॥ 53
అహమాత్మా చ సర్వేషాం శవాః సర్వే మాయా వినా ।
ప్రాణిదేహాన్మయి గతే యాస్త్యేవ సర్వశక్తయః ॥ 54
జాతావప్యేక ఏవాహం వ్యక్తావేవ పృథక్పృథక్ ।
యో భుంక్తే తస్య తృప్తిః శ్యాన్నాన్యేషాం చ కదాచన ॥ 55
పృథగ్జీవాది సర్వేషాం ప్రతిమానం చ ప్రాణినామ్ ।
పరిపూర్ణతమోఽహం చ గోలోకే రాసమణ్డలే ॥ 56
శ్రీదామశాపాద్రాధా సా మాం ద్రష్టుమక్షమాఽధునా ।
సర్వే చైవాంశరూపేణ కలయా చ తదంశతః । 57
రుక్మిణీమన్దిరే చాంశోఽప్యన్యాస్యాసాం మన్దిరే కలాః ।
మమాపి కుత్ర చిచ్చాంశం కుత్రచిచ్చ కలాకలాః ॥ 58
కలాకలాంశాః కుత్రాపి ప్రతిమాసు చ దేహిషు ।

విప్రవరా! నీవు శివాంశ సంభూతుడవు గావున భయము నొందకుము నేను సర్వమునకు ఉత్పత్తిస్థాన మని సర్వులు నానుండే ఉత్పన్నులయ్యెద రని దివ్యజ్ఞానముద్వారా నీ వెఱుంగలేవా? మునీశ్వరా! నేమ సర్వులకు ఆత్మను, నేను లేనిచే సకలదేహములు శవతుల్యములగును. ప్రాణులశరీరములనుండి నేను బయల్వెడలిన సకలశక్తులు నశింపగలవు. స్వయముగ నేనొక్కండనే అనేకానేక రూపముల వ్యక్తుడనైతిని. భుజించువారే తృప్తినొందగలరు. మఱియొకరెప్పుడు తృప్తినొందలేరు. జీవాది సమస్తప్రాణుల ప్రతిమలు భిన్న భిన్న రూపముల నుండును. గోలోకస్థిత రాసమండలములో పరిపూర్ణతముడ నైన నేనే విరాజిల్లెదను. రాధ శ్రీదాముని శాపము సఫలమొనరించుటకు ఈసమయమున నన్ను దర్శింప లేదు. సర్వులు రాధాదేవి అంశలచే కళాకళాంశ లచే ఉత్పన్నులైరి. రుక్మిణీ భవనములో రాధాదేవి అంశయున్నది. అన్యరాణుల

గృహములందు కేవలము ఆ మొకళలే కలవు. శరీరధారుల యందు కొందరిలో నాలంశలు, కొందరిలో నాకళలు, మరికొందరిలో నాకంళంశాంశలున్నవి.

ఇట్లు జగదీశ్వరుడు దుర్వాసమహర్షికి తత్త్వజ్ఞాన ముపదేశించెను. జగన్నాథుని స్వస్వరూపమును అవగత మొనరించుకొనిన వాడై జితేంద్రియుడైన ఆమహర్షి ఏకానాంశను త్యజించి శ్రీహరి యఖండ తపమొనరించుటకు వెడలిపోయెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు ప్రద్యుమ్న సంభవమను నూట పండ్రెండవ
అధ్యాయము సంపూర్ణము

---

# నూటపదమూడవ అధ్యాయము

## -: శిశుపాల దన్తవక్త్రుల వధ :-

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదా! దుర్వాసమహర్షి శిష్యసహితుడై ద్వారకాపురిని వీడి భక్తిసమన్వితుడై శంకరుని దర్శించుటకు కైలాసమునకు బయలుదేరెను. మహర్షి కైలాసము జేరి శివపార్వతులకు వినీతభావముతో ప్రణమిల్లి తనవివాహ విషయము వైరాగ్యవశమున సహధర్మచారిణిని పరిత్యజించుట యను వృత్తాంతమంతయు తెల్పెను. దుర్వాసమహర్షి వచనములను నాలకించి పార్వతి మందస్మిత వదనారవిందయై మహాదేవుని సమక్షములో దుర్వాసమహర్షికి సత్యమైన వైరాగ్య మునిట్లు ఉపదేశించెను.

శ్లో॥ ధర్మతత్త్వం న జానాసి ధర్మిష్ఠం మన్యసే స్వయమ్ ।
అనపత్యాం పరిత్యజ్య క్వ యాసి తపసే మునే ॥ 5

అనపత్యాం చ యువతీం కులజాం చ పతివ్రతామ్ ।
త్యక్త్వా భవేయుః సన్యాసీ బ్రహచారీ యతీతి వా ॥ 6

వాణిజ్యే వా ప్రవాసే వా చిరం దూరం ప్రయాతియః ।
తీర్థే వా తపసే వాఽపి మోక్షార్థం జన్మఖణ్డితమ్ ॥ 7

శ్లో॥ న మోక్షస్తస్య భవతి ధర్మస్య స్ఖలనం ధ్రువమ్ ।
అభిశాపేన భార్యాయా నరకం చ పరత్ర చ॥ 8
ఇహైవ చ యశోనాశ ఇత్యాహ కమలోద్భవః ।

మునీశ్వరా! నీకు ధర్మతత్త్వము పరిపూర్ణముగ అవగతముకాలేదు, అయినను నీకు నీవే ధర్మిష్ఠుడ ననిభావించుచున్నావు. దుర్వాసా! సంతాన విహీన మైన నీసహధర్మచారిణిని పరిత్యజించి తప మాచరించుట కేచటి కేగెదవు? ఎవరైతే పతివ్రతయగుపత్నిని సంతానహీనావస్థయందు త్యజించి, సన్యాసమునుగాని, బ్రహ్మచర్యమునుగాని, యతీత్వమునుగాని స్వీకరించెదరో, లేదా వ్యాపారనిమిత్తముగాని, ఉద్యోగనిమిత్తముగాని చిరకాలము దూరముగ నివసించెదరో, వారు తమభార్యావియోగశాపమున మోక్షభ్రష్టు లగుటయే గాక, తమతమధర్మములనుండి పతనముచెందగలరు, పరలోకమందు వారికి నిశ్చయముగ నరకము కల్గును, ఇహలోకమందు వారికీర్తి నశించును. ఇట్లు కమలోద్భవు డైనబ్రహ్మ ఆదేశించెను.

అందువలన విప్రశ్రేష్ఠా! తక్షణమే నీవు ద్వారకకు వెడలుము. నాయంశాసంభూతురా లైన నీయర్ధాంగి ఏకానాంశను ప్రేమతో పరిపాలించి నీధర్మమును రక్షించుకొనుము.

శ్లో॥ పాదపద్మార్జితం పాదపద్మం సర్వసుదుర్లభమ్ ॥ 9
సంతతం శమ్భునా గీతం మునీన్ద్రైః సనకాదిభిః ।
పరిత్యజ సురతరోః కృష్ణస్య పరమాత్మనః ॥ 10
క్వ యాసి తపసే వత్స సుధాం త్యక్త్వా మనోహరామ్ ।
శ్రీకృష్ణపాదపద్మం చ స్వప్నే జపతి యో మునే ॥ 11
శతజన్మకృతాత్పాపాన్ముచ్యతే నాత్ర సంశయః ।
యద్బాల్యే యచ్చ కౌమారే వార్ధకే యచ్చ యౌవనే ॥ 12
కామతోఽకామతో వాఽపి భస్మీభూతం చ పాతకమ్ ।
సాక్షాద్యో భారతే వర్షే శ్రీకృష్ణచరణామ్బుజమ్ ॥ 13
దృష్ట్వా సద్యో భవేత్పూజ్యో జీవన్ముక్తో భవేద్ధ్రువమ్ ।
కోటిజన్మార్జితాత్సద్యః కృతపాపాద్విముచ్యతే ॥ 14
సర్వాణ్యేవ హి తీర్థాని యతః పూతాని నిత్యశః ।

వత్సా! ఏ దేవాదిదేవుని పాదపద్మములు సుదుర్లభములో ఏ భగవంతుని పదపంకజములు కమలోద్భవుని ద్వారా, శంకరునిద్వారా సదా కీర్తింపబడు చున్నవో, సకలదేవతలు సనకాది మహర్షులు నిరంతరము అర్చించు కల్పవృక్షరూపుడైన ఆ శ్రీకృష్ణుని చరణారవిందములను వీడి నీవు ఏతపముల నాచరించుటకు పోవసంకల్పించితివి? నీ యీ కార్యము మనోహర సుధను పర్యాజించు చున్నట్లు లున్నది. ఎవరైనను తుదకు స్వప్నము నందైనను శ్రీకృష్ణుని చరణారవిందములను జపించిన వారు శతజన్మ సముపార్జిత పాపముల నుండి విముక్తులు కాగలరు. ఇందులేశ మైనను సంశయము లేదు. శ్రీకృష్ణుని దివ్యచరణకమలములను భరతభూమిపై దర్శింప గల్గువారు సకల పూజనీయులై నిశ్చయముగ జీవన్ముక్తులు కాగలరు. అంతియేకాదు, వారు తమకోటానుకోట్ల జన్మలందు సంగ్రహించిన పాపపుణ్యములనుండి ముక్తులై తీర్థపావనులు కాగలరు, ఇదిధృవము.

శ్లో॥ తద్ వ్రతం తత్తపః సత్యం తత్పుణ్యం తచ్చపూజనమ్ ॥ 15

సఫలం కృష్ణ సంబన్ధి స్వజన్మఖణ్డనం యతః ।
కృష్ణభక్తివిహీనశ్చ బ్రాహ్మణో వేదపారగః ॥ 16

తత్సఙ్గాచ్చ తదాలాపాద్భక్తభక్తిః ప్రణశ్యతి ।
కృష్ణస్యోచ్ఛిష్టభోజీ యః కృష్ణభక్తశ్చ బ్రాహ్మణః ॥ 17

అవహ్నిపవనాత్పూతః పూతం కర్తుం జగత్క్షమః ।
శ్రీకృష్ణం చ పరిత్యజ్య క్వ యాసి తపసే ద్విజ 18

తపసాం ఫలమాప్నోతి శ్రీకృష్ణస్మరణేన చ ।
యతో భక్తిర్న చ భవేచ్ఛ్రీశ్రీకృష్ణే పరమాత్మని ॥ 19

స గురుః పరమో వైరీ కరోతి జన్మ నిష్ఫలమ్ ।

శ్రీకృష్ణార్పణముగ నొనరించు వ్రతములు, తపములు, సత్యము, పుణ్యములు పూజలే సఫలములగును. ఎందువలననగ ఆ శ్రీకృష్ణార్పితపవిత్రా చరణములవలన దేహధారియొక్క జననమరణచక్రము నశింపగలదు. వేదవిదులైన బ్రాహ్మణులైనను శ్రీకృష్ణభక్తివిహీనులైనచో, వారితోడసాంగత్య మొన రించిన, వారితో వార్తాలాపము లొనరించినచో భక్తులభక్తి నశింపగలదు. శ్రీకృష్ణునియనన్యభక్తుడైన సద్బ్రాహ్మణుడు శ్రీకృష్ణస్వరూపుడే. సదా శ్రీకృష్ణప్రసాదమునే ఆరగించు భాగవతోత్తమునిస్పర్శచే అగ్ని మొదలు

పవనము వరకు పవిత్రములు కాగలవు, ఆభక్తుడు సకలజగములు పావన మొనరించుటలో సమర్థుడు కాగలడు. ద్విజవరా! శ్రీకృష్ణపరమాత్మను వీడి ఎచటకు తపమాచరింప బోవుచున్నావు? సకల తపఃఫలములు కేవలము శ్రీకృష్ణ స్మరణ మాత్రమువనే ప్రాప్తింపగలవు, ఎవని యుపదేశములవలన శ్రీకృష్ణుని యందు భక్తి ఉత్పన్నముకాదో, ఆగురువే పరమవైరి, ఆతడే జన్మను నిష్ఫల మొనరించు వా డని గ్రహింపుము.

పార్వతీదేవి ఉపదేశించిన దివ్యజ్ఞానమును ఆలకించి నిశ్చల మనస్కుడై దుర్వాసుడు శివునకు, దుర్గకు, అనేక ప్రణామము లర్పించి శ్రీకృష్ణుని దివ్యచరణార విందములనే మనములో స్మరించుచు ద్వారకానగరమునకు వెడలెను. ద్వారకలో సకల దేవేశ్వరేశ్వరు డైన శ్రీకృష్ణపరమాత్మను దర్శించి ఆపరబ్రహ్మమును అనేకవిధముల స్తుతించి తదనంతరము ఏకానాంశతో సుఖ పూర్వకముగ నివసింపదొడంగెను.

పాండవశ్రేష్ఠుడైన యుధిష్టరుని ప్రార్థనలను గ్రహించి శ్రీకృష్ణ పరమాత్మ హస్తినాపురము జేరెను. మాధవుడు పరమానంద పూర్వకముగ కుంతిని, పంచపాండవులను కుశలప్రశ్నలువేసి వారిని సదా రక్షించెదనని యభయ మొసగెను. తదనంతరము యుక్తిపూర్వకముగ జరాసంధాదిఅసుర లను పాండవులచే మడయింపజేసి యుధిష్టరుని ద్వారా రాజసూయ యజ్ఞము సంపన్న మొనరించెను. ఆయజ్ఞసభయందు పాండవులచే అగ్రపూజ నొందు చున్న పురుషోత్తము డైన శ్రీకృష్ణుని మాత్సర్యభక్తు లైన శిశుపాలదంత వక్త్రులు అనేకవిధముల దూషింపగ ఆజగన్నాథుడు వారిని తన చక్రాయుధ ముచే సంహరించెను. సుదర్శనచక్రఘాతముచే వారు దివ్యదేహులై శ్రీకృష్ణు నిట్లు స్తుతింపదొడంగిరి.

శి శు పా లు డు ప లి కె ను :-

శ్లో॥ వేదానాం జనకోఽసి త్వం వేదాఙ్గానాం చ మాధవ ।
సురాణా-మసురాణాం చ ప్రాకృతానాం చ దేహినామ్ ॥ 29

సూక్ష్మం విధాయ సృష్టిం చ కల్పభేదం కరోషి చ ।
మాయయా చ స్వయం బ్రహ్మ శంకరః శేష ఏవ చ ॥ 30

మనవో మునయశ్చైవ దేవాశ్చ సృష్టిపాలకాః ।
కాలాంశేనాపి కలయా దిక్పాలాశ్చ గ్రహాదయః ॥ 31

శ్లో॥ స్వయం పుమాన్స్వయం స్త్రీ చ స్వయమేవ నపుంసకః ।
కారణం చ స్వయం కార్యం జన్యశ్చ జనకః స్వయమ్ ॥ 32

యన్త్రస్య చ గుణో దోషో యన్త్రిణశ్చ శ్రుతౌ శ్రుతమ్ ।
సర్వే యన్త్రా భవాన్యన్త్రీ త్వయి సర్వం ప్రతిష్ఠితమ్ । 33

మమ క్షమస్వాపరాధం మూఢస్య ద్వారిణ స్తవ ।
బ్రహ్మశాపాత్కుబుద్ధేశ్చ రక్ష రక్ష జగద్గురో ॥ 34

మాధవా! నీవు సకలవేదములకు, వేదాంగములకు, దేవతలకు, అసురులకు, దేహధారులందరికి జనకుడవు. నీవే సూక్ష్మ సృష్టివిధాన మొనరించి ఆసృష్టిలో కల్పభేదములను కల్పించెదవు. నీవే ఆత్మమాయచే స్వయముగ బ్రహ్మశివశేషుడ వైనావు. మనువులు, మహర్షులు, వేదములు, సృష్టిపాలకులు నీకళాంశలచే ఉత్పన్నులైనారు. దిక్పాలకులు, సకలగ్రహాదులు నీకళలనుండి ఉద్భవించిరి. నీవే స్వయముగ పురుషుడవు, స్త్రీవి, నపుంసకుడవు, కార్యము, కారణుడవు. దేవా! నీవే జన్మించువాడవు, నీవే జనకుడవు, యంత్రముయొక్క గుణదోషములు యంత్రమును నిర్మించిన వారిపై ఆరోపింపబడు నని శ్రుతివచనము. దేవా! ఈసకలప్రాణులు యంత్రములే, నీవే ఆయంత్రములను నిర్మించినవాడవు. సర్వము నీయందే ప్రతిష్ఠిత మైయున్నది. జగద్గురూ మేము దుర్బుద్ధియుక్తులము, మూఢులమునగు నీద్వారాపాలకులము. బ్రాహ్మణశాపమునకు మేముగురియైతిమి, కావున మాయపరాధములను క్షమించి మమ్ములను బ్రాహ్మణశాపములనుండి రక్షింపుము.

ఇట్లు అనేకవిధముల ఆజయవిజయులు శ్రీకృష్ణ పరమాత్మను స్తుతించి ఆనందపూర్వకముగ వైకుంఠ ద్వారమును జేరిరి. శిశుపాలు డొనరించిన ఈస్తవనము నాలకించి ఆసభలో విరాజిల్లియున్న సర్వులు పరమాశ్చర్యచకితులైరి. వారందరు శ్రీకృష్ణుడే పరిపూర్ణతము డైన పరమేశ్వరు డని నిర్ణయించుకొనిరి. తదనంతరము యుధిష్ఠిరుడు రాజసూయ యజ్ఞమును పరిపూర్ణ మొనరించి బ్రాహ్మణులకు అనేక సంతర్పణల నొనరించెను.

శ్రీకృష్ణపరమాత్మ ద్వారకకు మఱలివచ్చి చిరకాలము సుఖముగ నివసించుచు ఉగ్రసేనుని యాజ్ఞానుసారముగ మృతవత్సలగు బ్రాహ్మణి యొక్క పుత్రులకు జీవనదానమును చేసెను. ఇదిగాంచిన దేవకి అత్యంత

ప్రసన్నురాలై కంసునివలన మరణించిన తనపుత్రులకుకూడ జీవనదానము చేయుమని శ్రీకృష్ణుని ప్రార్థింపగా, ఆయన తన సహోదరులను మృతస్థానము నుండి రావించి తల్లి కర్పించెను. తన్ను శరణుజొచ్చి ద్వారకానగరమున కఱు దెంచిన తనసహపాఠియగును సుదాముని దారిద్ర్యమును హరించెను. భక్త వత్సలు డైనభగవంతుడు భక్తునినుండి అటుకులను స్వయముగ గ్రహించి సుదామునకు ఏడుతరముల వరకు సుస్థిరరాజ్యలక్ష్మిని ప్రసాదించెను. ఇంద్రుడు అమరావతిలోరాజ్యమొనరించినట్లు సుదాముడు భూమిపై రాజ్యమును పాలించెను. అతడు కుబేరునితో సముడైన ధనాఢ్యు డయ్యెను. పరమాత్మ తనయ నన్యభక్తు డైన సుదామునకు నిశ్చలహరిభక్తిని తనపరమదుర్లభదాస్యసౌభాగ్యమును, నిత్యగోలోకపరంధామమందు ఉత్తమపదమును ప్రసాదించెను.

మునీశ్వరా! శ్రీకృష్ణుడు పారిజాతాపహరణమొనరించి ఇంద్రునిగర్వమును భంగమొనరించెను. సత్యభామద్వారా మనోవాంఛితమైన పుణ్యకవ్రతమును చేయించి సర్వత్రా నిత్యనైమిత్తికసత్కర్మలను ఉద్ధరించి ధర్మమును సంస్థాపించెను. సత్యభామ యొనరించిన పుణ్యకవ్రతములో తన్ను తాను దక్షిణగ సనత్కుమారునకు సమర్పించుకొనెను. ఇట్లు సత్యభామ గర్వమును పోగొట్టి ఆమె విమలయశమును సర్వత్రా విస్తరింపజేసెను. నారదా! రుక్మిణి యొక్క అన్యాన్యరాణులయొక్క సౌభాగ్యములను పెంపొందింపజేసి వైష్ణవులను, దేవతలను, బ్రాహ్మణులను, ఆదరించి పూజించి నిత్యనైమిత్తికకర్మలను సర్వత్రా వృద్ధిచేసెను. ఆ ప్రభువు ఉద్ధవునకు ఆధ్యాత్మిక జ్ఞానోపదేశమొనరించెను. పాండవులకు, కౌరవులకు, భేద ముత్పన్న మొనరించి రణరంగమధ్యములో అర్జునునకు గీత నొసంగి పృథ్విని నిష్కంటక మొనరించి, యుధిష్ఠిరునకు సామ్రాజ్యలక్ష్మిని ప్రసాదించెను. దేవర్షీ! ఇట్లు కృపామయుడైన ఆప్రభువు భూభారమును హరించెను.

వైష్ణవీదుర్గను గ్రామదేవతస్థానమున నియమించి రమణీయమైన రైవతపర్వతముపై అమూల్యరత్ననిర్మితమందిరములో ఆమెప్రసన్నతకొఱకు అనేకనైవేద్యములను, మనోహరధూపదీపములను, కోటానుకోట్లహవనములతో సంయుక్తమైన యజ్ఞముల నర్పించెను. పార్వతీదేవి ఆరాధ్యమహోత్సవములో ఆజగన్నాథుడు అనేకసంతర్పణల నొనరించి బ్రాహ్మణులను సత్కరించెను. శ్రీకృష్ణుడు పరమేశ్వరుడైన గణేశ్వరుని ఆరాధించి ఆయనకు నైవేద్య

ముగ అత్యంతస్వాధిష్టములైన, పరమతుష్టికారకములైన తిలలచే నిర్మింపబడిన ఐదులక్షలలడ్లను, స్వస్తికాకారయుక్తములైన అమృతతోపమయములైన ఏడు లక్షలమోదకములను; చక్కెరరాసులను, పరిపక్వములైన కదళీఫలములను, పదిలక్షలఉండ్రాళ్ళను, మృష్టాన్నములను, మనోహరస్వాధిష్టపరమాన్నము లను, స్వస్తికపిష్టకములను, ఘృతమును, వెన్నను, దధిని, అమృతతుల్యమైన క్షీరములను నివేదించెను. తదుపరి ధూపదీపములతో, పారిజాతపుష్పమాల లతో, సుగంధితచందనాదులతో, గంధముతో విఘ్నవినాయకుని అర్చించి ఆయనకు శ్రీకృష్ణుడు అగ్నిశుద్ధవస్త్రముల నర్పించెను. లోకశిక్షార్థమై ఆప్రభువు కోట్లకొలదిగా యజ్ఞముల నాచరించి, సర్వులచే ఆచరింపజేసి బ్రాహ్మణులతోగూడి మంగళవాద్యములు మ్రోగుచుండగ గణపతిని స్తుతిం చెను. సాంబునకు సంభవించిన కుష్ఠురోగనివారణార్థమై ప్రభువు ఒకసంవత్సర పర్యంతము అనుపమోపహారములద్వారా సూర్యుని పూజించి మాతృసహి తముగ సాంబుని సూర్యవ్రతమాచరింప జేసెను. అపుడు ప్రసన్నుడై స్వయముగ సూర్యభగవానుడు ప్రత్యక్షమై సాంబుని ఆరోగ్యవంతునిగ నొనరించి, వరము లను, తనస్తోత్రమును ప్రసాదించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మ ఖండమందు శిశుపాల దన్తవక్త్రుల వధ యను
నూట పదమూడవ అధ్యాయము
సంపూర్ణము.

---

## నూటపదునాల్గవ అధ్యాయము

### -: ఉషాపహరణాఖ్యానము :-

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :-

నారదా! శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుడు మహాబలపరాక్రమ సంపన్నుడు, విధాత అంశచే అనిర్ధుడు ఆయనకు కుమారునిగ ఆవిర్భవించెను యౌవన సంపన్నుడైన అనిరుద్ధునకు స్వప్నములో అతిలోకసౌందరవతియైన యొకరమణి గోచరించెను. ఆసౌందర్యరాశిని గాంచగనే ప్రేమవిహ్వలుడై

అనిరుద్ధుడు తాను మన్మథుని పుత్రుడననియు, త్రిలోకాధినాథుడైన శ్రీకృష్ణుని పౌత్రుడననియు తన్నుతాను పరిచయ మొనరించుకొని తనను పరిణయమాడ వలసినదిగ ఆలతాంగిని కోరెను. అందులకు ఆజవ్వని ఇట్లు ప్రత్యుత్తర మొసంగెను. "మన్మథాకారా! నేను బాణాసురుని కుమార్తెను, నానామ ధేయము ఉష. త్రైలోక్య విజయుడైన బాణాసురుడు శంకరుని కింకరుడు, అజేయుడు. పురుషోత్తమా! స్త్రీ మూడు (బాల్య, కౌమార, వార్ధక్య) అవస్థ లందు పరాధీనయే. స్వతంత్రించి ధర్మమును వీడి చరించు స్త్రీ నీచకులమందు జన్మించి పుంశ్చలి కాగలదు. కన్య వరుని యాచింపరాదు. వరుడే కన్యను ప్రార్థింపవలెను. ఇదియే సనాతనధర్మము. ప్రభూ! నీవు నాకు యోగ్యవరుడవు. నేను నీకు యోగ్యురాలనైనవధువును. నీవు నాపాణిని గ్రహింపవలెనన్న ప్రథమమున నాజనకుడైన బాణాసురుని, శివుని, పార్వతిని, ప్రార్థించి వారి యనుజ్ఞను బొందుము." ఈ విధముగ అనిరుద్ధునాదేశించి ఆబాలికారత్నము అంతర్ధానమయ్యెను. స్వప్నము భంగము కాగా అనిరుద్ధుడు మేల్కాంచి తన ప్రాణవల్లభను గాంచక కామజ్వరమునకు గుఱియై అశాంతియుక్తుడయ్యెను.

ఇట్లు ఉద్విగ్నుడగుచున్నకుమారుని గాంచి దేవకి, రుక్మిణి మొదలగు వారు ఈ విషయమును శ్రీకృష్ణునకు సూచించిరి. జరిగినదంతయు ఆలకించిన వాడై శ్రీకృష్ణుడు సస్మితవదనముతో ఇట్లు పల్కెను. "మహిళాశిరోమణు లారా! బాణాసురునికన్యయగు ఉషకు యోగ్యవరునితో సంధానము కావ లయు నని అభిలషించి దుర్గాదేవి అనిరుద్ధునకు స్వప్నములో ఉష గోచర మగునట్లొనరించెను. నేను అనిరుద్ధుని ఉషకు స్వప్నమందు సాక్షాత్కరించు నట్లు జేసెదను. త్వరలో వారిర్వురికల్యాణము అనివార్యము కావున మీరు అనిరుద్ధునిగూర్చి చింతింపకుడు." తదనంతరము 'ఉష' స్వప్నములో కోటి కందర్పదర్పహారియైనఅనిరుద్ధుని దర్శించి ఆయననే తన ప్రాణనాథునిగ వరించి విరహవ్యాకులయై, కామపీడితయై పరితపించుచు అన్యమనస్కురాలై ప్రవర్తింపదొడంగెను. ఉద్విగ్నురాలై మెలంగు ఉషను గాంచి సర్వము గ్రహించి నదియై ఆమెసఖి చిత్రలేఖ ఇట్లు పల్కెను.

"కళ్యాణీ! చేతనత్వము నొందుము, ఈనగరము దుర్భేద్యము. ఎందు వలననగ స్వయముగ ఉమాశంకరులు ప్రమథగణములతో పరివేష్ఠితులై ఈ నగరములో నివసించుచు మనలను, నగరమును సదారక్షించుచున్నారు.

ఎందులకు నీవు విచారించెదవు ? సఖి ! పరమశివుడే సర్వమంగళములకు వాస స్థానము ; కావున ఆయనస్మరణమాత్రముననే సకలఅరిష్టములు నశించి సర్వత్రా మంగళములు సంభవింపగలవు. దుర్గతినాశనియగు దుర్గను ధ్యానించిన సర్వ క్లేశములు నశించును. ఆమె సర్వమంగళ; కావున ధ్యానించుభక్తులకు ఆమె మంగళములను ప్రసాదించును" చిత్రలేఖకథనము నాలకించి ఉష దుఃఖించుచు శంకరునిసమక్షముననే విషాదమగ్నయై మూర్ఛిల్లెను. అపుడు గణేశ్వరుడు మహేశ్వరునితో ఇట్లు పల్కెను. "పితృదేవా ! స్వయముగ పార్వతి మాతా ఉషను కామదేవనందనుడైన అనిరుద్ధునకు స్వప్నములో గోచరింపజేసి ఇపుడు నీవామపార్శ్వమున మౌనముగ ఆసీనురాలైయున్నది. శ్రీహరి సర్వజ్ఞుడు, కావున బాణుని కన్యయగుఉషకు స్వప్నములో సుందరవేషధారియగు అని రుద్ధుడు గోచరించునట్లుజేసెను. కావున తక్షణమే చిత్రలేఖ ప్రమత్తుడైన అనిరుద్ధుని తోడ్కొనివచ్చుటకు ద్వారకానగరమునకు బయలుదేరవలెను.".

గణేశ్వరుడు పల్కినపల్కుల నాలకించి మహాదేవు డిట్లుబల్కెను. "కుమారా! ఈశుభకార్యమును అత్యంతగోప్యముగ నుంచుము. ఈవిషయము బాణాసురునకు అవగతము కారాదు" తదనంతరము మహాదేవునియనుజ్ఞ గైకొని యోగినియగుచిత్రలేఖ ద్వారకానగరము జేరెను. శ్రీహరిభవనము ఎంతటివారికైనను దుర్భేద్యము. అయినను చిత్రలేఖ పరమాత్మునియొక్క అనుజ్ఞచే గృహమును ప్రవేశించి హంసతూలికాతల్పముపై విశ్రమించియున్న అనిరుద్ధుని తల్పసహితముగ యోగబలముచే పట్టుకొని శోణితపురమునకు బయలుదేరెను. మునీశ్వరా! చిత్రలేఖమనోవేగశాలిని. ఆమె రెండుఘడియల లోనే అనిరుద్ధునితోసహా శోణపురమును జేరెను. ప్రాతఃకాలమున అంతఃపుర ములో అనిరుద్ధుని గాంచక శ్రీకృష్ణునిమందిరములో సర్వులు చింతింపనొడం గిరి. సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు అంతఃపురవాసులందరిని యోదార్చి ససైన్యముగ శోణితపురమునకు బయలుదేరెను.

నారీమణులందు ధన్యురాలైన, పుణ్యురాలైన, మాన్యురాలైన, శాంత యైన, దుర్వాసమహర్షిశిష్యురాలైన చిత్రలేఖ సిద్ధయోగిని. చిత్రలేఖ అని రుద్ధుని తోడ్కొని శోణితపురము జేరి ఆయనను అనేకవిధముల అలంకరించి యోగశక్తిద్వారా దుర్భేధ్యమైన ఉషయొక్క అంతఃపురమును ప్రవేశించి విరహజ్వాలలచే పీడింపబడుచున్న ఉషను గాంచెను. అన్నపానాదులను పరిత్య

జించి ఉష శుష్కోదరయైనది. ఆమెసఖులు ఆమెను పరివేష్టించి శైత్యోపచారము లొనరించుచుండిరి. చిత్రలేఖను తాను స్వప్నములో గాంచినదివ్యపురుషుని దర్శింపగనే ఉష స్వస్థచిత్తురాలై చిత్రలేఖవలన జరిగినదంతయు తెలిసికొని అత్యంతప్రసన్నురాలయ్యెను. ఉష మనఃపూర్వకముగ ప్రద్యుమ్ననందను డైన అనిరుద్ధుని వరించెను. ఆపురుషశార్దూలము గాంధర్వవిధిచే ఉషను పాణిగ్రహణ మొనరించి ఆమెతో విహరింపదొడంగెను. ఉషానిరుద్ధుల సమాగమము కర్ణాకర్ణిగ బాణాసురునకు తెలియవచ్చెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మ ఖండమందు ఉషా పహరణాఖ్యాన మను
నూట పదునాల్గవ అధ్యాయము
సంపూర్ణము.

---

## నూటపదునైదవ అధ్యాయము

### :- శివబాణాసుర సంవాదము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదా! అంతఃపురమున సంభవించిన ఉషానిరుద్ధుల సంగమమును గ్రహించినవారై అంతఃపురరక్షకులు భయభీతులై కార్తికేయుడు, గణేశ్వరుడు, ఉమాశంకరులు విరాజిల్లియున్న బాణాసురునిసభను ప్రవేశించి ఆదిదంపతులకు నమస్కరించి బాణునకు ప్రణమిల్లి అంతఃపురవృత్తాంతమును విన్నవించిరి. ఆసమాచారము నాలకించిన బాణాసురుడు లజ్జ నొందినవాడై అత్యంతకుపితుడయ్యెను. ఆసమయమున ఉమాశంకరులు, గణేశ్వరుడు, కార్తికేయుడు, భైరవి, భద్రకాళి, యోగినులు, అష్టభైరవులు, ఏకాదశరుద్రులు, భూతప్రేతకుష్మాండ భేతాళబ్రహ్మరాక్షసాదిగణములు, యోగులు, సిద్ధులు, చండికలు మొదలగు వారందరు శ్రీకృష్ణునిపౌత్రుడు డైన అనిరుద్ధునితో వైరము శ్రేయస్కరము కా

దనియనేకవిధముల ఉపదేశించిరి. అయినను బాణాసురుడు అనిరుద్ధునితో సంగ్రామమునే నిశ్చయించెను. తాను విద్వాంసుడననిభావించు బాణాసురుని గాంచి శ్రీమహాదేవుడు హితకరములైన, సత్యములైన, నీతిశాస్త్రసమ్మతములైన, పరిణామమందు సుఖప్రదములైన వచనముల నిట్లుపల్కెను. "బాణా! పృథ్వీభారము తొలగించుటకు, దుష్టులను శిక్షించుటకు, శిష్టులను రక్షించుటకు స్వయముగ పరమేశ్వరుడే ద్వారకానగరములో విరాజిల్లుచున్నాడు. ఎవనిరోమకూపములందు సర్వవిశ్వములు నిలచి యున్నవో, ఆవాసునకే ఆయన ఈశ్వరుడు కావున విద్వాంసులు ఆయనను వాసుదేవుడనికీర్తించిరి. స్వయముగ అవనిపై దయచేసిన చక్రపాణి బ్రహ్మాలకేరవిధాత, అసంఖ్యాకులైన బ్రహ్మావిష్ణుశివాదులకు స్వామి. ఆయన ప్రకృతికే అతీతుడు, ప్రాకృతిక నిర్గుణుడు, ఇచ్ఛారహితుడు, భక్తానుగ్రహవిగ్రహుడు, పరబ్రహ్మము, పరంధాముడు, దేహధారులకు పరమాత్మ. ఏయాత్మస్వరూపుడు దేహమును వీడి చనిన దేహధారి దేహము శవమగునో, ఆపరమాత్మతో నీకుసంగ్రామ మెట్లుసంభవము కాగలదు? అనిరుద్ధుడు ఆయన పౌత్రుడు. ఆకుమారుడు క్షణములోనే త్రిలోకములను సంహార మొనరింపగల బలపరాక్రమసంపన్నుడు. ఎందరు మహారథులైనను, దేవతలైనను, దైత్యులయినను, అనిరుద్ధుని పదునాఱవకళకైనను సరిరారు. ధనములో, బలములో సమానులైన వారిమధ్య వివాహము, మైత్రి శోభింపగలవు. బలవంతునకు, నిర్బలునకు మధ్య సంబంధము ఉచితముకాదు. నీ పితృదేవుడైన బలిచక్రవర్తి సకలదైత్యసారస్వరూపుడు, సాక్షాత్ శ్రీహరి కళాంశసంభూతుడు. అట్టివానినే క్షణములో సుతలలోకమునకు బంపిన ఆబృందావనేశ్వరుడైన, పరమపురుషుడైన, పరిపూర్ణతముడైన శ్రీకృష్ణునకు సకలజీవులు అంశాంశకళామాత్రులే."

తదనంతరము పార్వతీదేవి బాణాసురునితో ఇట్లుపల్కెను. "బాణాసురా! బ్రహ్మామహేశశేషాదులు ధ్యాననిష్ఠులైనపరమభక్తులు వారు అహర్నిశములు తమతమహృదయకమలములలో ఆసనాతనుడైన భగవంతునే ధ్యానించుచుందురు. సూర్యుడు, గణేశ్వరుడు, పరమయోగీంద్రులగుః రుద్రులకే ఆచార్యుడైనశివుడు ఆసనాతనుడైన, ఐశ్వర్యశాలియైన పరమాత్మనిమిత్తధ్యానమందు సదా తల్లీనులై యుందురు. సనత్కుమారాదులు కపిలమహర్షి, నరనారాయణులు తమహృదయసరోజములలో ఆసనాతన భగవంతునే ధ్యానించు

చుందురు. మునులు, మునీంద్రులు, సిద్ధేంద్రులు, యోగీంద్రులు ధ్యానము ద్వారా అప్రాప్యుడైన సనాతనుడైన భగవంతుని ధ్యానములో నిమగ్నులై యుందురు. సర్వులకు ఆదియు, సర్వులకు కారణము, సర్వేశ్వరుడు, పరాత్పరుడు నగు సనాతనుడైన భగవంతుని జ్ఞానులందరు ధ్యానింతురు.'' తదనంతరము గణేశ్వరుడు, కార్తికేయుడుకూడ బాణునియెదుట శ్రీకృష్ణమహిమలను వర్ణించి అనిరుద్ధునితో యుద్ధము తగదని ఉషను సమర్పింపుమని ఉపదేశించిరి. వారి ఉపదేశముల నాలకించి కోపరక్తాస్యనయనుడై బాణాసురు డిట్లు ప్రత్యుత్తర మొసంగెను. ''తల్లీ, మహేశ్వరీ! తండ్రీ, మహేశ్వరా! గణేశకార్తికేయాది భాతృగణములారా! నేను పల్కు-వచనముల నాలకింపుడు. శుభాశుభములన్నియు ప్రాణులకు తమతమకర్మలవలననే సంభవించును. చేసినకర్మకు వ్యతిరేకముగా ఏమియు సంభవింపదు. కాలము ప్రాప్తింపనిదే మృత్యువాసన్నము కాదు. నాయందు నిర్వాణమే విధాత లిఖించిన అనివార్యమైన నిషేకఫలము నెవరు నివారింపగలరు? భీరువై సంగ్రామమునుండి విరమించునరేశ్వరుని జీవనము నిష్ఫలము. యుద్ధములో జయమొందిన యశము లభించును, మరణించిన వీరస్వర్గము లభించును. మీరందరు రక్షించు ఈశ్వర్యమైన నగరమును ప్రవేశించి ఎవరు నాకన్యను గ్రహింపగలరు?.'' బాణాసురునివచనముల నాలకించి శోణితపురగ్రామదేవత యైన కోటరి ఇట్లు పల్కెను. ''వత్సా! ధర్మానుసారముగ నేను నీకు తల్లిని. కావున నాహితవచనములను సావధానముగ శ్రవణమొనరింపుము.

శ్లో॥ దురన్తేనామపి పుత్రేణ పిత్రోర్దుఃఖం పదే పదే ॥ 43

దుష్టుడైనపుత్రుడు తలిదండ్రులకు అడుగడుగున దుఃఖమును కలుగచేయుచుండును.

మఱియొకరు గ్రహించిన ఉష రెండవవారికి దానయోగ్యకాదు; కావున శ్రీకృష్ణుని పౌత్రుడైన, ప్రద్యుమ్నునిపుత్రుడైన అనిరుద్ధునకు స్వేచ్ఛానుసారముగ నీకన్యను దానమొనరింపుము. ఈ కర్మచే నీవు, నీ ఏడు తరములవారు పవిత్రులు కాగలరు. నీసర్వస్వమును జామాతకు ఉపహారముగ నొసంగి భూమిపై మహాయశస్వివి కమ్ము. లేనిచో మాధవుడు రణరంగములో సుదర్శనచక్రముచే నిన్ను వధించుసమయమున ఎవరు నిన్నురక్షింపగలరు?''

మునీశ్వరా! కోటరి బల్కిన హితవచనములు ఆత్మాభిమానియైన, దైత్యశ్రేష్ఠుడైన బాణునికర్ణములకు ములుకులైనోకగా ఆత డత్యంతకుపితుడై సకలాస్త్రశస్త్రములను సంగ్రహించి రణమునకే సిద్ధమయ్యెను. శంకరుని యాజ్ఞానుసారముగ స్కంధుడే బాణునిసర్వసైన్యములకు ఆధిపత్యము వహించెను. స్వయముగ శివుడు గణేశ్వరుడు, బాణునకు స్వస్తివచనములను బల్కిరి. పార్వతి, కోటరి శుభాశీర్వాదముల నొసంగిరి. అష్టభైరవులు, ఏకాదశరుద్రులు మొదలగువా రందరు అస్త్రశస్త్రసమన్వితులై కార్తికేయు ననుసరించిరి. పార్వతి పంపిన ఒకదూత అనిరుద్ధునకు రణసమాచారము నిట్లు దెల్పెను. "అనిరుద్ధా! లెమ్ము పార్వతీదేవి బల్కిన మంగళవచనములను బల్కుచున్నాడ శ్రవణ మొనరింపుము. వత్సా! కవచాస్త్రములను ధరింపుము. అంతఃపురమును వీడి బయల్వెడలి యువకిశోరమువలె దైత్యు నెదుర్కొనుము." దూత బల్కినసమాచారమును విని అత్యంతభయభీతురాలై ఉష జగజ్జననిపార్వతి నిట్లు ప్రార్థించెను. "మహామాయా! నాప్రాణేశ్వరుని రక్షింపుము, రక్షింపుము. నా నాధుడు నిర్భయుడైనను ఆయనకు ఈ మహాసంగ్రామములో అభయ మొసంగుము. నీవే జగన్మాతవు గావున నీకు అందరియందు సమముగ కరుణ యుండును."

తదనంతరము పరమైశ్వర్యశాలియైన అనిరుద్ధుడు కవచమును ధరించి, ధనుర్బాణములను గైకొన్నవాడై అంతఃపురమును వీడి రథారూఢుడై రణరంగమును ప్రవేశించి తనసమక్షమున కవచమును ధరించి సకలశస్త్రాస్త్రములచే అలంకృతుడై ప్రళయకాల రుద్రునివలె నున్న బాణాసురుని వీక్షించెను. అనిరుద్ధుని గాంచగనే బాణాసురుడు రక్తపంకజలోచనుడై అప్రతిహత క్రోధవశుడై ఇట్లు అనిరుద్ధుని, ప్రద్యుమ్నుని, శ్రీకృష్ణ పరమాత్మను నిందింప దొడంగెను. "పుణ్యక్షేత్ర మైన భారతవర్షములో విరాజిల్లు చంద్రవంశమునకు నీవు అంగారము (నిప్పుకణము) వంటివాడవు, నీతిశాస్త్ర వివర్జితుడవు, మహాదుష్టుడవు. నీతండ్రి శంబరాసురుని సంహరించి వాని భామినిని పరిగ్రహించెను. నీపితామహుడు వాసుదేవుడు మధురలో క్షత్రియుడు, గోకులములో వైశ్యపుత్రుడు, నందనందనుడు, బృందావనములో గోపాలుడు, నందుని పశువులకు కాపరి, గోపీజారుడు, పూతనను సంహరించిన వాడు, అధార్మికుడు, మధురలో కుబ్జను గ్రహించినవాడు, దుర్బలుడైన నరకాసురుని సంహరించి మనోహారిణు

లైన స్త్రీలను హరించినవాడు, నిర్బలుడైన భీష్మకుని, వాని పుత్రుని జయించి దేవయోగ్యమైన వాని కుమార్తె రుక్మిణిని హరించినవాడు. సూర్యభృత్యుడైన సత్రాజితు సూర్యుని అనుగ్రహమువలన శమంతకమణిని పొందను. మీ నల్లని వాడు మాయోపాయముచే మణిని సత్రాజిత్తుకన్యను హరించెను, యుధిష్ఠరుని యజ్ఞములో శిశుపాల దంతవక్త్రులను సంహరించెను. శాల్వుడు, జరాసంధుడు మొదలగువారలను అతిదారుణముగ సంహరించెను. కురుపాండవులకు వైరము కల్పించి మహాసంగ్రామ మొనరింపజేసెను. రాజులకు భయపడి సముద్రమధ్యమున నగరనిర్మాణ మొనరించెను. ఉపాయముతో నరకాసురుని సంహరించి వాని సర్వస్వమును హరించెను. భార్యమాటల నాలకించి సహోదరు డైన ఇంద్రుని జయించి స్వర్గదుర్లభ మైన పారిజాతము నపహరించెను. తల్లి సోదరుడని భావింపక ధర్మాత్ము డైన కంసుని వధించి వాని సర్వస్వమును హరించెను. భల్లూకేశ్వరుని యుద్ధములో జయించి వాని కన్యను హరించెను. వాసుదేవుని మేనత్త యగు కుంతి భర్తయొక్క ఆజ్ఞానుసారముగ క్షేత్రజ యై పుత్రులను గనెను. ద్రౌపది ఐదుగురు భర్తలకు భార్యయైనది. తనసహోదరి యైన సుభద్రను కృష్ణుడు మేనత్తకుమారునకు అర్పించెను.''

బాణాసురుడు బల్కిన దుర్భాషల నాలకించి అత్యంతక్రోధ సమన్వితుడై కామనందనుడు అత్యంతయోగ్యమైన, పరమార్థమైన ప్రత్యుత్తరముల నిట్లు పల్కెను. ''మూఢుడా! పవిత్ర మైన మావంశము నేల నిందితువు, ఎవని బాణములకు త్రిలోకములు వశములై మెలంగుచున్నవో ఆ బ్రహపుత్రు డైన అత్యంత పవిత్రు డైన కామదేవుడే నాతండ్రి. ఆయన శివుని ఫాలాగ్నికి భస్మమై పరమాత్మ యైన శ్రీకృష్ణునకు పుత్రునిగ అవతరించెను. పతిశోకముచే సంతప్త యైన పతివ్రతయైన నాతల్లి రతీదేవిని బలముచే శంబరాసురుడు చెరబట్టెను. మాయావతీ నామధారిణియై రతిదేవి తనఛాయను శంబరుని పత్నిగ నిసియోగించి తాను మాత్రము తన ప్రాణేశ్వరుని ధ్యానమందే మగ్నురాలై యుండెను. శంబరాసురుని సంహరించి సూర్యచంద్రుల సాక్షిగ నాతండ్రి నాతల్లిని పాణిగ్రహణ మొనరించి ద్వారకకు దయచేసెను. మహాత్ములైనను వేదములైనను ఎవనిని తెలిసికొనలేక పోయినవో, నాపితామహుడైన ఆవాసుదేవుని దివ్యలీలలను మూఢుడ వైన నీవెట్లు తెలిసికొనగలవు?

శ్లో॥ వాసుః సర్వనివాసశ్చ విశ్వాని యస్య లోమసు ।
తస్య దేహః పరం బ్రహ్మ వాసుదేవ ఇతి స్మృతః ॥

ఎవని రోమకూపములలో సకలబ్రహ్మాండములు వర్తమానములై యున్నవో ఆమహావిరాట్పురుషుడే వాసు, ఆయనకే దైవమైన అపరబ్రహ్మమునే వాసుదేవు డని స్మృతులు కీర్తించినవి,

నీవు శంకరుని భృత్యుడవు, కావున నాపితామహుని విషయమును శివుని ప్రశ్నింపుము. నీపూర్వపురుషుడైన బలిచక్రవర్తి శ్రీకృష్ణుని భృత్యుడే. గోకులములో శ్రీకృష్ణుడు వైశ్యపుత్రు డని జ్ఞానదుర్బలుడవైన నీవు పల్కితివి ప్రజాపతి ద్రోణుడు ఆయన సహధర్మచారిణి ధర, పరమాత్మయైన ఈశ్వరుని పుత్రునిగ పొందవలె నని ఘోరతప మాచరించిరి. వారి తపఃఫలానుసారముగ ద్రోణుడు వైశ్యరాజైన నందుడైనాడు, యశోధయే ధరాదేవి. గోలోకేశ్వరి యైన రాధ సుదాముని శాపకారణమున త్రింశత్కోటి గోపికలతో శ్రీకృష్ణాజ్ఞానుసారముగ వృషభాను నందినియై అవతరించినది. ఆగోపికలందరు శ్రీకృష్ణుని ప్రియపత్నులు. బ్రహ్మ పురోహితుడు కాగా, పరమాత్మ రాధాదేవి పాణిని గ్రహించెను. గోలోకవాసులైన గోపకుమారులు తేజములో హరితుల్యులు, వారు శ్రీకృష్ణుని పార్షదులు. వారు పరబ్రహ్మమును వీడలేక అవనిపై గోపబాలకులై అవతరించిరి. గోవులను రక్షించుటకే హరి గోపాలకుడైనాడు, గోపశిశువులను రక్షించుటకే ఆజగన్నాథుడు స్వమాయచే గోపబాలుడైనాడు పూతన బలిచక్రవర్తి కుమార్తె, ఆమె బలియజ్ఞవాటికలో వామనుని దర్శించి మాతృప్రేమకలదియై ఇట్టిబాలునకు స్తన్యము నిచ్చిన తనజీవనము ధన్యమని భావించెను. ఆమె మనోభీష్టమును తక్షణమే గ్రహించినవాడై ప్రభువు శ్రీకృష్ణావతారములో పూతన స్తన్యపాన మొనరించి ఆమెకు గోలోకములో మాతృస్థానమును ప్రసాదించెను. కుబ్జ పూర్వజన్మలో రావణుని సహోదరి యైన శూర్పణఖ. త్రిజగన్మోహనుడైన శ్రీరాముని ఆమె కామింపగ ధర్మాత్ముడైన లక్ష్మణుడు ఆమెనాసికను, కర్ణములను ఖండించెను. అపుడాశూర్పణఖ భగవంతునే భర్తగ పొందవలెనని బ్రహ్మనుగూర్చి అఖండతప మాచరించెను. ఆతపఃఫల ప్రభావమున ఆమె కుబ్జయై శ్రీకృష్ణానుగ్రహమునకు పాత్రురాలై గోలోకము జేరెను. నరకాసురుడు పూర్వకర్మానుసారముగ హరిచే వధింపబడెను. నరకుని అంతఃపురములో బంధింపబడిన పదునారువేల మంది దివ్య భామినులను శ్రీకృష్ణపరమాత్మ సూర్యచంద్రులసాక్షిగ వివాహ మాడెను. భీష్మకకన్యయైన రుక్మిణి శ్రీకృష్ణుని ప్రియసతి యైన శ్రీమహాలక్ష్మి,

పరమాత్మ ఆదేశానుసారముగ ఆమె వైకుంఠము నుండి దిగివచ్చి రుక్మిణియైన శ్రీకృష్ణుని వరించెను.

సత్రాజిత్తునికుమార్తె సత్యభామ సాక్షాత్తుగ వసుంధర. సత్రాజిత్తే స్వయముగ కన్యామణితోకూడ మణినికూడ శ్రీకృష్ణపరమాత్మ కర్పించి తరించెను. భూభారమును హరించుటకే హరి కురుపాండవసంగ్రామమును సంకల్పించెను. శిశుపాలదంతవక్త్రులు వైకుంఠములో శ్రీహరిద్వారపాలకు లైన జయవిజయులు. కుమారులశాపమువలన వారికి మూడుజన్మలు లభించెను. మొదటిజన్మలో హిరణ్యాక్షహిరణ్యకశిపులై జన్మించి శ్రీహరియవతారము లైన వరాహనృసింహులచే సంహరింపబడిరి. రెండవజన్మయందు రావణకుంభకర్ణులై శ్రీరామునిచే మడయింపబడిరి, మూడవజన్మలో శిశుపాల దన్తవక్త్రులై శ్రీకృష్ణపరమాత్మ సంహరింపగ మరల వైకుణ్ఠము జేరిరి. జరాసంధుడు, శాల్వుడు, కంసుడు మొదలగువారందరు దురాత్ములు, భూమికి భారమైనవారు, కావుననే వారు నిశ్చయముగ వధ్యులు. మాంధాతపుత్ర మధ్యము డైన యవనుని హరి సంహరింపజేసెను. లక్ష్మీకే ఈశ్వరు డైన కృష్ణునకు ఆయువనునిధనమువలన ఏమిప్రయోజనము? సత్యభామ పుణ్యక వ్రతార్థమై ప్రతిజ్ఞ పూనగ ఆమెవ్రతమును చెల్లించుటకు పరమాత్మ పారిజాతాపహరణ మొనరించెను. భల్లూకాత్మజయైన జాంబవతీదేవి దూర్గాంశాసంభూతురాలు. ఆమె యొనరించిన అఖండతపమునకు ఫలముగ పరమాత్మ ఆమెపాణిని గ్రహించెను. కుంతీదేవి కేవలము భర్తయొక్క ఆజ్ఞకు కట్టుబడి క్షేత్రజు లైన పుత్రులను పొందెను. ఈకర్మ మూడుయుగములందు ప్రసిద్ధము, కాని కలియుగములో నిషిద్ధము. యుధిష్టరుడు ధర్మదేవునికుమారుడు, భీముడు పవనాత్మజుడు, మహేంద్రునికుమారుడే ఫల్గునుడు, అశ్వినీదేవతలపుత్రులే నకులసహదేవులు.

శ్లో॥ అశ్వమేధం గవాలమ్భం సన్యాసం పలపైతృకమ్ ॥　　　112
దేవరేణ సుతోత్పత్తిం కలౌ పంచ వివర్జయేత్ ।

అశ్వమేధమును గవాలంభమును తల్లిదండ్రులఆజ్ఞ భార్యఆజ్ఞ లేనిదే సన్యాసమును పలపైతృకమును, మరదితో సుతోత్పత్తిని గలియుగములో విసర్జింపవలెను.

శంకరునివరప్రభావమువలన ద్రౌపది ఐదుగురుభర్తలకు భార్యయైనది. మేనరికము దాక్షిణాత్యులకు ఆచరణీయమే. కావున కృష్ణపరమాత్మ సుభద్రను మహాత్ముడైన ఫల్గుణున కొసంగెను. ఈ దేవరహస్యములను ఎఱుంగక అజ్ఞానివై వదరుచున్నావు."

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మ ఖండమందు శివబాణాసుర సంవాద మను
నూట పదునైదవ అధ్యాయము
సంపూర్ణము.

---

# నూటపదునాఱవ అధ్యాయము

## బాణానిరుద్ధ సంవాదము

బాణుడు పలికెను:-

అనిరుద్ధా! నీవు అత్యంతమహాజ్ఞానివి, నీవు వచించినదంతయు సత్యమే హరుడుకూడ ఈ విషయములనే నాకుపదేశించెను. మహాభాగా! ద్రౌపది శంకరుని వరమువలన ఎట్లు పంచభర్తృక యైనదో వర్ణింపుము. శంబరాసురుడు దేవతలనెల్ల పరాజితమొనరించి నీజనయగురతి నెట్లు అపరించెను?

అనిరుద్ధుడు పలికెను;-

బాణాసురా! ఒకసమయమున పంచవటిలో శ్రీరఘునాథుడు సీతాలక్ష్మణులలో కలసి ఒకరమణీయసరోవరతటముపై ఆసీనుడై యుండెను. ఆసమయము హేమంతఋతువు. శ్రీరాముడు ఫలములను కొన్నింటిని సీతకు నొసంగి, మఱికొన్నింటిని లక్ష్మణున కొసంగి మిగిలినవి తానుభుజించెను. లక్ష్మణుడు ఫలములను స్వీకరించెను, కాని ఆయన వానిని భుజింపలేదు; ఎందువలెననగ భవిష్యత్కాలములో సీతను చెఱనుండి విడిపించుటకు తాను మేఘనాధుని సంహారింపవలె నని లక్ష్మణు డెఱుంగును. పదునాల్గుసంవత్సరములు నిరాహారులై నిద్ర నాశ్రయింపక నియమసంపన్నులై మెలంగువారే రావణ

కుమారుడైన మేఘనాధుని సంహరింపగలరని లక్ష్మణునకు విదితమే. సీతారాములు ఏకాంతమునుండగ ఆకమలలోచను డైనరామునిసమ్ముఖమునకు సాక్షాత్తు అగ్నిభట్టారకుడు బ్రాహ్మణవేషధారియై అరుదెంచి ఇట్లుపల్కెను. "రామ భద్రా! నావచనముల నాలకించి సీతను రక్షించుకొనుము. ఎందువలననగ దుర్నివార్యమైన విధివలన ఏడుదినములలోపల రావణుడు జానకిని హరింప గలడు. విధాత నిర్ణయించిన విధినెవరు దాటగలరు?

శ్లో॥ వేదైశ్చతుర్భిః కథితం న చ దైవాత్పరం పరమ్ ॥ 12

దైవముకంటె శ్రేష్టులు మఱియొకరు లేరనినాల్గువేదములు ప్రవచించి నవి."

శ్రీ రా ము డు ప లి కె ను :-

అగ్నిదేవా! నీవు సీతను తోడ్కొని పొమ్ము ఆమెఛాయ మాయా సీతయై నాసమీపముననే యుండగలదు.

శ్లో॥ కలత్రయవర్జనం కర్మ సర్వేషాం చ జుగుప్సితమ్ ॥ 13

ఎందువలననగ సహధర్మచారిణి లేనిచో ఆచరింపబడుకర్మలు నిందితము లగును.

అపుడు అగ్నిదేవుడు అసలు సీతను తోడ్కొని ఆమెఛాయను మాత్రమే రాముని చెంత వీడి చనెను. రావణుడు ఆఛాయాసీతనునే హరింపగ రామభద్రుడు పుత్రబాంధవసహితముగ రావణుని సంహరించి ఆ ఛాయాసీతనే ఉద్ధరించెను. అగ్నిపరీక్ష యనెడునెపముతో ఛాయాసీతను శ్రీరాముడు అగ్ని ప్రవేశమొనరించునటుల జేసెను. ఆఛాయాసీతను అగ్ని తనసంరక్షణలో నుంచు కొని రామునకు అసలైనసీతను తిరిగినొసంగెను. జానకిని అగ్నిదేవునినుండి మఱల పొందినవాడై హర్షహృదయముతో అయోధ్యచేరెను. ఛాయాసీత శ్రీరామవియోగముచే దుఃఖితనై అగ్నియొక్క యాత్రమములోనే నివసింప దొడంగెను. ఆఛాయాసీతయే నారాయణ సరోవరమునకు జని భర్తకొఱకు నూఱుదివ్య సంవత్సరములు శంకరుని గూర్చి ఘోరతప మాచరించెను. ఆమె తపమునకు మెచ్చి భవుడు సాక్షాత్కరించి భద్రే! వర మర్ధింపు మని యాదేశిం పగ ఛాయ భర్తవియోగముచే దుఃఖితురాలైయున్న కారణమున 'పతిం దేహి, పతి దేహి' యని శంకరుని ఐదుపర్యాయము లర్థించెను.

సకలసంపత్ప్రదాత యైన శివుడు ఆమెకు వరమును ప్రసాదించుచు ఇట్లుపలికెను. "సాధ్వీ! నీవు వ్యాకులచిత్తవై 'పతిం దేహి, పతిం దేహి' యని యైదుపర్యాయములు నన్నర్థించితివి, కావున శ్రీహరి యంశాసంభూతు లైన ఐదుగురు ఇంద్రులు నీకు ఐదుగురు భర్తలు కాగలరు" మహాదేవు డనుగ్రహించిన వర ప్రభావమువలన ఈసమయమున ఆయైదుగురు ఇంద్రులు పంచపాండవులైరి. ఆఛాయయే ద్రౌపదీరూపమున యజ్ఞకుండము నుండి ఉద్భవించెను. ఆఛాయయే కృతయుగములో వేదవతి త్రేతాయుగములో జనకనందిని సీతాఛాయ, ద్వాపరములో ద్రౌపది; ఈకారణమువలనే ఆమె 'త్రి' హాయణీ కృష్ణా'యని పిలువబడెను, ఆమె పరమవైష్ణవి శ్రీకృష్ణుని భక్తురాలు; కావుననే ఆమెనామధేయము కృష్ణ అయ్యెను. ఆమె జన్మాంతరమున స్వర్గము జేరి మహేంద్రులకు స్వర్గలక్ష్మి కాగలదు. ద్రుపదుడు ద్రౌపదిని స్వయంవరంలో అర్జునునకు సమర్పింపగ అర్జునుడు విషయమును గోప్యముగ నుంచి తల్లి నిట్లు ప్రశ్నించెను. "తల్లీ! నా కొక అమూల్యవస్తువు లభించెను, దాని నేమి చేయవలెనో ఆదేశింపుము". అపుడు కుంతీదేవి ఆవస్తువును ఐదుగురన్నదమ్ములు సమముగ పంచుకొను డని యాదేశించెను. ఇట్లు మొదట శంకరుని వరమువలన, కుంతీదేవి యాజ్ఞావలన పంచపాండవులు ద్రౌపదికి భర్తలైరి. ఈపంచపాండవులు పదునల్వురు ఇంద్రులలోనైదుగురింద్రులు.

కందర్పదహన సందర్భమున నాజనని యగు రతీదేవి శంకరునితో నిష్ఠూరము లాడగ, ఆయన కోపించి ఇట్లు శపించెను. "రతి నీవు ఒక దైత్యునకు అధీనురాల వైయుండెదవు గాక. శంబసురుడు ఇంద్రాది సకలదేవతలను నిర్జించి నిన్ను హరింపగలడు. కాని నీ సతీత్వమునకు ఎట్టిహాని వాటిల్లదు మన్మథుడు మరల ఆవిర్భవించునంతవరకు నీవు నీఛాయను దైత్యున కొసంగి పవిత్రురాలవై వానిగృహములోనే యుండుము." దైత్యేంద్రా! ఇట్లు నేను నీకు పురాతనేతిహాసములను వర్ణించితిని.

కుంభాండకునిసోదరుడు బాణాసురుని ప్రధానదళపతియు బహుబలియు మహారథియునగు సుభద్రుడు ప్రళయాగ్నివలె సకలాస్త్రశస్త్రములను ధరించి శ్రీకృష్ణుపౌత్రుడైన అనిరుద్ధుని తాకెను. ఆరాక్షసుడు అనిరుద్ధునిపై త్రిశూలమును ప్రయోగింపగ ఆయునవీరుడు అర్ధచంద్రాకార శరముచే దైత్యుడు ప్రయోగించిన అస్త్రమును మార్గమధ్యములోనే ఖండించెను. అందులకు

సుభద్రుడు కినుక చెంది మఱల శతసూర్యసదృశ మైనశక్తిని ప్రయోగింపగ అనిరుద్ధుడు దానిని వైష్ణవాస్త్రముద్వారా నిర్జించెను. అనిరుద్ధుని శస్త్రములతాకిడికి బాణునిసర్వసైన్యాధిపతియగు సుభద్రుడు వీరస్వర్గము నలంకరించెను. అనిరుద్ధుడు బాణాసురుని సంహరించుటకు సంసిద్ధు డయ్యెను. అది గాంచి కార్తికేయుడు బాణాసురుని రక్షించి తానే స్వయముగ అనిరుద్ధుని ఎదిరించెను. కార్తికేయునకు అనిరుద్ధునకు ఘోరసంగ్రామ మారంభమయ్యెను. వీరిద్వరి సంగ్రామమును గాంచి గణేశ్వరుడు ఈ సమాచారమును మహాదేవు నకు విన్నవించుటకు బయలుదేరెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు బాణానిరుద్ధసంవాదమను నూట పదునాఱవ
అధ్యాయము సంపూర్ణము

---

# నూట పదునేడవ అధ్యాయము

## శివలంబోదర సంవాదము

**శ్రీ నారాయణ ఋషి పలికెను :-**

నారదా! గణేశ్వరుడు మహాదేవునకు నమస్కరించి సుభద్రునివధను, బాణానిరుద్ధులసంగ్రామమును, కార్తికేయనిరుద్ధులయుద్ధమును, అనిరుద్ధుని ప్రబలపరాక్రమాదులను క్రమముగ వర్ణించెను. గణేశ్వరునివచనముల నాలకించి శంకరుడు సస్మితవదనముతో కోమలవాణిద్వారా నిగూఢము లైన వేదసమ్మతవచనముల నిట్లుపల్కెను.

**శ్రీ మహాదేవుడు పలికెను :-**

మహాభాగా! విఘ్నేశ్వరా! హితకరములైన, తథ్యములైన, నీతిసారస్వరూపములైన, పరిణామమున సుఖదాయనములైన నా యుపదేశముల నాలకింపుము. అసంఖ్యాకవిశ్వసముదాయములు ప్రద్యుమ్ననిరుద్ధాదులు కార్యకారణములు అన్నియు శ్రీకృష్ణపరమాత్మయే యని గ్రహింపుము.

శ్లో॥ బ్రహ్మాదితృణపర్యన్తం జగత్సర్వం గణేశ్వర ।
విబోధ సత్యం కృష్ణం చ భగవన్తం సనాతనమ్ ॥ 6

గణేశ్వరా! బ్రహ్మ మొదలు తృణముల వఱకు గలసమస్తవిశ్వములు సనాతనుడైన శ్రీకృష్ణపరమాత్మస్వరూపములే యనెడి పరమసత్యమును తెలిసికొనుము.

గోలోకములో ద్విభుజధారియై, పరమశాంత విగ్రహుడై, రాధికా ప్రియతముడై, మనోహర రూపలావణ్య సమన్వితుడై, గోపవేషధారియై, గోప బాలకుడై విరాజిల్లు పరిపూర్ణతము డైన ప్రభువు శ్రీకృష్ణుడే యని గ్రహింపుము. గోపికలు గోపాలురు, కామధేనువులు, ఆయనను పరివేష్టించి యుందురు. ఆజగన్నాథుడు హస్తమున మురళిని ధరించి రమణీయ బృందా వనాంతర్గతదివ్యరాసమండలములో విహరించును. బ్రహ్మశివ శేషాదులు ఆయనకు సదా వందనము లర్పించుచుందురు. ఆప్రభువు శతశృంగపర్వత ముపై అక్షయవటవృక్ష ఛాయలో భాండీర వన సమీపమున విరజానది తట ముపైవిహరించుచుండును. ఆయనవర్ణము నూతన జలధర శ్యామలము. పీతాంబర ముచే ఆశరీరము విద్యుల్లతతో గూడిన మేఘమువలె భాసించుచుండును. రమణీయ గోకులములో, పుణ్యబృందావనములో జన్మించిన జీవులందరు ఆపరమపురుషుని కళాంశలే, కాని కుమారా! వారినడుమ చరించు శ్రీకృష్ణుడు స్వయముగ భగవంతు డని తెలిసికొనుము. కామదేవుడు బ్రహ్మశాపగ్రస్థుడై తన్నుతాను మరచినాడు. ఆయనకుమారుడు ఈఅనిరుద్ధుడు. ఈమహాసంగ్రామ ములో బాణాసురుడు అనిరుద్ధునిచే సంహరింపబడిడె వాడే, కాని కార్తికేయుడు వానిని రక్షించెను. గణేశ్వరా! యుద్ధములో స్కంధుడు అనిరుద్ధునితో సమానుడు, కాని అష్టభైరవులు, ఏకాదశరుద్రులు, అష్టవసువులు, ఇంద్రాది దేవతలు, ద్వాదశాదిత్యులు, సకలదైత్యనరేశ్వరులు, బాణాసురుడు మొదలగు వారందరు ఏకమైనను సంగ్రామములో అనిరుద్ధుని నిర్జింపలేరు.

గజననా! అనిరుద్ధుడు స్వయముగ బ్రహ్మ, కామదేవుడు ప్రద్యుమ్నుడు బలరాముడు ఆదిశేషుడు, శ్రీకృష్ణుడు ప్రకృతికంటె పరుడు. కుమారా! ఈవిధముగ నిగూఢ రహస్యములను నీకుపదేశించితిని. నీవు స్వయముగ సకలశుభ స్వరూపుడవు, విఘ్నవినాశకుడవు, కావున తక్షణమే రణరంగమునకు జని బాణాసురునిరక్షింపుము. అస్త్రశ్రేష్ఠమైన, కోట్లకొలదిసూర్యులతోసమానమైన ప్రభాసమన్వితమైన సుదర్శన చక్రధారియై శీఘ్రమే శ్రీహరి అఱుదెంచగలడు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు శివలంబోదర సంవాదమను నూటపదునేడవ
అధ్యాయము సంపూర్ణము.

# నూటపదునెనిమిదవ అధ్యాయము

## ఉషానిరుద్ధులను శ్రీకృష్ణున కర్పింపుమని బాణునకు పార్వతీదేవి ఉపదేశించుట

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! ఇట్లు గణేశ్వరునకు నిగూఢతత్త్వములను తెలిపి శివుడు అంతఃపురములోనికి జనెను. అంతఃపురములో దుర్గతినాశనిదుర్గ, భైరవి, భద్రకాళి, ఉగ్రచండ, కోటరి మొదలగువారందరు రత్నసింహాసనములపై విరాజమానులైయున్నారు. వారందఱు శివాగమనమును గాంచి లేచినిలువబడి జగదీశ్వరునకు నమస్కరించిరి. ఆసమయముననే గణేశ్వరుడు, మహాపరాక్రమసంపన్నుడైన కార్తికేయుడు, బాణాసురుడు, నందీశ్వరుడు, వీరభద్రుడు, సునందకుడు, మహామంత్రి యగు మహాకాలుడు, అష్టభైరవులు, ఏకాదశరుద్రులు సిద్ధేంద్రులు, యోగీంద్రులు మొదలగువారందరు రణవిరామసమయములో రణరంగమునుండి శివాశ్రమమునకు ఏతెంచిరి. అందఱు శివసభలో ఆసీనులై యుండగా ద్వారపాలకు డైనమణిభద్రుడు సభలో ప్రవేసించి పరమేశ్వరునకు నమస్కరించి ఇట్లువిన్నవించెను. "మహేశ్వరా! బలరాముడు, ప్రద్యుమ్నుడు, సాంబుడు, సాత్యకి, ఉగ్రసేనుడు, భీముడు, అర్జునుడు, అక్రూరుడు, ఉద్ధవుడు, శక్రనందను డైన జయంతుడు మొదలగువారందఱు అనిరుద్ధునకు సాయముగ ద్వారకానగరమునుండి అఱుదెంచిరి. వీరేకాక విధాతలకే విధాతయు, కోటానుకోట్ల మన్మధులశోభను మించిప్రకాశించువాడు, వనమాలాధారి యగు శ్రీకృష్ణుడు సప్తగోపపార్షదులు సేవించుచుండగ కాంతి సమన్వితమైన సుదర్శనచక్రమును ధరించి, రత్నాభరణవిభూషితుడై కౌమోదకీగదను, అమోఘశూలమును, విశ్వసంహారకారిణీయగు పాంచజన్యమును రథములో నుంచుకొని అపారయాదవసైన్యపరివేష్టితుడై రణమున కఱుదెంచెను. ప్రభూ! రణవిరామసమయము గతించినది. బలరాముడు తన హాలాయుధముచే లక్షలాదినగరరక్షకులను సంహరించి, ప్రాకారములను భేదించి, ద్వారపాలకులను వధించి ప్రధానద్వారమును సమీపించినారు." మణిభద్రుడు విన్నవించినసమాచారము, నాలకింపగనే మహాదేవుడు ఆసభాసదులను, పార్వ

తిని, భద్రకాళిని, స్కంధుని, గణేశ్వరుని, అష్టభైరవులను, ఏకాదశరుద్రులను, వీరభద్రుని, మహాకాలుని, నందీశ్వరుని, సకలసేనాధిపతులనుద్దేశించి ఇట్లు పల్కెను.

శ్రీ మహాదేవ ఉవాచ:-

సేనాధ్యక్షులారా ! గోలోకనాథు డైనచక్రపాణి అరుదెంచినాడు. ఆప్రభువు ఒకక్షణకాలములోనే సకల విశ్వములను లయ మొనరింపగలడు; అయినచో ఈనగరమెంత? కావున మీరందరు అనేకోపాయముల ద్వారా యత్న పూర్వకముగ బాణాసురుని ప్రాణములను రక్షింపుడు. ఇక బాణుడు విఘ్ననాశకుని స్మరించి సంగ్రామమునను సంసిద్ధుడు కావలెను. బాణుని దక్షిణ భాగమును కార్తికేయుడు రక్షింపవలెను. దైత్యేంద్రుని యగ్రభాగమున గణేశ్వరు డుండగలడు. వామభాగములో అష్టభైరవులు, ఏకాదశరుద్రులు, మహారథియగు నందీశ్వరుడు, మహాకాలుడు, వీరభద్రుడు మొదలగు ప్రమథ గణములు రక్షింపవలెను. ఊర్ధ్వభాగములో దుర్గ, భద్రకాళి, ఉగ్రచండ, కోటరి మొదలగు శక్తులు కాపుండవలెను. దుర్గతినాశని దుర్గా! బాణాసురుని నీవే రక్షింపగలవు. మహాభాగే! నీవు శ్రీకృష్ణపరమాత్మ శక్తివి గావున బుధజనులు నిన్ను నారాయణి యని కీర్తించిరి. విష్ణుమాయా నీవు జగజ్జననివి సర్వమంగళస్వరూపిణివి; కావున సకల శస్త్రాస్త్రముల సారస్వరూపమైన అమోఘ సుదర్శన చక్రమునుండి బాణాసురుని రక్షింపుము; ఎందువలననగ బాణుడు కనన్యనాథభక్తుడు గణేశ్వరునికంటె, కార్తికేయునికంటె నాకు అధికప్రియుడు; కావున దేవీ! వానికి నీచరణకమలరజమును ప్రసాదించి నీయభయహస్తమును వానిశిరముపై నుంచుము''.

భవుని వచనముల నాలకించి మందస్మిత ముఖారవిందయై దుర్గతినాశని యగు దుర్గ మధురవచనములతో బాణాసురు నిట్లాదేశించెను- ''వత్సా! బాణాసురా! నాహితోపదేశములను శిరసావహించిన నీకు విజయము తథ్యము. కుమారా! నీవద్దగల అసంఖ్యాకరమణులను, రత్నములను, ముత్యములను, వజ్రములను, సువర్ణములాదిగాగల సకలసంపదలను ఉపహారములుగ నొనర్చి సకల రత్నాలంకార విభూషిత యైన నీ కన్య ఉషను, అనిరుద్ధుని ఈక్షణమే శ్రీకృష్ణున కర్పించి నీరాజ్యమును నిష్కంటక మొనరించుకొనుము. ఏయాత్మ వెడలిపోయిన ఇంద్రియ సహితముగ సకలప్రాణములు విలీనములగునో, ఆపర మాత్మతో జీవునకు యుద్ధమా! దేహధారులందు నేనే శక్తిని, బ్రహ్మయే

మనస్సు. స్వయముగ పరమశివుడే జ్ఞానస్వరూపము, దేహమును శివము (చైతన్యము, ఆత్మ) వీడిన ఆ దేహము శవమగును. పరమేశ్వరా! సంగ్రామములో అప్రతిహత మైన సుదర్శనచక్ర తేజము నెవరు నిరోధింపగలరు?

శ్లో॥ పరమాత్మ చ సర్వేషాం భక్తానుగ్రహవిగ్రహః ।
నిత్యః సత్యో హి కృష్ణశ్చ పరిపూర్ణతమః ప్రభుః ॥ 33

శ్రీకృష్ణుడేసర్వాలయందు విరాజమానుడైయున్న పరమాత్మ, ఆయనయే భక్తానుగ్రహ విగ్రహుడు, నిత్యుడు, సత్యస్వరూపుడు, పరిపూర్ణుడు, ప్రభువులకే ప్రభువు.

గణేశ్వరునికంటె, కార్తికేయునికంటె మీరు నా కత్యంత ప్రియులు, కింకరులందు నాకు బాణాసురుడు ప్రేమ పాత్రుడు, కాని శ్రీకృష్ణునికంటె అధికప్రియతములు నాకు మఱియొకరు లేరు.

నేనే వైకుంఠములో మహాలక్ష్మిని, గోలోకములో స్వయముగ రాధను, శివలోకములో పార్వతిని, బ్రహ్మలోకములో సరస్వతిని, పూర్వకాలములో నేను ఆదిశక్తినై దైత్యులను సంహరించి దక్షకన్యనై ఆవిర్భవించితిని. తదనంతరము మీ నింద నాలకింప లేక సతీదేహమును వీడి పర్వతరాజనందిని యగు పార్వతి నైతిని. రక్తబీజునితో సంగ్రామసమయమున నేనే నామూర్తిభేదములో కాళికనై వానిని సంహరించితిని. నేనే వేదమాత యగు సావిత్రిని, జనకనందిని సీతను, భారతభూమిపై ద్వారకానగరములో విరాజిల్లు భీష్మకపుత్రి యగు రుక్మిణిని. గోలోకవాసినినైననేనే సుదాముని శాపమును పరిపూర్ణ మొనరించుటకు వృషభానుకన్యగ ప్రాదుర్భవించి పుణ్యమయ బృందావనములో శ్రీకృష్ణుని ధర్మపత్నినైతిని. మహేశ్వరా! నీవు స్వయముగ సర్వజ్ఞుడవు, సనాతనుడవు, శివుడవు. నేను మీకేమి సమయోచిత కర్తవ్యోపదేశ మొనరింగలను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మ ఖండమందు బాణునకు పార్వతిఉపదేశ మను
నూట పదునెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము.

# నూటపందొమ్మిదవ అధ్యాయము

## -: బలియొనరించిన శ్రీకృష్ణస్తోత్రము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! పార్వతివచనముల నాలకించి గణేశ్వరుడు, కార్తికేయుడు, కాళిక, స్వయముగ శివుడు శ్రీకృష్ణుని ప్రశంసింపదొడంగిరి. తదనంతరము పరాత్పరస్వరూపిణియైన, జ్యోతిస్వరూపిణియైన, పరమాద్యయైన మూలప్రకృతి ఈశ్వరి జగజ్జనని యగు పార్వతిని సంబోధించి శంకరుడు ఇట్లు పల్కెను.

శ్రీ మహాదేవుడు పలికెను :-

దేవేశ్వరీ! నీవు చెప్పినట్లు పరమాత్మతో యుద్ధమొనరించుట అయుక్తము, అత్యంతహాస్యాస్పదము; కావున బాణాసురుడు తన కుమార్తెయైన ఉషను సర్వాలంకారములచే అలంకరించి శ్రీకృష్ణున కర్పించుటయే ఉచితము. ఈ కర్మయే అత్యంత యశస్కరము, శుభప్రదము, సకలకర్మనిర్మూలనము. దేవీ! నీవు చెప్పినదంతయు వేదసమ్మతమే; కానీ బాణాసురుడు హిరణ్యకశిపునివంశజుడు. అతడు కన్య నర్పించి యుద్ధమునుండి పరాఙ్ముఖుడైన అది నీకే అకీర్తిదాయకము. కావున శివా! రణశాస్త్రవిశారదుడైన బాణాసురుడు భీరువుగాక రణమొనరింపవలెను. మేమందఱము బాణుని రక్షించుటకు వానిననుసరించెదము.

ఇట్లు దుర్గ నాదేశించి పరమేశ్వరుడు కన్య నర్పించుటకు కూడ యుచితమే యని బాణాసురునకు ప్రభోదింపగా అందులకు బాణుడు నిరాకరించెను. తదనంతరము మఱల దుర్గాదేవికూడ బాణున కనేకోపదేశముల నొనరించెను; కాని బాణుడు యుద్ధమొనరించుటకే సంకల్పించెను. ఆసమయములో మహాధర్మాత్ముడైన, వైష్ణవులందు అగ్రగణ్యుడైన, పరమార్థజ్ఞాతయైన మహాబలి చక్రవర్తి రత్ననిర్మిత రథారూఢుడై ఆమనోహర సభను ప్రవేశించెను. సప్త దైత్యులు ఆయనసేవలందు నిమగ్నులైయున్నారు. ఏడులక్షలమంది దైత్యేంద్రులు బలిని వెన్నంటియున్నారు. ఆయన రథమును దిగి శివునకు, పార్వతికి, గణేశ్వరునకు, కార్తికేయునకు నేక ప్రణామము లర్పించెను. అపుడు మహాదేవుడత్యంతప్రసన్నుడై మధురవచనములతో బలిచక్రవర్తి నిట్లు కుశలమును

ప్రశ్నించెను. "భక్తాగ్రణీ! నీవు సర్వసంపత్ప్రదాతవు, అత్యంతచతురుడవు. నీవంటి పరమవైష్ణవునితో సమాగమము అఖండశుభప్రదము; ఎందువలెననగ వైష్ణవులస్పర్శమాత్రముననే తీర్థములు సహితము పవిత్రములు కాగలవు. పవిత్రమైన బ్రాహ్మణాశ్రమము సర్వాశ్రమములవారికి పూజనీయము. పవిత్రుడైన బ్రాహ్మణుడు వైష్ణవుడైన అధికపూజనీయుడు కాగలడు. వైష్ణవబ్రాహ్మణునికంటె పవిత్రుడు మఱియొకడు లేడు. అతడు అగ్నికంటే, పవనునికంటే, సమస్తతీర్థములకంటె అధికపావనుడు. సకలదేవతలు ఆభక్తుని గాంచిన భయము నొందెదరు. అగ్నిలో పడిన శుష్కతృణములు భస్మములగునట్లే ఆపరమపావనుని శరీరమందు పాపములు నిలువజాలవు."

ఈశ్వరుడొనరించిన వైష్ణవప్రశంస నాలకించి బలిచక్రవర్తి ఇట్లు పల్కెను. "జగన్నాథా! మీరు నన్నేల ప్రశంసించుచున్నారు? మహేశ్వరా! నేను మీభృత్యుడనుగానా? నాథా! మీరే నాకు అత్యంతదుర్లభమైన పరమైశ్వర్యమును ప్రసాదించితిరి. సురేశ్వరా! మీరు సర్వస్వరూపులు, సర్వత్ర నుండువారు. శివా! నీవే విష్ణువు, ఇందు లేశమైనను సంశయము లేదు. ఆసమయమున నీవే వామనరూపధారివై నీభక్తుడనైన నాయైశ్వర్యమును హరించి ఇంద్రునకొసంగి నాకు అనన్యభక్తిని ప్రసాదించి నన్ను సృష్టికి అధోభాగమందు గల సుతలలోకమునకు బంపితివి. దేవా! నా పుత్రుడైనబాణుని సదా రక్షింపుము; ఎందువలెననగ ఆత్మతో యుద్ధము దేవతలకైనను నిందనీయమే." ఇట్లు శివుని ప్రార్థించి బలచక్రవర్తి తనశిరమును మహాదేవునిచరణములపై నుంచి అనేకప్రణామముల నర్పించెను. ఆసమయమున బలిసర్వాంగములు పులకించెను. నేత్రములు ఆనందాశ్రుజలపూరితములైనవి. ఆవైష్ణవశిఖామణి శుక్రప్రదత్తమైన ఏకాదశాక్షరమంత్రమును జపించి సామవేదోక్తస్తోత్రము ద్వారా పరమేశ్వరు నిట్లు స్తుతింపదొడంగెను.

### -: బలికృత శ్రీకృష్ణస్తోత్రము :-

శ్లో॥ అదిత్యాః ప్రార్థనేనైవ మాతుర్దేవ్యా వ్రతేన చ ।
పురా వామనరూపేణ త్వయాఽహం వంచితః ప్రభో ॥ 23

సమ్పద్రూపా మహాలక్ష్మీర్దత్తా భక్తాయ భక్తితః ।
శక్రాయ మత్తో భక్తాయ భ్రాత్రే పుణ్యవతే ధ్రువమ్ ॥ 24

అధునా మమ పుత్రోఽయం బాణః శఙ్కరకిఙ్కరః ।
ఆరాచ్ఛ ఏక్షితః సోఽపి తేనైవ భక్తబన్ధునా ॥ 25

పరిష్వక్తశ్చ పార్వత్యా యథా మాత్రా సుతస్తథా ।
గృహీతవాంశ్చ తత్కన్యాం బలేన యువతీం సతీమ్ ॥ 26

సముద్యతశ్చ తం హన్తుం కార్తికేనాపి వారితః ।
ఆగతోఽసి పునర్హన్తుం పౌత్రస్య దమనే క్షమః ॥ 27

సర్వాత్మనశ్చ సర్వత్ర సమభావః శ్రుతౌ శ్రుతః ।
కరోషి జగతాం నాథ కథమేవం వ్యతిక్రమః ॥ 28

త్వయా చ నిహతో యో హి తస్య కోరక్షితా భువి ।
సుదర్శనస్య తేజో హి సూర్యకోటినిభం పరమ్ ॥ 29

తేషాం సురాణామస్త్రాణి తదేవ చ నివారితమ్ ।
యథా సుదర్శనం చైవ మస్త్రాణాం ప్రవరం వరమ్ ॥ 30

తథా భవాంశ్చ దేవానాం సర్వేషామీశ్వరః పరః ।
యథా భవాంస్తథా కృష్ణో విధాతా వేదసామపి ॥ 31

విష్ణుః సత్త్వగుణాధారః శివః సత్త్వాశ్రయస్తథా ।
స్వయం విధాతా రజసః సృష్టికర్తా పితామహః ॥ 32

కాలాగ్నిరుద్రో భగవాన్ విశ్వసంహారకారకః ।
తమసశ్చాఽఽశ్రయః సోఽపి రుద్రాణాం ప్రవరో మహాన్ ॥ 33

స ఏవ శఙ్కరాంశశ్చాప్యన్యే రుద్రాశ్చ తత్కలాః ।
భవాంశ్చ నిర్గుణస్తేషాం ప్రకృతేశ్చ పరస్తథా ॥ 34

ప్రవరా! సర్వశక్తీనాం బుద్ధిః ప్రకృతిరీశ్వరీ ।
స్వాత్మనః ప్రతిబింబస్తే జీవః సర్వేషు దేహిషు ॥ 35

జీవః సకర్మణాం భోగీ స్వయం సాక్షీ భవాంస్తథా ।
సర్వే యాన్తి త్వయి గతే నరదేవే యథాఽనుగాః ॥ 36

సద్యః పతతి దేహశ్చ శవోఽస్పృశ్యస్త్వయా వినా ।
బుద్ధాః సన్తో న జానన్తి వంచితాస్తవ మాయయా ॥ 37

త్వాం భజన్త్యేవ యే సన్తో మాయామేతాం తరన్తి తే ।
త్రిగుణా ప్రకృతిర్దుర్గా వైష్ణవీ చ సనాతనీ ॥ 38

పరా నారాయణీశానీ తవ మాయా దురత్యయా ।
త్వదంశాః ప్రతివిశ్వేషు బ్రహ్మవిష్ణుశివాత్మకాః ॥ 39

శ్లో॥ సర్వేషామపి విశ్వేషామాశ్రయో యో మహాన్ విరాట్ ।
స శేతే చ జలే యోగాద్ విశ్వేశో గోకులే యథా ॥ 40

స యేవ వాసుర్భగవాన్ తస్య దేవో భవాన్ పరః ।
వాసుదేవ ఇతి ఖ్యాతః పురావిద్భిః ప్రకీర్తితః ॥ 41

త్వమేవ కలయా సూర్య స్త్వమేవ కలయా శశీ ।
కలయా చ హుతాశశ్చ కలయా పవనః స్వయమ్ ॥ 42

కలయా వరుణశ్చైవ కుబేరశ్చ యమ స్తథా ।
కలయా త్వం మహేన్ద్రశ్చ కలయా ధర్మ ఏవ చ ॥ 43

త్వమేవ కలయా శేష ఈశానో నైరృతి స్తథా ।
మునయో మనవశ్చైవ గ్రహాశ్చ ఫలదాయకాః ॥ 44

కలాకలాయాశ్చాంశేన సర్వే జీవాశ్చరాచరాః ।
త్వం బ్రహ్మ పరమం జ్యోతిర్ధ్యాయన్తే యోగినః స్తథా ॥ 45

తంత్వాఽఽద్రియన్తే భక్తాస్తే ధ్యాయన్తే చ తదన్తరే ।
నవీననీరదశ్యామం పీతకౌశేయవాససమ్ ॥ 46

ఈషద్ధాస్యప్రసన్నాస్యం భక్తేశం భక్తవత్సలమ్ ।
చన్దనోక్షితసర్వాఙ్గం ద్విభుజం మురలీధరమ్ ॥ 47

మయూరపిచ్ఛచూడం మాలతీమాల్యభూషితమ్ ।
అమూల్యరత్న నిర్మాణకేయూర వలయాన్వితమ్ ॥ 48

మణికుణ్డలయుగ్మేన గణ్డస్థలవిరాజితమ్ ।
రత్నసారాఙ్గులీయం చ క్వణన్మఞ్జీర రంజితమ్ ॥ 49

కోటికన్దర్పలీలాభం శరత్కమలలోచనమ్ ।
శరత్పార్వణేన్దు నిన్దాస్యం చన్ద్రకోటి సమప్రభమ్ ॥ 50

వీక్షితం సస్మితాభిశ్చ గోపీనాం కోటికోటిభిః ।
వయస్యైః పార్షదైర్గోపైః సేవితం శ్వేతచామరైః ॥ 51

గోపబాలకవేషం చ రాధావక్షఃస్థల స్థితమ్ ।
ధ్యానాసాధ్య దురారాధ్యం బ్రహ్మేశశేషవన్దితమ్ ॥ 52

సిద్ధేన్ద్రైశ్చ మునీన్ద్రైశ్చ యోగీన్ద్రైః ప్రణతం స్తుతమ్ ।
వేదానిర్వచనీయం చ పరం స్వేచ్ఛామయం విభుమ్ ॥ 53

స్థూలస్థూలతమం రూపం సూక్ష్మాత్ సూక్ష్మతమం పరమ్ ।
సత్యం నిత్యం ప్రశస్తం చ ప్రకృతేః పరమీశ్వరమ్ ॥ 54

శ్లో॥ విర్లిప్తం చ నిరీహం చ భగవన్తం సనాతనమ్ ।
ఏవం ధ్యాత్వా చ తే పూతాః స్నిగ్ధదూర్వాక్షతాజలమ్ ॥ 55

పద్మా పద్మార్చితే పాదపద్మే చ దాతుముత్సుకాః ।
వేదాః స్తోతుమశక్తా స్త్వామశక్తా సా సరస్వతీ ॥ 56

శేషః స్తోతుమశక్తశ్చ స్వయమ్భూః శమ్భురీశ్వరమ్ ।
గణేశశ్చ దినేశశ్చ మహేన్ద్రశ్చన్ద్ర ఏవ చ ॥ 57

స్తోతుం నాలం ధినేశశ్చ కిమన్యే జడబుద్ధయః ।
గుణాతీత మనీహం చ కిం స్తౌమి నిర్గుణం పరమ్ ॥ 58

అపణ్డితోఽహమసురో న సురః క్షన్తుమర్హసి । 59½

## బలియొనరించిన శ్రీకృష్ణస్తోత్రము

ప్రభూ! పూర్వకాలములో అదితీదేవిప్రార్థనలను మన్నించి ఆమె అఖండవ్రతఫలస్వరూపముగ నీవు వామనరూపధారివై నన్ను వంచించినావు. సంపత్స్వరూపిణియగు మహాలక్ష్మిని నానుండి గ్రహించి అత్యంతపుణ్యాత్ముడు, నీభక్తుడు, నా సోదరుడైన ఇంద్రునకు ప్రసాదించితివి. ఈ వర్తమానకాలములో నాకుమారుడు, శంకరకింకరుడైన బాణుని భక్తజనబాంధవుడవైన నీవే శంకరునిరూపమున ఆశ్రయము నొసంగి రక్షించుచున్నావు. జనని కన్నపుత్రుని పాలించునట్లే పార్వతీదేవి బాణుని పాలించి పోషించుచున్నది. నవయౌవ్వన సంపన్నయైన బాణునికన్యను అనిరుద్ధుడు బలపూర్వకముగ గ్రహించి తుదకు బాణునే సంహరించుట కుద్యుక్తుడుకాగా కార్తికేయుడు వానిని రక్షించెను. మఱల నీవే శ్రీకృష్ణరూపమున నీపౌత్రుని నిర్జించుటలో సమర్థుడైన బాణుని సంహరించుటకు దయచేసితివి. జగదీశ్వరా! సర్వాత్మకుడవైననీవు సర్వత్ర సమభావముతో వర్తింతు వని శృతులు నొక్కి-వక్కాణించినవి; మఱి నీ వేల ఇట్లు వ్యతిక్రమమొనరించు చున్నావు? నీవు ఎవవిని సంహరించుటకు సంకల్పించెదవో వానిని భూమిపై ఎవరు రక్షింపగలరు? దుర్నివార్యమైన సుదర్శనతేజము కోటానుకోట్ల సూర్యసమతేజసమన్వితము, పరమోత్కృష్టము. ఏ దేవతల దివ్యాస్త్రములచే ఆమహాస్త్రము నివారణము కాగలదు? సుదర్శనము సకలాస్త్రములందు సర్వశ్రేష్టమైనట్లే శ్రీకృష్ణపరమాత్మా! నీవు సమస్త దేవతలకు పరమేశ్వరుడవు. విధాతలకే విధాత విష్ణువు సత్త్వగుణమునకు ఆధారము, శివుడు సత్త్వగుణాశ్రయస్థానము, స్వయముగ సృష్టికర్తయైన పితామహుడు రజోగుణమునకు విధాత, తమోగుణమునకు ఆశ్రయులు ఏకాదశ రుద్రులు. విశ్వసంహారకర్తా! ఏకాదశరుద్రులందు సర్వశ్రేష్టుడైన కాలాగ్ని

రుద్రుడు, శంకరుని అంశజుడు. ఆయనదక్క అన్యరుద్రగణములు శంకరుని కళోద్భవులు. సకలదేవతలందు నీవు గుణరహితుడవు, ప్రకృతికి అతీతుడవు, సర్వులకు పరమాత్మవు. సకలప్రాణధారులప్రాణమే విష్ణుస్వరూపము; స్వయం బ్రహ్మయే మనోరూపము, శివుడే జ్ఞానము. సమస్తశక్తులయందు ప్రవరమైన ఈశ్వరీప్రకృతియే బుద్ధి, సమస్తదేహధారులందు విరాజిల్లు జీవములన్నియు పరమాత్మ వైన నీకు ప్రతినిధులు, అవి దేహము నందున్న ఆత్మకు ప్రతిబింబములు. జీవుడు తనకర్మలకు భోక్త. స్వయముగ ఆత్మరూపమున దేహములో విరాజిల్లు నీవు జీవు డొనరించు కర్మ లన్నింటికి సాక్షివి. దేహమునుండి ఆత్మ వైననీవు వెడలిపోయిన రాజు ననుసరించు సేవకులవలె దేహస్థిత సకలదేవతలు శక్తులు వెడలిపోయెదను. నీవు వీడగనే దేహము ధరణి కొరగి శవమై అస్పృశ్య మగును. కాని నీమాయచే వంచితు లైనకారణమున బుద్ధిమంతులైనను మహాత్ములైనను ఈరహస్యమును తెలియలేకున్నారు. నీ దివ్యగుణనామసంకీర్తన మొనరించుమహాత్ములు ఈమాయను తరింపగలరు. త్రిగుణములు, ప్రకృతి, దుర్గ, వైష్ణవి, సనాతని, పరా, నారాయణి, ఈశాని, మొదలగువీరందరు నీయాత్మమాయస్వరూపములే. వీరిని భేదించి నిన్ను జేరుట అత్యంతకఠినము. ప్రత్యేకవిశ్వమందు విరాజిల్లు బ్రహ్మవిష్ణుశివాదులు నీయంశలు. విశ్వేశ్వరుడైన శ్రీకృష్ణుడు గోలోకపరంధామములో విరాజిల్లునట్లే సమస్తలోకాశ్రయుడైన విరాట్టు యోగబలముచే జలములలో శయనించును. అయనయే భగవాన్ వాసు; వాసునకు నీవే దైవము, కావున నీవు వాసుదేవ యనునామమున విఖ్యాతినొందినావు. నీవు నీకళచే సూర్యుడవు, చంద్రుడవు, అగ్నివి, పవనుడవు, వరుణుడవు, కుబేరుడవు, యముడవు, మహేంద్రుడవు, ధర్మదేవతవు, శేషుడవు, ఈశానుడవు, నైఋతివి. మునులు, మనువులు, ఫలదాయకగ్రహములు, సమస్త చరాచరజీవులు మొదలగు వారందరు నీకళాకళాంశలచే ఉత్పన్నులైనవారే. నీవే పరంజ్యోతిస్వరూపమైన పరబ్రహ్మవు. యోగులు అపరబ్రహ్మమైన నిన్నే సదా ధ్యానింతురు. నీయనన్యభక్తులు తమయంతఃకరణములో నీసచ్చిదానంద విగ్రహమును దర్శించి ఇట్లు ధ్యానింతురు.

నీలనీరదశ్యాముడు, పీతాంబరధారుడు, మందహాసముచే ప్రసన్నమైన ముఖము గలవాడు, భక్తులకు ప్రభువు, భక్తులయందు వాత్సల్యము గలవాడు, చందనలిప్తము లైన అవయవములు గలవాడు, రెండుబాహువులుగలవాడు

వేణువును ధరించినవాడు, మయూరపిచ్ఛము శిరోభూషణముగ గలవాడు మాలతీమాలలచే విభూషితుడు, అమూల్య రత్నములచే నిర్మితములైన కేయూరములతోను వలయములతోను గూడినవాడు, మణికుండలములచే విరాజిల్లు గండస్థలములుగలవాడు, రత్నాంగుళీయకములను ధరించినవాడు, ధ్వనించు మంజీరములచే రంజితమైనవాడు, కోట్లకొలదిమంది మన్మథులసౌంద ర్యము గలవాడు, శరత్కాలపద్మములవలె విశాలములైన నేత్రములు గలవాడు, శరత్పూర్ణిమాచంద్రుని తిరస్కరించు ముఖము గలవాడు, కోట్ల కొలదిచంద్రులతో సమానమైన కాంతి గలవాడు, అసంఖ్యాక గోపికలచే చూడబడుచున్నవాడు, వయస్యులైన గోపపార్షదులచే వింజామరలద్వారా సేవింపబడుచున్నవాడు, గోపబాలకవేషమును ధరించినవాడు, రాధాదేవివక్షః స్థలమున యున్నవాడు, ధ్యానమునకు అసాధ్యుడు, దురారాధ్యుడు. బ్రహ్మ శివశేషాదులచే వందితుడు, సిద్ధేంద్రులచేత మునీంద్రులచేత యోగీంద్రుల చేత నమస్కరింపబడువాడు, స్తుతింపబడువాడు, వేదములకు అనిర్వచనీయుడు, పరుడు, స్వేచ్ఛామయుడు, విభుడు, స్థూలములకంటె స్థూలతముడు, సూక్ష్మము కంటె మిగుల సూక్ష్మమైనవాడు, సత్యమైనవాడు, నిత్యమైనవాడు, ప్రశస్తుడు, ప్రకృతికంటె పరుడు, ఈశ్వరుడు, నిర్లిప్తుడు, నిరీహుడు, సనాతనుడు, నగు ఆభగవానుని ధ్యానించి వారుపవిత్రులగుచుందురు. పద్మములచే సమార్చితము లైన చరణకమలములయందు కోమలదూర్వాంకురములను అక్షతలను జలము లను నివేదించుటకు ఉత్సుకులగుచుందురు.

దేవా! వేదములు, సరస్వతి, ఆదిశేషుడు, బ్రహ్మ, శివుడు, గణేశ్వరుడు సూర్యుడు, చంద్రుడు, మహేంద్రుడు, కుబేరుడు మొదలగువారైనను పరమేశ్వరుడవైన నిన్ను స్తుతించుటలో సమర్థులుకారు. అయినచో అన్యజడ బుద్ధి యుక్తులైన జీవు లేపాటివారు? గుణాతీతుడవైన, నిరీహుడవైన, నిర్గుణుడ వైన నిన్ను అపండితుడనైన, అసురుడనైన నే నేమని స్తుతింపగలను? ఈ నీ భక్తుడు క్షమకు అర్హుడు.

బలి యొనరించిన స్తోత్రము నాలకించి శంకరునిరూపమున విరాజిల్లు పరిపూర్ణతముడు, జగదీశ్వరుడు, భక్తవత్సలుడు నగు శ్రీహరి తన యనన్య భక్తున కిట్లు అభయప్రదానము చేసెను.

శ్రీ భగవానుడు పలికెను:-

వత్సా! భయము నొందకుము నాచే సురక్షితమై యున్న సుతలలోకములో విరాజిల్లు నీ నగరమునకు ప్రసన్నుడవై మఱలిపొమ్ము. నావరప్రసాదము వలన నీకుమారుడు అజరామరుడు కాగలడు, ఈమూర్ఖుని యభిమానదర్పములను వినాశనమొనరించి వీనిని రక్షించెదను, ఎందువలెననగ నా అనన్యభక్తుడైన ప్రహ్లాదుని యెడల అత్యంత ప్రసన్నుడనై నీవంశము నాద్వారా అవధ్యమని వర మొసంగియున్నాను. నేను నీకుమారునకు మృత్యుంజయ మహాజ్ఞానమును ప్రసాదించెను.

శ్లో॥ త్వయా కృతమిదం స్తోత్రం సామవేదోక్తమీప్సితమ్ ।
పురా సనత్కుమారాయ ప్రదత్తం బ్రహ్మణా తథా ॥ 64

సిద్ధాశ్రమే పుణ్యతమే ప్రశస్తే సూర్యపర్వణి ।
గౌతమాయ ప్రదత్తం చ గౌర్యా మన్దాకినీతటే ॥ 65

శఙ్కరేణ చ శిష్యాయ భక్తాయ చ దయాలునా ।
బ్రహ్మణే చ మయా దత్తం శివాయ విరజాతటే ॥ 66

భృగవే చ పురా దత్తం కుమారేణ చ ధీమతా ।
త్వం చ దాస్యసి బాణాయ బాణః స్తోష్యత్యనేన మామ్ ॥ 67

ఇదం స్తోత్రం మహాపుణ్యముపదిష్య గురోర్ముఖాత్ ।
పృలస్య పూజితస్యాపి వస్త్రభూషణచన్దనైః ॥ 68

సుస్నాతో యః పఠేన్నిత్యం పూజాకాలే చ భక్తితః ।
కోటిజన్మార్జితాత్పాపాన్ముచ్యతే నాత్ర సంశయః ॥ 69

విపదాం ఖణ్డనం స్తోత్రం కారణం సర్వసమ్పదామ్ ।
వారణం దుఃఖశోకానాం భవాబ్ధిఘోరతారణమ్ ॥ 70

ఖణ్డనం గర్భవాసానాం జరామృత్యుహరం పరమ్ ।
బన్ధనానాం చ రోగాణాం ఖణ్డనం భక్తమణ్డనమ్ ॥ 71

స స్నాతః సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దీక్షితః ।
వ్రతీ వ్రతేషు సర్వేషు తపస్వీ చ తపఃసు చ ॥ 72

స సత్యం సర్వదానానాం ఫలం లభతే ధ్రువమ్ ।
లక్షధా స్తోత్రపాఠేన స్తోత్రసిద్ధిర్భవేన్నృణామ్ ॥ 73

సర్వసిద్ధిం చ లభతే సిద్ధస్తోత్రో భవేద్యపి ।
ఇహలోకే దేవతుల్యోఽప్యన్తే యాతి హరేః పదమ్ ॥ 74

నీవు ఏసామవేదోక్త అభీష్టస్తోత్రముద్వారా నన్ను స్తుతించితివో, ఆ స్తోత్రమును పూర్వకాలములో ప్రశస్తమైన పుణ్యప్రదమైన సిద్ధాశ్రమములో బ్రహ్మ సనత్కుమారున కుపదేశించెను. గౌరి మందాకినీతటముపై ఈస్తోత్రమును గౌతమున కుపదేశించెను. దయామయుడైన శంకరుడు తన భక్తుడు, శిష్యుడైన బ్రహ్మకు ఈస్తవమునే ప్రసాదించెను. పూర్వకాలములో మహాజ్ఞాని యగు సనత్కుమారుడు ఈధ్యానమును భృగుమహర్షికి ప్రసాదించెను. భక్తాగ్రేసరా! బలీ! యీధ్యానమును నీవు బాణున కుపదేశించిన అతడు ఈస్తవధ్యానములచే నన్ను స్తుతింపగలడు. ఈస్తోత్రము మహా పుణ్యప్రదము. స్నానమాచరించి శుద్ధుడై, వస్త్రభూషణ చందనాదులతో గురువును పూజించి ఆయననుండి ఈస్తోత్రమును గ్రహించి నిత్యము పూజాసమయములో అనన్య భక్తితో పఠించిన మానవుడు తానొనరించిన కోటానుకోట్ల జన్మల పాపముల నుండి విముక్తుడు కాగలడు. ఇందు లేశ మాత్రమయినను సంశయము లేదు. ఈస్తోత్రము విపత్తులకు వినాశకరము, సమస్తసంపత్తులకు కారణము, దుఃఖశోక నివారణము. ఈస్తోత్రరాజము దేహధారులను భయంకర భవసాగరమునుండి ఉద్ధరింపగలదు, గర్భవాసమును ఖండింపగలదు, జరామృత్యువులను నివారింపగలదు, బంధనములను ఖండింపగలదు, రోగములను నశింపజేయగలదు. భక్తులకు కల్పతరువైన ఈ స్తోత్రమును పఠించువారు సమస్తతీర్థస్నానఫలములను, సర్వయజ్ఞదీక్షాగ్రహణఫలములను, సమస్తవ్రతానుష్ఠానఫలములను, సంపూర్ణ తపఃఫలములను అవలీలగ పొందగలరు. వారికి నిశ్చయముగ సర్వదానముల ఫలములు, సత్యవ్రతాచరణఫలములు సంప్రాప్తింపగలవు. ఈ స్తోత్రమును ఒక లక్షపర్యాయములు పఠించినమనుష్యులకు స్తోత్రసిద్ధి కలుగును. ఏమనుష్యునకు స్తోత్రము సిద్ధించునో వానికి సకలసిద్ధులు సులభములు కాగలవు. అతడు ఇహలోకములో దేవతుల్యుడై అంత్యకాలమున శ్రీహరిపరమపదము చేరగలడు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ జన్మఖండమందు బలియొనరించిన శ్రీకృష్ణస్తోత్రమను నూటపందొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

---

# నూటయిరువదియవ అధ్యాయము

## శ్రీకృష్ణబాణ సంగ్రామము : ఉషానిరుద్ధుల వివాహము

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

నారదా! తదనంతరము శ్రీకృష్ణపరమాత్మ ఉద్ధవునితో, బలదేవునితో సమాలోచనముచేసి బాణాసురుని యంతఃపురమునకు దూతను బంపెను. ఆదివ్య హర్మ్యములో శివుడు, గణేశ్వరుడు, దుర్గతినాశని యగు దుర్గ, కార్తికేయుడు, భద్రకాళి, ఉగ్రచండిక, కోటరి మొదలగు వారందరు విరాజిల్లియుండిరి. ఆభవనమును ప్రవేశించి శ్రీకృష్ణుడు పంపినదూత శివాదుల కనేక ప్రణామము లర్పించి ఇట్లు పల్కెను. "మహేశ్వరా! శ్రీకృష్ణపరమాత్మ బాణాసురుని యుద్ధమున కాహ్వానించు చున్నాడు; కావున సగౌరవముగ ఉషా అనిరుద్ధులను పరమాత్మ కర్పించి బాణాసురుడు శరణువేడవలెను, లేనిచో యుద్ధమునకు సిద్ధముకావలెను. రణమునకై ఆహ్వానించిని ఏపురుషు భీతుడై సమ్ముఖమున యుద్ధమొనరింపడో ఆతడు తనయేడు తరములవారితో గూడ నరకము నొంద గలడు.

దూత పల్కిన వచనముల నాకించి సభామధ్యములో శంనిరుని సమక్షమున స్వయముగ పార్వతీదేవి బాణున కిట్లు ఉపదేశ మొనరించెను.

పార్వతీ దేవి పలికెను:-

మహాభాగా, బాణాసురా! నీవు ఉషానిద్ధులను తోడ్కొని శ్రీకృష్ణుని జేరి ఆపరమాత్మను ప్రార్థింపుము. తదనంతరము నీసర్వస్వమును కానుకగ నొసంగి శ్రీకృష్ణుని శరణజొచ్చుము. ఆయన సర్వేశ్వరుడు, సర్వులకు ఆశ్రయ స్థానుడు, అత్యంత కృపామయుడు, భక్తవత్సలుడు.

పార్వతి యొనరించిన హితోపదేశము నాలకించి సభలో ఉపస్థితులైయున్న సర్వులు ధన్యము, ధన్యము నని అనేకవిధముల ప్రశంసించి అదియే తక్షణకర్తవ్య మని బాణున కుపదేశించిరి. కాని బాణాసురుడు క్రోధముతో రక్తపంకజలోచను డయ్యెను, వానిశరీరము కంపింపదొడంగెను. ఆయసురేశ్వరుడు తక్షణమే సభనుండిన లేచినవాడై ఎందరు హితవచవములను పల్కినను వినక కవచాస్త్ర శస్త్రములను ధరించి మహాదేవునకు ప్రణమిల్లి రథారూఢుడై కోటానుకోట్ల మహాబలపరాక్రమ సంపన్నులైన దైత్యులు వెంటరాగా రణరంగము

నకు బయలు దేరెను. అప్పుడు కుంభాండకుడు, కూపకర్ణుడు, నికుంభుడు, కుంభుడు మొదలుగాగల అసంఖ్యాక సేనాపతులు కూడ కవచశస్త్రాస్త్రధారులై తమ ప్రభువును అనుసరించిరి. వారితో ఉన్మత్త భైరవుడు, సంహారభైరవుడు, అసితాంగభైరవుడు, ఋుఋభైరవుడు, మహాభైరవుడు, కాలభైరవుడు, ప్రచండ భైరవుడు, క్రోధభైరవుడు, కాలాగ్నిరుద్రుడు, రుద్రగణములు, శక్తులు, ఉగ్ర చండ, కపాలిక మొదలగువారందరు అనేక ఆయుధములను ధరించి బయలు దేరిరి. శోణిపురి గ్రామదేవత యైన కోటరికూడ రత్ననిర్మిత రధారూఢయై రణమునకు బయలు దేరును. ఆశక్తి ప్రఫుల్లితముఖముతో హస్తములందు ఖడ్గ శూలములను ధరించి రధములో విరాజిల్లెను. చంద్రాణి, శాంత స్వరూపిణి యగు వైష్ణవి, బ్రహ్మవాదిని యగు బ్రాహ్మణీ, కౌమారీ, నారసింహి, వికటా కారయుక్త యగు వారాహి, మహామాహేశ్వరీ, భీమస్వరూపిణి యగు భైరవి, ఈ అష్టశక్తులందరు హర్ష సమన్వితలై రధారూఢలై రణమునకు బయలు దేరిరి. రక్తవర్ణప్రకాశనీ, త్రినేత్రధారిణీ యైన భద్రకాళి లోలకజిహ్వతో మహా భయంకరముగ దర్శన మొసంగుచు హస్తములలో, శూలశక్తిగదా ఖడ్గాదిఅస్త్ర శస్త్రములను ధరించి బహుమూల్యరత్న నిర్మిత రధారూఢయై బయలు దేరెను. తదుపరి మహేశ్వరుడు త్రిశూలధారియై నందీశ్వరు నధిరోహించెను. హస్తము లలో అనేక ఆయుధములను ధరించి దనుర్ధారియై కార్తికేయుడు మయూర వాహనము నధిరోహించి బయలు దేరెను. గణేశ్వరుడు పార్వతీదేవి దక్క అన్యులందరు బాణరక్షణార్థమై రణరంగమున కేగిరి.

ప్రమధగణ పరివేష్టితుడై ప్రచండభానుకోటిసమప్రభతో ప్రకాశించు మహాదేవుని గాంచి చక్రపాణి యగు శ్రీకృష్ణుడు అత్యంతప్రసన్నుడై యధోచిత రూపమున సంభాషణ మొనరించెను. తదనంతరము బాణాసురుడు శంఖధ్వని గావించి పార్వతీశ్వరు డైన శివునకు ప్రణమిల్లి ధనువునకు నారిని బిగించి దివ్యాస్త్రసంధాన మొనరించెను. ఇట్లు యుద్ధమున కుద్యుక్తు డైన బాణుని గాంచి శత్రువీరసంహారధురందరు డైన సాత్యకి రణములో నున్నవారు వారించు చున్నను సరకుగొనక బాణాసురు నెదిరించెను. నారదా! అపుడు బాణా సురుడు సాత్యకిపై నిక్షేప మను దివ్యాస్త్రమును ప్రయోగించెను. ఆయస్త్రము అమోఘము, గ్రీష్మఋతు మధ్యాహ్నసూర్యసమాన ప్రకాశయుక్తము, అత్యంతతీక్షణము. ఆదివ్యాస్త్రమును మార్గమధ్యములోనే ఖండించి సాత్యకి

బాణునిపై మఱియొక దివ్యాస్త్రమును ప్రయోగించెను. ఇరుపక్షములలో ఘోరసంగ్రామ మారంభమయ్యెను. దివ్యాస్త్రప్రయోగములచే సకలపృథ్వి కంపింపదొడంగెను. ఆమహారణమధ్యములో మహాబలియగు బలరాముడు బాణాసురుని వధించుటకు సిద్ధముగ నుండుట గాంచి కాలాగ్నిరుద్రుడు ఆయన నడ్డగించెను. అందులకు కినుకవహించి బలదేవుడు రుద్రుని సారథిని, రథమును, అస్త్రములను, నిశితశరవర్షముచే తృటికాలములో ఖండించివైచెను. విరథుడైన కాలాగ్నిరుద్రుడు కోపించి యాదవసైన్యముపై భయంకర జ్వరమును ప్రయోగమొనరించెను. ఆజ్వరబలముచే శ్రీకృష్ణపరమాత్మతక్క అన్యయాదవవీరులందరు జ్వరాక్రాంతులైరి. అది గాంచి జగన్నాథుడు మంద స్మితముఖారవిందుడై మహేశ్వరజ్వరమును నిర్జించుటకు వైష్ణవజ్వరమును ప్రయోగించెను. ఒక ముహూర్తకాలము ఆరెండు జ్వరములలో ఘోరసంగ్రామము సంభవించెను. తుదకు వైష్ణవజ్వరశక్తిచే ఆక్రాంతయై మహేశ్వరజ్వరము శ్రీకృష్ణపరమాత్మ నిట్లు స్తుతింపదొడంగెను. "భక్తానుగ్రహవిగ్రహా! నీవు సర్వాత్మకుడవు; పూర్ణపురుషుడవు. సర్వులపైన నీకు సమానప్రేమ కలదు, కావున జగన్నాథా! ప్రపన్నుడనైన నన్ను రక్షింపుము." జ్వరమొనరించిన ప్రార్థనలను మన్నించి శ్రీహరి వైష్ణవజ్వరమును ఉపసంహరించెను. తదనంతరము బాణాసురుడు అసంఖ్యాకనిశితశరములను అభిమంత్రించి యాదవసైన్యముపై ప్రయోగింపగా, అవి ప్రళయకాలాగ్నిజ్వాలలవలె ప్రకాశించుచు యాదవసైన్యములను కల్లోలపరచినవి. అపుడు ఆదివ్యాస్త్రములపై సూర్యసమానతేజసమన్వితము లైన దివ్యాస్త్రములను ప్రయోగించి అర్జునుడు ఖండించివైచెను. బహుకాలము ఇరుపక్షములమధ్య ఘోరసంగ్రామము జరుగ సాగెను. తుదకు బాణాసురుడు పాశుపతాస్త్రమును సంధించి యాదవసైన్యములపై ప్రయోగింపగా ఆమహాస్త్రము అత్యంతభయంకరముగ కోటానుకోట్ల సూర్యసమతేజముతో ప్రకాశించుచు అమోఘమై, విశ్వసంహారకారకమై ప్రజ్వరిల్లదొడంగెను. పాశుపతమును గాంచినవెంటనే జగన్నాటక సూత్రధారి యగు శ్రీకృష్ణపరమాత్మ సకలాస్త్రశస్త్రశ్రేష్ఠమైన సుదర్శన చక్రమును ప్రయోగించెను. ఆదివ్యచక్రము అనంతకోటిసూర్యుల ప్రకాశముతో ప్రకాశించుచు పాశుపతాస్త్రమును నివారించి, బాణాసురుని దాకి వానివేలాది హస్తములను ఖండించెను. బాణాసురుని దేహమునుండి రక్తము వరదలై పారగ ఆయసురశ్రేష్ఠుడు చేష్టారహితుడై ధరణి కొరిగెను. అపుడు

భక్తవత్సలుడైన మహాదేవుడు బాణుని చెంత కఱుదెంచి ఆయసురుని
అరచేతి నుండి లేవనెత్తి స్వయముగ జనార్ధనుని సమీపమునకు తోడ్కొని
జని వానిని పరమాత్మచరణారవిందములపై పడవేసెను. బాణుని రక్షింపవలసి
నదిగా సామవేదోక్త ధ్యానముతో మహాదేవుడైన చంద్రశేఖరుడు శ్రీకృష్ణుని
స్తుతించెను. శ్రీకృష్ణపరమాత్మ అత్యంత ప్రసన్నుడై తనకరస్పర్శా హస్తోదకమున
బాణునకు చైతన్యమును ప్రసాదించి మృత్యుంజయజ్ఞానము నుపదేశించి వానిని
అజరామరునిగ జేసెను.

బాణాసురుడు తన బాహుబలదర్పమును వీడి నతమస్తకుడై ముకుళిత
హస్తములతో, అనన్యభక్తితో శ్రీకృష్ణు ననేకవిధముల స్తుతించెను. తదనంత
రము బాణాసురుడు సకలరత్నాభరణాభూషణములచే తన కన్యకారత్నమైన
ఉష నలంకరించి శ్రీకృష్ణసమక్షములో అనిరుద్ధునకు కన్యాదాన మొనరించి
తన సర్వస్వమును కానుకగ అర్పించెను. శ్రీకృష్ణపరమాత్మ శంకరునియనుజ్ఞ
గైకొని ఉషా అనిరుద్ధులతో గలసి సకలయాదవసైన్యములు వెంటరాగా
ద్వారకానగరమునకు వెడలిపోయెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మ ఖండమందు ఉషానిరుద్ధుల వివాహ మను .
నూట యిరువదియవ అధ్యాయము
సంపూర్ణము.

---

# నూట యిరువది యొకటవ అధ్యాయము

## శృగాలవాసుదేవోపాఖ్యానము

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! ఒకసమయములో శ్రీకృష్ణపరమాత్మ తన సమస్తయాదవ
గణములతో సభదీరియుండగ ఆసభకు బ్రహ్మతేజముతో ప్రకాశించు ఒక
బ్రాహ్మణోత్తము డఱుదెంచి పురుషోత్తముడైన శ్రీకృష్ణుని దర్శించి భక్తి
సమన్వితుడై అనేకవిధముల స్తుతించి తదనంతరము వినయపూర్వకముగ వాసు
దేవశృగాలు డను నరేశ్వరుని సందేశము నిట్లు వివరించెను. "వైకుంఠములో

చతుర్భుజు డైన దేవాదిదేవు డైన లక్ష్మీపతి యగు వాసుదేవుడను నేనే. నేనే సర్వలోకములకు విధాతను, బ్రహ్మకు పాలకుడను. పృథ్వీభారము తొలగింప వలసినదిగా నన్ను బ్రహ్మ ప్రార్థించెను. ఆయనప్రార్థనలను మన్నించి నేనే స్వయముగ భారతవర్షమందు అవతరించితిని. నేనే దైత్యేశ్వరు లైన మధు కైటభులను హిరణ్యాక్షహిరణ్యకశిపాదులను, సంహరించి సృష్టిని రక్షించితిని. నేనే స్వయముగ బ్రహ్మను, శివుడను, నేనే సమస్తలోకపాలకుడైన, దుష్టసం హారకుడైన శ్రీమహావిష్ణువును. మనువులు, మహర్షులు, దేవతలు నాకళాంశ లచే ఉద్భవించిరి. ప్రకృతికిసహితము అతీతుడైన శ్రీమన్నారాయణుడను నేనే. ఇంతవరకు నానామధేయము ధరించి చరించుచున్న నిన్ను క్షమించితిని. నీవు అహంకారము వీడి వాసుదేవనామమును త్యజించి సకలపృథ్వీశాసకుడ నైన నన్ను తక్షణమే శరణువేడుము. నీవు నాకు ఆత్మార్పణమొనరింపవేని నేనే స్వయముగ చతుర్భుజరూపమును ధరించి శంఖచక్రగదాపద్మధారినై అపారసేనావాహినితో నీద్వారకానగరమును ముట్టడించెను. నీవు నన్ను శరణు వేడనియెడల సపుత్రబాంధవముగ నిన్ను, నీద్వారకను భస్మీపటలమొనరించె దను.”

బ్రాహ్మణోత్తముడు విన్నవించిన ఈ హాస్యాస్పదసందేశము నాలకించి శ్రీకృష్ణుడు తదితరసభాసదులందరు అట్టహాసము లొనరించుచు పరిహసించిరి. శ్రీకృష్ణపరమాత్మ వార్తావహుడైన ఆబ్రాహ్మణుని అనేకవిధముల సత్క రించి వానికి నాల్గువిధములైన ఆహారపదార్థముల నొసంగి సాగనంపెను. ప్రాతఃకాలముననే శ్రీకృష్ణపరమాత్మ సకలయాదవసైన్యసహితముగ బయలు దేరి వాసుదేవశృగాలుడు నివసించు రాజ్యమునకు జని వానిపురమును ముట్టడిం చెను. శ్రీకృష్ణుని రాకను గాంచిన శృగాలుడు కృత్రిమముగ చతుర్భుజములను ధరించి సకలసైన్యములతో శ్రీహరిసమక్షమున నిలచెను. పురుషోత్తము డగు శ్రీకృష్ణపరమాత్మ మిత్రభావముతో శృగాలునివైపు అత్యంతస్నేహభరిత దృక్కులను సారించి మందస్మితముఖారవిందుడై లౌకికరీతితో మధురముగ సంభాషించెను. పరమాత్మను దర్శింపగనే శృగాలునియహంకారము పటాపం చలు కాగా ఆతడు అత్యంతభయభీతుడై దంభము వీడి శ్రీకృష్ణు నిట్లు ప్రార్థించెను. “ప్రభూ! నీవు చక్రముద్వారా తక్షణమే నాశిరమును ఖండించి ద్వారకానగరమునకు మరలిపొమ్ము. నీకటాక్షమువలన నా యీ నశ్వరశరీర

గాలము సమాప్తము కాగలదు. దేవా! జయవిజయులవలె నేను నీద్వారపాలకు
డను. సుభద్రనామధేయుడనైన నేను శ్రీమహాలక్ష్మిశాపమువలన వైకుంఠ
మునుండి భ్రష్టుడనై నరుడ నైనాను. ప్రభూ! నూఱు సంవత్సరములు జనని
యొసంగిన శాపకాలమును నిన్ను నిందించుచు గడపితిని; దేవా! నాశాపకా
లము ముగిసినది; సర్వజ్ఞా! నీకు అంతయు అవగతమే, కావున విలంబన మొన
రింపక నన్ను సంహరింపుము. నీచే వధింపబడి ఈనశ్వరదేహమును వీడి నేను
దివ్యదేహధారినై వైకుంఠము చేరగలను." వాసుదేవశృగాలు డొనరించిన
ప్రార్థనల నాలకించి శ్రీకృష్ణపరమాత్మ ఇట్లు పల్కెను. "మిత్రమా! మొదట
నీవే యుద్ధము నారంభింపుము పిమ్మట నేను యుద్ధమునకు సన్నద్ధుడను కాగలను,
వత్సా! సకలరహస్యములు నాకు విదితమే, గావున నీవు సుఖపూర్వకముగ
వైకుంఠమునకు బయలుదేరుము."

పరమాత్మ ఆదేశానుసారముగ శృగాలవాసుదేవుడు మాధవునిపై
తన దివ్యబాణములను ప్రయోగించెను; కాలస్వరూపములైన ఆయస్త్రములు
శ్రీకృష్ణపరమాత్మకు ప్రణామము లర్పించి అంతర్హితములైనవి. వెనువెంటనే
శృగాలుడు ప్రళయకాలాగ్నిశిఖాసదృశ మైన గదను ప్రయోగించెను. ఆగదా
దండము శ్రీకృష్ణునిశరీరమును స్పృశింపగనే చూర్ణమయ్యెను. తదనంతరము
రాజు పరమదారుణ కాలస్వరూపమైన ఖడ్గప్రహార మొనరింపగ ఆఖడ్గము
శ్రీకృష్ణుని దాకగనే తునాతునకలయ్యెను. ఇట్లు తనచెంతగల సకల అస్త్రశస్త్ర
ములను శృగాలవాసుదేవుడు పరమాత్మపై ప్రయోగించి అస్త్రరహితుడు కాగా
గాంచి శ్రీకృష్ణుడు "మిత్రమా! అంతఃపురమువకేగి మఱికొన్ని శస్త్రములను,
అస్త్రములను తోడ్కొని రమ్మ"నిపల్కెను. పరమాత్మపరిహాసముల నాలకించి
శృగాలుడు ఇట్లు ప్రార్థించెను. "ప్రభూ! ఆకాశసదృశమైన ఆత్మ అస్త్రముల
ద్వారా ఛేదింపబడదు. ఆత్మతో యుద్ధ మెట్లు సంభవింపగలదు? సృష్టిని ఉద్ధ
రించుట కవతరించిన కారణస్వరూపా! ఈభవసాగరమునుండి నన్ను ఉద్ధరిం
పుము. నాథా! భవసాగరము అత్యంతభయంకరము, విషమవిషయములకంటె
అధికదారుణము; కావున నాకర్మజనితమాయామోహము లనుసంకెళ్ళను
ఛిన్నాభిన్న మొనరింపుము. దేవా! నీవు సకలకర్మలకు ఈశ్వరుడవు, విధాతలకే
విధాతవు, శుభఫలప్రదాతవు, సకలసంపత్ప్రదాతవు, ప్రాకృతకర్మకారణుడవు,
కర్మలను ఖండించుటలో అత్యంతసమర్థుడవు. నేను ఈపాంచభౌతిక దేహ

మును త్యజించి నాస్వస్థల మైన మీవైకుంఠసప్తద్వారమును జేరెదను." ఇట్లు అనన్యభక్తితో శృగాలు డొనరించిన స్తవనము నాలకింపగనే శ్రీకృష్ణపరమాత్మ విశాలనేత్రములనుండి ఆనందాశ్రువులు ప్రవహించినవి. అయన నేత్రములనుండి బహిర్గతములైన యశ్రుధారలచే బిందుసర మను దివ్యసరోవరము ప్రాదుర్భవించెను. ఆసరోవరము తీర్థములందు సర్వశ్రేష్టము. ఆపవిత్ర జలస్పర్శమాత్రముననే మనుష్యుడు జీవన్ముక్తుడై తన జన్మసంచితపాపములనుండి విముక్తిని పొందగలడు; ఇందు లేశమాత్ర మైనను సంశయములేదు.

తదనంతరము శ్రీకృష్ణపరమాత్మ శృగాలు నిట్లు ప్రశ్నించెను. "మిత్రమా! నీయంతఃకరణము ఇంతనిర్మల మైనచో నీ వేలయుద్ధబుద్ధివహించి నాచెంతకు దారుణసందేశమును బంపితివి?." భగవంతునిప్రశ్న నాలకించి శృగాలవాసుదేవు డిట్లుప్రత్యుత్తర మొసంగెను. "జగన్నాథా! నేను నీయెడల అట్టినిష్ఠురవచనములను ప్రయోగింపకున్న నీవు నాస్థలమున కిట్లు రాగలవా? నీకు కోపము కల్గింపకున్న శాపగ్రస్తుడ నైన నాకు నీదివ్యదర్శన మత్యంత దుర్లభము కాగలదు. దేవాదిదేవా! నీదివ్యమంగళవిగ్రహదర్శన మాత్రముననే నాసకలపాపములు నశించినవి, నేను శాపవిముక్తుడనైతిని." ఇట్లు పల్కుచు ఆ వాసుదేవశృగాలుడు యోగబలముచే శ్రీకృష్ణపరమాత్మను నయనానందకరముగ దర్శించుచు హరినామసంకీర్తన మొనరించుచు తన ప్రాకృతపాంచభౌతికశరీరమును త్యజించెను. ఆ శరీరమునుండి సప్తతాళ ప్రమాణయుక్త మైన దివ్యజ్యోతి బయల్వెడలి బ్రహ్మాదులచే శ్రీమహాలక్ష్మిచే సదా ఆరాధింపబడు భగవానుని చరణారవిందములకు ప్రణామము లర్పించి దివ్యదేహమును ధరించి విమానము నధిరోహించి వైకుంఠగమన మొనరించెను.

సకలయాదవులు శ్రీకృష్ణసహితముగ ఈయద్భుతదృశ్యమును గాంచి ప్రఫుల్లమనస్కులై ద్వారకానగరము జేరిరి. ద్వారకను చేరగనే పరమాత్మ ప్రపథమమున తలిదండ్రులను దర్శించి వారి కనేకప్రణామము లర్పించి తదనంతరము రుక్మిణీదేవి అంతఃపురమును ప్రవేశించి పుష్పశయ్యపై శయనించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు శృగాలవాసుదేవోపాఖ్యానమను
నూటయిరువదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

# నూట ఇరువది రెండవ అధ్యాయము

## శ్యమంతకమణి ఉపాఖ్యానము

నారదుడు పలికెను :-

సకలచరితములందు శ్రీకృష్ణుని దివ్యగాథలు అత్యంతరమణీయములు. దేవా! శ్యమంతకమణి ఉపాఖ్యానమును సవిస్తరముగ వివరింపవలసినదిగ ప్రార్థించుచున్నాను,

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! మున్ను భాద్రపదశుక్ల చతుర్థశినాడు చంద్రుడు గురుపత్ని తారను చెరబట్టగా ఆమె కోపించి నిన్ను గాంచినవారు కళంకితులు కాగల రని శపించెను. చంద్రుడు తన శాపపరిహారార్థము నారాయణసరోవరములో అఖండతప మాచరించెను. చంద్రునితపమునకు ప్రసన్నుడై నారాయణుడు సాక్షాత్కరించి సతీశాపము అనివార్యమని, అయినను ఒక్క భాద్రపదశుక్ల చతుర్దశీదినమున నిన్ను దర్శించినవారు నీలాపనిందలపాలు కాగల రని అనుగ్రహించి అంతర్హితుడయ్యెను. బ్రహ్మనందనా! లోకశిక్షార్థమై స్వయముగ శ్రీకృష్ణుడే భాద్రపదశుక్లచతుర్థశినాడు చంద్రుని దర్శించి తన్ను తాను అపనిందలకు గుఱిగావించుకొనెను. ఆచరితమును వర్ణించెద నవధరింపుము. ద్వారకానగరములో సత్రాజిత్తు డనుయాదవశ్రేష్ఠుడు కలడు. ఆయన పుష్కరక్షేత్రములో సూర్యభగవానుని ఘోరతపముచే ఆరాధించి సూర్యానుగ్రహమువలన శ్యమంతకమణిని పొందెను. ఆదివ్యమణి ప్రతిదినము ఎనిమిది బారువుల సువర్ణమును ప్రసాదించును. ప్రజాసేవకై మణి నర్పింపు మని శ్రీకృష్ణు డొనరించిన ఆదేశమును అత్యంతగర్వసమన్వితుడైన సాత్రాజిత్తు తిరస్కరించెను. సత్రాజిత్తునకు వసుంధరాంశచే ఉద్భవించిన సత్యభామ యను కన్యకామణి కలదు. ఒకదినమున సత్రాజిత్తుసహోదరుడు శ్యమంతకమణిని గళమందు ధరించి మృగయావినోదార్థమై వనములకు జనగా వానిగళములో ప్రకాశించు మణిని మాంసఖండమని భ్రమించి ఒకమృగరాజు వానిని సంహరించి మణిని గ్రహించెను. ఆవనమందే విరాజిల్లు భల్లూకేశ్వరుడైన జాంబవంతుడు మృగరాజునోటిలో మణిని గాంచి ఆసింహమును సంహరించి మణిని గైకొని గృహము జేరి ఆదివ్యరత్నమును తనకుమార్తె యగు జాంబవతి కొసంగెను.

సత్రాజిత్తు గృహములో మణిని గానక దానిని శ్రీకృష్ణుడే అపహరించెనని నిందవేసెను. తన నిందను బాపుకొనుటకై స్వయముగ శ్రీకృష్ణ పరమాత్మయే వనమునకు జని మణి భల్లూకేశ్వరుని గృహమునందు గలదని గ్రహించి జాంబవంతునిగృహము జేరెను. మణికై అఱుదెంచిన సచ్చిదానంద విగ్రహుడు తనస్వామియే యని తెలిసికొనలేక జాంబవంతుడు పరమాత్మపై విజృంభించెను. శ్రీకృష్ణపరమాత్మస్పర్శచే సత్యమును గ్రహించినవాడై భల్లూకేశ్వరుడు మణిసహితముగ తన బాలామణిని పరబ్రహ్మమున కర్పించి చరితార్థుడయ్యెను. సత్యము దెలిసిన తదుపరి సత్రాజిత్తు అత్యంతపశ్చాత్తప్తహృదయుడై శ్రీకృష్ణుడు తన కొసంగిన శ్యమంతకమణిని, ఆమణితో తన కుమార్తె సత్యభామను భగవంతున కర్పించి ధన్యుడయ్యెను. ఇట్లు భగవంతుడు తనపై బడిన నీలాపనిందను తొలగించుకొనెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు శ్యమంతకమణి ఉపాఖ్యానమను
నూట యిరువదిరెండవ అధ్యాయము
సంపూర్ణము

---

## నూట యిరువది మూడవ అధ్యాయము

## సిద్ధాశ్రమములో రాధాదేవి యొనరించిన శ్రీగణేశారాధన

నారదుడు పలికెను:-

మహర్షీ! పురాణములలో ప్రవచింపబడిన గణేశ్వరపూజాఖ్యానమును మున్ను నేను సంక్షేపముగ బ్రహ్మదేవునివలనవింటిని. దేవా! పూజనీయులకే పూజనీయుడు, సర్వప్రధానుడైన శ్రీగణేశ్వరుని మహిమను సవిస్తరముగ వివరింపవలసినదిగ ప్రార్థించుచున్నాను. పూర్వకాలములో పవిత్రసిద్ధాశ్రమ ప్రాంగణములో రాధాగమాధవులను సకలదేవతలు పూజించిరి. జగజ్జననియగు రాధాదేవియే సుదామునిశాపవశమున అవనిపై అవతరించి శ్రీకృష్ణునినుండి

హరమై నూఱుసంవత్సరములు వియోగమనుభవించెను. ఆమె శాపపరి సమాప్తిదినమున బ్రహ్మవిష్ణుశివాదులు, సురేంద్రులు, నాగేంద్రులు, ఆదిశేషుడు, భూమిపైగల నరేశ్వరులు, అసురులు, గంధర్వులు, రాక్షసులు మొదలగు వారందరుండగ సర్వప్రథమమున రాధ ఎట్లు గణేశ్వరుని పూజించెను? మహాభాగా! ఈ వృత్తాంతమంతయు సవిస్తరముగ కృపతో వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

నారాదా! త్రిలోకములందు పుణ్యవతియైన కారణమున పృథ్వి ధన్యురాలు, మాన్యురాలు. ఆపృథ్విపై విరాజిల్లు పుణ్యక్షేత్రమైన భారతవర్షము సత్కర్మలకు ఫల మొసంగు దివ్యభూమి. ఆపవిత్ర భారతదేశములో సిద్ధాశ్రమ మను మహాపుణ్యప్రద శుభక్షేత్రము కలదు. ఆక్షేత్ర మత్యంత ధన్యము, యశఃప్రదము, పూజ్యము, మోక్షప్రదాయకము. సనత్కుమారుడు ఈక్షేత్రములోనే సిద్ధి నొందెను. ఈప్రదేశములోనే స్వయముగ బ్రహ్మ తపమాచరించి అఖండసిద్ధిని పొందెను. యోగీంద్రులు, మునీంద్రులు, కపిలాది సిద్ధేంద్రులు, శతక్రతు మహేంద్రాదులు ఈపవిత్రభూమిపై తపమాచరించి సిద్ధులైరి. కావుననే ఈప్రదేశమును సిద్ధాశ్రమ మని కీర్తింతురు. ఈయాశ్రమము సర్వులకు దుర్లభము. మునీశ్వరా! ఈపవిత్రాశ్రమములో అమూల్యరత్న నిర్మితమైన గణేశ్వరుని దివ్యవిగ్రహము కలదు. స్వయముగ గణేశ్వరుడే అర్చావిగ్రహరూపమున పవిత్ర సిద్ధాశ్రమలో విరాజిల్లు చుండును. ప్రతివైశాఖ పూర్ణిమదినమున సకలదేవతలు, నాగులు, మనుష్యులు, దైత్యులు, గంధర్వులు, రాక్షసులు, సిద్ధేంద్రులు, మునీంద్రులు, యోగీంద్రులు, సనకాది మహాత్ములు, శ్రీగణేశ్వరుని సిద్ధాశ్రమములో అరాధింతురు. అది సుదాముని శాపవశమున రాధాదేవి శ్రీహరితో నూఱు సంవత్సరములు వియోగము ననుభవించి శాప విముక్తురాలైన సమయము. ఆశుభసమయమున సిద్ధాశ్రమమునకు పార్వతీ సహితముగ కళ్యాణప్రదాత యగు శంకరుడు, సకలగణ సహితముగ కార్తికేయుడు, సకలదేవతా సహితముగ బ్రహ్మాదు లరుదెంచిరి. ప్రధానులైన నాగులతో ఆదిశేషుడు కూడ ఆప్రదేశము జేరెను. మనువులు, మహర్షులు, నరేశ్వరులు ప్రసన్నమనములతో గణపతి నారాధించుట కాప్రదేశమునకు వచ్చిరి. నందాది గోకులవాసులు, ద్వారకానగరవాసులతో శ్రీకృష్ణుడు

ఆప్రదేశమున కలుదెంచిరి. తదనంతరము సురసికశిరోమణి, రాసేశ్వరి, శ్రీకృష్ణప్రణాధిదేవత యైన శ్రీరాధాదేవికూడ కులవాసినులైన గోపికలతో కలసి సిద్ధాశ్రమము జేరెను. ఆప్రదేశములో శ్రీరాధ స్నానమాచరించి శుద్ధురాలై, అగ్నిశుద్ధ వస్త్రములను ధరించి చరణకమలములను ప్రక్షాళన మొనరించుకొని నిరహారయై ఇంద్రియములను వశమందుంచుకొని గణేశ్వరుని యర్చ విగ్రహము విరాజిల్లు మణిమంటపమును ప్రవేశించెను. తదనంతరము ఆభువన పావని యగు రాధాదేవి శ్రీకృష్ణప్రాప్తిని ఆకాంక్షించి ఉత్తమసంకల్ప విధానము నొనరించి భక్తిపూర్వకముగ పవిత్రగంగా జలములతో శ్రీగణేశ్వరునకు అభిషేక మొనరించెను. నాల్గువేదములకు, వాసునకు, సకలలోకములకు జననియైన అఖండ బుద్ధిస్వరూపిణి యైన శ్రీరాధ శ్వేతపుష్పములను హస్తములలో ధరించి సామవేదోక్త ధ్యానముచే శ్రీగణేశ్వరు నిట్లు ధ్యానింప నారంభించెను.

శ్లో॥ ఖర్వం లమ్బోదరం స్థూలం జ్వలన్తం బ్రహ్మతేజసా।
గజవక్త్రం మహావిర్వాణ మేకదన్తమనన్తకమ్॥ 25

సిద్ధానాం యోగినామేవ జ్ఞానినాం చ గురోర్గురుమ్।
ధ్యాతం మునీన్ద్రైర్దేవేన్ద్రైర్బ్రహ్మేశాశేషసంజ్ఞకైః॥ 26

సిద్ధేన్ద్రైర్మునిభిః సద్భిర్భగవన్తం సనాతనమ్।
బ్రహ్మస్వరూపం పరమం మఙ్గళం మఙ్గలాలయమ్॥ 27

సర్వవిఘ్నహరం శాన్తం దాతారం సర్వసంపదామ్।
భవాబ్ధిమాయా పోతేవ కర్ణధారం చ కర్మిణామ్॥ 28

శరణాగతదీనార్తపరిత్రాణ పరాయణమ్।
ధ్యాయేద్ధ్యానాత్మకం సాధ్యం భక్తేశం భక్తవత్సలమ్॥ 29

పొట్టివాడు, లంబోదరుడు, స్థూలకాయుడు, బ్రహ్మతేజోధ్భాసితుడు, గజాననుడు, అగ్నిశిఖాసదృశకాంతిసమన్వితుడు, ఏకదంతుడు, అనంతుడు, సిద్ధులకు, యోగులకు జ్ఞానులగు గురువులకు ఆచార్యుడు, బ్రహ్మ, శివ, శేషాదులచేత, దేవేంద్రులచేత, మునీంద్రులచేత, సిద్ధేంద్రులచేత, మహర్షిగణములచేత, భక్తులచేత, సదా ధ్యానింపబడువాడు, పరమైశ్వర్యశాలియు, సనాతనుడు, బ్రహ్మస్వరూపుడు, మంగళప్రదాతయు, సకలమంగళములకు స్థానము, సంపూర్ణవిఘ్నవినాశకుడు, శాంతుడు, సకలసంపత్ప్రదాతయు, కర్మ

యోగులకు భవసాగరములో మాయాస్వరూపిణియైన నావకు కర్ణధారస్వరూపుడు, శరణాగతులను, దీనులను, దుఃఖితులను రక్షించుటలో సదాతత్పరుడు, ధ్యానస్వరూపుడు, సాధనచేసి పొందుటకుయోగ్యుడు, భక్తులకు స్వామియు, భక్తవత్సలుడు నగుగణేశ్వరుని నిశ్చలమనముతో ధ్యానించెదను.

ఇట్లు శ్రీగణేశ్వరుని ధ్యానించి శ్వేతపుష్పములను తన శిరముపై నుంచుకొని మఱల సర్వాంగములను శుద్ధమొనరించు వేదోక్తన్యాసము పఠించెను. తదనందరము శుభదాయకధ్యానముద్వారా మఱల ధ్యానమొనరించి శ్రీరాధ లంబోదరునిచరణసరోజములకు పుష్పాంజలులను సమర్పించెను. తదుపరి గోలోకవాసిని యగు శ్రీరాధ సుగంధసుశీతలతీర్థజలములను, దూర్వాంకురములను, ధాన్యములను, శ్వేతపుష్పములను, సుగంధచందనయుక్తమగు అర్ఘ్యమును, పారిజాతపుష్పమాలను, కస్తూరీకేసరయుక్త చందనానులేపనములను, సుగంధశుక్లపుష్పములను, ఉత్తమసుగంధధూపమును, గోఘృతదీపమును, సుస్వాదురమణీయనైవేద్యములను, చతుర్విధాన్నములను, సుపక్వఫలములను, అనేకవిధములైన లడ్డులను, రమణీయసుస్వాదుపిష్టకములను, వివిధ వ్యంజనములను, అమూల్యరత్ననిర్మితసింహాసనమును, అగ్నిశుద్ధవస్త్రములను, మధుపర్కమును, తుంబూలమును, అమూల్యశ్వేతవింజామరలను, మణిముక్తవజ్రములచే అలంకరింపబడిన సుందరసూక్ష్మవస్త్రముద్వారా సుశోభితమైన శయ్యను, సవత్సకామధేనువును, అనేక పుష్పాంజలులను అర్పించి అత్యంత శ్రద్ధతో షోడశోపచారములను సంపూర్ణమొనరించెను. తదనంతరము కాళిందీ కులవాసిని యగు శ్రీరాధ కల్పతరుసమానమైన గణేశ్వరుని షోడశాక్షర (ఓం గం గాం గణపతయే విఘ్నవినాశనే స్వాహా) మంత్రమును వేయిపర్యాయములు జపించెను. తదుపరి అనన్యభక్తిసమన్వితయై శిరమును వంచి సాశ్రుపూర్ణనేత్రములతో పులకితగాత్రయై గణేశ్వరు నిట్లు స్తుతింపదొడంగెను.

శ్లో॥ పరం ధామ పరం బ్రహ్మ పరేశం పరమేశ్వరమ్ ।
విఘ్ననిఘ్నకరం శాంతం పుష్టం కాన్తమనన్తకమ్ ॥ 58

సురాసురేన్ద్రైః సిద్ధేన్ద్రైః స్తుతం స్తౌమి పరాత్పరమ్ ।
సురపద్మదినేశం చ గణేశం మఙ్గలాలయమ్ ॥ 59

ఇదం స్తోత్రం మహాపుణ్యం విఘ్నశోకహరం పరమ్ ।
యః పఠేత్ప్రాతరుత్థాయ సర్వవిఘ్నాత్ప్రముచ్యతే ॥ 60

పరంధాముడు, పరబ్రహ్మము, పరేశుడు, పరమేశ్వరుడు, విఘ్నవినాయకుడు, శాంతుడు, పుష్టుడు, మనోహరుడు, అనంతుడు; ప్రధానులైన సురాసురులచే స్తుతింపబడువాడు దేవరూపకమలములకు సూర్యుడు, మంగళముల కాశ్రయస్థానుడు; పరాత్పరుడు నగు గణేశ్వరుని నేను స్తుతించెదను. ఈఉత్తమస్తోత్రము మహాపుణ్యప్రదము, విఘ్నములను, శోకములను హరింపగలస్తోత్రము. ప్రాతఃకాలమున ఈస్తోత్రమును పఠించువారు సర్వవిఘ్నముల నుండి విముక్తులు కాగలరు.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు రాధయొనరించిన శ్రీగణేశారాధనమను
నూటయిరువదిమూడవ అధ్యాయము
సంపూర్ణము.

## నూటయిరువదినాల్గవ అధ్యాయము

## బ్రహ్మేశశేషాదులొనరించిన శ్రీరాధికాస్తోత్రము

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! రాధ గణేశ్వరుని విధిపూర్వకముగ పూజించి స్తుతియొనరించి సర్వాంగములందు ధరించుటకు యోగ్యములైన బహుమూల్యరత్ననిర్మితాభూషణముల నర్పించెను. రాధ యొనరించిన పూజలను గాంచి స్తుతి నాలకించి అత్యంతశాంతస్వరూపుడైన గణేశ్వరుడు అత్యంతప్రసన్నుడై పరమశాంతస్వరూపిణియు త్రిలోకజననియు నగు శ్రీరాధాదేవిని మధురవచనములతో ఇట్లు స్తుతించెను.

**గణేశ ఉవాచ :**

శ్లో॥ తవ పూజా జగన్మాతర్లోకశిక్షాకరీ శుభే ।
బ్రహ్మస్వరూపా భవతీ కృష్ణవక్షఃస్థలస్థితా ॥ 3
యత్పాదపద్మమతులం ధ్యాయన్తే తే సుదుర్లభమ్ ।
సురా బ్రహ్మేశశేషాద్యా మునీన్ద్రాః సనకాదయః ॥ 4

జీవన్ముక్తాశ్చ భక్తాశ్చ సిద్ధేన్ద్రాః కపిలాదయః ।
తస్య ప్రాణాధిదేవి త్వం ప్రియా ప్రాణాధికా పరా ॥ 5

వామాఙ్గనిర్మితా రాధా దక్షిణాఙ్గశ్చ మాధవః ।
మహాలక్ష్మీర్జగన్మాతా తవ వామాఙ్గనిర్మితా ॥ 6

వసోః సర్వనివాసస్య ప్రసూస్త్వం పరమేశ్వరీ ।
వేదానాం జగతామేవ మూలప్రకృతిరీశ్వరీ ॥ 7

సర్వాః ప్రాకృతికా మాతః సృష్ట్యాం చ త్వద్విభూతయః ।
విశ్వాని కార్యరూపాణి త్వం చ కారణరూపిణీ ॥ 8

ప్రలయే బ్రహ్మణః పాతే తన్నిమేషో హరేరపి ।
ఆదౌ రాధాం సముచ్చార్య పశ్చాత్కృష్ణం పరాత్పరమ్ ॥ 9

స ఏవ పణ్డితోయోగీ గోలోకం యాతి లీలయా ।
వ్యతిక్రమే మహాపాపీ బ్రహ్మహత్యాం లభేద్ధ్రువమ్ ॥ 10

జగతాం భవతీ మాతా పరమాత్మా పితా హరిః ।
పితురేవ గురుర్మాతా పూజ్యా వన్ద్యా పరాత్పరా ॥ 11

భజతే దేవమన్యం వా కృష్ణం సర్వకారణమ్ ।
పుణ్యక్షేత్రే మహామూఢో యది నిన్దతి రాధికామ్ ॥ 12

వంశహానిర్భవేత్తస్య దుఃఖశోకమిహైవ చ ।
పచ్యతే నరకే ఘోరే యావచ్చన్ద్రదివాకరౌ ॥ 12

గురుశ్చ జ్ఞానోద్గిరణాం జ్ఞానం స్యాన్మన్త్రతన్త్రయోః ।
స చ మన్త్రశ్చ తత్తన్త్రం భక్తిః స్యాద్ధ్రువయోర్యతః ॥ 14

నిషేవ్య మన్త్రం దేవానాం జీవా జన్మని జన్మని ।
భక్తా భవన్తి దుర్గాయాః పాదపద్మే సుదుర్లభే ॥ 15

నిషేవ్య మన్త్రం శమ్భోశ్చ జగతాం కారణస్య చ ।
తదా ప్రాప్నోతి యువయోః పాదపద్మం సుదుర్లభమ్ ॥ 16

యువయోః పాదపద్మం చ దుర్లభం ప్రాప్య పుణ్యవాన్ ।
క్షణార్ధం షోడశాంశం చ నహి ముంచతి దైవతః ॥ 17

భక్త్యా చ యువయోర్మన్త్రం గృహీత్వా వైష్ణవాదపి ।
స్తవం వా కవచం వాఽపి కర్మమూల నికృన్తనమ్ ॥ 18

శ్లో॥ యోజయేత్పరయా భక్త్యా పుణ్యక్షేత్రే చ భారతే ।
పురుషాణాం సహస్రం చ స్వాత్మనసార్ధముద్ధరేత్ ॥ 19

గురుమభ్యర్చ్య విధివద్వస్త్రాలంకారచన్దనైః ।
కవచం ధారయేద్యో హి విష్ణుతుల్యో భవేద్ధ్రువమ్ ॥ 20

యదత్తం వస్తు మే మాతస్తత్సర్వం సార్థకం కురు ।
దేహి విప్రాయ మత్ప్రీత్యా తదా భోక్ష్యామి సామ్ప్రతమ్ ॥ 21

దేవే దేయాని దానాని దేవే దేయా చ దక్షిణా ।
తత్సర్వం బ్రాహ్మణే దద్యాత్తదానన్త్యాయ కల్పతే ॥ 22

బ్రాహ్మణానాం ముఖం రాధే దేవానాం ముఖముఖ్యకమ్ ।
విప్రభుక్తం చ యద్ద్రవ్యం ప్రాప్నువన్త్యేవ దేవతాః ॥ 23

జగన్మాతా! నీ వొనరించిన ఈపూజ కేవలము ప్రజలకు శిక్షను ప్రసాదించుటకే. శుభా! నీవు స్వయముగ బ్రహ్మస్వరూపిణివి, శ్రీకృష్ణునివక్షఃస్థలముపై విరాజిల్లుదేవివి. బ్రహ్మశివశేషాదిదేవతలు, సనకాదిమహర్షులు, జీవన్ముక్తులైన భక్తులు, కపిలాదిసిద్ధశిరోమణులు పరమ దుర్లభములైన ఎవని చరణకమలములను నిరంతరము ధ్యానింతురో ఆశ్రీకృష్ణునకు నీవు అధికప్రియురాలవు. శ్రీకృష్ణుని దక్షిణాంగమే మాధవు డయ్యెను, వామాంగమే రాధ యయ్యెను. శ్రీమహాలక్ష్మి నీవామాంగమునుండే ప్రాదుర్భవించెను. సర్వులకు ఆధారభూతు డైన వాసునకు జన్మప్రసాదించిన జననివి నీవు. నీవు పరమేశ్వరివి, వేదములకు, లోకములకు ఈశ్వరివి, మూలప్రకృతివి. మాతా! ఈసృష్టిలోనున్న నారీమణులు అందరు నీవిభూతులే. సర్వవిశ్వములు కార్యరూపములు, నీవు వానియన్నింటికి కారణరూపిణివి. ప్రళయకాలములో బ్రహ్మ తిరోభావమొందిన అది శ్రీహరికి ఒకనిమేషకాలముమాత్రమే. బుద్ధిమంతుడైన యోగి మొదట రాధానామముచ్చరించి తదనంతరము పరాత్పరుడైన శ్రీకృష్ణునినామ ముచ్చరించినచో, అనగా రాధాకృష్ణ యని పల్కినచో అతడు అనాయాసముగ గోలోకపరంధామము చేరగలడు. ఇందుకు భిన్నముగ ప్రవర్తించినవారు మహాపాపులై బ్రహ్మహత్యాపాతకమునకు గుఱియై సూర్యచంద్రు లున్నంతవరకు నరకము లనుభవింపగలరు. నీవే సకలలోకములకు జననివి, శ్రీహరియే జనకుడు; కాని జనని జనకునికంటె అత్యంత శ్రేష్ఠురాలు, పూజ్యురాలు, వందనీయురాలు.

ఈపుణ్యక్షేత్రమైన భారతవర్షములో సర్వకారణస్వరూపుడైన శ్రీకృష్ణుని పూజింపక అన్యదేవతారాధన మొనరించి, రాధాదేవిని నిందించిన మందమతి ఇహలోకములో దుఃఖశోకముల బొందును, వానివంశము నశించును. ఆతడు సూర్యచంద్రులున్నంతవరకు ఘోరనరకము ననుభవింపగలడు. జ్ఞానమును భోధించుటవలన ఆచార్యుని గురు డందురు. ఆజ్ఞానము మంత్రతంత్రాదులచే ప్రాప్తించును, ఆమంత్రతంత్రాదులు మీయిర్వురియెడల అనన్యభక్తియే. ప్రతిజన్మలోను దేవతలమంత్రములను జపించునప్పుడు జీవునకు దుర్గాదేవి యొక్క పరమదుర్లభములగు చరణకమలములందు భక్తిప్రాప్తించును. తదుపరి లోకములకు కారణస్వరూపుడైన శంభునిమంత్రము నాతడాశ్రయింపగలడు. తదనంతరమే అత్యంతదుర్లభమైన మీయిర్వురి (రాధాకృష్ణుల) చరణకమలప్రాప్తి వానికి కలుగగలదు. ఏపుణ్యవంతుడైన పురుషుడు మీయిర్వురి చరణకమలమునను పొందునో ఆతడు క్షణమైనను, షోడశాంశమైనను ఆయనన్యభక్తిని వీడలేడు. ఏమానవుడైతే ఈపుణ్యక్షేత్రమైన భారతవర్షములో మీయిర్వురిమంత్రమును, కవచమును, కర్మమూలములను ఖండింపగల స్తోత్రమును పరమవైష్ణవునినుండి అనన్యభక్తితో గ్రహించి జపించునో, ఆతడు తనను తాను ఉద్ధరించుకొనుటయేగాక తన వేలాదితరములవారినికూడ ఉద్ధరింపగలడు. అతడు నిశ్చయముగ విష్ణుతుల్యుడు కాగలడు.

విధిపూర్వకముగ వస్త్రాలంకారచందనములతో గురువును బాగుగ పూజించి వానినుండి నీదివ్యకవచమును గ్రహించువాడు నిశ్చయముగ విష్ణుతుల్యుడు కాగలడు; మాతా! నీవు నాకర్పించిన వస్తువులనన్నింటినీ సార్థకమొనరింపుము. అనగా నాప్రసన్నార్థము వానిని బ్రాహ్మణుల కర్పింపుము. తదుపరియే నేను వాటిని స్వీకరించెదను; ఎందువలెననగా దేవతల కర్పించు పదార్థములు బ్రాహ్మణుల కర్పించిన అవి అనంతములు కాగలవు. రాధామాతా! బ్రాహ్మణులముఖమే దేవతలప్రధానముఖము; బ్రాహ్మణులు ఏ యే పదార్థములను భుజింతురో అవి దేవతలను జేరును.

ఆసమయములోనే బ్రహ్మశివశేషాదిదేవతలు దేవశ్రేష్ఠుడైన గణేశ్వరుని పూజించుటకు సిద్ధక్షేత్రమున ఒకవటవృక్ష ఛాయలో సమావేశమైరి. ఒకశివదూత వారిని సమీపించి దేవతలతో, దేవాంగనలతో ఇట్లు పలికెను. "దేవగణములారా! వృషభాను నందిని రాధ నన్ను గాదని మంటపమును

ప్రవేశించి శుభముహూర్తములో స్వస్తివచన మాచరించి సర్వప్రథమమున శ్రీగణేశ్వరుని అరాధించెను. సర్వప్రథమమున ఎవరు గణేశ్వరుని ఆరాధింతురో వారికి అనంతఫలము ప్రాప్తించును, మధ్యలో పూజించువారికి మాధ్యమఫలము లభించును, చివరకు పూజించినవారికి స్వల్పపుణ్యమే లభింపగలదు. అట్టిదశలో ఎందరో దేవతలు, దేవాంగనలు, మహర్షులు ఉపస్థితులైయున్నను ఆరాధ గోపికలతో కలపి దేవశ్రేష్ఠుడైన గణపతిపూజను నిర్విఘ్నముగ సంపన్న మొనరించెను.''

దూత పల్కిన వచనము నాలకించి దేవతలు, మహర్షులు, మనువులు. నరేశ్వర సముదాయములు, దేవాంగనలు, మందహాసము లొనరించిరి. రుక్మిణీ మున్నగాగల మహిళారత్నములు అశ్చర్యచకితులైరి. అంతలో సావిత్రి, సరస్వతి, పరమేశ్వరియగు పార్వతి, రోహిణి, సతీసంజ్ఞ, స్వాహా మొదలగు దేవాంగనలు పతివ్రతలైన మునిపత్నులు అప్రదేశమున కఱుదెంచిరి. తదనంతరము సకలదేవతలు, మహర్షులు, మునులు, మనుష్యులు మొదలగువారందరు గణసహితముగ విరాజిల్లియున్న శ్రీకృష్ణునకు బ్రహ్మాదియితర దేవతలకు హర్షపూర్వకముగ ప్రణమిల్లిరి. అందరు శుభముహూర్తములో వివిధద్రవ్యములతో శ్రీగణేశ్వరుని పూజించి సుఖాసనములపై విరాజమానులైరి. ఆసమయమున నే పార్వతి పరమహర్షసంయుక్తయై రాధ విరాజిల్లియున్న స్థానమునకు జనెను. పార్వతిని గాంచి రాధాదేవి సింహాసనముపై నుండి లేచి స్వాగతము పల్కి ప్రేమతో నాలింగనమొనరించుకొని కుశలప్రశ్నలు వేసెను. దుర్గ రాధాదేవిని తనహృదయమునకు హత్తుకొని మధురవచనముల నిట్లు పల్కెను. ''రాధా! నేను నీ కుశలమునేమని ప్రశ్నింపగలను? ఎందువలననగ స్వయముగ నీవు సర్వమంగళములకు ఆశ్రయస్థానము, శ్రీదాముని శాపమునుండి నీవు విముక్తురాలవైతివి. ఇపుడు నీవిరహజ్వాలకూడ శాంతించినది. నామనఃప్రాణము లన్నియు నీయందే లగ్నమైయున్నట్లు, నీమనఃప్రాణములు నాయందు సంలగ్నములై యుండును. ప్రకృతిపురుషులకు భేదము లేనట్లే నీకు నాకు భేదము లేదు.

శ్లో॥ యే త్వాం నిన్దన్తి మద్భక్తా స్త్వద్భక్తాశ్చాపి మామపి ।
కుమ్భీపాకే చ పచ్యన్తే యావచ్చన్ద్రదివాకరౌ ॥ 44
రాధామాధవయోర్భేదం యే కుర్వన్తి నరాధమాః ।
వంశహానిర్భవేత్తేషాం పచ్యన్తే నరకే చిరమ్ ॥ 45

నాభక్తులై నిన్ను నిందించువారు నీభక్తులై నన్ను నిందించువారు సూర్యచంద్రులున్నంతవరకు కుంభీపాకనరక మనుభవింపగలరు. ఏనరాధము డైతే రాధామాధవులమధ్య భేదభావమును ప్రదర్శించునో వానివంశము నశించును, ఆతడు చిరకాలము నరకయాతనల ననుభవింపగలడు.

సర్వపూజ్యుడైన గణేశ్వరుని నీవే సర్వప్రథమమున పూజింపగల్గితివి, అట్లు నే నొనరింపలేకపోయితిని. ఈ గణేశ్వరుడు నీవాడైనట్లే నావాడును దేవీ! క్షీరములు, క్షీరములధవళత్వము కలసియుండునట్లే రాధామాధవుల కెన్నడు వియోగము సంభవింపదు. ఈ పుణ్యక్షేత్రమైన భారతవర్షములో నున్న మహాతీర్థమైన సిద్ధాశ్రమములో విఘ్నవినాశకుడైన శ్రీ గణేశ్వరుని బాగుగ పూజించిన నీవు ఏవిఘ్నములు సంభవింపకయే గోవిందునిపొందగలవు. నీవు రసికరాసేశ్వరివి శ్రీకృష్ణపరమాత్మ రసికశిరోమణి; కావున నాయికవైన నీసమాగమము రసికనాయకునితో సంభవించుట అఖిలవిశ్వములకు శుభప్రదము. రాధికా! నూఱువర్షముల శ్రీదామునిశాపకాలము గతించెను; కావున నేడు నీవు నాయనుగ్రహముచే శ్రీకృష్ణుని జేరగలవు. దేవీ! జగన్నాథుని ప్రసన్నతకొఱకు నీవు చక్కగ శృంగారమొనరించుకొనుము.''

అపుడు పార్వతీదేవియాజ్ఞానుసారముగ రాధాప్రియసఖులు రాధను సింగారించుటలో సంలగ్నులైరి. వారు ఈశ్వరి యగు రాధను ఒకరమణీయ సింహాసనముపై ఆసీనురాలిగ నొనరించిరి. రత్నమాల రాధాదేవిగళమును రత్నమాలికలచే అలంకరించి ఆమెహస్తమున క్రీడాకమలము నుంచెను. పద్మముఖి యను సఖి రాధచరణకమలములపై పారాణి చిత్రించెను. ఒక సుందరియగు గోపిక చందనయుక్తసిందూరముతో రాధాదేవిపాపటికి అధోభాగమైన లలాటమును పరమరుచిరబిందువులతో శోభితమొనరించెను. మఱియొకసఖి రాధాదేవిశిరోజములను బంధించి మహర్షులమనములనే మోహింపగల సుందరవేణిని నిర్మించెను. ఒకగోపిక కపోలములపై కస్తూరీకుంకుమమిశ్రితచందనముచే సుందరచిత్రావళిని చిత్రించెను. మాలావతీ సఖి శ్రీరాధాదేవిని సుందర చంపకపుష్పమనోహరగంధయుక్తమాలచే అలంకరించి వికసితనవమల్లికలను అర్పించెను. గోపికలు పరమశ్రేష్ఠనాయికయైన రాధను అనేక రత్నాభరణములచే అలంకరించిరి. శరత్కాలీనకమలదళసమాన శ్రీరాధాదేవి విశాలనేత్రములకు లలిత కాటుకను దిద్దెను. ఒక గోపిక మహేంద్రు డర్పించిన

పారిజాతసుగంధితపుష్పమును ఆమె హస్తమందుంచెను. సుశీల యనుగోపిక ప్రాణేశ్వరునితో ఎట్లుమధురవచనముల నాడవలెనో రాధకు వర్ణించి చెప్పెను. శృంగారవిషయసంబంధములైన అమృతోపమయములైన వచనములను సుధాముఖిపల్కెను. విపత్కాలములో స్మరింపదగు స్త్రీలషోడశకళలను కళావతి రాధచే స్మరణమొనరింపజేసెను. రాధాశ్రమము నంతయు గోపికలు గోరోచనముచే పరిశుద్ధమొనరించి రాధకు తాంబూలమొసంగిరి. ఆసమయముననే త్రిలోకవాసులందరు జగజ్జననియగు రాధను నయనములకరవు దీర దర్శించి చరితార్థులైరి.

శ్లో॥ శ్వేతచమ్పకవర్ణాభామతులాం సుమనోహరామ్ ।
మోహినీం మానసానాం చ మునీనామూర్ధ్వరేతసామ్ ॥ 76

సుకేశీం సున్దరీం శ్యామాం న్యగ్రోధపరిమణ్డలామ్ ।
నితమ్బకఠినశ్రోణీం స్తనయుగ్మోన్నతాననామ్ ॥ 77

కోటీన్దునిన్దితాస్యాం తాం సస్మితాం సుదతీం సతీమ్ ।
కజ్జలోజ్జ్వలరూపాం చ శరత్కమలలోచనామ్ ॥ 78

మహాలక్ష్మీం బీజరూపాం పరామాద్యాం సనాతనీమ్ ।
పరమాత్మస్వరూపస్య ప్రాణాధిష్ఠాతృదేవతామ్ ॥ 79

స్తుతాం చ పూజితాం చైవ పరాం చ పరమాత్మనే ॥
బ్రహ్మస్వరూపాం నిర్లిప్తాం నిత్యరూపాం చ నిర్గుణామ్ ॥ 80

విశ్వానురోధాత్ప్రకృతిం భక్తానుగ్రహవిగ్రహామ్ ।
సత్యస్వరూపాం శుద్ధాం చ పూతాం పతితపావనీమ్ ॥ 81

సుతీర్థపూతాం సత్కీర్తిం విధాత్రీం వేధసామపి ।
మహత్ప్రియాం చ మహతీం మహావిష్ణోశ్చ మాతరమ్ ॥ 82

రాసేశ్వరేశ్వరీం రమ్యాం రసికాం రసికేశ్వరీమ్ ।
వహ్నిశుద్ధాంశుకాధానాం స్వేచ్ఛారూపాం శుభాలయామ్ ॥ 83

గోపీభిః సప్తభిః శశ్వత్సేవితాం శ్వేతచామరైః ।
చతుస్సృభిః ప్రియాలీభిః పాదపద్మోపసేవితామ్ ॥ 84

అమూల్యరత్ననిర్మాణ భూషణౌఘైర్విభూషితామ్ ।
చారుకుణ్డలయుగ్మేన శ్రుతిగణ్డస్థలోజ్జ్వలామ్ ॥ 85

సునాసాం గజముక్తాఢ్యాం ఖగేన్ద్రచంచునిన్దితామ్ ।
కుఙ్కుమాలక్తకస్తూరీస్నిగ్ధచన్దనచర్చితా ॥ 86

దధానాం సుకపోలం చ కోమలాఙ్గీం సుకాముకీమ్ ।
గజేన్ద్రగామినీం రామాం కమనీయాం సుకామినీమ్ ॥ 87

రామాస్త్రజయరూపాం చ కామకామ్యాలయాం వరామ్ ।
క్రీడాకమలమమ్లానం పారిజాతప్రసూనకమ్ ॥ 88

అమూల్యరత్ననిర్మాణం దధానాం దర్పణోజ్జ్వలామ్ ।
నానారత్నవిచిత్రాఢ్యరత్నసింహాసనస్థితామ్ ॥ 89

పద్మైః పద్మార్చితం పాదపద్మం చ మఙ్గలాలయమ్ ।
హృత్పద్మే ధ్యాయమానాం చ కృష్ణస్య పరమాత్మనః ॥ 90

కర్మణా మనసా వాచా స్వప్నే జాగరణేఽపి చ ।
పత్ప్రీతిం ప్రేమసౌభాగ్యం స్మరన్తీం నిత్యనూతనామ్ ॥ 91

భావానురక్తసంసక్తాం శుద్ధభక్తాం పతివ్రతామ్ ।
ధన్యాం మాన్యాం గౌరవర్ణాం శశ్వద్వక్షఃస్థలస్థితామ్ ॥ 92

ప్రియాసు ప్రియభక్తేషు సుప్రియాం ప్రియవాదినీమ్ ।
కృష్ణవామాఙ్గ సమ్భూతామభేదాం గుణరూపయోః ॥ 93

గోలోకవాసినీం దేవదేవీం సర్వోపరిస్థితామ్ ।
వృషభానుసుతాఖ్యాం తాం పుణ్యక్షేత్రే చ భారతే ॥ 94

గోపీశ్వరీం గుప్తరూపాం సిద్ధిదాం సిద్ధిరూపిణీమ్ ।
ధ్యానసాధ్యాం దురారాధ్యాం వన్దే సద్భక్తవన్దితామ్ ॥ 95

ధ్యానే ధ్యానేన రాధాయా ధ్యాయన్తే ధ్యానతత్పరాః ।
ఇహైవ జీవన్ముక్తాస్తే పరత్ర కృష్ణపార్షదాః ॥ 96

శ్రీ రాధాదేవి శరీరకాంతి శ్వేతచంపకపుష్పసమానముగ పరమమనోహరము, అనుపమేయము. ఊర్ధ్వరేతుస్కులైన మహర్షుల మనములనుకూడ మోహింపగలసౌందర్యముగలది. ఆమె సుందరకేశసంయుక్త, పరమసుందరి. ఆహోడశవర్షీయ యగు శ్రీరాధ రాసమండలములో అక్షయవటవృక్షఛాయలో విరాజిల్లుజనని. ఆమెముఖసౌందర్యము కోట్లాదిచంద్రులసౌందర్యమును మించియుండును. ఆమె సదా సస్మితవదనయై విరాజిల్లును. ఆమె దన్తపంక్తి ఆత్యంత సుందరము. ఆమె శరత్కాలీయ కమలసమాన విశాల నేత్రములు కాటుకతో అలంకరింపబడి శోభించుచున్నవి. ఆమెయే శ్రీమహాలక్ష్మి, బీజస్వరూపిణి, పరమాద్య, సనాతని, పరమాత్మస్వరూపుడైన శ్రీకృష్ణుని ప్రాణములకే అధిష్ఠాత్రీదేవత; పరమాత్మప్రాప్తికొఱకు ఈమెనే స్తుతించి

పూజింపవలెను. శ్రీరాధాదేవి పరాశక్తి, బ్రహ్మస్వరూపిణి, నిర్లిప్త, నిత్యరూప, నిర్గుణ, విశ్వానురోధముచే ప్రకృతియైనది. ఆమె భక్తానుగ్రహమూర్తి, సత్యస్వరూపిణి, శుద్ధురాలు, పవిత్రురాలు, పతితపావని, ఉత్తమతీర్థములనే పావనమొనరింపగల తీర్థపావని, సత్కీర్తిసంపన్నురాలు, బ్రహ్మలకే విధాత్రి, మహాప్రియమహతీ, మహావిష్ణుజనని, రాసేశ్వరునకు స్వామిని, సుందరనాయిక, రసికేశ్వరి, అగ్నిశుద్ధవస్త్రపరిధాన, స్వేచ్ఛారూపిణి, సకలమంగళములకే ఆలయస్వరూపిణి.

సప్తగోపికలు శ్వేతచామరములను ధరించి నిత్యము ఆమె సేవలందు నిమగ్నులై యుందురు. నల్వురు ప్రియసఖులు ఆమె చరణకమల సేవలందు తత్పరులై యుందురు. అమూల్యరత్న నిర్మితాభూషణములు ఆమె శోభను వృద్ధియొనరించు చున్నవి. కర్ణములం దలంకరింపబడిన మనోహరకుండలములు గండస్థలమునే ఉద్భాసితమొనరించుచున్నవి. గరుత్మంతునిచంచుకమునే ఉపహాసమొనరింపగల ఆమెనాసికయందు గజముక్తామణి అలంకరింపబడియున్నది. ఆమెశరీరమంతయు కుంకుమకస్తూరీమిశ్రితసుస్నిగ్ధచందనచర్చితము. ఆమెకపోలము లత్యంతసుందరములు, అంగములు సుకోమలములు. రాధాదేవి మందగజగామిని, కమనీయురాలు, సుందరనాయిక, కామదేవునిఅస్త్రములకే విజయస్వరూపిణి, కామమనెడు వాసనలనే లయ మొనరింపగల శ్రేష్ఠదివ్యసౌందర్యరాశి. ఆమెహస్తములలో ప్రఫుల్లక్రీడాకమలమును, పారిజాతపుష్పములను, అమూల్యరత్నజటితస్వచ్ఛదర్పణమును ధరించి శోభించుచున్నది. నానాప్రకారరత్నజటితసింహాసనముపై శ్రీరాధాదేవి విరాజిల్లుచున్నది. శ్రీమహాలక్ష్మిద్వారా సదా సమర్చితమంగళరూపములైన శ్రీకృష్ణుచరణకమలములనునే తనహృదయములో ధ్యానించుచున్నది. మనోవాక్కాయకర్మలందు, స్వప్నజాగ్రత్సుషుప్తావస్థలయందు శ్రీకృష్ణప్రీతిని ప్రేమసౌభాగ్యములను నిత్యనూతనరూపములలో శ్రీరాధ సదా స్మరించుచుండును. ఆమె ప్రగాఢభావానురక్త, శుద్ధభక్తురాలు, పతివ్రత, ధన్యురాలు, మాన్యురాలు, గౌరవర్ణసంయుక్త, నిరంతరము శ్రీకృష్ణునివక్షఃస్థలముపై విరాజిల్లు శ్రీకృష్ణప్రియ. శ్రీరాధాదేవి శ్రీకృష్ణప్రియలందు, ప్రియభక్తులందు శ్రీకృష్ణున కత్యంత ప్రియురాలు. ఆమె ప్రియవాదిని, శ్రీకృష్ణవామాంగావిర్భూత. గుణమందు రూపమందు అభిన్నురాలైన రాధాదేవి గోలోకవాసిని, దేవాదిదేవి, అంకరి

...మైన విరాజమానురాలై యున్నశక్తి, గోపీశ్వరి, గుప్తస్వరూపిణి, సిద్ధిప్రదాయిని, సిద్ధిస్వరూపిణి. ఆమె ధ్యానముద్వారానైనను అసాధ్యురాలు, మహారాధ్యురాలు. సద్భక్తులద్వారా సదా వందితురాలు. వృషభానునందిని ...పమున పవిత్రభారతవర్షములో అవతరించిన శ్రీరాధాదేవి కివేవందన ములు. ధ్యానపరాయణులైన సమాధ్యవస్థలో ధ్యాననిష్ఠులై శ్రీరాధాదేవిని ధ్యానించు మానవులు ఈలోకములో జీవన్ముక్తులై పరలోకములో శ్రీకృష్ణుని పార్షదప్రవరులు కాగలరు.

తదనంతరము లోకవిధాతయైన బ్రహ్మ అసంఖ్యాకబ్రహ్మలకే జనని యైన పరమేశ్వరి యగు రాధయొక్క దివ్యసచ్చిదానందవిగ్రహమును దర్శించి పులకితగాత్రుడై సాశ్రుపూర్ణనయనములతో హస్తములను ముకుళించి ఇట్లు స్తుతింపనొడంగెను.

బ్రహ్మ పలికెను :

శ్లో॥ షష్టివర్ష సహస్రాణి దివ్యాని పరమేశ్వరి।
పుష్కరే చ తపస్తప్తం పుణ్యక్షేత్రే చ భారతే ॥ 99

త్వత్పాదపద్మ మధురమధులుబ్ధేన చేతసా।
మధూవ్రతేన లోభేన ప్రేరితేన మయా సతి ॥ 100

తథాఽపి న మయా లబ్ధం త్వత్పాదపద్మమీప్సితమ్।
న దృష్టమపి స్వప్నేఽపి జాతా వాగశరీరిణీ ॥ 101

వారాహే భారతే వర్షే పుణ్యే బృన్దావనే వనే।
సిద్ధాశ్రమే గణేశస్య పాదపద్మం చ ద్రక్ష్యసి ॥ 102

రాధామాధవయోర్దాస్యం కుతో విషయిణస్తవ।
నివర్తస్వ మహాభాగ పరమేతత్సుదుర్లభ ॥ 103

ఇతి శ్రుత్వా నివృత్తోఽహం తపసే భగ్నమానసః।
పరిపూర్ణం తదధునా వాంఛితం తపసః ఫలమ్ ॥ 104

పరమేశ్వరీ ! నా చిత్తము నీపాదపద్మ మధురమధువందు లుబ్ధమైనది. కావున ఆమధూవ్రత లోభముతో ప్రేరితుడనై నేను పుణ్యక్షేత్రమైన భారత వర్షములో నున్న పుష్కరతీర్థమునకుజని అఱువదివేల దివ్యవర్షములు నీదర్శన ప్రాప్తికై తపమొనరించితిని; అయినను నీ యభీష్ట చరణకమలముల దర్శనము

నాకు లభింపలేదు. స్వప్నములో నైనను నీదివ్యదర్శనము నాకు దుర్లభ మయ్యెను. ఆ సమయములో నన్నిట్లు ఆకాశవాణి ఆదేశించెను. "బ్రహ్మ దేవా! వరాహకల్పములో భారతవర్షములో విరాజిల్లు బృందావనములో నున్న సిద్ధాశ్రమమునకు నీవు గణేశ్వరుని చరణకమల దర్శనముకొఱకై పోయెదవు. అపుడే నీకు రాధా దర్శనము లభించును. నీవు విషయుడవు కావున నీకు రాధామాధవుల దాస్యసౌభాగ్య మెట్లుప్రాప్తింపగలదు? కావున మహాభాగా! నీవు తపమునుండి నివృత్తుడవై మఱలిపొమ్ము. ఎందువలననగ రాధామాధవుల దర్శనసౌభాగ్య మత్యంత దుర్లభము." ఇట్లాదేశము నాలకింపగనే నా ధ్యానము భగ్నముకాగ నేను తపమునుండి విరతుడనైనాను. నా యఖండ తపఃఫలస్వరూపమున నేడు నీ దివ్యసందర్శన సౌభాగ్యము లభించి నా మనోరథము పరిపూర్ణమైనది.

శ్రీ మహాదేవుడు పలికెను:

శ్లో॥ పద్మైః పద్మార్చితం పాదపద్మం యస్య సుదుర్లభమ్ ।
ధ్యాయన్తే ధ్యాననిష్ఠాశ్చ శశ్వద్బ్రహ్మాదయః సురాః ॥ 105

మునయో మనవశ్చైవ సిద్ధాః సన్తశ్చ యోగినః ।
ద్రష్టుం నైవ క్షమాః స్వప్నే భవతీతస్య వక్షసి ॥ 106

దేవీ! బ్రహ్మాదిసకలదేవతలు, మహర్షులు, మనువులు, సిద్ధులు, భక్తులు, పరమయోగులు శ్రీమహాలక్ష్మిద్వారా కమలపుష్పములచే సమార్చితమైన, అత్యంతదుర్లభమైన శ్రీహరిచరణారవిందములను నిత్యము ధ్యాననిష్ఠులై ధ్యానించినను స్వప్నమునందుకూడ దర్శింపలేకున్నారు. నీవు ఆదేవాదిదేవుని వక్షఃస్థలముపై విరాజిల్లుసౌభాగ్యసంపన్నురాలవు.

శ్రీ అనంతుడు పలికెను:-

శ్లో॥ వేదాశ్చ వేదమాతా చ పురాణాని చ సువ్రతే ।
అహం సరస్వతీ సన్తః స్తోతుం నాలం చ సంతతమ్ ॥ 107

అస్మాకం స్తవనేయస్య భూరిభక్తిం చ సుదుర్లభమ్ ।
తవైవ భర్త్సనే భీతాశ్చావయోరన్తరం హరేః ॥ 108

సువ్రతే! వేదములు, వేదమాత, పురాణములు, నేను (ఆదిశేషుడు), సరస్వతి, భక్తులు, నిన్ను స్తుతించుటలో సమర్థులము కాము.

నారదా! ఇట్లు ఆ ప్రదేశములో సమావేశమై యున్న సకల దేవతలు, దేవాంగనలు, మహర్షులు, మనువులు మొదలగువారందరు వినమ్రభావముతో శ్రీరాధాదేవి ననేకవిధముల స్తుతించిరి. ఇది గాంచి మేమే శ్రీకృష్ణున కత్యంతప్రియురాండ్ర మనిభావించిన రుక్మిణ్యాదిగాగల మహిళారత్నముల శిరములు లజ్జాభారముచే నతములైనవి. వారందరు తమవేడినిట్టూర్పులచే హస్తములందు గల రత్నదర్పణములను మలినమొనరించిరి. సత్యభామగర్వ మంతయు ఆక్షణములోనే నశించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ జన్మఖండమందు బ్రహ్మశేషాదులొనరించిన శ్రీరాధాస్తోత్రమను నూటయిరువదినాల్గవ అధ్యాయము సంపూర్ణము.



## నూటయిరువదియైదవ అధ్యాయము

### వసుదేవుడు రాజసూయయజ్ఞములో తనసర్వస్వమును దానమొనరించుట

నారదుడు పలికెను:-

ప్రభూ! గణేశ్వరుని యారాధనము, రాధాస్తోత్రాదులు సంపూర్ణమైన పిమ్మట సిద్ధక్షేత్రములో ఏమి జరిగెనో కృపతో వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

నారదా! గణేశ్వరారాధనా మహోత్సవములో సమ్మిళితులైన సకల దేవతలు, మహర్షులు, యోగీంద్రులు మొదలగువారందరు ఒక అక్షయవట వృక్షముక్రింద సమావేశమైరి. వారిలో విరాజమానులై యున్న బ్రహ్మశివ శేషాదులను సంబోధించి దేవకీవసుదేవులు పరమాదరపూర్వకముగ నిటు

ప్రశ్నించిరి. "మహాభాగులారా! మీరు దీనబాంధవులు; కావున మేమిప్పు రము ఈభవసాగరమును తరించుట కేదియుత్తమసాధనమో, తెలియజెప్ప వలసినదిగ ప్రార్థించుచున్నాము. మీరు భవసాగరమును దాటింపగల నౌకకు నావికులు. తీర్థములే పవిత్రజలమయములు కావు, మృచ్ఛిలామయవిగ్రహ ములే దేవతలు కారు. ఎన్ని యజ్ఞములు, పుణ్యములు, వ్రతోపవాసములు, తపములు, దానములు, విప్రదేవార్చనలు కలవో, అవియన్నియు చిరకాలములో కర్తను పావనమొనరింపగలవు; కాని పరమవైష్ణవజనులు తమదర్శనమాత్రము ననే దేహధారులను పవిత్రులుగ జేయగలరు. విష్ణుభక్తులపావనచరణకమల రజస్పర్శమాత్రముననే తత్కాలమే వసుంధర, తీర్థములు, సముద్రములు, పర్వతములు పవిత్రములు, కాగలవు. పాతకరూపము లైన ఇంధనములను వినాశమొనరింపగల పరమవైష్ణవుల దర్శనమును దేవత లైనను ఆకాంక్షింతురు.

శ్లో॥ సోఽజ్ఞానీ నైవ బుబుధే జ్ఞానం చ జ్ఞానినా సహ ।
పరమం స్వాదురూపం చ దధిదుగ్ధరసం యథా ॥

క్షీరములు, దధి, మధురసములు అత్యంతస్వాదిష్టములు [illegible] జ్ఞానము పరమానందదాయకము. ఆమహాజ్ఞానమును జ్ఞానులసాహ[illegible] కూడ పొందలేనివారు అజ్ఞానులు.

జ్ఞానులగురువులకు ఆచార్యుడు కేవలము భగవంతుడే. [illegible] శ్రీకృష్ణునకు తండ్రినో, అట్లే ఈదేవకి ఆయనకు తల్లి; కావున [illegible] లారా! నాతక్షణకర్తవ్యము నాదేశింపుడు."

వసుదేవుని విన్నపముల నాలకించి నాల్గువేదముల [illegible] ఆచార్యులకే ఆచార్యుడైన శంకరుడు మందహాసమొనరించి మహా[illegible] నిట్లు పల్కెను. "అహో! జ్ఞానులచెంతయుండుట [illegible] రించుటకు కారణము కాగలదు; గంగాజలములచే [illegible] గంగను అనాదరమొనరించి సిద్ధికొఱకు అన్యతీర్థములకు [illegible] తండ్రి నన్ను జ్ఞాన మర్థించుచున్నాడు. వసుదేవుడు [illegible] మహాజ్ఞానియైన కశ్యపునిఅంశసముద్భవుడు. ఈయనకు శ్రీ[illegible] యందు ఇంకను పుత్రబుద్ధి కలదు; కావుననే [illegible] శ్రీకృష్ణుని అంగసంభూతులమైన మమ్ము జ్ఞాన మర్థించుచున్నాడు[illegible]

తదనంతరము శ్రీమహాదేవుడు సర్వకారణకారణుడైన శ్రీకృష్ణపరమాత్మ దివ్యమహిమల ననేకవిధముల కీర్తించి తుదకు వసుదేవు నిట్లాదేశించెను. "యదువంశకులోద్భవా! వసుదేవా! సర్వేశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మయే సకలములకు మూలమని గ్రహింపుము; కావున రాజసూయయజ్ఞానుష్ఠానముచే యజ్ఞకారణుడు, యజ్ఞేశ్వరుడు నీకుమారుడైన శ్రీకృష్ణుని ఆరాధించి భవసాగరమును అవలీలగ తరింపుము." తదనంతరము వసుదేవుని తనసర్వస్వము శ్రీకృష్ణప్రీత్యార్థమై రాజసూయయజ్ఞములో దానమొనరింపుమని సనత్కుమారు డాదేశించెను. మునీశ్వరా! శివునియాదేశానుసారముగ వసుదేవుడు జితేంద్రియుడై సకలయజ్ఞసామగ్రిని సంగ్రహించి ఒకశుభముహూర్తములో రాజసూయయజ్ఞానుష్ఠానమొనరించెను. ఆయజ్ఞములో సాక్షాత్తుగ యజ్ఞేశ్వరుడు దక్షిణసహితముగ విరాజిల్లెను. కావున సకలదేవతలు ప్రత్యక్షముగ సాక్షాత్కరించి వసుదేవు డర్పించిన హవ్యములను స్వయముగ గ్రహించిరి. తదనంతరము వసుదేవుడు పూర్ణాహుతి నొనరించి శ్రీకృష్ణుని యాజ్ఞానుసారముగ తన సర్వస్వమును పురోహితుడైన సనత్కుమారునకు దక్షిణగ నొసంగెను. సనత్కుమారుని యాదేశానుసారముగ వసుదేవుడు బ్రాహ్మణులకు అఖండైశ్వర్యములను దక్షిణరూపముగ ప్రసాదించి అసంఖ్యాకసంతర్పణలను గావించి బ్రాహ్మణులశుభముఖములద్వారా సకలదేవతలను తృప్తులుగ నొనరించెను. తదనంతరము దేవతలు, మహర్షులు, దేవాంగనలు ఆప్రదేశములోనే సుఖపూర్వకముగ రాత్రిగడపి ప్రాతఃకాలముననే శ్రీకృష్ణునియనుజ్ఞ గైకొని తమతమనిజవాసముల కరిగిరి. సకలయాదవులు రుక్మిణీసహితముగ శ్రీకృష్ణుని తోడ్కొని ద్వారకానగరమును జేరిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు వసుదేవుడు రాజసూయయజ్ఞములో తనసర్వస్వము
దాన మొనరించుట యను నూట యిరువదియైదవ
అధ్యాయము సంపూర్ణము



# నూటయిరువదియారవ అధ్యాయము

## రాధామాధవుల పునఃసమాగమము

శ్రీ నారాయణ ఋషి పలికెను:-

నారదా! ఇట్లు మాధవుడు, యాదవులు, దేవతలు, మహర్షులు, మనువులు, దేవాంగనలు, అన్యాన్యమానవులు, సిద్ధాశ్రమములో శ్రీగణేశ్వరునిపూజించిరి. తదనంతరము శ్రీకృష్ణుడు కేవలము తనయొకయంశతో రుక్మిణీ మొదలగువారితో కలసి ద్వారకానగరమునకు మఱలిపోయెను. కాని స్వయముగ సాక్షాద్రూపమున సిద్ధాశ్రమములోనే ఆగి నందయశోదలతో గోకులవాసులైన గోపగోపికలతో ప్రేమపూర్వకముగ వార్తాలాపములాడెను. తుదకు యశోదానందుల నిట్లాదేశించెను, "తండ్రీ! మీరుకూడ వ్రజమునకు మఱలి పొండు. పరమశ్రేష్ఠయశస్యసంపన్నా! మాతాయశోదా! నీవుకూడ జనకునితో గలసి వ్రజము జేరి ఆయుఃశేషపర్యన్తము భోగముల ననుభవింపుము." ఇట్లు తలిదండ్రుల నాదేశించి శ్రీకృష్ణపరమాత్మ రాధికాశ్రమమునకు బయలు దేరెను. శ్రీకృష్ణుడు రాధికాశ్రమము జేరి దూరమునుండే సస్మితవదనారవిందయైన రాధికను వీక్షించెను. ఆమె నిత్యయౌవ్వనసంపన్న, ద్వాదశవర్షప్రాయపు ముద్దరాలు. ముత్యముల హారములు గళమున శోభించుచుండగా శ్రీరాధ రత్ననిర్మితసింహాసనముపై విరాజమానయై యున్నది. అసంఖ్యాక గోపికాసఖులు హస్తములలో దండములను ధరించి శ్రీరాధాదేవిని పరివేష్టించియుండిరి. రాధాదేవి తనను వీక్షించుచున్న శ్రీకృష్ణ పరమాత్మను గాంచెను. ఆయన పరమసౌందర్యసుందరబాలకవేషధారియై ముఖారవిందముపై చిరునవ్వులు చిందులాడగా అనంతకోటిమన్మథుల సౌందర్యమునే తిరస్కరించుచున్నాడు. ఆయన శరీరకాంతి నూతనజలధరమువలె శ్యామలవర్ణము ఆయన పీతాంబరధారి. భగవంతునియవయవములన్నియు చందనచర్చితములు. రత్ననిర్మితాభూషణములు ఆయనకు శోభను సమకూర్చుచున్నవి. శ్రీకృష్ణుడు మాలతీమాలాభూషితుడు మయూరపింఛాలంకృత మకుటధారి, ప్రసన్నమందస్మితముఖారవిందుడు, సాక్షాత్తుగ భక్తానుగ్రహమూర్తి. పరమాత్మ ఒకహస్తములో మురళిని, రెండవహస్తములో [illegible] దర్పణమును ధరించి శ్రీరాధాదేవికి దివ్యసాక్షాత్కారమొసంగెను. [illegible]

ఘని గాంచగనే శ్రీరాధ సింహాసనమునుండి లేచి పరమభక్తిపూర్వకముగ ఆపరమేశ్వరునకు సాదరప్రణామములర్పించి ఆహ్వానించి అనేకవిధముల స్తుతింప దొడంగెను.

శ్రీ రా ధా దే వి ప లి కె ను :-

శ్లో॥ అద్య మే సఫలం జన్మ జీవితం చ సుజీవితమ్ ।
యద్దృష్ట్వా ముఖచన్ద్రం తే సుస్నిగ్ధం లోచనం మనః ॥ 15
పంచప్రాణాశ్చ స్నిగ్ధాశ్చ పరమాత్మా చ సుప్రియః ।
ఉభయోర్హర్షబీజం చ దుర్లభం బన్ధుదర్శనమ్ ॥ 16
శోకార్ణవే నిమగ్నోఽహం ప్రదగ్ధా విరహానలైః ।
త్వద్దృష్ట్యాఽమృతవృష్ట్యా చ సుసిక్తాఽద్య సుశీతలా ॥ 17
శివా శివప్రదాఽహం చ శివబీజా త్వయా సహ ।
శివస్వరూపా నిశ్చేష్టాఽప్యదృశ్యా చ త్వయా వినా ॥ 18
త్వయి తిష్ఠతి దేహే చ దేహీ శ్రీమాన్ శుచిః స్వయమ్ ।
సర్వశక్తిస్వరూపా చ శివరూపాగతే త్వయి ॥ 19
స్త్రీపుంసోర్విరహో నాథ సామాన్యశ్చ సుదారుణః ।
యాన్త్యేవ శక్తిభిః ప్రాణా విచ్ఛేదాత్పరమాత్మనః ॥ 20

నాథా! నీముఖచంద్రమును దర్శించుటచే నేడు నాజన్మ సార్థకమైనది, జీవనము ధన్యజీవనమైనది. నానయనములు, మనస్సు పరమప్రసన్నములైనవి, నాపంచప్రాణములు స్నేహార్ద్రమై ఆత్మ అత్యంతహర్ష సమన్వితమైనది. దుర్లభ బంధుదర్శనము ఇర్వురకు (ద్రష్టకు దృశ్యమునకు) హర్షకారణము కాగలదు. నేను విరహాగ్నిచే జ్వలించుచు శోకసాగరములో నిమగ్నురాలనై యుంటిని. నాథా! నీవు నీపీయూషవర్షిణీ దృక్కులచే నన్ను బాగుగ అభిషేకింపుము. నీయవలోకన మాత్రముననే నాసమస్త తాపములు నశింపగలవు. నీతో నున్నంతవఱకే నేను శివను, శివప్రదను, శివబీజమును, శివస్వరూపను; కాని నీనుండి వియుక్తనైన నేను అదృశ్యురాలను, నాచేష్టలన్నియు నశించును. పరమాత్మా! నీవు దేహములో నున్నంతవఱకే దేహము శోభాసంపన్నమై, పవిత్రమై సర్వశక్తి స్వరూపమున నుండును; నీవు వీడిపోయిన ఆదేహమే శవ మగును. నాథా! నీవే నాయాత్మ, నేనే నీదేహము. స్త్రీపురుష సామాన్య

వియోగమే అత్యంతదారుణము, అయినచో పరమాత్మ వియోగము సంభవించిన పంచప్రాణములు సకలశక్తుల సహితముగ దేహమును వీడిపోవును.

ఇట్లు ప్రార్థించి శ్రీరాధాదేవి శ్రీకృష్ణపరమాత్మను సాదరముగ రత్నసింహాసనాధీశునిగ జేసి ఆయన పాదపద్మముల కడ చోటుచేసికొని అనేకవిధముల ఆదివ్య చలణములను పూజించెను. తదనంతరము అయ్యాదిదంపతులు సానందముగ అత్యంత శ్రేష్ఠమైన రత్నసింహాసనము నలంకరించిరి. గోపికలు వారిని పరివేష్టించి వింజమరలు వీచుచు సేవింప దొడంగిరి. చందన యను గోపిక శ్రీహరి శ్రీఅంగములకు సుగంధిత చందనానులేపన మొనరించెను. రత్నమాల గోపేశ్వరుని గళమును రత్నమాలలతో అలంకరించెను. పద్మావతి శ్రీమహాలక్ష్మిద్వారా కమలపుష్పములచే సమార్చితములైన శ్రీహరి దివ్యచరణకమలములను స్వచ్ఛజలములతో ప్రక్షాళన మొనరించి, దూర్వాపుష్పచందయుక్త అర్ఘ్యము నర్పించెను. మాలతి గోపాలుని శిరమున మాలతీమాలలు నలంకరించెను. పార్వతి నాధునకు చంపాపుష్పములు సమర్పించెను, హర్షమగ్నయై జగన్నాథునకు పారిజాత పుష్పములను, సువాశిత జలములను, కర్పూరయుక్త సుగంధిత తాంబూలాదులను నివేదించెను. గోపికదంబమాల పరమాత్మను కదంబపుష్పమాలలచే అలంకరించి శ్రీహరికి ప్రఫుల్లక్రీడా కమలమును, అమూల్యరత్న దర్పణమును సమర్పించెను. సుకోమలాకమల పూర్వకాలములో వరుణప్రదత్తమైన రెండుదివ్య వస్త్రములను సమర్పించెను. సుందరీ వధువు శ్రీహరికి అమృతముతో పరిపూర్ణమైన రత్ననిర్మిత పాత్ర నందించెను. సుధాముఖి సుధను గొనితెచ్చెను. చిత్రలేఖ ప్రఫుల్లితమాలతీ పుష్పములచే అలంకరింపబడిన చందనచర్చిత పుష్పశయ్యను సిద్ధమొనరించెను. దివ్యశయ్యను సిద్ధమొనరించిన ఆ మహాహర్మ్యనిర్మాణము బహుమూల్యరత్నములచే నిర్మింపబడెను. శ్రేష్ఠమణులు, ముత్యములు, మాణిక్యములు, వజ్రములు ఆభవనశోభను వృద్ధిపొందించుచున్నవి. కస్తూరీకుంకుమయుక్త వాయువులు ఆభవనపరిసరప్రాంతములను సుగంధిత మొనరించుచుండెను. జ్వలించుచున్న వందలకొలది రత్నదీపములు ఆభవనమును ఉద్దీప్త మొనరించుచున్నవి. సుందరశయ్యనేర్పాటుచేసిన ఆభవనములో గోపికలు సుగంధితధూపములను వెలిగించిరి. అసంఖ్యాకులైన గోపికాసఖులు రాధామాధవులను దివ్యశయ్యపై కూర్చుండబెట్టి మందహాసమొనరించుచు వెడలిపోయిరి.

ఆయేకాంతములో మనస్సు నాకర్షింపగల పరమరమణీయశయ్యపై రాధామాధవులు దీర్ఘవియోగానంతరము ఆసీనులైరి. శ్రీకృష్ణపరమాత్మగళమును శ్రీరాధాదేవి దివ్యపుష్పమాలికలచే అలంకరించి, సువాశితతాంబూల మొసంగెను. తదనంతర మామె శ్యామసుందరునివక్షఃస్థలముపై కస్తూరీకుంకుమయుక్తచందనానులేపన మొనరించెను. శ్రీహరిశిఖలో సుందరచంపాపుష్పముల నలంకరించి, ఆయవహస్తమునకు సహస్రదళయుక్తక్రీడాకమల మందించి, మురళిని బలవంతముగ గ్రహించెను. శ్రీరాధ యొనరించు దివ్యలీలలను దర్శించి అఖండశాంతమూర్తి అత్యంతకమనీయుడు, నాయికామనోహారి యైన శ్రీకృష్ణపరమాత్మ మందహాసముచేయ దొడంగెను. ప్రియతము డగు శ్రీకృష్ణుని గాంచి ఏకాంతములో శ్రీరాధాదేవిమధురవచనముల నిట్లు పల్కెను. "నాథా! నీవు స్వయముగ మంగళాలయుడవు, సంపూర్ణమంగళబీజుడవు, మంగళస్వరూపుడవు, సకలకుశలమంగళప్రదాతవు. నిన్ను కుశలప్రశ్న వేయుట నిష్ప్రయోజనమైనను లౌకికవ్యవహారానుసారముగ కుశలప్రశ్న వేయుట సమయానుసారముగ ఉచితము. కావున రుక్మిణీకాంతా! సత్యభామాప్రాణపతీ! నీవు కుశలమేనా?"

తదనంతరము శ్రీరాధ శ్రీకృష్ణుని, ఆయన స్వరూపావతారలీలారహస్యములను తెలుపవలసినదిగ ప్రార్థించెను. అందులకు శ్రీకృష్ణపరమాత్మ అత్యంతనిగూఢమైన ఆరహస్యము నిట్లుపదేశింపనారంభించెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను ;-

శ్లో॥ శృణు రాధే ప్రవక్ష్యామి జ్ఞానమాధ్యాత్మికం పరమ్ ।
యచ్ఛ్రుత్వా పాలికో మూర్ఖః సద్యో భవతి పణ్డితః ॥ 82

జాత్యాఽహం జగతాం స్వామీ కిం రుక్మిణ్యాదియోషితమ్ ।
కార్యకారణరూపోఽహం వ్యక్తో రాధే పృథక్ పృథక్ ॥ 83

ఏకత్మాఽహం చ విశ్వేషాం జాత్యా జ్యోతిర్మయః స్వయమ్ ।
సర్వప్రాణిషు వ్యాప్త్యా చాప్యాబ్రహ్మాదితృణాదిషు ॥ 84

జాత్యాఽహం కృష్ణరూపశ్చ పరిపూర్ణతమః స్వయమ్ ।
గోలోకే గోకులే పుణ్యే క్షేత్రే బృన్దావనే వనే ॥ 85

ద్విభుజో గోపవేషశ్చ స్వయం రాధాపతిః శిశుః ।
గోపాలైర్గోపికాభిశ్చ సహితః కామధేనుభిః ॥ 86

శ్లో॥ చతుర్భుజోఽహం వైకుణ్ఠే ద్విధారూపః సనాతనః ।
లక్ష్మీసరస్వతీకాన్తః సతతం శాన్తవిగ్రహః ॥ 87

యన్మానసీ సిన్ధుకన్యా మర్త్యలక్ష్మీ పతీర్భువి ।
శ్వేతద్వీపే చ క్షీరోదే తత్రాపి చ చతుర్భుజః ॥ 88

రాధా! ఏజ్ఞానము నాలకించిన మూర్ఖుడైనవాడుకూడ మహాపండితుడు కాగలడో, సర్వశ్రేష్ఠమైన అయ్యాధ్యాత్మికజ్ఞానమును వర్ణించెద నవధరింపుము. రాధా! నేను స్వాభావికముగనే సకలలోకములకు స్వామిని; ఐనచో రుక్మిణీమున్నగు మహిళలెంత? నేనే కార్యరూపమున, కారణరూపమున విడి విడిగా వ్యక్తుడ నయ్యెదను. నేనే స్వయం జోతిర్మయుడను, సమస్తవిశ్వములకు ఏకమాత్రాత్మను, తృణము మొదలు బ్రహ్మవఱకుగల సంపూర్ణప్రాణులందు వ్యాపించియున్న పరమాత్మను. గోలోకములో నేనే స్వయముగ పరిపూర్ణుడైన శ్రీకృష్ణరూపముతో విరాజిల్లెదను, రమణీయ పుణ్యక్షేత్రమైన గోకుల బృందావనములో నేనే రాధాపతినై విరాజిల్లుచున్నాను. ఈసమయమున ద్విభుజుడనై, గోపవేషధారినై, గోపాల బాలకులతో, గోపికలతో, గోవులతో క్రీడించుచున్నాను. వైకుంఠములో నేనే చతుర్భుజరూపమున విరాజిల్లెదను. అచ్చట లక్ష్మీసరస్వతులను ప్రియతమలుగ నొనరించుకొని సదాశాంతరూపమున నివసించెదను. ఇట్లు సనాతన పరమేశ్వరుడనైన నేనే రెండురూపముల విభక్తుడనైనాను. భూతలముపై, శ్వేతద్వీపములో, క్షీరసాగరములో మానసి, సింధు కన్య, మర్త్యలక్ష్ములకు ఏపతులైతే కలరో వారు కూడ నేనే, నేనచట చతుర్భుజ రూపముతో విరాజిల్లుచున్నాను.

శ్లో॥ అహం నారాయణర్షిశ్చ నరో ధర్మః సనాతనః ।
ధర్మవక్తా చ ధర్మిష్ఠో ధర్మప్రవర్తకః ॥ 386

శాన్తిర్లక్ష్మీస్వరూపా చ ధర్మిష్ఠా చ పతివ్రతా ।
అత్ర తస్యాః పతిరహం పుణ్యక్షేత్రే చ భారతే ॥ 90

సిద్ధేశః సిద్ధిదః సాక్షాత్కపిలోఽహం సనాతనః ।
నానారూపధరోఽహం చ వ్యక్తిభేదేన సున్దరి ॥ 91

అహం చతుర్భుజః శశ్వద్ద్వారవత్యాంరుక్మిణీపతిః ।
అహం క్షీరోదశాయీ చ సత్యభామా గృహే శుభే ॥ 92

శ్లో॥ అన్యాసాం మన్దిరేఽహం చ కాయవ్యూహో పృథక్పృథక్ ।
అహం నారాయణర్షిశ్చ ఫల్గునస్యాస్య సారథిః ॥ 93
స సర్షిర్ధర్మపుత్రో మదంశో బలవాన్భువి ।
తపసాఽఽరాధిత స్తేన సారథ్యేఽహం చ పుష్కరే ॥ 94

నేనే స్వయముగ నారాయణఋషిని, ధర్మవక్తుడైన ధర్మిష్ఠుడైన, ధరమార్గ ప్రవర్తకుడైన, సనాతన ధర్మమైన నరుడను నేనే. ధర్మిష్ఠురాలు పతివ్రతయు, శాన్తస్వరూపిణియు నగు లక్ష్మీదేవికి ఈపుణ్యక్షేత్రమైన భారత వర్షములో నేనే భర్తను. నేనే సిద్ధేశ్వరుడైన, సకలసిద్ధి ప్రదాతయైన కపిల మహర్షిని. సుందరీ ఇట్లు నేనే వ్యక్తిభేదములతో నానారూపములను ధరించి యున్నాను. చతుర్భుజరూపధారినైన నేనే సదా ద్వారకలో రుక్మిణీస్వామినై, సత్యభామ శుభ భవనములో నివసించుచు, అన్యాన్యరాణుల గృహములలో వేరువేరు రూపముల క్రీడించుచు క్షీరసాగరములో శయనించియున్నాను. నారాయణఋషినైన నేనే అర్జునునకు సారథినైనాను. ఆనరుడు ధర్మదేవుని కుమారుడు, మహాబలవంతుడు, మదంశచే భూమిపై అవతరించిన నరఋషి పుంగవుడు. అర్జునుడు పుష్కరక్షేత్రములో నాకై ఘోరతపమాచరించెను. అందులకు నేను అత్యంత ప్రసన్నుడనై, పార్థునకు సారథినై సారథ్యకార్యము మొనరించితిని.

శ్లో॥ యథా త్వం రాధికా దేవీ గోలోకే గోకులే తథా ।
వైకుణ్ఠే చ మహాలక్ష్మీర్భవతీ చ సరస్వతీ 95
భవతీ మర్త్యలక్ష్మీశ్చ క్షీరోదశాయినః ప్రియా ।
ధర్మపుత్రవధూ స్త్వం చ శాన్తిర్లక్ష్మీస్వరూపిణీ ॥ 96
కపిలస్య ప్రియా కాన్తా భారతే భవతీ సతీ ।
త్వం సీతా మిథిలాయాం చ త్వచ్ఛాయా ద్రౌపదీ సతీ ॥ 97
ద్వారవత్యాం మహాలక్ష్మీర్భవతీ రుక్మిణీ సతీ ।
పంచానాం పాణ్డవానాం చ భవతీ కలయా ప్రియా ॥ 98
రావణేన హృతా త్వం చ స్వం చ రామస్య కామినీ ।
నానారూపా యథా త్వం చ చ్ఛాయయా కలయా సతీ ॥ 99
నానారూప స్తథాఽహం చ స్వాంశేన కలయా తథా ।
పరిపూర్ణతమోఽహం చ పరమాత్మా పరాత్పరః ॥ 100

శ్లో॥ ఇతి తే కథితం సర్వమాధ్యాత్మికమిదం సతి ।
రాధే సర్వాపరాధం మే క్షమస్వ పరమేశ్వరీ ॥ 101

రాధా నీ వెట్లు గోలోకములో రాధికాదేవివో, అట్లే గోకులములో రాధవు. నీవే వైకుంఠములో మహాలక్ష్మివి, సరస్వతివి. క్షీరసాగరశయనునకు ప్రియతమ మైన మర్త్యలక్ష్మివి కూడ నీవే. ధర్మదేవుని కోడలు, లక్ష్మి స్వరూపిణి శాంతీరూపిణిగా నీవే యున్నావు. భారతవర్షములో కపిల మహర్షి ప్రియపత్నియగు భారతివి నీవే. మిథిలానగరములో సీతానామమున విఖ్యాతురాలవైనావు. ద్రౌపది నీఛాయయే. ద్వారకలో మహాలక్ష్మి యంశ మైన రుక్మిణీరూపమున నీవే విరాజిల్లుచున్నావు. పంచపాండవుల పత్నియగు ద్రౌపది నీకళాసంభూయే. నీవే శ్రీరాముని సహధర్మచారిణివైన సీతవు; నీఛాయాస్వరూపమునే రావణుడు అపహరించెను. సతీ! నీ వెట్లు నీఛాయా రూపముల, కళారూపముల నానారూపములలో ప్రాదుర్భవించితివో, అట్లే నేను నాయంశలచే, నాకళలచే అనేకరూపముల వ్యక్తుడనైనాను. నేనే పరిపూర్ణుడనైన, పరాత్పరుడనైన పరమాత్మను. ఇట్లు నేను నీకు ఈయాధ్యాత్మిక జ్ఞానము నుపదేశించితిని పరమేశ్వరీ ఇక నీవు నాసర్వాపరాధములను క్షమించి నన్ను అనుగ్రహింపుము.

శ్రీకృష్ణుని కథనము నాలకించి రాధికాసహితలగు సకలగోపికలు అత్యంతహర్ష హృదయాంతరంగలైరి. వారందరు పరమేశ్వరుడైన శ్రీకృష్ణునకు అనేక ప్రణామము లర్పించిరి. తదనంతరము శ్రీ రాధాకృష్ణులు గోపూజ యొనరించిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు రాధామాధవుల పునఃసమాగమమను
నూటయిరువదియారవ అధ్యాయము
సంపూర్ణము.

# నూటయిరువదియేడవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు వ్రజమునకు మరలివచ్చుట

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! తదనంతర మాదివ్యదంపతులు దివ్యశృంగారక్రీడల నొనరించిరి. రాధ శ్రీకృష్ణునితో నిట్లుపల్కెను. "మహాభాగా! ఇక పుణ్యమయబృందావనములో నున్న రాసమండలమునకు బయలుదేరుము. అచట నేను నీతో జలములలో, స్థలములపై క్రీడింపగలను. తదనంతరము మలయపర్వతముపై మనమిర్వురము విహారమొనరించి సుందరమణిమందిరమును ప్రవేశింపవలయును. ఇవిగాక అనేక రహస్యమయ స్థానములలో మనమిర్వురము విహరింపవలెను". ఇట్లు రాధామాధవులు పరస్పర వార్తాలాపములతో ఆమంగళమయ మగురాత్రినిగడిపిరి. అరుణోదయమైనను రాధ శ్రీకృష్ణుని వీడుట కంగీకరింపలేదు. అపుడు శ్రీకృష్ణుడు యుక్తిపూర్వకముగ ప్రేమభరితవచనములతో ఆమెను సమాధానపరచెను. తదుపరి శరత్కాలప్రఫుల్ల కమలసదృశ నేత్ర యుక్తుడైన శ్రీహరి రాధాదిగోపికలతో ఒకదివ్యరథ మధిరోహించి బృందావనము జేరెను. ఆప్రదేశములో ఆయన యథేచ్ఛగా జలస్థలవిహారము లొనరించెను.

తదనంతరము రాధామాధవులు సుందరముగ నలంకరించుకొని, వనములలోను ఉపవనములైన విశ్వందక, సురసన, మాహేంద్ర, నందనాది వనములలోను, సుమేరు శిఖరములపైన, రమణీయ గంధమాధన పర్వతముపైన, అన్యాన్యసుందర పర్వతములపైన, గుహలలోను, వనములలోను, అత్యంత గుప్తముగ పుష్పోద్యానవనములలోను విహరించి ప్రత్యేక నదులలో, నదీజలములలో, సముద్రతిలములో జలక్రీడల నొనరించిరి. పారిజాతవృక్ష వనములో, పుష్పభద్ర, సుభద్ర నారాయణ సరోవరములలో, పవనుడు దేవతలు నివసించు మలయపర్వతముపై, త్రికూటముపై, భద్రకూటముపై, పంచకూటముపై, సుకూటముపై, దేవతలు విహరించు కమనీయ భూమిపై, ప్రత్యేక సముద్రములపై మనోహరద్వీపములలో, శ్రేష్ట స్వర్గలోకములలో, పుణ్యమయ రుచిరచంద్రసరోవరములో, మునుల యాశ్రమముల చెంత, రాధామాధవులు విహరించుచు అనేకదివ్య క్రీడల నొనరించిరి. తదనంతరము శ్రీకృష్ణుడు రాధను తోడ్కొని జంబుద్వీపములో నున్న ద్వారకానగరమున

కేతెంచి, తదుపరి రైవతపర్వతమును జేరిరి. తదనంతరము వారిర్వురు గోగోప సమూహములతో వ్యాప్తమైన గోకులము జేరిరి. గోకులములో భాండీరవట వృక్షమును దర్శించి పుణ్యమయబృందావనమును ప్రవేశించిరి.

శ్రీకృష్ణునియాగమనము నాలకించి యశోదానందులు, గోపవృద్ధులు. గోపికలు, గోపకుమారులు అత్యంతప్రసన్నతతో హాశ్రుపూర్ణలోచనులైరి. తదుపరి వారందరు గజరాజును, నటుని, నర్తకిని, పతీపుత్రవతి యగు బ్రాహ్మణ స్త్రీని, బ్రాహ్మణులను ముందుంచుకొని దేవగణములు అగ్నిదేవునకు స్వాగతముపల్కినట్లు శ్రీకృష్ణునకు స్వాగతము పల్కిరి. అపుడు మాధవుడు తలిదండ్రులైన యశోదానందులను గాంచి రాధతోగూడ బాలరూపమును ధరించి వారినిసమీపించెను. కరుణామయమూర్తియగు నామధుసూదనుడు చిరునవ్వులు చిందించుచు తల్లియొడిలో చేరెను. అపుడు యశోదానందులు శ్రీకృష్ణుని హృదయమునకు హత్తుకొని పరమాత్మదివ్యముఖారవిందమును చుంబించుచు అనన్యవాత్సల్యభక్తిసమన్వితులై ఆపరబ్రహ్మమును ఆనంద బాష్పధారలచే అభిషేకమొనరించిరి. బాలగోపాలుడు యశోదస్తన్యపానమొన రించి ఆమెకు అఖండతృప్తి నొసంగెను. ఏరూపముతో వ్రజమును వీడి మధురకు జనెనో శ్రీకృష్ణుని యారూపములోనే సకలవ్రజవాసులు దర్శించిరి. ఆయన హస్తములలో మురళి శోభించెను. ఆయన రత్నాభరణవిభూషితుడై ఏకాదశవర్షకిశోరవయస్కుడై, పీతాంబరధారియై శిఖలో మయూరపిచ్ఛమును ధరించి మాలతీమాలలతో అలంకృతుడై, కస్తూరీతిలకమును ధరించి ఆవ్రజ వాసులకు దివ్యదర్శన మొసంగెను. తదనంతరము యశోద రాధామాధవులను అంతఃపురములోనికి తోడ్కొనిపోయి మంగళకార్యములను సంపన్న మొనరించెను. అసంఖ్యాకులైన బ్రాహ్మణులకు సంతర్పణ మొనరించెను. గోపికల మాహాత్మ్యమును తెలిసికొన్న యశోదానందులు రాధాసహితులగు సకలగోపికలను మహర్షులను పూజించి నటుల పూజించి ధన్యులైరి. తదనంతరము వారు పరమానందమగ్నులై బ్రాహ్మణులకు, యాచకులకు అసంఖ్యాకమణులను, రత్నములను, సువర్ణములను, మాణిక్యములను, వజ్రములను, గోరత్న

ములను, అశ్వరత్నములను, ధాన్యములను, సుపక్వభూములను, వస్త్రములను దానమొనరించిరి. ఇట్లు వారు మంగళవాద్యములను యోగించుచు అఖండ హరినామసంకీర్తనముచేసి దేవతల నర్చించి మహోత్సవ మొనరించిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు శ్రీకృష్ణుడు వ్రజమునకు మఱలి వచ్చుట యను
నూటఇరువదియేడవ అధ్యాయము
సంపూర్ణము.

## నూటయిరువదియెనిమిదవ అధ్యాయము

### -: రాధాగోపగోపికలు గోలోకము జేరుట :-

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదా! ఏప్రదేశములో మొదట బ్రాహ్మణపత్నులు శ్రీకృష్ణునకు అన్నము నర్పించిరో, ఆభాండీరవటవృక్షఛాయలో శ్రీకృష్ణపరమాత్మ విరాజమానుడై సమస్తగోకులవాసులను తన సమక్షములో సమావేశపరచెను. శ్రీహరివామపార్శ్వమున శ్రీరాధాదేవి, దక్షిణపార్శ్వమున యశోదానందాదులు, నందుని దక్షిణపార్శ్వమున వృషభానుడు, వృషభానుని వామపార్శ్వమున కళావతి మొదలగు నితరగోపీగోపకులు, బాంధవులు, మిత్రులు ఉచితాసనములపై ఆసీనులైరి. ఆసభలో గోవిందుడు నందుని యుద్దేశించి ఇట్లు పల్కెను.

శ్రీ కృష్ణుడు పలికెను:-

తండ్రీ! సత్యములైన, పరమార్థప్రదాయకములైన, పరలోకములో సుఖప్రదాయకములైన వచనముల బల్కెద నాలకింపుము.

శ్లో॥ ఆబ్రహ్మస్తంబపర్యన్తం భ్రమం సర్వం నిశామయ।
విద్యుద్దీప్తిర్జలే రేఖా యథా తోయస్య బుద్బుదమ్ ॥ 6

బ్రహ్మమొదలు కీటకపర్యంతము అంతయు విద్యుల్లతవోలే జలములపై గీచిన రేఖవోలె, నీటిబుడగలవోలె భ్రమాత్మకము లని గ్రహింపుము.

నేను మథురలో నీకు సర్వస్వమును ఉపదేశించితిని. రాధ కదళీవనములో యశోదకు ఈదివ్యజ్ఞానమునే ప్రసాదించెను. మే ముపదేశించిన ఆపరమసత్యమే భ్రమరూపమైన అంధకారమును నివారింపగల ప్రజ్వలితదీపము. కావున మీరు మాయను వీడి ఆపరమపదమును స్మరింపుడు. ఆపదము జన్మమృత్యు జరావ్యాధిరహితము, మహోహర్ష ప్రదాయకము. శోకసంతాపరహితము, కర్మమూలములకు ఉచ్ఛేదకము, పరబ్రహ్మమైన, సనాతనుడనైన, భగవంతుడనైన నన్నేకాగ్రతతో ధ్యానించి అవలీలగ ఆపరమపదము జేరుడు. ఇక కర్మమూలనికృంతనమైన కలియుగము రాబోవుచున్నది, కావున మీరు శీఘ్రమే సకలగోకులవాసులతో కలసి గోలోకము జేరుడు. తండ్రీ! కలియుగ మత్యంతపాపభూయిష్ఠము. తండ్రీ! కలియుగములో స్త్రీపురుషనియమములు లుప్తములగును, విప్రులు సంధ్యాదుల నొనరింపక, యజ్ఞోపవీతరహితులై చరింతురు. ద్విజాతీయులు యజ్ఞసూత్రమునుగాని, తిలకమునుగాని ధరింపరు. జనులందరు శిశ్నోదరపరాయణులై ధర్మకార్యములను విసర్జింతురు. యజ్ఞములు, వ్రతములు, తపములు క్రమముగ అదృశ్యమగును. కేదారకన్యశాపవశమున ధర్మము క్షీణించును. స్త్రీలు స్వచ్ఛందగామినులై భర్తను వశమందుంచుకొనగలరు. వారు అహర్నిశము పతులను నిందించుచు దుర్భాషలాడెదరు. కుటుంబమునకు నాయకత్వము స్త్రీలేవహింపగలరు. వారే భర్తలకు స్వాములై ప్రవర్తింపగలరు. కలికాలములో స్త్రీపురుషులు జారత్వముపై మక్కువ కల్గియుందురు. జారపురుషుని స్త్రీ నూర్గురుపుత్రులకంటె అధికముగ ప్రేమింపగలదు. స్త్రీలు తమశృంగారములలో నిమగ్నులై సతతము జారసేవాపరాయణులు కాగలరు. పురుషులపరిస్థితికూడ ఈవిధముగనే యుండును. అతిథిసేవ, శ్రీహరియర్చనము, దైవారాధనము, తలిదండ్రులయెడల భక్తి గౌరవము అంతరింపగలవు. ప్రజలు విష్ణువైష్ణవద్వేషులై చరించెదరు. చాతుర్వర్ణ్యముల వారు వామమంత్రోపాసనమొనరించి శక్తికొఱకై సదా ప్రయత్నము లొనరింపగలరు. సాలగ్రామమును, తులసిని, కుశలను, గంగోదకములను గౌరవింపక మానవులు ధూర్తులై మ్లేచ్ఛులవలె వ్యవహరించెదరు. కారణములకే కారణు

డనైన, సర్వములకు బీజస్వరూపుడనైన, సుఖప్రదాతనైన, మోక్షప్రదాతనైన సర్వసంపత్ప్రదాతనైన నన్ను త్యజించి మానవులు మూర్ఖులై సదా క్షుద్రసంప దలనే సేవించుచు విషయములకు బానిసలై వర్తించెదరు. సనాతనియగు విష్ణు మాయారూపైన మహామాయ, నాకు దేహధారులకు నడుమ తెరవలె నిలువబడి జీవులను వంచించును. నాయారాధన అవనిపై నున్నంతవరకే గంగ, తులసి, విష్ణుభక్తులు, పురాణములు, స్వల్పముగ ఈకలియుగములో విరాజిల్లగలరు. నందరాజా! కలియుగప్రభావము వృద్ధిచెంది నా దివ్యగుణనామసంకీర్తనము లుప్తము కాగలదు. వర్ణాశ్రమధర్మములను పరిత్యజించి నరులు ఏకవర్ణులై కిరాత కులవలె శఠులై ప్రవర్తింతురు. తల్లిదండ్రులసేవను, గురుజనులసేవలను, దేవ విప్రసేవలను, అతిథిసేవలను నరులు విసర్జింతురు. తండ్రీ! కలియుగములో పృథ్వి సస్యహీనమగును, పంటలు పండవు, సకాలములో వర్షములు వర్షింపవు. జలా శయములు జలహీనములు కాగలవు, వృక్షములు ఫలహీనములు కాగలవు, బ్రాహ్మణులు దైవారాధనహీనులు, వేదహీనులు నయ్యెదరు. పరిపాలకులు బలహీనులయ్యెదరు. ప్రజలు జాతిహీనులయ్యెదరు. మ్లేచ్ఛులే పరిపాలకులై వసుంధరను పాలింపగలరు. పుత్రులు తలిదండ్రులను భృత్యులవలె కష్టముల పాలుజేయగలరు, శిష్యులు ఆచార్యుల నల్లే హింసింపగలరు, భార్యలు భర్తలను నిర్లక్ష్యముచేసి అహంకారముతో అజ్ఞానులై ప్రవర్తించెదరు. పుణ్యాత్ములందరు కలియుగాంతమునకు పరిపూర్ణముగ అదృశ్యులయ్యెదరు. కేవలము పాపాత్ములే శేషింపగలరు. కలియుగాంతములో ప్రచండసూర్యుల తాపముచే, అఖండవర్షధారలచే, జీవరాశియంతయు నశించును.

శ్లో॥ హే వైశ్యేన్ద్ర ప్రతికలౌ న నశ్యతి వసున్ధరా ।
పునః సృష్టిః భవేన్నిత్యం సత్యబీజం నిరన్తరమ్ ॥ 36

హేవైశ్యేంద్రా! ప్రతికలియుగాంతమున వసుంధర నశింపదు. మరల ఆమెపై సృష్టి ఉద్భవించి, సర్వబీజమైన సత్యము మరల విరాజిల్లి నిరంతరము కొనసాగగలదు.

ఆసమయముననే ఒకదివ్యవిమానము దివినుండిభువికి అరుదెంచెను. ఆవిమానశోభ వర్ణనాతీతము. నారదా! రాధ, కళావతి అయోనిజలు, వారేకాదు గోకులవాసినులైన సకలగోపికలు అయోనిజలే యని గ్రహింపుము. గోపికలరూపములలో జగన్నాథుని ఆరాధించుటకు స్వయముగ శ్రుతులే

ఆవిర్భవించినవి. శ్రీకృష్ణుని యాజ్ఞానుసారముగ ఆదివ్యవిమానము నధిరోహించి రాధాసహితముగ సకలగోకులవాసులు గోలోక మహాప్రస్థానమును కొనసాగించిరి. బ్రాహ్మణోత్తమా! వారు మార్గమధ్యములో నానా ప్రకార దివ్యరత్నములచే విభూషితమైన మనోహర విరజాతటమును గాంచిరి. తదనంతరము ఆవిమానము శతశృంగ పర్వము జేరెను. ఆపర్వతముపై అనేక చిన్మయ మణులతో వ్యాప్తమైన రమణీయ రాసమండలమును వారు దర్శించిరి. రాసమండలమునకు అనతిదూరములో పుణ్యమయ బృందావనమును గాంచిరి. తదుపరి కోటానుకోట్ల శాఖలతో విస్తరించియున్న అక్షయవటమును దర్శించిరి. అయ్యక్షయవటము నూఱు యోజనముల విస్తారము, మూడువందల యోజనముల ఉన్నతము. అరుణవర్ణయుక్తములైన ఫలసమూహములు ఆదివ్యవృక్షశోభను పెంపొందింప జేయుచున్నవి.

అక్షయవటవృక్ష ఛాయలో అసంఖ్యాక గోపికలతో శ్రీబృందాదేవి శ్రీరాధాదేవి రాకకై ఎదురుచూచు చుండెను. బృందను గాంచగనే రాధ సకలవ్రజవాసులతో విమానమును డిగ్గి బృందను సమీపించెను. బృందాదేవి రాధకు నమస్కరించి కుశలసమాచారముల నడిగి వారందరిని ఆహ్వానించెను. బృందాదేవి శ్రీరాధను అనేక మ్రజహారములచే అలంకరించి రత్నసింహాసనముపై కూర్చుండ జేసి ఆమె చరణకమలములు సేవలో సంలగ్నురాలయ్యెను. గోపికలందరు శ్రీరాధ సేవలందు యథావిధిగ సంలగ్నులైరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు రాధ, గోపగోపికలు గోలోకము జేరుట యను
నూటయిరువది యెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము

# నూటఇరువదితొమ్మిదవ అధ్యాయము

## -: శ్రీకృష్ణనిజధామగమనము :-

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదా! పరిపూర్ణతముడైన శ్రీకృష్ణపరమాత్మ గోకుల వాసులకు సాలోక్యమోక్షమును ప్రసాదించి తానొక్కడే కేవలము ఐదుగురు గోప కుమారులతో భాండీరవటవృక్ష ఛాయలో ఆసీనుడయ్యెను. గోకులమంతయు గోసముదాయము లన్నియు వ్యాకులముగ నుండుట పరమాత్మ గాంచెను. రక్షకులు లేనికారణమున బృందావనమంతయు శూన్యముగ నుండెను. అపుడు కృపాసాగరునకు దయకల్గి ఆత్మమాయచే అమృతవృష్టి గావించి బృందావన మును పరమ మనోహరముగ, సురమ్యముగ గోపగోపికలతో పరిపూర్ణముగ నొనరించెను. తదనంతరమాయన గోకులవాసుల నుద్దేశించి ఇట్లు పల్కెను. "హే, గోపగణములారా! బంధువులారా! మీరు సుఖములనుభవించుచు శాంతిపూర్ణులై ఈపవిత్రగోకులములో నివసింపుడు. గోపికలతో నావిహార ములు, సురమ్యరాసమండలము, పుణ్యప్రదబృందావనము, సూర్యచంద్రు లున్నంతవఱకు నుండగలవు. సర్వకాలసర్వావస్థలయందు నాదివ్యలీలలకు నిలయమైన ఈప్రదేశము అత్యంతపునీతమై అఖండపుణ్యప్రదమైన పవిత్ర క్షేత్రము కాగలదు."

తదనంరము లోకవిధాతయగు బ్రహ్మ, ఆదిశేషుడు, ధర్మదేవత, భవానీశంకరులు, సూర్యుడు, మహేంద్రుడు, చంద్రుడు. అగ్ని, కుబేరుడు, వరుణుడు, పవనుడు, యముడు, అష్టవసువులు, ఈశానాది సకలదేవతలు, సర్వగ్రహములు, రుద్రులు, మహర్షులు, మనువులు మొదలగు వారందరు శ్రీకృష్ణపరమాత్మ విరాజిల్లియున్న ప్రదేశమున కఱుదెంచి భగవంతు ననేక విధముల స్తుతించిరి. వారు సాష్టాంగ దండప్రణామము లర్పించి పరమాత్మ నిట్లు స్తుతించిరి.

బ్రహ్మ ఉవాచ :

శ్లో॥ పరిపూర్ణతమ బ్రహ్మస్వరూప నిత్యవిగ్రహ ।
జ్యోతిః స్వరూప పరమ నమోఽస్తు ప్రకృతేః పర ॥

సునిర్లిప్త నిరాకార సాకార ధ్యానహేతునా ।
స్వేచ్ఛామయ పరం ధామ పరమాత్మ న్నమోఽస్తు తే ॥ 13

సర్వకార్యస్వరూపేశ కారణానాం చ కారణ ।
బ్రహ్మేశశేషదేవేశ సర్వేశ తే నమోఽస్తు తే ॥ 14

సరస్వతీశ పద్మేశ పార్వతీశ పరాత్పర ।
హే సావిత్రీశ రాధేశ రాసేశ్వర నమోఽస్తు తే ॥ 15

సర్వేషామాదిభూత స్త్వం సర్వః సర్వేశ్వర స్తథా ।
సర్వపాతా చ సంహర్తా సృష్టిరూపా నమోఽస్తు తే ॥ 16

త్వత్పాదపద్మరజసా ధన్యా పూతా వసున్ధరా ।
శూన్యరూపా త్వయి గతే హే నాథ పరమం పదమ్ ॥ 17

యత్పంచవింశత్యాధికం వర్షాణాం శతకం గతమ్ ।
త్య క్త్వే మాం స్వపదం యాసి రుదతీం విరహాతురామ్ ॥ 18

దేవా! నీవు పరిపూర్ణతముడవైన పరబ్రహ్మస్వరూపుడవు, నిత్యవిగ్రహ ధారుడవు, జ్యోతిస్వరూపుడవు, పరబ్రహ్మవు, ప్రకృతికే అతీతుడవు; దేవా! నీకు నానమస్కారములు. పరమాత్మా! నీవు పరమనిర్లిప్తుడవు, పరంధాముడవు; నీకు నాప్రణామములు. సర్వేశ్వరా! నీవు సర్వకార్యస్వరూపములకే స్వామివి, సకల కారణములకు కారణుడవు, బ్రహ్మశివశేషాది దేవతలకే అధిపతివి; నీ కనేకానేక అభివాదములు. పరాత్పరా! నీవు సరస్వతీశుడవు, పద్మేశుడవు, పార్వతీశుడవు; హేసావిత్రీశా! రాధేశా! రాసేశ్వరా! నీకు నాప్రణామములు. సృష్టిరూపా! నీవు అన్నింటికి, అందరకు ఆధారభూతుడవు, సర్వరూపుడవు, సర్వేశ్వరుడవు, సర్వపాలకుడవు; సంహారకుడవు. దేవాదిదేవా! నీకు నమస్కారములు. నాథా! నీ చరణ కమల రజస్పర్శచే ఈ వసుంధర పరమపావనమై ధన్యురాలైనది. మీరు మీ పరమపదమునకు వెడలిన యవని శూన్యమగును. ఈ ధరిత్రిపై దివ్యలీలలను చేయుచు నీవు నూటఇరువదియైదు సంవత్సరములు గడపినావు. ఇక నీవిరహముచే దుఃఖించు ఈ పృథ్విని వీడి నిజధామమునకు దయచేయవలెను.

మహాదేవ ఉవాచ:

శ్లో॥ బ్రహ్మణా ప్రార్థిత స్త్వం చ సమాగత్య వసున్ధరామ్ ।
భూభారహరణం కృత్వా ప్రయాసి స్వపదం విభో ॥ 19

# నూటఇరువదితొమ్మిదవ అధ్యాయము

## -: శ్రీకృష్ణనిజధామగమనము :-

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! పరిపూర్ణతముడైన శ్రీకృష్ణపరమాత్మ గోకుల వాసులకు సాలోక్యమోక్షమును ప్రసాదించి తానొక్కడే కేవలము ఐదుగురు గోప కుమారులతో భాండీరవటవృక్ష ఛాయలో ఆసీనుడయ్యెను. గోకులమంతయు గోసముదాయము లన్నియు వ్యాకులముగ నుండుట పరమాత్మ గాంచెను. రక్షకులు లేనికారణమున బృందావనమంతయు శూన్యముగ నుండెను. అపుడు కృపాసాగరునకు దయకల్గి ఆత్మమాయచే అమృతవృష్టి గావించి బృందావన మును పరమ మనోహరముగ, సురమ్యముగ గోపగోపికలతో పరిపూర్ణముగ నొనరించెను. తదనంతరమాయన గోకులవాసుల నుద్దేశించి ఇట్లు పల్కెను. "హే, గోపగణములారా! బంధువులారా! మీరు సుఖములనుభవించుచు శాంతిపూర్ణులై ఈపవిత్రగోకులములో నివసింపుడు. గోపికలతో నావిహార ములు, సురమ్యరాసమండలము, పుణ్యప్రదబృందావనము, సూర్యచంద్రు లున్నంతవఱకు నుండగలవు. సర్వకాలసర్వావస్థలయందు నాదివ్యలీలలకు నిలయమైన ఈప్రదేశము అత్యంతపునీతమై అఖండపుణ్యప్రదమైన పవిత్ర క్షేత్రము కాగలదు."

తదనంరము లోకవిధాతయగు బ్రహ్మ, ఆదిశేషుడు, ధర్మదేవత, భవానీశంకరులు, సూర్యుడు, మహేంద్రుడు, చంద్రుడు. అగ్ని, కుబేరుడు, వరుణుడు, పవనుడు, యముడు, అష్టవసువులు, ఈశానాది సకలదేవతలు, సర్వగ్రహములు, రుద్రులు, మహర్షులు, మనువులు మొదలగు వారందరు శ్రీకృష్ణపరమాత్మ విరాజిల్లియున్న ప్రదేశమున కఱుదెంచి భగవంతు ననేక విధముల స్తుతించిరి. వారు సాష్టాంగ దండప్రణామము లర్పించి పరమాత్మ నిట్లు స్తుతించిరి.

బ్ర హ్మ ఉ వా చ :

శ్లో॥ పరిపూర్ణ తమ బ్రహ్మస్వరూప నిత్యవిగ్రహ ।
జ్యోతిః స్వరూప పరమ నమోఽస్తు ప్రకృతేః పర ॥

సునిర్లిప్త నిరాకార సాకార ధ్యానహేతునా ।
స్వేచ్ఛామయ పరం ధామ పరమాత్మ న్నమోఽస్తు తే ॥ 13

సర్వకార్యస్వరూపేశ కారణానాం చ కారణ ।
బ్రహ్మేశశేషదేవేశ సర్వేశ తే నమోఽస్తు తే ॥ 14

సరస్వతీశ పద్మేశ పార్వతీశ పరాత్పర ।
హే సావిత్రీశ రాధేశ రాసేశ్వర నమోఽస్తు తే ॥ 15

సర్వేషామాదిభూత స్త్వం సర్వః సర్వేశ్వర స్తథా ।
సర్వపాతా చ సంహర్తా సృష్టిరూపా నమోఽస్తు తే ॥ 16

త్వత్పాదపద్మరజసా ధన్యా పూతా వసున్ధరా ।
శూన్యరూపా త్వయి గతే హే నాథ పరమం పదమ్ ॥ 17

యత్పంచవింశత్యాధికం వర్షాణాం శతకం గతమ్ ।
త్యక్త్వే మాం స్వపదం యాసి రుదతీం విరహాతురామ్ ॥ 18

దేవా! నీవు పరిపూర్ణతముడవైన పరబ్రహ్మస్వరూపుడవు, నిత్యవిగ్రహధారుడవు, జ్యోతిస్వరూపుడవు, పరబ్రహ్మవు, ప్రకృతికే అతీతుడవు; దేవా! నీకు నానమస్కారములు. పరమాత్మా! నీవు పరమనిర్లిప్తుడవు, పరంధాముడవు; నీకు నాప్రణామములు. సర్వేశ్వరా! నీవు సర్వకార్యస్వరూపములకే స్వామివి, సకల కారణములకు కారణుడవు, బ్రహ్మశివశేషాది దేవతలకే అధిపతివి; నీకనేకానేక అభివాదములు. పరాత్పరా! నీవు సరస్వతీశుడవు, పద్మేశుడవు, పార్వతీశుడవు; హేసావిత్రీశా! రాధేశా! రాసేశ్వరా! నీకు నాప్రణామములు. సృష్టిరూపా! నీవు అన్నింటికి, అందరకు ఆధారభూతుడవు, సర్వరూపుడవు, సర్వేశ్వరుడవు, సర్వపాలకుడవు; సంహారకుడవు. దేవాదిదేవా! నీకు నమస్కారములు. నాథా! నీ చరణకమల రజస్పర్శచే ఈ వసుంధర పరమపావనమై ధన్యురాలైనది. మీరు మీ పరమపదమునకు వెడలిన యవని శూన్యమగును. ఈ ధరిత్రిపై దివ్యలీలలను చేయుచు నీవు నూటఇరువదియైదు సంవత్సరములు గడపినావు. ఇక నీవిరహముచే దుఃఖించు ఈ పృధ్విని వీడి నిజధామమునకు దయచేయవలెను.

మహాదేవ ఉవాచ :

శ్లో॥ బ్రహ్మణా ప్రార్థిత స్త్వం చ సమాగత్య వసున్ధరామ్ ।
భూభారహరణం కృత్వా ప్రయాసి స్వపదం విభో ॥ 19

త్రైలోక్యే పృథివీ ధన్యా సద్యః పూతా పదాఙ్కితా ।
వ్రజం చ మునయో ధన్యాః సాక్షాద్ దృష్ట్వా పదామ్బుజమ్ ॥ 20

ధ్యానాసాధ్యో దురారాధ్యో మునీనామూర్ధ్వరేతసామ్ ।
అస్మాకమపి యశ్చేశః సోఽధునా చాక్షుషో భువి ॥ 21

వాసః సర్వనివాసశ్చ విశ్వాని యస్య లోమసు ।
దేవ స్తస్య మహావిష్ణుర్వాసుదేవో మహీతలే ॥ 22

సుచిరం తపసా లబ్ధం సిద్ధేన్ద్రాణాం సుదుర్లభమ్ ।
యత్పాదపద్మమతులం చాక్షుషం సర్వజీవినామ్ ॥ 23

విభో! నీవు బ్రహ్మదేవునిప్రార్థనలను మన్నించి అవనిపై అవతీర్ణుడవై భూభారము హరించి నిజధామమున కరుగుచున్నావు. నీచరణాంకితమైన క్షణమే ఈ భూమి పరమపావనమై త్రిలోకములందు ధన్యయైనది. నీ దివ్యచరణకమలములను ప్రత్యక్షముగ దర్శించి మేము, సకలవ్రజవాసులు; మహర్షులు ధన్యులమైతిమి. ఏ పరబ్రహ్మము ఊర్ధ్వరేతస్కులైన మహర్షులకు కూడ ధ్యానము ద్వారానైనను అసాధ్యుడో, దురారాధ్యుడో, నిష్ప్రాపుడో, ఆ పరమేశ్వరుడే ఈ సమయమున భూతలముపై మాకు దృష్టిగోచరుడగుచున్నాడు. ఎవని రోమకూపములందు నిఖిల విశ్వములు వర్తమానములై యున్నవో, ఆ సర్వనివాసుడైన ప్రభువే వాసువు. ఆవాసుస్వరూపుడైన మహావిష్ణువుకు ఏదైవమైతే కలడో, ఆదైవమే వాసుదేవుడను నామమున విఖ్యాతినొందెను. సిద్ధేంద్రులు చిరకాలము తపమొనరించి పొందిన ఆభగవానుని అనుపములైన,పాదపద్మములు నేడు మాయందఱి నేత్రములను ధన్యమొనరించినవి.

అనంత ఉవాచ :

శ్లో॥ త్వమనన్తో హి భగవన్నాహమేవ కలాంశకః ।
విశ్వైకస్థే క్షుద్రకూర్మేమశకోఽహం గజే యథా ॥ 24

అసంఖ్యశేషాః కూర్మాశ్చ బ్రహ్మవిష్ణుశివాత్మకాః ।
అసంఖ్యాని చ విశ్వాని తేషామీశః స్వయం భవాన్ ॥ 25

అస్మాకమీదృశం నాథ సుదినం క్వ భవిష్యతి ।
స్వప్నాదృష్టశ్చ యశ్చేశః స దృష్టః సర్వజీవినామ్ ॥ 26

నాథ ప్రయాసి గోలోకం పూతాం కృత్వా వసున్ధరామ్ ।
తామనాథాం రుదన్తీం చ నిమగ్నాం శోకసాగరే ॥ 27

నాథా! అఖండ ఐశ్వర్యసంపన్నశాలివైన అనంతుడవు నీవే కాని నేను కాను. నేను కేవలము నీకళాకళాంశనే. ఈ విశ్వమునకు ఆధారమైన క్షుద్రకూర్మముయొక్క పృష్ఠభాగముపై గజముపై మశకమున్నట్లు నేనున్నాను. అసంఖ్యాకులైన శేషులకు, కూర్మములకు, బ్రహ్మ విష్ణు శివాదులకు, విశ్వములకు స్వామివి స్వయముగ నీవే. స్వప్నములో నైనను దుర్లభుడగు ఆ దేవాది దేవుడు నేడు సమస్తజీవులకు దృష్టిగోచరుడైనాడు. ఇంతకంటె మఱియొక సుదినము మాకు లేదు. నాథా! నీవే ఈ వసుంధరను పరమపావన మొనరించితివి. ఇక శోకసాగరములో నిమగ్నురాలై యున్న ఈ పృథ్విని అనాథగ నొనరించి గోలోకమునకు వెడలుము.

దే వా ఊ చు ః :

శ్లో॥ దేవాస్తోతుం న శక్తాయం బ్రహ్మేశానాదయస్తథా।
తమేవ స్తవనం కిం వా వయం కుర్మో నమోఽస్తు తే॥　　28

దేవా! సకలదేవతలు, బ్రహ్మ ఈశానాదులు నిన్ను స్తుతించుటకు సమర్థులు కారు. అట్టి నిన్ను మే మేమని స్తుతింపగలము; కావున నీ కిదే మా నమస్కారములు.

మునీశ్వరా! ఇట్లు సకలదేవతలు శ్రీకృష్ణపరమాత్మను దివ్యగోలోక పరంధామమునకు దయచేయ వలసినదిగ ప్రార్థించిరి. శేషించిన గోపకుమారులందఱు గోలోకపరంధామమునకు మహాప్రస్థాన మొనరించిరి. పరమాత్మ అవనిని వీడి జనువేళ పృథ్వి భయభీతయై కంపింపదొడంగెను. సప్తసముద్రములు అల్లకల్లోలము కాజొచ్చినవి. శ్రీకృష్ణాజ్ఞానుసారముగ ద్వారకానగర శోభ లుప్తమైనది. ద్వారకానగరములో విరాజిల్లు శ్రీకృష్ణమూర్తి వటమూల స్థితమూలమూర్తిలో లీనమయ్యెను. మిగిలిన యదువంశీయులు పరస్పరము కలహించి పాంచభౌతిక దేహములనువీడి దివ్యగోలోక పరంధామమునకు బయలుదేరగ వారిపత్నులు సహగమన మొనరించిరి. అర్జునుడు హస్తినాపురముజేరి ఈ సమాచారము నంతయు యుధిష్ఠిరునకు విన్నవించెను. యుధిష్ఠిరుడు సోదరులతో పత్నితో కలసి స్వర్గమునకు బయలుదేరెను.

పరమాత్మ, బలసంపన్నుడు, దేవాదిదేవుడు, శ్రీమన్నారాయణుడు ప్రభువులకే ప్రభువు, శ్యామసుందరవిగ్రహుడు, నిత్యకిశోరుడు, రత్ననిర్మితా

భూషణ విభూషితుడు అగ్నిశుద్ధవస్త్ర పరీధానుడు, వనమాలావిరాజితుడు, అత్యంతసుందరాకారుడు, శాంతస్వరూపుడు, మనోహరుడు, అయిన శ్రీకృష్ణ పరమాత్మ అక్షయవటవృక్షఛాయలో శయనించియుండగా శ్రీమహాలక్ష్మ్యాదు లైన సకల దేవతలచే సేవింపబడు భగవంతుని చరణకమలములో కిరాతుని ద్వారా విసర్జింపబడిన అస్త్రము గ్రుచ్చుకొనెను. ఆ లక్ష్మీకాంతుడైన, రాధా హృదయేశ్వరుడైన పరమేశ్వరుని బ్రహ్మాదిదేవతలు అనేకవిధములుగ ప్రణా మము లర్పించి స్తుతించిరి. మందస్మిత ముఖారవిందుడై దేవతలను వీక్షించి వారకు అభయ మొసంగెను. పరమాత్మ విరహమును భరింపలేక దుఃఖించు పృధ్వికి శ్రీకృష్ణపరమాత్మ ధైర్య మొసంగెను. కిరాతునకు గోలోకపరంధామ మును ప్రసాదించెను.

తదనంతరము బలదేవుని యద్భుత తేజము ఆదిశేషునందు ప్రవేశించెను. ప్రద్యుమ్నుడు మన్మధుడయ్యెను. అనిరుద్ధుడు బ్రహ్మను ప్రవేశించెను. నారదా! అయోనిజ శ్రీమహాలక్ష్మియైన రుక్మిణి తనదివ్యదేహముతోనే వైకుంఠము జేరెను. కమలాలయయగు సత్యభామ పృధ్విలో లీనమయ్యెను. జాంబవతి జగజ్జననియగు పార్వతిని ప్రవేశించెను. ఇట్లు ఏ యే దేవాంగనలు, దేవతలు పరమాత్మకొఱకై పృధ్విపై తమతమ అంశలచే అవతరించిరో, వారు వారివారి స్వస్వరూపములందు లీనమైరి. సాంబుడు కార్తికేయునందు వసుదేడు కస్యపు నందు దేవకి అదితియందు లీనమైరి. సాగరుడు రుక్మిణీదేవి మందిరముదక్క మిగిలిన ద్వారకాపురిని ఆక్రమించెను. తదనంతరము సాగరుడు మూర్తీభవించిన వియోగకారణమున అశ్రుపూర్ణలోచనుడై వ్యాకులుడై శ్రీకృష్ణు ననేకవిధ ముల స్తుతించి దుఃఖింప దొడంగెను.

నారదా! తదనంతరము గంగ, సరస్వతి, పద్మావతి, యమున, గోదావరి స్వర్ణరేఖ, కావేరి, నర్మద, శరావతి, బాహుద, పుణ్యదాయనియగు కృతమాల మొదలగు పుణ్యనదీమతల్లులందరు స్వరూపధారిణులై శ్రీకృష్ణపరమాత్మను సందర్శించి నమస్కరించిరి. వారిలో జహ్నుతనయయగు జాహ్నవి (గంగ) అత్యంత విరహవేదన ననుభవించుచు అశ్రుపూర్ణలోచనయై దుఃఖించుచు పరమేశ్వరుడైన శ్రీకృష్ణునితో ఇట్లు పల్కెను. "నాథా! రమణశ్రేష్ఠా! నీవు ఉత్తమ గోలోక పరంధామమునకు బయలుదేరుచున్నావు; కాని ఈ కలియుగములో నీవు లేని మాగతి ఏమి కాగలదు!" గంగాదేవి యాక్రందన నాలకించి కరుణానిధియగు శ్రీకృష్ణపరమాత్మ ఇట్లు పల్కెను.

శ్రీకృష్ణ ఉవాచ:

శ్లో॥ కలేః పంచసహస్రాణి వర్షాణి తిష్ఠ భూతలే ।
పాపాని పాపినో యాని తుభ్యం దాస్యన్తి స్నానతః ॥ 50

మన్మన్త్రోపాసక స్పర్శాద్భస్మీభూతాని తత్క్షణాత్ ।
భవిష్యన్తి దర్శనాచ్చ స్నానాదేవ హి జాహ్నవి ॥ 51

హరేర్నామాని యత్రైవ పురాణాని భవన్తి హి ।
తత్ర గత్వా సావధానమాభిః సార్ధం చ శ్రోష్యతి ॥ 52

పురాణశ్రవణాచ్చైవ హరేర్నామానుకీర్తనాత్ ।
భస్మీభూతాని పాపాని బ్రహ్మహత్యాదికాని చ ॥ 53

భస్మీభూతాని తాన్యేవ వైష్ణవాలిఙ్గనేన చ ।
తృణాని శుష్కకాష్ఠాని దహన్తి పావకా యథా ॥ 54

తథాఽపి వైష్ణవా లోకే పాపాని పాపినామపి ।
పృథివ్యాం యాని తీర్థాని పుణ్యాన్యపి చ జాహ్నవి ॥ 55

మద్భక్తానాం శరీరేషు సన్తి పూతేషు సంతతమ్ ।
మద్భక్తపాదరజసా సద్యః పూతా వసున్ధరా ॥ 56

సద్యః పూతాని తీర్థాని సద్యః పూతం జగత్తథా ।
మన్మన్త్రోపాసకా విప్రా యే మదుచ్ఛిష్టభోజినః ॥ 57

మామేవ నిత్యం ధ్యాయన్తే తే మత్ప్రాణాధికాః ప్రియాః ।
తదుపస్పర్శమాత్రేణ పూతో వాయుశ్చ పావకః ॥ 58

కాలేర్దశసహస్రాణి మద్భక్తాః సన్తి భూతలే ।
ఏకవర్ణా భవిష్యన్తి మద్భక్తేషు గతేషు చ ॥ 59

మద్భక్తశూన్యా పృథివీ కలిగ్రస్తా భవిష్యతి ।

జాహ్నవీ! కలియుగములో ఐదువేల సంవత్సరముల వఱకు నీవు విరాజిల్లగలవు. పాపాత్ములు నీ జలములలో స్నానము లాచరించి నీకు ఏయేపాపములను పసాదించెదరో, అవియన్నియు నా మంత్రోపాసకులైన పరమవైష్ణవుల స్పర్శచే, దర్శనముచే, స్నానాదులచే తత్కాలమే భస్మములు కాగలవు. ఏ ప్రదేశములో హరినామసంకీర్తనము పురాణచరితములు మారుమ్రోగునో ఆ ప్రదేశమునకు నీవు సకల తీర్థసహితముగ ఏతెంచి సావధానముగ శ్రవణ మొనరింపగలవు. ఆ పురాణశ్రవణము వలన, హరినామ సంకీర్తన శ్రవణమువలన

పాపులద్వారా మీకు సంక్రమించిన బ్రహ్మహత్యాది మహాపాతకములు భస్మీ భూతములు కాగలవు. అగ్ని శుష్క కాష్టములను, తృణములను దహించునట్లు వైష్ణవాలింగనమాత్రముననే సర్వపాపములు నశింపగలవు. ఇట్లు నా యనన్య భక్తులైన వైష్ణవులు పాపాత్ముల పాపములను దహించెదరు. గంగా! ఈ భూతలముపై గల సకలపుణ్యతీర్థములు నా భక్తుల పావనశరీరములందు సదా యుండగలవు. నా యనన్యభక్తుల చరణరజస్పర్శమాత్రముననే తీర్థములు పవిత్రము లగును, వసుంధర తత్కాలమే పావనమగును, జగమే పరిశుద్ధ మగును. నా మంత్రోపాసన చేయువారు, నా కర్పించిన ప్రసాదమునే సదా భుజించువారు, నిత్యము నా ధ్యానమందే సంలగ్నులై యున్నవారు నాకు నా ప్రాణములకంటెను అధికప్రియులు. అట్టి మహాత్ముల స్పర్శ మాత్రముననే వాయువు, అగ్నికూడ పవిత్రములు కాగలవు. నా భక్తులు ఈ పృథ్విని వీడగనే సకలవర్ణములు ఏకము కాగలవు. నా భక్తశూన్యమైన ఈ పృథ్విపై పరిపూర్ణ ముగ కలిసామ్రాజ్యము విరాజిల్లగలదు.

శ్రీకృష్ణుని దివ్యశరీరమునుండి చతుర్భుజధారియైన పురుషోత్తముడు బయల్వెడలెను. ఆయనకాంతి వందలకొలది పూర్ణిమచంద్రుల ప్రభను మించి ప్రకాశించెను. ఆయన శ్రీవత్సచిహ్నవిభూషితుడై హస్తములందు శంఖచక్ర గదాపద్మములు శోభింపగ దివ్యదర్శన మొసంగెను. ఆ శ్రీమన్నారాయణుడు దివ్యరథారూఢుడై క్షీరసాగరమునకు బయలుదేరెను. అపుడు సింధుకన్యకూడ ఆ పురుషోత్తముని యనుసరించెను. జగత్పాలకర్తయగు విష్ణువు శ్రీకృష్ణుని దివ్యవిగ్రహమునుండి బయల్వెడలి శ్వేతద్వీపము జేరెను. శ్రీకృష్ణుని మనస్సు నుండి ఉత్పన్నయై మనోహారిణియగు మర్త్యలక్ష్మివిష్ణువు ననుసరించెను. ఇట్లు ఆ శుద్ధస్వరూపమే రెండురూపముల దివ్యసాక్షాత్కార మొసంగెను. ఆ సచ్చిదానంద విగ్రహుని దక్షిణాంగము ద్విభుజారూపధారియైన గోపబాలకునిగ మారిపోయెను. ఆ పరంధాముని అఖండైశ్వర్య రూపసౌందర్యము నే నేమని వర్ణింపగలను?

శ్లో॥ నవీనజలదశ్యామః శోభితః పీతవాససా ।
శ్రీవంశవదనః శ్రీమాన్ సస్మితః పద్మలోచనః ॥ 65

శతకోటీన్దుసౌన్దర్యం శతకోటిస్మరప్రభామ్ ।
దధానః పరమానన్దః పరిపూర్ణతమః ప్రభుః ॥ 66

శ్లో॥ పరం ధామ పరం బ్రహ్మ స్వరూపో నిర్గుణః స్వయమ్ ।
పరమాత్మా చ సర్వేషాం భక్తానుగ్రహవిగ్రహః ॥ 67

నిత్యదేహశ్చ భగవానీశ్వరః ప్రకృతేః పరః ।
యోగినో యం వదన్త్యేవం జ్యోతిరూపం సనాతనమ్ ॥ 68

జ్యోతిరభ్యన్తరే నిత్యరూపం భక్తా విదన్తి యమ్ ।
వేదా వదన్తి సత్యం యం నిత్యమాద్యం విచక్షణాః ॥ 69

యం వదన్తి సురాః సర్వే పరం స్వేచ్ఛామయం ప్రభుమ్ ।
సిద్ధేన్ద్రా మునయః సర్వే సర్వరూపం వదన్తి యమ్ ॥ 70

యమనిర్వచనీయం చ యోగీన్ద్రః శంకరో వదేత్ ।
స్వయం విధాతా ప్రవదేత్కారణానాం చ కారణమ్ ॥ 71

శేషో వదేదనన్తం యం నవధారూపమీశ్వరమ్ ।
తర్కాణామేవ షణ్ణాం చ షడ్విధం రూపమీప్సితమ్ ॥ 72

వైష్ణవానామేకరూపం వేదానామేకమేవ చ ।
పురాణానామేకరూపం తస్మాన్నవవిధం స్మృతమ్ ॥ 73

నారదా! ఆభగవానుడు నవీనజలదశ్యామలవర్ణుడు, పీతాంబరధారి ఆయన ముఖమందు సుందరమురళి విరాజిల్లుచున్నది. పరమాత్మనేత్రములు కమలములవలె విశాలములు, ఆయన అత్యంతశోభాసంపన్నుడై మందస్మిత ముఖారవిందుడై దర్శనమొసంగెను. ఆయన నూఱుకోట్లపూర్ణిమాచంద్రుల కంటే సౌందర్యశాలి, నూఱుకోట్లమన్మథులకంటే ప్రభాలావణ్యసంపన్నుడు పరమానందస్వరూపుడు, పరిపూర్ణతముడు, ప్రభువులకే ప్రభువు, పరంధాముడు, పరబ్రహ్మస్వరూపుడు, ప్రాకృతికనిర్గుణుడు, సర్వులకుపరమాత్మ, భక్తానుగ్రహమూర్తి, సచ్చిదానందవిగ్రహుడు, నిత్యశరీరధారి, పరమైశ్వర్యశాలి, ప్రకృతికే అతీతుడైన సర్వేశ్వరేశ్వరుడు. పరమయోగులు ఎవనిసనాతనజ్యోతి స్వరూపమును తెలిసికొని, ఆజ్యోతిమధ్యలో అఖండజ్యోతిపుంజమునకు కారణమైన సచ్చిదానందవిగ్రహమును భక్తిద్వారా దర్శింతురు. వేదములు ఎవనిని సత్యమని, నిత్యమని, ఆదియనికీర్తించునో, సకలదేవతలు ఎవనిని స్వేచ్ఛామయుడైన పరమప్రభువని వచింతురో, సకలసిద్ధశిరోమణులు, మహాఋషులు ఎవనిని సర్వరూపుడని కీర్తనమొనరింతురో యోగయోగేశ్వరుడైన శంకరుడు ఎవనిదివ్యనామము అనిర్వచనీయమని వచించెనో, బ్రహ్మ ఎవనిని

సకలకారణకారణుడని కీర్తించెనో, ఆదిశేషుడు నవవిధముల రూపములను ధరించు నీసర్వేశ్వరేశ్వరుని అనంతుడని కీర్తించెనో; ఆఱుప్రకారములైన ధర్మములే ఆయన ఆఱురూపములు, వైష్ణవులే ఒకరూపము, వేదములు మఱియొకరూపము, పురాణములు తొమ్మిదవరూపము; కావుననే భగవంతుని నవరూపధారియనికీర్తించిరి.

శ్లో॥ న్యాయో నిర్వచనీయం చ యం మతం శంకరో వదేత్ ।
నిత్యం వైశేషికాశ్చాఽఽద్యం తం వదన్తి విచక్షణాః ॥ 74

సాంఖ్యా వదన్తి తం దేవం జ్యోతిరూపం సనాతనమ్ ।
మిమాంసా సర్వరూపం చ వేదాన్తః సర్వకారణమ్ ॥ 75

పాతంజలోఽప్యనన్తం చ వేదాః సత్యస్వరూపకమ్ ।
స్వేచ్ఛామయం పురాణం చ భక్తాశ్చ నిత్యవిగ్రహమ్ ॥ 76

సోఽయం గోలోకనాథశ్చ రాధేశో నన్దనన్దనః ।
గోకులే గోపవేషశ్చ పుణ్యే వృన్దావనే వనే ॥ 77

చతుర్భుజశ్చ వైకుణ్ఠే మహాలక్ష్మీపతిః స్వయమ్ ।
నారాయణశ్చ భగవాన్ యన్నామ ముక్తికారణమ్ ॥ 78

సకృన్నారాయణేత్యుక్త్వా పుమాన్ కల్పశతత్రయమ్ ।
గఙ్గాదిసర్వతీర్థేషు స్నాతో భవతి నారద ॥ 79

శంకరుని మతమునే ఆశ్రయించి సకలన్యాయశాస్త్రములు, శ్రుతులు ఎవనిస్వరూపము అనిర్వచనీయమని నిరూపణమొనరించినవో, దీర్ఘదర్శులైన వైశేషికులు యెవనిని నిత్యమని కీర్తించిరో, సాంఖ్యులు యెవనిని సనాతనజ్యోతిస్స్వరూపునిగా నొక్కి-వక్కాణించిరో, నాయంశసంభూతములైన వేదాంతీయులు యెవనిని సర్వరూపుడని, సర్వకారణకారణుడని వర్ణించినవో, పతంజలిమతానుయాయులు యెవనిని అనంతుడని కీర్తించిరో, వేదగణములు యెవనిని సత్యస్వరూపుడని వచించినవో, పురాణములు యెవనిని స్వేచ్ఛామయుడని వర్ణించినవో, అనన్యభక్తులు యెవనిని నిత్యసచ్చిదానంద విగ్రహుడని పల్కెదరో ఆగోలోకనాథుడైన శ్రీకృష్ణపరమాత్మయే గోకులములో బృందావన పుణ్యవనములో గోపబాలవేషధారియై నందుని పుత్రనిరూపమున అవతరించెను. ఆయనయే శ్రీరాధా ప్రాణపతి, ఆయనయే వైకుంఠములో చతుర్భుజుడైన మహాలక్ష్మీపతి, శ్రీమన్నారాయణుడు, శ్రీమన్నారాయణ దివ్యనామము ముక్తిప్రాప్తికి ఏకైక

కారణము. నారదా! ఏమనుష్యుడైతే ఒకపర్యాయమైనను సద్భక్తితో శ్రీమన్నారాయణ శబ్దముచ్చరించిన ఆతడు మూడువందల కల్పములపర్యంతము గంగాది సకలతీర్థస్నాన ఫలములను పొందగలడు.

శంఖచక్ర గదాపద్మధరుడు వక్షఃస్థలమందు శ్రీవత్స చిహ్నముతో, మణిశ్రేష్ఠ కౌస్తుభమును, వనమాలను ధరించి శోభించుచు వేదములు స్తుతించుచుండగ శ్రీమన్నారాయణుడు సునంద నందకుముదాది పార్షదపరివేష్టితుడై దివ్యవిమానము నధిరోహించి వైకుంఠము జేరెను. వైకుంఠనాథుడు వెడలి పోయినంతనె మహాళిపింఛము గంధదామమును మెరయ, విలసితాగ్రముగ నొక్క వేణువందు బ్రహ్మగాంధర్వ గీతంబు పరగజేసె- జటులనటమూర్తి గోపాలచక్రవర్తి. ఆదివ్యగానమునకు జగజ్జనని ఆద్యాశక్తి పార్వతి దక్క అన్య జీవులందరు, లోకములన్నియు మోహితులై మూర్ఛనొందినవి. అపుడు విష్ణుమాయా సర్వరూపిణియు సనాతనియు పరబ్రహ్మరూపిణియు పరమాత్మస్వరూపిణియు, సుగుణయు, నిర్గుణయు, స్వేచ్ఛామయియు, యైన పార్వతి సనాతనుడైన శ్రీకృష్ణపరమాత్మతో ఇట్లుపల్కెను.

పార్వతి పలికెను:-

ప్రభో! గోలోకస్థిత రాసమండలములో నేనే నాయొక్క రాధికారూపమున విరాజిల్లుచున్నాను. ఈసమయమున నీవులేని గోలోకము రాసశూన్యమైనది; కావున నీవు ముక్తామాణిక్య విభూషిత రథారూఢుడవై గోలోకము జేరి ఆలోకమును పరిపూర్ణ మొనరింపుము. దేవా! నీవక్షఃస్థలములో నివసించు పరిపూర్ణతమాదేవిని నేనే. మీయాజ్ఞచే వైకుంఠములో విరాజిల్లు మహాలక్ష్మి నేనే. వైకుంఠములోనే శ్రీహరి వామభాగమందు యున్న సరస్వతినిగూడ నేనే. నేనే నీయాజ్ఞచే నీమనమునుండి ఉద్భవించిన సింధుకన్యను. బ్రహ్మ సమక్షములో విరాజిల్లు నాకళనుండి ప్రాదుర్భవించిన వేదమాతాయగు సావిత్రి నానామధేయమే. మొదట సత్యయుగములో నీఆజ్ఞానుసారముగ నేను సమస్త దేవతల తేజములను నాఆవాస్థానముగ నొనరించుకొని వారితేజములనుండి ప్రాదుర్భవించి శక్తిస్వరూపమును ధరించితిని. ఆయవతారములోనే నేను లీలాపూర్వకముగ శుంభాది దైత్యులను సంహరించితిని. నేనే దుర్గాసురుని వధించి దుర్గనైతిని, త్రిపురాసురుని సంహరించి త్రిపురనైతిని, రక్తబీజుని వినాశన

మొనరించి రక్తబీజవినాశని యని కీర్తింపబడితిని. నీయాజ్ఞవలన నేను దక్షకన్యయైన సతినైతిని, ఆయవతారములో యోగము ద్వారా దేహము త్యజించి మఱల నీదేశానుసారముగ గిరిరాజ నందినియగు పార్వతి నైతిని. నన్ను నీవే గోలోకస్థిత రాసమండలములో శంకరునకు ప్రసాదించినావు. నేను సదా విష్ణుభక్తితో నిమగ్న నై యున్న కారణముననే నన్ను వైష్ణవీ విష్ణుమాయ యందురు. నారాయణీ మాయనైనను కారణమున నన్ను నారాయణీ అని కీర్తింతురు. నేనే శ్రీకృష్ణుని ప్రాణప్రియను, ఆయనప్రాణముల కధిష్ఠాత్రిదేవిని, వాసుస్వరూపుడైన శ్రీమహావిష్ణువు జననియైన రాధను. నీఆదేశానుసారముగ నేనే ఐదురూపముల విభక్తనైనాను; కావున ఆయైదు ప్రకృతులు నాస్వరూపములే. నేనే గృహగృహమునందు కళాకళాంశలచే ప్రాదుర్భవించి వేదపత్నుల రూపములలో యున్నాను. మహాభాగా! గోలోకములో రాధాస్వరూపిణినైన నేను విరహాకులనై నీయగమనము కొఱకు ఎదురుచూచు చున్నాను; కావున నీవు శీఘ్రమే గోలోక పరంధామమునకు బయలు దేరుము.

శ్లో॥ పార్వతీవచనం శ్రుత్వా ప్రహస్య రసికేశ్వరః ।
రత్నయానం సమారుహ్య యయౌ గోలోకముత్తమమ్ ॥ 98

నారదా! పార్వతిప్రార్థనలను మన్నించి రసికేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మ రత్ననిర్మితవిమానము నధిరోహించి ఉత్తమగోలోకపరంధామము జేరెను.

తదనంతరము విష్ణుమాయ మాయారూపిణీ యగు పార్వతి మురళీనాదముచే ఆచ్ఛన్నులైన సకలజీవులను మేల్కొల్పెను. సకలదేవతలు హరినామసంకీర్తన మొనరించుచు విస్మయావిష్టులై తమతమనిజధామముల కఱిగిరి. శ్రీదుర్గాదేవికూడ హర్షనుగ్నురాలై శివునితోగూడి కైలాసము జేరెను.

గోలోకములో సర్వజ్ఞురాలైన శ్రీరాధ అత్యంతప్రసన్నురాలై సకల గోపికాసహితముగ శ్రీకృష్ణపరమాత్మ కెదురేగి ఆజగదీశ్వరుని చరణారవిందముల నాశ్రయించెను. గోపకుమారులకు, గోపికలకు శ్రీకృష్ణదివ్యదర్శన ప్రగాఢవాంఛ కలదు; కావున పరమాత్మయాగమనము వారికి పరమానంద ప్రదమయ్యెను. వారినేత్రములు, ముఖములు అఖండానందముతో వికసించినవి; సకలగోలోకవాసులు భగవంతుని యాగమనసందర్భమున దుంధుభులను మ్రోగించి మహోత్సవ మొనరించిరి. దివ్యవిమానారూఢుడై విరజానదిని

దాటి గోలోకము జేరిన శ్రీకృష్ణపరమాత్మ తనకు స్వాగతముపల్కుటకై ఏతెంచిన రాధను గాంచగనే విమానము దిగి ఆమె ననుగ్రహించెను. తదనంతరము జగత్పతి రాధపాణిని గ్రహించి శతశృంగపర్వతముపై విహారార్థము బయలుదేరెను. వారిర్వురు రాసమండలములందు, అక్షయ వటప్రాంతమున, పుణ్యబృందావనమున, పవిత్రతులసీకాననమందు యథేచ్ఛగ విహరించిరి. తదనంతరము వారు మాలతీవనమును దాటి, కుందనవనమందు విహరించి, చంపకవనము దాటి చందనకాననమును జేరిరి. చందనకాననమున కావలయున్న శ్రీరాధాదేవి దివ్యఅంతఃపురమును వారు దర్శించిరి. అంతఃపురమును ప్రవేశించి. సకలజగములకు తలిదండ్రులైన శ్రీరాధాకృష్ణులు దివ్యరత్ననిర్మిత సింహాసనముపై విరాజమానులైరి. పరమాత్మ జగజ్జననియగు రాధనుండి షోడశోపచారములను, కర్పూరయుక్తతాంబూలమును స్వీకరించెను. బ్రహ్మర్షి! నారదమునీంద్రా! సకలజగన్నాథుడైన శ్రీకృష్ణపరమాత్మయొక్క దివ్యలీలలు అపారములు, వానిని వర్ణింపనెవరితరము?

నారదా! ఇట్లు నేను భగవంతునిగోలోకగమనాఖ్యానమును నాతండ్రియగు ధర్మదేవుని ముఖారవిందమునుండి విన్నదివిన్నట్లుగ నీయెదుట వర్ణించితిని. శ్రీహరిదివ్యచరితములు అమృతవృష్టితుల్యములు. శ్రీకృష్ణదివ్యలీలాశ్రవణములు దేహధారులు భవసాగరమును తరించుటకు ఏకైకసాధనములు. శ్రీహరికథలను శ్రవణమొనరించినవారు, ప్రవచించినవారు జన్మరాహిత్యమునొంది గోలోకపరంధామమును జేరగలరు. బ్రహ్మకులోద్భవా! కావున నీవు సదా ఆసచ్చిదానందవిగ్రహుని దివ్యనామసంకీర్తనమందు సంలగ్నుడవుకమ్ము కుమారా! నీవిక ఏవిషయములను శ్రవణమొనరింపగోరెదవో తెల్పుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ
జన్మఖండమందు శ్రీకృష్ణ నిజధామగమనమను
నూటయిరువది తొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము

---

# నూటపండ్రెండవ అధ్యాయము

## నారదుడు సృంజయకన్యను పాణిగ్రహణమొనరించుట

నారదుడు పలికెను:-

మహాభాగా! నాయభీప్సితవిషయముల నన్నింటిని అవశేషముగ మీయపారకరుణవలన శ్రవణమొనరింపగల్గితిని. శ్రీహరికథా దివ్యసుధాసాగరమును గ్రోలిననాకు ఇక ఏవాంఛలులేవు. సమస్తకామనలను పరిపూర్ణమొనరింపగల ఈ బ్రహ్మవైవర్తమహాపురాణము పరమాద్భుతము! జగద్గురూ ఈ పవిత్రసంహితాశ్రవణమాత్రముననే నాకర్మబంధములన్నియు పటాపంచలైనవి. దేవా! హిమాలయపర్వతముపై అఖండతపముద్వారా శ్రీరాధాకృష్ణులను ఆరాధించుటకు అనుజ్ఞ ప్రసాదింపవలసినదిగ ప్రార్థించుచున్నాను. పరమగురూ! నాతక్షణకర్తవ్యమేదో మీరాదేశింపవలసినదిగ కోరుచున్నాను.

శ్రీనారాయణఋషి పలికెను:-

బ్రహ్మకులైకపావనా! నారదా! ప్రస్తుతమును నీవు బ్రహ్మకుమారుడవు; కాని పూర్వజన్మలో నీవు ఉపబర్హణుడను గంధర్వేశ్వరుడవు. ఆజన్మలో నీకు ఏబదిపట్టపురాణులుకలరు. వారిలో సతీసాధ్వియు, సుందరియు నగు మాలావతి నిన్నే మరుజన్మలో ప్రాణేశ్వరునిగ బడయవలెనని ఘోరతపముద్వారా మహాదేవుని అర్థించినది. ఆయన ఆమె మనోభీప్సితమును అనుగ్రహించెను, ఆసాధ్వియే నేడు సృంజయుని కన్యకారత్నమై అవతరించినది. ఆమె నామధేయము 'స్వర్ణష్ఠీవి.' ఆకామిని పరమసుందరి, అత్యంతకోమలాంగి, శ్రీమహాలక్ష్మికళ, పతివ్రత, మహాభాగ, మనోహారిణి, అత్యంతమధురభాషిణి, కమనీయరూపసుస్థిరయౌవ్వన సంపన్నరాలు. నారదా! తక్షణమే నీవు ఆకన్యకామణిపాణిని గ్రహింపుము; ఎందువలననగ శంకరునియాజ్ఞ ఎట్లు వ్యర్థముకాగలదు? బ్రహ్మ లిఖించిన కర్మ ఎట్లు నశింపగలదు?.

శ్లో॥ నాభుక్తం క్షీయతేకర్మ కల్పకోటిశతైరపి ।
అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ॥ 8

నూరుకోట్లకల్పములు గతించినను అనుభవింపనిచే కర్మలు క్షీణింపవు. దేహధారి యొనరించిన శుభాశుభకర్మలు అవశ్యము అనుభవింపక తప్పదు

సూతు పలికెను :

శౌనకాది మహర్షులారా! శ్రీమన్నారాయణ ఋషివర్యుని యాదేశము నాలకింపగనే నారదుని మనస్సు ఖిన్నమయ్యెను. శంకరుని యాదేశము పరిపాలించుటకు నారదుడు శ్రీనారాయణ ఋషీంద్రునకు అనేక ప్రణామము లర్పించి సృంజయుని రాజధానికి బయలుదేరెను.

శౌనకుడు పలికెను :-

మహాభాగా! సూతమహర్షీ! ఈపరమాద్భుతమైన, ,పరమపురాతనమైన అత్యంత సరసమైన, అపూర్వరహస్య సమన్వితమైన బ్రహ్మవైవర్త మహాపురాణమును శ్రవణమొనరించి మామహర్షి మండలియంతయు అత్యంతధన్యమైనది. నారదమహర్షి బ్రహ్మపుత్రుడు, అతీంద్రియుడు, కావున ఆమహాపురుషుని వివాహవృత్తాంత మంతయు ప్రవచింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

సూతుడు పలికెను :

శౌనకాది మహర్షులారా! నారదుడు పరమేశ్వరుని సంకల్పముచే మోహమునకు వశుడై సృంజయరాజకన్యను చూచి, సకలదేవతలు సమవేతమై యున్న రమణీయబ్రహ్మ సభను ప్రవేశించెను. ఆ విష్ణువ్రతపరాయణుడైన నారదుడు పితృదేవునకు అనేకప్రణామము లర్పించి జరిగిన విషయము లన్నింటిని విన్నవించెను. ఆశుభసమాచారము నాలకింపగనే బ్రహ్మముఖారవిందము ప్రఫుల్లితమయ్యెను తదనంతరము జగత్పతియగు బ్రహ్మ తనకుమారుడైన నారదునితో ఆలోచించి ఒకశుభముహూర్తమున సకలదేవతలను తోడ్కొని రత్ననిర్మిత విమానములపై అధిరోహించి వరుడైన నారదునితో సహా సృంజయు రాజధానిని చేరెను. బ్రహ్మాదిదేవతల రాకనుగూర్చి విని సృంజయుడు పరమానందభరితుడై వారికి అఖండస్వాగతము పలికె. దివ్యమహోత్సవము నొనరించి రత్ననిర్మితభూషణ విభూషితయైన తనకన్యారత్నమును నారదునకు [illegible] పూర్వకముగ నారదున కర్పించెను. ఆనరేశ్వరుడు తనసర్వస్వమును జామాతకు ఉపహారములుగ నర్పించి చరితార్థుడయ్యెను, బ్రహ్మఅత్యంతము హర్షమగ్నుడై భార్యసహితముగ పుత్రుని తోడ్కొని సకలదేవతలు, మహర్షులు వెంటరాగా బ్రహ్మలోకము జేరెను. విప్రవరులారా! ఈవిధముగ మునిశ్రేష్ఠుడైన నారదుడు తనప్రాకృత కర్మానుసారముగ కళత్రసహితుడయ్యెను. కర్మబంధముల నెవరు తొలగింపగలరు?

వివాహానంతరము ఆపరమభక్త శిఖామణియగు నారదుడు చాలకాలము సుఖముల ననుభవించి తనని షేక కర్మలను నిష్కామలవ మొనరించుకొనెను. ఒక దినమున దాంపత్య జీవితమునుండి విరక్తుడై మునిశ్రేష్ఠుడైన నారదుడు బ్రహ్మలోకములో మనోహర వటవృక్షఛాయలో ఆసీనుడైయుండగా ఆప్రదేశమునకు సాక్షాత్ సనత్కుమారు లరుదెంచెను. ఆయన బాలకునివలె నగ్నముగ నుండి అఖండ బ్రహ్మతేజముచే ప్రకాశించుచుండెను. సృష్టికి పూర్వమున సనత్కుమారుడు ఏప్రాయములో ఉన్నాడో, ఇపుడుకూడ అతడు ఆప్రాయము లోనే ఉన్నాడు. ఆమహాత్మునకు శ్రీమన్నారాయణుడే ఆచార్యుడు, సనత్కుమారుడు అనంతకల్పములనుండి తన ముష్వురు సోదరులతో కలసి శ్రీకృష్ణ మంత్రమునే జపించుచుండెను. ఆవైష్ణవాగ్రణి, జ్ఞానులకే ఆచార్యుడు. సత్పురుషులందు శ్రేష్ఠుడైన తన యగ్రజుడైన సనత్కుమారుని సమక్షమున దర్శింపగనే నారదుడు అనన్యభక్తిభావముతో సాష్టాంగదండ ప్రణామము లర్పించెను. అపుడు సనత్కుమారుడు సస్మితవదనుడై నారదునకు పారమార్థిక దివ్యవచనముల నుపదేశించెను.

సనత్కుమారుడు పలికెను:-

అహో, సోదరా! నీవే మొనరించుచున్నావు? యువతీ పతే! కుశలమేనా? స్త్రీపురుషుల పరస్పర ప్రేమానురాగములు సదా వృద్ధి నొందుచు, నిత్యము నూతనముగ గోచరింపగలవు; కాని,

శ్లో॥ అర్గలం జ్ఞానమార్గస్య భక్తిద్వార కపాటకమ్ ।
మోక్షమార్గవ్యవహితం చిరం బన్ధనకారణమ్ ॥ 32
గర్భవాసస్య బీజం చ పరం నరకకారణమ్ ।
పీయూషబుద్ధ్యా గరలం భుంక్తే పాపీ నరాధమః ॥ 33
పరం నారాయణం త్యక్త్వా యస్యాఽఽస్తే విషయే మనః ।
స వంచితో మాయయా చామృతం త్యక్త్వా విషం భజేత్ ॥ 34

స్త్రీపురుషమోహము జ్ఞానమార్గమునకు అవరోధము, భక్తిద్వారమునకు ద్వారబంధము, మోక్షమార్గమునకు వ్యవధానము, చిరకాలమువరకు బంధములకు కారణము, గర్భవాసమునకు బీజము, తుదకు నరకమునకే కారణము; అయినను దేహధారి ఆమోహాదులైన విషములనే అమృతములని భ్రమించి పానమొనరించును. ఏదేహధారిమనస్సు పరమపురుషుడైన

శ్రీమన్నారాయణుని చరణారవిందములను వీడి విషయములందు భ్రమించునో ఆతడు అమృతమును త్యాగమొనరించి మాయకు వశుడై విషమును స్వీకరించినట్లే భావింపవలెను.

కావున సోదరా! మాయాస్వరూపిణియైన ప్రియపత్నిపై మోహమును వీడి పరమపుణ్యమయ భారతవర్షము జేరి మాధవుని యఖండతపముద్వారా భజించి చరితార్థుడవు గమ్ము.

శ్లో॥ స్థితే నారాయణే స్యేశే పరే స్వపద దాతరి ।
విషయీ విషయాన్ధశ్చ వంచితో మాయయా ధ్రువమ్ ॥ 38

గృహాణ మమ మన్త్రం చ కృష్ణ ఇత్యాక్షరద్వయమ్ ।
సర్వేషామేవ మన్త్రాణాం సారాత్సారం పరాత్పరమ్ ॥ 39

సర్వేషు చ పురాణేషు వేదేషు చ చతుర్షు చ ।
ధర్మశాస్త్రేషు తన్త్రేషు నాస్త్యేవా స్మాత్పరో మనుః ॥ 40

నారాయణేన దత్తో మే పుష్కరే సూర్యపర్వణి ।
అసంఖ్యాక కల్పం జప్త్వాఽహం భ్రమామి సర్వపూజితః ॥ 41

తనపరమపదమును ప్రసాదించు మనస్వామి పరమపురుషోత్తముడైన శ్రీమన్నారాయణుడు ఉండగా ఏపురుషుడు విషయములందు సంలగ్నుడగునో, అతడు మాయచే వంచింపబడెనని భావింపబడును. ఇక నీవు నానుండి 'కృష్ణ' యను రెండక్షరముల దివ్యమంత్రమును గహ్రింపుము. ఈమహామంత్రము సర్వ మంత్రములసారము మఱియు పరాత్పరతుల్యము; సకలపురాణములందు, నాల్గు వేదములందు; ధర్మశాస్త్రములందు, సకలతంత్రములందు ఈదివ్యమహామంత్రముకంటె ఉత్తమమంత్రము మఱియొకటి లేదు. ఈమహామంత్రమునే సూర్య గ్రహణసమయమున మున్ను పుష్కరక్షేత్రములో స్వయముగా శ్రీమన్నారాయణుడు నాకనుగ్రహించెను. అసంఖ్యాకకల్పములనుండి నేను ఈమహామంత్రమునే జపించుచు సర్వపూజితుడనై భ్రమించుచున్నాను.

సూతుడు పలికెను:-

సనత్కుమారుడు నారదునకు పరమోత్కృష్ణ మగు కృష్ణ మంత్రము నుపదేశించెను. తదనంతరము ఆమహామనీషి నారదు నాశీర్వదించి సనాతనుడైన శ్రీకృష్ణుని దర్శనార్థమై గోలోకమునకు బయలుదేరెను. సర్వేశ్వ

ప్రదము, శ్రీకృష్ణునియందు నిశ్చల భక్తిప్రదము, కర్మమూలములను ఖండింపగల శ్రీకృష్ణమంత్రము పొందగనే నారదుడు మోహరహితుడై భార్యాసహితముగ నాది యను సర్వములను త్యజించి తపమొనరించుటకు పుణ్యతపోభూమియైన పవిత్రభారతవర్షము జేరెను. భారతావనిలో కృతమాలాతటముపై భక్తిజ్ఞానాచార్యుడైన శంకరుని దర్శనము నారదునకు లభించెను. తనసమక్షమున స్వయముగ ప్రత్యక్షమైన మహాదేవుని దర్శించి నారదమౌని పులకిత గాత్రుడై అశ్రుపూర్ణనయనములతో ఈశ్వరుని చరణకమలముల నాశ్రయించెను. అపుడు భక్తవత్సలుడు, జగదీశ్వరుడు అయిన శివుడు భక్తశిరోమణియగు నారదునితో ఇట్లు పల్కెను.

మహాదేవుడు పలికెను:-

శ్లో॥ అహో నారద దృష్ట్వా త్వాం ప్రసన్నోఽహం స్వతేజసా ।
భక్తానాం దర్శనం యత్ర సుదినం తచ్ఛరీరిణామ్ ॥ 46

అయం హి పరమో లోభో దేహినాం భక్తసంగమః ।
స స్నాతః సర్వతీర్థేషు యో దదర్శ చ వైష్ణవమ్ ॥ 47

అహో! నారదా! అఖండ తేజోద్భాసితుడవైన నిన్నుగాంచి నేను అత్యంత ప్రసన్నుడనైతిని; ఎందువలెననగ ఏదినమున అనన్యభక్తుల దర్శనము ప్రాప్తించునో, ఆదినమే దేహధారులకు పరమోత్తమమైన దినమని గ్రహింపవలెను. పరమభక్తులతో సమాగమము లభించుట దేహధారులకు పరమకళ్యాణకరము. ఎవరికి పరమవైష్ణవుని దర్శనము లభించునో ఆతడు సమస్తతీర్థములందు స్నానమాచరించి నట్లే భావింపవలెను.

ఏమంత్రము సమస్తమంత్రములందు పరమదుర్లభమో, ఆకృష్ణమహామంత్రము నీకు ప్రాప్తించెను. ఈమంత్రమును నాకు, బ్రహ్మకు, ధర్మదేవతకు శ్రీకృష్ణపరమాత్మ గోలోకములో రాసమండలముపై ఉపదేశించెను. ఆమహామంత్రమునే నేను నాకుమారులైన గణేశ్వర కార్తికేయుల కుపదేశించితిని. ఈమహామంత్రమునే ధర్మదేవుడు నారాయణ ఋషీంద్రునకు, శ్రీమన్నారాయణుడు సనత్కుమారునకు ఉపదేశించిరి. ఆకృష్ణదివ్యమంత్రమునే సనత్కుమారుడు నీకు ఉపదేశించెను.

శ్లో॥ మన్త్రగ్రహణమాత్రేణ జనో నారాయణో భవేత్ ।
విచారణం చ నాస్త్యత్ర కాలాకాలం శుభాశుభమ్ ॥ 51

నారదా! ఈకృష్ణదివ్యమంత్రగ్రహణమాత్రముననే మనుష్యుడు నారాయణస్వరూపుడు కాగలడు. ఈమంత్రజపమునకు శుభాశుభసమయములని, అసమయములని భావింప నవసరములేదు. అనగా ఈమహామంత్రమును సర్వదా సర్వకాలములందు సర్వసమయములందు జపింపవచ్చును.

ఐదులక్షలు ఈమహామంత్రమును జపించిన ఈమంత్రపునశ్చరణము పూర్ణమగును. బ్రహ్మకులైకపావన! శ్రీకృష్ణపరమాత్మ దివ్యధ్యానము సకలపాపహరము, కర్మమూలములను ఛేదింపగల కుఠారము. శాస్త్రములందు ఆశ్రీకృష్ణధ్యానము వర్ణింపబడినరీతితో వైష్ణవజనులు శ్రీకృష్ణుని ధ్యానింపవలెను. ఆపరమనిగూఢమైన శ్రీకృష్ణ దివ్యధ్యానము నుపదేశించెదను, సావధానుడవై గ్రహింపుము.

## మహాదేవు డుపదేశించిన శ్రీకృష్ణధ్యానము

శ్లో॥ కృష్ణం నవఘనశ్యామం కిశోరం పీతవాససమ్ ।
శతకోటీన్దుసౌన్దర్యం దధానమతులం పరమ్ ॥ 53

భూషితం భూషణౌఘైస్తైరమూల్యరత్ననిర్మితైః ।
చన్దనోక్షితసర్వాఙ్గం కౌస్తుభేన విరాజితమ్ ॥ 54

మయూరపిచ్ఛచూడం చ మాలతీమాల్యమణ్డితమ్ ।
ఈషద్ధాస్యప్రసన్నాస్యం నిత్యోపాస్యం శివాదిభిః ॥ 55

ధ్యానాసాధ్యం దురారాధ్యం నిర్గుణం ప్రకృతేః పరమ్ ।
సర్వేషాం పరమాత్మానం భక్తానుగ్రహవిగ్రహమ్ ॥ 56

వేదానిర్వచనీయం తం వరం సర్వేశ్వరం భజే ।
ధ్యానేనానేన తం ధ్యాత్వా భగవన్తం సనాతనమ్ ॥ 57

భజ తం పరమానన్దం నిత్యం సత్యం పరాత్పరమ్ ।

నూతనజలధరసమానమైన శ్యామల వర్ణముగలవాడు, సదా కిశోర వయస్కుడు, పీతాంబరధారియు, నూఱుకోట్ల పూర్ణిమచంద్రులతో సమానమైన అనుపమసౌందర్యధారియు, అలంకరింపబడియున్న అమూల్యరత్ననిర్మిత భూషణసమూహములుశోభను పెంపొందించు అవయవములుగలవాడును, చందనచర్చితశరీరియు, కౌస్తుభమణిద్వారా విశేషముగ శోభించుచున్నవాడును, మాలతీమాలలతో శిఖయందు మయూరపిచ్ఛముచేత శోభిల్లు శిఖగలవాడు

మందహాసవదనారవిందుడు శివాది దేవతలచే సదా ఉపాసింపబడువాడు ధ్యానాసాధ్యుడు, దురారాధ్యుడు, ప్రాకృతికనిర్గుణుడు ప్రకృతికే అతీతుడు, సర్వులయందుగల పరమాత్మయు, వేదములద్వారా అనిర్వచనీయుడని కీర్తింపబడువాడు, సర్వేశ్వరుడు, భక్తానుగ్రహసచ్చిదానందవిగ్రహుడు, పురుషోత్తముడగు శ్రీకృష్ణపరమాత్మనే సదా భజించెదను. నారదా! పరమానంద స్వరూపుడైన, సత్యమైన, నిత్యమైన, పరాత్పరుడైన, సనాతనుడైన శ్రీకృష్ణపరమాత్మను ఈసామవేదోక్తధ్యానవిధితో ధ్యానించి, అహర్నిశములు భజించి జన్మరాహిత్యము నొందుము.

సూతుడు పలికెను :-

శౌనకాది మహర్షులారా! ఇట్లు నారదునకు దివ్య శ్రీకృష్ణధ్యానము నుపదేశించి పరమేశ్వరుడైన శంకరుడు స్వధామమునకు మఱలిపోయెను. తదనంతరము నారదుడు వీతరాగుడై ఇంద్రియసంచారమును బంధించి జగన్నాథుడైన శ్రీకృష్ణుని సచ్చిదానందవిగ్రహమునే తన హృదయకమలములో దర్శించి అఖండతపోమగ్నుడయ్యెను. తదుపరి పరమభక్తశిరోమణియైన నారదముని యోగధారణద్వారా శ్రీహరిని స్మరించుచు నశ్వరమైన దేహమును వీడి దివ్యదేహధారియై శ్రీరాధాదేవిచే సదా సమార్చితము లగు శ్రీకృష్ణచరణసరోజముల దాస్యసౌభాగ్యమును పొందెను. ఆపరమభక్తశిఖామణి జన్మయే జన్మ. కావున మహర్షులారా! దేహధారులు సదా సచ్చిదానందవిగ్రహుడైన శ్రీకృష్ణపరమాత్మయందు అనన్యభక్తిని, ఆయనదాస్యసౌభాగ్యమును, గోలోకపరంధామగమనమును ఆకాంక్షింపవలెను. కేవలము శ్రీకృష్ణదివ్యనామసంకీర్తనయే ఈఘోరకలియుగములో భవసాగరమును తరించుటకు ఏకైకనావ. ఆనావకు స్వయముగ ఆపరంధాముడే కర్ణధారి, (నావికుడు);

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణజన్మఖండమందు నారదుడు శృంజయ కన్యను పాణిగ్రహణ మొరించుట యను నూటముప్పదియవ అధ్యాయము సంపూర్ణము.

# నూటముప్పదియొకటవ అధ్యాయము

## పురాణలక్షణములను ప్రవచించి, పురాణముల శ్లోకసంఖ్యను నిరూపించుట

తదనంతరము శౌనకాదిమహర్షులు ప్రశ్నింపగా సూతమహర్షి వారికి స్వర్ణోత్పత్తిప్రసంగము నుపదేశించి శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణ విషయానుక్రమణికను దెల్పెను. తదనంతరము సూతు నుద్దేశించి శౌనకమహర్షి ఇట్లు పల్కెను.

శౌనకుడు పలికెను:-

వత్సా! శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమును శ్రవణమొనరించి మేమందరము ధన్యులమైతిమి, మాజీవితములన్నియు సుజీవనములైనవి. శ్రీబ్రహ్మవైవర్త మహాపురాణ శ్రవణఫలము సాక్షాత్తుగ గోలోకప్రాప్తియని మేము గ్రహించితిమి. మహాభాగా! మాకు పురాణములలక్షణములను, పురాణములశ్లోకసంఖ్యలను వివరింపవలసినదిగ ప్రార్థించుచున్నాము.

సూతుడు పలికెను:-

శౌనకాదిమహర్షులారా! నేను నాకు విదితమైనంతవఱకు పురాణములను, ఇతిహాసములను, సంహితలను, పాంచరాత్రములను వర్ణించెద నవధరింపుడు. విప్రవరులారా! ఏచరిత్ర సర్గలతో, ప్రతిసర్గలతో, వంశములవర్ణనములతో, మన్వంతరవర్ణనములతో, వంశానుచరితవర్ణనములతో ఓతప్రోతమైయుండునో, ఆపంచలక్షణములుగలదానినే పురాణము అందురు. ఉపపురాణములకుకూడ ఇవియే లక్షణములని విద్వాంసులు వర్ణించిరి. పురాణమనగా అర్థము జరిగినచరిత్ర యని గ్రహింపుడు. ప్రధానపురాణముల లక్షణములను వర్ణించెద నాకర్ణింపుడు. ప్రధానపురాణములకు పదిలక్షణములు కలవు అవి ఏవనగ; సృష్టి, విసృష్టి, స్థితి, పాలనము, కర్మవాసనలవర్ణనము, మనువుల క్రమము, ప్రళయములవర్ణనము, మోక్షమార్గనిరూపణము, శ్రీహరిదివ్యగుణగానము, అన్యాన్యదేవతలవర్ణనము.

శౌనకాదిమహర్షులారా! పరమోత్కృష్టమైన బ్రహ్మపురాణశ్లోకముల సంఖ్యపదివేలు; పద్మపురాణశ్లోకసంఖ్య ఏబదిఐదువేలు; విష్ణుపురాణశ్లోకసంఖ్య

ఇరువదిమూడువేలని బుధజనులు కీర్తించిరి; శివపురాణశ్లోకసంఖ్య ఇరువది నాల్గువేలు; శ్రీమద్భాగవతమహాపురాణశ్లోకములసంఖ్య పదునెనిమిదివేలని విదులు నొక్కివక్కాణించిరి. నారదపురాణశ్లోకసంఖ్య ఇరువదియైదువేలనిరి; మార్కండేయపురాణశ్లోకసంఖ్య పురాణవిదులు తొమ్మిదివేలని ప్రవచించిరి; పరమ రుచికరమైన అగ్నిపురాణశ్లోకసంఖ్య పదునైదువేలనాల్గువందలనిరి; పురాణప్రవరమైన భవిష్యపురాణము పదునాల్గువేలఏదువందల శ్లోకసమన్వితము; సర్వులకు ఈప్సితమైన శ్రీబ్రహ్మవైవర్త మహాపురాణశ్లోకసంఖ్య పదునెనిమిదివేలని మనీషిగణములు ప్రవచించిరి; వేదవేదాంగ పారంగతులైన విద్వాంసులు ఈ శ్రీ బ్రహ్మవైవర్తమహాపురాణము సకలపురాణములసారమని నొక్కివక్కాణించిరి; లింగపురాణశ్లోకసంఖ్య పదునొకండువేలు; వరాహపురాణశ్లోకసంఖ్య ఇరువదినాల్గువేలని పల్కిరి; సజ్జనులు ఉత్తమమైన స్కంధపురాణశ్లోకసంఖ్య ఎనుబదియొక్కవేలఒకనూరు అనిరి; పండితులు వామనపురాణశ్లోకసంఖ్య పదివేలనిరి; కూర్మపురాణశ్లోకసంఖ్య పదిహేడువేలనిరి; మత్స్యపురాణశ్లోకసంఖ్య పదునాల్గువేలు; గరుడపురాణమునకు పదితొమ్మిది వేలశ్లోకములని సజ్జనులు నిర్ణయించిరి; బ్రహ్మాండపురాణము పదిరెండువేల శ్లోకయుక్తము. ఈక్రమముగ అష్టాదశపురాణములశ్లోకసంఖ్య నాల్గులక్షలని నిర్ణయింపబడెను. పురాణవేత్తలు నిర్ణయించిన అష్టాదశపురాణములివియే. ఉపపురాణముల సంఖ్యకూడ పదునెనిమిదియే యనివిద్వాంసులు నిర్ణయించిరి.

మహాభారతాదులను ఇతిహాసము లందురు. వాల్మీకిరామాయణాదులను కావ్యము లందురు. శ్రీకృష్ణమహాత్మ్యములచే పరిపూర్ణములైన పాంచరాత్రములసంఖ్య ఐదు అనిచెప్పబడెను. అవియే వాశిష్ఠము, నారదీయము, కాపిలము, గౌతమీయము, సనత్కుమారీయము. శ్రీకృష్ణభక్తి ఓతప్రోతములైన సంహితలు ఐదనిచెప్పబడెను. అవియే బ్రహ్మసంహిత, శివసంహిత, ప్రహ్లాదసంహిత, గౌతమసంహిత, కుమారసంహిత. శౌనకాదిమహర్షులారా! శాస్త్రభండారము అత్యంతవిస్తృతము. నేను నాకవగతమైనంతవరకు క్రమముగ శాస్త్రములను వర్ణించితిని.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణములోని శ్రీకృష్ణ జన్మఖండమందు పురాణలక్షణములను, శ్లోకసంఖ్యలను నిరూపించుట యను నూటముప్పదియొకటవ అధ్యాయము

సంపూర్ణము

# నూటముప్పదిరెండవ అధ్యాయము
## శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ మాహాత్మ్యము

తదనంతరము శౌనకాదిమహర్షులు శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్తమహాపురాణ మాహాత్మ్యమును వర్ణింపుడని ప్రార్థింపగా సూతమహర్షి తమప్రవచనము నిట్లుకొనసాగించెను.

సూతుడు పలికెను:-

శౌనకాదిమహర్షులారా! శ్రీకృష్ణపరమాత్మయే గోలోకస్థితరాసమండలములో తనయనన్యభక్తుడైన బ్రహ్మదేవునకు స్వయముగ ఈ మహాపురాణ సంహిత నుపదేశించెను. తదుపరి బ్రహ్మదేవుడు ధర్మదేవతకు, ధర్మదేవత నారాయణఋషీంద్రునకు, నారాయణఋషినారదునకు, నారదుడు భక్తుడనైన నాకు ఉపదేశించిరి. అపరమశ్రేష్ఠమైన దివ్యమహాపురాణమునే ఇపుడు మీసమక్షమున గానమొనరించితిని.

శ్లో॥ సుదుర్లభం పురాణం చ బ్రహ్మవైవర్తమీప్సితమ్ ।
యద్వృణోత్యేవ విశ్వౌఘం జీవినాం పరమాత్మకమ్ ॥ 30

తద్బ్రహ్మసాక్షీరూపం చ కర్మణామేవ కర్మిణామ్ ।
తద్బ్రహ్మవివృతం యత్ర తద్విభూతిమనుత్తమామ్ ॥ 31

తేనేదం బ్రహ్మవైవర్తమిత్యేవం చ విదుర్బుధాః ।
పుణ్యప్రదం పురాణం చ మఙ్గలం మఙ్గలప్రదమ్ ॥ 32

సుగోప్యం చ రహస్యం చ యత్ర రమ్యం నవం నవమ్ ।
హరిభక్తిప్రదం చైవ దుర్లభం హరిదాస్యదమ్ ॥ 33

సుఖదం బ్రహ్మదం సారం శోకసన్తాపనాశనమ్ ।

ఈ యభీప్సితబ్రహ్మవైవర్త మహాపురాణము పరమదుర్లభము, సకల విశ్వసమూహములను వరణ మొనరించినది, జీవదేహధారులందు పరమాత్మ స్వరూపమున విరాజిల్లియున్నది. సకలకర్మిష్ఠులకర్మలకు ఏకైకసాక్షి యగు పరబ్రహ్మనిరూపణము, ఆయన అనుపమ విభూతులు ఈపురాణ మందు వివరింపబడినవి, కావున పురాణవేత్తలైనవిద్వాంసులు ఈపవిత్రపురాణ సహితంను బ్రహ్మవైవర్త మహాపురాణమని కీర్తించిరి. ఈ మహాపురాణము అఖండపుణ్యప్రదము, అత్యంతగోపనీయములైన

రహస్యములతో ఓతప్రోతము, నిత్యనూతనము. ఈపవిత్రశ్రీహరిచరితము అనన్యహరిభక్తిప్రదము, దుర్లభహరిదాస్యప్రదము, పరబ్రహ్మప్రాప్తికి ఏకైక సాధనము, సకలసారస్వరూపము, శోకసంతాపనాశకము. సరిత్తులయందు శుభకారిణియగు గంగ తక్షణమే ముక్తిని ప్రసాదింపగలిగించునట్లు, తీర్థములందు పుష్కరతీర్థము; పురములందు కాశీపురి, సకలదేశములందు భారతవర్షమువట్లు శుభప్రదములో, ముక్తిప్రదములో, ఎట్లు పర్వతములందు సుమేరు, పుష్పములందు పారిజాతము, పత్రములందు తులసీపత్రము, వ్రతములందు ఏకాదశీవ్రతము, వృక్షములందు కల్పవృక్షము, దైవములందు శ్రీకృష్ణుడు, జ్ఞానశిరోమణులందు మహాదేవుడు యోగీంద్రులందు గణేశ్వరుడు, సిద్ధేంద్రులందు కపిలుడు, తేజస్వులందు సూర్యుడు, వైష్ణవులందు సనత్కుమారుడు, రాజులందు శ్రీరాముడు. ధనుర్ధారులందు లక్ష్మణుడు, దేవీమాతలందు మహాపుణ్యవతి దుర్గ, శ్రీకృష్ణప్రియతమలందు కృష్ణప్రాణాధికారాధ, ఈశ్వరీమణులందు శ్రీమహాలక్ష్మి, సకలపండితులందు సరస్వతి శ్రేష్ఠులైనట్లు; సకలపురాణములందు శ్రీబ్రహ్మవైవర్త మహాపురాణ మత్యంతశ్రేష్ఠము. ఈపురాణముకంటె విశిష్టమైనది, సుఖప్రదమైనది, మధురమైనది, ఉత్తమపుణ్యప్రదమైనది, సకలసందేహ నాశకమైనది మఱియొకపురాణము లేదు. ఈమహాపురాణశ్రవణము ఇహలోకములో సుఖప్రదము, సంపూర్ణసంపత్ప్రదము, శుభప్రదము, పుణ్యప్రదము, సకలవిఘ్నవినాశము, ఉత్తమహరిదాస్యప్రదము పరలోకమందు శ్రీకృష్ణసామీప్య మోక్షప్రదము.

మహర్షులారా! సంపూర్ణయజ్ఞముల ఫలములు, సకల తీర్థస్నానఫలములు, వ్రతఫలములు తపఃఫలములు, పృథ్వీప్రదక్షిణఫలములు మొదలగునవి యన్నియు ఈమహాపురాణ శ్రవణఫలమునకు సరిరావు. నాలుగువేదములను పఠించిన ఫలముకంటె ఈపురాణ శ్రవణఫలము శ్రేష్ఠము. పుత్రులు లేనివారు ఈదివ్యపురాణమును సంయమచిత్తులై శ్రవణమొనరించిన వారికి గుణవంతులు, విద్వాంసులు, వైష్ణవులు, ఆయుష్మంతులు అయినపుత్రులు కలిగెదరు. కన్యలు శ్రవణమొనరించిన ఉత్తమపతిసౌభాగ్యము నొందగలరు. మృతవత్సలైనను, కాకవంధ్యలైనను ఈపురాణశ్రవణ మాత్రముననే చిరంజీవులైన సంతానమునకు తల్లులు కాగలరు. పుత్రులు లేనివారికి పుత్రులు, సాధ్వియైనభార్యను కాంక్షించు

వారికి సతియగు పత్ని, కీర్తిహీనులకు ఉత్తమయశము ఈపురాణశ్రవణ మాత్రమున లభింపగలదు. బ్రహ్మవైవర్త మహాపురాణశ్రవణఫలముచే మూర్ఖుడు పండితుడగును, రోగి రోగవిముక్తుడగును, బంధితుడు బంధవిముక్తుడగును భయభీతుడు భయవిముక్తుడగును, ఆపత్తిగ్రస్తులు ఆపద్విముక్తులు కాగలరు, అరణ్యములలో నిర్జన మార్గములో, దావాగ్నిమధ్యలో, రణరంగముమధ్యలో చిక్కి ఆపదలపాలైన వారు ఈమహాపురాణమును శ్రవణమొనరించిని నిశ్చయముగ సకల సంకటనములనుండి విముక్తులై విజయలక్ష్మిని పొందగలరు. ఈదివ్యపురాణమును శ్రవణమొనరించిన వానికి కుష్ట్యాది రోగములుకాని, దారిద్ర్యముగాని, వ్యాధులుగాని, శోకములుకాని, అంటవు. ఈపురాణశ్రవణము మహాపాపులను సహితము పునీతమొనరింపగలదు. దత్తచిత్తుడై ఈమహాపురాణమందు అర్ధశ్లోకమునుగాని లేక చతుర్థశ్లోకమును గాని శ్రవణమొనరించిన వానికి బహుసంఖ్యాక గోదానపుణ్యము ప్రాప్తించును. ఇందు లేశమైనను సంశయము లేదు.

శ్లో॥ చతుఃఖణ్డం పురాణం చ శుద్ధకాలే జితేన్ద్రియః ।
సంకల్ప్యతో యః శృణోతి భక్త్యా దత్త్వా చ దక్షిణామ్ ॥ 53

యద్బాల్యే యచ్చ కౌమారే వార్ధకే యచ్చ యౌవ్వనే ।
కోటిజన్మార్జితాత్పాపాన్ముచ్యతే నాత్ర సంశయః ॥ 54

రత్ననిర్మాణయానేన ధృత్వా శ్రీకృష్ణరూపకమ్ ।
నిత్యం గత్వా గోలోకం కృష్ణదాస్యం లభేద్ధ్రువమ్ ॥ 55

అసంఖ్యబ్రహ్మణాం పాతే న భవేత్తస్యపాతనమ్ ।
సమీపే పార్షదో భూత్వా సేవాం చ కురుతే చిరమ్ ॥ 56

ఏమనుష్యుడైతే శుభముహూర్తములో జితేంద్రియుడై సంకల్పపూర్వకముగ ఈమహాపురాణవక్తకు దక్షిణనొసంగి భక్తిభావసహితముగ నాల్గుఖండములుగల ఈ మహాపురాణమును శ్రవణమొనరించునో, ఆతడు అనేక పూర్వజన్మలనుండి బాల్యములో, కౌమారములో, యువావస్థలో, వృద్ధావస్థలో సముపార్జితసకలపాపములనుండి నిస్సందేహముగ ముక్తుడై శ్రీకృష్ణస్వరూపమును ధరించి రత్ననిర్మితదివ్యవిమానము నధిరోహించి అక్షరమైన గోలోక పరంధామము చేరగలడు. ఆదివ్యలోకములో వానికి అనన్యశ్రీకృష్ణభక్తి

శ్రీకృష్ణదాస్యసౌభాగ్యము నిశ్చయముగ లభింపగలవు. అసంఖ్యాకు లైన బ్రహ్మలు పతనమైనను ఆభక్తుడు పతనముకాడు, అతడు శ్రీకృష్ణసామీప్య ముక్తి నొంది శ్రీకృష్ణపార్షదుడై శ్రీకృష్ణుని చిరకాలము సేవింపగలడు. మునీశ్వరులారా! శ్రోతలు బాగుగ స్నానమాచరించి శుద్ధులై ఇంద్రియము లను వశమందుంచుకొని ఏకాగ్రతతో బ్రహ్మఖండమును శ్రవణ మొనరించిన తదుపరి వాచకునకు మృష్టాన్నములను, సుపక్వఫలములను, తాంబూలసహిత సువర్ణములను దక్షిణగ అర్పించి చందనమును, శ్వేతపుష్పములమాలను, మనోహరములైన పట్టువస్త్రములను శ్రీకృష్ణునకు నివేదనయొనరించి వాచకున కొసంగవలెను. అమృతసమములైన కథలతో ఓతప్రోతమైన దివ్యప్రకృతిఖం డము నాలకించి శ్రోతలు వాచకునకు మధురదధియుక్తమగు అన్నము నొసంగి, సువర్ణదక్షిణతో సత్కరించి వత్ససహితముగ గోదానమీయవలెను; సకలవిఘ్నములను నశింపజేయగల శ్రీగణపతిఖండమును జితేంద్రియులై శ్రవణ మొనరించి శ్రోతలు వాచకునకు సువర్ణయజ్ఞోపవీతమును, వాహనమును, ఛత్రమును, పుష్పమాలను, మధురపదార్థములను, నువ్వులలడ్లను, దేశకాలను సారముగ ఉపలబ్ధములైన సుపక్వఫలములను సువర్ణములసహితముగ తాంబూలమును అర్పింపవలెను. జన్మరాహిత్యమును ప్రసాదింపగల శ్రీకృష్ణ జన్మఖండమును శ్రోతలు అనన్యభక్తిభావముతో శ్రవణ మొపరించి వాచకునకు రత్నజటితమగు అంగుళీయకమును, పట్టువస్త్రములను, హారములను, స్వర్ణకుం డలములను, పుష్పమాలను, సుందరమగు పల్లకిని, సుపక్వఫలములను, క్షీరము లను, సువర్ణముల నర్పించి సత్కరింపవలెను, శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణ మును శ్రవణ మొనరించిన తదుపరి నూర్గురు అనన్యభక్తులకు పరమాదరసహిత ముగ సంతర్పణచేయవలెను. అనన్యవిష్ణుభక్తుడు శాస్త్రపారంగతుడు, పండితుడు, శుద్ధాచారసంపన్నుడు నగుసత్పురుషుని ఈపురాణవాచకునిగ ఎన్నుకొనవలెను. శ్రీకృష్ణవిముఖుడైన, దురాచారియైన, సదుపదేశముల నొనరించుటలో అకుశలుడైన వానిద్వారా ఈ దివ్యపురాణశ్రవణ మొనరింపరాదు. అట్లు శ్రవణ మొనరించిన పురాణశ్రవణఫలము నిష్ఫలము కాగలదు.

శ్లో॥ శ్రీకృష్ణభక్తియుక్తాచ్చ పురాణం యః శృణోతి చ ।
భక్తిం పుణ్యం చ లభతే యాత్యన్తే శ్రీహరేః పదమ్ ॥

శ్రీకృష్ణునియెడల అనన్యభక్తియుక్తులై ఈ శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమును శ్రవణమొనరించువారు అసంఖ్యాకపూర్వజన్మలందు తామొనరించిన పాపములనుండి ముక్తులై, పరమపవిత్రులై శ్రీహరి యనన్యభక్తిని, దాస్యసౌభాగ్యమును పొంది అంత్యకాలమున గోలోకపరంధామము చేరగలరు.

విప్రవరులారా! ఇట్లు నేను నాగురుదేవుని శ్రీముఖారవిందమునుండి శ్రవణమొనరించిన, శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమును మీయెదుట వర్ణించితిని. ఈపవిత్రనైమిశారణ్యములో గూడిన సద్విప్రసమాజమును దర్శించి నమస్కరించుటకే నే నేతెంచితిని; మహాత్ములైన మీయాజ్ఞను శిరసావహించి ఈ దివ్యపురాణమును సాంగోపాంగముగ వర్ణించితిని. మహర్షిశ్రేష్ఠులారా! నేను పవిత్రనారాయణాశ్రమమునకు ప్రస్థానమొనరింపవలెను కావున నాకు కృపతో అనుజ్ఞదయచేయుడు.

శ్లో॥ నమోఽస్తు బ్రాహ్మణేభ్యశ్చ కృష్ణాయ పరమాత్మనే ।
శివాయ బ్రహ్మణే నిత్యం గణేశాయ నమోనమః ॥ 71

కాయేన మనసా వాచా పరం భక్త్యా దివానిశమ్ ।
భజ సత్యం పరం బ్రహ్మ రాధేశం త్రిగుణాత్పరమ్ ॥ 72

నమో దేవ్యై సరస్వత్యై పురాణగురవే నమః ।
సర్వవిఘ్నవినాశిన్యై దుర్గాదేవ్యై నమోనమః ॥ 73

సద్బ్రాహ్మణులైన మీకు నానమస్కారము, పరమాత్మయైన శ్రీకృష్ణునకు నమస్కారము. శివునకు, బ్రహ్మకు, గణేశ్వరునకు నిత్యము అనేకానేక నమస్కారములు. సత్యస్వరూపుడైన, రాధాప్రాణేశ్వరుడైన, త్రిగుణాతీతుడైన, పరబ్రహ్మమైన శ్రీకృష్ణపరమాత్మను మనోవాక్కాయకర్మలచే పరమభక్తిపూర్వకముగ అహర్నిశములు భజింపవలెను. సంపూర్ణవిఘ్నములను వినాశమొనరింపగల దుర్గాదేవికి అనేకప్రణామము లర్పించెదను. శౌనకాదిమహర్షులారా! మీపుణ్యప్రదదివ్యచరణసరోజములను దర్శించి నేను నేను శ్రీగణేశ్వరుడు విరాజమానుడై యున్న సిద్ధాశ్రమమునకు పోవలయు నని సంకల్పించితిని.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణజన్మ ఖండములోని నారదనారాయణ సంవాదమున శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ మహాత్మ్యమను నూటముప్పది రెండవ అధ్యాయము సంపూర్ణము.

ఇది శ్రీకృష్ణపరమాత్మ దివ్యచరణారవింద మిళిందాయమాన మానసత్వ
మహావైభవ సంపన్నులైన శ్రీమట్టుపల్లి వేంకటమహాలక్ష్మి
జగన్నాథుల తనూభవుడు భక్తజన దాసానుదాసుడు
సుజనవిధేయుడు నగు శివసుబ్బరాయగుప్తచే
ప్రణీతంబైన శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త
మహాపురాణ మను వచనకావ్యమందు
శ్రీకృష్ణజన్మకాంఖాత్మకమైన
ఉ త్త ర భా గ ము
సం పూ ర్ణ ము.



**శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణము సర్వము సంపూర్ణము**

శ్రీ హరిః ఓం తత్ సత్